# శ్రీ శంకర కృప

దక్షిణామ్నాయ
శ్రీశృంగేరి శారదా పీఠమువారి యాజమాన్యమున వెలువడు
ఆధ్యాత్మిక మాసపత్రిక


| | | |
|---|---|---|
| సంపుటి: 20 | వెల రు. 1 జనవరి, 1981<br>సంవత్సర చందా రు. 10/- | సంచిక: 5 |







రౌద్రి మార్గశిర - పుష్యము (శ



రౌద్రి చైత్ర శు షష్ఠినాడు శ్రీజగద్గురువులు శ్రీ సన్నిధానమువారి వర్ధంతి సందర్భముగా ఆయుష్య హోమపూర్ణాహుతిని తిలకించుట

# శ్రీ శంకర కృప

సంపాదకులు: తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

సంపుటి 20 | శంకరశ్శంకర స్సాక్షాత్ వ్యాసో నారాయణోహరిః | సంచిక 5

# శ్రీ శంకర భగవత్పాదాచార్య విరచిత

## శ్రీమత్త్రిపురసుందరీ వేదపాద స్తోత్రము

శ్లో॥ శరణం కరవాణ్యంబ చరణం తవ సుందరి।

శపేత్వత్పాదుకాభ్యాం మే నాన్యః పంథా అయనాయ॥ 56

(దీనియందున్న వేదపాదము తైత్తిరీయచిత్తి ప్రశ్నములోనిది)

తా. ఓ అంబా! త్రిపురసుందరీ! నేను నీ పాదములను శరణముగా చేసికొనుచున్నాను. నీ పాదుకలతో ఒట్టు పెట్టుకొనుచున్నాను. నీ పాదముకన్న మోక్షమునకు వేరొక మార్గము లేనేలేదు.

విశేషములు:

శ్రీదేవి చరణములనుండి వెలువడిన రశ్మికిరణములవలననే సృష్టి జరిగినదని శాస్త్రమతము. కావున సననము మరల ఆ పాదకమలములతో నైక్యము సాధించినపుడే మోక్షము. నీ పాద కమలములకన్న మోక్షమునకు వేరొక మార్గములేదని చెప్పుటకు కారణమిది. శ్రీదేవియొక్క పాదములు కోరినదానికంటె అధికము నిచ్చునవని శ్రీభగవత్పాదులు సౌందర్య లహరి యందు చెప్పిరి.

త్వదన్యః పాణిభ్యామభయ వరదో దైవతగణ

స్త్వమేకా నైవాసి ప్రకటిత వరాభీత్యభినయా

భయాత్త్రాతుం దాతుం ఫలమపి చ వాంఛాసమధికం

శరణ్యే లోకానాం తవహిం చరణావేవనిపుణౌ॥

(లోకములకు రక్షకురాలవగు తల్లీ! నీకంటె వేరైన దేవతలు చేతులతో అభయవర ముద్రలను ధరించుచున్నారు. ముఖ్యురాలవగు నీవు మాత్రము హస్తముల చేత వెల్లడింపబడిన వరాభయ ముద్రలను ధరించుదానవు కాదుకదా! కాని నీ పాద

సిద్ధముగా నున్నాము. ఈ మహా ఘోరమైన నష్టమును పూరించుకొనుటెట్లు? మరి కొన్ని దినములు జీవితమును తుది ఘడియలలో వైద్యులు పొడిగించెదమన్నచో వారికి వేలకు వేలు ద్రవ్యము ఇచ్చుటకు మనము సిద్ధముగా నున్నాము. ఇపుడు మనము మంచి ఆరోగ్యము, శక్తి కలిగివుండి నిరవధికముగా కాలమును వృథా చేసికొనుచున్నాము. అందుచేతనే—ఈ మానవజన్మలో జ్ఞానమును సాధించుకొననివాడు ఎంతో అపరిమిత నష్టము పొందినవాడని ఉపనిషత్తులనుచున్నవి.

---

# శ్రీ జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణుల ఉపదేశములు

ఒక బీద దంపతులున్నారు. వారికి అందమైన బిడ్డ కలదు. పేదతనమువలన వారు దానిని సరిగా పెంచలేక పోవుచున్నారు. మంచి దుస్తులు ఇవ్వలేకపోవుచున్నారు. సరియైన ఆహారము ఇవ్వలేకపోవుచున్నారు. అయినప్పటికి దానికి సహజమైన సౌందర్యమువలన అందరిని ఆకర్షించుచున్నది.

వారి ఇంటి కెదురుగా ధనికులైన దంపతులు కలరు. వారికి సంతానము లేదు. ఒక బిడ్డను దత్తత చేసుకొనవలెనని ఆలోచన చేశారు. ఎదురుగానున్న పేదవారి బిడ్డను తమకు దత్తత ఇవ్వమని అడిగిరి. పేదతల్లి తడబడలాడినది. తండ్రి 'మేము పేదవారము. బిడ్డకు తగిన ఆహారముకాని దుస్తులుగాని, ఆభరణములుగాని మేమియ్యలేకున్నాము. ఇంతకు బిడ్డను మీకు ఇచ్చినచో మా ఎదురింటిలోనే వుండునుగదా! దినము కనబడుచుండును. మేము చూచి సంతోషపడగలము' అనెను. ఆ మాటలు విని బిడ్డతల్లి దత్తత నిచ్చుటకు సమ్మతిపడెను.

బిడ్డ ధనికులింటికి దత్తత వెళ్ళెను. వారు బిడ్డ కోరదగినవన్నియు సమకూర్చిరి. బిడ్డ సంతోషముగా నున్నది. పేద తల్లిదండ్రులు తరచుగా వచ్చి బిడ్డను చూచుటకు దత్తత తల్లిదండ్రులు అడ్డుపెట్టిరి. రోజును కన్నవారు చూచుచున్నచో బిడ్డకు అనురాగము వారిపైనే వుండి దత్తత చేసికొన్నవారిపైన అనురాగము ఏర్పడదని వారి భావము.

పేదతల్లి చాలసేపు ఏడ్చి తన్ను తాను ఓదార్చుకున్నది. ఒకనాడు ధనికుల ఇంటినుండి సేవకుడు వచ్చి పేద తల్లితో వెంటనే రమ్మని చెప్పెను. ఆమె ఎందు

కన్నది. వాడు బిడ్డవద్దకు యెవ్వరును పోవుటలేదన్నాడు. ఆమె ఏలననగా బిడ్డకు మశూచికము వచ్చినదని వాడు చెప్పెను.

"నా బిడ్డా!" అని అరచుచు పేదతల్లి బిడ్డవద్దకు పరుగెత్తెను.

తల్లిప్రేమ అంతయు ప్రేమయే. దానికి పరిమితులు లేవు. అవధులు లేవు. విశేషములు లేవు.

---

# శ్రీ జగద్గురు భారతీ తీర్థస్వామి చరణుల ఉపదేశము

## నాగరకోయిలలో చేసిన అనుగ్రహభాషణము

మనమీ విశాల విశ్వమును చూచినప్పుడీ విశ్వము స్వయంభువా లేక దీనికొక కర్తయున్నాడా యన్న ప్రశ్న ఉదయించును. ప్రతి వస్తువునకు—అది వున్నదని-తయారుచేయు వాడొకడున్నాడని మనము అంగీకరింతుము. ఉత్పత్తి కలిగిన దానికి తయారుచేయువాడుండి తీరవలెననుట అనుల్లంఘనీయమైనప్పుడు, జగత్తునకు ఆది ఉన్నప్పుడు, దాని సృష్టికి కర్తయన్నవాడొకడుండి తీరవలెనని మనము నిశ్చయింపవలసి వచ్చును. ఈ విశ్వమునకు సృష్టికర్త యెవ్వరు కానోపును? మనవంటి జీవుడు మాత్రము కాజాలడన్నది స్పష్టము. దేనినిగాని చేయదలచుకున్నవాడు అది యెట్లు తయారగునో తెలిసినవాడై యుండును. తయారుచేయున దెట్టిదో తెలియక తయారు చేయగలడా? లేదు. ఈ విశాల విశ్వము—నదులు, పర్వతములు, సముద్రములు—యెడార్లు—మైదానములు—వీటిని నిర్మించినివానికి వాటిని గురించి తెలిసి యుండక తప్పదు. ఇట్టి తెలివి మనవంటి జీవునికి కలదాయని విచారించినచో—సాధ్యముకాదని వెల్లడి యగును. ఈ గోడకు అవల నేమియున్నదో కూడ మనకు తెలియదు కదా! విశ్వమునందున్నదంతయు మనకు తెలియునని చెప్పగలమా? అట్టి సర్వజ్ఞత్వము కలవాడే దీనిని సృష్టించి యుండవలెను. దానిని మనము ఈశ్వరుడని భగవంతుడని పిలుచుచున్నాము. ఈశ్వరుని అస్తిత్వము మన మంగీకరింపనిచో మరి "సృష్టి ఎవ్వరు చేసినట్లు?" అన్న ప్రశ్నకు తృప్తికరమైన సమాధానము లేదు. తృప్తికరముగ పరిష్కరించుటకు సమాధానము ఈశ్వరుడు.

మరియొక సందర్భముగ చూచిన—ఒక పెద్ద వ్యవస్థ ఉన్నచో దానిని క్రమబద్ధముగా నడపుటకు ఒక పాలకుడు కావలెను. ఒక సమ్యగ్దర్శకుడగు పరిపాలకుడు లేనిచో నడువజాలదు. ఈ విశ్వము ఒక పెద్ద వ్యవస్థ. దీనికి చైత్రాది పన్నెండు నెలలు గల కాలము. అశ్విన్యాదిగ నక్షత్రములు వసంతాదిగ ఋతువులు. కొన్ని వృక్షములు వసంత ఋతువునందే కాయలు కాయును. మరికొన్ని వృక్షములు శరత్తున. ఈ క్రమము పాటింపపడుటకు దర్శకుడు—పాలకుడు—కావలెను. సూర్యుడు ప్రతిదినము ఉదయించి సాయంవేళ అస్తమించును. చంద్రుడు రాత్రివేళ ఉదయించి ప్రాతస్సున అస్తమించును. ఇట్లు నియమపాలన చేయునది యెవరు?

వర్ష ఋతువున వర్షములు, వేసవిలో యెండలు. ఒక క్రమపాలన లేనిచో సూర్యుడు సాయంవేళల నేల నుదయింపకూడదు? చంద్రకాంతి పగటివేళ నేల రాకూడదు? మామిడిపండ్లు వసంతకాలమున వచ్చుట యన్నదేల? వర్షాకాలముననే వర్షములేల? శరద్రాత్రియందే వెన్నెల ఏల? హేమంతముననే చలి ఏల? ఈ నియమము లేల? పాలించు ఈశ్వరుడున్నాడు కావున.

తైత్తిరీయోపనిషత్తును చూడగా 'భీషాస్మాద్వాతః పవతే భీషోదేతిసూర్యః' అని కన్పించుచున్నది. (ఒక పరమమునందున్న భీతిచేత సూర్యుడు సకాలమున ఉదయించుచున్నాడు—వాయువు వీచుచున్నాడు. ఇంద్రుడు తన కర్తవ్యమును నెరవేర్చుచున్నాడు) సత్యమైన యీ ఉపనిషత్వాదసారమును మనము గ్రహింపవలెను. ఉపనిషత్తులు విశ్వ రహస్యమును చెప్పు మహోత్కృష్ట గ్రంథములు. అందున్న ఏ చిన్న వాక్యసారముగాని సహస్రవర్ష పరిశోధనలవలన గ్రహించుట కతీతమైనది. అట్టి విషయములను ఉపనిషత్తులవలన మనము గ్రహింపగలుగుచున్నాము. 'భీషాస్మాద్వాతఃపవతే' అనుటతో ఉపనిషత్తు సూర్యాగ్నివాయు ఇంద్రాదులను శిక్షించునది—మనలను పాలించునది పరమమైన దున్నదని చెప్పుచున్నది. ఈ అనంతవిశ్వమున కొక క్రమపాలన శీలుడున్నాడనుచున్నది, ఇది మనకు జ్ఞానప్రసాదము. తార్కికాది బహుమార్గములవలన పరమాత్మ ఉనికి సిద్ధపడుచున్నది.

ఆయన అనుగ్రహమువలన మనము కదలిక కలిగి వున్నాము. లేనిచో ఏమి చేయలేము. మనకెంత తెలివి ఉన్నను, మనకెంత వివేకమున్నను, ఇతరుల ఉపదేశ సహకార లాభమున్నను లేకపోయినను దేవాలయమున కేగినప్పుడు మనము తలలను వంచుదుము. ఏల? మన కృత్యమునకు వెనుక నున్న భావమేమనగా "ఓయి భగవన్! నీవు నాకన్న అధికుడవు. నేను లోకమునందెంత పెద్ద అధికారిని అయినప్పటికి, నీ

ముందు అల్పుడను. అందుచేత నీ ముందు ప్రణమిల్లుచున్నాను. నీవే నన్ను కాపాడవలెను" శాస్త్రమునందు నమస్కార శబ్దార్థము వివరింపబడి ఉన్నది. తనకంటె అధికుని ముందు చేయు వినయపూర్వక కృత్యము నమస్కారము.

భగవంతుని ముందు నమస్కరించుచున్నా మనగా ఆయన మనకంటె అధికుడని. మన మెంత ఘనులమైనను భగవంతుడు మనకంటె యెంతో యెక్కువ ఘనుడని. ఇది ఇప్పటి ఆధునిక భావము కాదు. అనాదిగా నున్నది. సృష్ట్యాదినుంచి ఉన్నది. మనకు తర తరాలుగా పరంపరగా వచ్చినది. మనము విజ్ఞానమును, చదువును, వివేకమును యెంత పెంచుకున్నప్పటికి భగవంతునియందు విశ్వాసమును భక్తిని పోగొట్టుకొనకూడదు. (సశేషము)

---

# శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్య విరచిత అపరోక్షానుభూతి

## వ్యాఖ్యానము: శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

అవతారిక: (1.9 వ శ్లోకమునకు) మానవుని సమున్నత స్థానమునకు తీసికొని పోవుటకుగాని - కూలద్రోయుటకుగాని-అతని మనస్సులోని ఆలోచనలే — మనోవృత్తియే కారణము-అని శ్రీ భగవత్పాదులు ఆరు శ్లోకములలో వివరించుచున్నారు.

శ్లో॥ భావవృత్త్యాహి భావత్వం శూన్యవృత్త్యాహి శూన్యతా
బ్రహ్మవృత్త్యాహి పూర్ణత్వం తథా పూర్ణత్వమభ్యసేత్॥

తా. ఘటాది భావాకారవృత్తిచేతనేకదా భావమయత్వము కలుగును. శూన్యవృత్తిచేతనేకదా శూన్యత—జడత్వము కలుగును. బ్రహ్మాకారవృత్తిచేతనే పూర్ణత్వము సిద్ధించును. అందుచేత భావవృత్తిని శూన్యవృత్తిని విడచి పూర్ణత్వమునే అభ్యసింపవలెను.

విశేషములు: మనోవృత్తియే బంధమోక్షకారణమని విశదీకరింపబడినది.

శ్లో॥ యేహివృత్తిం జహత్యేనాం బ్రహ్మాఖ్యాం పావనీంపరాం
వృథైవతేతు జీవన్తి పశుభిశ్చసమానరాః 130.

తా. పావనము, పరమము అగు యీ బ్రహ్మాకార వృత్తిని విడచి ఎవ్వరు జీవించి యున్నారో, అట్టివారు వ్యర్థజీవులు. పశువులతో సమానులు.

శ్లో॥ యేహివృత్తిం విజానంతి జ్ఞాత్వాపివర్ధయంతి యే
తేవై సత్పురుషాధన్యా వంద్యాస్తే భువనత్రయే॥ 131

తా. ఈ వృత్తిని ఎవ్వరు యెఱుంగుచున్నారో, దీని నెఱింగి ఎవ్వరు వృద్ధి పొందించుచున్నారో వారే సత్పురుషులు. ధన్యులు. వారు మూడు లోకములందును నమస్కరింప తగినవారు.

శ్లో॥ యేషాం వృత్తిస్సమావృద్ధా పరిపక్వాచ సాపునః
తేవై సద్బ్రహ్మతాం ప్రాప్తా నేతరే బ్రహ్మవాదినః 132

తా. ఎవరియందీ బ్రహ్మాకారవృత్తి సమముగా వృద్ధినిపొంది పరిపక్వమగునో ఆ మహానుభావులు బ్రహ్మరూపులగుదురు. అనగా ముక్తులు. కాని వ్యర్థముగా మాటలు చెప్పు వారిట్టి స్థితిని పొందరు.

శ్లో॥ కుశలా బ్రహ్మవార్తాయాం వృత్తిహీనా స్సురాగిణః
తేప్యజ్ఞాని తయానూనాం పునరాయాంతి యాంతిచ॥ 133

తా. బ్రహ్మతత్వమిదియని ఉపన్యాసప్రవచనములు చేయుటయందు నేర్పరులై, బ్రహ్మాభ్యాసవృత్తి లేనివారై విషయవాంఛలు కలవారై -యెవరున్నారో - అట్టివారు కూడా అజ్ఞానులే. వాస్తవము. వారును మరల మరల జనన మరణములను పొందుచుందురు.

శ్లో॥ నిమేషార్థం నతిష్ఠన్తి వృత్తిం బ్రహ్మమయీాం వినా
యథాతిష్ఠంతి బ్రహ్మాద్యాసనకాద్యాశ్శుకాదయః॥ 134

తా. బ్రహ్మాదిదేవతలును. సనక, సనందన, సనాతన సనత్కుమారులు, శుక మహర్షి మొదలగు వారివలె జ్ఞాననిష్ఠులైనవారు అర్ధనిమిషము కూడ వ్యర్థము చేయకుండా బ్రహ్మాకార వృత్తితోనే యుందురు. (సశేషము)

---

## వ్యాసములు-ఎక్స్ఛేంజి కాపీలు, రివ్యూకి గ్రంథములు

మా పత్రికకు పంపదలచిన వ్యాసములను ఎక్స్ఛేంజి కాపీలను రివ్యూకి గ్రంథములను (2 కాపీలు) యీ క్రింద చూపిన మా మద్రాసు కార్యాలయము అడ్రసునకే పంపవలెను.

శ్రీ రామలింగేశ్వరరావు,
శ్రీ శంకరకృప సంపాదకుడు,
నెం. 63 కోడంబాకం హైరోడ్డు, త్యాగరాయనగరు, మద్రాసు-600 017.

# శ్రీ విద్యారణ్య విజయగాథ



5

శ్రీ విద్యారణ్యులు తామప్పటికే సర్వ వాక్యార్థ విజ్ఞాతపై వేద భాష్యము వ్రాసి యుండుటచే దానిని సాదరముగా గురువులకు నివేదించిరి.

గురువులు శ్రీ విద్యాతీర్థులు దానిని చూచి సంతసించి "దీనికి లోకమున నున్న పండితుల ఆమోదమును సంపాదింపు" మని ఆనతి చేసిరి.



# సంస్కృతభాషను మనమేల ఆదరించి నేర్చుకొనవలెను? (35)

ఈ ప్రశ్నకు మన దేశంలో మేధావివర్గంలో మూర్ధన్య మనీషామణులు సమాధానాలు చెప్పారు. గత సంచికలందు కొన్నిటిని తెలుసుకున్నాము. ఇప్పుడు మరికొన్ని. (సంపాదకుడు)

## శ్రీ సేఠ్ గోవిందదాస్

సంస్కృతశబ్ద సరిత్తు భారతీయ సాహిత్య భాషలన్నిటికి జీవనాధారమగు పోషక ద్రవ్యము. సంస్కృతములోని ఉపమాలంకారములు, ఉత్ప్రేక్షలు, అభివ్యంజనములు, సూక్తులు, భారతీయ భాషలన్నింటియందు కలసి మెలసి పోయినవి. ఇది భారతీయ సాంస్కృతిక ఐక్యతకు ప్రతీతి. సంస్కృత శబ్దములు భారతీయ భాషలందెంత కలసిపోయినవనగా—కొంతప్పుడు రెండు ప్రాంతీయ భారతీయ భాషలకున్న భేదమును నిరూపించుట కష్టమగుచున్నది.

దాక్షిణాత్యులగు తమిళులనుచున్నారుకదా—తమ భాషయందు సంస్కృత శబ్దములు కలియలేదని. అయితే వారి మాటలు భ్రమపూర్ణమైనవి. మదరాసు విశ్వవిద్యాలయము వారిచే ప్రకటింపబడిన ప్రమాణశబ్దకోశము "తమిళ లెక్సికన్" (డిక్షనరీ) కొంచెము పరిశీలించినచో విదితమగుచున్నదేమనగా—తమిళ భాషలో 50 శాతం సంస్కృత శబ్దము లున్నవని.

కేవలము భారతీయ భాషల విషయము మాత్రమే కాదు. సింహళము, సయాం, (తాయిలాండ్) కంబోడియా మొదలగు దేశముల భాషలకు కూడ సంస్కృతము ప్రాణతుల్యముగ నున్నది. ఆ యా భాషల కవిత, ధార్మిక విచారధార, ప్రశాసన శబ్దావళి, వైజ్ఞానికపదావళి-అన్నియు సంస్కృతమయములే.

మనము ముఖ్యముగా స్పష్టముగా గ్రహింపవలసినదేమనగా-ఎప్పుడు సమస్త భారతదేశమున సంస్కృత అధ్యయనము అనివార్యమగునో—అప్పుడు మన భారతమునకే కాదు—యావద్భూమండలమునకు మన సాంస్కృతిక ఐక్యత సువిదితము కాగలదు.

అధ్యక్షీయ భాషణ
అఖిల భారత హిందీ సాహిత్య
సమ్మేళన (మీరట్)

---

# వేదాంత న్యాయములు (32)

## (న్యాయములవంటి ఉదాహరణలు)

[వేదాంత శాస్త్రముతో సూక్ష్మవిషయములను బోధచేయుటకు కొన్ని ఉదాహరణలు సాధారణముగా నుపయోగించెదరు. ఈ ఉదాహరణలు నిత్యజీవితమునకు సంబంధించినవిగా నుండి-వీటిమూలమున దుర్గ్రాహ్యమైన సిద్ధాంత విషయములను అవగాహన చేసికొనుటకు తోడ్పడును. ఈ ఉదాహరణలవలన-సునిశిత ప్రజ్ఞావంతముకాని సామాన్యుని మేధస్సుకూడ సిద్ధాంతమును గ్రహింపగల్గును. సామాన్యపాఠకులకొఱకు వేదాంత న్యాయముల వివరణములను క్రమముగా ప్రకటించుచున్నాము. సంపాదకుడు]

## నిప్పు-పొగ

పొగ యందుచున్న నిప్పునుండి బయిలుదేరును. ఒకప్పుడు దట్టమైన పొగ యేర్పడి దానికి మూలమైన నిప్పును కన్పించకుండ తెర కట్టుట జరుగును. కాని పొగ నిప్పునుంచే వచ్చును. నిజమునకు అది యందుచున్న నిప్పునకు భాగమే. పొగ నిప్పుతో నున్నదే.

అదేవిధముగా మాయ బ్రహ్మము నుండి బయలుదేరినదే అయిననూ బ్రహ్మము కనపడకుండునట్లు మాయ తెరను అడ్డుపెట్టును. బహువిధములైన మాయావస్తుజాలమును ప్రదర్శించును.

కాని మాయ బ్రహ్మముతో నున్నదే. భిన్నము కానేకాదు. కన్పించుచున్నది బ్రహ్మమే. శుద్ధ సచ్చిదానందము.

---

## చందాదారులకు విన్నపము-ప్రకాశకుని చిరునామా మార్పు గమనింపుడు

చందాలు బాకీయున్నవారికి పత్రిక పంపబడదు. చందా సొమ్మును ముందుగనే (తమ అడ్రసు మార్పుకూడ వెంటనే) క్రింది చిరునామాకు పంపవలెను.

ఆకెళ్ల సత్యనారాయణమూర్తి
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు,
6-3-609/18, ఆనందనగర్,
ఖైరతాబాదు, హైద్రాబాదు-500004.

# శ్రీ శంకర భగవత్పాద విరచిత
# వివేకచూడామణి
## (శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామి విరచిత వ్యాఖ్యాసమేతము)

**ఆంధ్రీకరణము : డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు(వేదాంత శిరోమణి విద్వాన్)
ఎం. ఏ. (సంస్కృత, ఆంగ్ల హిందీ) పి. హెచ్‌డి.**

(గతసంచిక తరువాయి)

ఈ విధముగ రజస్తమోగుణములున్నను వాటిచే తిరస్కృతము కాని సత్త్వధర్మములను చెప్పి, ఏమాత్రము వాటి సంపర్కము లేని సత్త్వగుణము యొక్క ధర్మములను చెప్పుచున్నారు—

మూ. విశుద్ధసత్త్వస్య గుణాః ప్రసాదః స్వాత్మానుభూతిః పరమా ప్రశాంతిః
తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా, యయా సదానందరసం సమృచ్ఛతి 121

ప్ర. అ. ప్రసాదః = మనోనైర్మల్యము, స్వాత్మానుభూతిః = స్వాత్మానుభవము, పరమా ప్రశాన్తిః = గొప్ప శాంతియు, తృప్తిః = తృప్తియు, ప్రహర్షః = ఆనందము, యయా = దేనిచే, సదా = యెల్లప్పుడు, ఆనందరసం = ఆనందరసమును, సమృచ్ఛతి = పొందునో, అట్టి పరమాత్మనిష్ఠయు పరమాత్మయందు ఏకాగ్ర స్థితియు, ఇవి, విశుద్ధే సత్త్వస్య = విశుద్ధమగు సత్త్వగుణము యొక్క, గుణాః = గుణములు.

వ్యా. అ. విశుద్ధత్వమనగా రజస్తమో గుణములతో కలియకుండుట. కేవల సత్త్వగుణము యొక్క గుణాః = కార్యములగు ధర్మములు, ప్రసాదః - మనస్సు నిర్మలముగా నుండుట. ఆవరకమగు తమస్సు, విక్షేపకమగు రజస్సు లేకపోవుటచే ఏమాత్రి ప్రతిబంధకము లేకుండగ స్వాత్మానుభూతి, ఆత్మతత్త్వము, తమస్సుచే ఆవరింపబడినప్పుడు, అది స్పష్టముగ భాసింపక అన్నమయాదుల భాసించును. కేవలసత్త్వమే ఉన్నప్పుడు మాత్రము స్వస్వరూపము నిర్విఘ్నముగ అనుభవింపబడును. కావున నే పరమా = నిరతిశయమైన, ప్రకృష్టమగు శాంతియు, ముందుగూడ "కస్తాం పరానన్దరసానుభూతిమ్" ఇత్యాది శ్లోకము (క 23) చెప్పనున్నారు. మొదట సాధన దశలో ప్రయత్నపూర్వకముగా సంపాదింపదగిన శాంతి ఆత్మదర్శనము కలిగిన పిమ్మట స్వభావముగా అయిపోవును, అని భావము. కావున నే నీచమగు ఈ ప్రపంచమున

సంచారము లేకపోవుటచే మనస్సునకు తృప్తి, అనగా 'చాలును' అనెడు బుద్ధి నిరంకుశముగ కలుగును. ప్రహర్షః=ఇతర సాధనములపై ఆధారపడనిదియు, యెల్లప్పుడును స్వయముగనే భాసించుచున్న ఆనందము లేదా—"చేయదగిన పని చేసితిని; పొందదగినది పొందితిని;" అని తనను ధన్యునిగ తలచుచు సంతసించుచుగాన ప్రకృష్టమగు హర్షము, దానిచే యెల్లప్పుడును ఆనందరసమును బాగుగ పొందునో అట్టి పరమాత్మ నిష్ఠ. స్వరూపానందమును సాక్షాత్కరించుకొనుటచే మనస్సు మరల వేచుటకు అశక్తమై, లీనమై నిర్వికల్ప సమాధిని అనుభవించునని భావము. 121.

అ. వ. ఇపుడు గుణత్రయమయము, 'మాయ', 'అవిద్య' మొదలగు శబ్దములచే వాచ్యము, కార్యమునుబట్టి ఊహింపదగినదియు అగు ఈ అవ్యక్తమే, స్థూల సూక్ష్మాది సకల కార్యములకు హేతువగుటవలనను, జ్ఞాన నాశ్యమగుటవలనను, 'శీర్యతే ఇతి శరీరమ్' (నశించునది గాన శరీరము) అను వ్యుత్పత్తి ననుసరించి 'కారణ శరీరము' అని చెప్పుచు "అవ్యక్తనామ్నీ" ఇత్యాది శ్లోకమునందు (110) ఉపక్రమింపబడిన మాయను "అవ్యక్తమేతత్" ఇత్యాది శ్లోకమునందు ఉపసంహరించుచున్నారు—

మూ. అవ్యక్తమేతత్త్రిగుణైర్నిరుక్తం తత్కారణం నామ శరీరమాత్మనః
సుషుప్తిరేతస్య విభక్త్యవస్థా ప్రలీన సర్వేంద్రియ బుద్ధివృత్తిః 122

ప్ర. అ. ఏతత్త్రిగుణైః=ఈ గుణత్రయముచే, నిరుక్తం=నిర్వచింపబడిన, తత్=ఆ, అవ్యక్తం=అవ్యక్తము, ఆత్మనః=ఆత్మయొక్క, కారణం నామశరీరం=కారణమను పేరుగల శరీరము, ప్రలీన సర్వేంద్రియ బుద్ధి వృత్తిః=అణగిపోయిన సకలేంద్రియ వృత్తులును బుద్ధివృత్తియు గల, సుషుప్తిః=సుషుప్త్యవస్థ, ఏతస్య=ఈకారణ శరీరముయొక్క, విభక్త్యవస్థా=విశిష్టమగు అవస్థ.

వ్యా. అ. అవ్యక్తం=దాని స్వరూపముచే సాక్షాత్తుగ అస్పష్టమైనది, కామ క్రోధ-జ్ఞాన-ఆలస్య-అమానిత్వాది ధర్మములచే ఊహింపదగిన ఈ రజస్తమః సత్వ గుణములచే, నిరుక్తం=త్రిగుణాత్మిక, కార్యానుమేయ, అని పూర్వము చెప్పబడిన నిర్వచనము కలది, తత్ అవ్యక్తం=అవిద్యాది శబ్దములచే చెప్పబడు ఆ అవ్యక్తము, ఆత్మకు కారణ శరీరము. ఇది శాస్త్రమునందు కారణశరీరమని ప్రసిద్ధము. 'సుషుప్తి' ఇత్యాది వాక్యముచే ఈ కారణ శరీరముయొక్క అసాధారణమగు అవస్థను చెప్పుచున్నారు. ఏతస్య=కారణశరీరమైన ఈ అవ్యక్తమునకు, ప్రలీన సర్వేంద్రియ బుద్ధి=వృత్తిః'=అనునది సుషుప్తికి విశేషణము. ఏ సుషుప్తియందు సర్వేంద్రియ వృత్తులును,

బుద్ధివృత్తియు లీనమైపోయినవో అది దీనిచే నకేంద్రియముల వృత్తులతో కూడిన జాగ్రదవస్థయు, కేవల బుద్ధివృత్తియే గల స్వప్నావస్థయు వ్యావర్తింపబడినవి. విభక్త్యవస్థా=విభాజకమగు—అనగా ఇతర అవస్థలకంటె దీనిని వేరుచేయు అవస్థ. అజ్ఞానము అవస్థాత్రయమునందును ఉండును, ఐనను జాగ్రత్స్వప్నావస్థలు అజ్ఞానమునకును ఇంద్రియ బుద్ధివృత్తులకును గూడ సాధారణములు. సుషుప్తి మాత్రము ఒక్క అజ్ఞానముననే (అవ్యక్తమునకే) సంబంధించినదగుటచే దాని అసాధారణావస్థయని భావము. 122.

అవ. నాల్గవపాదముయొక్క అర్థమును అనుభవముచే స్పష్టీకరించుచున్నారు.

మూ. సర్వప్రకారప్రమితి ప్రశాన్తి ర్బీజాత్మనావస్థితిరేవ బుద్ధేః
సుషుప్తి రత్రాస్య కిల ప్రతీతిః కించిన్న వేద్మీతి జగత్ప్రసిద్ధేః ॥123.

ప్ర. అ. సర్వప్రకార ప్రమితి ప్రశాన్తిః=సర్వవిధములగు జ్ఞానముల ప్రశాంతిగల, (సుషుప్తికి విశేషణము) బుద్ధేః=బుద్ధియొక్క, బీజాత్మనా=బీజస్వరూపమున అవస్థితిరేవ=ఉండుటయే. సుషుప్తిః=సుషుప్తిః. అత్ర=ఈ అవస్థయందు. అస్య=పురుషునకు, "కించిత్ న వేద్మి ఇతి=ఏమియు యెరుగను అని, జగత్ప్రసిద్ధేః=జగత్తులోని ప్రసిద్ధినిబట్టి, ప్రతీతిః కిల=ప్రతీతియుండును కదా?

వ్యా. అ. ప్రత్యక్షిత్వము, అనుమితత్వము మొదలగు అనేక ప్రకారములుగల ప్రమితులు ఏ సుషుప్తియందు పూర్తిగ శాంతించుచున్నవో అది "సర్వప్రకార ప్రమితి ప్రశాంతి" ఐనచో మరునాడు వ్యవహారమెట్లు జరుగుచున్నది అని ఆశంకించుకొని 'బీజాత్మనా' ఇత్యాది వాక్యముచే సమాధానము చెప్పుచున్నారు. బుద్ధేః=అంతఃకరణమునకు, బీజాత్మనా=సంస్కారరూపమున, అనగా కారణ జ్ఞాన రూపమున మాత్రమే, అవస్థితిః=ఉనికి, అంతియేకాని ఆ సమయమున తనవలన కలిగిన వృత్తి స్వరూపముతో బుద్ధికి ఉనికి లేదు, అను విషయము 'ఏవ' కారముచే తెలియుచున్నది అదియే సుషుప్తి. ఆ సమయమున ఏవిధమగు జ్ఞానము కూడ లేకుండుటకు అనుభవమును ప్రమాణముగ చూపుచున్నారు. అత్ర=ఈ సుషుప్తి విషయమున, అస్య=నిద్రించి మేల్కొన్న జీవునియొక్క, 'నాకేమియు తెలియలేదు' అను ప్రతీతి, కిల=ప్రసిద్ధమైనది. ఆ సమయమున అంతఃకరణ వృత్తికూడ ఉన్నచో అపుడు "నాకేమియు తెలియలేదు" అను ప్రతీతి ఉండుటకు వీలులేదు. జాగ్రత్స్వప్నావస్థలలో అట్లు లేదుకదా? ఈ అనుభవమును గూర్చి వివాదము చేయువానిని గూర్చి "జగత్ప్రసిద్ధేః" అని చెప్పుచున్నారు. ఈ విధముగ సకల ప్రసిద్ధమగు ప్రతీతి యున్నప్పుడు వివాదము చేయుట అసంగతమని అభిప్రాయము. 123

అ. వ. ఆత్మానాత్మ వివేచనమునకై చెప్పదలచిన అనాత్మ విషయము నిపుడు ఉపసంహరించుచున్నారు:—

మూ. దేహేన్ద్రియ ప్రాణ మానోఽహమాదయః సర్వేవికారా విషయాః సుఖాదయః. వ్యోమాది భూతాన్యఖిలం చ విశ్వమవ్యక్తపర్యన్త మిదం హ్యనాత్మా.

ప్ర. అ. దేహేన్ద్రియప్రాణ మానోఽహమాదయః=దేహము, ఇంద్రియములు ప్రాణములు, మనస్సు. అహంకారము మొదలగు. సర్వేవికారాః=సమస్తమైన వికారములు, విషయాః=విషయములు, సుఖాదయః= సుఖాదులు, వ్యోమాది భూతాని= ఆకాశము మొదలగు భూతములు, అవ్యక్తపర్యంతం=అవ్యక్తమువరకునుగల, ఇదం విశ్వం=ఈ ప్రపంచము, అనాత్మాహి=అనాత్మయే కదా!

వ్యా. అ. దేహము, ఇంద్రియములు, ప్రాణములు, మనస్సు, అహంకారము అనునవి ఏ బుద్ధ్యాది వికారముల ఆదియందున్నవో అట్టి సర్వేవికారాః=సమస్తమైన భౌతిక పదార్థములు. విషయాః=శబ్దస్పర్శరూప రసగంధములు, సుఖాదయః= సుఖము మొదటిది వేటికో అట్టి మనఃపరిణామరూపములైన భయాంతములగు దుఃఖ మోహ సంకల్పాది వృత్తులును, వ్యోమాది భూతాని=ఆకాశము ఏ పృథివివరకునుగల ఏ భూతములకు ఆదియో అట్టి భూతములును, అధికముగ చెప్పనేల? ఈ దృశ్యమగు అవ్యక్తపర్యంతమైన సకల జగత్తును అనాత్మయే. దీనిచే "కో సావనాత్మా" అను దానికి ప్రత్యుత్తర మీయబడినది. 124. (సశేషము)

---

# అద్వైత సిద్ధాంతము ముందు పాశ్చాత్యుల పూర్వపక్ష ఖండన

## (ఆచార్య సుందరము)

(శ్రీ శంకర భగవత్పాద అద్వైత సిద్ధాంతము పైన పాశ్చాత్య విద్వాంసులు కొందరు దుర్బలమైన ప్రతిపక్షవాదములు చేసిరి. ఆ వాదముల ఖండన మీ వ్యాసము. —సంపాదకుడు.)

(గతసంచిక తరువాయి)

తరువాత ప్రథమాధ్యాయపు నాలుగవపాదముయొక్క రెండవభాగమును తీసికొని డా. థీబా—సూత్రకారుని మనస్సునందు మాయాసిద్ధాంతము లేదని చెప్పుటకు ప్రయత్నించెను. ఈ భాగమును గురించి మేమింతకుముందే ఒక పర్యాయము సూచనలు చేసితిమి. ఈ భాగమును డా. థీబా తీసుకొని "సూత్రకారుని అభిప్రాయ

మట్లయినచో — ఆ భావమును వ్యక్తము చేయుట — బ్రహ్మము మాయ ద్వారా నే ప్రపంచమునకు ఉపాదానకారణమని — ప్రపంచము మిథ్యయని ఎక్కడను లేదు" అని వ్రాసెను. అంతేకాక శంకరానుయాయులు తీవ్రముగా విరోధించు భావమును సూచించు మత్' అను శబ్దము చెప్పుచున్నదని అనగా ప్రపంచము బ్రహ్మమునకు వివర్తము కాదని బ్రహ్మమునుంచి ప్రపంచము పరిణమించుచున్నదని కూడా డా. థిబో వ్రాసెను.

ఒక సూత్రమునం దుపయోగింపబడిన పదము దీనికి సామాన్యముగా ఉన్న అర్థప్రతీతిచేత — ఒక ప్రకరణమంతయు ఉద్ఘాటించిన — గ్రంథమంతయు సాధించిన సిద్ధాంతమును త్రోసివేయజాలదు. వ్యాసభగవానుని సూత్రములందు నిర్ణయింపబడిన ఒకేఒక సత్పదార్థము బ్రహ్మము. అందుచేత యీ సూత్రమునం దుపయోగింపబడిన 'పరిణామ' అన్న పదమునకు ఒకే ఒక అర్థముండవలెను. సాధారణమైన మార్పు — కార్యముయొక్క సత్యత్వమును గురించిన స్పష్టీకరణ లేకుండా.

అందుచేత శ్రీ శంకరభాష్యమునకు వ్యాఖ్యాతయగు గోవిందానందులు యీ సందర్భమున "అత్రసూత్రే పరిణామశబ్దః కార్యమాత్రపరః తదనన్యత్వే నివర్త వాదస్య వక్ష్యమాణత్వాత్" (ఈ సూత్రమునందు పరిణామ శబ్దము ఒక కార్యమును రూపు కట్టించుటన్న సామాన్యార్థముతోనే అవగాహన చేసుకొనవలెను. ఏల ననగా రాబోవు సూత్రమునందు (సూత్ర ii - 1, 14 — తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః) వివర్తవాదము చెప్పబడుచున్నది కాబట్టి, ఛాందోగ్య ఉపనిషత్తులోని వాక్యమును "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేక సత్యమ్ —" సూచించుచున్నది. ఛాందోగ్యవాక్యమునకు భావమేమనగా — వికారము వాక్కుపై ఆధారపడిన నామధేయము మాత్రమే. మనము మృత్తు — మట్టి — అని చెప్పబడునది సత్యము. కుండలు — కూజాలు మొ॥గా చెప్పుట కేవలము నామములు మాత్రమే)

ఇక్కడ ఉపాదాన కారణమైన బ్రహ్మ మొక్కటే సత్యము. 'సత్యం' అన్న శబ్దము ఉపయోగించుట — కారణసందర్భముగా — కార్యము తాను స్వతంత్రముగా — తనయంత తాను సత్యముకాదని చెప్పుటకు.

వికారము (కర్మము) యోగులు చెప్పునట్టి వికల్పమువంటిది. 'శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః' వికల్పమనగా — వస్తువులేకుండా కేవలము శబ్దవివరణమువలన కలుగు జ్ఞానమువంటిది. ఇది బ్రహ్మవేత్త దృష్టినిబట్టియైన నిజము. అతనికి — శ్రుతి యొక్క సారభావమువలన — కారణము (బ్రహ్మము) అద్వితీయమైన సత్యము. నిజముగా దానికంటె భిన్నముగా కార్యమేదియు లేదు.

తరువాతకాలమున అవిద్య—మాయ అను పదములు, ఈశ్వర, జీవ సందర్భముగా పరిచయములైనప్పటికి—యింకను—శ్రీ శంకరులు ప్రయోగించినట్లు 'మాయ శబ్దము అవిద్య అర్థముతో ప్రయోగింపబడుచున్నది. అందుచేత యీ సూత్రమున పరిణామ శబ్దము సామాన్యార్థమున—(ఒక కార్యమును కల్పించుట యన్న భావముతో దాని సత్యస్థితికి సంబంధము లేకుండ) ఉపయోగింపబడినట్లు అవగాహన చేసికొనవలెను. గోవిందానందుడిట్లే సూచించెను.

తరువాత డా. థీబా iii, 2, 11, సూత్రములను తీసికొనెను. "ఈ సూత్రముల భాష అమిత అస్పష్టముగా—అతి సంగ్రహముగా నున్నది. అందుచేత ఏ వ్యాఖ్యాత విశ్వసింపతగినవాడో నేను నిర్ణయించుకోలేక పోవుచున్నాను" అని వ్రాసెను. ఇక్కడ మున వ్యాఖ్యానమున పేక్షణీయము. అయితే "నిర్ణయించుకొనలేక పోవుచున్నాను" అని వ్రాసిన డా. థీబా వారల బలముగా దృఢముగా 'ఏ సూత్రములును శ్రీ శంకర సిద్ధాంతమును బలపరచుట లేదన్నదిమాత్రము నిశ్చయము' అని వ్రాయుటెట్లు? ముందు వెనుకల నున్న పాఠములచేత వ్యతిరేకింపబడనందున శంకర సిద్ధాంతము ధర్మబద్ధమని చెప్పుటకు వెనుకాడ నక్కరలేదు. శ్రుతుల భావప్రవాహము శంకర సిద్ధాంతమునకు విరుద్ధముకాదు.

డా. థీబా చేసిన తరువాతది—ఆఖరుది సూచన మాత్రము iii. 2. గురించి. దీనియందు మాయ శబ్దప్రయోగమున్నది. స్వప్నమునందలి భ్రాంతి దృశ్యములను గురించి తెలుపుచున్నది. ఇక్కడ డా. థీబా వ్రాసినదేమనగా—"మాయను గురించి సత్యముకాని భ్రాంతియని శ్రీ శంకరుల నిర్ణయమును మనమంగీకరించినను — యీ సూత్రమును బాదరాయణుడు జగత్తు భ్రాంతి కల్పితమని భావింపలేదని — లేక అట్టి సిద్ధాంతమును సంభావించినప్పటికీ—'మాయ' శబ్దమును ఆయన వేరు అర్థముతో ప్రయోగించెను." ఎందుచేత? డా. థీబా సమాధానము చెప్పెను. "జాగ్రదవస్థలోనివాడు ప్రపంచమును గమనించుటలోని 'మాయ'—స్వప్నావస్థలో దృశ్యములను చూచునప్పటికి దానికంటె-అధికస్థితి దనుట నిశ్చయముగా శంకర సిద్ధాంతము" అది చక్కగా నిజము. ఆ భేదమును తెలుపుటకే శ్రీ శంకరులు 'మాయామాత్రమ్' అని సమాసప్రయోగ చేసిరి. జాగ్రదస్థ సుషుప్తి అవస్థ మాయాకలితములు కాగా స్వప్నము మాయామాత్రము - నిశ్చయముగా, ప్రత్యేకముగా - నిశ్శంకగా - మాయాత్మకమే.

మాయను గురించి బాదరాయణుని అభిప్రాయమిట్లుండునని డా. థీబాచేసిన

భావనలు రెండును సరికాదు. అందుచేత జగత్తు మిథ్యయని బాదరాయణుడు సిద్ధాంతీకరించెననుట—మాయశబ్దమును ఆయనకూడ శంకరులు ఉపయోగించిన అర్థములోనే ఉపయోగించెననుట సరియయినది. ఈ సూత్రము—స్వప్నమును మాయ యనుటకు బదులుగా 'మాయామాత్రము' అనుట కున్న హేతువును పరిశీలించినచో యీ నిశ్చయము మరింత దృఢపడును. కారణము — కార్త్స్న్యేనా నభివ్యక్త స్వరూపత్వాత్—(సత్యలక్షణము లన్నిటిని అభివ్యక్తము చేయకపోవుట వలన.) ఒక కాలమున—ఒక ప్రదేశమున సంభవించినట్లు—తరువాత నవి అసత్యములని నిరూపించుటకు వీలుకానట్లు—లక్షణములు స్వప్నమునకు లేవుకదా? ఇవి జాగ్రదవస్థకున్నవి. అయితే స్వప్నములందు ఏ కొంచెమైన సత్యస్పర్శలేదా? దానికి సమాధానము తరువాత సూత్రమునందున్నది. జాగ్రదవస్థలోని సంఘటనలకువలె స్వప్నములకుకూడ కొంత సత్యత్వమున్నది. అవి భవిష్యత్సూచకములు.

సూత్రకారు డీ విషయమును తెలుపుచున్నాడు—శ్రుతి అట్లు చెప్పినదని—స్వప్నశాస్త్రజ్ఞులట్లు ధృవీకరించుచున్నారని, అట్లు ఈ సూత్రములు స్వప్నస్థితిని గురించి—మాయావాదమును — శ్రీ శంకరులు ప్రవచించినట్లే—సూత్రకారుడు సంభావించెనని ఋజువుచేయుచున్నవి. డా. థీబా చెప్పినట్లు — ఈ అధికరణమునందు మాత్రమే సూత్రకారుడు మాయాశబ్దము నుపయోగించెనన్నది విస్మరింపరాదు. జగత్తుయొక్క వ్యావహారిక సత్యమును—(పారమార్థిక సత్యముకాదు) గురించి సూత్రకారునికి భాష్యకారునికి యేకాభిప్రాయ మున్నదనీ నిరూపణము జరిగినందువలన—డా. థీబా వాదమును దీర్ఘముగా పరిశీలించినందువలన నష్టములేదు.

ఇక డా. థీబా విమర్శలోని తుది విషయము — జీవబ్రహ్మ సంబంధమును గురించి తీసికొందుము. సూత్రములు జీవునికి బ్రహ్మమునకు అభేదమని, అవిద్యాహేతువుచే అధ్యారోపము జరిగి భిన్నముగా తోచుచున్నదన్న సిద్ధాంతము సూత్రములు చెప్పుచున్నవా? లేదా? డా. థీబా—"ఈప్రశ్న మాయావాదమునకు మరియొక రూపమే—" అని సబబుగా వచించెను. మాయావాదమునకు విరుద్ధముగా చేయబడిన ప్రతివాదములు ఖండింపబడి—ఆ ప్రతివాదముల కేమాత్రము ఆధారమే లేదని నిరూపింపబడుటచేత—యిక జీవునికి బ్రహ్మమునకు భేదములేదన్న సిద్ధాంతము కూడ ఋజువు చేయబడినదని మనము భావించవచ్చును. అయితే డా. థీబా—ఈ విషయమును గురించి ప్రత్యేక పరిశీలన కావలసియున్న దనెను. కాబట్టి ఆయన చేసిన వాదమును మనము పరిశీలింత్తము.

(సశేషము)

# నిత్యకర్మలు (23)

(ప్రాతఃకాలమున నిద్రలేచిన తరువాత ప్రతినిత్యమును ప్రతి మానవుడును కొన్ని నిత్యకర్మలను చేయవలసి యున్నది. ఆ నిత్యకర్మ లేవి? ఏట్లు చేయవలెను? ఈ ప్రశ్నలు సామాన్యులకు కలుగుచున్నవి. ఆ యీ ప్రశ్నలకు సమాధానముగా యీ వ్యాస పరంపర ప్రకటించుచున్నాము. —సంపాదకుడు.)

## స్నానమునెట్లు చేయవలెను? (2)

(గత సంచిక తరువాయి)

నదికిపోయి గంగను ధ్యానించి గొడ్డులోతు నీట నిలచి, సిగను రెండుగా విడదీసి, చెవులు ముక్కులు మూసికొని, ముమ్మారు స్నానము చేయవలెను. ముమ్మారు మునిగిన తరువాత ఆచమనము చేసి సిగను ముడివైచుకొని శరీర మలిన శోధనము చేసికొని. మరల ఆచమనము చేసి, ప్రాణాయామము చేసి, అప్పుడు సంకల్పము చేసి మరల ముమ్మారు స్నానము చేయవలయును.

ప్రమాణవచనములు

శ్లో॥ తతోనదీం సమాగత్య గంగాధ్యాన పురస్సరం
నాభిమాత్రే జలేస్థిత్వా త్రివారం స్నానమాచరేత్॥ విశ్వామిత్ర

శ్లో॥ నాభిమాత్రే జలేస్థిత్వా కృత్వా కేశాన్ ద్విధా ద్విజః
నిరుద్ధ కర్ణనాసస్తు త్రివారం మజ్జనంచరేత్॥ విష్ణుం

శ్లో॥ త్రిరాప్లుత్య సమాచమ్య శిఖాంబ ధ్యాసమాచమేత్
ప్రాణానాయమ్య సంకల్ప్య త్రివారం మజ్జయేత్పునః॥ అశ్వలాయనః

స్నానమునందు పంచ అంగములున్నవి. సంకల్ప, సూక్తపఠన, మార్జన, అఘమర్షణ, దేవాదితర్పణము

(సంకల్ప సూక్త పఠనం మార్జనం చాఘ మర్షణం
దేవాది తర్పణం చైవస్నానం పంచాంగముత్తమం)

సంకల్పము చేసిన తరువాత (శుభేశోభన ముహూర్తే....ప్రీత్యర్థం ప్రాత స్నానమహంకరిష్యే) 'హిరణ్య శృంగం' అను సూక్తమును పఠించి (యీ సూక్త మంత్రమును పెద్దలవలన గ్రహింపవలెను) ఆపోహిష్ఠామయో—హిరణ్యవర్ణా అను మంత్రములచే మార్జనము చేసికొనవలెను.

తరువాత పవమానసూక్తమును పఠించి పిమ్మట మరల స్నానమును చేయవలెను.

(మంత్రములు పెద్దలనుండి గ్రహింపవలెను) (సశేషము)

# శ్రీ విద్యారణ్యుల గురించిన జనశ్రుతి గాథలు (5)

## విజయనగర నిర్మాణము

విజయనగర నిర్మాణము ప్రారంభమునకు యంత్రనిర్మాణము ముహూర్త నిర్ణయము చేయుటలో తనకు సహాయకారిగా నుండుటకు విద్యారణ్యులు కాశీపండితు నొకనిని రప్పించిరి. ఆ ముహూర్త నిర్ణయము నక్షత్రగమనమునుబట్టి చేయుటకై ఆ పండితుడు సమీపముననున్న కొండపై నెక్కెను. నిర్ణయింపబడిన ముహూర్తమునకు కొండపై నుండి పండితుడా శంఖము నూదుటకు, ఆ ధ్వనిని విన్నంతనే విద్యారణ్యులు కరగించి పెట్టుకొనిన లోహమును యంత్రపుటచ్చున పోయుటకు నిర్ణయమైనది.

అనుకున్న సమయము సమీపించినది. విద్యారణ్యులకు శంఖారావము వినిపించినది. ఆయన లోహమును యంత్రపు టచ్చులో పోసెను. మరల నొక శంఖధ్వని విన్పించినది. కాశీపండితుడు కొండపై నుండి దిగి వచ్చెను. రెండవ పర్యాయము విన్పించిన శంఖారావమే కాశీపండితుడు చేసినదని, మొదటిది ఆ ప్రాంతమున సంచరించు జంగమ భిక్షుకునిదని తెలిసినది. విద్యారణ్యులు కాశీపండితుడు అనుకున్న ముహూర్తముకంటె ముందుగా యంత్రము నిర్మింపబడినదని విచారించిరి. చింతవలన ప్రయోజనము లేదని గ్రహించి చల్లారిన యంత్రమును చూడగా అది రెండుశంబొతిక బీటలు కలిగియుండెను.

ఆ నగరము రెండువందల యిరువదియైదు సంవత్సరములకంటె మించిన కాలముండదని వారు గ్రహించిరి. (అది అల్లే 1336 నుండి 1565 వరకు నున్నది.

---

## అవతారములు - వైభవము

శ్రీరామ, శ్రీకృష్ణ అవతారములు—శ్రీమన్నారాయణుని లీలావతారములే. ఈ రెండు అవతారములను కలుపుట కెందరో భక్తులు ప్రయత్నించి సంతోషించెదరు.

బాలకృష్ణుడు ఊయెలయందు శయనించియుండగా యశోదాదేవి జోలపాటగా రామగాథ చెప్పినదట. ఆ పాటలో సీతాదేవిని రావణుడపహరించెనన్న మాట రాగా బాలకృష్ణుడు ఉగ్రుడై లేచి "లక్ష్మణా! నా ధనుస్సు—నా ధనుస్సు-

ఎక్కడున్నదది"—అనెనట. "రామో నామ బభూవ....గిరః పాంతు వః) అని లీలాశుకుడు శ్రీకృష్ణ కర్ణామృతము (ii-71) న చక్కని శ్లోకములోన చమత్కరించెను.

మరికొందరు రామగాథను శ్రీకృష్ణ గాథను కలిపి ద్వ్యర్థి కావ్యములను రచించిరి. ప్రతి శ్లోకము రెండర్థములు నిచ్చునట్లు రచించిరి. ఇట్టి ద్వ్యర్థి రచనలకు శ్లేషాలంకారము లేక అన్వయభేదము—లేక అనులోమ విలోమ పాదము సహాయపడును. ఇట్లే మూడర్థములనిచ్చు—త్రిసంధాన కావ్యములున్నవి.

ఉదాహరణకు రాఘవ యాదవీయమున నొక శ్లోకము. "యఃపూతనామరణలబ్ధకీర్తిః—అని పాఠముగా శ్రీ కృష్ణుని పూతనా సంహారకార్యమువలన లభించిన కీర్తియని అర్థము స్ఫురించుచున్నది. అయితే "యస్-పూత-నామరణలబ్ధకీర్తిః" అని చదివినచో నామస్మరణము చేత పూతము చేయునట్టి—గొప్ప రణవీరుడని కీర్తి లాభము పొందినట్టి శ్రీరాముడని అర్థము వచ్చును.

శ్రీమద్భాగవతమున పూతనరాక్షసి సుందర స్త్రీగా శ్రీకృష్ణునికడకు వచ్చుట యున్నది. "వరస్త్రియము" అని శబ్ద ప్రయోగము. బాలకృష్ణుడు ఆమె సహజత్వమును గుర్తించెను. తన కన్నులు మూసికొనెను (నిమీలితేక్షణః) భగవంతుడు కన్నులేల మూసికొనెను? తన నిజస్వరూపము రాక్షసికి తెలియకుండ నుండుటకు. ఆయన పుండరీకాక్షుడు గదా! కనులు తెరచిన ఆమె గుర్తించు ప్రమాదమున్నది. అంతేకాదు. ఆ కంటిచూపు దయాపూర్ణమైనది. అందువలన ఆమెను సంహరించుటకు వీలుండక పోవచ్చును. ఆమె చనుబాలు విషముతో—ఆమె ప్రాణముల నే త్రావినాడు భగవంతుడు. ఆయన అంగస్పర్శవలన ఆమెకు ముక్తి లభించినది. ఆమె మృతశరీరము తగులబెట్టగా సువాసనలు గుబాళించినది.

ఈ గాథను విన్నవారికి భగవంతుని యందు భక్తి లభించును. (గోవిందే లబ్ధ తే రతిం)

మరియొక కవి పూతన తల్లిగను యశోదరూపమున వచ్చినదట! అనెను (కుహనా జననాన్యాః) పూతనకు జన్మరాహిత్యము లభించినట్లే యీ గాథ విన్నవారు మరల చనుబాలు త్రావు శిశువులు కాబోవరట! ఇంకొక చిత్రమున్నది. అసలు యశోదయే నిజమైన తల్లి గాదు. పూతనా రాక్షసి అమె రూపము ధరించినది. మోసములో మోసము. ఈ చమత్కారము ఆండాళు రచించిన తిరుప్పావై—25వ పాశురమున చక్కగా నున్నది.

రామనామము సంసారతరణోపాయమైన తారక మంత్రమని జగత్ప్రసిద్ధి.

(శ్రీరామ రామరామేతి....) ఆయన రఘువీరుడని రణపుంగవుడని, భక్తుల ప్రశంస (జయజయ మహావీర!—తులసీ గోస్వామి).

వాల్మీకి మాటలలో "తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహమ్...." ఇది రామావతార తత్త్వమును ప్రస్ఫుటము చేయుచున్న పలుకు.

శ్రీరాముడు శ్రీకృష్ణుడు—ఒకే ఒక తేజస్సుయొక్క అవతారములు. "పరమవ్యోమ భాస్కరః" (నయంతీ సంభవం ధామ)

శ్రీకృష్ణుని బాలక్రీడల మాధుర్యమును, బాల్యచేష్టల మాధుర్యమును పోతనామాత్యుడు ఆంధ్ర మహాభాగవతమున చక్కగా వర్ణించెను. అయితే అందున్న తాత్త్విక గూఢార్థమును విస్మరింపరాదు.

---

# రూపము - ప్రాముఖ్యత

పరమశివుడు గజ చర్మాంబరధరుడట. వ్యాఘ్ర చర్మాంబరుడట. వసనము చర్మమని - చేతులందు త్రిశూలమును, అగ్నిని, మృగమును ఢక్కాను ధరించెనట. ఆయన సర్పహారములు కలవాడట. స్మశానవాసియట. జడలు ధరించెనట. ఆ జటాటవీ నటన గంగాతుంగ భంగము కలవాడట. చంద్రచూడుడట. ఈ అలంకారములతో నున్న రూపమును సంభావించుటలోగల గూఢార్థమేమి?

ఆయన మన బాధలను, అవలక్షణములను తాను తీసికొని మనలను కాపాడును. అందుచేత మనమాయన అనుగ్రహమును కృపను సంపాదించవలెను.

అహంకారము గర్వము మనకు ముఖ్య శత్రువులు. అవి మత్తగజములు. క్రూర వ్యాఘ్రములు. మనము పరమశివుని శరణుజొచ్చినచో ఆయన వాటిని సంహరించును. మనకున్న ముఖ్య బలహీనత చంచలమైన మనస్సు. అది మృగము (లేడి) వలె స్థిరత్వము లేనిది. పరుగిడునది. భయకంపితమైనది. భగవంతుడు మృగధరుడై మన మనస్సులను నిర్భయముగా ఆయనకు వదలివేయుమని చెప్పుచున్నాడు. అప్పుడు మన మనస్సులు పరిశుద్ధములగును. భయరహితములగును.

మనము నిత్యము త్రిగుణసంకలిత సంసారమగ్నులము. భగవంతుని ఆశ్రయించినచో ఆయన త్రిశూలము త్రిగుణాతీతులను చేయును. ఆ త్రిశూలము 'నిస్త్రైగుణ్యో భవ' అని పలుకుచున్నది. భగవంతుడు సర్వమాయానాథుడు.

శబ్దము సృష్టికి ప్రథమము—పంచభూతాదికము. పరమశివుని ఢక్కానాదము వ్యాకరణసూత్రజనకము. అనగా శబ్దజనకము. నాదమయము. మనకు వైరాగ్యలాభము

కలుగుటకై మనము ఢక్కాదినాదముతో పరమశివకీర్తనము చేయవలెను. వైరాగ్యము లభించి పంచజ్ఞానేంద్రియ విషయలంపటత్వము తొలగును.

అవిద్య—అజ్ఞానము మనకు ప్రథమవారసత్వము. దానిని తనకు సమర్పణ చేసినచో తన చేతిలోని అగ్నిలో దహించి జ్ఞానాగ్ని నిత్తునని పరమశివుడు మనకు తెలుపుచున్నాడు.

మానవునికి దారిద్ర్యమునకన్న బాధాకరమైనది మరొకటి లేదు. శ్మశానవాసియైన పరమేశ్వరుడు గారిద్ర్యమును తనకు సమర్పించి ఐశ్వర్యమును గైకొనుమనుచున్నాడు.

మన బాధలు కోరికలు ఆ కపాలి భిక్షాపాత్రయందుంచినచో మనము సర్వవిధముల పరిపూర్ణులమగుదుము - మనలను నిరంతరము తాపత్రయము. అధికభౌతిక, ఆధ్యాత్మిక అధిదైవిక మండించుచున్నవి కదా! శీతలమైన ఆయన సన్నిధిని చేరి యీ తాపమును పోగొట్టుకొనవచ్చునుకదా! ఆయన శీతాంశుభూషణుడు. శీతలజలసరిత్తు-హిమనగజాత—అయిన గంగానదిని ధరించినవాడు. శీతల వాయుభుక్కులైన సర్పములను దండలుగా వేసికొన్నవాడు. అన్నిటికి మించి ఆయన శరీరార్ధభాగమున హిమగిరితనయ కలదు.

శ్రీ శంకర భగవత్పాదులు చమత్కరించినారు. "ఇన్ని విధముల శీతలబాధననుభవించుచున్న పరమేశ్వరుడు దహించుచున్న మంటలుకల తన హృదయకుహరమునకు వచ్చి వెచ్చచేసికొవచ్చును" అని.

అప్పయ్య దీక్షితులీ భావమునే మరొకవిధముగా చెప్పెను. ఓయి 'సువర్ణగిరియైన మేరుపర్వతధారి! నీ తలపై గంగాప్రవాహమున్నది. శీతాంశుకిరణుడున్నాడు. చేతులందు పాదములపైన చల్లని రక్తములు గల పాములున్నవి. నీ వామభాగమున హిమగిరి కూతురున్నది. నీవు కరుణాజలస్వీన్నడవు. నీ శరీరమంతయు చల్లని గంధము పూయబడియున్నది. ఇంత చాలదా? నీవింకను అభిషేకజలమును మరల మరల కోరుదువే! నీవు నివసించుచున్న నా హృదయమునందున్న అగ్నిమూలమునా? నీవు నన్ను వదలిపెట్టి వెళ్ళిపోదువాయేమి? (హాశొగంగా....నిత్యావాసే మదీయే—)....

శ్రీ జగద్గురువులు పరమశివావతారులు. భక్తులు ఆయన కన్నియు సమర్పించి అంతర్ముఖులై తరించవలెను. ఆయన వాంఛారహితుడు, వైరాగ్యమూర్తి.

---

# గురువంశ కథా కథనము

(సంస్కృత మూలము: బ్రహ్మశ్రీ కాశీలక్ష్మణశాస్త్రి
గురువంశ కావ్యమ్)

తెలుగు: శ్రీ చెఱుకుపల్లె జమదగ్నిశర్మ ఎం. ఏ.

## ద్వాదశ సర్గము

(గతసంచిక తరువాయి)

ప్రసన్నులై రాజభవనమునకు బయలుదేరనున్న జగద్గురువులకు పండితులు, శిష్యులు, రాజకీయులు, సైనికులు, రకరకముల ప్రజలు [illegible] ఆహ్వానించుచు సాష్టాంగము లొనర్చిరి. (44) అప్పుడు దేవేంద్రునివలె విరాజిల్లుచున్న గురుచంద్రులు సర్వజన విలోక్యులగుచు బహువిధ ప్రశంసల నందుచు వంశపురీ రాజమార్గమును ప్రవేశించిరి. (45) అట్లు వారేగుచుండిన రాజ మార్గమున హర్మ్యస్థులైన పురప్రజలు సౌధోపరిభాగములనుండి కురిసిన పూలు పేలాలు క్రిందనున్న జనుల తలలపైబడి అచ్చటనే ఉండిపోయినవి. జనము కదలుచున్నను అవి తలలనుండి జారి నేల నంటలేకపోయినవనగా అప్పటి సమ్మర్ద మెంతటిదో ఊహింపవచ్చును. (46) జనానందనులగు యోగీంద్ర చంద్రుల మహోదయము వలన వంశపురి యన్న సముద్ర ముప్పొంగినట్లయినది. జగద్గురు దర్శనమున ధన్యత నందనెంచి వచ్చిన అసంఖ్యాక ప్రజానీకముచే నిజముగనే వృద్ధి పొందినది. (47) అప్పుడు గురువులు బహుగృహశ్రేణీ మాలామధ్య మణివలె ప్రకాశించుచున్న నీలకంఠేశ్వరాలయములోనికి పోయి స్వామిని సేవించుకొని ప్రసన్నాంతరంగులయిరి. (48) ప్రదక్షిణ మాచరించి పునః ప్రణామ మొనర్చి స్వామి యెదుట నిలబడి మానసికముగనే సమర్పించి, మౌని సమ్రాట్టు లాలయము నుండి వెలువడి శ్రీ మఠమునకు తిరిగి వచ్చిరి. వారి వెంట శిష్యులు రాజపురుషులు సర్వులు ననుగమించిరి. (49) అట్లు మఠమును చేరిన శ్రీగురువుల పాద పద్మములను ప్రక్షాళించి భక్తితో పూజించి నీరాజన మర్పించి కృష్ణభగవానుని కొలిచిన ధర్మపుత్త్రునివలె గురుపాద తీర్థమును గైకొని ప్రభువు కృతార్థుడయ్యెను. (50) చుట్టునున్న సర్వులతో యథార్హముగ ముచ్చటించి అందరి నిండ్లకేగుట కనుమతించిన పిమ్మట యతీశ్వరు లాహ్నికములను నిర్వర్తించి దేవార్చనాదికము ముగించి సంతుష్టులై మఠమునందే యుండిరి. (51) గురువులట్లు ఆహ్నికము నిర్వర్తించుకొని మఠమునందే తుష్టులై యున్నారను ప్రశస్త వార్తను విని

చెన్నమాంబా తనూజుడగు నా ప్రభువు అప్పుడే తన వద్దకు వచ్చిన మూకాంబా ప్రసాదమును వారి కొలకై పంపించెను. (52) సర్వాభీష్టసిద్ధి సూచకమగు ఆ తల్లి ప్రసాదమును పరమ భక్తితో స్వీకరించి శిరసావహించి భుజంగ ప్రయాతవృత్తములతో గూర్చిన దివ్యస్తోత్రముతో మహాదేవతయు మహాదేవకాంతయు నగు నా జగజ్జనని నిట్లు స్తుతించిరి. (53)

జయశ్రీ జటాలే! జగచ్చిత్రలీలే!
సదారమ్యఖేలే! సదానమ్యశీలే!
అయే! లేఖపాలే! విశాలేడ్యఫాలే!
మదాలంబ లోకాంబ మూకాంబ పాహి!

సర్వలోక జయముతోడి జడలుగల తల్లీ! జగమునెడి చిత్రలీలకు హేతువైన మాతా! మిక్కిలి రమ్యమైన క్రీడలుగలదానా! ఎల్లప్పుడు నమస్కరింపదగిన శీలము గలదానా! సర్వదేవతలను పాలించుదానా! విశాలమైన పూజనీయ ఫాలము కలదానా! నాకు ఆధారమైన జననీ, సర్వజగజ్జననీ! ఓ మూకాంబా! నన్ను రక్షింపుము.

సతాం హృద్విహారే! కృతారి ప్రహారే!
తనౌ పూర్ణహారే! మనోఘాపహారే!
మురారే రుదారే పురారే రమారే
కరాలంబనం దేవి మూకాంబ దేహి!

సత్పురుషుల హృదయములలో విహరించుదానా! శత్రువులను కొట్టివేసిన తల్లీ! శరీరమున నిండుగా హారములను ధరించినదానా! మనఃకృత పాపములను గూడ హరించుదానా! మురారి యందౌదార్యము కలదానా! పురారి కెడములేనిదానా! ఓ మూకాంబాదేవీ! నాకు చేయూత నిమ్ము, (55)

నతాధీనశక్త్యధీనే! శ్రితానామదీనే!
స్తుతిప్రేమదానే! మతిప్రేష్ఠభానే!
రమానేకమానేఽభిమానేఽసమానే!
మమానేకమిష్టం ప్రదద్యా భవాని!

నిన్ను కొలుచువారి కధీనవై యుండుదానా! ఆశ్రితులయెడ ఔదార్యము చూపుదానా! స్తోత్రమాత్రమునకు ప్రేమనొలుకు తల్లీ! అత్యంత ప్రేమగల మనస్సునకు తోచుదానా! లక్ష్మ్యాద్యనేక దేవతలకు మాన్యురాలా! అభిమానమున సమానులు లేనిదానా! నా ఇష్టముల నన్నింటిని నొసంగుము భవానీ! (56)

త్రిలోకేశజాయే! ద్రుతధ్వస్తమాయే!
మనస్యర్చనీయే! మనూపాసనీయే!
విధేయేఽవధేయే ప్రదీయే ప్రణీయే
త్వదీయే పదాబ్జే మదీయే హృదిస్తామ్॥.

మూడు లోకముల ప్రభువున కిల్లాలా! మిక్కిలి వేగముగ మాయను మాయను చేయుదానా! అంతరంగమున నర్చింప దగినదానా! మంత్రము మూలమున నుపాసింప దగినదానా!విధేయులైనవారికి నిరవధికముగ నిచ్చుదానా! నమస్కరింపదగినదానా! నీ పాదాబ్జములు నా హృదయమున నుండుగాక! (57)

అపేక్షావదాన్యే! కటాక్షాత్తధన్యే!
మహాభాగ్యమాన్యే! మహీధ్రేశ కన్యే!
శరణ్యేఽతి పుణ్యేఽగ్రగణ్యేఽనుగుణ్యే
ప్రసన్నేమయిత్వం ప్రసన్నేక్షణైధి!

కోరికలు విరివిగా తీర్చుతల్లీ! కడకంటి చూపులతో నే ధన్యుల నొనర్చుదానా గొప్పగొప్పవారికి గౌరవనీయురాలా! పార్వతీ! ఎక్కువ పుణ్యవంతులకు శరణ్య వగుచు వారిలో నగ్రగణ్యుల కనుగుణముగా ననుగ్రహించుదానా! ప్రసన్నుడగు నా యందు ప్రసన్నములైన నీ చూపులు పడనిమ్ము! (58)

స్వపాదాబ్జ భృంగే కృపాదాయ్య పాంగే
గిరీశాంతరంగే స్ఫురద్వాక్తరంగే
కురంగేంద్రరంగే చిరంగేయ తుంగే
సుజంఘే తవాంఘ్రి ధరామ్యుత్తమాంగే!

నీ పాదాబ్జ భృంగములయందు దయచూపు నపాంగములు కలదానా! కైలాసపతి కంతరంగమైనదానా! ప్రకాశించు వాక్తరంగములు కలదానా! శృంగ మండలమున నిరంతరము గానముచేయు తుంగానది కలదానా! చక్కని జంఘలు కలదానా! నీ పాదద్వయిని నా తలపై ధరించెదను. (59)

మహారాజరాజే మిళద్రంగపూజే
దివాక స్సమాజేష్టదైత్యార్దనాజే
సదా జేతృరాజే విరాజే ర్విరాజే
భజే హృత్సరోజే భజత్కల్పభూజే!

రాజాధిరాజ రాజపరమేశ్వరుల పూజలందికొనుదానా! దేవసమూహముల

క్షిప్తమైన దైత్య మర్దనము చేయుదానా! నిత్యజయశీలా! పూర్ణవైరాగ్యవంతుల యందు విరాజిల్లుదానా! భజించువారికి కల్పవృక్షమవైన నిన్ను హృత్సరోజమున నిల్పి భజింతును (60)

తనూభూ మహాసేన హార్దావభాసే
సఖీనాం విలాసే ముఖశ్రీ వికాసే
సదాసే విదాసే దయాసేకిహాసే
గుణానాం నివాసే చిరం త్వాముపాసే!

కుమారుడగు మహాసేనుని హృదయమున వెలుగొందుదానా! సఖుల కానంద మొసగుదానా! ముఖలక్ష్మీవిలాసము కలదానా! ఎల్లప్పుడు సేవించువారికి దాస్యము చేయుదానా! దయను వెదజల్లు చిరునవ్వు కలదానా! గుణములకు నివాసమైనదానా నిన్ను చిరకాల ముపాసించెదను. (61)

ఇట్టులంబను స్తోత్రమొనర్చుటలో తత్పరులైన యోగి సమ్రాట్టులు కీర్తి సాంద్రుడగు బసవ భూపాలుని, దేవిచే ప్రోత్సాహితుడై దేశరక్షణ మొనర్చుచున్న ప్రఖ్యాతుని తాను విశిష్ట తుష్టాంతరంగులగుటచే బహువిధములుగా తుష్టి నొనర్చిరి. (సశేషము)

విశేష సూచనలు:

**52 వ శ్లోకము:—కొల్లూరునందలి మూకాంబ ఇక్కేరి నాయకుల కిలువేల్పు.**

---

## భారతీయ సాధనలు-5

# విశ్వాసము-సంస్కృతి

విశ్వాసము-నమ్మకము కలిగియుండుటకూడ ఒకవిధమైన సంస్కృతియే. మనము విశ్వాసమును అభివృద్ధి చేసికొని దానితో బ్రతుకవలెను. భగవంతునియందు విశ్వాసము లేకున్నచో జీవితము నిష్ప్రయోజనము. విశ్వాసము ద్వారా మనకు భగవంతునితో నొక సంబంధ మేర్పడును. అందువలన మనమాయనకు అంకితము కావలెను, అప్పుడు క్రమముగా మనకు ముక్తిలాభము కలుగును. ఇది జీవితసాధన సారము. భగవంతుడు మనకొరకు సతతము విశ్వాసముతో నిరీక్షించుచునే యున్నాడు. మన మాయనయందు విశ్వాసము పెంచుకొనుటే కావలసినది.

ముందు మనకు మనయందు, మనశక్తిసామర్థ్యములందు విశ్వాసము కలుగ

వలెను. మన దీపము వెలుతురు మనకు మాత్రమే కాదు, కొంచెమైన యితరుల కుపయోగపడవలెను. అట్లే మన శక్తి సామర్థ్యములును.

నిజమునకు అన్ని మతములకంటె ప్రాచీనతమమై, సనాతనమైన సనాతనము నందు చెప్పని సంగతులు మరే మతమునందు లేవు.

సర్వశక్తివంతుడైన భగవంతుడొకడున్నాడని, ప్రాణికోటియందు నరజన్మ దుర్లభమని, మానవుడు నిర్వహింపవలసిన విధ్యుక్తధర్మములున్నవని, లోకమంతయు సుఖముగా నుండవలెనని, జీవుడు-ఆత్మ-భగవంతుడే అని-అయితే ఆట్లగుటకు సాధన ఆవశ్యకమని, నిత్యము భగవంతుని సన్నిధానమును కల్పించుకొని భగవత్ప్రార్థన చేయుచు-తత్సన్నిధాన వర్తనము చేయుచుండవలెనని, అందువలన భగవంతుడు సమీపవర్తి అగునని, పరోపకారము పరార్థప్రాపకము సద్గుణములని, మాతృదేవో భవ, పితృదేవోభవ- తలితండ్రులను పూజింపుమని, స్త్రీబాలవృద్ధాతురులను ప్రత్యే కముగా చూడవలెనని-నీవు ఆచరింపలేనిది ప్రచారము హాస్యాస్పదమని-యిదంతయు మన సనాతన మతమే.

తరువాత వచ్చిన ఏ మతముగాని యీ విషయములను త్రోసివేయలేదు. ఆ మతములయొక్క ఆవశ్యకత-(క్రొత్తగా చెప్పనదేమియు లేనప్పుడు) ఎట్టిది?

నిజమునకు విశ్వాసమువలననే ప్రపంచమున జన జీవితములు సాగుచున్నవి. అన్యులయందు కొంత విశ్వాసముంచకపోయినచో జీవితము దుర్భరము. సాగదు. విశ్వాసము దేహమునుండి విడదీయరానిది.

విశ్వాసమునలన చిత్తశుద్ధి యగును. సంస్కృతి యనగా ఆధునికత-నవ్యత- కాదు. లలితకళాభిమానము కాదు. మానవుని జీవితము ఫలవంతమగుటయందు - ప్రయోజనకారి యగుటయందు సంస్కృతి ప్రతిఫలించును.

భగవంతునియందు అచంచలమైన విశ్వాస ముండుటయే సంస్కృతికిమూలము. గీతయందు భగవంతుడట్లే చెప్పెను. ఆత్మసంయమనము-నిగ్రహము చాల ముఖ్యము. అది సంస్కృతికి లక్షణము. శ్రద్ధ-ఉత్సాహము-అవలంబింపవలెను.

నేడు మానవతా వాదమని యొకటి పలుమారులు చెప్పబడుచున్నది. మానవతా వాదము, సంఘసేవ-కావలసినవే. అవి అంతటితో ఆగిపోరాదు. దయ, ఔదార్యము వలెనే-మానవత్వముకూడ సజ్జన లక్షణము.

తన అయిదుమంది కుమారులను-నిద్రించువారిని చంపిన అశ్వత్థామను ద్రౌపది చంపవలదని పాండవులను ప్రార్థించినది. ఇది సంస్కృతి లక్షణము.

పట్టాభిషేకము చేసికొందువు రమ్మనినను, వనములకు పొమ్మనినను-శ్రీ రాముడు ఒకేవిధమైన మందహాసమునే చేసెను. ఇది సంస్కృతి లక్షణము.

---

# శృంగేరి వార్తలు

శృంగేరిలో ధనుర్మాస ప్రారంభమునాటినుండి శ్రీ చంద్రమౌళీశ్వరస్వామి వారికిన్ని—శ్రీ శారదా శ్రీ మలహానికరేశ్వర శ్రీ భగవత్పాద, శ్రీ విద్యాశంకరాది సకల దేవాలయములందును ప్రత్యేకపూజలు జరుగుచున్నవి. ధనుర్మాస ప్రారంభమునాడు శ్రీ జగద్గురువులు స్వయముగా ప్రత్యేకపూజలను ప్రారంభించిరి. డిశంబరు 22న ఆర్ద్రోత్సవము జరిగినది.

మార్గశిరమున శృంగేరిలో హేమంత విజృంభణమెక్కువగా నుండి చలి మిక్కుటముగా నుండును. అయినప్పటికీ శిష్యసందోహము వచ్చుచునేయున్నారు. నిత్యము పాదపూజలు, భిక్షావందనములు, మొదలగు సేవలుచేసి ఆగంతుకులైన శిష్యులు శ్రీ జగద్గురువుల దర్శనములనుచేసి అనుగ్రహమును సంపాదించి సంతోషముతో తరలి వెళ్ళుచున్నారు.

శ్రీ జగద్గురువులు నవంబరు మాసమున శిష్యపరివార సమేతముగా శివమొగ్గ పట్టణమునకు (షిమోగా) విజయముచేసి-అక్కడి శిష్యమహాజనము నడిపించిన రుద్రచండీ హోమాదుల నిర్వహణమును-పూర్ణాహుతులను తిలకించి—శిష్యలోకమును ఆశీరనుగ్రహపూర్ణులను చేసి, వారికి సంతోషము కలిగించిరి.

పిమ్మట మరల శిష్యపరివార సమేతముగా శృంగేరి పట్టణమునకు తిరిగి వచ్చిరి.

శ్రీ జగద్గురువులు శృంగేరినుండి సంచారమునకు వెళ్ళునప్పుడును, మరల తిరిగి వచ్చునప్పుడును శ్రీ శారదా దేవ్యాదిగా వేంచేసియున్న దేవతలను సేవింతురు. సంచారమునకు వెళ్ళునప్పుడు పురజనులు గుమిగూడి శీఘ్ర పునరాగమనమునకై ప్రార్థింతురు. తిరిగి వచ్చినప్పుడు సంతోషాతిశయమున స్వాగతములు నివేదింతురు.

---

Printed & Published by A. Satyanarayana Murthy,
6-3-609/18, Anand Nagar, Khairatabad, Hyderabad - 500 004.
Printed at KRANTI PRESS, MADRAS-600 001.
Editor : T. Ramalingeswara Rao

# సద్గుణములు

మానవుడు సద్గుణముల నలవరచుకొనవలెను. నీతిని అవలంబించవలెను. అందు వలన అతనికి శ్రేయస్కరము. సంఘమునకు మేలు. ఇది సామాన్య ధర్మము. అయితే సద్గుణమనగా నేమి? ప్రాంతమునుబట్టి, దేశమున చట్టమునుబట్టి, ఆచారమును బట్టి, సంస్కృతినిబట్టి, సద్గుణమన్నది మార్పుచెందవచ్చును. సర్వజనులకు, సర్వ కాలములకు—సద్గుణమిదియని నిర్వచించుట తేలికకాదు. కొన్ని సద్గుణ విషయములం దట్లు చేయవచ్చును. అన్ని సద్గుణముల విషయమున సాధ్యము కాదు. ఉదాహరణకు సత్యమును గురించి, అహింసను గురించి, వర్ణాశ్రమములనుబట్టి అహింస స్వరూపము మారునని మహాభారతమున వేదవ్యాస మహర్షి నిర్ణయించెను.

నీవు నీయందు సక్రమముగా ప్రవర్తించితివేని అన్యులయందు అక్రమముగా ప్రవర్తింపజాలవని అభియుక్తోక్తి యొకటి కలదు. ఆత్మబోధ ననుసరించి నడచు కొమ్మని భావము. అనగా అంతర్వాణి ప్రబోధమని. ఈ అంతర్వాణిని ధర్మముతో దృఢతరము, బలవత్తరము చేసికొనవలెను.

ఒకరి అంతర్వాణి ప్రబోధము, మరియొకరి అంతర్వాణి ప్రబోధమునకు భిన్న ముగా నుండవచ్చును. "నీకు అపకారమైనను ఫరవాలేదు-ఇతరులకు అపకారము జరుగకుండ చూడవలెను" అన్నది భారతీయ ధర్మసూత్రము.

భగవద్గీతలో దేవీగుణ సంపత్తి, అసురీ గుణములు వివరింపబడినవి. గుణములు త్రికరణశుద్ధిగా నుండవలెను. ధర్మసందేహము వచ్చినప్పుడు-ధర్మసూత్రము లెరిగి నిష్పాక్షికముగా సంచరించు వేత్తల నడవడిక ప్రకారము నడచుకొనవలెనని మన శ్రుతి స్మృతులు చెప్పుచున్నవి.

సద్గుణములు—సామాన్యములని, ముఖ్యములని. విశ్వాసము, పురోగమనాభి లాష, భూతదయ, ముఖ్యములు. దయ, ఔదార్యము సర్వాధారము. ఆహారము నందు మితము పాటించవలెను. వాక్కునందు ప్రీతి ఘటించవలెను. కోపమును త్యజించవలెను. తప్పునకు పశ్చాత్తాపము కావలెను. పశ్చాత్తాపమనగా వచ్చిన నష్ట కష్టములకు నిరంతర దుఃఖము కాదు.

భగవంతుడు సకల కల్యాణగుణాభి రాముడు. సద్గుణవంతుడు భగవంతునే ఆదర్శమూర్తిగా పెట్టుకొనవలెను. ప్రతి సందర్భమునందు బాధ్యతలను క్రమాను కూలముగ నిర్వహింపవలెను.

గృహస్థాశ్రమమున నున్నవారికి ఏకపత్నీవ్రతము సద్గుణము. శ్రీరాముడు ఆదర్శపురుషుడు.

సీతాదేవి భూగర్భమును ప్రవేశించి అదృశ్యమైన తరువాత కూడ రాముడు మరల వేరొక స్త్రీని గైకొనలేదు. సీతాదేవి అదృశ్యమైన తరువాత రాముడు మరల వివాహము చేసికొనుట తప్పు కాదు, అధర్మము కాదు. కాని ఆయన అట్లు చేయ లేదు. అయితే శ్రీకృష్ణునికి వేలాదిమంది భార్యలు. కాని ఆయన బ్రహ్మచారి. ఆయ నకు కామ వాంఛ లేదు.

అయిదుమంది భర్తలున్న ద్రౌపదిని పతివ్రతగా చెప్పుచున్నాము. దానికి బలమైన హేతుబద్ధమైన కారణ మున్నది. శ్రీకృష్ణుడు, ద్రౌపది-సామాన్యులకు సంసార విషయమున ఒజ్జబంతులుకాదు.

బ్రహ్మచర్యము అందరికి కాదు. నిష్ఠగా అనుసరింపగలవారికి-బ్రహ్మచారినని భ్రష్టుడగుటకంటె వివాహమాడుట మంచిది. బ్రహ్మచారికంటె మంచి గృహస్థు సంఘమునకు మేలు. ఇంద్రియములను హద్దులో నుంచుకొనుట ముఖ్యము. గృహస్థుగా నుండి బ్రహ్మచర్య మవలంబింపవచ్చును.

కావున సామాన్యముగా సద్గుణముల క్రింద చలామణి అగుచున్న గుణములు తనకున్నవని డాంబికములు పలుకుచు ఆ గుణములు తనకున్నట్లుగా నడచుటవలన ప్రయోజనములేదు. అది ఆత్మవంచనయే. అట్లే పరమ విరాగినని చెప్పుచు-స్త్రీహస్త భోజనము కాని చేయని వైరాగ్య మెట్టిది? తానే భగవంతుడను సన్న్యాసు అందరిలో శ్రేష్ఠుడనని చెప్పుకొనుచు-స్త్రీలను సంన్యాసులుగా చేసి-వారితో నిరం తర మందిరాంతర వాసము చేయువానికి ఇంద్రియ విషయ పరాఙ్ముఖత యున్నట్లా?

కాబట్టి ఆత్మవంచన—సర్వవ్యాపియైన భగవద్వంచన లేకుండా-సద్గుణములను అలవరచుకొనుచు ప్రవర్తింపవలెను.



Regd. No. H HD 392. SRI SANKARA KRUPA
January 1981

To

Dr. Sankaranarayana
S.V. University — Oriental Research I
TIRUPATI Chittoor Dt.

## ఈ సంచికలో



If undelivered please return to :
A. SATYANARAYANA MURTY,
Publisher : Sri Sankara Krupa
6-3-609/18 Anand Nagar Khairatabad, Hyderabad-500004.

# శ్రీ శంకర కృప

దక్షిణామ్నాయ
శ్రీ శృంగేరీ శారదా పీఠము వారి యాజమాన్యమున వెలువడు
ఆధ్యాత్మిక మాసపత్రిక




| వెల రు. 1 ఫిబ్రవరి, 1981<br>సంవత్సర చందా రు. 10/- | సంచిక 6 |
| --- | --- |


రౌద్రి పుష్య - మాఘ (శకాబ్ది ౧౯౦౨)





26 జనవరి 1980న మధురలో శ్రీ మఠమున ప్రతిష్ఠాంగ హోమ
పూర్ణాహుతిని శ్రీ జగద్గురువు లిరువురు తిలకించుట

# శ్రీ శంకర కృప

సంపాదకులు: తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

| సంపుటి 20 | శంకరశ్శంకర స్సాక్షాత్ వ్యాసో నారాయణో హరిః | సంచిక 6 |
|---|---|---|

## శ్రీ శంకర భగవత్పాదాచార్య విరచిత

## శ్రీమత్త్రిపురసుందరీ వేదపాద స్తోత్రము

శ్లో॥ రత్నచ్ఛత్త్రైశ్చామరై ర్దర్పణాద్యై
శ్చక్రేశానీం సర్వదోపాచదన్త్యః
యోగిన్యోఽన్యాః శక్తియశ్చాణిమాద్యా
యూయం పాతస్వస్తిభి స్సదా నః॥ 57

(దీనియందున్న వేదపాదము తైత్తరీయ సంహితలోనిది.)

తా॥ రత్నములతో అలంకరింపబడిన గొడుగులను పట్టియు, చామరములను వీచియు, అలంకరించుకొనుటకు అద్దములను పట్టియు చక్రేశ్వరికి ఉపచారములను చేయునట్టి యోగినులును, అణిమాదిశక్తులును — మీరందరును — మాకు నిరంతరము శుభములనిచ్చి రక్షింపుడు.

విశేషములు: అండ పిండ బ్రహ్మాండములకు, శ్రీదేవికి, (జీవబ్రహ్మములకు) సాంకేతికమైన రూపము శ్రీచక్రము. అందునవావరణలున్నవి. ఆవరణములకు చక్రము లని పేరు. ప్రతి చక్రమునందు శ్రీదేవి చక్రేశ్వరిగా నున్నది. అక్కడక్కడ ఆయా చక్రములందు ఆమెకు పరివారజన మున్నారు. ఆ పరివారజనము నందు అణిమాశక్తి మొదలగు శక్తులును, యోగినీ గణమును కలరు. వారందరును మాకు శుభములను కూర్తురుగాక యని ప్రార్థనము.

శ్రీ చక్రనవావరణలను గురించి—తదధిష్ఠాన చక్రేశ్వరీ తత్పరివార గణమును గురించి వ్రాసినచో గ్రంథమే యగును.

(ఈ వివరములు కావలసినవారు—ఈ సంపాదకుడు రచించిన 'శ్రీచక్రవిలసనము' అన్న శ్రీచక్రసర్వస్వ గ్రంథమును చూచుకొనవచ్చును. త్రివేణీ పబ్లిషర్స్, మచిలీపట్టణం-1.)

# శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి చరణుల ఉపదేశములు

## శ్రద్ధతో కూడిన కృషి ఆవశ్యకత (3) ఈ జన్మ వృథాచేయవలదు

మానవు లందరకు జ్ఞానము సంపాదించుకొనుటకు అధికారమున్నప్పటికి— అందరికి జ్ఞానతృష్ణ వుండదు. జ్ఞానమును సంపాదించు మార్గమున ప్రవేశించుటకు నాలుగు గుణము లుండవలెను. అందు మొదటిది వివేకము—నిత్య అనిత్య వస్తువులను గురించి నిశ్చయించుకొనగల బుద్ధివిశేషము. ఆత్మయొక్కటే నిత్యమైనదని— యితరము లన్నియు అనిత్యములని గ్రహించవలెను. ఈ జ్ఞానము లభించినంతట రెండవ గుణమైన వైరాగ్యము కలుగును—ఇహలోకమునందు గాని పరలోకమునందు గాని లభించు భోగములందు విరక్తి. ఇహామూత్ర ఫలభోగవిరాగము.

ఈ లోకమున, పరలోకమున నున్న వస్తువులన్నియు అనిత్యములని — వాటి నుండి లభించు భోగములుకూడ అనిత్యములని—బ్రహ్మలోక భోగములుకూడ అనిత్యములే నని తెలిసికొన్నవాడు అనిత్యములైన భోగములకొరకు ఆశపడడు. కుక్క ముట్టుకొన్న ఆహారమును తినుట కెవ్వడైన ఆశపడునా? ఆశపడడు. అదే విధముగా అనిత్యములైన భోగములపై విరక్తి కలుగును. వైరాగ్యమను గుణము లభింపగా శమాది షట్కమును అవలంబింప పూనుకొనును. శమాదిషట్క మీ విధముగానున్నవి.

1. శమము: జరిగిన, జరుగుతున్న జరుగబోవు సంగతులను గురించి వ్యగ్రపడుతున్న మనస్సును అదుపులోనికి పెట్టి నియమించుట.

2. దమము. ఇంద్రియనిగ్రహము. తమతమ విషయములపై ఆయా యింద్రియములు సంచరింపకుండ చేయుట.

3. తితీక్ష: శీతోష్ణములను, ఆకలి దప్పులను సుఖదుఃఖములను భరించుట.

4. ఉపరతి: చంచలమగు మనస్సును వృత్తిరహితము చేయుట.

5. శ్రద్ధ: వేదవాక్యములందు గురువాక్యములందు పరమప్రామాణ్యతయన్న విశ్వాసముండుట.

6. సమాధానము: మనశ్శాంతి.

ఈ ఆరును కలసి శమాదిషట్కమన్న మూడవ గుణము. విముక్తి పొందవలెనన్న తీవ్రేచ్ఛ ముముక్షుత్వము—నాలుగవది. ఈ నాలుగు గుణములు కలవాడే ఆత్మవిచారముచేయు సాధనామార్గమున ప్రవేశించుటకు అర్హుడు. అట్టివాని ప్రయత్నమే జ్ఞానలాభమును పొందును.

శుకుడు మొదలగువారు తేలికగా మోక్షము పొందిరని—మనమింకను యిట్లే యుంటిమని ఆందోళనకు అవకాశములేదు. వా రెన్నియో జన్మములలో జ్ఞానము కొరకు ప్రయత్నించి తుదకు సాఫల్యత పొందిరి. మనమా మార్గమునం దింకను ప్రవేశింపనే లేదాయె! అట్టి ప్రయత్నము చేయవలసిన ఆవశ్యకత యున్నదనియైన మనమింకను నిశ్చయించుకొనలేదు. అసలా విధమైన ఆలోచనలను చేయుటకు తగిన చిత్తశుద్ధి మనకింకను ఏర్పడనేలేదు. అట్టి చిత్తశుద్ధి ఏర్పడుటకుగాను మనమింతవరకు పరమేశ్వరార్పణ బుద్ధితో మంచికార్యములు చేయనేలేదు. అయితే మహర్షులకు లభించిన మోక్షముమాత్రము వెంటనే కావలెనన్న దురాశమాత్రము మనకు కావలసినంత యున్నది.

ఒక బడిలో నొకే తరగతియం దిరువురు బాలురున్నా రనుకొనుము. ఒకడు తన పాఠములను జాగ్రత్తగా శ్రద్ధగా చదువును. వా రిద్దరికి భోజనవసతి సౌకర్యములు సమానమే. ఉపాధ్యాయులు పాఠములు చెప్పుటకూడ సమమే. కాని శ్రద్ధగా చదివినవాడు పరీక్షలం దుత్తీర్ణు డగుచున్నాడు. రెండవవాడు తప్పుచున్నాడు. కారణము—ఒకనియందు శ్రద్ధాప్రయత్నము లుండుట—మరియొకనియందవి లేకపోవుట. అట్లే కొందరు మహర్షులై-ముక్తజీవులై బంధములను తొలగించుకొనుటకు—మరికొందరు సంసారబంధములం దట్లే సతమతమగుటకు కారణము—వారియందు తీవ్ర శ్రద్ధాప్రయత్నము లుండుట వీరియందవి లేకపోవుట. కాబట్టి మనము ప్రయత్నము చేయవలెను. అసలీ శ్రమ పరిశ్రమ ఎవరికొరకు? మనలను బంధించుచున్న శృంఖలములను తొలగించుకొని మనము స్వేచ్ఛ-ముక్తి పొందుటకే. తాను బంధింపబడియుండగా యితరులను విముక్తి చేయగలనని ఎవ్వరయిన చెప్పగలడా? ఈత రానివాడు—లోతయిన నదిని దాటుటకు తన భుజముపై వేరొకరిని మోసుకొని దాటించగలడా? కాని నేడు లోకమున అట్టివారు కోకొల్లలు. మనము ఆలోచింపవలెను. వారు తమరిని తాము ఉద్ధరించుకొన్నారా? ఆ ప్రయత్నమును వారు చేయలేదని మనకు స్పష్టమగును. అట్టివారిని శాస్త్రములు ఆత్మవంచకులన్నవి. తన్ను తాను వంచన చేసుకొనువాని మూర్ఖతయెట్టిదో మనము గ్రహింపగలము.

తన్ను తాను విముక్తి చేసికొనుటకు ప్రయత్నము చేయనివారిని మందబుద్ధులని శ్రీ భగవత్పాదు లనిరి. మానవుడై జన్మించి—పురుషుడై యుండి, ఉపనిషన్నిధులలోని జ్ఞానమంతయు పొందుటకు అవకాశములుండి—విముక్తి పొందుటకు ప్రయత్నము చేయనివానిని మందబుద్ధి యనుట చాల తక్కువమాట. అందుచేత శ్రీ

భగవత్పాదు లట్టివానిని ఆత్మహత్య చేసికొన్నవాడనికూడ—(అనాత్మయగు దానిని ఆత్మగా భావించి ఆత్మ అదృశ్యుగునట్లు చేసినవాడు కాబట్టి) అనిరి.

లబ్ధ్వాకథంచిన్నరజన్మ దుర్లభం। తత్రాపి పుంస్త్వం శ్రుతిపారదర్శనమ్।
యఃస్వాత్మ ముక్తైన యతేతమూఢధీః స ఆత్మహాస్వం వినిహ న్త్యసద్గ్రహాత్॥

అట్టివాడు మూర్ఖుడని చెప్పుటకు అభ్యంతర మేమి? లోకమున మూర్ఖులు చాల మంది యున్నారు. వారు కొన్నికొన్ని విషయములందు మూర్ఖత్వము కలవారు. ఒకడు లౌకిక విషయములందు మూర్ఖుడై యుండవచ్చును. మరొకడు శాస్త్రములు బోధించునది తెలియనివాడు కావచ్చును. కాని ఎవడైన 'నే నున్నానా? లేనా?' అన్న సందేహమును కలిగినవాడగుచో—వానిని మూఢడనుటకు సందేహమక్కర లేదు. అది అట్లుండగా—యిక "నేనులేను!" అన్న నిశ్చయము చేసికొన్న వానికంటె మూర్ఖుడు మరెవ్వడు నుండడని మనము దృఢముగా చెప్పవచ్చును. కాబట్టి ఎవరయిన తన ఉనికిని గురించి శంకకలిగి—అనాత్మను ఆత్మగా భావించిన వాడున్నచో—వానికంటె మూర్ఖుడుండడని చెప్పవచ్చును.

అట్టి శంకలకు, తప్పు అభిప్రాయములకు కారణ మేమనగా—సహజమయిన తన స్థితినుండి పతనము పొందుటయే. ఈ పతనమునే ప్రమాదమని - తప్పని - చెప్పుచున్నాము. తనను గురించి తప్పుగా తెలిసికొన్న వానికంటె మరి మూర్ఖుడెవ్వడుండడు నని ఆచార్యులవా రడుగుచున్నారు!

ఇతః కోన్వస్తి మూఢాత్మాయస్తు స్వార్థే ప్రమాద్యతి।
దుర్లభం మానుషం దేహం ప్రాప్యతత్రాపిపౌరుషమ్॥

ఇప్పుడు స్పష్టమగుచున్నది—ఏమైన బుద్ధిలేశము కలవాడు అనాత్మబంధముల నుండి తన్ను విముక్తుని చేసికొనుటకు సర్వప్రయత్నములు చేయవలెనని. ఇప్పుడు లభించిన స్వర్ణావకాశమును జారవిడుచుకొనరాదు. మనకు మానవజన్మ లభించి బుద్ధి యున్నది. జ్ఞానసాధనకు తగిన ఉపకరణము లున్నవి. ముందు బాహిరమైన వాటిని గురించి కోరికలను తొలగించుకొనవలెను. ఒక మహాత్ముని పాదముల చెంతకు చేరి, ఆయనను శరణువేడవలెను. ఆ మహాత్ముని ఉపదేశములను సరిగా అవగాహన చేసికొనవలెను. ఆ ఉపదేశముల సారమును మననము చేయవలెను-ఆత్మసిద్ధి అగునంతవరకు మననము చేయుచుండవలెను. అప్పుడు మనము నిత్యముగా ముక్తస్థితి యందుందుము.

(శ్రీ జగద్గురు చంద్రశేఖరస్వామి చరణుల ఉపదేశములు లభించినంతవరకు ప్రకటించితిమి. రానున్న సంచికనుండి నూత్న శీర్షిక. —సంపాదకుడు)

---

# శ్రీ జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణుల ఉపదేశములు

అద్దములోనున్న ప్రతిబింబము ముఖమున తిలకము పెట్టవలెనని భావన చేసితి మనుకొందము. మనము ఆ ప్రతిబింబముపై తిలక ముంచలేము. తీవ్రముగా ప్రయత్నించిన అద్దము పగిలిపోవును. అందులోని ప్రతిబింబము అదృశ్యమగును. అందుకు బదులు మన ముఖముపైననే తిలకము పెట్టుకొన్నచో అది ప్రతిబింబముపైనకూడ కనపడును. అయితే తన ముఖముపై కాకుండా ప్రతిబింబము ముఖముమీద మాత్రమే తిలక ముంచవలెనన్నది అభిప్రాయమైనచో—యిట్లు చేయుటవలన ప్రయోజనములేదు.

మన లౌకిక వ్యవహారములన్నియు అద్దములోని ప్రతిబింబముపైన తిలకముంచుటకు చేయు ప్రయత్నములవంటివి. అవి నిష్ప్రయోజకములు. సుఖము నొసంగలేవు. ప్రతిబింబమును వదలి అసలు ముఖమునకు తిలక ధారణము చేయవలసిన విధముగానే లౌకికములు వదలి-భగవంతుని రూపమైన ఆత్మ విషయకముగా విచారణ చేయవలెను.

---

# శ్రీ జగద్గురు భారతీ తీర్థస్వామి చరణుల ఉపదేశము

## నాగరకోయిలలో చేసిన అనుగ్రహభాషణము

### (గతసంచిక తరువాయి)

మానవుడెంత చదివినవాడైనను వినయమును వదలిపెట్టరాదు. ఏదోకొంత తెలిసికొని 'నాయంత ఘనుడు, తెలిసినవాడు లేడు' అన్నభావము మానవుడు కల్పించుకొనుచున్నాడు. ఇట్టి భావమును పొందకుండుట వినయము. సాధారణముగా సామాన్యుని కట్టి భావన కలుగుచుండును. శాస్త్రనిర్మాతలైన మనీషానుభులతో పోల్చి చూచుకొన్న మన విజ్ఞానము అత్యల్పము. కాని మనకున్న అహంకారము దొడ్డది. ఒకటి రెండు పుస్తకములు చదివి—చిన్న యోగ్యతాపత్రము పొందగనే— అద్వితీయుల మనుకొందుము. నిజమునకు మనకు తెలిసినది అత్యల్పము. విద్య (చదువు)తో పాటు వినయము పెరుగవలెను. శాస్త్రము లుద్బోధించున దిదియే. వినయములేని విద్యవలన ప్రయోజనము తక్కువ. సక్రమముగా సాధించిన విద్యవలన జ్ఞానము, వినయము పెరుగునని చెప్పుచు మహాకవి కాళిదాసు రఘువంశ కథనమున

లక్ష్మణ శత్రుఘ్నుల జననముచెప్పునప్పుడు "సమ్యగారాధితా విద్యాప్రబోధ వినయా వివ—" అనెను. పరిపూర్ణముగా చక్కగా ఆరాధింపబడి పొందిన విద్యచేత జ్ఞాన వినయములు ప్రబోధింపబడినట్లుగా సుమిత్రాదేవికి లక్ష్మణ శత్రుఘ్నులు ప్రభవించిరట. హేతుహీనముగా, అనుభవములేక—క్రమపద్ధతులు లేకుండ అని మహాకవి చెప్పలేదు. విద్యవలన జ్ఞాన వినయములు లభించు నన్నది స్థాపితము. వినయమువలన వివేకము ప్రకాశించును. వినయ మనగా మహాత్ములయెడ అహంభావ ప్రదర్శన లేకుండుట. మహాత్ములకు మహాత్ముడు భగవంతుడు. 'న తత్సమశ్చాభ్యధికశ్చలోకే దృశ్యతే—ఆయనతో సముడుగాని అధికుడుగాని లేడు. నతత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే. భగవంతుని శక్తి అపరిమితము. ఆయన సర్వ సమర్థుడు. మన శక్తిసామర్థ్యములు పరిమితములు.

ఒకడు సంపన్నుడైనచో నొక దేవాలయమును కట్టవచ్చును. జగత్తునే నిర్మింపగలడా? లేడు - పరిమిత శక్తిగలవాడు. భగవంతుని శక్తికి పరిధులులేవు. ఈశ్వరుని గురించి శ్రుతి 'యస్సర్వజ్ఞస్సర్వ విద్యస్య జ్ఞానమయం తపః'—(ఆయనకు సకలము—ప్రతియొకటి తెలియును) అన్నది. అట్లు అన్నియు తెలిసినవాడే భగవంతుడు. మనకు 'జగత్తు' అన్న శబ్దము తెలియును. జగత్తునం దేమియున్నదో తెలియదు. అయితే భగవంతుని విషయమున 'అణోరణీయాన్ మహతోమహీయాన్'—మహత్తుకంటె మహీయుడు. అందుకని మనము భగవంతుని ప్రస్తుతింతుము. ఈ వాదములు మరి యితర నిరూపణలు భగవంతుని అస్తిత్వమును ఋజువుచేయును.

ఇట్లు బహువిధముల నిరూపింపబడిన ఉనికిగల భగవంతుని నిరాకరించినచో మనకంటె కృతఘ్నుడెవ్వడు? కృతఘ్నుడనగా ఉపకారమును మరచిపోయిన వాడు. తనకు జరిగిన ఉపకారమును మానవు డెన్నటికిని మరువరాదు. జ్ఞాపకముంచుకొనవలెను. కృతఘ్నుడు తనకు జరిగిన మేలును మరచిపోయి ఉపకారికి అపకారము చేయును. పాముకి పాలెన్ని పోసినను కరచుట మానదు. దానికి కృతజ్ఞత తెలియదు. మనముకూడ కృతజ్ఞత మరచిపోయినచో మనకు పామునకు భేదమేమి? పాము విషధరము. మనముకూడ విషధరులమా? 'ఖలునకు నిలువెల్ల విషము—' అన్నారుకదా? అప్పుడు పాముతో అభేదమే! కృతఘ్నత ఉండనే ఉండకూడదు.

ఎవరి సహాయములేకుండ మనము తల్లి గర్భవాసము చేసినాము. ఇప్పుడు కాలు, చేతులు, మేధ, చదువు కలదు. మన ఆహారము మనము సంపాదించుకొని తినగలము. తల్లిగర్భవాసము నందుండగా మనలను కాపాడినదెవరు? మన ఆహారమును

మనము సంపాదించుకొంటిమా? మన కప్పుడేమి చదువున్నది? మనకేమి బుద్ధి కలదు? అప్పుడు మనలను సంరక్షించినది భగవంతుడే. "యోమా గర్భగతస్యాపి వృత్తిం కల్పితవాన్ ప్రభుః" అప్పుడు సహాయము కోరుటకెవ్వ రున్నారు! "తల్లి గర్భమున నిరాధారముగ నుండగా కాపాడిన భగవంతుని విస్మరింతుమా?" అని కవి యొకడు ప్రశ్నించుచున్నాడు. లోకమున బుద్ధి కలవారు కించిత్తు మేలునుకూడా మరచిపోరు.

"దేవుడు లేడు. దేవుడు లేడు" గంద్రగోళముగా అల్లరిచేయుచు అరవ వచ్చును. అట్లు అల్లరి చేయుటకుకూడ భగవంతుడే శక్తినీయవలెను. అందుచేత నాస్తికవాదము చేయుట తప్పు. అది కృతఘ్నుల మార్గము. ప్రతివారు ఆస్తిక బుద్ధితో భగవదారాధన చేసినచో మేలు చేకూరును. భగవదనుగ్రహమువలన సకలాభీష్టసిద్ధి లభించును. ఏవ్యావృత్తి ప్రారంభించినను భగవంతుని మరువరాదు. ఇది శాస్త్రముల శాసనము. మన పూర్వులు మనకు నేర్పిన పాఠమిది. దీనిని మరువకుండ మనము ప్రవర్తించినచో మనకు భగవదనుగ్రహము వలన ఉత్తమస్థితి తప్పక లభించును.

---

## సంస్కృతభాషను మనమేల ఆదరించి నేర్చుకొనవలెను? (36)

ఈ ప్రశ్నకు మన దేశంలో మేధావివర్గంలో మూర్ధన్య మనీషామణులు సమాధానాలు చెప్పారు. గత సంచికలందు కొన్నిటిని తెలుసుకున్నాము. ఇప్పుడు మరికొన్ని. (సంపాదకుడు)

### శ్రీ అతల్ బిహారీ వాజ్ పేయీ

మనకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత మనకుగల ఆశ యెట్టిదనగా మనకు మన 'స్వ' సాక్షాత్కారము లభించుటకై సంస్కృతభాష ద్వారా సర్వోత్తమ శిక్షణ జరిగి తగిన వ్యవస్థ చేయబడునని. మనకు సంస్కృతము అతి పవిత్రమైన పరంపరా ప్రవాహము. రాష్ట్రీయజ్ఞానమునకు తాత్పర్యము. భారతీయ సంస్కృతికి నిరంతర స్రోతస్సు. సంస్కృతమును ప్రశంసించుచు మాటాడుట అల్పము. సంస్కృతమును ప్రశంసించుచు మాట్లాడువారు తమ సొంతగొప్పలు చెప్పుకొన్నా రనవలెను. సంస్కృతమును మనము గొప్పచేయ నక్కరలేదు. అది స్వయంసిద్ధము. అయితే ప్రశ్నయేమనగా సంస్కృత భాషయొక్క పఠన పాఠనములు విస్తరించుటకై మన మేమి ప్రయత్నము చేసితిమని. 25, మే 1959, లోకసభలో ప్రసంగము

# శ్రీ విద్యారణ్య విజయగాథ



6

గురువులు శ్రీ విద్యాతీర్థులవారి అనుమతితో విద్యారణ్యులవారు తమ వేదభాష్యమును దేశమున పండితులకు చూపి ఆమోదము పొందుటకు బయలుదేరిరి. అశరీరవాణి విన్పించినప్పుడు తిరిగి శృంగగిరికి వచ్చుటకు కట్టుడి చేసికొనిరి.

శ్రీ విద్యారణ్యులు సంచారవశమున ఆంధ్రదేశమున నున్న ఏలేశ్వరోపాధ్యాయుని కడకేగి అతనికి వేద భాష్యము చూపగా "వేద వ్యాస మునీంద్రుడు తప్ప మరొక్కరు దీని యోగ్యతను గుర్తింపలేరు" అని అతడు చెప్పెను.



# శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్య విరచిత
# అపరోక్షానుభూతి

## వ్యాఖ్యానము: శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

[గతసంచిక తరువాయి]

అవతారిక (135వ శ్లోకమునకు) రాజయోగమును వివరించిన శ్రీ భగవత్పాదులు మరల బ్రహ్మ విచారముయొక్క ప్రాముఖ్యతను తెలుపుచు అది కైవల్యమయిన మోక్షమునకు అనుల్లంఘనీయమైన ప్రథమసోపానమని తెలుపుచున్నారు. ఇదే విషయమును గ్రంథాదియందు ముఖ్యముగా 10, 16 శ్లోకములందు వివరించియున్నారు. ప్రపంచమును బ్రహ్మముకంటె వేరుగా అవగాహన చేసికొనుటకై అది బ్రహ్మము ఉపాదాన కారణముగా వెలువడినదని చెప్పినప్పటికి—నిజముగా సృష్టికి కారణమగుట బ్రహ్మముయొక్క లక్షణము కాదని—లోక వ్యావహారికముగా అట్లు చెప్పబడుచున్నదేకాని—పారమార్థికముగా కారణముకాదని చెప్పుచున్నారు.

శ్లో॥ కార్యేకారణతాయాత కారణేనహి కార్యతా।
కారణత్వం తతోగచ్ఛేత్కార్యా భావేవిచారతః 135

తా॥ కార్యమునందు కారణత్వము తెలియవచ్చినది. కారణమునందో కార్యత్వము కనపడదు కదా. అందువలన విచారమువలన కార్యములేనియపుడు కారణత్వము నశించును.

అనగా కుండలు మొదలగు వస్తువులను—కార్యములను–చూచునపుడు–కుండలు మొదలగునవి కార్యమనియు వాటియందు మన్ను అవగతమై యుండుటచేత మృత్తిక (మన్ను) కారణమనియు బుద్ధి కలుగుచున్నది. అయితే కుండలు మొదలగు వాటియందు మన్నుతప్ప వేరొక వస్తువు లేకుండుట నెఱిగి అది మృత్తికా మాత్రమని కేవల కారణమునే గ్రహించినపుడు ఘటాదికార్యము తోచదు. ఇట్లు విచారింపగా ఘటాదికార్యమే లేకపోవుటవలన మృత్తికకు కారణత్వముకూడ నశించును.

ఇదేవిధముగా ఆకాశాది కార్యదృష్టిచే తదనుగతమైన సచ్చిదానంద లక్షణ బ్రహ్మమునకు కారణత్వము వచ్చుచున్నది. కారణమైన బ్రహ్మమును చూచునపుడు కారణసత్త తప్ప కార్యమునకు వేరుసత్త లేకపోవుటచేత ఆకాశాదికార్యముతోచదు. ఇట్లు కార్యమే లేకపోవుటవలన కార్యబుద్ధి సాపేక్షమైన కారణత్వము బ్రహ్మమున నుండదు. (సశేషము)

# వేదాంత న్యాయములు (33)

(న్యాయములవంటి ఉదాహరణలు)

[వేదాంత శాస్త్రముతో సూక్ష్మవిషయములను బోధచేయుటకు కొన్ని ఉదాహరణలు సాధారణముగా నుపయోగించెదరు. ఈ ఉదాహరణలు నిత్యజీవితమునకు సంబంధించినవిగా నుండి-వీటిమూలమున దుర్గ్రాహ్యమైన సిద్ధాంత విషయములను అవగాహన చేసికొనుటకు తోడ్పడును. ఈ ఉదాహరణలవలన-సునిశిత ప్రజ్ఞావంతముకాని సామాన్యుని మేధస్సుకూడ సిద్ధాంతమును గ్రహింపగల్గును. సామాన్యపాఠకులకొఱకు వేదాంత న్యాయముల వివరణములను క్రమముగా ప్రకటించుచున్నాము. సంపాదకుడు]

## సూత్రము - హారము

కంఠహారమున వేరువేరు రకముల పూసలుండవచ్చును. ఆ పూసల దండలో ఎన్నో విధములయిన, ఎన్నో పరిమాణములుగల పూసలున్నను—వాటన్నిటిని కలిపి యుంచుచున్నది వాటిద్వారా పోవు సూత్రము. అది దారము కావచ్చును. లేక తీగ (లోహ నిర్మితము) కావచ్చును. పూసలను కలిపి ఒక హారముగా నుంచునది— అన్నిటికి ఆధారభూతమైనది సూత్రమే. అదే నిజమునకు హారమునకు అంతస్సు.

అదేవిధముగా భిన్నభిన్న జీవులకు లోకములకు—అండ పిండ బ్రహ్మాండము లకు ఆధారమైన చైతన్యమున్నది. అది పరబ్రహ్మము. అది యీ సకలమునకు— యీ ఉనికి యావత్తునకు ఆధారమై—కలిపియుంచి—బలమై—వాటి అస్తిత్వమునకు మూలమైయున్నది.

---

# నిత్యకర్మలు (24)

(ప్రాతఃకాలమున నిద్రలేచిన తరువాత ప్రతినిత్యమును ప్రతి మానవుడును కొన్ని నిత్య కర్మలను చేయవలసి యున్నది. ఆ నిత్యకర్మ లేవి? ఏట్లు చేయవలెను? ఈ ప్రశ్నలు సామాన్యులకు కలుగుచున్నవి. ఆ యీ ప్రశ్నలకు సమాధానముగా యీ వ్యాస పరంపర ప్రకటించుచున్నాము. —సంపాదకుడు.)

(గత సంచిక తరువాయి)

## స్నానమునెట్లు చేయవలెను? (3)

తరువాత 'నమోఽగ్నయ' అను మంత్రమును చెప్పుచు నమస్కారము చేయ వలెను.

పిమ్మట 'యదపాంక్రూర'—మను మంత్రమును చెప్పుచు బొటనవ్రేలితో

యజ్ఞోపవీతమును గ్రహించి ఉదకములను ముమ్మారు వలయాకారముగా (ప్రాదక్షిణముగా) త్రిప్పుచు ఆ మధ్యభాగమున ముమ్మారు స్నానమాచరింపవలెను.

తరువాత 'ఇమమ్మేగంగ' అను మంత్రముచేత ఉదకమును అభిమంత్రించవలెను.

'ఋతంచ సత్యం చాభీద్ధా' అను అఘమర్షణ మంత్రముచేత ఉదకములయందవగాహన చేయవలెను.

✓ 'ఆర్ద్రంజ్వలతి జ్యోతిరహమస్మి' అను మంత్రముచేత నాచమనము చేయవలెను.

తరువాత స్నానాంగ తర్పణము.

స్మృత్వాచమనముచేసి, దేవాది తర్పణమని సంకల్పముచేసి దేవతర్పణము(1) ఋషితర్పణము (ద్వి) ప్రాచీనావీతియై (త్రిరావృత్త్యా) పితృతర్పణము చేయవలెను.

మరల స్మృత్వాచమనముచేసి

యన్మయా దూషితం తోయం శారీరమల సంయుతం। తస్యపాపవిశుద్ధ్యర్థం యక్ష్మాణం తర్పయామ్యహమ్॥ అసంస్కారాశ్చ యేకేజ్జలాశాః పితగోమసు। తేషామాప్యాయనార్థాయ దీయతే సలిలంమయా॥—అని దోసిలితో ఉదకము 2 సార్లు గట్టున విడువవలెను.

పిమ్మట వస్త్రమును నాలుగుమడతలుపెట్టి ప్రాచీనావీతియయి — "యేకే చాస్మత్కులే జాతా అపుత్రా గోత్రిణామృతాః। తేగృహ్ణంతుమయాదత్తం వస్త్రనిష్పీడనోదకమ్" అనుచు వస్త్రమును పిండవలెను (గట్టున.)

తరువాత కూర్చుండి వేఱొక పొడివస్త్రముచేత శరీరమును తుడుచుకొనవలెను.

(మంత్రములను తెలిసినవారివలండి ముఖతా అధ్యయనము చేయవలెను.)

---

## వ్యాసములు-ఎక్స్ఛేంజి కాపీలు, రివ్యూకి గ్రంథములు

మా పత్రికకు పంపదలచిన వ్యాసములను ఎక్స్ఛేంజి కాపీలను రివ్యూకి గ్రంథములను (2 కాపీలు) యీ క్రింద చూపిన మా మద్రాసు కార్యాలయము అడ్రసునకే పంపవలెను.

శ్రీ రామలింగేశ్వరరావు,
శ్రీ శంకరకృప సంపాదకుడు,
నెం. 63 కోడంబాకం హైరోడ్డు, త్యాగరాయనగరు, మద్రాసు-600 017.

# గురువంశ కథా కథనము

(సంస్కృత మూలము: బ్రహ్మశ్రీ కాశీలక్ష్మణశాస్త్రి గురువంశ కావ్యమ్)

తెలుగు: శ్రీ చెఱుకుపల్లె జమదగ్నిశర్మ ఎం. ఏ.

(గతసంచిక తరువాయి)

## త్రయోదశ సర్గము

ప్రాతశ్శివపూజ ముగించుకొనిన బసవధరణీశ్వరుడు జగద్గురువులను తనయింటి కాహ్వానించుటకు మతిమంతులయిన మంత్రివర్యులను వారి సకాశమునకు పంపెను(1) వారు వెళ్ళి శ్రీ మఠమును చేరి గురువులకు వినతులొనర్చి ప్రాజ్ఞుడైన రాజు నాశయము మనవి చేసిరి. శిష్యుల నానంద పఱచుచు హృష్టాంతరంగులైయున్న జగద్గురువులా రాజు గుణగణము లెఱింగిన స్వారస్యమున నృపగృహ గమనమున కంగీకరించిరి. (2) అప్పుడు వారు వైభవోజ్జ్వల మగు శిబిక నధిరోహించి పటహపణవాది వాద్యములు హృద్యముగా మ్రోగుచుండ ఛత్రచామరాది బిరుదపరంపలు పరగుస్సహము లగుచుండ మంత్రి ప్రముఖులతో సర్వులు తమ్మనుగమింప రాజభవనమును చేరుకొనిరి. (3) గురువు లేతెంచుచున్న కలకలము వినుచునే యోగ్యుడగు నా రాజు సంభ్రమముతో లేచి తనవా రందఱితోపాటు ఎదురేగి ప్రసన్నులై వచ్చుచున్న మహాతేజస్వంతులగు జగద్గురువులను సర్వాభీష్టప్రదుడగు వశిష్ఠమహర్షిని దశరథు డాదరించు నట్లాదరించుచు తన ఆస్థానమునకు తోడితెచ్చుకొనెను (4). ప్రశంస్యులు, స్మేరాస్యులు, సర్వపరిజన నమస్యులగు వారిరువురు రాజాస్థాన మంటపమున మహోన్నతాసనములం దుపవిష్టులైయుండ తమతమ విశిష్ట చరిత్రలచే గౌరవనీయులగు నా మహనీయులు మేరు హిమవంతులవలె భాసించిరి (5). విద్యత్ప్రియుడగు నా నృపతికోరకానాడు జగద్గురువులు శ్రోతలకెల్లరకు పరమానంద మొందించు గంభీర శాస్త్రోపన్యాస మొసంగిరి. దాని విన్న సర్వులు శ్రీవారిని స్తుతించుచుండ వారి మహత్త్వ మెఱింగిన ప్రభువును హృదయపూర్వకముగా శ్లాఘించెను (6). మౌనివర్యులు రాజున కనూన సమ్మాన మొనర్చిరి. పండితుల కెల్లరకు సంతోషముతో సమ్మానవస్త్రము లనుగ్రహించిరి. తరువాత రాజు గురువుల నుద్దేశించి భక్తి ప్రపత్తులతో సముచిత వచనము లుచ్చరించుచు ఆస్థాన భవనమునుండి శ్రీవారి ననుసరించెను (7). రాజ

భవనము నుండి జగద్గురువులు, రాజు, సచివులు, సైనికులు, విద్వజ్జనులు సర్వులు తమ్మనుసరించుచు స్తోత్రములు, ప్రశంసా గానములు, వాద్యఘోషములు చేయుచుండ శిష్యానుచర పరివృతులై శ్రీమఠమును చేరుకొనిరి. (8) అక్కడ కొన్నాళ్ళుండి భక్తవరుల ఇండ్లలో నిత్యమొక్కరి భిక్ష సంగీకరించుచు పాదతీర్థ ప్రదానముచే పవిత్రుల నొనర్చుచు సర్వ జగన్నుతులగు శ్రీసచ్చిదానంద యతీశ్వరులు నియమము నందిరి. (9) పిమ్మట నొకనాడు రాజు తన పురోహిత బ్రాహ్మణుని యింట గురువులకు స్వీయవైభవమునకు తగిన మహాభిక్ష చేయించెను. మిక్కిలి రుచిగల భక్ష్యము లెన్నెన్నో చేయించుటయేకాక ఇతర ద్వీపములనుండి పడవలపై తెప్పించిన అపురూప ఫలముల నెన్నింటినో విరివిగా సమర్పించెను. (10) భిక్ష పూర్తి అయిన తరువాత రాజు తన వైభవమంతటితో మంత్రులెల్లరతో వినమ్రుడై గురువుల సమీపమున నిలిచి తన పలుకులతో స్తోత్ర మొనర్చి విలువయిన కానుక లర్పించి వారినుండి ఆశీస్సుల నందికొనెను. (11) శిష్యవరదులగు జగద్గురువు లానాడే పగటి దివిటీలు మొదలైన లాంఛనము లన్నిటితో కదలి వేగముగా శ్రిత శుభకరియగు శృంగపురి చేరుకొనిరి. సాగనంపుటకై రాజు పంపగా తమ వెంట వచ్చిన మంత్రుల నుచితముగా నాదరించి వారిని వారి పురమునకు పంపిరి. (12)

అటుపిమ్మట గురువులు నిత్య వ్యసనపరులై బహుకాలము పరిశ్రమించుచు మహాశ్చర్యకర పరమోత్తమ వర్తనచే జనుల నెల్లర స్వవశ మొనర్చుకొనుచు ఆనందముల కన్నింటికి మూలమయిన నిదానమును పెంపొందించుకొనుచు చిదానందమున తేలియాడుచు కొన్నాళ్ళు శృంగగిరియందే గడపిరి. (13) అప్పుడే శ్రీవారు మలహానికరేశ్వరస్వామి నుద్దేశించి గ్రామమున తఱచు జరుగు నుత్సవములలో నుపయోగించుటకై త్రిలోకనాథుడగు ఆ దేవుని నిరుపమైశ్వర్యమునకు తగిన చిత్ర విచిత్ర శిల్పరమ్యమైన మంచి వెండిపల్లకి నొకదానిని చేయించిరి. (14) దాని నొక శుభదినమున వైభవోపేతముగ ఉత్సవ మొనరించి స్వామికి అత్యంత భక్తి నమ్రతలతో సమర్పించిరి. ఆ పూట వేయిమంది బ్రాహ్మణులకు పంచభక్ష్య పరమాన్నములతోడి షడ్రసోపేత భోజనము పెట్టించిరి. (15) ఆ పల్లకిని చేయించిన ఉత్సాహాతిశయముతో జగద్గురువులు శృంగేరి పురమున సకల వీధుల నూరేగించుచు భవానీపతి కనేకానేక మహోత్సవములను జరిపించిరి. స్వామియు తన రజతాచలపతిత్వమున కనుగుణముగా నున్నదని ఆనందపడెను. (16) పరమేశ్వర ప్రీతికై ఇట్లు శృంగేశ్వర పూజా మహోత్సవములు నిర్వర్తించి పిమ్మట యోగివర్యులు ఋష్యశృంగమహర్షి

లింగాత్మ భావమునంది ప్రతిదినమభివృద్ధి నందుచున్న కిగ్గ యను పుణ్యక్షేత్రమున కేగిరి. (17) మహాతపస్వులగు గురువులు త్వరలోనే ఋష్యశృంగేశ్వరస్వామి ఆలయము చేరినప్పటికిని లోనికి పోక దగ్గరలోనే యున్న వ్యాఘ్రాదులు నివసించు స్వామి ఆవిర్భవించిన ప్రదేశమునకు ముందు వెళ్ళిరి. అక్కడ నందినీ నదిలో స్నానమాచరించి సమస్తాహ్నికములు నిర్వర్తించుకొని ఋషివరుల రమ్యాశ్రమ ప్రదేశము నాసక్తితో సేవించిరి. (18) అక్కడ ఆవిర్భవించిన సురవరుడైన వరదనరసింహుని భక్తితో సేవించుకొని ఋష్యశృంగేశ్వరుని ఆలయమునకు వచ్చి ఆయనను సర్వోపచారములతో పూజించి వనదుర్గాదేవిని మాచి ఆ తల్లిని గూడ సమర్చించిరి. (19) ఆ కొండనుండి దిగివచ్చి కిగ్గచేరి మరల ఋష్యశృంగేశ్వర స్వామిని సేవించి ఆ స్వామికి దీపోత్సవాదులు సమర్పించి సర్వజనుల కానందను కలిగించుచు జగద్వంద్యులగు జగద్గురువులు శృంగనగరిని చేరిరి. (20)

ఆ పిమ్మట మునివర్యులు పరమ పుణ్యదివసమైన మహాచంపాషష్ఠినాడు దేవతలలో శ్రేష్ఠుడు, సురపద శరణ్యుడు, కారుణ్యాంబునిధియు నగు సుబ్రహ్మణ్య స్వామికి మహోత్సవము చేయించుచున్నారని విని విజ్ఞుడైన మంత్రివరుని రాజు గురువుల సమక్షమునకు పంపగా నాతడు వచ్చెను. (21) ఆ మంత్రి రాజాజ్ఞను గైకొని తాను వచ్చు మార్గమునందే సముచిత ప్రదేశములో యోగివర్యుల ప్రయాణమున కనుకూలముగా మఠ సదృశములయిన వసతులను కల్పించుచు వచ్చి జగద్గురువుల దర్శనము చేసికొని రాజు నాశయము విన్నవించి బయలుదేరవలసినదని అభ్యర్థించెను. (22) భక్తి తాత్పర్యములతో నాతడొనర్చిన విన్నపము నందికొనిన గురువర్యులు సంతోషించి నిజశిష్యులను పోష్యులను పరితోష్యులను సర్వులను ప్రయాణమునకు సన్నద్ధము కావలసినదని హెచ్చరించుటకై భేదవాదులకు గుండె దిగులు కల్పించు దుందుభిని మ్రోగింపజేసిరి. (23) పిమ్మట గురువర్యులు సుందరమైన శిబికనధిరోహించి సకల పరివారముతో శృంగగిరి నుండి బయలుదేరి వారాహీ సంగమ ప్రదేశమునందలి కూడలి సంగమక్షేత్రము చేరి అక్కడ ఒకనాడుండి నిత్యవిధులు నిర్వర్తించుకొని తరువాత ఘట్ట శిరస్సును చేరుకొనిరి. (24) అక్కడ నుండి సహ్యాద్రి నవతరించి ఋషులకు నివాసయోగ్యమై ఫలపుష్ప సమన్వితమగు తొలవ

**24 వ శ్లోకము.**

**పశ్చిమ సముద్ర తీరమందలి ఇప్పటి ఆ గుంభే నగరమునే అప్పుడు ఘట్టశిరమని వ్యవహరించినట్లు తోచుచున్నది.**

దేశమును చేరి తటస్థపడిన సకల దేవతలను అర్చించుచు అనుగమించు నందరితోడను కోత్కూట పురమును చేరుకొనిరి. (25) అక్కడనుండి శివగంగాతటమందున్న మహా మహిమోపేతుడైన వైద్యేశస్వామిని చేరి సర్వోపచారములతో పూజించుకొనిరి. ఆ స్వామి శ్రీశైలేశ్వరున కొకప్పుడు తలయందు వ్యాధిరాగా దానికి చికిత్స యొనర్చిన మహామహుడట. జగద్గురువుల కా స్వామిని సేవించుకొన గలుగుటతో పరమానందమయినది. (26) అటనుండి జగద్గురువులు మహోత్సాహముతో వేగముగనే దివి నే వేపురము చేరుకొనిరి. అక్కడనున్న పరమ రమ్యాకారుడైన కృష్ణస్వామి నక్షే కనులప్పగించి చిరకాలము చూచి ఆనందించిరి. ఆ స్వామి సకలోపచారములతో పూజ గావించి సుబ్రహ్మణ్యపురమునకేగు తలంపుతో అచట కొంతకాలముండిరి.(27)

జగద్గురువులు తమపురములో సుబ్రహ్మణ్యోత్సవములు జరుపుటకు వేంచేయుచున్నారను తెలిసి తత్పురవాసు లెల్లరు నిచ్చటికే చేరి గురుచరణయుగ దర్శన భాగ్యమునంది ధన్యత భజించిరి. ఈ వార్తలు తెలిసి దేశ దేశముల నుండి వచ్చి చేరుచున్న యాత్రికులతో పట్టణ ముబ్బిపోయినది. (29) అర్ధచంద్ర సదృశమునైన లలాట ప్రదేశముల తెల్లని విభూతితో త్రిపుండ్రధారణ మొనర్చి జగద్గురుచరణ సేవాకుతుకమున త్వరపడుడు త్వరపడుడని తమవారిని తొందరించుచు మహారాష్ట్ర యాత్రికులు వచ్చి "మన మెంత ధన్యులము! గురువుల నిచ్చటనే సేవించుకొన గలిగితిమి" అని తమ్ము తామభినందించుకొనిరి. (29) స్పష్టమయిన స్వరములతో వేద పఠనము చేయుచు తలలపై తడి యంగవస్త్రములు, ఉపరికాయమున నుత్తరీయములు, చేతులలో జలపూర్ణ కలశములు, ఎడమచంకలలో ధౌత వస్త్రములు చుట్టిన పెట్టెలను ధరించి తెల్లని యజ్ఞోపవీతములు తళతళలాడుచుండగా ఆంధ్రదేశ వేదపండితులు వచ్చి గురువులను సేవించుకొనిరి. (సశేషము)

---

25 వ శ్లోకము.

కోత్కూట పురమిప్పుడు కోక్కడో అయినది. ఆ పట్టణము ఉప్పినియంగాడికి దగ్గర నున్నది.

---

Printed & Published by A. Satyanarayana Murthy,
6-3-609/18, Anand Nagar, Khairatabad, Hyderabad - 500 004.
Printed at KRANTI PRESS, MADRAS-600 001.
Editor : T. Ramalingeswara Rao

# శ్రీ శంకర భగవత్పాద విరచిత
# వి వే క చూ డా మ ణి
## (శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామి విరచిత వ్యాఖ్యాసమేతము)

ఆంధ్రీకరణము : డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు(వేదాంత శిరోమణి విద్వాన్)
ఎం. ఏ. (సంస్కృత, ఆంగ్ల హిందీ) పి. హెచ్‌డి.

(గతసంచిక తరువాయి)

అ. వ. అన్తిమ కార్యమగు దేహము మొదలు ఆదిమ పరిణామ్యుపాదాన కారణమగు అవ్యక్తమువరకును ఉన్నవన్నియు అనాత్మలే యని చెప్పబడినది. ఇప్పుడు దీనికి విపరీతముగా, ఆదిమ పరిణామ్యుపాదానకారణమగు అవ్యక్తము మొదలు అన్తిమ కార్యముగు దేహము వరకును గల సమస్త దృశ్య ప్రపంచమును అనాత్మయే యని దార్ఢ్యము కొరకై చెప్పుచు, అది మిథ్యాయను విషయమును గూడ చెప్పుచున్నారు—

మూ. మాయా మాయాకార్యం సర్వం మహదాది దేహ పర్యన్తమ్.
అసదిద మనాత్మ తత్త్వం విద్ధిత్వం మరు మరీచికా కల్పమ్. 125.

ప్ర. అ. మాయా=మాయయు, మహదాది=మహత్తు మొదలుకొని, దేహ పర్యన్తం=దేహామువరకును గల, సర్వం=సమస్తమైన, మాయాకార్యం=మాయా కార్యము, ఇదం=ఈ, అనాత్మతత్త్వం=అనాత్మతత్త్వము, అసత్=అసత్తనియు, మరు మరీచికా కల్పం=మరు మరీచికతో సమానమైనదనియు, త్వం=నీవు, విద్ధి=తెలిసికొనుము.

వ్యా. అ. మాయా=మూల ప్రకృతి, మహత్=మహత్తత్త్వము, 'తదైక్షత' (అది చూచెను) అను శ్రుతియందు ప్రసిద్ధమగు ఈక్షణము, అది దేహపర్యంతమగు ఏ మాయాకార్యమునకు ఆదియో అట్టి మహదాదికము, అహంకార="సోఽకామ యత" (ఆ ఈశ్వరుడు కోరెను) అను శ్రుతియందు చెప్పిన ఈశ్వర సంకల్పము, తరువాత పంచమహాభూతములు, తరువాత పంచీకృత స్థూలభూతములు, తరువాత బ్రహ్మాండము, అందలి చతుర్దశ భువనములు, వానిలోనున్న స్థూలదేహాదులు, ఈ దేహపర్యంతమగు సమస్తమైన, మాయాకార్యం=మాయయు, దానికార్యము అయిన

అనాత్మతత్త్వం="కోఽసావనాత్మా" అను ప్రశ్నకు సమాధానముగ చెప్పబడిన ఆత్మ వ్యతిరిక్త పదార్థమును, అసత్=సద్రూపమగు ఆత్మకంటే భిన్నమైనదియు, కావుననే పూర్వోక్తమగు శుద్ధాద్వితీయ బ్రహ్మజ్ఞానముచే నాశ్యత్వము మొదలగు హేతువుచే, మరు మరీచికా కల్పం=కనబడి నశించిన స్వరూపము కలదగుటచే ఎండ మావులతో సమానమైనదానినిగా, మిథ్యా=భూతమైన దానినిగా, విద్ధి=తెలిసికొనుము, గ్రీష్మమునందు మరుభూమిపై ప్రసరించిన సూర్యకిరణములు మహాజల ప్రవాహబుద్ధిని కలిగించును. పరిశీలించి చూచినచో అచట జలమేమియు నుండదు. అట్లే బ్రహ్మజ్ఞానము కలుగుటకు పూర్వము మాయయు, తత్కార్యములును భాసించును. బ్రహ్మసాక్షాత్కారము కలుగగనే, మెలకువ వచ్చిన పిమ్మట స్వప్నమువలె, అదియంతయు సమూలముగ నశించును. ఈవిధముగ మాయా=మాయాకార్యములు దృష్టనష్ట స్వరూపములగుటచే మరు మరీచికలవలె మిథ్యాభూతములు, మరు మరీచిక లనగా ఎడారి ప్రదేశమున ప్రసరించిన సూర్యకిరణములు. 125.

అ. వ. ఈవిధముగ అనాత్మను గూర్చి పూర్తిగ వివరించి "పరమః క ఆత్మా" అను ప్రశ్నకు సమాధానము చెప్పుటకు ప్రారంభించుచున్నారు.—

మూ. అథ తే సంప్రవక్ష్యామి స్వరూపం పరమాత్మనః.

యద్విజ్ఞాయ నరో బన్ధాన్ముక్తః కైవల్య మశ్నుతే. 126.

ప్ర. అ. అథ=అటుతర్వాత, పరమాత్మనః=పరమాత్మయొక్క, స్వరూపం=స్వరూపమును, తే=నీకు, సంప్రవక్ష్యామి=చెప్పెదను, యత్=దేనిని, విజ్ఞాయ=తెలుసుకొని, నరః=నరుడు, బంధాత్=బంధమునుండి, ముక్తః=ముక్తుడై, కైవల్యం=మోక్షమును, అశ్నుతే=పొందునో.

వ్యా. అ. అథ శబ్దమునకు "అనాత్మను గూర్చి చెప్పిన తరువాత" అని యర్థము. యత్=ఏ పరమాత్మ స్వరూపమును, విజ్ఞాయ=సాక్షాత్కరింప చేసికొని, నరః=విద్యాధికారముగల పురుషుడు, బంధాత్=అహంకారాది దేహసంబంధమునుండి, ముక్తః=విడువబడినవాడై, అనగా దేహాది తాదాత్మ్యాధ్యాసమును విడచినవాడై, కైవల్య=సర్వోపాధి వినిర్ముక్తుడగుటచే కేవల చిద్రూపత్వమును, భేదరహితమగు సచ్చిదానంద రూపత్వమును, అశ్నుతే=పొందునో, అట్టి పరమాత్మునియొక్క స్వరూపమును, పరమాత్మను గూర్చిన సత్యమును, నీకు స్పష్టముగను విస్తరముగను చెప్పెదను. 126.

అ. వ. ఆత్మను గూర్చి చెప్పుటకు ఉపక్రమించుచున్నారు:—

మూ. అస్తికశ్చిత్స్వయం నిత్యమహం ప్రత్యయ లంబనః.
అవస్థాత్రయ సాక్షీసన్ పంచకోశ విలక్షణః 127.

ప్ర. అ. స్వయం=స్వయముగనే, అహంప్రత్యయలంబనః = అహం అను వృత్తికి ఆశ్రయభూతుడును, అవస్థాత్రయసాక్షీసన్=అవస్థాత్రయమునకు సాక్షియై, పంచకోశవిలక్షణః=ఐదు కోశములకంటె భిన్నుడైన, కశ్చిత్ = ఒకానొకడు, నిత్యం=ఎల్లప్పుడును, అస్తి=ఉన్నాడు.

వ్యా. అ. స్వయం=సత్తాస్ఫూర్తి విషయమున ఇతరాపేక్ష లేకుండగనే, అహం ప్రత్యయలంబనః='అహం' అను ఆకారము గల మనోవృత్తితో తాదాత్మ్య మును పొందుటచే అహం వృత్తికి ఆశ్రయభూతుడును, అహంప్రత్యయః=అహం వృత్తి, లంబనం=బింబమును గ్రహించునదిగా ఎవనికి వున్నదో అతడు—అనగా అహంవృత్తికి విషయభూతుడు ('నేను' అనబడేవాడు అని అర్థము) అవస్థాత్రయ సాక్షీసన్=జాగ్రత్స్వప్న సుషుప్తులనెడు అవస్థాత్రయమునకు సాక్షాద్ద్రష్టయై, పంచకోశవిలక్షణః=అన్నమయ—ప్రాణమయ—మనోమయ — విజ్ఞానమయ—ఆనంద మయకోశములకంటె వ్యతిరిక్తుడు అగువాడు, ఎల్లప్పుడును ఒకడున్నాడు. "అతడే ఆత్మ" యని అధ్యాహారము. ఈ ఆత్మ కాలత్రయా బాధ్య స్వరూపమని చెప్పి నట్లైనది.

అ. వ. ఆత్మ అవస్థాత్రయ సాక్షియను విషయమును ఉపపాదించుచున్నారు.

మూ. యో విజానాతి సకలం జాగ్రత్స్వప్న సుషుప్తిషు.
బుద్ధి తద్వృత్తి సద్భావ మభావ మహ మిత్యయమ్. 128.

ప్ర. అ. యం=ఎవడు, అహమితి='నేను' 'నేను' అని, జాగ్రత్స్వప్న సుషుప్తిషు=జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలయందు, బుద్ధితద్వృత్తిసద్భావం=బుద్ధి యొక్కయు, దాని వృత్తులయొక్కయు ఉనికిని, అభావం=వాటియొక్క అభావ మును, సకలం=ఈ సమస్తమును, విజానాతి=తెలుసుకొనుచున్నాడో, ఇది ఆత్మయని అన్వయము.

వ్యా. అ. "నేను దీనిని చూచుచున్నాను; దీని అనుమతి చేయుచున్నాను, శబ్దము ద్వారా తెలిసికొనుచున్నాను, స్మరించుచున్నాను" ఇత్యాది విధమున జాగ్ర త్స్వప్నములయందు, బుద్ధియొక్కయు, దానికి సంబంధించిన వృత్తుల యొక్కయు ఉనికిని, సుషుప్త్యనంతరము కలుగు "నాకేమియు తెలియలేదు" అను స్మృతి ననుస రించి, సుషుప్త్యవస్థయందు బుద్ధియొక్కయు, దాని వృత్తులయొక్కయు అభావమును

"నేను దానిని తెలుసుకొనుచున్నాను; దానిని తెలిసికొంటిని; దానిని తెలిసికొనగలను" అను అనుభవమువలన, సకలములగు జాగ్రదవస్థలోని పదార్థములను, స్వాప్న పదార్థములను, సుషుప్తియందు అజ్ఞానమును తెలిసికొనుచున్నాడో అతడు ఆత్మ అని అన్వయము.

అ. వ. అన్నింటిని చూచునదగుటచేతను, దీనిని చూచునది మరియొకటి ఏదియు లేకుండుటచేతను, ఆత్మజ్ఞానస్వరూపము అని చెప్పుచున్నారు:—

మూ. యః పశ్యతి స్వయం సర్వం యం నపశ్యతి కించన
యశ్చేతయతి బుద్ధ్యాది నతద్యం చేతయత్యయమ్. 129.

ప్ర. అ. యః = ఏది, స్వయం = తాను, సర్వం = సమస్తమును. పశ్యతి = చూచునో, యం = దేనిని, కించన = ఏదియు, నపశ్యతి = చూడదో, యం = ఏది, బుద్ధ్యాది = బుద్ధి మొదలగుదానిని, చేతయతి = చైతన్యవంతము చేయుచున్నదో, తత్ — ఆ బుద్ధ్యాదికము, యం = దేనిని, నచేతయతి = చైతన్యవంతముగ చేయజాలదో, అయం = ఇది (ఆత్మ).

వ్యా. అ. "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" (ఈ ఆత్మకంటే భిన్నమగు చూచునది మరియొకటి ఏదియును లేదు) అను శ్రుతి ననుసరించి ఏది సర్వమును చూచుచున్నదో దేనిని మరెవ్వరు చూడజాలరో "నతత్ర చక్షుర్గచ్ఛతి నా వాగ్గచ్ఛతి నోమనః" (అచటకు నేత్రము, వాక్కు, మనస్సు వెళ్ళజాలవు) "నచక్షుషా గృహ్యతే నాపి వాచా నాన్యైర్దేవైః" (నేత్రముచేతగాని, వాక్కుచేతగాని, ఇతరములగు ఇంద్రియములచేతగాని గ్రహింపబడదు) "నైవవాచా నమనసా ప్రాప్తుం శక్యో న చక్షుసా" (వాక్కులచేగాని, మనస్సుచేగాని, నేత్రముచేగాని, పొందుటకు శక్యము గాదు) అని శ్రుతి చెప్పుచున్నది. ఏది బుద్ధ్యాది జడపదార్థమును తన ప్రతిబింబముచే చేతనము కలదానినిగా చేయుచున్నదో, ఆ బుద్ధ్యాదికము స్వతఃచేతన స్వభావమగు చేతనవంతము చేయజాలదో, జడవస్తువు తన కార్యమును నిర్వహింపవలెనన్నచో దానికి చేతనాపేక్షయుండునుగాని చేతనమునకు పరాపేక్షయుండదు. ఇది ఆత్మయని అన్వయము. (సశేషము)

---

# శ్రీ విద్యారణ్యుల గురించిన జనశ్రుతి గాథలు (6)

## యతి యగుట మరొక జన్మ

విద్యారణ్యులవారు పూర్వాశ్రమమున మిక్కిలి పేదవారట. భరింపరాని దారిద్ర్యమును నివారించుకొనుటకు మహాలక్ష్మీదేవిని తీవ్రముగా ఉపాసించిరట. ఆమె ప్రత్యక్షమై "ఓయీ! నీకీ జన్మమునందు ఐశ్వర్యప్రాప్తిలేదు. ఈ తరువాత జన్మలో వలసినంత ఐశ్వర్యము సంప్రాప్తించును" అని చెప్పెనట.

సన్న్యాసము తీసికొన్నచో మరియొక జన్మయే యగునుకాబట్టి విద్యారణ్యులు సన్న్యాసమును స్వీకరించిరట. అందుచేత విద్యారణ్యస్వామికి సకల రాజ వైభవములు, చక్రవర్తి చిహ్నములు లభించినవట. మహాలక్ష్మీదేవి 3½ ఘడియల కాలము విద్యారణ్యులకొరకై స్వర్ణవర్షము కురిపించినదట.

ఈ గాథ చాల ప్రచారములో నున్నది.

(విద్యారణ్యస్వాములవారిని గురించి చారిత్రకులు వ్రాసినదానికంటె జనశ్రుతిలో బహుళముగా అనంతముగా గాథలున్నవి. వాటిని ప్రోగుచేసి ప్రకటించుట మాకు శక్తికి మించిన పని. ఇంతవరకు ప్రకటించిన గాథలతో మేము తృప్తిపడుచున్నాము.)

ఈ గాథలవలన చాల తెలిసికొంటిమని ప్రశంసా లేఖలు వ్రాసిన పాఠకులకు కృతజ్ఞతలు.

(సంపాదకుడు)

---

## చందాదారులకు విన్నపము-ప్రకాశకుని చిరునామా మార్పు గమనింపుడు

చందాలు బాకీయున్నవారికి పత్రిక పంపబడదు. చందా సొమ్మును ముందుగనే (తమ అడ్రసు మార్పుకూడ వెంటనే) క్రింది చిరునామాకు పంపవలెను.

ఆకెళ్ల సత్యనారాయణమూర్తి,
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు,
6-3-609/18, ఆనందనగర్,
ఖైరతాబాదు, హైద్రాబాదు-500004.

# అద్వైత సిద్ధాంతము ముందు పాశ్చాత్యుల పూర్వపక్ష ఖండన

## (ఆచార్య సుందరము)

(శ్రీ శంకర భగవత్పాద అద్వైత సిద్ధాంతము పైన పాశ్చాత్య విద్వాంసులు కొందరు దుర్బలమైన ప్రతిపక్షవాదములు చేసిరి. ఆ వాదముల ఖండన మీ వ్యాసము. —సంపాదకుడు.)

(గత సంచిక తరువాయి)

డా. థీబొ వ్రాసిన దిట్లున్నది—"వైయక్తిక జీవుని పరిమాణమును గురించి చర్చించిన సూత్రములను శంకరులు భాష్యము వ్రాసిన విధముగా అవగాహన చేసికొనుటకు వీలులేదు" ఈ సూత్రము 2 వ అధ్యాయము ద్వితీయపాదమున 19-32. మరియు ఆ పాదమున 13 వ అధికరణమునుండి చర్చింపబడిన విషయమేమనగా వ్యక్తి జీవుడు అణువా లేక విభువా? అని.

డా. థీబొ తన సంగ్రహావ్యాఖ్యానమును చూడమన్నాడు. మొదట శ్రీ శంకరుల భాష్యమున ఆయన చూపిన దోష మేమనగా సూత్రమును (19-20) అతిగావ్యాఖ్యానించెనని-(చివరకా సూత్రప్రతిపాదనను 29 సూత్రమున విసర్జింపవలసియుండగా—) కాని వెంటనే తన మాటలను తానే వదలుకొనుచు నిట్లనెను—"ఇక్కడ మామూలుగా చేయవలసిన దానికంటె అధికముగా పూర్వపక్షమును వివరించుట అసమంజస మన నక్కరలేదు."

తరువాత 29 సూత్రము వైపు తిరిగి (అది సిద్ధాంతమును ప్రతిపాదించు చున్నది) "శ్రీ శంకరులు యీ సూత్రమునకు అంటగట్టిన భావము బలవంతముగా రుద్దబడినదనుటకు సందేహింప నక్కరలేదు" అనెను. ఆయన అందుకు చెప్పిన కారణములు? ఆయన తన వాదమునకు బలము కూర్చుకొనుచు తొలుత చెప్పినది—"ఈ సందర్భమున మొదటి తొలి శబ్దమునకు బుద్ధియని చెప్పుటకు అవకాశమే లేదు" ఇట్లు డా. థీబొ అభిప్రాయపడుటకు కారణమేమనగా యీ సూత్రమును ఆయన అవగాహన చేసికొన్నవిధమే—"ముఖ్యముకాని 'ప్రజ్ఞావత్' శబ్దమును వదలిపెట్టె" ఆయన చేసిన అనువాద ఫలితమిది.

నిజమునకీ పదము ఉదాహరణమును నిరూపించుచు 'తత్' శబ్దార్థమునకు సూచన చేయుచున్నది—'ఉపాధి' అన్న అర్థమని ఈశ్వరునివలె అతడు అణీయుడుగా మనోమయుడుగా ధ్యానింపబడుచున్నాడు. (అధ్యాయము 3. 14-2-3) పరి

మిత ఉపాధి లక్షణములుండుటవలన అట్లే జీవుని విషయమున అతని ఉపాధి లక్షణముల ప్రభావమువలన (బుద్ధి) అణుత్వము ఆపాదింపబడుచున్నది. ప్రజ్ఞకు చేతో ముఖమనికూడ పేరు. ఏలననగా చిత్తము (బుద్ధి)వలననే జీవుడు స్వప్న సుషుప్తి అవస్థలనుండి జాగరితుడగుచున్నాడు కాబట్టి బుద్ధి (చిత్తము) అతని ఉపాధి—అది అతని స్థితిని—అవస్థను—గుణములను నిర్ణయించుచున్నది. అందుచేత ప్రజ్ఞావత్—శబ్దార్థమువలన 'తత్' శబ్ద అర్థము యీ సూత్రమున నిర్ణయింపబడుచున్నది. డా. ధీబాకు వచ్చిన కష్టమేమనగా అనవసరమనుకున్న 'ప్రజ్ఞావత్' శబ్దమును విస్మరించి సూత్రార్థమును నిర్ణయించుటకు ప్రయత్నించినందువలన.

నిజమునకు సూత్రమునందు ఏ శబ్దమును అనవసరము కాదు. ఈ సూత్రమున ప్రజ్ఞావత్ శబ్దమే ఆ సూత్ర తాత్పర్యమును నిర్ణంచుటకు మార్గసూచన చేయుచున్నది.

ఇక డా. ధీబా చేసిన రెండవ వాదముకూడ నిట్లే అనుచితముగ నున్నది. అతనివాదము—"శంకరుని సిద్ధాంతమును అనుసరించి బుద్ధియొక్క గుణములు—సుఖము, దుఃఖము, కోరిక. (రాగద్వేషములు) ఆత్మకు సంసారమందున్నప్పుడైన అంటిపెట్టుకొనునని చెప్పుటకు చాల సందేహింపవలసి యున్నది. ఆత్మయొక్క ముఖ్య లక్షణము—ఏ స్థితియందున్నప్పటికి— (శంకరుని సిద్ధాంతము ననుసరించి) జ్ఞానమే—బుద్ధితో దానికి గల సంబంధము మిథ్య—అసత్యము:"

నిజముగా అది మిథ్యయే. అయితే జీవునికి అతడున్న వ్యావహారికమున్న స్థితిలో నది తెలియదుకదా! అధ్యాస—అవిద్యవలన—అతడు తనయొక్క సహజ స్థితిని గురించిన జ్ఞానమును పోగొట్టుకొని తన ఉపాధితో అభేదమును భావించుకొను చున్నాడు-అనగా బుద్ధితో—కొంతప్పుడు దేహముతో. ఫలితమేమనగా సంసార స్థితిలో ఆత్మయొక్క యథార్థస్థితి అతనికి లేదు. సూత్రము చెప్పినట్లు అతడు బుద్ధితో అభిన్నుడనుకొనుచున్నాడు.

మూడవ పాదమున 18 సూత్రము ఆత్మను 'జ్ఞా'నమని చెప్పినదానిని డా.ధీబా పట్టుకొని యిట్లు వ్యాఖ్యానించు చున్నారు. "శంకరుల అభిప్రాయములను కలిగియున్న ఏ గ్రంథకర్తయైనా ఆత్మయొక్క ముఖ్య లక్షణములను వ్యాఖ్యానించునప్పుడు 'జ్ఞాత్రి' అను అర్థము వచ్చు 'జ్ఞా' శబ్దమును ప్రయోగించుచునని భావింపలేము. 'జ్ఞా' అనగా జ్ఞానము కాదు."

సూత్రమునందు చెప్పిన హేతువును డా. ధీబా గమనించలేదు. 'అతఏవ'—(ఈ హేతువుచేత), ఏ హేతువు? సమాధానమేమనగా క్రిందటి సూత్రమున చెప్పిన

హేతువు వలన. (విస్తరభీతివలన అది మరల ఉదహరించబడలేదు—సూచింపబడినది) ఆ హేతువు అది నిత్యము—కార్యము కాదు.

జ్ఞాత్రి—తెలియబడుట కలవాటగుటచేత నిత్యముకాదు. స్వాప్నావస్థయందది లేదు. అందుచేత జ్ఞా అనగా జ్ఞాత్రి అని అవగాహన చేసికొనరాదు. జ్ఞానమునియే గ్రహింపవలెను. శ్రుతి జీవబ్రహ్మల అభేదమును తెలుపుచున్నది. (తత్త్వమసి) సత్యం జ్ఞాన మనంత బ్రహ్మ” అను శ్రుతిపాఠములు బ్రహ్మజ్ఞానమని చెప్పుచున్నవి. మరియు బృహదారణ్యక ఉపనిషత్తు 'నహిద్రష్టు ర్దృష్టం ద్విపదదిలో పోవిద్యతే'—(ఋషి యొక్క జ్ఞానమునకు నాశనములేదు) వ్యావహారిక ప్రాపంచిక జ్ఞానమున్నప్పటికి లేకపోయినప్పటికి—అట్టి ప్రాపంచిక జ్ఞాన ముత్పన్నమగుటకు ఆధారమైన జ్ఞానము నశింపదు.

విమర్శింపబడుచున్న సూత్రమునందీ జ్ఞానముయొక్క అవశ్యకత—నిత్యత మూల మున జీవుని 'జ్ఞ' అని చెప్పుట. అందుచేతి 'జ్ఞ' అనగా 'జ్ఞాత్రి'—తెలిసికొనువాడు కాజాలదు. సుషుప్తియందగీ ప్రాపంచిక జ్ఞానము నశించుచున్నది. అప్పుడు జ్ఞాత్రి లేదుకదా! కావున సారభూతమైన జ్ఞానము మాత్రము। నిలుచును. అందుచేత ఆ అర్థ మునే యీ సూత్రమునందు జీవునకు అపాదించుట. సూత్రకారుడు 'జ్ఞ' పదమేల ప్రయోగించెనని—'జ్ఞాత్రి' ఏల ఉపయోగింపలేదని పరిశీలింపవలెను. ఉపనిషత్తు లందు ఆత్మజ్ఞాత్రియని జ్ఞానమని రెండువిధములుగా చెప్పుట కలదు. ఏది సత్యమగు తురీయమగు అర్థమో సూత్రకారుడు తేల్చవలెను.

సూత్రమును నిబద్ధీకరించునపుడు పూర్వపక్షమును దృష్టియందుంచుకొని దానిని మన దృష్టికి తెచ్చుటకు ప్రయత్నమున్నది—దానికి సమాధానము తేలికగా గోచ రించుటకు. ఇతర అధికరణములందు కూడ నిట్టి పద్ధతిని అనుసరించెను.

ఉదాహరణకు—“దహర ఉత్తరేభ్యః” (I, 3, 14) “ఆనందమయోఽ భ్యాసాత్” (I-1,12) ఈ రెండు సూత్రముల నిర్మాణ వైఖరి—పూర్వపక్షము స్ఫురింపబడునట్లున్నది. నిజమునకు యీ అధికరణములందు జరుగుచున్న పరిశీలన దహరము బ్రహ్మమా? కాదా? అని కాదు. ఆనందమయము బ్రహ్మమునియా? కాద నియా? అనికాదు. అట్టి సందేహమునకు ఆస్కారమే లేదు. పూర్వపక్షమును స్ఫురింప జేసి దానిపైన వాదముతో సిద్ధాంతము చెప్పుటకు.

అదేవిధముగా యీ సూత్రమునందు 'జ్ఞ' అని ప్రయోగించినందువలన పూర్వ పక్షము స్ఫురింపచేయబడి (ఆత్మజ్ఞాత్రి కావచ్చునసుట) దానిపై వాదముతో సిద్ధాం తము చెప్పుట కవకాశమున్నది. సూత్రమున 'క' ప్రత్యయమునకు 'కర్త'—భావము—

రెండు అర్థములున్నవి. ఇందు మొదటిదానికి అవకాశమే లేదు. అది ముందే నిరూపింపబడినది. 'అత ఏవ' అని సూత్రమునందు చెప్పబడుటచేత. కాబట్టి రెండవ అర్థమునే తీసికొనవలెను. ఇక్కడ పరిశీలింపవలసినదేమనగా వ్యాకరణ శాస్త్రము-యిట్టి కర్తృప్రయోగమును కంగీకరించునా యని. దీనికి ప్రమాణము వార్తికకారుని సూత్రము చూపుచున్నది. 'ఘఞర్థే కః' 'ఘఞ్' అను ప్రయోగములకు భావమనియే అర్థము. కర్త అనుట కాదు. కాబట్టి డా. ధీబా లేవతీసిన అభ్యంతరము నిష్ప్రయోజనము. పూర్తిగా విఫలము. (సశేషము)

---

# శృంగేరి వార్తలు

శృంగేరిలో శ్రీ చంద్రమౌళీశ్వరునికి, శ్రీ శారదాదేవికి మరియు నచట వేంచేసియున్న యితర దేవతలకు (జనేవరి 14 బుధవారమునాడు) మకరసంక్రమణ-ఉత్తరాయణ పుణ్యకాలమున - ప్రత్యేక పూజార్చనలు జరిగినవి. శ్రీ చంద్రమౌళీశ్వరునికి ప్రత్యేకాభిషేకములను శ్రీ జగద్గురువుల పర్యవేక్షణలో నిర్వహింపబడెను.

హేమంతఋతువున - చలి విపరీతముగా నున్నప్పటికి శిష్య సందోహము శృంగేరికి వచ్చి శ్రీ జగద్గురువులకు భిక్షావందన పాదపూజాదులను నిర్వహించుచు నే యున్నారు. రౌద్రి సంవత్సర మకరసంక్రాంతినాడు జనము చాలమంది వచ్చి శ్రీ జగద్గురువును దర్శించి వారి అనుగ్రహమును బడసిరి.

ఆంధ్రదేశమునకు శృంగేరి చాల దూరముగా నున్నందువలన పూర్వము ఆంధ్ర శిష్యులు శృంగేరికి వచ్చుట తక్కువ. నేటి కాలమున ప్రయాణ సౌకర్యము అధికమగుటచేత ఆంధ్ర శిష్యులు వచ్చుట అధికమయినది. ఆంధ్రదేశము నుండి టూరిస్టు బస్సులు వచ్చుట మిక్కిలి అగుచున్నది. ఇది ముదావహమగు విషయము.

---

# మార్మికత

అంతర్ముఖులైన మహాత్ములను, అమిత భక్తితో దేహానుభూతి విస్మరించి దివ్యానుభూతిలో నాట్యమాడు మహానుభావులను - మనమప్పుడప్పుడు లోకమున చూచుచున్నాము. వీరికి మార్మికమైన అనుభవము లభించినదని చెప్పుకొందుము.

మార్మిక అనుభవము——(mysticism) అనగా నేమి? ఇది యొక ఆంతరేంద్రియానుభవము. కేవలత్వముతోడి ఐక్యసాధనయందు అతి చరమస్థితి. దీనికి చక్కని ఉదాహరణముగా తరంగ సముద్రములను చెప్పవచ్చును.

సమున్నత—పరమ—చైతన్యమును గురించిన లోకదృష్టి పురుషసూక్తమున చక్కగా వివరింపబడినది. పురుషసూక్తము ఋగ్వేదీయమైనను మరల నితర వేదము లందును చెప్పబడినది.

పరమస్థితి ఇంద్రియాతీతమే. అవాఙ్మానసగోచరము. అయినప్పటికి సాధనా పరిణతి మనస్సుయొక్క పరిపక్వతపై ఆధారపడియున్నది. ఒక ఉన్నత శక్తియొక్క సన్నిహితత్వమును మనస్సు అనుభవములోనికి తెచ్చుకొనుటపై ఆధారపడియున్నది. మన మహర్షులు అడవులలో—అతి సాధారణ జీవితములను గడపుచు ఉన్నత భావనా పరంపరలతో కాలము గడపుచు వెళ్ళబుచ్చిరి. ఆ మహర్షుల భావోజ్జ్వలతయే ఉపనిషత్తులు. తన్ను తాను తెలిసికొనుట సర్వమును తెలిసికొనుట" "సర్వజీవులకు అనుబంధ బంధమొకటి యున్నది" ఈ సత్యములను ప్రచారము చేయుటకై ప్రయత్నములు చేసి—యీ భావముల అనుభూతిని యితరులకు కలిగించుటకై కృషి జరిగినది.

'ఏకత్వము' అన్నది మేధాసముద్దీప్త భావపరిణతి కాదు. అనుభవ నిరూపితము. అనుభవించువాడు అనుభవింపబడుదానితో పొందు అభిన్నత, ఉపనిషత్తుల లోని దివ్యవాక్కుల సారము—సామాన్య మానవునికి అందుబాటులోనికి తెచ్చినది భగవద్గీత. అది భగవంతుడు—శ్రీకృష్ణపరమాత్మ—అనుగ్రహించినది. భగవద్గీతా సారమున కర్మభక్తి వైరాగ్యజ్ఞానముల—దేని స్థాయిలో దానిని-అనుగమించి ఉన్నత స్థితిని చేరుట.

ఇప్పుడే కాదు—పూర్వమును — (ముఖ్యముగా ప్రాగ్దేశములు) భారతీయ మార్మికత యావత్ప్రపంచమును సమ్మోహమొనరించినది.

ఈ ఆధునిక కాలమున—శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామి, రామకృష్ణపరమహంస, రమణ మహర్షి—తమ తమ సాధనా మార్గములలో సిద్ధులైన వారు. 'నేను' (అహం) 'నీవు' అన్న చైతన్య భావము చివరకు 'నేను'గా మిగిలి—అట్లనుకొనువాడు అదృశ్యమగుటగా పరిణమించును.

అతీతమైన దివ్యశక్తిని తనయందు అనుభూతి పొందుట మార్మికతయే. ఇట్టి మార్మికానుభవము కలవారు మహాత్ములే.

---

# గ్రంథావలోకనము

## 1. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ

ఓరియంటల్ జర్నల్ (1977) అక్టోబరు

1980 లో ప్రకటితము. వాల్యూము 20. పు. 19

**విశ్వనాథ రామకథా భాష్యకారిత్వము**

రచన: యం. ప్రభాకరరావు (యం. ఏ.)

ఇదియొక ప్రగాఢ పరిశీలనాధరితమైన విమర్శ. విద్వదుస్మీలనా రమణీయమైనది. శ్రీమద్వాల్మీకి రామాయణమునకు అనువాదముగా కాక—రామకథా భాష్యముగా శ్రీ విశ్వనాథ శ్రీమద్రామాయణ కల్పవృక్షమును సృష్టించెను. కల్పవృక్షమనుటలో వాల్మీకము కంటె కించిన్న్యూనముని ధ్వని.

శ్రీవిశ్వనాథ రామకథా భాష్యకారిత్వమును, వాల్మీకమునకు తుల్యసంచారిగా నున్న రచనా పరిష్కృతయు, యీ రచయిత సమగ్రదృష్టితో సమీక్షించి, విద్వత్తు గుబాళింపగా ప్రకటించిన పరిశోధన వ్యాసమిది.

పాశ్చాత్య సాహిత్య విమర్శలను అనుకరించువారు కన్నులు తెరచి మన సాహిత్య విమర్శ సంప్రదాయ మెట్టిదో గ్రహించుటకు ఆదర్శవంతమైన పరిశీలనమిది. యువకుడైన యీ వ్యాసకర్త యింతోధిక కృషితో మరికొన్ని ఉత్తమ సాహిత్య విమర్శ గ్రంథములను రచింపగలడని ఆశింపవచ్చును. (తురాపాట్)

## 2. మహాపౌరుషము

రచన: శ్రీ కారుమంచి కొండలరావు

వెల: రూ. 4-00

ప్రచురణ: విమలానంద భారతీ గ్రంథమాల, గాంధీనగరము, విజయవాడ.

ఇది రామాయణ కథాసంపూర్ణమైన నాటకము. రామాయణగాథనంతయు (కాండకు నొక్క యంకముగా) ధర్మవ్యాఖ్యానరూపముగా రచనాకౌశలముతో రూపు కట్టించినదీ నాటకము. శ్రీ కొండలరావుగారి ధర్మవ్యగ్రత—సులభసుందరమైన శైలి, తత్త్వప్రబోధ మనసూత్రమున ధర్మానుశాసన సన్నివేశములు మణులుగా పొదిగించుటవంటి గుణబహుళి సంకలితమీ గ్రంథము.

రామాయణ కథాప్రియులు, ధర్మప్రియులు, సాహిత్య భావుకులు, సర్వాస్తికజనులు ఆదరింపవలసిన గ్రంథమిది. (భావుకశేఖర)

# అనుగ్రహ సౌలభ్యము

తన్ను విశ్వసించువారికి భగవంతుడెప్పుడును సులభుడే. భగవంతుడు తన సౌలభ్యమును పెక్కు పర్యాయములు మనకు ప్రదర్శించుచునే యున్నాడు—ముఖ్యముగా శ్రీకృష్ణావతారమున—బాల క్రీడలలో.

లీలాశుకుని శ్రీకృష్ణ కర్ణామృతమునందొక శ్లోకము కలదు. (యద్ రోమ రంధ్ర—II-27) భగవంతుని యజ్ఞవరాహ అవతారమున ఆయన రోమ రంధ్రమును నింపుటకైన సముద్రములన్నియు కలిసినను చాలవట. కాని భగవంతుని శ్రీకృష్ణావతారమున యశోదాదేవి తన దోసిటి పట్టిన నీటితో ఆయన శరీరమునంతయు కడుగ జాలినదట.

మరియొక భక్తశిఖామణి చెప్పినాడు—బాలకృష్ణునికి స్నానము చేయించుచు తల్లి యశోదాదేవి ఆయన కాళ్ళు చేతులను కదలకుండ గట్టిగా పట్టుకొని—ఆయన నోటిని తెరచి నాలుకను శుభ్రము చేయబోగా ఆ నోటిలో ఆమెకు సర్వజగత్తులు కల్పించినవట.

శ్రీకృష్ణుడు మన్ను తిన్నాడని తోటి బాలకులు చెప్పగా తల్లి యశోదాదేవి ఆయన నోటిని తెరచి సర్వలోకములు చూచినదని ఆంధ్రమహాభాగవతమున పోతన్నగారు (కలయో! వైష్ణవ మాయయో!) సుందరముగా వర్ణించిరి. అట్లే వరహావతార ఘట్టము కూడ పోతన్నగారి రచనలో అద్భుతముగా నున్నది.

మరియొక చక్కని సంఘటన—స్నానములు చేయునప్పుడు పసుపు పూసికొనుట మనదేశమున స్త్రీల అలవాటు. గోపికలు పసుపుకొమ్ములను కొని తెచ్చుకొనుటకొక అంగడికి పోయిరి. వారివెంట బాలకృష్ణుడు వెళ్ళెను. వారు పసుపు కొమ్ములను తీసికొని రంగు చక్కగా నున్నదో లేదో తెలిసికొనుటకు నీలమేఘశ్యాముడైన శ్రీకృష్ణుని శరీరమున రుద్దిరి. ఆ శరీరము బంగారు వన్నెతో తళతళలాడినది. ఆ పసిడి రంగు మేనితో గృహమునకు తిరిగిరాగా యశోదాదేవి దిగ్భ్రమ చెందినది. భగవంతుడు గోపికల చేతులలో కొయ్యబొమ్మవలె నైనాడని శుకుడు ఆశ్చర్యచకితుడైనాడు కదా! (గోపిభిః స్తోభితో అనృత్యద్ భగవాన్ బాలవత్ క్వచిత్ ఉదగావలిక్వచిత్ ముగ్ధః తద్వశోదారు యంత్రవత్ ....దర్శయన్ తద్విదాం లోకే ఆత్మనో భృత్యవశ్యతామ్)

బాలకృష్ణుడు నిద్రలో స్వప్నమున బ్రహ్మామహేశ్వరులు తన్ను దర్శించుటకు రాగా—

"మహేశ్వరా! పద్మాసనా! మీకు స్వాగతము. ఇట ఆసీనులు కండు" అనెను. ఈ మాటలు విన్న యశోదాదేవి—బిడ్డకు దృష్టి దోషము తగిలినదేమోనని భయపడినది. ఆ దృష్టిదోష నివారణకు రక్షలు కట్టించినది (శ్రీకృష్ణామృతముII-58)

యశోద శ్రీకృష్ణుని ఱోటికి కట్టివేసిన సన్నివేశము ప్రసిద్ధమైనది. దానిని కదలించుచు బాలకృష్ణుడు యమళార్జున వృక్షముల చెంతకు పోయెను. ఈ సన్నివేశ మెంత రమణీయమైనది? గోపీ గృహమున ఱోటితో కట్టివేయబడిన శ్రీకృష్ణుని యందు ఉపనిషణ్మణి తేజస్సును గమనింపుడని లీలాశుకుడు సాధకులను హెచ్చరించెను. (విచినుత భవనేషు వల్లవీనాం ఉపనిషదర్థం ఉలూఖలేనిబద్ధం) శ్రీమద్భాగవతమునందు, ఆంధ్రమహాభాగవతమునందు—యీ సన్నివేశము చక్కగా వర్ణింపబడినది.

శ్రీకృష్ణుడు పార్థసారథియై గుఱ్ఱములను నీరు త్రావించి వాటిని నీళ్ళతో కడుగుట—మాలీసు చేయుట—ఎంత రుచిర సన్నివేశము. (నఖనియమిత కంఠూన్ .... దేవకీ పుణ్యరాశిః) ఆయన తన గోళ్ళతో గుఱ్ఱముల శరీరములను దువ్వి వాటికి సుఖము కలిగించెనట. తానే జలము తెచ్చి వాటిని కడిగినాడట. మెడచాచి కొరడాను తలపాగలో గ్రుచ్చి-గుఱ్ఱపు త్రాళ్ళను పంటితో పట్టుకొని-గుఱ్ఱములను నడపించెనట ఆ దేవకీ పుణ్యరాశియైన దేవకీ నందనుడు.

ఇంతకు ముఖ్యమైన విషయ మేమనగా భగవంతుడు భక్తసులభుడు. మనను చేయపలసినది—ఆయనయందు విశ్వాసముంచి మన విధ్యుక్త ధర్మములను మనను నిర్వహించుట.

"అరవింద నేత్రాత్ కృష్ణాత్ కిమపి తత్త్వం అహం నజానే" అని అద్వైత శిఖామణియైన పరమహంస పరివ్రాజకాచార్య వర్యుడు మధుసూదన సరస్వతి—భగవంతుని అనుగ్రహ సౌలభ్యమునే ప్రస్తుతించెను.

---

భారతీయ సాధనలు—7

# స్త్రీల కేది ధర్మము

స్త్రీలు బ్రహ్మవిచారము చేయవచ్చునా? అని పెక్కు పర్యాయములు విన్పించుచున్న ప్రశ్న. దీనికి స్థూలమైన సమాధాన మేమనగా-ప్రతిజీవియు—స్త్రీ పురుష భేదము లేకుండ-వయోభేదము లేకుండా-అందరును భగవచ్చింతన చేయవచ్చునని. ఇందు అభి

ప్రాయభేదము లేదు. శంకాస్పదము కానేకాదు. అయితే వారి కే మార్గము అవలంబనీయ మన్నది మరియొక ప్రశ్న.

సాధనా మార్గములు అనేకములు—అసంఖ్యాకములు. ఏ మార్గ మవలంబించిన ఆరోహణ సులభముగా నుండునన్నది—వారి వారి పరిస్థితులనుబట్టి—వారి వారి జన్మాంతర సంస్కారమునుబట్టి-ఆశ్రమాది ధర్మములనుబట్టి ఉన్నది. అదియంతయు సమ్యగ్దర్శనము చేయగలవాడు గురువు. అందుకనియే గురువును ఆశ్రయింపుడని శాస్త్రములు, పెద్దలు పదే పదే చెప్పుట.

నిర్గుణమైన పరతత్త్వమును చంచలమైన మనస్సుతో లక్షింప గలుగుట దుస్సాధ్యము. అందుకనియే సగుణాకార దేవతా మూర్తులు (సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా) తద్వారా ఆరోహణము – ఉన్నతకక్ష్యల సాధనము. అయితే యీ సగుణాకార దేవతామూర్తులు మాత్రము మానసిక ఏకాగ్రతను సంధించుటకు పరిచితములు కావే?

అదికూడ నిజమే. పరిచితమైన మాతృ-పితృ-ఆచార్య-రూపములను దేవతాత్వ నిధులుగా భావించి మానసిక ఏగాగ్రత సాధించి తరింపుడని శ్రుతి చెప్పుచున్నది. (మాతృదేవోభవ, పితృదేవోభవ ఆచార్యదేవోభవ).

స్త్రీల విషయమున మరియొక సౌలభ్యము. తమకు అత్యంత ప్రియమై-సర్వభోగములకు ఆధారముగానుండి-తమ తమ మనస్సులకు నిరంతర విహారస్థలముగానున్న భర్తను దైవమని భావించి-మానసిక ఏకాగ్రత సాధించి ఉన్నత కక్ష్యలు ఆరోహింపవచ్చును. ఇదే మన వారు పాతివ్రత్యధర్మమని చెప్పుచున్నారు. ఇందువలన ఇహ పర సాధనమున్నది. ఇహమునందు సాధ్యము అగుదానికంటె పరమందు సాధింపబడునది మిక్కుటము.

ఇంత సులభమైన మార్గము తమకుండగా దానిని పరిత్యజించి అందని ప్రమాని పండ్లకు అఱ్ఱులు చాచుట తగునా? అసలు భక్తి యందు మధురభక్తి రహస్య మింతేకదా? శ్రీకృష్ణచైతన్య మహా

ప్రభు — మన తాళ్లపాక అన్నమాచార్యులుగారు — పురుషులై యుండికూడ-యీ మధురభక్తి మార్గమున తరించినవారుకదా?

కొంతమంది ఉత్తమస్త్రీలకు కూడ-యీ మార్గమును అనుసరించుటకు వీలుకాక పోవచ్చును. గృహిణిగానున్న స్త్రీ-ముందు తన గృహిణీధర్మమును నిర్వహించుకొన్న తరువాత నే-స్వధర్మ నిర్వహణ. తరువాత నే-మిగిలిన విషయములు.

వైరాగ్యము కలిగి విరాగిగా జీవింపవచ్చును. తప్పులేదు. అయితే ఒకటి జ్ఞాపక ముంచుకొనవలెను. పురుషులతోపాటు స్త్రీలకుకూడ పరివ్రాజకత్వమిచ్చి వారందరిని కలసి ఆరామములందుండనిచ్చి బౌద్ధమతము-కామాలయముల కాకరమై భ్రష్టమైపోయినది.

స్త్రీలు విరాగులై - దగ్గరవారి అండజేరి భగవచ్చింతనతో విరాగి జీవితము గడుపవచ్చును. లేక పదిమంది విరాగిస్త్రీలు కలిసి జీవింపవచ్చును. అంతేకాని "మేము విరాగులము, మాకేమియు ఫరవాలేదు" అని అహంకార గర్వ దర్పముతో పురుషులతో కలసి ఏకమందిరాంతరవాసమునకు పూనుకున్నచో ఫలితము నైతిక పతనమే.

ఇప్పుడు ప్రస్తుతము కొందరు కుహనా సన్న్యాసులు తాము సాక్షాత్తు పరమేశ్వరుల స్వరూపులమని ప్రచారము కావించుకొనుచు - త్రైలోక్య దేశికులమని డాంబికములు పలుకుచు-ప్రమత్తలైన స్త్రీలను ఆకర్షించుచు-వారిని బ్రహ్మవాదినులుగా బ్రహ్మవిద్వరిష్ఠులనుగా చేయుదుమని విశ్వాసము కల్పించి-వారికి సన్న్యాసమిచ్చి కాషాయరమ్య వల్కలములను కట్టించి-తమకు అంతర్జనముగా చేసికొని వారితో ఏకాంతవాసము చేయుచు-త్రిలోక వంచన చేయుచున్నారు. ఇది మన మతము అంగీకరింపని ప్రవర్తన. మన శాస్త్రములు సమ్మతింపని పద్ధతి. ఆధ్యాత్మిక భూమికలో అహేతుకమైనది. సర్వులును గర్హింపవలసినది. అట్టివారు భ్రష్టబౌద్ధ పరివ్రాజకులకంటె హీనులు. సనాతన మతమును వారు త్యజించిన వారన్నమాట.

అట్టివారి ఉచ్చులకు లోబడకుండ స్త్రీలు భగవచ్చింతన

చేయుచు - స్వధర్మపాలన కావించుకొనుచు - సంఘమునందు సమున్నత గౌరవమును పొందుచు - ఆధ్యాత్మిక సాధనా పురోభివృద్ధి సాధించుకొనవచ్చును.

—బ్రహ్మాదేవి

## పాఠకులతో

పాఠకులకు శ్రీ శంకరకృప ప్రత్యేకముగా విన్నపము చేయవలసిన ఆవశ్యకత వచ్చినది.

దిన దినమునకు జీవితమున ముఖ్యావసర వస్తువుల ధరలు పైకిపోవుట పాఠకులందరకు అనుభవములో నున్నదే. అట్లే కాగితపు ధరలును దిన దినమునకు పెరుగుచున్నవి. అచ్చుకమున (ముద్రణాలయమున) శ్రామిక భత్యములు పెరుగుటతో పత్రిక ముద్రణ వ్యయము కూడ నానాటికి పెరుగుచున్నది.

అయినప్పటికి ఎన్నో ఖర్చులను తగ్గించినను పత్రిక ధరను పెంచకుండ చూచుట దుర్భరముగా నున్నది. పత్రికను స్వయంపోషకముగా చేయుట బహుకష్టసాధ్యముగా నున్నది.

ఎట్టి పరిస్థితులందైనను - పత్రిక సాగుచునే యుండవలెనన్న బహుజన అభీష్టమును గుర్తించి భారమును భరించి సాగించుచునే యున్నాము.

ప్రతి నెలలో - పత్రిక అసాధారణ మనోజ్ఞమైన వ్యాసములతో నున్నదని పాఠకులు వ్రాయుచున్న అసంఖ్యాక ప్రశంసాలేఖలు కొంత ఆశాజనకముగా నున్నవి.

మేము కోరునదేమనగా - పాఠకులు ప్రతియొకరు పదిమంది నూతన చందాదారులను చేర్పించి పత్రికా నిర్వహణకు తోడ్పడుడని. ఇది కష్టమైన పని కాదు.

మా అభ్యర్థనమును పాఠకులు మన్నించి సహకరింతురని ఆశించుచున్నాము.

**తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు**
సంపాదకుడు.

**ఆకెళ్ళ సత్యనారాయణ**
ప్రకాశకుడు.

# శ్రీ జగద్గురు భారతీతీర్థస్వామివారి వార్షిక వర్ధంతి

శ్రీ శంకర భగవత్పాద ప్రతిష్ఠాపిత దక్షిణామ్నాయ సుప్రసిద్ధ, శ్రుతి స్మార్త యజుర్వేద పీఠమైన శ్రీ శృంగేరి శారదాపీఠమునకు ప్రస్తుతము జగద్గురు పీఠస్థులైన శ్రీ జగద్గురు అభినవ విద్యాతీర్థమహాస్వామివారు వారికి ఉత్తరాధికారులుగా నిర్ణయించిన శ్రీ జగద్గురు భారతీతీర్థస్వామివారికి వార్షిక వర్ధంతి దుర్మతినామ సం॥ర చైత్ర శు॥ షష్ఠి శుక్రవారం (10-4-1981) నాడగుచున్నది.

శ్రీ శృంగేరీ శారదాపీఠమందు సహజముగా భక్తి ప్రపత్తులు కలిగిన శంకర భక్తసు పాఠకుల సహకారమున గత సం॥రాలలో శ్రీ జగద్గురువు సన్నిధానమువారి వర్ధంతి ఉత్సవములందు పాదపూజలు చేసితిమి. ఈ సం॥రము కూడ అట్లే చేయవలెనన్న పాఠకుల కోరిక మేరకు అదే విధముగా చేయదలచితిమి.

కాబట్టి పాఠకులు తమ శక్తికి తోచినది వారి—రు. 6/-లకు తక్కువ కాకుండా ఈ క్రింది చిరునామాకు—వర్ధంతి పూజానిధికి అని వ్రాసి—మనియార్డరు పంపగోరు చున్నాము. ఆనాడు పాదపూజచేసి శ్రీ జగద్గురువుల సన్నిధినుండి ఆశీర్మంత్రాక్షతలు శ్రీ శారదా చంద్రమౌళీశ్వరుల ప్రసాదము (కుంకుమ)—విరాళములు పంపిన వారికి—పోస్టుద్వారా చేయించెదము. ముందుగా పంపినచో ఏర్పాట్లు సుకరమగును.

ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి
శ్రీ శంకరకృప పబ్లిషర్స్,
6-3-609/18 ఆనందనగరు,
ఖైరతాబాదు హైదరాబాదు—500 004.

# శ్రీ శంకర కృపా

సంపాదకులు: తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు




సంపుటి 20 } శంకరశ్శంకర స్సాక్షాత్ వ్యాసో నారాయణో హరిః { సంచిక 7

## శ్రీ శంకర భగవత్పాదాచార్య విరచిత

## శ్రీమత్త్రిపురసుందరీ వేదపాద స్తోత్రము

శ్లో॥ దరిద్రం మాం విజానీహి సర్వజ్ఞాఽసియతః శివే

దూరీకృత్యాశు దురితమథానో వర్ధయారయిమ్॥ 58

తా॥ ఓ శివా! నీవు సర్వజ్ఞురాలవు కాబట్టి నన్ను దరిద్రునిగా తెలిసికొనుము. నా పాపమును శీఘ్రముగా పారద్రోలి మరియు మాకు సంపదను అభివృద్ధి పొందింపుము.

విశేషములు: శ్రీదేవి సర్వజ్ఞురాలగుటచేత సర్వము తెలిసి—సాధకుని దారిద్ర్యమునుకూడ గ్రహించునది.

దురిత క్షయము చేయుమని కోరుట సంప్రదాయము. దురిత క్షయద్వారా పరమేశ్వర ప్రీతియగును. ఇది నిత్యస్మార్త సంకల్పమునందున్న విషయము, దురితము క్షయము కాగా దైవీసంపద లభించును.

సంపదను అభివృద్ధిపొందింపుమని కోరుట—శ్రేయస్సు—ఆధ్యాత్మిక సంపదను—లభించునట్లు చేయుమని కోరుటయే. ప్రేయస్సును కోరుట కాదు.

---

## శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి చరణ స్మరణమ్

### వైరాగ్యము

మన హిందూమతము ప్రగాఢముగా పరిశీలించినచో ప్రాపంచిక విషయ పరాఙ్ముఖతను ప్రబోధించుచున్నదని ఆధునిక విమర్శకులు చాలమంది అభిప్రాయ

పడుచున్నారు. సాధకుడు ఉత్తమ స్థితిని సాధించుటకు చేయుచున్న సాధనలో ప్రాథమిక దశలో అతడు నిగ్రహమును స్థిరపరచుకొనుటకు చేయు ప్రయత్నమున— ఇంద్రియ లౌల్య హేతువులకు దూరముగా నుండుటకై—మతి స్థిమితమును పోగొట్టు జనసమ్మర్దమునకు దూరముగా నుండవలెనని తలచవచ్చును. శ్రీ శంకర భగవత్పాదులు—ముఖ్యముగా తమ శ్లోకఖండిక-జీవన్ముక్త ఆనందలహరిలో — జీవన్ముక్తుడు ప్రపంచకోలాహలము మధ్యలో నుండియు దానికి సంబంధము లేకుండ నుండగలడని చెప్పిరి. ఈ సత్యమును విస్పష్టముగా నిరూపించిన మహనీయులు—ప్రముఖ అద్వైత పీఠమైన శ్రీ శృంగేరి జగద్గురు పీఠమును అధివసించిన శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి చరణులు.

మఠ వ్యవహారమున—అది యెంత నిష్కాపట్యమైనదైనను శ్రీ జగద్గురువులు జోక్యము కలుగజేసుకొనలేదు. మఠప్రధానోద్యోగి ఒకసారి శ్రీ జగద్గురువులకు పూలతోటపైన అనురక్తి కలిగింప యత్నించెను. మఠమునందున్న పెక్కు దేవాలయములలో పూజకొరకు పూవులా తోటనుండి వచ్చును. ఒక సాయంత్రమా యుద్యోగి శ్రీ జగద్గురువులను సమీపించి "ఇచ్చట సమీపముననే మంచిపూలతోట నొకదానిని పెంచితిమి. అది బాగా పూలు పూయుచున్నది. దానిని శ్రీ జగద్గురువులు చూడవలెనని నా కోరిక" అని విన్నవించెను. శ్రీ జగద్గురువులు సమ్మతించి, ఉద్యోగి వెంట నడచి పూదోటను చక్కగా పరిశీలనగా చూచి వెనుతిరిగిరి. ఒక్క మాటయు పలుకని శ్రీజగద్గురువుల ప్రవర్తనకా యుద్యోగి నిరుత్సాహపడి "ఈ పూదోట బాగున్నదో లేదో తమ యభిప్రాయమును తెలిసికొనవలెనని తమకు శ్రమ యిచ్చితిని" అనగా శ్రీ జగద్గురువులు "ఏమి? బాగుగనే ఉన్నది" అని పలికిరి. తృప్తిపడని ఉద్యోగి "నేను అడిగిన తరువాత తను రిట్లు చెప్పుట నాకు తృప్తి కలిగింపలేదు. ఇంకా దీనిని అభివృద్ధిపరచుటకు ఏమేమి చేయవలయునో తాము చెప్పుడు!" అని వేడెను. శ్రీ జగద్గురువులు "నీ వింక ఏ పూల మొక్కలను పాతదలచితివి?" అనిరి. ఉద్యోగి "ఫలానా మొక్కలను" అని సమాధానము చెప్పెను. శ్రీ జగద్గురువులు "ఔను, అట్లు చేయవచ్చును" అనిరి.

అప్పుడు ఉద్యోగి యీ క్రొత్త ఆలోచన చేసినది—తానేగాని శ్రీ జగద్గురువులు కాదని—యిట్టి విషయములపై శ్రీ జగద్గురువులకు అనురక్తి కలిగించుటకు ప్రయత్నించుట నిష్ఫలమనీ గ్రహించెను.

ఒకొక్కప్పుడు శ్రీ జగద్గురువుల వైరాగ్యమెంత అపరిమితముగా నుండెడి

దనగా—కొందరు—మత వ్యవహారములను చూచుటకుకూడ నిచ్ఛలేని శ్రీ జగద్గురువులు పీఠాధిపత్యమును త్యజింపవచ్చును కదా' అన్న భావములను వెలిబుచ్చునంతవరకు నుండెడిది. అట్టి భావమును శ్రీ జగద్గురువుల ముందెవ్వరైన వెలిబుచ్చినచో అల్లేచేసి యుండెడివారు. అట్టిది జరిగియున్నచో ఎంతో దురదృష్టము వాటిల్లెడిది. అంతేకాదు. ఒక అద్వైత పీఠాధిపతి — ఆత్మానుభవ సిద్ధి పొందినవాడైనచో — ఆ పీఠాధిపత్యమునకు తగడన్న అసందర్భ ప్రతీతికి అవకాశమేర్పడి యుండెడిది.

1953 సంవత్సరమున శృంగేరిలో జరిగిన సహస్రచండీహోమమును తిలకింపవచ్చిన అశేష జనానీకము శ్రీ జగద్గురువుల దర్శన భాగ్యము కలుగునని అపేక్షించుచుండగా—శ్రీ జగద్గురువుల శాంతికాముకత—ఏకాంతవాసాభిలాష స్పష్టముగా వ్యక్తములైనవి. శ్రీ జగద్గురువులు హోమమునకుగాను చేయబడిన పనుల వివరములన్నియు తెలిసికొనిరి. కాని ముఖ్యశిష్యులు చేసిన విన్నపములను మన్నించలేదు—వారు బయటకు రానేలేదు. తమ గదిలోనే ఉండిపోయిరి. శిష్యస్వాములే అన్నియు సరిచూడవలసి వచ్చెను. ఆయనకు ఏమాత్రము అహంభావమున్నను—ఎంత స్వల్పమైన కీర్తి వాంఛ వున్నను—ఆయన బయటకు వచ్చి—అశేష జనానీకమునకు స్వల్పకాలమైనను దర్శన మిచ్చి వారందరి ఉత్సాహభరిత ప్రణామములను స్వీకరించి ఆనందము పొందువారు. కాని ఆయన రాలేదు. జనమందరు వెళ్ళిపోయిన తరువాత కొన్ని నాళ్ళకు ఆయన బయటకు రాగా ఒక సన్నిహిత శిష్యుడు "వేలాది శిష్యులు తమ దర్శనమునకై వేచియుండిరి. ఉత్సవము జరిగినన్ని రోజులు అందరి ఆలోచనలు తమరిని గురించియే. దూరమునుండియైన తమ దర్శనము లభింపకపోవుట వారికి చాల నిరుత్సాహమైనది. ఈ పరితాపముతో వారు తిరిగిపోయిరి" అని చెప్పెను. అప్పుడు శ్రీ జగద్గురువులు తమ సహజ మందస్మితముతో సహజ ధోరణిలో—"అది చాల మేలు. నేను కన్పించి యున్నచో—వారికున్న వాంఛ వెంటనే తీరిపోయి—వారు వెంటనే నన్ను మరచిపోయి వుండెడివారు" అని సమాధాన మిచ్చిరి. (సశేషము)

---

# శ్రీ జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణుల ఉపదేశములు

కొందరు యోగ విద్యాబలముచేత కొన్ని శక్తులను పొందుదురు. కొందరు ఒక అంజనమును సాధింతురు. ఆ అంజనమును వా రుపయోగించినప్పుడు—జన సమూ

హములో జనము అందరు వారికి కన్పింతురేగాని వారెవ్వరికిని జనులకు కన్పించరు. ఇది యొకవిధమైన అదృశ్యము కాగల శక్తి.

భగవంతుడు పేదవానికీ విధమైన శక్తిని అనుగ్రహించినట్లు తోచుచున్నది. పేదవాడు జనసమూహములో నుండగా అతని కందరును కన్పింతురు. అతనిని మాత్రము ఎవ్వరును గమనింపరు. ఇది గ్రహించవలసిన విషయము.

---

# శ్రీ జగద్గురు భారతీ తీర్థస్వామి చరణుల ఉపదేశము

## (తెంకరైలో శ్రీ చరణులు చేసిన అనుగ్రహ భాషణము)

గంగాపూర ప్రచలిత జటాగ్రస్త భోగీంద్ర భీతా
మాలింగంతీ మచలతనయాం సస్మితం వీక్ష్యమాణః
లీలాపాంగైః ప్రణత జనతాన్నందయం చంద్రమౌళిః
మోహధ్వాంతం హరతు పరమానందమూర్తిః శివోనః

శ్రీ శంకర భగవత్పాదులకు మనము అనుయాయులమని చెప్పుకొన గల్గుట మన అదృష్టము. శ్రీ భగవత్పాదులు అవతరించి యుండకపోయినచో మనగతి యెట్లుండి యుండెడిదో ఊహింపరానిది. శ్రీ భగవత్పాదులు ఉపనిషత్తులందున్న సత్యమును వెల్లడించుచు భాష్యాదుల నుండి వీక శ్లోకివరకుగల బహు గ్రంథములను రచించుటచేత—(సాధకులలో భిన్న తరగతులవారిని దృష్టియందుంచుకొని) దేశమున అద్వైత తాత్త్విక సిద్ధాంతము నిరంతరముగా శాశ్వతముగా నిలచియుండుటకై నాలుగు దిక్కులందు నాలుగు మఠములను నిర్మించుటచేత—కావించిన ధర్మప్రచార మింతింతయని పరిమితు లేర్పరచి చెప్ప వలనుపడదు. ఆయన అల్పవయస్సైన ముప్పది రెండు సంవత్సరములలో కావించిన అద్భుతములను మరెవ్వరూ చేయజాలరని మనమే కాదు—పాశ్చాత్యులు కూడ నంగీకరించుచున్నారు. ఇంతవరకు ఆయనవంటి మేధావి మరొకడు జన్మింపలేదు. మరి ముందు కాలమున జన్మింపడు. శ్రీ భగవత్పాదులంతటి అద్వీయమహాత్ముడు. అట్టి మహాత్ముని అడుగు జాడలలో నడచుకొనుగలుగుట మన భాగ్యము.

ప్రగాఢమైన విశ్లేషణాత్మక పరిశీలనముతో ఉపనిషత్తుల సారము అద్వైత

సిద్ధాంతమని శ్రీ భగవత్పాదులు సిద్ధపరచిరి. మనమొక భావమును దృష్టియందుంచుకొని చూచినచో ఆ భావమే మనకు కన్పించును. ఒక పర్యాయము సాహిత్య విద్వాంసు డొకడు మా పరమ గురువుల దర్శనమునకు వచ్చి—"సాహిత్యమువలన కలుగు రసానందమువంటి దేదైన ఉపనిషత్తు లందున్నదా? నిజమునకు ఉపనిషత్తులే 'రసగ్ హ్యేవాయం లబ్ధ్వానందో భవతి' అని ప్రకటించినవి. కాబట్టి సాహిత్యము వలన రసానందలాభమున్నదని ఉపనిషత్తులే చెప్పుచున్నవి" అనెను.

అతడు సాహిత్య నిమ్నగమగ్నమానసు డగుటచేత తన మనస్సులోని భావమునే ఉపనిషత్తులు కూడ వచించుచున్నట్లతనకి తోచినది. పరమగురువులతనితో—"నీవు దాని నట్లేల అన్వయింతువు 'రసగ్ హ్యే వాయం లబ్ధ్వానందీ భవతి' అనుము. నంది యనగా వృషభము. భావమే మనగా సాహిత్యమునందు మునిగిపోయిన వాడు (మిగిలినవన్నియు విస్మరించి) పశుతుల్యుడని. వాడు మానవుడగు యోగ్యత కల వాడనియే!" అని పలికిరి.

పాక్షిక దృష్టితో చూచినవానికి సత్యము గోచరింపదు. పక్షపాత దృష్టి లేకుండ పరిశీలించినపుడే సత్యము బోధపడును. మహాత్ముడొకడేదైన ప్రవచించి—పలుకునపుడు ఆయన భావ తాత్పర్యము వెల్లడింపబడును. తాత్పర్యమనగా నది. మనము చాల సంగతులను చెప్పుచుందుము. పలుకునపుడు మనసునందున్న భావము తాత్పర్యమగును.

వేదముయొక్క సారమిది యని నిర్ణయించు టెట్లు? ఎవడైన నేదియేని చెప్పినప్పుడు వాని నడిగి తాత్పర్యమును గ్రహింపవచ్చును. వేదము విషయమునందట్లు చేయుటకు అవకాశము లేదుకదా!—వేదము అపౌరుషేయము కాబట్టి. అనగా అది పురుషకర్తృకము కాదని. అది పురుష కర్తృకమైనచో—అది సంపూర్ణముగా విశ్వసనీయమే కాదు. పురుషకృతమైనచో దోషములు చోటు చేసికొనును. అట్టి దోషములలో మొదటిది భ్రమ.

భ్రమ యనగా తప్పుగా అవగాహన చేసికొనుట. ఉదాహరణకు జ్యోతిష్టోమ యజ్ఞమువలన స్వర్గలాభము కాకున్నప్పుడు—స్వర్గలాభమే యని తలచి అట్లె వ్రాయుట. తనకు అవగాహన అయినట్లు కదా వ్రాయుట, తప్పుగా అవగాహన చేసికొన్నచో తప్పుగానే వ్రాయును.

రెండవది ప్రమాదము. సరిగా అవగాహన చేసికొన్నప్పటికీ వ్రాయునపుడు తప్పులు దొర్లవచ్చును. అట్టివి ప్రమాదములు. వ్రాయునపుడు అన్య విషయ మేదియేని మనస్సునందున్నచో ప్రమాదభరితమగును.

మూడవది విప్రలిప్స. సరిగా అవగాహన చేసికొని సముచితముగా వ్రాయ గలిగి యుండియు కావలెనని దురుద్దేశముతో తప్పుదారిని పట్టించుచు వ్రాయుట విప్రలిప్స.

నాలుగవది కర్ణాపాటవము. జ్ఞానేంద్రియముల పైననే ప్రతివాడు ఆధార పడుట. గురువు సరిగా ప్రవచించినను శిష్యునకు శ్రవణలోపమున్నచో—సరిగా ఉపదేశింపబడినను తప్పుగా అవగాహన చేసికొనుటకు అవకాశములున్నవి.

మానవకృత రచనలలో దోషము లుండవచ్చును. భ్రమ, ప్రమాద, విప్రలిప్స కర్ణాపాటవములు. అందుచేత మానవకృత రచన పరిపూర్ణమైన ప్రమాణముగా విశ్వ సింప తగదు. అందుకనియే మీమాంసకులు వేదమును అపౌరుషేయమనిరి. ఉపనిషత్తు లందుకూడ "అస్యమహతోభూతస్య నిశ్వసితమేత ద్యదృగ్వేదో యజుర్వేదః సామ వేదోఽథర్వాంగి రసః" అని యున్నది. (సశేషము)

---

# సంస్కృతభాషను మనమేల ఆదరించి నేర్చుకొనవలెను? (37)

ఈ ప్రశ్నకు మన దేశంలో మేధావివర్గంలో మూర్ధన్య మనీషామణులు సమాధానాలు చెప్పారు. గత సంచికలందు కొన్ని టిని తెలుసుకున్నాము. ఇప్పుడు మరికొన్ని. (సంపాదకుడు)

## శ్రీ జయప్రకాశ నారాయణ

సాధారణముగా భారతీయ హైందవులు తమ ప్రాచీన వాఙ్మయముతో సర్వథా అపరిచితులుగా నున్నారు. వారు విద్యలేనివారు. వారిని గురించి చెప్పవల సినదేమున్నది? అయితే—వారి విషయమున మిక్కిలి సంభావ్యమగునదేమనగా—. గ్రామములలో కథకులద్వారా ప్రాచీన వాఙ్మయ పరిచయము కొంచెము లభించు చున్నది. కాని యీ(వారి)కథకులు రామాయణ, మహాభారత, భాగవతములనుదాటి వెళ్ళరు. చదువుకున్న హైందవులందరు ఆంగ్లభాషా పరిచయము కలవారు.

నేటి భారతీయ విద్యాపద్ధతులలోని దోషమేమనగా — సంస్కృత భాషా ప్రవేశము లభించుట దుర్లభమగుట. అందుచేత దర్శనాది వేదాది గ్రంథములను చూడదలచుకున్నను ఆ భాగ్యము లభించుటలేదు. ఆంగ్లభాష ద్వారా వీటిని కొంత కొంత గ్రహింపవచ్చును. అట్టి ప్రగాఢ ఆంగ్ల పరిచయమున్నవారు చాల తక్కువ.

ఈ పరిస్థితి ఉన్నంతకాలము మనకు మన ప్రాచీన వాఙ్మయము-అపూర్వ అగ్రాహ్య, అగమ్యవస్తువైపోవుచున్నది.

అందుచేత మన మానసిక స్వాస్థ్యము, మన స్వాభావిక వికాసము అణగిపోవు చున్నవి. మన వేదములు, మన దర్శనశాస్త్రములు, హిమాలయ శృంగములగు చున్నవి. ఆ శిఖరమును చేరుట అసాధ్యమగుచున్నది. మానసిక, బౌద్ధిక వికాసము లేకున్నచో మనకు ఆలోచనా స్వాతంత్ర్యము లభ్యముకాదు. మానసిక సాహసము అలవడదు. ప్రాచినతా కుడ్యముల ఆధారముపైన మనము నవీన సాంస్కృతిక భవనము నిర్మింపదలచినచో—ఆ ప్రాచీన కుడ్యములను దృఢము చేసికొనవలెను. వాటి మహిమను తెలిసికొనుట అవశ్యకము.

(జయప్రకాశ విచారధార పుట 273)

---

# శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్య విరచిత అపరోక్షానుభూతి

## వ్యాఖ్యానము: శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

[గతసంచిక తరువాయి]

అవతారిక (136 వ శ్లోకమునకు) కారణమైన మన్ను కార్యమైన కుండలో నున్నదిగాని కార్యమగు కుండ మట్టియందు లేదు. విచారింపగా కార్యము కారణము కంటె అన్యముగా లేదు. అయితే దానికున్న ప్రత్యేకత నామరూపాత్మకమేగాని సత్యమునందు స్వతంత్ర స్థితిలేదు. అందుచేత అసలు మట్టికి ఏదో కార్యము సాధించినట్లు కారణత్వమును అంటగట్టుట కూడ అనవసరము. దాని కారణత్వము సాపేక్షమైనది. సహజమైనది కాదు. అదేవిధముగా బ్రహ్మము సహజముగా కారణత్వము లేని శుద్ధము. గుణరహితము. ఈ భావమును చెప్పుచున్నారు.

శ్లో॥ అథశుద్ధం భవేత్ వస్తుయత్ వై వాచామ గోచరమ్
ద్రష్టవ్యం మృత్ ఘటేనైవ దృష్టాంతేవ పునః పునః॥ 136

తా. (పై శ్లోకములందు చెప్పిన విధముగా) కారణత్వము నివర్తిల్లగా – ఏది వాక్కుల కగోచరమై శుద్ధమై – కార్యకారణతా రహితమైన ప్రసిద్ధమైన వస్తువు

గలదో ఆ బ్రహ్మమే అతడగును. అట్లు మరల మరల దృఢమగుటకై మృద్ఘట దృష్టాంతము చేతనే చూడవలయును.

శ్లో॥ అనేనైవ ప్రకారేణ వృత్తిర్బ్రహ్మాత్మికాభవేత్
ఉదేతి శుద్ధచిత్తానాం వృత్తిజ్ఞానంతతః పరమ్॥ 137

తా. ఈ విధముగా బ్రహ్మాకారమైన వృత్తి కలుగును. ఇట్లు విచారము చేయుచుండగా పిమ్మట శుద్ధచిత్తులైనవారికి వృత్తిజ్ఞాన ముదయించును.

విశేషములు: ఈ విచారము జ్ఞానమునకు సాధనమైన విధముగానే ధ్యానమునకు కూడ సాధనమగునని సూచింపబడినది. వృత్తిజ్ఞానము కలిగి బ్రహ్మరూపమగునని భావము. ముందు ధ్యానరూపమ బ్రహ్మవిషయకవృత్తి - పిమ్మట తదభ్యాసపరిపాక వేళ అఖండాకార వృత్తి కలుగునని భావము.

శ్లో॥ కారణం వ్యతిరేకేణపుమానాదౌవిలోకయేత్
అన్వయేన పునః తద్ధి కార్యే నిత్యం ప్రపశ్యతి॥ 138

తా. తత్త్వవిచారణము చేయునపుడు తొలుత కార్యము కారణము వేరులేదని విచారణ చేయవలెను. పిదప అన్వయముచే కార్యమునందా కారణమును ఎల్లప్పుడు చూడవలయును—కార్యమునందంతటను కారణమే అనుగతమై యున్నదని గ్రహించి ఆ కారణమునే చూడవలయును.

శ్లో॥ కార్యేహి కారణం పశ్యేత్పశ్చాత్కార్యం విసర్జయేత్
కారణత్వం తతోగచ్ఛేదవశిష్టం భవేన్మునిః॥ 139

తా. కార్యమునందు—(ప్రపంచమునందు) కారణమునే (బ్రహ్మము) చూడవలయును. అనగా ప్రపంచము బ్రహ్మమేనని విచారింపవలెను. పిమ్మట కార్యమును విసర్జింపగా బ్రహ్మయొక్క కారణత్వము పోవుచున్నది. అప్పుడు అవశిష్టమైన శుద్ధ బ్రహ్మమే అగుచున్నాడు జ్ఞాని.

విశేషము: కార్యకారణాతీత బ్రహ్మమును మననము చేసిన జ్ఞాని బ్రహ్మరూపుడే అగునని భావము.

శ్లోకములు 138, 139, ముందు 135 శ్లోకమున చెప్పిన భావమునే వివరించుచున్నవి. బ్రహ్మమును తెలియుటకు ముందుగా నామరూపాత్మక ప్రపంచమునకది కారణమని భావించి - ప్రపంచమును విశ్లేషించి పరిశీలింపగా దానికి స్వతంత్ర స్థితి లేదని—అసలు ఉనికి లేదని స్పష్టమగును. ప్రపంచ మిథ్యాత్వము బోధపడగా బ్రహ్మ నిత్యత్వము తెలియును. (సశేషము)

---

# శ్రీ విద్యారణ్య విజయగాథ



7

కాశీకి పోవు మార్గ
మున శ్రీవిద్యారణ్యులు
వింధ్యాద్రికి పోయి
అచ్చట నొక చెట్టు
పైన భయంకరుడై
పడిపోవుచున్నట్లున్న
శృంగి యను బ్రహ్మ
రాక్షసుని టక్కచిక్కిన
వానిని చూచిరి

శ్రీవిద్యారణ్యులు
కరుణాకరులై వానిని
సమీపించి "నీవెవ్వ
రవు? ఈరూపమేమి?
నీవిక్కడనేలనుంటివి?
నీకేమి సహాయము
కావలెను?" అని
ప్రశ్నించిరి.



# వేదాంత న్యాయములు (34)

(న్యాయములవంటి ఉదాహరణలు)

[వేదాంత శాస్త్రముతో సూక్ష్మవిషయములను బోధచేయుటకు కొన్ని ఉదాహరణలు సాధారణముగా నుపయోగించెదరు. ఈ ఉదాహరణలు నిత్యజీవితమునకు సంబంధించినవిగా నుండి-వీటిమూలమున దుర్గ్రాహ్యమైన సిద్ధాంత విషయములను అవగాహన చేసికొనుటకు తోడ్పడును. ఈ ఉదాహరణలవలన-సునిశిత ప్రజ్ఞావంతముకాని సామాన్యుని మేధస్సుకూడ సిద్ధాంతమును గ్రహింపగల్గును. సామాన్యపాఠకులకొఱకు వేదాంత న్యాయముల వివరణములను క్రమముగా ప్రకటించుచున్నాము. సంపాదకుడు]

## వస్త్రధారణము

మానవుడు వస్త్రములను ధరించుచున్నాడు. వస్త్రములు పాతవి కాగా వాటిని త్యజించి క్రొత్తబట్టలు వేసికొనుచున్నాడు.

ఈ ఉదాహరణము శ్రీమద్భగవద్గీతలో చెప్పబడినది. జీవుడు—వస్త్రముల వలె—దేహములను ధరించుచున్నాడని—పాత బట్టలను వదలిపెట్టినట్లు—జీర్ణ దేహములను త్యజించి—క్రొత్త దేహములను ధరించుచున్నాడని—అందుచేత నశించుచున్నవి దేహములేకాని—జీవుడు కాదని—జీవుడు (అనగా ఆత్మ) నిత్యమని వెల్లడి చేయబడుచున్నది.

---

# గురువంశ కథా కథనము

(సంస్కృత మూలము: బ్రహ్మశ్రీ కాశీలక్ష్మణశాస్త్రి గురువంశ కావ్యమ్)

తెలుగు: శ్రీ చెఱుకుపల్లె జమదగ్నిశర్మ ఎం. ఏ.

## త్రయోదశ సర్గము

(గతసంచిక తరువాయి)

పిమ్మట కర్ణభూషణ కాంతులు కదలుచుండ ఉత్తరీయములను నడుములకు చుట్టి ముండిత శిరస్సులయందు పెద్దపెద్ద జుట్టు ముడులు తాల్చి పరస్పర సంభాషణములతో కోలాహాల మొనర్చుచు ద్రావిడ పండితులు వచ్చి చేరిరి. (81) తలలకు గుడ్డలు చుట్టి చేతులలో కఱ్ఱలు విసనకఱ్ఱలు ధరించి బుధుల ననుకొనుచు గంధాక్ష

తలు ధరించువారై తమ భాషయందే ముచ్చటించుకొను తౌలవ దేశవాసులసంఖ్యాక ముగా చేరిరి. (32) పెద్ద పెద్ద ముందుజుట్టు ముడులు కలిగి, ముఖములలో జంకు కన బఱచుచు, దండచ్ఛత్రములను చేతులలో ధరించి నిత్యతైలాభ్యంజనా భ్యాసముచేత నిగనిగలాడుచున్న శరీరములతో నిత్య సదాచారులు నిరంతర సంభాషణ శీలురునగు కేరళులు గుమిగూడిరి. (33) కాక్వాలాపములొనర్చుచు, తెల్లని చక్కని పలువరుస లతో దానిమ్మగింజల నపహసించుచు, నుదుట పొడుగుబొట్లు ధరించి ఎఱ్ఱని లోపలి వస్త్రములతో పైన తెల్లని ఉడుపులు తాల్చి శరవణభవ భక్తులగు కర్ణాటకు లనేకులు వచ్చిరి. (34) కర్ణకఠోర వర్ణము లుచ్చరించుచు, కాళ్ళమధ్య పడుచున్న కట్టుబట్టలతో విశాల వక్షములచేత కవాటములను నిర్జించిన భక్షణ దక్షులైన ఔత్తరాహ పండితులు చెవుల ధరించిన ముక్తామణియుత కుండలములు ధగధగలాడు చుండగా వచ్చి చేరిరి. (35) ముక్కుకొన నుండి తలమీది జుట్టువరకు పొడుగుపాటి బొట్టు పెట్టి దానిపై నుదుటి యందు మసిబొట్టు పెట్టుకొని, భుజాగ్రముల తప్తాంకిత ములు తాల్చి భేరీధ్వనులను మించు గొంతులను విప్పుచు చెవులలో తులసిదళములు తాల్చిన విమత మనస్కులగు మాధ్వనివహము చేరినది. (36)

అప్పుడు కేలదీశ్వర కృపాలబ్ధ పూర్ణ విభవులగు మహామాత్యాదులు సుబ్రహ్మణ్య పురమున నున్న రాజ సౌధమున అన్ని ఏర్పాట్లు పూర్తి చేయించి అక్కడ ఉంచవలసిన వారినుంచి జగద్గురువుల నచ్చటికి గొనిపోవుట కనేక కానుక లతో వాద్య బృందములతో వినయవంతులై వచ్చి శ్రీవారిని దర్శించుకొనిరి. (37) అక్కడ సమావిష్టులయిన దేశదేశాగత విద్వద్వర్యులు, ఆత్మాను సంధానపరులు, పరమానంద భరితులు నగు పెద్దలెల్లరును జగద్గురు పదయుగ దర్శన మొనర్చికొని విస్మేరాత్ములై యితర నిర పేక్షులై మహానంద మనుభవించిరి. వీరు వారని లేక స్మార్తులు, మాధ్వులు, వివిధ మతములకు చెందిన వారచ్చట నుండిరి. (38) విలినేవే పురము నుండిబయలుదేరిన నిత్యోత్సాహపరులు, మహామునులు నగు జగద్గురువులు సచ్చిదానంద యోగీంద్రుల నెల్లవారు తిరిగి తిరిగి చూచుచు వారి పాదపద్మములకు సాష్టాంగ ప్రణామము లొనర్చుచు బహువిధ స్తోత్రము లొనర్చుచు పరమానందము నందిరి. (39) గుహాప్రసాదమంది కొనుటకు పుణ్యస్నాన మొనర్చుటకు నింత మంచి సమయము మరల లభించదని వచ్చి చేరిన వివిధ దేశ జనములతో నిండిన గుహాపుర వీథుల యందేగుచు జగద్గురువులు జన సమూహమును చూచుటకు తమ ముఖము నటు నిటు త్రిప్పుచుండుట వారి గుహా సమత్వమునకు సూచకముగనే యున్నది. (40)

ఆ గుహాపురము ద్వీపము వంటిది. ధారాద్వయ పరివృతమై వచ్చిపోవు జన సమూహ ములచే కిటకిట లాడుచు నొడ్డు తాకు తరంగహస్తములతో తజ్జనిత ధ్వనులతో మాటిమాటికి తెలుచు పేపనోళ్ళతో అహ్వాన మందించుటయే కాక విచ్చిన కుముదము లచే మహానందమును వ్యక్త మొనర్చుచున్నది. (41) ధారాద్వయ పరివృత మైన ఆ పురమును చూచి బుధవరులు మహానందమునంది ఎల్లప్పుడు అమృతముచే నావృతమగు పవిత్ర పురమున్నదని 'అమృతే నావృతాం పురీ' మను వేదోక్తులవలన వినియుంటిమే గాని కనులతో చూడలేదు. పుణ్యవశమున నిప్పటికా అదృష్టము పట్టినది. ప్రజాయుః కీర్త్యాదులకీ వాహినిని సేవించుకొనవలెనని ప్రశంసించిరి. (42) ఆ గుహాపురమందలి గుహుడు గుహోద్భవుడే. అక్కడ స్వామినిగూర్చి సాగుచున్న సంకీర్తన ధ్వనులు, ఉత్సవ విశేషమునకై మ్రోగుచున్న శంఖభేరీ పణవాది వాద్యధ్వనులు ఒక ప్రక్క దిక్కుల నంటుచు, మరొకప్రక్క పాతాళమున కేగుచున్నట్లు స్వామియున్న బిల ద్వార మొప్పినది. (43) అప్పుడు జగద్గురువులు కనిపించిన వారెల్లరు ప్రణామము లొనరించుచుండ పల్లకినుండి దిగి దారి మధ్యలో గణపతిని చూచి "ఈ స్వామి సజ్జ నుల కభీష్టము లొసంగుటకు హస్తము చాచుచున్నాడు. తన దగ్గరకు రండని భక్తుల నాహ్వానించుచున్నాడు". అని ఆ దేవుని కారుణ్యమును స్మరించుచు ధ్యానించిరి.(44) అట్లు దివాదీపాది సకల రాజబిరుదములతో రాజసింహాసన గురువులగు జగద్గురువులు పురప్రవేశ మొనరించి సకల జనులచే సమ్మానితులగుచుండుట చూచి సహింపలేని కొందరు మాధ్వులు పెద్దపెద్ద పతాకములు తాల్చి శ్రీవారిని నిరోధింపవలెనని గుహుని ఆలయము బహిర్ద్వారము కడ గుమిగూడి యుండిరి. (45) అది గమనించి గురువులకు రాజునకు సన్నిహితులైన జనులు చాలమంది వెండి బెత్తాలవారు, బంగారు బెత్తాలవారు మాత్రమే కాక మామూలు కర్రలు తాల్చిన బహుసంఖ్యాకులు కృష్ణా తటము నుండి పడవలలో వచ్చిచేరి మధ్వసంఘమును చెదరగొట్టిరి. (46) అట్లు తమ్ము తరుముచున్న వారిని చూచిచూచి దేశదేశములనుండి వచ్చి చేరిన మధ్వు లెల్లరు నుదుటితో ఊర్ధ్వ పుండ్రములను తీర్చినవారు, ముఖముల మసిబొట్లు పెట్టినవారు, తప్తాంకితములు కలవారు, తులసి కట్టెలు మోయుచున్నవారు (47) వ్రేలు పొట్టలను చేతులతో వహించుచు, కంఠములందు సూక్ష్మపాత్రలు వ్రేలాడుచుండగా తెల్లని పళ్ళలో, ముఖముల వికాసము తోచుచుండ, చంకలలో కృష్ణాజినపు మడిపొత్తులు తాల్చి సందుల గొందుల బడి పారిపోసాగిరి. (48) కొందఱు ఖలులు తమకు సురక్షిత స్థల మదే యనుచు సాహసించి బిలద్వారమున జొచ్చిరి. కొందరు గుహావిహారణాద్రి

యందలి గుహాలలో చేరిరి. కొందరు నదిలో బడి యీది తప్పించుకొనిరి. ఇట్లు మధ్వ నివహములలో హాహాకారములు చెలరేగినవి. (49) నారిలో కొందరు పంచకాగ్రేసరులు గోడల సున్నము గోకి దానితో విభూతి బొట్లు ధరించి తక్కిన జనులలో కలిసిపోయిరి. మరికొందరు బైరాగులనుండి విభూతి సంపాదించి తమ బిడ్డల లాలాజలముతో తడిపి దానినే తాల్చి జనులలో కలిసిపోయిరి. (50) అప్పుడు కొందరు శైవులు స్మార్తులు కలిసి గుహపురమందున్న భిక్షుక మఠమును క్షణములో మట్టుపెట్టు ప్రయత్నమున నుండుట తెలిసి పరమ దయాళువులగు జగద్గురువులు అట్టి దుష్కార్యము జరుగరాదని నిషేధించి ఆ ప్రదేశమున రక్షణకై స్వానుచరులను నియమించిరి. (51) పిమ్మట జగద్గురువులు దక్షాధ్వర హారకుమారుని ఆలయమునకు ప్రదక్షిణ మాచరించి పరివార దేవతలను కొలిచి సోదరసహితుడైన భుజగరూపుడై యున్న సుబ్రహ్మణ్యుని నమస్కరించి భక్తితో మహాధనము కర మర్పించి ఆ స్వామిని స్తుతించిరి. (52) స్వామి పుష్ప ప్రసాదమును స్వీకరించి సకలాశ్చర్య జనకులగు యోగివర్యులు స్వామి కుత్సవము చేయుట కధికారుల కభ్యనుజ్ఞ నొసంగి తాము తమ శిష్యులతో కలిసి సమస్త బిరుదములతో వందినుతులు సాగుచుండ స్వీయమఠమును చేరుకొనిరి. (53) చంపాషష్ఠినాడు ఉషస్సమయముననే జరిగిన సుబ్రహ్మణ్య రథోత్సవమును తిలకించి ఆనంద సాగర నిమగ్నులైన యతి వర్యులు భువన విస్మయకర మగు ప్రసాదస్నాన మొనర్చిరి. (54) తరువాత స్వామికి భుజగరూపుడై యున్న శరవణభవునకు మయూరాందోళి కోత్సవము మహావైభవముతో జరుగగా దానిని చూచి ఆనాడు చాల ధనము వ్యయమొనర్చి విశేషోత్సవములు కొన్ని చేయించి బుధజన వినోదులగు గురువర్యులు స్వామి నిట్లు నుతించిరి. (55) హే కుమారస్వామీ! నీవు భక్తుల నను గ్రహించుచు బాల వేషమున నుండి భుక్తాన్న శేషమును ఒడలికి పట్టించుకొను లీలలు ప్రకటించుచు తల్లి యయిన అన్నపూర్ణను మించుచున్నావు. షడ్వక్త్రములు తాల్చి పంచవదన మాత్రుడైన తండ్రిని అన్ని విధముల మించుచున్నావు. అపార సముద్రము వంటి పరమాద్భుత చరిత్రగల నీ మహిమ స్తుతించుటకు నాకేమి సామర్థ్య మున్నది?" (56) ఇట్లు అనేకవిధముల స్తోత్ర మొనర్చి మఠమునకు తిరిగి వచ్చి అసంఖ్యాక భక్తజనులకు తీర్థమునిచ్చి దేశదేశాగత స్మార్త సంఘముల కానందము కలిగించి భయగ్రస్తులైన మధ్వయతి గణములకు పశ్చాత్తాపము కలిగించి శ్రీ సచ్చిదానంద భారతీ గురుకరేణ్యులు దిగ్విజయవంతులై వెలుగొందిరి. (57) (సశేషము)

# శ్రీ శంకర భగవత్పాద విరచిత
# వి వే క చూ డా మ ణి
## (శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామి విరచిత వ్యాఖ్యాసమేతము)

ఆంధ్రీకరణము : డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు(వేదాంత శిరోమణి విద్వాన్)
ఎం. ఏ. (సంస్కృత, ఆంగ్ల హిందీ) పి. హెచ్‌డి.

(గతసంచిక తరువాయి)

మూ. యేన విశ్వ మిదం వ్యాప్తం యంనవ్యాప్నోతి కించన
అభారూపమిదం సర్వం యం భాన్తమను భాత్యయమ్. 130.

ప్ర. అ. యేన=దేనిచేత, ఇదం విశ్వం=ఈ ప్రపంచము, వ్యాప్తం=వ్యాపింపబడినదో, యం=దేనిని, కించన=ఏదియు, నవ్యాప్నోతి=వ్యాపించదో, అభారూపం=అప్రకాశరూపమగు, ఇదం సర్వం=ఇది యంతయు, భాన్తం = ప్రకాశించుచున్న, యం=దేనిని, అనుభాతి=అనుసరించి ప్రకాశించుచున్నదో, అయం=ఇది (ఆత్మ).

వ్యా. అ. అంతటను ఉపాదన కారణమగుటచే సర్వాంతమగు దేనిచే ఈ జగత్తు అంతయు, వ్యాప్తం=విశేషముగ సంబద్ధమైనదో, ఏ వస్తువు కూడ ఏ ఆత్మను వ్యాపింపజాలదో, ఉ వస్తువులన్నియు బాహ్యములుగాన దీనిని వ్యాపింపజాలవు. "విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్" (నేనే జగత్తునంతను ఒక్క అంశతో నిలిపియున్నాను) "వికారావర్తిచ తథాహి స్థితిమాహ" (పరమేశ్వర రూపము వికార సూత్ర గోచరమే కాక అవికారముగ కూడ నున్నది. ఆమ్నాయము వికారభూతములగు సవితృమండలాదులందున్నదియు, తదతీతమునగు ద్విరూపమగు స్థితిని చెప్పుచున్నది). "పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" (భూతములన్నియు ఈతనిలో నాల్గవవంతు మాత్రమే. అమృతమగు ఈతని మిగిలిన పాదత్రయము పైన ఉన్నది) అని స్మృతి—సూత్ర—శ్రుతులు చెప్పుచున్నవి. "జ్యాయాన్ పృథివ్యాః జ్యాయానన్తరిక్షాత్, జ్యాయానేభ్యో లోకేభ్యః" (ఈ ఆత్మ ఈ భూమికంటెను, అంతరిక్షముకంటెను అన్ని లోకములకంటెను పెద్దది) అని కూడ శ్రుతులు చెప్పుచున్నవి. అభారూపం=అప్రకాశరూపమైన, జడమైన "తమేవ భాన్తమను భాతిసర్వమ్" (ప్రకాశించుచున్న ఈ ఆత్మను అనుసరించియే

మిగిలిన వన్నియు భాసించుచున్నవి) అను శ్రుతి ననుసరించి, ఇదియంతయు, చిద్రూప మైన, ప్రకాశించుచున్న, దేనిని అనుసరించి భాసించుచున్నదో అది ఆత్మయని అన్వయము. ఈ శ్లోకమున—"సత్యంజ్ఞాన మనన్తం బ్రహ్మ" అను శ్రుతిచే చెప్ప బడిన అనన్తత్వము దేశపరిచ్ఛేదము లేదు అని చెప్పుట ద్వారా చెప్పబడినది.

మూ. యస్య సన్నిధి మాత్రేణ దేహేంద్రియ మనోధియః
విషయేషు స్వకీయేషు వర్తన్తే ప్రేరితా ఇవ. 131.

ప్ర. అ. యస్య=దేనియొక్క, సన్నిధిమాత్రేణ=సంనిధి మాత్రము చేత నే, దేహేంద్రియ మనోధియః=దేహము, ఇంద్రియాదులు, మనస్సు, బుద్ధి ఇవి యన్నియు ప్రేరితా ఇవ=ప్రేరేపింపబడినవి వలె, స్వకీయేషు=తనకు సంబంధించిన, విషయేషు= విషయములయందు వర్తన్తే=ప్రవర్తించుచున్నదో.

వ్యా. అ. కేనేషితం పతితప్రేషితం మనః, కేనప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః కేనేషితాం వాచమిమాం వదన్తి, చక్షుఃశ్రోత్రంక ఉదేవో యునక్తి" (మనస్సు ఎవనిచే ప్రేరేపింపబడినదై వెళ్ళుచున్నది. ప్రథమ ప్రాణము ఎవనిచే ప్రేరితమై బయల్వెడలుచున్నది? ఎవనిచే ప్రేరితమగు ఈ వాక్కును పలుకుచున్నారు. చక్షుఃశ్రోత్రములను ఏ దేవుడు ప్రేరేపించుచున్నాడు? అని ప్రశ్నించి "శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచోహ వాచంస ఉప్రాణస్య ప్రాణః చక్షుషః చక్షుః" [ఆత్మ శ్రోత్రమునకు శ్రోత్రము; మనస్సునకు మనస్సు; వాక్కునకు వాక్కు; ప్రాణమునకు ప్రాణము; నేత్రమునకు నేత్రము] అని [కేనోపనిషత్తునందు] ప్రత్యుత్త రముగా చెప్పబడిన విషయమును చెప్పుచున్నారు. ఏ ఆత్మయొక్క, సంధిని మాత్రేణ=అభిమాన రూప సంబంధ వశముచేత, దేహేంద్రియ మనోధియః=ఇచట దేహ శబ్దముచే వాక్పాణి పాదాది కర్మేంద్రియములు గ్రహింపబడును. ఇంద్రియ శబ్దముచే శ్రోత్రాది జ్ఞానేంద్రియములు గ్రహింపబడును, మనః=అన్తఃకరణము, ధీః= కర్త్రియగు బుద్ధి, మాటలాడుట, గ్రహించుట, నడచుట, వినుట, చూచుట, స్పృశించుట, సంకల్పించుట, వికల్పించుట మొదలగు తమ తమ విషయముల యందును, లౌకిక వైదిక కార్యములయందును, ప్రేరేపింపబడినవి వలె; జడములకు స్వతః వ్యాపారము ఉండదు కదా? ప్రవర్తించుచున్నదో అది ఆత్మ అని అన్వయము. 131.

మూ. అహంకారాది దేహాన్తా విషయాశ్చ సుఖాదయః
వేద్యన్తే ఘటవద్యేన నిత్యబోధ స్వరూపిణా. 132.

ప్ర. అ. నిత్యబోధ స్వరూపిణా= నిత్యజ్ఞానస్వరూపియగు, యేన=దేనిచే, అహంకారాది దేహాన్తాః=అహంకారము మొదలు దేహము వరకును గల, పంచ కోశములును, విషయాశ్చ=శబ్దాది విషయములును, సుఖాదయః=సుఖాదులును, ఘటవత్=ఘటమువలె. వేద్యన్తే=తెలియబడుచున్నవో.

వ్యా. అ. దృశ్యము ద్రష్టయొక్క ధర్మము కాజాలదు. అందుచే అహంకారాది దేహాంతములగు పంచకోశములును, శబ్దాది విషయములు, వాటివలన కలుగు సుఖాదులును, నిత్యబోధ స్వరూపిగా=స్వతస్సిద్ధమగు జ్ఞానస్వరూపము గల, దేనిచే. ఘటమువలె తెలియబడుచున్నదో అది ఆత్మయని అన్వయము. సుఖాదులు దృశ్యములు గాన అవి ద్రష్టయొక్క ధర్మము కాజాలవు, అందుచే ఆత్మ అసంగమను విషయము చెప్పినట్లైనది. అహంకారాది దేహాన్తములగు ఐదు కోశలములును వేద్యములని చెప్పుటచే సూత్రస్థానీయమగు (ఈ ఘట్టములోని) మొదటి శ్లోకమున (127) చెప్పబడిన పంచకోశ విలక్షణత్వము ఇచట సంగ్రహముగ చెప్పబడినది. ఈ విషయమే ముందు "దేహోయమన్న భవన" ఇత్యాది శ్లోకమున (156) స్పష్టము చేయబడును.

మూ. ఏషా న్తరాత్మా పురుషః పురాణో నిర న్తరాఖణ్డ సుఖానుభూతిః
సదై కరూపః ప్రతిబోధమాత్రో యేనేషితా వాగసవ శ్చర న్తి. 133.

ప్ర. అ. యేన=దేనిచే, ఇషితాః=ప్రేరేపింపబడినవై, వాగసవః=వాక్ప్రాణములు చర న్తి=సంచరించుచున్నవో, ఏషః=ఈ, అంతరాత్మా=అంతరాత్మ, పురాణ పురుషః=ప్రాచీనుడైన పురుషుడు, నిర న్తఖణ్డ సుఖానుభూతిః = నిరంతరములు అఖండములు అగు ఆనంద—అనుభవములే స్వరూపము కలది. సదా=ఎల్లప్పుడును, ఏకరూప=ఒకే విధమగు రూపము కలది, ప్రతి—బోధ మాత్రః=అన్ని జ్ఞానముల యందును భాసించునది.

వ్యా. అ. దేనిచే, ఇషితా=సన్నిధిమాత్రముచేతనే ప్రేరితములై, వాగసవః=వాక్కును, ప్రాణములును, ఇది సకలకార్యకరణ సంఘమునకును ఉపలక్షణము, 'వాక్' అసవః! అని భిన్నపదములుగనైన తీసికొనవచ్చును. వాగింద్రియము, ప్రాణములును, చర న్తి=శబ్దోచ్చారణము ఉచ్ఛ్వాస నిశ్వాసములు మొదలగు తమ తమ కర్మలను చేయుచున్నవో, అది, అ న్తరాత్మా=లోకప్రసిద్ధములును, బ్రహ్మ సాక్షాత్కారమునకు హేతువుగ శ్రుతిచేత గూడ కల్పితములును, బాహ్యములును అగు అన్నమయాది=ఆనందమయ అంతః పంచకోశముల కన్నను అధిష్ఠానముగ నుండుటచే

సర్వానుగతమై, భూఛిద్ర (నేల నెర-దసర్ప)దండ-జలధారాదుల కల్పనకు అధిష్ఠానమై భాసించు రజ్జువువలె భాసించు అంతరాత్మ, పురుషః=పూర్ణుడు లేదా 'పురిశేతే' అనువ్యుత్పత్తిచే శరీరమునందు శయనించువాడు, పురాణః=పూర్వము కూడ ఉన్నను క్రొత్తవాడే: అనగా సనాతనుడు. నిరన్తరానన్త సుఖానుభూతి; నిరంతరం=నిరవధికమైనది. కావుననే, అఖణ్ణం=అపరిచ్ఛిన్నమైన, యేసుఖముకలదో, మరియు నిరంతరము, అఖండము అగు యే అనుభూతి కలదో, తత్స్వరూపుడు." యత్ సాక్షాదపరోక్షాద్బ్రహ్మ" (ఏది సాక్షాత్తు అపరోక్షమైనదో అది బ్రహ్మ) అని శ్రుతి వాక్యము. ఎల్లప్పుడును ఒకే రూపము కలవాడు, అనగా నిర్వికారుడు. ప్రతిబోధ మాత్రః—"బోధే బోధేప్రతి - బోధమ్ ప్రతిబోధం మయతే ఇతి ప్రతిబోధ మాత్రః", సకల బుద్ధి వృత్తుల యందును, కాష్ఠాదులయందు అగ్నివలె, అనుగత రూపమున తెలియబడువాడు అని యర్థము. "ప్రతి బోధ విదితం మతమ్" (ప్రతిజ్ఞానమునందున తెలియదగినది) అని శ్రుతివాక్యము. జ్ఞానరూపత్వము "నిరన్తరానన్త సుఖానుభూతిః" అను పదముచే దెప్పబడినది' (గాన ఇచట ఆ అర్థము గ్రహింప పనిలేదు). లేదా ప్రతిబోధ మనగా గురూపదేశ జన్యజ్ఞానము, దానియందు విషయ మగువాడు 'గురువుచే బోధింపబడినవాడై' (గురుణా ప్రతి బోధితః) అని ప్రసిద్ధము, లేదా నిద్రపోయి మేల్కొనినవాడు (సుప్తప్రతి బుద్ధః) అను ప్రసిద్ధి ననుసరించి, అవిద్యారూపమగు నిద్రను తొలగించు మహావాక్య జన్యమగు అఖండాకార వృత్తిరూపమగు జ్ఞానము ప్రతిబోధము. దానియందు విషయమైనవాడు అని యర్థము. 133 (సశేషము)

---

## చందాదారులకు విన్నపము-ప్రకాశకుని చిరునామా మార్పు గమనింపుడు

చందాలు బాకీయున్నవారికి పత్రిక పంపబడదు. చందా సొమ్మును ముందుగనే (తమ అడ్రసు మార్పుకూడ వెంటనే) క్రింది చిరునామాకు పంపవలెను.

ఆకెళ్ల సత్యనారాయణమూర్తి,
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు,
6-3-609/18, ఆనందనగర్,
ఖైరతాబాదు, హైద్రాబాదు-500004.

# అద్వైత సిద్ధాంతము ముందు పాశ్చాత్యుల పూర్వపక్ష ఖండన

## (ఆచార్య సుందరము)

(శ్రీ శంకర భగవత్పాద అద్వైత సిద్ధాంతము పైన పాశ్చాత్య విద్వాంసులు కొందరు దుర్బలమైన ప్రతిపక్షవాదములు చేసిరి. ఆ వాదముల ఖండన మీ వ్యాసము. —సంపాదకుడు.)

(గత సంచిక తరువాయి)

తరువాత డా. థీబా తీసికొన్న సూత్రము ii, 3, 43. ఈ సూత్రము ముఖ్యమైనదని అతని అభిప్రాయము. ఏల?

"ఆత్మ విస్పష్టముగా బ్రహ్మాంశమని (భాగ) చెప్పబడినది."

ఇది బాదరాయణుని కూలంకష రచనను త్రోసివేయలేదు. అట్లే ఉపనిషత్ప్రవరములైన ఆత్మ - 'నిష్కలం నిష్క్రియం శాంతిం' అనువానిని గాని. 50 వ సూత్రము—'ఆభాస ఏవచ' అనునది సరిగా వ్యాఖ్యానింపబడినచో — ప్రతిబింబ వాదము—జీవుడు బ్రహ్మమునకు ప్రతిబింబమని అందుచేత మిథ్యయని. అయితే 'హేత్వాభాస' అని చెప్పుటకు హేతువేమియు లేదు. ఈ సందర్భమున డా. థీబా చేసిన వ్యాఖ్యానమట్లున్నది.

"ప్రతి సూత్రము—50 సూత్రముకూడ—అల్పాక్షరములతో అవిస్పష్టముగ నుండుటచేత—దానిని అట్లే చూచినచో బహ్వర్థములకు అవకాశమిచ్చుచున్నది—అందు కొన్ని అర్థములు దానికి వ్యతిరేక భావములనుకూడ ప్రకటించును కూడ. అందుచేత సుగమమైన పద్ధతి యేమనగా—యీ సూత్రముల—యావద్గ్రంథ లక్ష్యమేమిటన్నది దృష్టియందుంచుకొనవలెను."

ఇంతవరకు థీబా వాదములను పరాస్తము చేయగలిగితి మన్నచో—శంకరుల భాష్యము బ్రహ్మసూత్ర యావద్గ్రంథ లక్ష్యమును దృష్టియందుంచుకొన్నది యగుట వలననే. థీబా చేసిన చివరి భాషణము—"ఉన్న పరిస్థితులలో—ఏది ఏమైనప్పటికి-యీ సూత్రము—ప్రతిబింబవాదమును—(అది మాయావాదమునకు త్రోవతీయును)-బలపరచుచున్న దనుటకు అవకాశము తక్కువ." అయితే ముందే iii (2) 8 సూత్రము సందర్భముగా సూత్రముల సారము మాయావాదమని ప్రతిష్ఠించితిమి కాబట్టి యీ సూత్రము 50 (ii-3) ముందు చెప్పినిదానిని ధ్రువపరచుచున్నది.

సూత్రకారుడు జీవబ్రహ్మల అభిన్నతను లక్షింపలేదనుటకు డా. థీబా ఎడ

నెడ కొన్ని కొన్ని సంగతులను ప్రస్తావించెను. ఆ సంగతులను వరుసగా పరిశీలింతము. మొనట ముఖ్యసూత్రమని అతడు భావించిన I. 22. సూత్రమును తీసికొనెను. ఆ సూత్రమున ఈశ్వరుడు అధికుడని—అనగా వైయక్తిక జీవునికంటె అధికుడని-భిన్నుడని శ్రుతులు చెప్పుచున్నవి కాబట్టి” అని కలదు. ఇంతకు మునుపే బ్రహ్మజ్ఞానముపై, క్రింది తరగతులు లేవని త్రోసిపుచ్చితిమి. (సూత్రములందట్లు లేదని). అయితే సూత్రములందు సగుణ నిర్గుణ బ్రహ్మముల భిన్నత్వము మాత్రము ఉన్నదని నిరూపించితిమి. జీవబ్రహ్మల భిన్నత్వమును సూత్రములు చెప్పినపుడు బ్రహ్మము సగుణబ్రహ్మ మన్నమాట. నిర్గుణబ్రహ్మము కాదు. ఈ సందర్భమున డా. థీబా వ్రాసిన వ్రాతలు నిరర్థకములు. భూపతనము చెందినవి.

ఉపనిషత్తులలోని యథార్థభావమును దాచిపెట్టుటకు సూత్రకారుడు ప్రయత్నించెనని—లేక అది (సూత్ర గ్రంథము) ఎక్కువగా మార్మిక సిద్ధాంత భరితమని శంకరుల అభిప్రాయముగా థీబా భావించుట పెద్ద పొరపాటు. ఇట్టి పొరపాటు భావనులకు ఆస్కారమే లేదని గట్టిగా చెప్పుచున్నాము. థీబా తానే అంగీకరించెను—“శంకరుల అనుయాయులందెవరియందు గాని—శంకర సిద్ధాంతము గోప్యమైనదిగా సంరక్షించు ప్రయత్నములేదు.” శంకర అనుయాయుల విషయమున నేది స్పష్టమో శంకరుల విషయమునకూడ నట్లే. శంకరభాష్యము నందెచ్చటగాని—బ్రహ్మసూత్రములు మార్మిక సిద్ధాంతమును మాత్రమే చెప్పుచున్నవని వేదాంత సిద్ధాంతమును పూర్తిగా వెల్లడించుటలేదని — సూచనకూడ లేదు. శంకరులు భాష్యప్రారంభమునందు బ్రహ్మసూత్రముల సారమును గురించి వ్రాసిన దిట్లున్నది “అస్యానర్థహేతోః ప్రహాణాయ ఆత్మైకత్వావిద్యా ప్రతిపత్తయే సర్వే వేదాంతా ఆరభ్యంతే యథాచాయమర్థః సర్వేషాం వేదాంతానాంతథావయమస్యాం శారీరక మీమాంసాయాం ప్రదర్శయిష్యామః” ఈ అనర్థహేతువును (అధ్యాస-లేక అంతరఇంద్రియము ఆత్మయన్న భ్రాంతిని) తొలగించుటకును మరియు కేవల ఆత్మైక్యతను గురించిన జ్ఞానము కొరకును ఉపనిషదధ్యయనము ప్రారంభింపబడుచున్నది. ఇది సర్వోపనిషత్తుల ప్రయోజనము, సారము అగుటచేత మేము దానిని ఈ శారీరక మీమాంసయందు-బాదరాయణసూత్రములందు నిరూపించెదము—”

బ్రహ్మసూత్రాపేక్ష లేకుండా ఉపనిషత్సార మేమిటో తేల్చుటకై డా. థీబా—తరువాత ప్రయత్నించెను. అందువలన ఉపనిషత్తులు (సూత్రములవలెనే), శంకరుల వేదాంత సిద్ధాంతమునకు అంగభూతములైన నాలుగు సిద్ధాంతములను నిరూ-

పించుట లేదని చెప్పుట కాయన ప్రయత్నము. ఈ ప్రయత్నము ప్రారంభించుటకు ముందాయన "ఉపనిషత్తులన్నియు ఒకే సిద్ధాంతమును ప్రతిపాదించుచున్నప్పటికి— ప్రాచీన భారతమున పెక్కు భిన్న భిన్న వాదములుండి ఆయా ప్రతివాదముల వారున్నూ తమదే అసలైన ఉపనిషత్సార బ్రహ్మసూత్రసారభూతమైన సిద్ధాంతమని వాదించువారగుటచే—బ్రహ్మసూత్రములు కూడ అదే సిద్ధాంత ప్రతిపాదకములని మనము భావించుటకు వీలులేదు" అని వ్రాసెను. ఇక్కడ డా. థీబా బాధ్యతతో కూడిన వ్రాత వ్రాసినట్లు తోచుట లేదు. బ్రహ్మసూత్రముల సిద్ధాంతమును శంకరులు సరిగా వివరించెనా లేదా అన్నది తేల్చుటకు పూనుకొన్న డా. థీబా తన బాధ్యతను విస్మరించినట్లే స్పష్టము.

భారతమున నున్న విభిన్న వేదాంతవాదములవారికి వారి వారి సంప్రదాయములే చాల ముఖ్యములు. తనకు తానె శంకర సిద్ధాంతమునకు రామానుజ సిద్ధాంతమునకు మధ్య తీర్పరిగా నిలబడిన డా. థీబా-ఏ సంప్రదాయమునకు చెందనివాడగుడు. తనకై తాను పూనుకన్నట్లు—సూత్రముల యథార్థ సిద్ధాంత మేమిటో తేల్చి—ఎవరి వివరణము సరియైనదో—ఎవరి వివరణము సరిగా లేదో నిర్ణయింపవలసియుండగా— ఆ బాధ్యతను నిర్వహింపకుండుటకు కారణ మేమిటో అవగాహన అగుటలేదు.

రామానుజుడు మరికొందరు ప్రాచీన వ్యాఖ్యాతలు ఉపనిషత్తులు మాయా సిద్ధాంతమును చెప్పలేదని అందుచేత బాదరాయణుడు కూడ నట్లే కావించెనని తలచుట తప్పు కాదని—డా. థీబా అభిప్రాయమగుటచేత—విభిన్న వేదాంత వాదములలో దేనిని బాదరాయణుడు బలపరచలేదని కూడ అతడు భావించుటచేత—బ్రహ్మసూత్రములు ఉపనిషదుపదేశమును సక్రమముగా నిరూపించ ప్రయత్నించెనని కూడ తలచుటచేత—యీ రెంటి మధ్య తీర్పు చెప్పినప్పుడే బాధ్యత నిర్వహించినట్లగును. తీర్పు చెప్పుటకు ఆధారములు చూపవలెను. నిజమునకు బాదరాయణుడు తన సూత్రములందు—ఒక శబ్దప్రయోగముచేత—ఒక వాదమును బలపరచియుండెనేని—యితర వాదములవారు బ్రహ్మసూత్రములను ప్రమాణ గ్రంథముగా స్వీకరించియుండెడివారు కాదు.

సత్యమేమనగా—ఉపనిషత్తులవలె బ్రహ్మసూత్రములు కూడా—సనాతన మతమునకు ఆధార గ్రంథముగా అన్ని శాఖలవారిచేత గౌరవింపబడుచు—అందరిచేత సమముగా ప్రామాణికతకు గౌరవస్థానము నందున్నది. (సశేషము)

# నిత్యకర్మలు (25)

(ప్రాతఃకాలమున నిద్రలేచిన తరువాత ప్రతినిత్యమును ప్రతి మానవుడును కొన్ని నిత్య కర్మలను చేయవలసి యున్నది. ఆ నిత్యకర్మ లేవి? ఏట్లు చేయవలెను? ఈ ప్రశ్నలు సామాన్యులకు కలుగుచున్నవి. ఆ యీ ప్రశ్నలకు సమాధానముగా యీ వ్యాస పరంపర ప్రకటించుచున్నాము. —సంపాదకుడు.)

## శుభవస్త్రధారణము

నిర్మలమగు వస్త్రమును "శుచీవోహవ్యా" అను మంత్రముచేత ప్రోక్షింపవలెను. 'దేవస్యత్వా' అను మంత్రముచేత వస్త్రమును తీసి కొనవలెను. "అవధూత గ్ం రక్షోఽవధూతా అరాతయః" అనుచు వస్త్రమును విదలించవలెను.

'ఉదుత్యం జాతవేదస' అను మంత్రముతో మడివస్త్రమును సూర్యునకు చూపించవలెను.

'ఆవహ న్తీ వితన్వానా' అను మంత్రమును చెప్పుచు వస్త్రమును ధరించవలెను.

పిమ్మట ఒక పర్యాయము ఆచమనము చేయవలెను.

"ఉత్క్రామంతు భూతపిశాచా యేభూతాశ్చ నిశాచరాః

ఏతేషామ విరోధేన బ్రహ్మ కర్మసమారభే" అని చెప్పుచు దర్భాసనమును పరచి కూర్చుని సంధ్యావందనాది కర్మల చేయవలెను.

(ఇందు సూచించిన మంత్రములను తెలిపినవారిమండి గ్రహింపవలెను.)

శుభ్రవస్త్రధారణము తరువాత ఊర్ధ్వపుండ్రధారణము - భస్మధారణము - సంధ్యావందనాదులు. ఆ యా కర్మల విధానములు తెలిపినవారినుండి గ్రహింపవలెను.

(ఇంతటితో) 'నిత్యకర్మలు' ధారావాహిక శీర్షికను ముగింపు చేయుచున్నాము.

ఈ శీర్షికలో ప్రకటింపబడిన వివరణములను ప్రశంసించుచు పెక్కుమంది పాఠకులు వ్రాసిరి. వారందరికి కృతజ్ఞతలు. సంపాదకుడు.)

---

## వ్యాసములు-ఎక్స్చేంజి కాపీలు, రివ్యూకి గ్రంథములు

మా పత్రికకు పంపదలచిన వ్యాసములను ఎక్స్చేంజి కాపీలను రివ్యూకి గ్రంథములను (2 కాపీలు) యీ క్రింద చూపిన మా మద్రాసు కార్యాలయము అడ్రసునకే పంపవలెను.

శ్రీ రామలింగేశ్వరరావు,
శ్రీ శంకరకృప సంపాదకుడు,
నెం. 63 కోడంబాకం హైరోడ్డు, త్యాగరాయనగరు, మద్రాసు-600 017.

# గ్రంథావలోకనము

## 1. గీతాభిజ్ఞానము

రచన—సత్యసుధీరత్న యార్లగడ్డ రంగనాయకులు చౌదరి.
సత్యసదనము, పడమటివొంటు, కారంచేడు, చీరాల తా॥ ప్రకాశం జిల్లా.
ప్రచురణ: యార్లగడ్డ వెంకన్న చౌదరి చారిటీస్, మద్రాసు-17.
వెల: 10 రూపాయలు.

ఇది ఛందోగమన ఛాయలలో సంచరించు ముక్తఛందో రచన. అల్పవిషయములను గ్రహించి అనల్పార్థముగా అనల్ప విషయములను గ్రహించి ఓజఃపూర్ణముగా రచింపబడిన సూక్తిముక్తావళి. రచయిత పండితుడగుటచేత వ్యాకరణ చమత్కారములు, పూర్వకవి ప్రయోగ ముక్తాయింపులు గుబాళింపుగా నున్నవి. లౌకిక ప్రపంచ వ్యవహారమున కిది అభిజ్ఞవంటిది. (తురాషాట్)

## 2. ప్రదోషకాల మహిమ

వెల 1-00

## 3. శనిత్రయోదశి మాహాత్మ్యము

వెల: 0-75

సంకలనకర్త: వేమూరి బైరాగిశాస్త్రి, చీలుమూరు.

ఈ రెండు గ్రంథములును శివప్రార్థనా సంబంధములు. బ్రహ్మోత్తర ఖండము నుండి తీసికొనిన సూక్తులకు సముచిత వివరణము వంటివి ప్రదోషకాల మహిమయు, శనిత్రయోదశి మాహాత్మ్యమును. ఆస్తిక జనులు ఆదరింపతగినవి. (పౌరాణిక)

---

# సద్విద్య

శ్రుతి, యుక్తి, అనుభవములపైన ఆధారపడిన అద్వైత సిద్ధాంతమును శ్రీ శంకర భగవత్పాదులు ప్రవచించిరి. శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామివారు—యిటీవలి కాలమున అంతర్ముఖులై శ్రీశంకర భగవత్పాదులు సూచించిన జీవన్ముక్తస్థితి యెట్టిదో లోకమునకు నిరూపించిరి. ఆయన అద్వైత సిద్ధాంతమునకు మూర్తికట్టినవారై సన్నిధికి వచ్చినవారిని ప్రబోధించిరి.

ఛాందోగ్య ఉపనిషత్తున ఆరవ అధ్యాయము సాంప్రదాయికముగా సద్విద్య

అని పిలువబడుచున్నది. తరువాత ప్రకరణమును భూమవిద్య యందురు. శ్రీ శృంగేరి జగద్గురు పరంపరలోని గురువులందరు 'సత్'కు సంబంధించిన ప్రబోధమునే చేయుచున్నారు. గాని అణిమాది సిద్ధుల లబ్ధి కలిగించు యోగభూమికలను ప్రబోధించుట లేదు.

సాధన చేసి సత్తునందు పర్యవసించుటయే సాధనాసిద్ధిగాని—కొన్ని అద్భుతములను ఇంద్రజాలములను చేయగల సిద్ధులను కైవసము చేసికొనుట కానేకాదు.

సామాన్యునికి జగత్తు సత్యముగా తోచును. అతనికా విషయమున సందేహము లుండవు. కలుగవు. బ్రహ్మము మాత్రమే సత్యమని తెలిసికొన్న ముక్తజీవునికి-మిగిలినదంతయు మిథ్యయని గ్రహింపబడుటచేత—నిజముగా నతడు జ్ఞానజాగరితుడగుటవలన—శంకలు లేవు. సందేహములు లేవు. కలుగవు.

మేధావిగా చలామణి అగుచున్నవానికి—తాత్త్వికునిగా జీవనము గడపుకొనుచున్నవానికి పరిష్కారములేని సందేహములు. అవి ఆధారరహితములు.

అపరిణామి—నాశరహితము—అగు సత్తు దేశకాలాతీతము. అందుచేత జ్ఞానేంద్రియాతీతము. అవాఙ్మానసగోచరము. ఇంద్రియభరిత హేతువాదమునకందదు. సత్యము, సత్తు—శంకింపరాని స్థితి. అది తెలిసిన వానికన్ని గ్రంథులును వీడిపోవును.

'మాయ' అనునది సత్యమగు దానిని గురించిన సకల ప్రశ్నల నైష్ఫల్యము నకు స్థానము. అదియొక సంయోజనాత్మక భావము.

'నేను చింతన చేయుచున్నాను. కావున నే నున్నాను'—అనుట సరికాదు. "నే నున్నాను కావున నేను చింతన చేయుచున్నాను" అనునది వేదాంతముల మార్గము.

ఉనికిగల ఒకే ఒక పదార్థమగు సత్తును తెలిసికొనుటకే 'ఆత్మానంవిద్ధి' అనిరి మన ఋషులు.

బ్రహ్మసూత్రములు బ్రహ్మయొక్కటే సత్యమని ప్రారంభమగుచున్నవి. అద్వైత సిద్ధాంతము-తదితరమైనదంతయు మిథ్యయనుచున్నది. 'బ్రహ్మైవసత్యమ్—జగన్మిథ్యా-ఒక వస్తువును గురించి తెలిసికొన్నయెడల సర్వమును గురించియు తెలిసికొన్నట్లగును.

ఛాందోగ్య ఉపనిషత్తున ఉద్దాలక మహర్షి సువర్ణమును సువర్ణ వస్తువులను మృత్తికను మృత్తికా వస్తువులను ఉదాహరించెను. "కారణమైన వస్తువు యొక్క-

గుణములను తెలిసికొన్నచో కార్యములైన వస్తువుల యొక్క గుణములన్నియు తెలియును. కార్యము చెందిన మార్పు, నామము—వచించుకొరకు కార్యము కారణము-ఒకేవిధమైన ఉనికి గలవి.

ఈ పై వాక్యములలో కార్యమునకు ప్రత్యేకమైన స్థితిలేదని అద్వైతము వెల్లడించుచున్నది.

భూమ విద్యను సనత్కుమారుడు నారదునికి బోధించెను. అనంతమైనదాని యందే భయమును అతిక్రమించి పరిపూర్ణానందము అనుభవమునకు వచ్చునని. ఈ జగత్తు అంతయు మొదట సత్తు అగు బ్రహ్మముగానే యుండెను. మరి వేరొకటి యేదియు లేనేలేదు, "సదేవ ఇదం అగ్రఆసీద్ ఏకం ఏవ అద్వితీయమ్" జగత్తు లేదని కాదు. బ్రహ్మమునందే ఉన్నది. తెలియకపోయినను అద్వితీయమైన అద్వైతమే కలదు. చీకటిలో త్రాడు పాముగా తోచినను త్రాడున్నది—పాముగా భ్రమ-నిజము తెలియగా భ్రమ అదృశ్యమగుచున్నది.

---

భారతీయ సాధనలు–7

## యోగమార్గ సోపానములు

మానవుని స్వభావమును మార్చుట తేలిక పని కాదు. చంచలమైన మనస్సునకు యోగాభ్యాసము వలన ఏకాగ్రత సాధింపవచ్చును. మనస్సును నిగ్రహించుట వలన ఇహపరలాభములున్నవి. "మనకర్మ మిట్లున్నది. ఏమి చేసినను లాభములేదు" అని భావించుట ఇహపరసాధనా ప్రగతికి మంచిదికాదు.

ఏదియో ఆశాభంగమైనప్పుడుగాని — ఒక పరిస్థితిని యెదుర్కొనుటకు ధైర్యము లేకగాని—తప్పించుకొని పారిపోవుట—చేయతగిన పనికాదు. మంచిది కాదు. ఆంతర చింతన చేయవలెను. అట్లే కొన్ని క్షుద్రశక్తులను సంపాదించుటకు - కొన్ని అద్భుతములను చేయగలుగుటకు—యోగాభ్యాసము చేయుట—ఆడంబరత్వమునకే త్రోవతీయును—మనోనిగ్రహమునకు కాదు. చివర కదిపతనమునకే తీసికొని పోవును.

శ్రేయస్సు—(నిజముగా మేలు) ప్రేయస్సు—(ప్రీతికరమైనది)—లకున్న భేదమును ఉపనిషత్తులు తెలుపుచున్నవి. అది గమనింపవలెను. మనము సాధకులమని గర్వము పెంచుకొనరాదు. అందువలన అన్యులపై ద్వేషము పెరుగును. అది పతన హేతువే.

మనస్సే బంధహేతువు. ముక్తిహేతువుకూడ. మానసిక భావనలను పరిశుద్ధము చేసికొనుచుండవలెను. భావనయెట్లున్న అట్లు మారుననికదా అభియుక్తోక్తి (యద్భావం తద్భవతి). నిజమునకు జగత్తు మనః కల్పితము. నిజాంతర్గతము. భావము దేశకాల సంగమకలితమైనది. అది ఫలమును కల్పింపకుండ సమసిపోదు. కాఁబట్టి పరిశుద్ధమైన ఆలోచన ఆవశ్యకము. రాత్రి నిద్రపోవుటకు ముందు ఆ దినమున చేసిన ఆలోచనలను—పనులను జ్ఞాపకమునకు తెచ్చికొని పరిశీలన చేసికొన్నచో మేలు. మనస్సు నియమబద్ధమగును. ఇట్లు చేయుట ప్రతి క్రియారహితముగా—విలువలను కట్టుటకు కాకుండా — చేయవలెను. అది ఒక పరిశీలన మాత్రమే కావలెను. క్రింద స్థాయిలో మన ఆలోచనలు మన కోరికలకు బానిసలే. కాఁబట్టి మన కోరికలను—అభీష్టములను—వాంఛలను తగ్గించుకొనవలెను.

ఒక పద్ధతి యేమనగా—స్వార్థమును తక్కువ తక్కువ చేసికొని యితరుల యందు (ముందు మన కుటుంబ సభ్యులతో ప్రారంభించి) అధికముగా ఔదార్యమును చూపుట. ఇతరుల దోసగుణను—వారియందున్న దుష్టత్వమును వ్రేలెత్తి చూపకూడదు. ధర్మమువైపు ప్రయాణము చేయుచు ధార్మిక గుణమును పెంపొందించుకొనవలెను. దాని ప్రభావ మితరులపైన కూడ పడును. ఇతరులను సరిగా అర్థము చేసికొనుటకు అవగాహన చేసికొనుటకు—వారివారి దృష్టి పరిస్థితి గ్రహింపవలెను.

దేహమును విస్మరించినకొలది అది మనలను అధికాధికముగా స్వాధీనపరచుకొనుటకు ప్రయత్నించును. దానిని బాధపెట్టనేల? శ్రీకృష్ణ పరమాత్మ అర్జునుని దీని విషయమున హెచ్చరించెను (గీత-17-6) దేహమునకు సేవకుడుగా కాకూడదు. అంతే. చేయవలసినది మనస్సును బలపరచి దాని ఏకాగ్రత సాధించుట.

"యోగః చిత్తవృత్తి నిరోధః" అన్న పాతంజల యోగసూత్రము, మానసిక సమున్నతస్థితి సాధించినప్పుడే సమన్వయమగును. నిత్యజీవితమున సామాన్యులకుకూడ అనుభవమున్న విషయము—ఒక మంచి గ్రంథమును చదువునప్పుడు—అన్నిటిని మరచిపోయి—ఆకలినికూడ మరచిపోయి—చదువుట కలదు. ఈ విధముగా మనస్సు సంలీనము పొందుట ఉన్న స్థితిలో సాధింపవలెను. 'మనస్సు' అనగానేమి? ఎక్కడనున్నది? సమాధాన నిర్వచనములు తేలికగా చెప్పలేము. అయితే మనస్సు ఏమిటో మనకు అనుభవమే. మనము జపము ప్రారంభింపగా మనస్సు కదలును—చలించును—దూరదూరముగా సంచరించును. జపము యాంత్రికముగా సాగును. మనస్సు చేయు సంచారమును గమనింపవలెను. మనస్సుయొక్క విహారమును గమనించుటలో భావనా ప్రవాహమును నియమింపవచ్చును.

ఆత్మ శరీరవాసి. (దేహోదేవాలయ ప్రోక్తః జీవోదేవస్సనాతనః). పగలంతయు లౌకిక విషయలంపటులమై గడుపుచున్నాము. సాయంత్రమువేళ దేవాలయమున దీపము వెలిగింతుము. అది తెల్లవారలు వెలుగవచ్చును. ప్రశాంతవేళల మనము ఆత్మధ్యాన నిరతుల మగుటకిది సాంకేతిక చిహ్నము. యోగాభ్యాసమున తొందర పనికిరాదు. మందగమనమున ముందుకు సాగిపోవలెను.

---

## శ్రీ జగద్గురు భారతీతీర్థస్వామివారి వార్షిక వర్ధంతి

శ్రీ శంకర భగవత్పాద ప్రతిష్ఠాపిత దక్షిణామ్నాయ సంజ్ఞిక, శ్రుతి శిరస్థాన యజుర్వేద పీఠమైన శ్రీ శృంగేరీ శారదాపీఠమున ప్రస్తుతము జగద్గురు పదస్థులైన శ్రీ జగద్గురు అభినవ విద్యాతీర్థమహాస్వామివారు తమకు ఉత్తరాధికారులుగా నిర్ణయించిన శ్రీ జగద్గురు భారతీతీర్థస్వామివారికి వార్షిక వర్ధంతి దుర్మతినామ సం॥ర చైత్ర శు॥ షష్ఠి శుక్రవారం (10-4-1981) నాడగుచున్నది.

శ్రీ శృంగేరీ శారదాపీఠమందు సహజముగా భక్తి ప్రపత్తులు కలిగిన శంకర కృప పాఠకుల తరఫున గత సం॥రాలలో శ్రీ జగద్గురువు సన్నిధానమువారి వర్ధంతి ఉత్సవములందు పాదపూజలు చేసితిమి. ఈ సం॥రము కూడ అట్లే చేయవలెనన్న పాఠకుల కోరిక మేరకు అదే విధముగా చేయదలచితిమి.

కాబట్టి పాఠకులు యెవరికి తోచినది వారు—రు. 6/లకు తక్కువ కాకుండా ఈ క్రింది చిరునామాకు—వర్ధంతి పూజానిధికి అని వ్రాసి—మనియార్డరు పంపగోరుచున్నాము. ఆనాడు పాదపూజచేసి శ్రీ జగద్గురువుల సన్నిధినుండి ఆశీర్మంత్రాక్షతలు శ్రీ శారదా చంద్రమౌళీశ్వరుల ప్రసాదము (కుంకుమ)—విరాళములు పంపిన వారికి—బట్వాడా చేయింతుము. ముందుగా పంపినచో ఏర్పాట్లు సుకరమగును.

ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి
శ్రీ శంకరకృప పబ్లిషరు,
6-3-609/18 ఆనందనగరు,
ఖైరతాబాదు హైద్రాబాదు—500 004.

---

Printed & Published by A. Satyanarayana Murthy,
6-3-609/18, Anand Nagar, Khairatabad, Hyderabad - 500 004.
Printed at KRANTI PRESS, MADRAS-600 001.
Editor : T. Ramalingeswara Rao

# శృంగేరీ వార్తలు

శ్రీ జగద్గురు మహాసన్నిధానము వారు శిష్యస్వామి సహితులై శృంగేరి యందే ఉపనిషదర్థాను సంధానరూప శ్రీ శారదా చంద్రమౌళీశ్వర పూజాదులను నిర్వహింపుచు ఆనందమున నున్నారు.

మాఘ శుక్ల పంచమి సోమవారము (9-2-81) శ్రీ పంచమి దినమున శ్రీ శారదాదేవి ఆలయమునందు—మిగిలిన ఆలయములందు ప్రత్యేక పూజార్చనలు జరిగినవి. శ్రీ చంద్రమౌళీశ్వరునికి ప్రత్యేకాభిషేకములు నిర్వహింపబడినవి. శిష్య మహాజనము అధిక సంఖ్యలో వచ్చి ప్రత్యేక పూజాదులను తిలకించి శ్రీ జగద్గురువుల ఆశీరనుగ్రహములను పొంది ఆనందించిరి.

మాఘ బ తృతీయ శనివారము (21-2-81) శృంగేరిలో శ్రీ శారదాదేవికి మహా రథోత్సవము జరిగినది. ఆస్తిక మహాజనము విశేష సంఖ్యలో విచ్చేసి మహా రథోత్సవమున పాల్గొనిరి—శృంగేరి పౌరజనము యావత్తు మహారథోత్సవమున పాల్గొనిరి. శ్రీ శారదాదేవి రథోత్సవమున కొంత ప్రత్యేకత కలదు. శ్రీ శారదాదేవి వేదస్వరూప, వేదగర్భ, ప్రజ్ఞాన ఘనరూపిణి. అమ్మవారి రథోత్సవమున వేద పండితులు అసంఖ్యాకముగా పాల్గొని వేదఘోష చేయుదురు. అంతమంది ఏక కంఠముతో సుస్వరముగా వేదఘోష చేయగా నది ప్రశాంత వాయుమండలమున తరంగములుగా విజృంభించి-గగనము శ్రవణ గోచర రూపాకృతి సంతరించుకొన్నదై విహరించుచున్నట్లుగా తోచినది. ఉత్సవమున పాల్గొన్న జనమంతయు దివ్యాను భూతి పరమై పులకించినది.

---

# పరిసరములు

మనకందరకు తెలిసిన విషయమొకటున్నది. కోకిలలు చిన్ననాడు కాకి గూటిలోనే పెరుగునట. కాకి కోకిల పిల్లలను తన బిడ్డలుగా తలపోసి పెంచునట. కాని అది గొంతువిప్పగా తన పిల్ల కాదని తెలిసికొని పంపించివేయునట. కోకిల కాకి పిల్లలతో పెరుగుచున్న వేళ—తాను కోకిలనని దానికి కూడ తెలియదు. అప్పుడది కాకిపిల్లలతో నాడుకొన్నది. వాటిని సహోదరులని భావించినది. అట్లే ఆదరించినది. అది కోకిలగా బయల్పడి వెళ్ళిపోయిన పిమ్మట—కాకిపిల్ల యొకటి ముందుకు వచ్చి—"ఆ కోకిలపిల్ల నాతోనే పెరిగినది. నా ప్రక్క పరున్నది. నన్ను 'అన్నా' అని ఆదరించినది. అన్నగా నన్ను కీర్తించినది. గౌరవము నెరపినది. అట్లు

చేసినట్లు నాకడ సాక్ష్యములున్నవి. ఇంతకు నేను చెప్పునదేమనగా—మీరు గౌరవించుచున్న కోకిల నాకు తమ్ముడు. అతనిచేత కీర్తింపబడి గౌరవింపబడిన నన్ను మీరెల తక్కువగా చూతురు? అతనికంటె అధికముగా చూడుడు!'' అని మొర పెట్టుకొనుచున్నదనుకొనుడు. అప్పుడు మీరేమి చేయుదురు?

నవ్వుదురు. 'నీ సాక్ష్యములు నీవు భద్రముగా దాచికొమ్మ'ని చెప్పుదురు. అయితే దానిని కాకిగానే చూచెదరు.

అట్లే కొందరు పరమహంస పరివ్రాజకాచార్యవర్యులైన శ్రీ జగద్గురువులకు పూర్వాశ్రమమున సన్నిహితులమని—గురుస్థానము నందున్నవారమని—అట్లు ఋజువు చేయుటకు తమకడ పత్రములున్నవని — చెప్పుకొనుచు — అందువలన తమ్ము దేశము గౌరవించి బహు సమ్మానములను చేయవలసియున్నదని కరపత్ర ప్రచారమునకు దిగుచున్నారు. జగన్మిథ్యయన్న ఉపనిషత్సూక్తిని నమ్మిన వారికి సాక్ష్యాధారముల ఆవశ్యకతయేమి. మహాత్ముడెట్టి ఉన్నత పరిచయములు లేకపోయినను గౌరవింప తగినవాడే. అట్టి వానికి సర్టిఫికెట్ల అవసర మేమున్నది. 'చేతకాని వాజమ్మకు—చేతినిండ సర్టిఫికెట్లు—' అని అభియుక్తోక్తి.

తాను ఘనుడనని ప్రచారము చేసికొనువాడెప్పుడును అల్పుడే. జనమును వలలో వేసికొని ధనార్జన చేయవలెనన్న దురాశతో విచిత్ర ప్రచార కల్పులైన కుహనా మస్కరులను విశ్వసింపరాదు.

నిజమైన సాధనా తృష్ణకలదేని—అవ్యాజ కృపా వాత్సల్య మూర్తులైన శ్రీ జగద్గురు మహాసన్నిధానము వారిని దర్శించిన చాలును. సుకృతము ఫలించును.

# జ్ఞానము-సిద్ధులు

“ఎప్పుడెప్పుడు ధర్మగ్లాని, అధర్మము విజృంభించునో, అప్పుడప్పుడు నేను అవతరింతును” అని శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతయందు (IV—7) మనకు అభయ మిచ్చెను. ఆ అభయ వాక్యములలోని తాత్పర్యమేమనగా—శ్రీ పరమాత్మ అవతారము ఆయా కాలములకు తగినట్లుగా నుండునని. (యదా యదా—యథా తథా)

శ్రీరాము శ్రీకృష్ణాది అవతారములు ప్రధానముగా దుష్ట శిక్షణకు, శిష్ట రక్షణకు. అయితే కేవల జ్ఞానప్రచారమునకుగాను దక్షిణామూర్తియైన పరమాత్మ శ్రీ శంకర భగవత్పాదులై అవతరించి జ్ఞాన సముద్ధరణముచేసి యావత్కాలము భారతమున ధర్మరక్షణ జరుగుటకై చతురామ్నాయ పీఠములను స్థాపించి మఠామ్నాయ శాసనమును లిఖించిరి. అందులో పీఠాధిపతులుగా వచ్చువారు తనవలె చూడబడవలెనని—తనవంటి వారేనని—తనవలె వైరాగ్యమూర్తులని స్పష్టముచేసి పోయిరి. ఈ పీఠాధిపతులలో ఒక్కరొకరు-తమ తమ కాలములకు తగినట్లుగా-అవసరమైనట్లుగా-ఆచార విచార ప్రచారములను చక్కదిద్దుచు పీఠమును నిర్వహించిరి.

శ్రీ శృంగేరీ జగద్గురు పరంపరలో 33వ వారైన శ్రీ సచ్చిదానంద శివాభినవనృసింహ భారతీస్వామివారు చరిత్రనుండి ఛాయలను వెనుకకుతీసికొనివచ్చుటకు ప్రయత్నించి ఎన్నో నూతన వ్యవస్థలను కల్పించియుండిరి. పిమ్మట వచ్చిన శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామివారు అద్వైత సిద్ధి సాధించిన జీవన్ముక్తిని స్థితి యెట్టిదో—స్థిత ప్రజ్ఞుడనగా నెట్లుండునో చూపుటకు ప్రత్యక్షమూర్తిగా శిష్యలోకమునకు దర్శనమిచ్చిరి.

నేడు శ్రీ జగద్గురు అభినవ విద్యాతీర్థ మహాస్వామివారు—శ్రీ శంకర భగవాత్పాదులవలె—ఆసేతుశీతనగపర్యంత భూమియందు విస్తారముగా సంచరించి—నిద్రితమైయున్న భారతమున ఆధ్యాత్మిక సంచలనము కలిగించి పునర్జాగరణోద్యమము నిర్వహించి—తాము కాలు పెట్టిన చోటులందెల్ల నూతన దేవాలయ నిర్మాణములతో—పూర్వ ధర్మవ్యవస్థల పునరుద్ధరణతో—ధర్మవికాసము కలిగించుచున్నారు. కేవల శాస్త్ర పరిచయమువలన—బ్రహ్మానుభూతి కలుగదని—దానికి సాధన—గురువుల అనుగ్రహము కావలెనని శ్రీజగద్గురువులు పదేపదే చెప్పుచుందురు.

కేవలశాస్త్రజ్ఞానమువలన దుఃఖము నశింపజాలదన్నది గమనింపవలసిన అంశము. (సో అహం భగవో మంత్రవిదేవ అస్మిన ఆత్మవిత్....సో అహం సోచామి) అందుచేత బ్రహ్మ జ్ఞానము అవలంబనీయ మగుచున్నది. (యోవై భూమాతత్ సుఖమ్).

అయితే శంకర భగవత్పాదులు కర్మకాండ భాగమైన వేదమును—(పూర్వమీమాంస) విస్మరించి—జ్ఞానభాగమైన ఉపనిషత్తులనే అనుసరింపుడని చెప్పినట్లు భావించుట సరికాదు. శాస్త్రవిహితమైన కర్మలను నిష్కామముగా చిత్తశుద్ధి కొరకు, దురిత క్షయముకొరకు చేయవలసినదే. కాని స్వర్గాది భోగలాభాపేక్షతో చేయవలసిన యజన కర్మలను గురించిన ప్రసక్తి లేదు.

శ్రీ శంకర భగవాత్పాదులు శాసించినట్లు—నేడు మనకు ధర్మమార్గమును నిరూపించుటకు, ఆచార విచారమునకు శ్రీ శృంగేరి శారదా పీఠాలంకారులైన జగద్గురువులే శరణ్యము. శ్రీ జగద్గురువుల నిత్యచర్యవలన మనము గ్రహింపగల్గుచున్న దేమనగా:—

సహజ స్థితియందున్న స్థితప్రజ్ఞుడగు వాడు సహజముగా అంతర్ముఖుడై—తన నిజస్థితియందే—అనగా తపోవ్యగ్రస్థితియందే ఉండునని. తీవ్రమైన తపస్సు అనగా అంతర్ముఖత్వముతో ఆత్మస్థితియందే వుండుట. అందువలన పరిపక్వస్థితి వృద్ధి యగుచుండును. అనగా పూర్ణస్థితికి గమనమైన లక్ష్యసిద్ధి.

పరిపూర్ణ స్థితియందున్న మహాత్మునికి—బ్రహ్మనిష్ఠునికి సిద్ధులన్నియువచ్చి ఆశ్రయించును. ఆయన కోరకున్నను అవి ఆయనకు వశీకృతములై పోయి—ఆయనను

ఆశ్రయించును. ప్రారబ్ధకర్మవశము—అట్లున్నచో—మహాత్ముడు కూడ ఆ సిద్ధులను ప్రదర్శించుచు క్రీడించును. బ్రహ్మనిష్ఠునికి 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనునది అనుభవమగుట చేత—ఆయన అఖండాత్మ స్థితియందుండుట చేత—జగత్తంతయు ఆయనకు ఆత్మయే యగుట చేత—ఆయన సిద్ధులను ప్రదర్శించుచు చేయునట్టి క్రీడలు కూడ ఆత్మాభిన్నములే అగుచున్నవి.

అయితే ప్రారబ్ధమట్లు లేకున్నచో—ఎన్ని సిద్ధులు వచ్చి తన్ను ఆశ్రయించినప్పటికి—మహాత్ముడు—సిద్ధ పురుషుడు—బ్రహ్మనిష్ఠుడు చలింపడు. తొణకడు. బెణకడు. తరంగములులేని మహాసముద్రమువలె నిశ్చలముగా నుండును. గాలిలేనప్పుడు ప్రశాంత వాతావరణములో సుందరమైన కాసార జలమువలె ప్రశాంత నిశ్చల రమణీయతతో ప్రకాశించును.

సహజ ఆత్మస్థితి యందుండుటయే సర్వశక్తులకు సంపూర్ణమైన స్థితి. ఈ సహజస్థితియందు సర్వశక్తులును పరిపూర్ణస్థితి యందుటవలన ప్రభవించును. అన్నియు ఆ స్థితియందు గుప్తముగా నున్నవన్నమాట. నిద్రాణముకాదు. నిత్యజాగరితములే. బీజస్థితియందు కాదు—పరిపూర్ణ వికాస యుక్తములే. పూర్ణమైన సహజ స్థితియే సకలమును.

జ్ఞాని, జీవన్ముక్తుడు— జనమధ్యమున కూడ—తన సహజస్థితియందే వుండును. అది అద్భుతమైన తపస్సు. ఉపనిషదర్థానుసంధానము. జీవబ్రహ్మైక్య స్థితి సర్వశక్తియుక్తము. సకల సిద్ధియుతము. సర్వ పరిపూర్ణమును.

సిద్ధులు చాలవిధములైనవి. ఒక్కొక్క సిద్ధిని సాధించుటకు ఒక్కొక్క విధమైన సాధన—ప్రయత్నము—కావలసి యున్నదని పాతంజలయోగసూత్రములందు (3వ ప్రకరణము) చాల వివరములతో చెప్పబడినది. అయితే—యీ అతీత శక్తులవలన సమాధికి అభ్యంతరములు ఉత్పన్నమగునని కూడ హెచ్చరింపబడినది.

ఒక్కొక్క సిద్ధిని సాధించుటకు ఎంతో సాధన ఆవశ్యకమై యుండగా—బ్రహ్మనిష్ఠునకు ఆ విధమైన సాధనలేమియు అక్కరలేకుండ అన్ని సిద్ధులు వశములగును. ఆయన సిద్ధులను ప్రదర్శింపవలెనన్న ఉత్సుకతకలవాడుకాడు. సిద్ధులకొరకాయనచేసిన ప్రయత్నములేదు. అవి వచ్చి తమంతట తామే వచ్చి ఆయనను ఆశ్రయించినవి.

బ్రహ్మనిష్ఠులై నిరంతర ఆత్మధ్యాన నిరతులై-విషయపరాఙ్ముఖులై విరాజిల్లిన శ్రీ జగద్గురు చంద్రశేఖరభారతీ మహాస్వామివారు సకలసిద్ధి పరిగతమైన జీవన్ముక్తుని స్వరూపమిట్టిదని మనకు ప్రత్యక్షముగా చూపినవారు. శ్రీ జగద్గురు అభినవవిద్యాతీర్థ

మహాస్వాములవారు వారి అడుగుజాడలలో అనుగమించుచు మనకు ధర్మప్రబోధము-సాధనామార్గ ప్రదర్శోపదేశము చేయుచున్న అవ్యాజకరుణామూర్తులు.

శ్రీ జగద్గురువులను ఆశ్రయించి తరణోపాయమును తెలిసికొనవచ్చును.

---

# శాస్త్రవిహిత సంస్కారములు-కావ్యములలో సూచనలు

జీవునియొక్క వ్యక్తిత్వము రూపుకట్టి అభివృద్ధి పొందుటకు సంస్కారములు ఆవశ్యకములని మన మహర్షులు తెలిపిరి ఈ సంస్కారములు జీవితమంతయు అవలింబింపవలసినవిగా నున్నవి. జన్మకు కారకులైన తల్లిదండ్రులు చేయవలసినవి కొన్ని, తరువాత జన్మధరించిన జీవి మరణకాలమువరకు చేయవలసినవి మిగిలినవి.

ఒక చిత్రపటముయొక్క-ఆవరణము-దాని యందు రంగులు చేర్చినకొలది-ప్రకాశమానము అగునట్లుగా సంస్కారములతో బ్రాహ్మణ్యుని వ్యక్తిత్వరూపము వెలుగొందునని అంగిరసమహర్షి పలికెను (చిత్తకర్మ యథా నేకై రాగైః ఉన్మీల్యతే శనైః బ్రాహ్మణ్యమపి తద్వత్ స్యాత్ సమకారైః విధిపూర్వకైః)

ఈ సంస్కారములు నలుబదియనియు అందు ముఖ్యమైనవి పదునారనియు బహుజనాంగీకారము. గర్భాదానం పుంసవనం సీమంతో జాతకకర్మచ...వ్రతాదీయో వేదాంభక్రియావిధి..ఉద్వాహోవివాహ ఆగ్నిపరిగ్రహః త్రేతాగ్ని సంగ్రహశ్చైవ సంస్కారాః షోడశస్మృతాః (పరాశరస్మృతి-పరాశరమహర్షి వేదవ్యాసమునీంద్రుని తండ్రి.)

నేటికాలమునందీ సంస్కారములను చాలమంది విస్మరించుచున్నారు. ఉపనయన వివాహాదులను మాత్రము యేదోమాదిరిగా జరిపించుచున్నారు. అట్లే చివరకు దహనసంస్కారాదులు.

ఈ సంస్కారములను గురించి మన పూర్వ కావ్యములందు చేయబడిన సూచనలు, వివరములు గమనింపతగినవిగా నున్నవి. ముఖ్యముగా వాల్మీకి రామాయణమున—(ఆది కావ్యమున) కన్పించు వివరణములు ఆనంద స్ఫురన్మధుర రమణీయములు. జీవితము అనుభవముతో చక్కదిద్దుకొని సంస్కరించుకొనవలసిన కళారూప క్రియాతుల్యము.

విద్య పరమార్థమును తెలిసికొనుటకై అభ్యసింపవలెననుట—'పరార్థ్యామ్—అధ్యాపయంతి'—అని వాల్మీకి సూచన. శ్రీరామలక్ష్మణాదులకు ఉపనయ సంస్కారము జరిగినదన్న సూచనయే వారు సోదరులు నలువురు శ్రీ వశిష్ట మహర్షి సన్నిధిని అధ్యయనముచేసి వేదపారగులైనారని చెప్పుట.

హనుమంతుని తొలిసారిగా చూచి ఆయన మాటలను వినగా శ్రీరామ

చంద్రుడు—ఆ భాషణము సంస్కారయుతముగా నున్నదని తలచెను. "సంస్కార క్రమ సంపన్నాం....కల్యాణీం వాచం హృదయ హారిణీమ్."

"కౌసల్యా సుప్రజారామ పూర్వ సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్."

ఈ శ్లోకము చాల మందికి తెలిసినదే. బాలరాముని యాగ యాగరక్షణమునకు తీసికొనిపోవుచున్న విశ్వామిత్రుడు—మార్గమధ్యమున నొక రాత్రి శయనించిన రాముని నిద్రలేపెను.

జనకరాజు వశిష్టమహర్షిని సీతారాముల కల్యాణోత్సవమును యథావిధిగా నిర్వహింపకోరెను. (కారయస్వ ఋషిసమ్యక్....రామస్య—క్రియామ్ వైవాహికీమ్ క్రియామ్) వశిష్ట మహర్షి వివాహామునల్లే నిర్వహించెను. వాల్మీకి మహర్షి రామాయణ కావ్యమున—వివాహ వేదికను గురించి పూర్తి వివరములను, పాత్రలను గురించి వివరములను—పేలాలను గురించిన వివరములను, అక్షతలను గురించిన వివరములను. హోమమును గురించిన వివిరములను, పాణిగ్రహణమును గురించి చెప్పెను.

శ్రీ సీతారామలక్ష్మణులు అయోధ్యను వదిలి అరణ్యావాసమునకుపోయి కొంతకాలము చిత్రకూటమునందుండి పిమ్మట మునుల ఆదేశానుసారము గోదావరీ తటమునకు వచ్చి అక్కడ 'పంచవటి' యొద్ద పర్ణశాల నిర్మించుకొనిరి. ఆ పర్ణశాల నిర్మాణమునకు వాస్తుశాస్త్ర వివరణములు—గృహప్రవేశము చేయవలసిన విధి శ్రీరామచంద్రుడు లక్ష్మణునికి చెప్పినట్లు రామాయణమునందున్నది.

దశరథ మహారాజు రామవియోగముతో మరణించెను. ఆయన దేహమునకు దహన సంస్కారములు జరిగినవి. రామ బాణమువలన వాలి మరణించెను. రావణునితో యుద్ధమున గాయపడి రామునికి సందేశమిచ్చి జటాయువు మరణించెను. ఆ తరువాత యుద్ధభూమిలో రావణుడు మరణించెను. ఈ సన్నివేశములతో వాల్మీకి దహనాదితురీయ సంస్కారములను గురించి చెప్పెను. ఇందు జటాయు, వాలి రావణుల తుది సంస్కారములు శ్రీరామచంద్రుని ఆదేశపర్యవేక్షణాదులతో జరిగినవి. (ప్రేత కార్యాని అకారయత్.)

నిజమునకు సంస్కారములన్నియు తాపత్రయాదుల శాంతికొరకు; ఆధిభౌతిక, ఆధిదైవిక, అధ్యాత్మికమైన తాపములు మొదలగునవి సర్వమైన బాధలు శమించి శాంతి పుష్టియగుటకుగాను. ఈ తాపములు శమింపగా చిత్తశాంతి వృద్ధిపొందును. అందువలన సాధనా ప్రయత్నము బలమగును. ప్రయత్నము సక్రమ మార్గమున పయనించును. గమ్యస్థానము చేరును. ఫలవంతమగును.

జీవితముయొక్క లక్ష్యమంతయు పరమార్థమును సాధించుకొనుటకే కదా! ఈ పరమార్థ సాధనా మార్గమున సంస్కారములవలన లభించు సహాయము—దోహదము—అనల్పమైనది. విస్మరింప వీలుకానిది. అందుచేత విధి విహితమైన సంస్కారములను విస్మరింపరాదు. అవలంబింపవలెను. చేసికొనవలెను.

— 0 —

Regd. No. 17?28/59 H/HD 392. SRI SANKARA KRUPA
March 1981

To
Dr. S. Sankaranarayanan
Director
S.V. University
Oriental Research Institute
TIRUPATI Chittoor (Dt)



ఈ సంచికలో



If undelivered please return to:
**A. SATYANARAYANA MURTY,**
Publisher : SRI SANKARA KRUPA
6-3-609/18 Anand Nagar Khairatabad, Hyderabad-500004.

# Tirumala Tirupati Devasthanams, Tirupati

**Would you like to feed the poor among the Lord's Devotees at Tirumala ?**

The Hindu religious literature is replete with legends about the sanctity of poor feeding. Feeding the poor devotees of the Lord, in a holy place like Tirumala is particulary propitious. Equally auspicious and popular is the custom of distribution of the Lord's prasadams to His devotees.

The Tirumala Tirupati Devasthanams have introduced a Scheme-Sri Venkateswara Nitya Prasada Dana Endowment Scheme by which you can distribute either food packets or laddus or Vadas to Pilgrims to Tirumala

You make an endowment of Rs. 500/- to the T. T. D. The annual interest on it will be utilised either to feed 20 poor pilgrims or distribute 15 Laddus, or 15 Vadas to pilgrims in the queue lines once inevery year.

The distribution will be done as desired by you on any day of the year as specified by you-your birth day, wedding anniversary day, your son's or daughter's birthday, your father's or mother's Sraadha day, or any day of other sentimental value to you.

Any number of endowments can be made by a donor and each endowment can be on a different day, as desired. Those who make a minimum of 10 endowments will be provided free darsan for a family of five persons on the notified day ( value Rs 125/- per year on the basis of the present cost of five special Darsan Tickets).

The name and gotra of every donor will be read out at the Koluvu (daily ritual of notification to the Lord) on the day of distribution.

Your contribution to this also earns exemption from Income-Tax and you may kindly quote this while claiming Income - Tax relief in your assessment

Donations may please be sent through the branches of ANDHRA BANK all over India, or by D. D's. of any Bank, in favour of the Executive Officer, T. T Devasthanams, Tirupati to.

The Manager, Andhra Bank T. T. D. Administrative Building, Tirupati-517501 with the following particulars :

1. Name and address of the remitter.
2. Name and address of the person in whose name the performance is to be done.
3. Name and address of the person in whose name the Income-Tax Exemption Certificate is to be issued.
4. Gotram / Family name of the person, in whose name the performance is to be done.
5. Date of performance.
6. Items to be distributed : FOOD PACKETS / LADDU / VADA (only one item is to be noted.)
7. Amount donated : Rs.

The donations are to be made at least 15 days in advance of the distribution day specified by you.

*EXECUTIVE OFFIECR.*

T. T. D's Order No. 02409 / PR4 / ADv-15 / 81 dt. 2-3-81

# శ్రీ శంకర కృప

సంపాదకులు: తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

| సంపుటి 20 | శంకరశ్శంకర స్సాక్షాత్ వ్యాసో నారాయణోహరిః | సంచిక 8 |
|---|---|---|


## శ్రీ శంకర భగవత్పాదాచార్య విరచిత

## శ్రీమత్త్రిపురసుందరీ వేదపాద స్తోత్రము

శ్లో॥ మహేశ్వరి మహామంత్ర కూట త్రయ కళేబరే
కాది విద్యాక్షరశ్రేణి ముశంతస్త్వాహవామహే॥ 59

(దీనియందున్న వేదపాదము యజుస్సంహితలోనిది)

తల్లీ! మహేశ్వరీ! మహామంత్రమైన పంచదశి మంత్రమందున్న మూడు కూటములు (వాగ్భవ, కామరాజ, శక్తి) శరీరముగాగల దానవగు నిన్ను—కకారము మొదటనున్న మంత్రాక్షరముల పంక్తి స్వరూపిణి వగు నిన్ను—కోరి ఆహ్వానించుచున్నాను.

విశేషములు: పంచదశి మంత్రము మూడు కూటములు (విభాగములు) కలది, ఆ కూటములకు వరుసగా వాగ్భవ, కామరాజ శక్తి కూటములని పేరు. పంచదశి మంత్రము పెక్కువిధములు—కాది, హాది, సాది మొదలగునవి. అందుకాది విద్యామంత్రమునకు దక్షిణామూర్తి ఋషి.

మంత్ర అధిష్ఠాన దేవత—మంత్ర (శబ్ద) స్వరూప దేవత—పంచా దానిలోని బీజములు—వలె—అభిన్నములు. శ్రీదేవి పంచదశి కూటత్రయ స్వరూపిణియని, మంత్రాధిష్ఠాన దేవతయని లలితా సహస్రనామావళి యందు కొన్ని నామములు తెలుపుచున్నవి.

శ్రీదేవి మంత్ర స్వరూపిణియని, మంత్రాధిష్ఠాత్రియని మంత్రశాస్త్ర సారమగుట చేతనే—ఆ శాస్త్రమున—శబ్దము—తదర్థముకూడ నిత్యముగా భావింపబడుచున్నవి.

---

# శ్రీ జగద్గురు సచ్చిదానంద శివాభినవ నృసింహ భారతీ మహాస్వామి చరణుల ఉపదేశము

(శృంగేరీ జగద్గురు పరంపరలో 33 వ వారైన (1879-1912) వీరి జయంతి ఆరాధన కూడ యీ మాసమున వచ్చుట చేత ప్రత్యేకముగా యీ ఉపదేశవ్యాసమును ప్రకటించినాము.—సంపాదకుడు).

శాస్త్రములు - సర్వకాలికములు

పెద్ద స్థితిలో నుండి ఆధునిక నాగరికతా మగ్నులైన పెద్దమనుష్యులు కొందరు శ్రీ జగద్గురువుల సన్నిధికి వచ్చి ప్రసంగవశమున నందొకను చక్కని విషయమును ప్రసక్తికి తెచ్చెను.

పెద్దమనిషి: శాస్త్రములందు విధింపబడిన ప్రవర్తన — నిత్యనైమిత్తికాది కర్మల కర్తవ్యత—యీ దినములలో అనుసరింపతగినవిగా లేవు. కాబట్టి కాలాను సారముగ సంగ్రహించి నేటి బ్రాహ్మణులకు ఆచరణ సాధ్యమయిన కనిష్ఠవిధులు నిర్ణయింపబడవలెను. మా కొరకు నేడీ పనిని చేసి పెట్టవలెనని శ్రీ జగద్గురువులకు నా అభ్యర్థన.

శ్రీ జగద్గురువులు: నన్నేల అడిగెదవు! మీరే చేయవచ్చును కదా.

పెద్దమనిషి: మేమెట్లు చేయుదుము! శ్రీ జగద్గురువులు చేయుటయే సమంజ సము—మహనీయమైన ఆధ్యాత్మిక పీఠము నధిష్ఠించిన తమకే బహువిధములుగా నిట్టి యోగ్యతయున్నది.

శ్రీ జగద్గురువులు: ఈ పీఠముపైనున్నవాడు శాస్త్రములందున్నదానిని వివ రించి చెప్పుటయే గాని నూతనమైనదానిని దేనిని నిర్ణయింపలేడు.

పెద్దమనిషి: పరాశరమౌని కలియుగ ప్రారంభమున నొక స్మృతి రచింప లేదా? నేటి వర్తమాన పరిస్థితులకు తగినట్లుగా నొక స్మృతి రచింపబడవలెను.

శ్రీ జగద్గురువులు: పరాశరమౌని కలియుగమునకు స్మృతి రచించెనని నీవే చెప్పితివికదా! మరల నొక స్మృతిని రచింపవలసిన ఆవశ్యకతయేమి? ఇంకను కలి యుగమే నడుచుచున్నది.

పెద్దమనిషి: శాస్త్రములను కాలోచితముగా అన్వయించుటకు ఉదాహరణ ముగా మాత్రమే నేను పరాశరుని గురించి చెప్పితిని. ఆయన నిర్ణయించిన విధులు

ఆయన కాలమునకు తగినవిగా నుండి యుండవచ్చును. ఆ తరువాత నేటికి మానవులు శక్తిసామర్థ్యములు వసతి సౌకర్యములు చాల తగ్గిపోయినవి. అందుచేత మార్పు ఆవశ్యకమగుచున్నది.

శ్రీ జగద్గురువులు: అట్టి మార్పుకి ఆవశ్యకత ఉన్నదని భావించినను — ఆ మార్పు చేయు బాధ్యత నాపై నేల నుంచెదవు?

పెద్దమనిషి: ఈ కాలమున శ్రీ జగద్గురువులొక్కరే మహర్షులు.

శ్రీ జగద్గురువులు: అటులనా? అట్లు వినుట సంతోషకరమే. మన సంప్రదాయమున—ఒక నల్లరాయిని విగ్రహముగా చేసి బ్రాహ్మణులు దానికి మంత్రములచే ప్రాణప్రతిష్ఠ చేసిరేని అది దేవతయై లోకముచేత పూజార్హత సంపాదించుకొనుచున్నది. ఒక బ్రాహ్మణుని కూర్చుండబెట్టి అక్షతలు చల్లి గణపతి స్వరూపుడని తలచినచో అతనికి సమర్పించినవన్నియు మహాగణపతికి సమర్పించినవే అగుచున్నవి. అట్లే నన్ను నీవు మహర్షిగా భావించినందువలన నీకు కొంత మేలు సమకూడుట తథ్యము. కాని ఆ రాయి తానే దైవమనుకొనరాదు. ఆ బ్రాహ్మణుడు తానే మహాగణపతి ననుకొనరాదు. అట్లే నీ మాటలను నమ్మి నేను ఒక మహర్షిని అనుకొనరాదు. నా నిజస్థితిని నేను విస్మరింపరాదు.

పెద్దమనిషి: ఏ మంత్రములను చెప్పిగాని శ్రీ జగద్గురువులందు నేను మహర్షిత్వమును ఆహ్వానించుట లేదు. తమ తపస్సుచేత విద్వత్తుచేత జ్ఞానముచేత తాము నిజముగా మహర్షులే.

శ్రీ జగద్గురువులు: మహర్షులు భూత భవిష్యద్వర్తమాన కాలజ్ఞులును, సర్వజ్ఞులును కదా!

పెద్దమనిషి: తాముకూడ నట్లే.

శ్రీ జగద్గురువులు: అటులనా? ఇప్పుడు కాలానుసారము శాస్త్రములను మార్పుచేయవలసిన ఆవశ్యకత యున్నదన్న విషయముకూడ నాకు తెలియదు. అది నీ నుండి తెలిసికొనవలసివచ్చినది. ఈ స్వల్పవిషయమును తెలియని నేను సర్వజ్ఞుడనగుట నెట్లు? ఎవరో అభ్యర్థించిరని యాజ్ఞవల్క్య పరాశరాదులు తమ తమ స్మృతులను రచించినట్లు తోచుటలేదు. నీచేత ఉద్బోధింపబడవలసిన స్థితిలోనున్న నేను సర్వజ్ఞుడనుకొనరాదు. నేను సర్వజ్ఞుడనైనచో నీవు చెప్పకుండ నాకే తెలిసి యుండి నేనొక స్మృతిని — కాలమునకు ఆవశ్యకత యున్నదని తోచినప్పుడు — రచించి యుండెడివాడను. ఏ విధముగా చూచినను నే నిప్పుడు కల్పించుకొనుట సముచితము కాదు.

మరియు శాస్త్రము శాసనరూపమైనది — శాసింపబడువారి సమ్మతి దాని కక్కరలేదు—అందుచేత ఎవ్వరిని అడుగనక్కరలేదు. మరొక సంగతి. ఒకవేళ నేను నీ అభ్యర్థనమును మన్నించి నేటి కాలానుసారముగ శాస్త్రవిధులను తగ్గించి సంస్కరింతునన్న నమ్మకమేమున్నది? ఇంకను తగ్గింపుడని మరికొందరు వచ్చి అడుగరని నమ్మకమేమున్నది? అసలు నీవు మరొకసారి వచ్చి మరికొంత తగ్గింపుడని కోరవని నమ్మకమేమి? నీ కోరికను మన్నించి మార్పులు చేయుచు పోయిన దానికి అంత మెప్పుడు?

పెద్దమనిషి: శాస్త్ర విధులను తగ్గించుటకు వీలులేనప్పుడు మాకున్న అల్ప వసతి అవకాశములలో వానినెట్లు నిర్వహింపగలమో నాకు తెలియుటలేదు.

శ్రీ జగద్గురువులు: ఏ కాలమునందుగాని శాస్త్రమునందు విధించినవన్నియు చేయుట ఎవ్వరికిగాని సాధ్యము కాదు. తన పరిసరములు, పరిస్థితి, అనుకూల్యతలను బట్టి ఎవనికి వాడే తనకెంత సాధ్యమో అంత నిర్ణయించుకొని ఆ ప్రకారము చేసికొన వలెను. అయితే పరిమితమైన నిర్వహణమువలన సంపూర్ణ ఫలము లభింపదు. తక్కువగా చేయునట్లు విధులను మార్పు చేయవలసినదిగా కోరువారి అభిప్రాయము పరిపూర్ణ ఫలము కావలెననియే. తక్కువచేసి ఎక్కువ ఫలము కావలెనని కోరుట దురాశ కదా! కావున శాస్త్రములను మార్పు చేయవలెనని కోరుటకంటె-శాస్త్రములందు నీవు చేయగలిగినంతవరకు విధులను చేయుట సమంజసము. అట్లు చేయుట శ్రద్ధగా, సంపూర్ణ విధులను చేయలేకపోయితిమన్న తాపముతో నున్నచో భగవంతుడు పరిపూర్ణ ఫలమును తప్పక అనుగ్రహించును. దీనియందు సందేహముండనక్కర లేదు. నీ అనుకూల్యత ఉన్నస్థితికి శాస్త్రములను దిగజార్చు ప్రయత్నము, ఆలోచన విడనాడుము.

---

# శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి చరణ స్మరణమ్

## వైరాగ్యము

(గతసంచిక తరువాయి)

ప్రపంచమునుండి తప్పించుకొనవలయునని గాని పారిపోవ వలెననిగాని శ్రీ జగద్గురువులు భావింపలేదు. తనలోన తాను విశ్రాంతి తీసికొనగల పరమ కళానిధిగా

వారైరి. ప్రపంచమును విస్మరించుట—లేక దానికి తాము సాక్షిభూతులుగా నుండుట—వారికి పరిపాటి. జగత్తు విషయములు వారిని స్పృశింపలేకపోయినవి. నీటిపై తామరపాకువలె అని గీతయందు చెప్పిన ఉదాహరణ మాయనయందు సరిగా నున్నది. అయన బహిర్ముఖుడుగా నున్నప్పుడు మిక్కిలి శ్రద్ధతో మఠపూజాదికములను—తమ ఆశ్రమోచిత విధులను, శ్రద్ధావుళులై వచ్చిన శిష్యులకు మంత్రోపదేశములను చేయుటలు, తమ్ము భక్తితో గాని, కుతూహలముతో గాని, చూడవచ్చినవారికి దర్శనమిచ్చుటలు—యథాక్రమముగ నిర్వహించెడివారు. ఆయినప్పటికి పరిపూర్ణమైన విరాగిత నిలుపుకొనెడువారు.

గల్లంతు చేయుచున్న అధిక జనసమ్మర్దము మధ్యలో (ముఖ్యముగా ఉత్సవ సమయములందు లేక సంచారమునకు వెళ్ళినపుడు) ఏకాగ్రతతో మానసిక స్థిరతతో శ్రీ జగద్గురువులు చేయు పూజను చూచుట—ఒక ప్రత్యక్ష పాఠము—ఆహ్లాద జనకము. ఒకప్రక్క పెద్దగా వేదఘోష. మరియొక ప్రక్క నిపుణులో లేక సాధకులో పూజాకానుకగా సంగీత వాద్యములను వాయించుట—వేరొక ప్రక్క భజన సమాజములు గొంతెత్తి తాళవాద్యములతో భగవన్నామ సంకీర్తనలు చేయుట—పిల్లలు—చంకలోని పసివారు రోదించుట—(ఉండనే ఉన్నది). అన్నిటికి మించి స్త్రీలు పురుషులు—యౌవనులు—వృద్ధులు—ఒకరితో నొకరు ఏవో సంగతులను గొణుగుకొనుట — నిజముగా భక్తితో పూజ కావించుటకు కావలసిన ప్రశాంత వాతావరణమునకివి యన్నియు అవరోధములే. ఇట్టి గంద్రగోళము శ్రీ జగద్గురువుల ఏకాగ్రతకెప్పుడు భంగము కలిగింపలేదు. అయన ఇట్టి శ్రవణేంద్రియ ఆపాతములను వినిపించుకొనకుండ నుండుట కలవాటు పడినవారు. అసలు ప్రకృతి కూడ ఆయనను ఆకర్షించు శక్తి — ఇంద్రియ వ్యాపార కలితుని చేయు శక్తి— కోల్పోయినది.

శ్రీ జగద్గురువుల పుట్టిన రోజునాడు, మధ్యాహ్నవేళ శ్రీ జగద్గురువులు శృంగేరి పుర మధ్యమందున్న మలహానికరేశ్వర దేవాలయమునకు పోయి అక్కడ స్వయముగా దేవతారాధనము చేయుట మఠమునందు బహుకాలముగా నున్న సంప్రదాయము. అక్కడ గర్భగృహము ఆరడుగుల చదరము, అక్కడ శ్రీ జగద్గురువులు కూర్చుని పూజ చేయుచుండగా పరిచారకు డొకడు పరికరములను అందించుటకై తిరుగాడుటకు మాత్రమే అచ్చట చోటు కలదు. (ఒక సంవత్సరము జరిగిన సంఘటన వివరించుట యది.)

శ్రీ జగద్గురువులు మధ్యాహ్న వేళకు వచ్చి దేవాలయ ప్రాంగణమున మరల స్నానాదులను చేసి సరిగా మిట్టమధ్యాహ్నమున గర్భగృహము ప్రవేశించిరి. అది మిట్టమధ్యాహ్నము. బయట వేడి ఎక్కువగా నున్నది. పరిచారకుడా యిరుకు గర్భగృహమునుండి పదేపదే బయటకు వచ్చుచున్నాడు—ధారగా కారుచున్న చెమటను తుడిచి వేసికొనుటకు. ఏమియు పట్టించుకొనకుండ శ్రీ జగద్గురువులు పూజ కావింపతొడగిరి. పూజ ముగించి, దీపారాధన జరిగిన తరువాత శ్రీ జగద్గురువులు సాయంత్రము సుమారు 4 గంటలకు బయటకు వచ్చిరి. అప్పుడు వారు తమ సహజ మందస్మితముతో వెలుపలకు రాగా చూచుటకు ఆయన అలసినట్లే లేరు. ముఖమున శ్రమ చిహ్నములు లేవు. ధరించిన భస్మ త్రిపుండ్రమట్లే చెక్కుచెదరకుండ నున్నది. చెమటపట్టిన గుర్తులులేవు. చెమటతో పరిచారకుడు అంత సతమతముకాగా-చెమట లేకుండ శుభ్రముగా—అప్పుడే స్నానముచేసి ఒడలు తుడుచుకున్నట్లుగా నున్న శ్రీ జగద్గురువులను చూచుటకు ఆశ్చర్యమైనది. (సశేషము)

---

# శ్రీ జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణుల ఉపదేశములు

ఒక పెద్ద మోటారుకారు కలిగిన ధనవంతు డొకడున్నాడు. అతడు ప్రతి దినమును ఆ కారులో తన కార్యాలయమునకు పోవుచుండువాడు. సాయంత్రము వేళ ఆ కారులో కూర్చుండి సముద్రతీరమున విహారముగా నడపువాడు. అక్కడ నడయాడు వారతనిని చూచి అతని కారును వైభవమును చూచి అసూయపడెడువారు. వారు "ఆ విధముగా భోగమనుభవించుట గొప్ప అదృష్టము" అని తల చెడివారు.

కాని ఒకనాడా కారు ఎదురుగా వచ్చు లారీని గుద్దుకొన్నది. ఆ సుందరమైన కారు ముక్కలు ముక్కలైనది. దీనియందున్న యజమాని దానిలో యిరుకుకొని పోయెను. అతనిని బయటకు తీసిన తరువాత అతని రెండు కాళ్ళను తీసివేయవలసి వచ్చినది. మోకాలివరకు రెండుకాళ్ళు ఉత్తరించిరి. అతడిక నడువలేడు. ఎవరైనా మోసుకొని పోవలసినదే.

జనము మరల వానిని చూచిరి. "ఎంత ఘోరము! మన యదృష్టముకొలది భగవదనుగ్రహమువలన మనకు కారు లేకుండపోయినది. కాళ్ళతో నడిచి పోవుట—కారులో పోవుటకంటె ఎంతో శ్రేయస్కరము."

ఎక్కువ ధనము—లౌకిక భోగవస్తువులు కలవారు ఎక్కువ సుఖముగా నుండిరని భావించుట సరికాదు.

---

# శ్రీ జగద్గురు భారతీ తీర్థస్వామి చరణుల ఉపదేశము

## (తెంకర్లై లో శ్రీ చరణులు చేసిన అనుగ్రహ భాషణము)

### (గతసంచిక తరువాయి)

వేదము భగవంతుని శ్వాసమువంటిది. మనకు ఉచ్ఛ్వాస నిశ్వాసములకు ఎట్లు ప్రయత్నము లేదో భగవంతునికట్లే అప్రయత్నముగా వేదము బయల్వెడలెను. పద్మ ముఖుడైన భగవంతుని వదనమునుండి నిశ్వాసముగా బయల్వెడలిన దగుటచే వేదము నందు దోసగులుండజాలవు.

తార్కికులు శబ్దప్రమాణమును గురించి చెప్పునప్పుడది రెండు విధములని—లౌకిక శబ్దము—వైదికశబ్దము—అనిరి. మనము మాటాడునదెల్ల లౌకిక శబ్దము. వేదము నందున్నది వైదిక శబ్దము. లౌకిక శబ్దమును గురించి చెప్పుచు — 'లౌకికం త్వాప్త వాక్యం ప్రమాణమ్' ఆప్తుని వాక్యము ప్రమాణము—అనిరి. ఆప్తుడనగా నెవ్వరు? విషయములను యథాతథముగ—ఉన్నదున్నట్లుగ—గ్రహించి అట్లే ఉన్నదున్నట్లుగ చెప్పువాడు. మనలను తప్పుత్రోవలు పట్టించుటకు ప్రయత్నము చేయనివాడు. కావున లౌకిక శబ్దమంతయు ప్రమాణము కాదు. ఆప్తుడు చెప్పినదే ప్రమాణము.

అయితే "వైదిక మీశ్వరోక్తత్వాత్ సర్వమపి ప్రమాణమ్"—వైదికశబ్దము లౌకికము వంటిది కాదు. అది ఈశ్వరోక్తమగుట చేతనంతయు ప్రమాణమే. దాని యందు ప్రమాణత్వము లేని పదమొక్కటికూడ లేదు.

కాబట్టి వేదము చెప్పు దానినెట్లు నిర్ణయింపవలెను? ఎవరేని చెప్పిన దానిని వారి నడిగి తాత్పర్యము నిర్ణయింపవచ్చును. వేదము అపౌరుషేయ మగుటవలన నట్లు చేయుటకు సాధ్యము కాదు. పూర్వ మీమాంసాశాస్త్రమునందు వేదభావ నిర్ణయ మున కొక పద్ధతి కలదు.

ఉపక్రమోప సంహారౌ అభ్యాసోఽపూర్వతాఫలమ్ అర్థవాదోపపత్తీచ లింగం తాత్పర్య నిర్ణయే॥ వేద తాత్పర్య నిర్ణయమునకుగాను హేతువులు కనుగొన వలెను.

అందు మొదటగా ఉపక్రమోప సంహారములు—వేదమంత్రమునకు మొదలు-అంతిమము. ఒక విషయమును గురించి చెప్పుటకు ప్రారంభించి—మధ్యలో కొన్ని అవాంతర విషయములను చెప్పి మరల ఉపక్రమించిన విషయమును గురించి చెప్పి ఉపసంహరణ జరుగవచ్చును. అట్టి సందర్భములో ఉపక్రమ ఉపసంహారములనుబట్టి తాత్పర్య నిర్ణయము చేయవలెను. నిజముగా మంచి ఉపన్యాసకుని విషయమున—ఉపక్రమ ఉపసంహారములు ఒకే విషయమును గురించి యుండును. సామాన్యుల విషయమట్లు కాదు. వారు సందర్భశుద్ధి లేని విహారము చేయుదురు. మంచి ఉపన్యాసకుని ఉపన్యాసమున ఉపక్రమోప సంహారములను బట్టి అతడు చెప్పిన తాత్పర్యము విస్పష్టమైనట్లే వేదము విషయమునకూడ.

ఛాందోగ్య ఉపనిషత్తు ఆరవ ప్రకరణము "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం" అని ప్రారంభమైనది. ఆత్మ ఒకటే ఉన్నది. చైతన్యము ఆత్మ, బ్రహ్మము—ఏకార్థములుగా ఉపనిషత్తున ప్రయోగింపబడినవి. ఆ ప్రకరణము 'ఏత దాత్మ్య మిదం సర్వం తత్సత్యం' అని ముగిసినది. కాబట్టి ఉపక్రమ ఉపసంహారముల ఐక్యతనుబట్టి ఉపషత్తుయొక్క తాత్పర్యము ఆత్మ అద్వితీయమని.

రెండవది అభ్యాసము. మరల మరల చెప్పుట అభ్యాసము. తరువాత నేమి చెప్పవలయునో తెలియనప్పుడు మరల నదే చెప్పుట సామాన్యులు చేయునది. కాని విజ్ఞులు అట్లు చేయరు. వారు మరల నదే చెప్పినచో—అది ముఖ్యమైన విషయమని గ్రహించవలెను. వేదమొక విషయమును మరల మరల చెప్పినచో నది విషయ తాత్పర్యమని—ముఖ్యమైనదని గ్రహింపవలెను. ఛాందోగ్య ఉపనిషత్తునందు 'తత్త్వమసి' అనునది ఒకసారి కాదు. రెండు పర్యాయములు కాదు. తొమ్మిది పర్యాయములు మరల మరల చెప్పబడినది. 'తత్త్వమసి' అనగా జీవబ్రహ్మైక్యత. వేదాంతము చదివిన వారికిది తెలియును. దాని నిప్పుడు నేను వ్యాఖ్యానించుట లేదు. అల్పవ్యవధిలో వ్యాఖ్యానించుటకు అవకాశము లేదు. కావున అది జీవబ్రహ్మైక్యతను సూచించు చున్నదని చెప్పిన చాలును. ఉపనిషత్తు దీనిని తొమ్మిది పర్యాయములు మరల మరల చెప్పినది కావున-అభ్యాసహేతువు వలన—అది వేదతాత్పర్యమని - జీవబ్రహ్మైక్యతా నిరూపణమే శాస్త్ర తాత్పర్యమని స్పష్టము. మరల మరల చెప్పుట పునరుక్తి కాదు. దానిని 'ఆగమోక్తి' అందురు.

మూడవ హేతువు అపూర్వతా. ఇదివరకే మనకు తెలిసిన దానిని శాస్త్రము చెప్పుచున్నచో—దానివలన ప్రయోజనమేమి? అది పూర్వమే ప్రచారమందున్న

విషయమని మనము త్రోసివేయనచ్చును. ద్వైత, అద్వైతములందేది అపూర్వము? అద్వైతమే. ద్వైతము అందరకు తెలియును. చిన్నపిల్లలకుకూడ తెలియును. తాను భగవంతుని కంటె భిన్నుడనని చిన్న పిల్లవాడుకూడ పలుకును. ఇక అందులోని ప్రత్యేకత యేమున్నది? కాని అద్వైతము అపూర్వము. దానిని గురించి వినగానే కొందరు భయపడుదురు. ఏలననగా అది తేలికగా అవగాహన కాదు. వ్యతిరేకమైన ద్వైతభావములెన్నియో కలవు. "మాటాడు నీవు వినునట్టి నాకంటె భిన్నుడవు. అద్వైత మెట్లు చెప్పుదువు?" ఇట్లు ఎన్నియేని వ్యతిరేక వాదములు చేయుదురు. ఎందుచేత? అద్వైతము తేలికగా అవగాహన కాదు కాబట్టి. కావున అపూర్వతా హేతువుచేత వేదతాత్పర్యము అద్వైతమేనని ద్వైతము కాదని స్పష్టము.

నాలుగవ హేతువు ఫలము. ఛాందోగ్య బృహదారణ్యక ఉపనిషత్తులందు అద్వైత జ్ఞాన ఫలము అధికముగా చెప్పబడినది. 'తస్యతావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సమ్పత్స్యే (ఛాందోగ్య)' ప్రారబ్ధకర్మానుభవానంతరము జ్ఞాని బ్రహ్మభావమును పొందునని. ఈ ఫలవాక్యమునుబట్టి కూడ వేదతాత్పర్యము జీవ బ్రహ్మైక్యత యని స్పష్టమగుచున్నది.

తరువాత హేతువు అర్థవాదము. "అనేన జీవేనాత్మానుప్రవిశ్యనామరూపే వ్యాకరవాణి' మొదలగునవి అర్థవాదములు.

ఇదియు జీవబ్రహ్మాభిన్నత — వివరించును—బ్రహ్మము జీవుని రూపమున ప్రవేశించునని చెప్పుటచేత. ఒకడు గృహమున బయటనుండి ప్రవేశించెనన్నప్పుడు ప్రవేశమునకు పూర్వము బయటనున్న వానికి ప్రవేశించిన వానికి భేదములేని విధముగా— బ్రహ్మము జీవుని రూపమున ప్రవేశించునని చెప్పినపుడు జీవునికి బ్రహ్మమునకు అభిన్నత నే చెప్పినట్లయినది.

తరువాత హేతువు ఉపపత్తి. ఉపపత్తి యనగా యుక్తి. 'యథాసోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్' అని చెప్పినప్పుడు—ఒక ఘటము యొక్క కారణమును—మృత్తును—తెలిసికొన్నచో—అన్ని ఘటములకు మృత్తుకారణమైనట్లు తెలియును. అట్లే బ్రహ్మము జగత్కారణమని తెలిసినప్పుడు అన్నియు తెలిసినట్లగును. ఇట్టి యుక్తి అద్వైతమునకు అన్వయించును. ద్వైతమునకు యుక్తియేమి? ఏదియు లేదు.

ఈ ఆరు హేతువులవలన వేదము యొక్క తాత్పర్యము అద్వైతమని నిర్ణయమగుచున్నది. తమ ప్రస్థానత్రయ భాష్యమున శ్రీ భగవత్పాదులు యుక్తి అద్వైతము

నకే నని ద్వైతమునకు కాదని — వేదతాత్పర్యము అద్వైతమేనని నిరూపించిరి. శ్రీ భగవత్పాదుల గ్రంథములను చదివినచో ఆయన గ్రంథముల సారము వేదతాత్పర్యమే నని తెలియనగును.

— o —

# భక్త్యంజలి

భారతీయమైన సద్ధర్మము సర్వకాలము తేజోభరితముగా విరాజిల్లుటకై శ్రీ శంకర భగవత్పూజ్యపాదులు భారతదేశమున నాల్గు దిక్కులందు నెలకొల్పిన నాలుగు ఆమ్నాయపీఠములలో దక్షిణమున యజుర్వేదశిరః ప్రధానపీఠమై అవిచ్ఛిన్న గురు పరంపరా విద్యమానమై ప్రకాశించుచున్న శ్రీ శృంగేరి శారదాపీఠమున జగద్గురు అభినవ విద్యాతీర్థ మహాసన్నిధానమువారు తమకు ఉత్తరాధికారిగా నిర్ణయించిన శ్రీ జగద్గురు భారతీతీర్థస్వామివారి వార్షిక వర్ధంతి దుర్మతినామ సం॥ర చైత్రశు షష్ఠి శుక్రవారము (10-4-81) నాడగుచున్నది.

తాము సద్ధర్మమైన హైందవ ధర్మమును అనుష్ఠించుచున్నామని గర్వించు వారందరు—ఆస్తిక జనులందరు — శ్రీ శంకర భగవత్పూజ్యపాదులవారియెడ ఋణగ్రస్తులై యున్నవారే. శ్రీ శంకర భగవత్పూజ్య పాదులకు పరంపరగా ప్రతి నిధిస్థానమందున్న శ్రీ శృంగేరి జగద్గురువుల చరణ సన్నిధిని కృతజ్ఞాబద్ధులు కావలసిన వారే.

శ్రీ జగద్గురు సన్నిధానమువారి వర్ధంతి శుభసమయమున బద్ధాంజలులమై శ్రీ మహాసన్నిధానము వారిట్లే సన్నిధానమువారిచే సేవింపబడుచు — బహుసంవత్సరములు సర్వాస్తిక జనులను అనుగ్రహ కటాక్షములతో తాపత్రయ విదూరులను చేయు చుందురు గాతమని శ్రీ శృంగేరి పీఠ దేవతలైన శ్రీ శారదా చంద్రమౌళీశ్వరులను ప్రార్థించుచున్నాము.

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు
సంపాదకుడు

ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి
ప్రకాశకుడు

—————

# పంచాంగ విశేషములు

## శ్రీ శృంగేరీ జగద్గురు మఠ పంచాంగము ననుసరించి

రౌద్రి ఫాల్గుణ బ ఏకాదశి బుధవారము (1-4-81) నుండి

దుర్మతి వైశాఖ శుక్ల ఏకాదశి గురువారము (14-5-81) వరకు

1-4-81 బుధవారము ఫాల్గుణ బ ఏకాదశి సర్వేషాం శ్రీ జగద్గురు సచ్చిదానంద శివాభినవ నృసింహభారతీ మహాస్వామివారి జయంతి.

3-4-81 శుక్రవారము మాసశివరాత్రి

4-4-81 శనివారము ఫాల్గుణ అమావాస్య ద్వాపరయుగాది

5-4-81 ఆదివారము దుర్మతినామ సం॥ర చైత్రశుపాడ్యమి. సంవత్సరాది. తైలాభ్యంగనము. నింబ కుసుమ భక్షణ. శ్వేతవరాహకల్పాది. ప్రపాదానము. నేటినుండి శృంగేరిలో వసంత నవరాత్రి శ్రీరామోత్సవములు.

6-4-81 సోమవారము చైత్రశు ద్వితీయ శ్రీ జగద్గురు సచ్చిదానంద శివాభినవ నృసింహ భారతీ మహాస్వామివారి ఆరాధన

7-4-81 మంగళవారము చైత్రశు తృతీయ. ఉత్తమమన్వాది. మాససంపద్గౌరీ వ్రతములు. (కృత్తికా-రాత్రి)

8-4-81 బుధవారము చైత్రశు చతుర్థి. వరచతుర్థి వ్రతము.

9-4-81 గురువారము చైత్రశు పంచమి. లక్ష్మీపంచమి (నాగ) కూర్మకల్పాది. మత్స్య జయంతి.

10-4-81 చైత్రశు షష్ఠి శుక్రవారం శ్రీ జగద్గురు భారతీతీర్థస్వామి వారి వర్ధంతి.

12-4-81 ఆదివారము శ్రీరామ నవమి. శృంగేరిలో ఉత్సవము.

13-4-81 సోమవారము సౌరసంవత్సరాది. (అశ్వినికార్తె)

15-3-81 బుధవారము చైత్రశు ఏకాదశి సర్వేషాం.

17-4-81 శుక్రవారము శ్రీ విద్యారణ్య జయంతి.

19-4-81 ఆదివారము చైత్ర పౌర్ణమి.

27-4-81 సోమవారము శుక్రమౌఢ్యని వృత్తి. భరణీ కార్తె

30-4-81 గురువారము చైత్ర బ ఏకాదశి సర్వేషాం

### మే నెలలో మొదటి భాగము

2-5-81 శనివారము మాసశివరాత్రి

4-5-81 సోమవారము డోల్లుకర్తరి.
5-5-81 మంగళవారము వైశాఖశు పాడ్యమి నేటినుండి 8-5-81 వరకు శృంగేరిలో (కాలడిలో) శ్రీ శంకర జయంతి ఉత్సవములు. (కృత్తికా)
6-5-81 బుధవారము వైశాఖశు తృతీయ. అక్షయతదియ
8-5-81 శుక్రవారము శ్రీ శంకర జయంతి వైశాఖశు పంచమి.
10-5-81 ఆదివారము కృత్తిక కార్తి - కర్తరి ప్రారంభము.
14-6-81 గురువారము వైశాఖశు ఏకాదశి సర్వేషాం వృషభ సంక్రాంతి.

---

# శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్య విరచిత అపరోక్షానుభూతి

## వ్యాఖ్యానము: శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

[గతసంచిక తరువాయి]

అవ (140 శ్లోకమునకు) అపరోక్ష జ్ఞానమువలన కలుగు స్థితిని చెప్పుచున్నారు.

శ్లో॥ భావితం తీవ్రవేగేన వస్తుయత్ నిశ్చయాత్మనా
పుమాన్ తద్ధి భవేత్ శీఘ్రం జ్ఞేయంభ్రమరకీటవత్॥ 140

తా॥ తీవ్రమైన వేగముతో నిశ్చయబుద్ధి కలిగి పురుషుడు ఏ వస్తువును భావన చేయునో—జ్ఞేయంబగు ఆ వస్తువుగానే శీఘ్రముగా నగును-అదెట్లనగా భ్రమరము-ఒకవిధమైన పురుగును తెచ్చి తన స్థానమందుంచి ఆ పురుగు చుట్టును తిరుగుచు రొద చేయుచుండగా ఆ కీటకము (పురుగు) భయముతో ఆ భ్రమరమునే ధ్యానించుచుండుటవలన తాను భ్రమరమే అగును—అదేవిధముగా పరోక్షజ్ఞానము కలవాడు తీవ్రముగా నిశ్చయ బుద్ధితో బ్రహ్మధ్యానము కావించినప్పుడు అపరోక్షవృత్తి కలిగి తద్ద్వారా బ్రహ్మపురుడగునని భావము.

అవ (141 శ్లోకమునకు) తీవ్రవేగముగా చేయవలపిన భావనను గురించి చెప్పుచున్నారు.

శ్లో॥ అదృశ్యం భావరూపంచ సర్వమేవ చిదాత్మకమ్
సావధానతయా నిత్యం స్వాత్మానం చైవ భావయేత్॥ 141

తా॥ ద్రష్టను, దృశ్యమును, దర్శనమును—(ప్రత్యక్ష పరోక్షములుగా) అగు త్రిపుటి రూపమున నున్న జగత్తు అంతయు ఆత్మారోపితమే కావున—ఆరోపితము-అధిష్ఠానము కంటె భిన్నముగా లేదు కనుక—సమస్తమును తన్నును చిదాత్మకముగా-చిదాత్మకునిగా—నిత్యము సావధానముగా భావింపవలయును.

విశేషములు: చకారమువలన (భావరూపంచ) త్రిపుటిలో—ద్రష్ట—దృశ్యముతో పాటు దర్శనముకూడ గ్రహింపవలెను.

అవ (142 శ్లోకము) బ్రహ్మాకార్యమును గూర్చి చెప్పుచున్నారు.

శ్లో॥ దృశ్యం హ్య దృశ్యతాం నీత్వా బ్రహ్మాకారేణ చింతయేత్
విద్వాన్నిత్య సుఖేతిష్ఠేత్ ధియాచిద్రసపూర్ణయా॥ 142

తా॥ దృశ్యమైన ప్రపంచమును—దానియొక్క నామరూపత్వమును విస్మరించి, అది అదృశ్యమైన బ్రహ్మయేనని నిశ్చయించి సర్వమును బ్రహ్మాకారముగా చింతింపవలయును. విద్వాంసుడు తాను చిదానంద పరిపూర్ణ వృత్తితో నిత్యసుఖంబునందుండవలెను.

అవ (143 శ్లోకమునకు) రాజయోగసాధనము చెప్పుచున్నారు.

శ్లో॥ ఏభిరంగై స్సమాయుక్తో రాజయోగ ఉదాహృతః
కించిత్పక్వ కషాయాణాం హఠయోగేన సంయుతః 143

తా॥ ఈ పదునైదు అంగములతో గూడిన రాజయోగము అపరోక్షానుభూతికి సాధనముగా చెప్పబడినది. కొంచెము పక్వమైన చిత్తము కలవారికి—సరిగా పక్వము కాని చిత్తము గలవారికి హఠయోగముతో (పతంజలిప్రోక్తమైన అష్టాంగ యోగముతో) కూడిన యీ తత్త్వనిష్ఠయే పరమార్థ సాధనకు ఉపాయము. (సశేషము)

---

# వేదాంత న్యాయములు (35)

## (న్యాయములవంటి ఉదాహరణలు)

**[వేదాంత శాస్త్రముతో సూక్ష్మవిషయములను బోధచేయుటకు కొన్ని ఉదాహరణలు సాధారణముగా నుపయోగించెదరు. ఈ ఉదాహరణలు నిత్యజీవితమునకు సంబంధించినవిగా నుండి-వీటిమూలమున దుర్గ్రాహ్యమైన సిద్ధాంత విషయములను అవగాహన చేసికొనుటకు తోడ్పడును. ఈ ఉదాహరణలవలన-సునిశిత ప్రజ్ఞావంతముకాని సామాన్యుని మేధస్సుకూడ సిద్ధాంతమును గ్రహింపగలుగును. సామాన్యపాఠకులకొఱకు వేదాంత న్యాయముల వివరణములను క్రమముగా ప్రకటించుచున్నాము. సంపాదకుడు]**

## ఊసరవెల్లి రంగులు

ఊసరవెల్లి అనబడు తొండ—సాధారణముగా ఉష్ణప్రదేశములందెక్కువగా కనుపించు జంతువు. ఇది నాలుగు కాళ్ళమీద ప్రాకులాడును. తానున్న పరిసరములను బట్టి—ఇది తన శరీరపు రంగును మార్చుకొనునని ప్రసిద్ధి. అది ఎఱ్ఱని రంగును వహించి యున్నప్పుడు చూచినవాడు అది ఎఱ్ఱగా నున్నదనును. అట్లే అది ఆకుపచ్చ రంగును వహించి యున్నప్పుడు చూచినవాడు అది ఆకుపచ్చ రంగుగా నున్నదనును. అయితే దానిని చాలపర్యాయములు పరిశీలనగా చూచినవాడు—అది పెక్కురంగులను ధరించ గలదని తెలిసికొనును, దాని రంగును గురించి వానికి సందేహములు లేవు.

ఈ ఉదాహరణము వేదాంతమున ఉపయోగించుట దేనికనగా—భగవంతుని గురించి కొంచెము కొంచెము తెలిసినవారు చేయు వాదములను, ఆర్భాటములను తెలియచెప్పుటకు. భగవంతుని గురించి ఏ కొంచెమో తెలిసినవారు—తమకు తెలిసినదే యథార్థమని—ఇతరులు చెప్పినది నిజము కాదని—గంద్రగోళము చేయుచు—వాదములు చేయుచు—యుద్ధమునకు సిద్ధపడుదురు.

అయితే బ్రహ్మజ్ఞానికి—బ్రహ్మవేత్తకు—ప్రకృతి జగత్తు—యొక్క యథార్థస్థితిని తెలిసియుండుటవలన—భగవత్స్వరూప యాథార్థ్యము అవగాహన అయి వుండుటవలన—అతనికి పరతత్త్వమును గురించి సందేహములు లేవు. శంకలు లేవు. వివాదములు లేవు. మౌనమే శరణ్యము.

---

# శ్రీ శంకర భగవత్పాద విరచిత
# వివేకచూడామణి
## (శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామి విరచిత వ్యాఖ్యాసమేతము)

**ఆంధ్రీకరణము : డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు(వేదాంత శిరోమణి విద్వాన్) ఎం. ఏ. (సంస్కృత, ఆంగ్ల హిందీ) పి. హెచ్‌డి.**

(గతసంచిక తరువాయి)

అవ. "సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వాభివదన్య దాస్తే" (ధీరుడైన ఈ ఆత్మ సమస్తరూపములను వేరువేరుగ చేసి, నామముల నేర్పరచి,

వాటియందుండును) మొదలగు శ్రుతుల ననుసరించియు, "అవస్థితేరితి కాశకృత్స్నః" (పరమాత్మయే విజ్ఞానాత్మరూపమున వున్నాడు అని కాశకృత్స్నుడు) అను బ్రహ్మసూత్రము ననుసరించియు పరమాత్మయే జీవరూపమున వుండుటచే శోధిత 'త్వం' పదార్థముగ ఆత్మను చెప్పి "అనశ్నన్నన్యోఽభి చాకశీతి" (పరమాత్మ కర్మఫలమును అనుభవింపకుండగ ప్రకాశించుచున్నాడు.) అను శ్రుతిచే తత్పదార్థముగ బోధితమగు ఆత్మనుగూర్చి చెప్పుచున్నాడు:—

మూ. అత్రైవ సత్త్వాత్మని ధీగుహాయా మవ్యాకృతాకాశ ఉరుప్రకాశః.
ఆకాశ ఉచ్చై రవి వత్ప్రకాశతే స్వతేజసా విశ్వమిదం ప్రకాశయన్. 134

ప్ర. అ. అత్రైవ=ఈ శరీరమునందే, సత్త్వాత్మని=సత్త్వప్రధానమగు, ధీగుహాయాం=బుద్ధి యనెడు గుహయందు, అవ్యాకృతాకాశే=మాయయందు, ఉరు ప్రకాశః=అధిక ప్రకాశముగల, ఆకాశః=పరమాత్మ, స్వతేజసా=తన తేజస్సుచే, ఇదం విశ్వం=ఈ ప్రంచమును, ప్రకాశయన్=ప్రకాశింపచేయుచు, రవివత్=సూర్యుడువలె, ఉచ్చైఃప్రకాశతే=సర్వోత్కర్షముతో ప్రకాశించుచున్నాడు.

వా. అ. అత్రైవ=ఈ సాధక శరీరమునందే, సత్త్వప్రధానమగు బుద్ధియనెడు గుహయందు; 'గుహా' శబ్దము గుహూసంవరణే అను ధాతువునుండి నిష్పన్నమైనది. బుద్ధి విజ్ఞానమయ కోశముగనుండి ఆత్మను కప్పివేయుచున్నది గాన "ధీగుహా" అని చెప్పబడినది. దానియందు ఉపాదాన కారణమగుటచే అనస్యూతముగనున్న ఏ అవ్యాకృతాకాశము కలదో దానియందు, అనగా మాయయందు, ఉరుప్రకాశః=అధిక ప్రకాశ రూపమైనది. జ్ఞానరూపమై సర్వావభాసకమగుటచే ఇది ఉరుప్రకాశము "తద్దేవా జ్యోతిషాం జ్యోతిః" (దేవతలు జ్యోతిస్సులకు జ్యోతిస్సైన ఆ ఆత్మ స్వరూపమును") అని శ్రుతి వాక్యము. ఆకాశః=పరమాత్మ, స్వతేజసా=సూర్యాది సకల జ్యోతిస్సులను ప్రకాశింపచేయు జ్ఞానరూపమగు ప్రకాశముచేత, "యేన సూర్యస్తపతి తేజసేద్ధః" (ఏ పరమాత్మ తేజస్సుచే ప్రదీప్తుడై సూర్యుడు తపించుచున్నాడో) అని శ్రుతివాక్యము. ఇదం విశ్వం=దృశ్యమగు సకల ప్రపంచమును ప్రకాశింపచేయుచు, సూర్యుడువలె, ఉచ్చైః=సర్వోత్కర్షముతో ప్రకాశించుచున్నాడు. లేదా "ఉచ్చైః రవివత్" అని అన్వయించి "ఆకాశ మధ్యవర్తియగు సూర్యుడువలె" అని అర్థము చెప్పవచ్చును. ఈ విధముగ పూర్వశ్లోకమున "ఏషోఽన్తరాత్మ పురుషః" అను వాక్యమున "పురి, శరీరే, శేతే ఇతి పురుషః" అను వ్యుత్పత్తిచే, "శరీరమున నివసించువాడు" అని చెప్పిన ఆత్మనుగూర్చి ఈ శ్లోకమున—అత్ర=

"ఈ స్థూల శరీరమునందు" అనియు, ధీగుహాయాం="సూక్ష్మ శరీరమూన" అనియు, అవ్యాకృతాకాశే="కారణ శరీరమునందు" అనియు వివరింపబడినది. (అనగా ఆత్మ—స్థూల-సూక్ష్మ కారణ శరీరాంతరాత్మయని యర్థము). ఆకాశ మధ్యవర్తియగు రవి సకల దిక్కులందును వున్న వస్తువులను ప్రకాశింపచేయుట అనునది లోక ప్రసిద్ధము, అట్లే సర్వాంతరుడగు ఆత్మ సకల వస్త్వవభాసకమని అభిప్రాయము.

మూ. జ్ఞాతా మనోఽహంకృతి విక్రియాణాం దేహేన్ద్రియ ప్రాణకృత క్రియాణామ్.

అయోఽగ్నివత్తా ననువర్తమానో నచేష్టతే నో వికరోతి కించన. 135

ప్ర. అ. మనోఽహంకృతి విక్రియాణాం=మనస్సుయొక్కయు, అహంకారము యొక్కయు వికారములకును, దేహేన్ద్రియ ప్రాణ కృతక్రియాణాం=దేహేంద్రియ ప్రాణములచే చేయబడిన క్రియలకును, జ్ఞాతా=జ్ఞాతయైన ఈ ఆత్మ, అయః=ఇనుమును, అగ్నివత్=అగ్నివలె, తాన్=వాటిని, అనువర్తమానః = అనుసరించుచున్నవాడై, నచేష్టతే=చేష్టచేయుట లేదు; కించన=దేనినికూడ, నోవికరోతి=వికారము కలదానినిగ చేయుటలేదు.

వ్యా. అ. ఆంతరములగు కామము సంకల్పము మొదలగు మనోవిక్రియలను, గర్వము, దర్పము మొదలగు అహంకార వికారములను తెలిసికొనునది, అట్లే బాహ్యములైన, దేహేంద్రియములు వివక్షితములుగాన వాటి క్రియలగు వచనాదులను, దర్శన శ్రవణాదికములగు చక్షురాది జ్ఞానేంద్రియ వ్యాపారములను, ఉచ్ఛ్వాస నిఃశ్వాసాదులగు ప్రాణ వ్యాపారములను తెలిసికొనునది. ఈ విధముగ సకలమైన ఆంతర - బాహ్యవికారములకు సాక్షియైన ఈ ఆత్మ నిర్వికారమని చెప్పుచున్నారు :- పొడవుగగాని, గుండ్రముగగాని ఉన్న ఇనుమును ఆశ్రయించియున్న అగ్ని ఏ విధముగ ఆయా ఆకారములలో నున్నట్లు వ్యవహరింపబడునో, వాస్తవమున అగ్నికి ఏ విధముగ దీర్ఘత్వ వర్తులత్వాదు లుండవో అట్లే మనోఽహంకృతి దేహేంద్రియ ప్రాణములన్నిం అనువర్తమానః=వ్యాపించున దగుటచేతను, స్వచ్ఛమగుట చేతను, అంతటను ప్రతిబింబించుచున్నను, వాటి వాటికి సంబంధించిన వ్యాపారములు కలదిగ వ్యవహరింపబడు చున్నను—వాస్తవమున, నచేష్టతే=తాను వికారమును పుట్టించుటలేదు, నోవికరోతి కించన=దేనియందును వికారమును పుట్టించుట లేదు. ఆత్మ—సూర్యుడు సాన్నిధ్య మాత్రముచేతనే జడపదార్థములను ప్రవర్తించునట్లు చేయుచున్నది కాని తన వ్యాపారము ద్వారా కాదు అని భావము. 135 (సశేషము)

# గురువంశ కథా కథనము

(సంస్కృత మూలము: బ్రహ్మశ్రీ కాశీలక్ష్మణశాస్త్రి
గురువంశ కావ్యమ్)

తెలుగు: శ్రీ చెఱుకుపల్లె జమదగ్నిశర్మ ఎం. ఏ.

(గతసంచిక తరువాయి)

## చతుర్దశ సర్గము

అటనుండి బయలుదేరి వచ్చుచుండగా షణ్ముఖ భక్తుడైన వేలాపురక్ష్మాపాలుని మంత్రులెదురువచ్చి భక్తి వినయములతో జగద్గురువులను ప్రార్థించి వారిని తమ రాజధానికి తీసికొనిపోయిరి. అక్కడ చేరిన భక్తులెల్లరును పాదతీర్థ ప్రదానముచే పవిత్రుల నొనర్చి నేరంకి పురమును చేరుకొని అక్కడ సకలలోక పూజన మందికొనిరి. (1) అక్కడనుండి నేత్రావతీ కుమార ధారా సంగమ స్థానమునయున్న లవణాపణ పట్టణము చేరుకొని అచ్చట సహస్ర లింగేశ్వరస్వామిని తదేక దృష్టితో చిరకాలము వీక్షించి భూలోక భాస్వరుడగు నా స్వామిని సేవించుకొనిరి. (2) కోరిన వెల్ల సమకూర్చుకొనుటకైన సమస్త సంభారములు తమ హృదయమునందే యున్న మునీషి వరేణ్యులయిన యతీశ్వరులు సకలేష్టుడైన ఆ స్వామి నట్లు భక్తితో నర్చించి యక్కడనుండి నారసింహాలయ పురము చేరి నృసింహస్వామిని పూజించి భువి నృసింహులే యని పేరుపొందిరి. (3) పిమ్మట ఉత్తమాంశు వంగ భూరమణుని మంత్రులు వచ్చి ప్రార్థింపగా దూరమైనను వారితో గలిసి నందావరమున కేగి గౌరవమొందియు తనుదే యయినను ఆ రాజుచే సమ్మానితులయి వినాయకాది దేవతలను పూజించి బుధులను సమ్మానించిరి. (4) అక్కడనుండి శ్రేష్ఠమైన నావనెక్కి జలమార్గమున వినోదముగ ప్రయాణమొనర్చి మునిపుంగవులిన వల్లిపురమును చేరుకొని అచ్చటి సమాలంబాయగు దుర్గాంబిక నర్చించిరి. అప్పటికొకానొక భూతము శ్రీవారి

---

1 వ శ్లోకము.

ఇప్పుడు ఉప్పనియంగాడి తాలూకాలో నున్న బెళ్లారే నగరమే అప్పుడు కోంకణ దేశస్థ వేలాపురంగా నుండినదనిపించుచున్నది. నేరంకిపురి-దీనినిప్పుడు హాలే నేరంకియనుచున్నారు.

2 వ శ్లోకము.

లవణాపణపురి - దీనినే ఇప్పుడు ఉప్పినియంగాడి అని వ్యవహరించుచున్నారు.

ఎదుట నిలిచి (5) ఆశ్చర్యకరముగా నిట్లు పలికెను. "స్వామీ! మీ దర్శన భాగ్యముచే నేను ధన్యుడనైతిని. ఇకమీద మీ యాత్రలో నేనును తమవెంట నుండెదను. సముద్రములో ప్రవేశించిన తరువాత అనుకోని ఉపద్రవ మొకటి రాగలదు. దానిని నేను నివారించెదను." (6) అక్కడనుండి వరద వాసుదేవుడున్న కుడుప గ్రామమున కేగి కదళీ వనాంతర్గతుడై సుభద్రక సరస్వతీ తీరస్థుడై భుజంగ రూపుడై యున్న అనంత పద్మనాభేశ్వరుని సేవించుకొనిరి. (7) ఆ స్వామి కుక్క్య పుర్యధీశ్వరుడని జగత్ప్రసిద్ధి నందినవాడు. శుద్ధ షష్ఠినాడు సుగంధి పుష్పములతో కాంతి మంతములైన దీపములతో భక్తి శ్రద్ధలతో నా స్వామిని పూజించి అక్కడ సుఖముండిరి. (8) సువర్ణ కదళీ వనమునుండి వచ్చుటతోడనే సిద్ధోత్తముల ప్రార్థన ననుసరించి కుక్క్య పురికిగూడ పోయి తాము భాగీరథపలె నిత్యనిర్మలులయ్యు అచటి పావన తీర్థములం దాదరముతో స్నానములొనర్చిరి. (9) పిమ్మట యతీశ్వరులు సిద్ధసంఘములు చేయు మహోత్సవ వైభవములచే భాస్వరుడైన మంజునాథేశ్వరుని మిక్కిలి శ్రద్ధాభక్తులతో పూజించిరి. ఆ స్వామి రసవాపిక నుండి ఉదయించెననియు ముక్తప్రదుడనియు సమస్త విబుధులచే నర్చితుడగుచున్నాడు. (10) అక్కడనుండి యతివర్యులు పరమ రమ్యమగు కాంతారమున కేగిరి. అక్కడనున్న కనకలింగ కాంతేశ్వరుని దర్శించుకొనిరి. తల్లి ప్రేరేపణతో మోదప్రద వివిధ సాధనములతో పూర్ణప్రజ్ఞులగు జగద్గురువులు ఆ స్వామిని పూజించి మహానందము నందిరి. (11) చాల దూరమునుండి వచ్చి చౌట భూమీశ్వరుడు వినయముతో ప్రార్థించుట వలన భక్తసులభులగు గురువు లాతని నగరమునకేగి సమ్మానము లంది జగత్ప్రసిద్ధుడగు సోమనాథేశ్వరుని సేవించుకొని శిష్యబృందములతో నచ్చట వసించిరి. (12) పిమ్మట కారకల్ పట్టణమందలి అనంతేశ్వరుని పూజించి హెబ్బరీ పురమందలి జనార్దనస్వామిని స్తుతించి

---

7 వ శ్లోకము.

కుడుపపురి-కడవ

8 వ శ్లోకము.

కుక్క్యపురి-కుక్కే

10 వ శ్లోకము.

మంజునాథాలయము కదిరి ముందున్నది.

12 వ శ్లోకము.

ఇప్పటి ఉప్పిని యంగాడి తాలూకా యందలి కొంత భూభాగమునకు అప్పుడు చౌటభూమి యనువ్యవహారముండెడిది.

సర్వశ్రేష్ఠమగు హోలాడి నగరమును చేరి అటనున్న స్వీయమఠమందే వసించిరి. (13) ప్రణతరక్షణ దీక్షితుడై విపక్షి శిక్షణ దక్షుడై అచట వేంచేసియున్న నృసింహ స్వామి వీక్షించి మహత్తర పూజల నొనర్చిరి. అటనుండి పరమానందముతో అనేక బుధవరులకు నిలయమైన కోటీశ్వర పురమునకేగిరి. (14) ప్రసన్న హృదయులగు జగద్గురువులు మకర సంక్రమణ పర్వదినమున సాగరస్నాన మొనర్చిరి. కోటీశ్వరు నధిక పూజలతో నానందింపజేసిరి. (15) పిమ్మట గురువులు కుంభకాశి యందలి కుంభేశ్వరుని పూజించిరి. వృకోదరుడు కుంభాసురుని సంహరించినది అక్కడనే యని పలజ్ఞులు చెప్పెదరు. అక్కడనుండి వసుచక్రవర్తి నిర్మితమైన వసుపురమును యతిపతులు చేరి ఆ వైభవమున కానందించిరి. (16) మంగళ ప్రదమగు పరమశివ మహాలింగము నర్చించి శిష్యజనులెల్లరు భక్తి శ్రద్ధలతో సేవించుచుండ యతీశ్వరులు వెంట వచ్చుచున్న మహాజనులను భాషణములతో నలరించుచు బలకూరునందలి స్వీయ మఠమును చేరుకొనిరి. (17) అక్కడనుండి వేగముగ జలమార్గమున గంగవల్లీ పురమున కేగి సురనర సర్వాభీష్ట ప్రదుడగు తత్స్వామి నర్చించిరి. (18) అచ్చటి నుండి మునివర్యులు కొంత దూరమందే యున్నను వటకల నగరమునకేగి బాలకన్యా పురమునుండి వచ్చి చేరిన బ్రాహ్మణులను భోజనముల చేతను, దేవతలను పూజల చేతను సమరులై తృప్తి నొందించిరి. (19) ఆ నగరమందే మార్కండేయు ననుగ్రహించిన

---

13 వ శ్లోకము.

హెబ్బూరి రాజులనే బల్లాలులని యందురు.

13, 37 శ్లోకములు.

హోలాడి నగరములో శృంగేరి జగద్గురు సంస్థానమునకు చెందిన మఠమొకటి యున్నదని పాఠకులు గ్రహింపవలెను.

16 వ శ్లోకము,

కుంభకాశి - కుంభాషి.

18 వ శ్లోకము

గంగపల్లీ పురము - గంగోలి. పాశ్చాత్యులు దీనినే కంబోలిన్ అను పేరుతో వ్యవహరించిరి.

19 వ శ్లోకము.

వటకలపురము - భట్కల్.

బాలకన్యాపురము - బార్కూర. ఈ పట్టణమందుగూడ శృంగేరి జగద్గురు సంస్థానమునకుస్వీయ మఠమున్నది.

పంచలింగేశ్వరస్వామి వెలసియున్నాడు. ఆయన సర్వకామితార్థ ప్రదుడు. వరాగతలైన రుద్రకన్యలు విరాజిల్లుచున్నారు. రసవాపిక యున్నది. సర్వేష్టదులగు శివగణములున్నవి. (20) పిమ్మట శ్రేష్ఠమైన సింహాసనమును పొంది మిక్కిలి వెలుగొందుచున్న భూత పాండి స్థిరావరు డొసంగిన కానుకలను ధనమును స్వీకరించి సంతోషముతో నాతనిని ఆశీర్వదించి మధురభాషణములతో సాగనంపిరి. (21) తరువాత మురుడేశ్వరుని సేవించుకొనిరి. ఆ నగరమందే గణేశ్వరు డొనర్చిన కపటమునకు రావణుడు కోపించినది. అచటి స్వామియందు వస్త్రము లింగాత్మ భావమందె ఇప్పటికి తెలియనగుచున్నది. ఆ పురమునుండి బయలుదేరి (22) సర్వసమ్మాన్యయగు హొన్నావరమునకు జగద్గురువు లేగిరి. అచ్చటి ధనికులచే సమ్మానితులై యటనుండి పురాకథిత సూత్రాత్మక లింగమున్న ధారేశ్వరమున కేగిరి. (23) అక్కడ నుండగనే వారికి కలలో శారదాదేవి చేయి చెక్కిలికాన్చి ఈషదవనతవదనయై కనిపించి ఇక ఆలస్యము చేయక త్వరగా శృంగపురము చేరుకొనుమని ఆదేశించినది. వెంటనే వారికి మెలకువ వచ్చినది. (24) తల్లి ఆదేశము నందికొనిన గురుశిష్యులు వచ్చిచేరిన రాజపూరుషామాత్యాదులచే సమ్మానితులగుచు నదీ తరణ మొనరించి కుతూహలముతో గోకర్ణమును చేరిరి. (25) అక్కడ మహామహిమోపేతుడగు మహాబలేశ్వరునకు పంచామృతములతో బహువిధ ఫలములతో నానా పుణ్య నదీజలములతో అభిషేకోత్సవ మొనరించి (26) నానావిధ పరిమళ పుష్ప తిలాన్వితాక్షతాదులతో కోమల బిల్వదళములతో సహస్రనామ పూజ చేసిరి. బహువిధాన్నముల నివేదన మొనరించిరి. దీపధూప నీరాజనాదుల నొసంగి సర్వోపచార సమర్పణముచే స్వామి కాప్యాయనము కలిగించిరి. (27) మహాబలేశ్వరుని పూజించుటలో సముత్సుకులైన యోగివర్యులు బహుదీపికారాధనములతో మహోత్సవ మొనర్చిరి. గీత వాద్యాది మంగళ ఘోషములతో రథోత్సవ మొనరించిరి. నియమనిష్ఠలు గల బ్రాహ్మణోత్తములకు మృష్టాన్నభోజన తృప్తి కలిగించిరి. (28) అక్కడున్నంతకాలము సకల పావనయగు నదీమతల్లిక యందు నిత్యస్నాన మొనర్చుచు నుండి తటస్థపడిన దేవత లందరిని యథావకాశముగ నారాధించుచు దక్షిణోత్తరదిశా యాత్రలు పూర్తి చేసికొని (29) అనుపమ హేమరేఖా చిహ్నములు సర్వత్ర వ్యక్తము చేయు మూకాంబను దర్శించి ఆమె ననేకోపచారములతో నర్చించి రాజక్షేమమును కాంక్షించి అతనికి విభవాభి

---

23 శ్లోకము.

హొన్నావరా - హొనావర్.

వృద్ధి ననుగ్రహింపుమని ప్రార్థించిరి. (30) సర్వజనానందకరముగ తల్లికి రథోత్సవము చేయించి శతాధిక సువాసినులకు నూత్నవస్త్రము లర్పించి యథేష్ట భోజన ప్రదానము చేసి జగజ్జనని ప్రీతికై బహుధనవ్యయము కావించిరి. (31) జగద్గురువు లిట్లు మహా వైభవోపేతులై సపరివారముగ నౌకలతో సముద్రయానముగూడ చేయుచున్నారని గిట్టనివారి వలన విన్న ద్వీపాధిపతి యొకడు దురాశయుడై కొందరు భటులతో హొన్నావరమున కేగెను. (32) అక్కడ మునివరులకై విచారించి వారు వెడలిపోవుట తెలిసి ఊరిలోని ధనవంతులను దోచికొని కొందరు స్త్రీలనుగూడ అపహరించెను. అక్కడనుండి వసుపురమునకేగి స్థానిక మఠమును దోచికొనెను. (33) ఈతని దురాగతములను కేలడి భూపాలకుడు విని యతిపతుల కెట్టి యాపదయు కలుగకుండ జాగ్రత్తపడవలయునని మూకాంబికా సేవయందున్న శ్రీవారికడకు ఆగకొనకుండ పరమాద్భుతముగా నొక విశ్వాసపాత్రుడయిన సేవకుని విజ్ఞప్తి పత్రికతో పంపించెను. (34) అట్లు వచ్చిన సేవకుని నుండి తెలియవలసిన సమాచారమంతయు తెలిసికొని అతనికిచ్చి తాముగూడ రాజునకొక పత్రిక నంపిరి. ఆ లేఖలో "మేమిక్కడకు సుఖముగనే వచ్చి మూకాంబికకు స్వజనులమై యున్నాము. నీ వైభవాభివృద్ధికై తల్లి నర్థించితిమికూడ." అని ప్రస్ఫుట మొనర్చిరి. (35) స్వామి పంపిన లేఖవలన వారు ఎట్టి ప్రమాదము లేకుండ సురక్షితముగ మూకాంబికా సన్నిధానమును చేరి యుండుట తెలిసి ఆనందభరితుడైన రాజు వెంటనే సభతీర్చి చంద్రమౌళీశ్వర నిత్యార్చనా పరులయిన మహాత్ముల కెవరివలన నెట్టి శ్రమయు కలుగనేరదని వారి మాహాత్మ్యమును ప్రకటించుచు వేనోళ్ళ కొనియాడెను. (36) (సశేషము)

---

**32, 33 శ్లోకములు.**

**ఇచ్చట వర్ణితుడైన ద్వీపాధిపుడు అబిసీని యాదేశము నుండి వచ్చిన వాడు, సముద్రపు దొంగలకు నాయకుడు. ఇతడే జంబూర దుర్గాధిపుడైన సిద్దీసత్ కానోపును.**

---

# సంస్కృతభాషను మనమేల ఆదరించి నేర్చుకొనవలెను?

## (38)

ఈ ప్రశ్నకు మన దేశంలో మేధావివర్గంలో మూర్ధన్య మనీషామణులు సమాధానాలు చెప్పారు. గత సంచికలందు కొన్నిటిని తెలుసుకున్నాము. ఇప్పుడు మరికొన్ని. (సంపాదకుడు)

## శ్రీ అవనీంద్ర కుమార విద్యాలంకార

భారతము ఒక దేశము. ఈ దేశముతో పరిచయము, దీనిని గురించిన జ్ఞానము-సంస్కృత పరిచయము సంస్కృత జ్ఞానము లేకుండా—ప్రాప్తించనే ప్రాప్తించవు. భారత పుణ్యభూమియందు జన్మించిన వాడెవడైనా ఒకసారి భారతదేశమునుండి బయటకు వెళ్ళినప్పుడు—అతనికి అప్పుడు దేశభక్తి యొక్క మహాత్త్వము అవగాహన అవుతుంది. అప్పుడతని హృదయము భారతదేశముపై ప్రతి శ్రద్ధాభక్తులతో పరిపూర్ణమవుతుంది.

భారతదేశమునుండి బయటకు వెళ్ళుటకు అవసరము లేనివారికి భారతదేశముపై భక్తి కలుగుటకు, భారతదేశపు పరిచయము కలుగుటకు, ఒక మార్గమున్నది. అది ఏమంటే భారతీయుడైన ప్రతి బాలుని—బాలికను—'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి' అన్న వాక్యమును సతతము మననము చేయించుట—సంస్కృత భాషను అధ్యయనము చేయించుట.

నవభారత టైమ్స్ 2 జూలై 1961

## డా॥ సర్. సి. వి. రామన్

భారత దేశము నందంతట రాష్ట్రభాషగా నుండతగిన యోగ్యత వస్తుతః సంస్కృతభాషకు మాత్రమే కలదు. దానిని తిరిగి సముచితస్థానము నందుంచుట మన కర్తవ్యము. అట్లా చెయ్యకపోతే మనం 15 భాషలను రాష్ట్రభాషలను చెయ్యవలసి వస్తుంది. (ఈ భాషలవాళ్ళు జగడము చేస్తారు కాబట్టి). సంస్కృతము ప్రతి భారతీయుని రక్తమునందు కలసి ప్రవహించుచున్నది. అంతేకాదు. కేవలము సంస్కృత భాష ఒక్కటే మన దేశముయొక్క ఐక్యతను స్థాపితము చేయగలది.

---

# 'గురుకృప'

సాధనచేసి ఆధ్యాత్మికముగా పురోగతి సాధింపదలచినవారు గురువు అనుగ్రహమునకై పరితపింపవలెను. ఏ విధమైన వివాదములలోను జోక్యము కలుగజేసికొనరాదు. విభేదముల జోలికి పోరాదు. చంద్రకిరణములందున్న అమృతముకొరకు చకోరపక్షి వేచి చూచునట్లుండవలెను. స్వాతి వానకై యెదురుచూచు ముత్తెపుచిప్పవలె నుండవలెను.

గురువునకై వెదకికొనుచు—పరిభ్రమింప నక్కరలేదు. గురువుయొక్క అనుగ్రహమునకు తగిన యోగ్యత—పాత్రత—నీవు సాధించుకొనినప్పుడు నీకు గురుదర్శనము తప్పక లభించును. తగిన ఉపదేశము లభించి శంకానిర్మూలన మగును. గురువు ఆధ్యాత్మిక సాధనా మార్గమున వెలుగుజూపు దయామూర్తి. భగవంతుని సన్నిధిని చేర్చు వాత్సల్యమూర్తి. చిత్తగత కల్మషమును హరించి చిత్తశుద్ధి కలిగించు ధన్వంతరి. భగవదనుగ్రహమన్న సూర్యరశ్మిని పట్టుకొని ఏకత్ర సమీకరించి దానితో దోషములన్న ప్రత్తిని మండిచివైచు భూతద్దమాయన.

అందుకనియే గురూపసదనము తప్పనిసరి యన్నారు బ్రహ్మవేత్తలు. బ్రహ్మజ్ఞానలబ్ధికి ముఖ్యమైన శ్రవణ మననానిదిధ్యాసలలో శ్రవణమునకు గురువు తప్పనిసరి కదా. గురువుసుండికదా శ్రవణము చేయవలసినది. తన అనుభవమువలన గురువు ఆదర్శము చూపు దేశికుడు, ఆచార్యుడు.

ఎంతో కాలము తపస్సుచేసిన తరువాతగాని కొందరికి సాధనాసిద్ధి లభించదు. ఉదాహరణకు విశ్వామిత్రుని, నారదుని, గుర్తింపవచ్చును. అయితే కొందరికి అతిస్వల్పకాలమున భగవదనుగ్రహము లభింపవచ్చును. ధ్రువుడు, ప్రహ్లాదుడు, మొదలగువారీ కోవకు చెందినవారు. అది వారి సుకృతము. అదృష్టము. అయితే అందరికి గురువు ఉపదేశమున్నది.

కొన్నియెడల గురువు శిష్యుని తీవ్ర పరీక్ష చేయవచ్చును. పరీక్షకు నిలిచినప్పుడే తన అనుగ్రహము నొసగును. ఉదాహరణకు సత్యకామ జాబాలి వృత్తాంతమును గ్రహింపవచ్చును. కొన్నియెడల గురువు—అయాచితముగ ఉపదేశమిచ్చి అనుగ్రహింపవచ్చును. ప్రహ్లాదుని వృత్తాంత మిట్టిదేకదా! శ్రీ శంకర భగవత్పాదులు హస్తామలక తోటకులను అనుగ్రహించినదిట్లేకదా. ఈ నాటికి శ్రీ శంకర భగవత్పాద పరంపరలో అవిచ్ఛిన్న సంప్రదాయమూర్తులైన శ్రీ శృంగేరి జగద్గురు మహాసన్నిధానము వారిట్లే అనుగ్రహించుచున్నారు.

గురువు శిష్యుని తనంత వానిని చేయుట గురువుయొక్క అనుగ్రహ విశేషము. శ్రీ శృంగేరి జగద్గురువుల అనుగ్రహమువలన—ఆ పరంపరలో ఒకరి తరువాత నొకరు—పరమసిద్ధులు—పీఠము నలంకరించిరి. జగద్గురు పరంపరలో 33 వ వారైన శ్రీ జగద్గురు సచ్చిదానంద శివాభినవ నృసింహ భారతీ స్వామివారిని సేవించిన శిష్యులు పెక్కుమంది ప్రఖ్యాతిపొందిన సిద్ధులు, విద్వాంసులు నైనారు. అట్టివారిలో శ్రీ భారతీకృష్ణ తీర్థ (పిమ్మట పూరీ పీఠాధిపతులైనవారు) శ్రీ విద్యాశంకర భారతి (పిమ్మట శర్వాణీం పీఠాధిపతులైనవారు) శ్రీ చదలువాడ సుందర రామశాస్త్రి (వావిళ్ళ సంస్థలో పెక్కు బృహద్గ్రంథములను పరిష్కరించినవారు) మున్న మెరిగిన వారు.

సాధనా పరితృష్ణ గలవారు అవ్యాజముగా కృపా వాత్సల్యపూరిత అనుగ్రహ కటాక్షములను ప్రసరించుచున్న శృంగేరి జగద్గురు మహాసన్నిధానమువారిని జగద్గురు సన్నిధానమువారిని ఆశ్రయింతురుగాక.

---

# గ్రంథావలోకనము

## 1. ఈశావాస్యోపనిషత్తు - వివరణోపన్యాసము

రచయిత: అరిపిరాల వేంకటసోమాచార్యులు

(రిటైర్డు ఇంజనీరు) బాపూజీ నగరు, కొవ్వూరు (ప. గో. జిల్లా) 534 350.

వెల: పేపరు బైండు రు. 4/- అట్టబైండు రు. 6/-.

ప్రస్థానత్రయమున ముఖ్యమైన ఉపనిషత్తులందు ప్రథమ గణ్యమైన ఈశావాస్యోపనిషత్తునకు వివరణోపన్యాసముగా రచింపబడిన ఆధునిక వ్యాఖ్యానమిది. శాస్త్రదృష్టి కొంత, అద్వైత దృష్టి కొంత కలసిన వివరణము—ఆధునిక భావ పుష్టి గలవారికిని కనువిప్పుగా నుద్దేశింపబడినది. ఆస్తికులు సమాదరింపవలసిన గ్రంథము.

(వేది)

## 2. గణపతి ముని (చరిత్ర)

రచన: కవిరత్న యామిజాల పద్మనాభస్వామి

17, వివేకానందవీధి, త్యాగరాయనగరు, మదరాసు - 17.

వెల: రు. 5/-

కావ్యకంఠ బిరుదాంచితుడై రమణమహర్షి చేత 'నాయన' యనిపించుకొని వాశిష్ఠ గణపతి మునిగా ప్రసిద్ధుడైన శ్రీ అయ్యల సోమయాజుల సూర్యగణపతి గారి

జీవిత చరిత్రకిది సంగ్రహస్వరూపం. సంస్కృతంలో శ్రీ కపాలిశాస్త్రి రచన, ఆంధ్రంలో శ్రీ గుంటూరి లక్ష్మీకాంతంగారి రచన 'నాయన' దీని కాధారాలు. శ్రీ గణపతి ముని చరిత్రయందు ఉత్కంఠ కలిగించేదిగా వున్నదీ రచన. సాఫీగా సాగినది. మహాత్ముల చరిత్రలను సామాన్యులకు అందించే ప్రయత్నంగా సాగిన యీ గ్రంథము ఆస్తిక సమాదరణ పాత్రమైనది. (సుముఖ)

3. హేరంబోపస్థానమ్

(సంస్కృత మూలం: కావ్యకంఠ వాసిష్ఠ గణపతి ముని)

తెలుగు: కవిరత్న భారద్వాజ (యామిజాల) పద్మనాభస్వామి.

వెల: రు. 0-50.

'నాయన' శ్రీ గణపతి ముని తన మధుర దివ్య సంస్కృత వాక్కుతో చేసిన హేరంబుని స్తుతికిది తెలుగు వ్యాఖ్యానము. సమూలము....అస్తికులకు ఆనందము కూర్చునట్లుగా నున్నది. (కపిల)

---

# శృంగేరీ వార్తలు

రౌద్రి సంవత్సర మహాశివరాత్రి ఉత్సవము (4-3-81) శృంగేరిలో మహా వైభవముగా జరిగినది. శృంగేరిలో గల దేవాలయములందు ప్రత్యేక పూజాభిషేకములు జరిగినవి.

శ్రీ జగద్గురువులు శ్రీ చంద్రమౌళీశ్వరస్వామికి ఆ రాత్రి (చతుర్యామములు) యామయామమునకు ప్రత్యేకముగా మహాన్యాసపూర్వక ఏకాదశవార రుద్రాభిషేకములు జరిపిరి. పంచామృతములతో ఫలోదకములతో, ప్రత్యేకాభిషేకములు జరిగినవి. రాత్రి తెల్లవారలు భక్తజనులు అభిషేకములు తిలకించిరి.

మరునాడుదయము రుద్రహోమము జరిగినది. బహుజన సంతర్పణ జరిగినది. అశేష సంఖ్యలో చూడవచ్చిన శిష్యమహాజనము ఉత్సవమునందు పాల్గొని శ్రీ జగద్గురువుల అనుగ్రహమునకు పాత్రులై ఆనందించిరి.

శృంగేరిలో పూర్వము విభాండకమహర్షి ఆశ్రమస్థలమునందున్న మలహానికరేశ్వరస్వామి ఆలయమునందు ప్రత్యేకోత్సవములు నడచినవి. మాఘ అమావాస్య శుక్రవారము (6-3-81) నాడు శ్రీమలహానికరేశ్వరస్వామి వారికి శృంగేరి పురమున రథోత్సవము జరిగినది. పౌరజనము అధిక సంఖ్యలో పాల్గొనిరి.

శృంగేరి క్షేత్రమున నాలుగు మూలలందు నాలుగు దేవతాయతనములు క్షేత్ర పాలక నిలయములుగా నున్నవి. దుర్గా హనుమత్ కాళీ కాలభైరవ దేవాలయములు.

దుర్గాదేవి వన మధ్యమున వనదుర్గాదేవిగా ప్రసిద్ధి పొంది 'నతజన సులభ'యని కీర్తింపబడుచున్నది. దుర్గాదేవి ఆలయమున ప్రత్యేకోత్సవములు జరగి ఫాల్గుణ శు అష్టమి శుక్రవారము (మృగశిరా నక్షత్రము) నాడు రథోత్సవము వైభవముగా నడచినది. పరిసర జానపదులు అసంఖ్యాకులు వచ్చి రథోత్సవమున పాల్గొనిరి. చాలమంది అమ్మ వారి ముందు మ్రొక్కుబడులు తీర్చికొనిరి. ఫలవృక్షముల తొలి కాపును సమర్పించు కొనుట—అమ్మవారి అనుగ్రహము వలన సంతాన వంతులయినప్పుడు చిన్నచిన్న ఊయెలలను సమర్పించుకొనుట—అనారోగ్యమును అమ్మవారి అనుగ్రహమువలన పోగొట్టుకొని ఆరోగ్యవంతులైనపుడు మ్రొక్కుకొన్న మ్రొక్కుబడులను తీర్చుకొనుట సామాన్యముగా జరుగునవి.

ఈ దుర్గాదేవిని ఇలువేల్పుగా కొలుచువారు పరిసర గ్రామము లందెక్కువ మంది కలరు. వారందరికి శ్రీ దుర్గాదేవి ఉత్సవము అనుల్లంఘనీయమైనది. నడుము కట్టి ఉత్సవమున పాల్గొని శ్రీదేవిని సేవింతురు.

ఫాల్గుణ కృష్ణ షష్ఠి గురువారము (26-3-81), శృంగేరిలో పరాపర గురువు లైన శ్రీ జగద్గురు అభినవ సచ్చిదానంద భారతీ స్వామివారి ఆరాధన యథాసంప్ర దాయముగ జరిగినది. శ్రీ జగద్గురువులు స్వయముగా పర్యవేక్షణ చేసిరి.

---

## చందాదారులకు విన్నపము-ప్రకాశకుని చిరునామా మార్పు గమనింపుడు

చందాలు బాకీయున్నవారికి పత్రిక పంపబడదు. చందా సొమ్మును ముందుగనే (తమ అడ్రసు మార్పుకూడ వెంటనే) క్రింది చిరునామాకు పంపవలెను.

ఆకెళ్ల సత్యనారాయణమూర్తి,
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు,
6-3-609/18, ఆనందనగర్,
ఖైరతాబాదు, హైద్రాబాదు-500004.

# శ్రీ విద్యారణ్య విజయగాథ



8

శ్రీ విద్యారణ్యులతో బ్రహ్మరాక్షసి శృంగి తాను త్రేతాయుగమున శ్రీరామచంద్రుని నుండి తులాపురుషదానము తీసికొని, పరిహారము చేసికొనక పోవుటతో ఇట్లయితినని చెప్పి తనకు ఆకలి తీరునట్లు అన్నము పెట్టమని కోరెను.

శ్రీ విద్యారణ్యులు యతి యగు తాను అన్నము పెట్టుటకు వీలు లేదని మరొకరి నడుగుమని, తాను కాశీకి పోవుచున్నా నని బదులు చెప్పెను



దుర్గమమైన పాఠము లెదుర్కొనినప్పుడు తెలివిగా తప్పుకొనుటయేగాని మరి వేరు కాదు." అని వ్రాసెను. అయితే మాండూక్య ఉపనిషత్తునందున్న వేదాంత సిద్ధాంతమునుగాని — సృష్టిక్రమము (సూక్ష్మమునుండి స్థూలమునకు) గురించిన వేదాంత సిద్ధాంతమును గాని తెలిసిన వాడెవ్వడైన శంకరుల వివరణమునందు దోషమున్నదని భావింపడు. ఈ పద్ధతియే ప్రాచీన — అర్వాచీన ఉపనిషత్తులందున్నది. వేదాంత దర్శనములలో భిన్న వాదములవారికీ విషయమున అభిప్రాయ భేదము లేదు. పైన ఉదహరించిన ఛాందోగ్య ఉపనిషత్పాఠము మాయాసిద్ధాంతమును తెలుపుట లేదన్న డా. థీబా మాటలకు సమాధానముగా మేమిదివరకే—అది మాయాసిద్ధాంతమును— సూచనగా కాదు—వాచ్యముగా తెలుపుచున్నదని నిరూపించితిమి. మాయావాదమను—అనగా నామరూపాత్మకమైన జగత్తు మిథ్యయని—కాబట్టి మరల నిచట పునరుద్ఘాటించుటకు ఆవశ్యకత లేదు.

మును కాదన్న థీబా వాదమును మేమింతకుముందే ఎట్లు పరాస్తము చేసితిమో జ్ఞాపకము తెచ్చుకొనవలెను. ఉపనిషత్తుల కాలము క్రియాత్మకమైనదని అందుచేత ఏకవాక్యతగల సిద్ధాంతమును రూపు కట్టించుటకు అవకాశము లేదన్న థీబా వాక్యము అనంగీకార్యము. ఎదురుగా కన్పించుచున్న దానికి విరుద్ధముగా ఊహాగానములు చెల్లవు. యథార్థమైన దానిని త్రోసివేయుటకెన్ని వాదములైన చాలవు. 'నదృష్టేఽనుపపన్నం నామ' (ఇంద్రియ గోచరమైన అనుభవపూర్వకమగు దానిని హేతువాద విరుద్ధమని వాదింపరాదు) అని శ్రీ శంకరులనిరి.

నిజమునకు ఉపనిషత్తులు ఒక ఏకాకార సిద్ధాంత సమిష్టి గ్రంథభాగములుగా అంగీకరింపబడినవి. ఈ సిద్ధాంత సంప్రదాయమును ఋషులు నిలువబెట్టిరి. ఆ సంప్రదాయమును—ఒక నిర్దుష్ట హేతువాద వైఖరిలో పుష్టి చేసిన వివరణము బాదరాయణ బ్రహ్మసూత్రములు. శంకరులు తన ఊహాపోహలతో నొక క్రొత్త వేదాంత సిద్ధాంతమును సృష్టించినాడన్న థీబా వాదమును మేమిదివరకే విరుగగొట్టితిమి. ఉపనిషత్తులే చెప్పుచున్నవి—ఉపనిషత్సిద్ధాంతమును ఒక గురు పరంపర-(స్వయంభువైన బ్రహ్మ మొదలు)—ప్రచారము చేసినదన్నది వంశ బ్రాహ్మణమునందది (పరంపర) వివరింపబడినది. కాబట్టి వేదాంత సిద్ధాంతమును ఒకరెవ్వరో ఊహాపోహలతో-భావనా కల్పముతో రూపకల్పన చేసిరనుట పొరపాటు. అసంగతము. "భిన్న భిన్న వ్యాఖ్యాతలు ఉపనిషద్విషయములను సిద్ధాంతరూపమున వెల్లడించుటకు అవలంబించిన పద్ధతులు" అని థీబా చెప్పుట సమంజసమగునా? పద్ధతులుగాని విషయములుగాని

వారి స్వంతములు కావు. ఉపనిషత్తులలోని మహర్షులే—యీ సిద్ధాంతమును తాము పరంపరగా మందుతరము వారికి చెప్పుచున్నామని తమ ముందున్న పరంపరా పురుషుల పేర్లు చెప్పియున్నారు. (సశేషము)

---

# సరస్వతీ తత్త్వం


ముదివేడు ప్రభాకరరావు,ఎం.ఏ.,

ఓరియంటల్ రీసర్చి ఇన్‌స్టిట్యూట్

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయము, తిరుపతి


జిజ్ఞాసః— సరస్వతి అంటే ఏమిటి? సరస్వతీ ఉపాసనవలన మానవజాతికి యెలాంటి శ్రేయస్సు చేకూరుతుంది? అనే ప్రశ్నల్ని గూర్చి విచారిస్తూ పోతే సరస్వతీ తత్త్వ మేమిటో కరతలామలక మౌతుంది.

భిన్నత్వంలో ఏకత్వంః— సరస్వతి జ్ఞానాధిష్ఠానదేవత, భారతీయ ధర్మం లోని అన్ని విచార మార్గాలూ సరస్వతిని గూర్చి చెబుతున్నాయి. వైదిక ధర్మంలో సరస్వతి, జైనధర్మంలో శ్రుతదేవత, బౌద్ధధర్మంలో ప్రజ్ఞాదేవి అనే పేర్లతో సరస్వతీదేవియే ఉపాసింపబడుతోంది. ప్రజ్ఞ జ్ఞానానికి అధిదేవత. బుద్ధభగవానునికి తపశ్చర్య, సమాధుల ఫలస్వరూపంగా లభించిన బుద్ధివిశేషమే ఈ ప్రజ్ఞ. ప్రజ్ఞ ఒక్కటే మానవునిలోని విశిష్టగుణం. భౌతిక, ధార్మిక శక్తుల యొక్క వాటివాటి గొప్పతనాలు వాటికున్నప్పటికీ ప్రజ్ఞ లేదా మనోశక్తి అన్నిటికంటే మించింది. ఒక సూత్రాన్ననుసరించి "మనస్సే మానవుడు." 'మనసుంటే మార్గం లేకపోదు' అనే లోకోక్తి ఇందుకే ఏర్పడింది.

వ్యష్టి మనస్సుః— మనస్సుకు రెండు స్వరూపాలు. ప్రతి వ్యక్తిలో ప్రత్యేకంగా నిర్మితమైన మనస్సున్నది. ఇది వ్యష్టి మనస్సు. నిజ జీవితంలో వ్యక్తి సాధించిన భౌతిక వికాసం వాని మనస్సునుండి నిర్గమించిందే నని చెప్పాలి. సృష్టిలో ఎందరు జీవులున్నారో అన్నిరకాల మనస్సులున్నాయి. 'జిహ్వాకొకరుచి పుర్రెకొక బుద్ధి', 'తాను మెచ్చింది రంభ తాను మునిగింది గంగ' అనే సామెతలిలా ఏర్పడ్డవే. వేర్వేరు జీవుల్లో వేర్వేరు ప్రజ్ఞలున్నాయి. ఈ ప్రజ్ఞల్లో గల అనంత భేదాలకు లెక్కా జమా లేదు. సృష్టిలోని సమస్త వస్తుజాలానికి ఎలా అంతం అనేది లేదో అల్లే ప్రజ్ఞా సహితమైన మనస్సు లేదా బుద్ధి అసంఖ్యాక భేదాలతో నిండి వుంది.

ఈ బుద్ధుల స్వరూపమేమిటని విచారిస్తే బుద్ధి లేదా మనస్సు అనేది ఏదో స్థూల వస్తువు కాదు. శరీరాన్ని మనం భౌతికంగా చూడగల్గుతున్నాను. కాని శరీరాంతర్గతమైన ప్రజ్ఞ లేదా బుద్ధి ఒక సూక్ష్మశక్తి. అది ఎలాంటి సూక్ష్మశక్తి అంటే మనం దాని ప్రేరణచేత శబ్దాన్ని ఉచ్చరించినపుడే ఆ శక్తి మనయందున్నదని తెలుస్తూ వుంది. ఇంకా చెప్పాలంటే మనస్సుయొక్క విచారణాఫలితమైన కర్మల్ని మనం చేస్తూ వుండడాన్ని బట్టి ప్రజ్ఞాశక్తి మనలో వుందని యితరులకు తెలుస్తూ వుంది. మీట నొక్కగానే తీగల్లో ప్రవహించే విద్యుచ్ఛక్తి బల్బు రూపంగా వెలుగునూ, పంఖారూపంగా గాలినీ ఎలా ప్రసరింపజేస్తూందో అదే ప్రకారంగా మనస్సులోని సూక్ష్మశక్తి మాటలుగా, చేతలుగా నిరంతరం మూర్తరూపాన్ని ధరిస్తూ వుంటుంది. వ్యక్తియొక్క ఈ ప్రజ్ఞ లేదా బుద్ధిని సాధారణ పరిభాషలో వ్యష్టి మనస్సు అనవచ్చును.

సమిష్టి మనస్సు:— ఎందరు వ్యక్తులో అన్ని వ్యష్టి మనస్సులు. ఇప్పుడాలోచించగా ఈ అసంఖ్యాకమైన వ్యష్టి మనస్సులు లేదా బుద్ధులన్నీ ఆదిలో ఒక చోట సమావేశపరుపబడినవనీ, వాటి సంగమస్థానం ఒకే చోటనీ, ఈ వివిధ రకాలైన బుద్ధిశక్తులకు జనిస్థానం లేదా ఉద్భవస్థానం ఒకటుందని తెలియవస్తుంది. ఇలాంటి ప్రజ్ఞాశక్తి యొక్క విశిష్ట భాండారానికి సమిష్టి మనస్సని అంటారు. సృష్టి ప్రవర్తమానమవడానికి మూలభూతమైన దుంపలో తప్పనిసరిగా ఇటువంటి ఒక సమిష్టి మనస్సున్నది. అది మిక్కిలి శక్తివంతమైంది. మహత్తరమైంది. అన్నిటికీ మించింది. అందులో వివిధ వ్యక్తుల వేర్వేరు బుద్ధి విశేషాలు ఏకత్రా సమావేశపరుపబడ్డాయి.

దేవతా పరికల్పన:— ఈ విధమైన సమిష్టి మానసాన్ని మనం 'దేవత' అని పిలువవచ్చును, వ్యష్టి మనస్సుకొక హద్దున్నది. హద్దున్నదానికి అంతముంది. కాని నిస్సీమం, అపరిమితం అయిన శక్తి అమృతం, అనంతం. అదియే దేవత. ఆ దేవతను ఏ పేరుతోనైనా పిలువవచ్చు. కాని అది అమృతత్వం. అన్ని ధర్మాలు, దర్శనాలు, ఆచారాలు, అధ్యాత్మవిషయాలు, నీతి, సాహిత్యాలు, కళలు ఇవన్నీ మానవ వ్యక్తిగత బుద్ధిలో వ్యస్తంగా భిన్నభిన్న విషయాలు కావచ్చును. కాని సమిష్టిరూపంలో ఇవన్నీ ఒకే విరాట్ మానసతత్వంలో లీనమై వున్నాయి. వ్యక్తికిది వ్యస్త దృష్టి. శక్తికిది సమస్త దృష్టి. ఈ మహత్తరమైన శక్తినే మనం జ్ఞానాధిష్ఠానదేవి సరస్వతి అని పిలుస్తున్నాము.

సరస్వతీ శబ్దార్థం:— "సృగతౌ" అన్న సంస్కృత ధాతు నిష్పన్న మైనదే సరస్వతీ శబ్దం. "సరో వివిధం జ్ఞానం విద్యతే యస్యాం చిత్తౌసా సరస్వతీ" సరోవరం నుండి జన్మించింది సరస్వతి అనేది సామాన్యార్థం. 'సృ' అన్న ధాతువుకు 'గతి' 'కదలిక' అని అర్థాలు. ఆ ఘాత మైతే కదలిక నిలిచిపోతుంది. కాబట్టి అది అనాహతం కావాలి. నిగ్రహం వున్నపుడు కదలిక అనాహత మవుతుంది. వివిధ జ్ఞానాలకు జనిస్థానం సరోభవయైన సరస్వతి. ఇక్కడ సరోవరం ఏమిటి? అదెక్కడ వుంది? పైన సమిష్టి మనస్సని దేన్నైతే చెప్పామో అదే ఈ సరోవరం. దాని నెవడూ ప్రత్యక్షరూపంలో చూడలేడు. అందుకే దానిని బుద్ధియొక్క అవ్యక్త సరోవరం అని చెప్పబడుతోంది. సరస్వతీనది అంతర్వాహిని (unconcious steam). దీన్నే ఋషులు 'బ్రాహ్మసర' మన్నారు. వేదం దీన్నే 'హిరణ్మయ ఉత్సము' (బంగారపు బావి) అన్నది.

ఉత్సోదేవ హిరణ్మయః — ఋగ్వేదం.

ఇక్కడ హిరణ్య మంటే సువర్ణం. బంగారు. ఉత్సమంటే బావి. ఈ సువర్ణం ప్రకాశించే స్థూలమైన ధాతువు కాదు. అది అధ్యాత్మతత్త్వం. అదే మనస్సు. ఆ ప్రకాశమానమైన సువర్ణ కిరణాలలో జీవిత సర్వస్వం యొక్క విలువలు సంగ్రహించ బడి వుంది. జీవితంలో ఎన్ని అమూల్యమైన రత్నాలున్నాయో వాటన్నిటికీ జనిస్థానం ఈ బంగారపు బావియే.

జ్ఞానజ్యోతి:—సరస్వతి సర్వశుక్ల. శుక్ల వర్ణం ప్రకాశం లేదా జ్యోతియొక్క రూపం. దీన్నే జ్ఞానం అంటారు. జ్ఞానం ఒక జ్యోతి. ఇది ప్రతి వ్యక్తియొక్క మాన సంలో అభివ్యక్తమౌతుంది. సృష్ట్యారంభం నుండి ఈ నాటివరకూ మానవుని మన స్సులో జ్ఞానరూపమైన జ్యోతిస్సు యెన్ని రకాలుగా ఉదయమైందో దీన్నిబట్టి మనం ఊహించుకోవచ్చు. అనేక ఋషులూ, మునులు, బుద్ధుడు, బోధిసత్త్వుడు, అర్హతులు, సిద్ధులు, ఆచార్యులు ఈ జ్ఞానజ్యోతిని ఉపాసించారు. నామభేదం చేత వస్తుతత్త్వంలో భేదమేమీ వుండదు. అందరూ సరస్వతీ మందిరంలో జ్ఞానజ్యోతిని ఉపాసించినవారే. ఇక ముమ్ముందు కూడా మానవుని పురోభివృద్ధికి మార్గమిదే.

మానస సరోవరం:— జ్ఞానంయొక్క స్వరూపం జ్యోతి లేదా ప్రకాశమని చెప్పబడింది. దానినే మరొక విధంగా జలమనికూడా చెప్పవచ్చు. ప్రతి వ్యక్తి మనస్సు ఆ విరాట్ జ్ఞాన సరోవరం యొక్క ఒక పరిమితమైన, సీమితమైన అంశం. లేక దీన్నిలా చెబితే మరింత బాగుంటుంది. వ్యక్తి మనస్సు ఒక కమండలం. ఈ

కమండలం ఆ విరాట్ జ్ఞాన సరోవరంలోని జలంతో నిండివుంది. జన్మ మొదలు మృత్యు పర్యంతం ఈ కమండలంలోని జలబిందువులతో మనం జీవిత వికాసాన్ని పొందుతూ వున్నాము. ఏది సమిష్టి జలమో అది నిత్యమూ స్వచ్ఛమైంది. దానిలో భావకాలుష్య ముండదు. ఎందుకంటే అది అగాధంలోని జలం. అందుకే అది నిర్మలం, మధురం, అమృతస్వాదువు. కాని అదే జలం వ్యక్తి మానస పాత్రలో వచ్చినపుడు అది సీమితమౌతున్నది. వ్యక్తియొక్క రాగద్వేషాలచేత కలుషిత మౌతున్నది. అందుకని ప్రతి వ్యక్తి ఈ విషయంలో నిక్కలి జాగరూకుడై వుండాలి. ఎల్లప్పుడూ తన మనస్సును సరస్వతి యొక్క విరాట్ జ్ఞానచింతనచే స్వచ్ఛత్వాన్ని, పరిశుద్ధినీ పొందేటట్లుగా చూచుకొంటూ వుండాలి.

**అహం=హంసః**— సరస్వతీదేవి వాహనం హంస. మానవుని వ్యక్తిగత బుద్ధిని లేదా మనస్సును 'అహం' అంటారు. అదే హంసః విరాట్ జ్ఞానాన్ని మూర్తరూపంలో అంటే ఒక కేంద్ర స్థానంలో దర్శించాలంటే మనోరూపమైన హంస కంటే వేరు మార్గంలేదు. సరస్వతీ ఆ వాహనం హంసద్వారానే సంభవం. వ్యక్తియొక్క మనస్సు ఆ పక్షితో సమానమైంది. దాని శక్తివంతాలైన రెక్కలతో విరాట్ ఆకాశాన్ని కొలవడంలో గొప్ప విశేషముంది. ఎవ్వరికీ పోవడానికి శక్యం కాని అతి గహనమైన ప్రదేశాలలోకూడా ఆ పక్షి తన పయన కౌశలంచేత విశేషాన్ని గ్రహించి తిరిగి రాగలదు. ఈ శక్తికి ఆధారం వారి వారి మనస్సులయొక్క ఏకాగ్రత లేదా సమాధి అనవచ్చును.[1] దీని ప్రాప్తికి సాధనం తపశ్చర్య. కేవల జ్ఞానం లేక ఇచ్ఛ ఇక్కడ పనికిరాదు.

**వ్యక్తుల వ్యవహారం - పరస్పర ప్రభావం:**— అనేక పాత్రల్లో ఉంచబడిన జలం నుండి ఒక్కొక్క బిందువు గ్రహించి వాటిని ఒక పాత్రలో ఎలా కలుపవచ్చో అలాగే వ్యక్తియొక్క మనస్సులో నిత్యమూ ప్రతిక్రియ జరుగుతూ వుంటుంది. మన ఆలోచనలు మనం ఇతరులకు అందిస్తూ వుంటాము. ఇతరుల సంస్కారం మనలో కలుపుకొంటూ వుంటాము. ఈ ప్రకారంగా ఎందరు వ్యక్తులతో మనం సాన్నిహిత్యం గల్గి వుంటామో ఆయా వ్యక్తుల మానస జలం మన మనస్సులో అనాయాసంగా కలిసిపోతూ వుంటుంది. ఆ దాన ప్రదానాలతో కూడిన ఈ కార్యక్రమమే మానవ జీవన వ్యవహారం. ఇది ఎప్పటికీ అంతమయ్యేది కాదు. ఈ గొలుసులోని ప్రతి సంకెల

1. శ్రీహర్ష, శ్రీనాథ, జగన్నాథ, విశ్వనాథాదుల ధిషణాహంకారాన్ని ఈ స్థాయినుండి చూడాలి. అప్పుడే వారి వారి ప్రత్యేకతలు తేటతెల్లమవుతాయి.

రాత్రింబవళ్ళు నాల్గుదిక్కులా ప్రసరిస్తూనే వుంటుంది "ఆనోభద్రాః క్రతవోయంతు విశ్వతః" నాల్గు చెఱగుల నుండీ గొప్ప గొప్ప భావాలు వచ్చి మమ్ము చేరుగాక! అని ఆహ్వానిస్తున్నాడు వేదఋషి. ఇలా కోరే ప్రతి మానవుడూ తన మానస జలాన్ని స్వచ్ఛంగా, నిర్మలంగా వుంచుకోవాలి. ఇది వైయక్తిక వైలక్షణ్య పరిరక్షణం. (Safe-guarding Individual Personality). ఇతరుల మేళ్తోడి సంపర్క సాన్నిహిత్యాలవల్ల తన మనస్సులో ఎటువంటి ఉద్వేగానికీ, అలజడికీ, ప్రతికూల ప్రతిక్రియలకూ తావీయకుండా జాగ్రత్తపడాలి. ఇదే ఉత్తమ సంయమన మనోలక్షణం. ఇలాంటి మనస్సే మానవ పురోగతికి మిక్కిలి ఆవశ్యకమైంది. ఇలాంటి స్వచ్ఛమైన మనస్సే ఆ సమిష్టి మనస్సుకు దగ్గరగా వుంటుంది. అలాంటి వారే దేవతలకూ. అమృత తత్త్వానికీ సన్నిహితంగా ప్రవర్తిస్తూవుంటారు. వారినే అమృతహృదయులని మనం పిలుస్తూ వుంటాము. కావ్య పరిభాషలో కవీ—సహృదయులంటే వీరే.

**మానవ మనోమందిరం:—** మన మనస్సులో ఇటువంటి సరస్వతీ మందిరాన్ని నిర్మించుకొంటున్నామో అది రాయిరప్పల కుప్ప కాకూడదు. అది జ్ఞానాధిష్ఠాన దేవతకొక ప్రతీక కావాలి. ఆ ప్రతీకద్వారా మనం దేవతా స్వరూప ప్రాప్తిని పొందాలి. ప్రతి సరస్వతీ మందిరంలో సేకరింపబడిన గ్రంథరాశి ఒక స్థూల ప్రతీక మాత్రమే. ఆ శబ్దరాశి నిస్సందేహంగా ఆ సమిష్టి మనస్సంజనితమైందే. ఆ జనిస్థానాన్నే మనం పైన బ్రహ్మసరం లేక సమిష్టి మనస్సు అన్నాం. ఈ స్థూల గ్రంథాల ప్రయోజనమంతా జీవిత చారితార్థ్యానికి ఉపయోగపడేంతవరకే. లిఖితాక్షరాల వెనుక ఏ వాస్తవికమైన అక్షరతత్త్వముందో దానికెన్నడూ నాశంలేదు. అక్కడికి చేరేటందుకు సోపానక్రమం ఈ గ్రంథ పఠన మననాదుల వలన ప్రతి మానవునికీ లభించాలనేదే మన ఆశయం. ఆదర్శం. ఎవడు జాగరూకుడై తన మనస్సును స్వచ్ఛంగా మేఘగత జల బిందువులాగా పవిత్రంగా ఉంచుకోవటానికి నేర్చుకొన్నాడో, చక్కగా మనస్సుచే విచారించి కార్యాలను యుక్తిసహంగా చేసుకోవడం అభ్యసించాడో, ఎవడు మనోశక్తిచే జీవననిర్మాణకళలో నిష్ణాతుడో అతనికి సరస్వతీ మందిర నిర్మాణధ్యేయం సార్థకమైనట్లే. ఈ విధమైన ప్రణాళిక సర్వధర్మాలకూ శ్రేష్ఠమైంది. సర్వరూపాలకూ ఉన్నతమైంది. ఈ విరాట్ మానవీయ సంస్కృతి యొక్క ఆరాధన సర్వజనులకూ ఉపాదేయమైంది. ఇది ఉదాత్తమైన ఆశంస.

---

కీ.శే. డా. వాసుదేవశరణ్ అగ్రవాలా హిందీ రచన యీ వ్యాసానికి తోడ్పడింది. (రచయిత)

# శ్రీ సరస్వతీదేవి - ఒక సంభావన

భారతదేశమునం దన్ని ప్రాంతములలో—మన మతశాఖలలో అందరిచేత—పూజింపబడుచున్న ఆరాధింపబడుచున్న దేవతామూర్తి శ్రీ సరస్వతీదేవి—ఆమె కున్న దేశవ్యాప్త ఆరాధన బహుశ గణపతికి దక్క మరి వేరొక దేవతామూర్తికి లేనేలేదని చెప్పవచ్చును. ఆమె ఆరాధన భారతదేశమున మాత్రమే కాదు-టిబెట్, జావా, జపాన్ మొదలగు విదేశములందుకూడ నున్నది. ఆమెను హైందవులు మాత్రమే ఆరాధించుట కాదు. వాగ్వాదిని, శ్రుతదేవత—అని జైనులు, ప్రజ్ఞాపారమిత, మంజుశ్రీ అని మహాయాన బౌద్ధులు, వజ్రవీణా సరస్వతి, వజ్రశారద అని తాంత్రికులు అర్చించుచున్నారు.

జ్ఞాన విజ్ఞాన దేవతగా—వివేక దాత్రిగా, నైపుణ్య సాధనము ననుగ్రహించునదిగా, సంగీత సాహిత్యాది లలితకళా దేవిగా సరస్వతీదేవికి మన మతమునందద్వితీయ స్థానమున్నది. భిన్నభిన్న శాఖలు ఆమె ఉన్నతికి భంగము కలిగింపలేవు-ప్రామాణిక గ్రంథ భేదము లామెను స్పృశించవు. తాత్త్విక దార్శనిక వివాదము లామె చెంతకు రావు. మల్లినేను డన్న సంస్కృత కవి సరస్వతీదేవిని గురించి చిత్రమైన శ్లోకమును రచించెను.

> సాంఖ్య భౌతిక చార్వాక మీమాంసక దిగంబరాః
> సౌగతా స్తేపి దేవి త్వాం ధ్యాయంతి జ్ఞానహేతవే॥

ఆమె ఆధిక్యత సర్వజనామోదమైనది. కవులు, తాత్త్వికులు, ఋషులు, విద్యాధికులు, సామాన్యులు—అందరు ఆమె అనుగ్రహమును అర్థించువారే. బహుశా హైందవ దేవతానీకమున తొలిగా రూపుదాల్చిన దామెయే కావచ్చును. ఋగ్వేదము నందతి ప్రాచీన మండలము లందామె ప్రస్తుతి కలదు. ఆమె విగ్రహములు యావద్దేశమునందున్నవి. చరిత్రకందని అతి పురాతన సరస్వతీ విగ్రహము భార్హుత్ నందున్నది. తరువాత క్రీస్తుకంటె ముందు కాలమునాటి సరస్వతీ శిల్ప మొకటి మధురాప్రాంతమున 'కంకాలితిలా' యన్న ప్రదేశమున నున్నది. క్రీస్తు సమకాలికు డని చెప్పదగిన హువిష్కుని నాణెములపైన స్పష్టముగా సరస్వతీమూర్తి (గంగా దేవితో కలసి) యున్నది.

హేమచంద్రుడన్న జైన విద్వాంసుడు సరస్వతీదేవి నామములకు భాష్యము వ్రాసెను. (అభిధాన చింతామణి 2, 155) బ్రాహ్మి=బ్రహ్మకు సంబంధించినది; భారతి=భరించునది (బిభర్తి) లేక నటకుల దేవత (భరతానామ్=నటనమ్);

సరస్వతి=ప్రవహించు దేవత (ప్రసరణమ్ అస్తి అస్యాః) లేక జ్ఞానపూర్ణమైన దేవత (సరో=జ్ఞానమ్, విద్యతే అస్యామ్). సరస్ అనగా ప్రవహించుట — పరుగిడుట— సెలయేరుగా సాగుట. సామాన్యముగా జలసంబంధమైనదే.

తొలి వేదకాలమున 'సరస్వతి' యన్న నది యొకటి గంగా సింధు మైదానమున చాల ప్రముఖపాత్ర వహించినది. ఆ నదీ తటమున వేదగానముద్భవిల్లినది. సంకలింపబడినది. ఆ నది వలన ఆనాటి ఋషులు ప్రభావితులైరి. దాని దివ్యత్వమును వారు తెలిసికొనిరి. నిత్యము మనలను జాగరితులను చేయుచున్న ఉషస్సు దేవతా మూర్తియే కదా! మనకు ఆధారమైన భూమి పృథ్వీదేవి కదా! అట్లే జ్ఞానప్రబోధన నదీదేవి దేవత యేల కారాదు. తొలుత సరస్వతి నదీదేవత.

ఋగ్వేదమున రెండు సరస్వతీ సూక్తములున్నవి. ఒకదాని యందామె నదీ దేవత. అయితే పరిశుద్ధాతి పరిశుద్ధ నదీమూర్తి ఆమె. (నదీనాంశుచిర్యతి) భూసారము సారవంతము చేయునట్టిదామె. నదులలో దివ్యత్వభరితయైన యీ నదిని స్తుతించుటకు వేదఋషి పూనుకొనినాడు. (7-6-95. బృహదుగాయిసె వచోసూర్య నదీనాం) మరియొక సూత్రమునందామె నది కాదు. (6-5-61 సరస్వతి దేవనిదో నిబర్హాయ ప్రజాం విశ్వస్య....) ఆమె శక్తియుక్తమైన దేవత. దేవతల శత్రువులను నాశము చేయుటకు ప్రార్థింపబడుచున్నది. (ఋగ్వేదము—2.3.30 సరస్వతి త్వం అస్మాంగా విద్ధిమ రుత్వతి దృశవతిజేసి శత్రుమ్)

ఇంద్రుడు వృషభుని సంహరించినప్పుడు సరస్వతీ యుక్తుడాతడు. ఆమె పవిత్రము చేయును (పావక) సత్యప్రియుల ఉత్సాహమామె (చోదయిత్రి సూనృతానామ్) సుమతుల చేతస్సు. (చేతన్తి సుమతీనామ్. ఋగ్వేదము 1-10-6). అయితే సరస్వతీదేవికి జలముతో ప్రబల సంబంధము. అద్భుతంగా ప్రకాశిస్తూ ముందుకు ఉరకలువేస్తూ వచ్చే వరదకూడా మనస్సుతో సంబంధం కలదే (ఋగ్వేదము 1-10-6.12) (ధియో విశ్వ విరాజతీ)

వేదవ్యాఖ్యాత సాయణుడు సరస్వతీదేవి ద్వివిధరూపయని — (నదీ-దేవీ) యాస్కుని ప్రమాణం చూపించినాడు. (ద్వివిధాహి సరస్వతి: విగ్రహావద్దేవతా నదీ రూపాచ .... సరస్వత్యా ద్విరూపత్వం యాస్కో దర్శయతి: యత్ర సరస్వతీత్యేతస్య నదివద్దేవతాచ్చ నిగమాభవన్తి—(నిరుక్త 2.23)

ఆ నదీతటమున వసించువారి వాక్కుతో మనోభావనలతో ఆమెకు సంబంధమేర్పడినది. ఋగ్వేదమున దేవీ సూక్తమని చెప్పబడు (10-10-125) అంభ్రణి

సూక్తమున్నది. అది వాగ్దేవి ప్రవచితమట. ఆమె అంభ్రిణ మునికూతురట (అందుచేత వాగంభ్రిణి). వేదవ్యాఖ్యాత సాయణుడు ఆమెను బ్రహ్మవిదుషిగా శ్రుతిపారంగతగా చెప్పెను. ఆమె దివ్య ఆవేశముతో విశ్వ చైతన్యాభిన్నత్వమును అనుభవములోనికి తెచ్చుకొని "నేనెవరిని ఎన్నుకొన్న — వానిని పురుషోత్తమునిగా — మహాకవిగా—మహర్షిగా—మహాజ్ఞానిగా చేతును" అన్నది.

(సాయణుని వాక్యములు: అంభృణస్య మహర్షేర్దుహితా వాగ్నామ్నీ బ్రహ్మవిదుషి స్వాత్మానం అస్తౌత్. సచ్చిత్సుఖాత్మకః సర్వగతః పరమాత్మ దేవతా తేన హ్యేషా తాదాత్మ్యం అనుభవంతి సర్వజగద్ — రూపేన సర్వస్య అధిష్ఠానత్వేన చాహం ఏవ సర్వం భావమితి స్వాత్మానమ్ స్తౌతి).

(యం కామయే తంతం ఉగ్రం కృణోమి తం బ్రహ్మాణాం తం ఋషిం తం సుమేధాం)

ఆ విధంగా మానవత్వాన్ని అధిగమించి విశ్వచైతన్యంతో ఐక్యతను ప్రకటించుకొన్న వనితకు నిజంగానే దివ్యత్వం వచ్చివుంటుంది. దివ్యత్వావేశభరిత వాక్కుయొక్క రూపము—జ్ఞానకలిత మానూక్తము. ఎట్లయినను మన సంస్కృతమున చాల పురాతన కాలముననే—వాక్కునకు దివ్యజ్ఞానమునకు అధిష్ఠాన దేవత యేర్పడినది.

అంతకు ముందొక మంత్రమున మనస్సును రక్షించుటకు సరస్వతీ ప్రార్థనమున్నది. (ఋగ్వేద 6-6-61 (4) గృత్సమదమహర్షి సరస్వతీదేవిని వాత్సల్యమూర్తియైన తల్లిగా (ఋగ్వేద 1-4-41 (16-8) నదీసుతల్లిగా, దేవతాశిరోమణిగా సంభావించి అప్రశస్త భక్తులను ఘనులనుగా అనుగ్రహింపవేడెను. బ్రహ్మదేవునికి తెలుపమనెను. రమణీయమైన ఆ మంత్రము—

అంబీతమె నదీతమె దేవీతమె సరస్వతీ!
అప్రశస్తా ఇవ స్మసి ప్రశస్తిం అంబ నస్కృధి
.... .... .... .... .... .... .... .... .... ....
.... .... .... .... .... .... .... .... .... ....
ఇమా బ్రహ్మ సరస్వతి జుషస్వ వాజినీవతీ.
యాతే మన్మ గృత్సమదా ఋతావరి ప్రియా దేవేషు జుహ్వతి!!

సరస్వతీదేవికి సన్నిహితమైన దేవతామూర్తి — వేదజ్ఞాన అధిష్ఠానదేవత గాయత్రి. తొలుతనది యొక ఛందస్సు పేరు. తరువాత వేదమాతగా సంభావన. సామాన్య ప్రతీతిలో ఆమె బ్రహ్మదేవుని జాయ. నిజమునకామె వేదగర్భ—వేదసార.

వేదగాయకుని రక్షించునదని అర్థము. గాయత్రి శబ్ద వ్యుత్పత్తి—గాయం తాం త్రాయసే ఇతి.

తైత్తిరీయారణ్యకమున ఋషి గాయత్రి ఛందస్సును తనకు బ్రహ్మజ్ఞానము కల్గింపుమని అర్థించుచున్నాడు. (ప్రపాఠక 10, అను వాక 34. ఛందసామా తేదం బ్రహ్మజు షస్వమే). సంధ్యావిద్యగా, సరస్వతిగా ఆమె సంబోధింపబడినది. సరస్ అనగా తేజస్సు అని ఒక వ్యుత్పత్తి. వేద పరిభాషలో గాయత్రి భర్గుని తేజస్సు (సవితృ). సావిత్రి పదముకూడ గాయత్రి వంటిదే. (సత్యవంతుని భార్య సావిత్రి కాదు). సవితృర్ ద్యోతనాచ్చైవ. గాయత్రి మంత్రద్రష్ట విశ్వామిత్ర మహర్షి. పౌరాణికముగా ఆయన వశిష్ఠునికి ప్రతిస్పర్థి.

ఈ పౌరాణిక గాథను దృష్టియందుంచుకొన్నచో లక్ష్మీ తంత్రములోని కథ చిత్రముగా నున్నది. విశ్వామిత్రుని అభ్యర్థనముపై ఆమె వశిష్ఠుని తన వరదనీటిలో తీసికొనిపోయెనట. (ప్రక. 50 శ్రీ సూక్త ప్రభావ ప్రకాశ శ్లోకములు 71-74). గాయత్రి మంత్రము ప్రధానముగా జ్ఞానాలాభాపేక్ష కలది. మనస్సును చైతన్యవంతము చేయుటకు (ధియోయోనః ప్రచోదయాత్) ఋగ్వేదమున మరొకచోట ఆమె మనస్సునకు చోదయిత్రిగా చెప్పబడినది. (1-1-2—(11).

మనస్సునకు వాక్కునకు సంబంధమున్నదని మన ప్రాచీనులెప్పుడో గ్రహించిరి. సావిత్ర్యుపనిషత్తునందు సవితృడనగా నెవ్వరు? సావిత్రి యెవ్వరు? మనస్సు సవితృడు. వాక్కు సావిత్రి. మనస్సు కలచోట వాక్కు కలదు. వాక్కున్నచోట మనస్సు కలదు. రెండును కలసి యొక్కటే—అని చెప్పబడినది. (కఃసవితా? కః సావిత్రీ? మన ఏవసవితా వాక్ సావిత్రి స యత్ర మనస్తత్రవాక్: యత్ర వావాక్ తన్మమునస్తే ద్వే యోని తద్ ఏకం మిధునం).

వైదిక మండలములలో సవితృడు ప్రముఖుడు. వేదమతమున అతి పూర్వ దేవతా మూర్తి. సూర్యుని మూర్తులందొకటి. సృష్టిజీవుల పరిణామమునకు అతి ముఖ్యశక్తి కారకుడు. శబ్దమునకు వ్యుత్పత్తి అర్థము సకలము—ప్రభావము కలిగించువాడు—(సర్వస్య ప్రసవితా. నిరుక్తము 10, 31) సూర్యోపాసన మిక్కిలి పురాతనమైనది. ఇతర దేశములందుకూడ నున్నది. నేటికిని ద్విజుల సంధ్యావందనమున ప్రత్యేకముగా నున్నది. మహాభారతమునందెడనెడ కన్పించును. మయూరభట్టు సూర్యశతకమునుబట్టి దానికేంత ప్రాముఖ్యముండెడిదో గమనార్హము. నేడు ఉత్తర భారతమున కన్పించు సూర్యదేవాలయములనుబట్టి (ఒరిస్సాలోని కోణార్క దేవాలయము పరిధినుండి—

గుజరాతులో మోఢారలోని ఆలయమువరకు) సూర్యోపాసన విస్తృతముగా వ్యాపించి యుండినట్లు స్పష్టము. వాలభిరాజులు మైత్రకులు, థానేశ్వర్ రాజులు పుష్యభూతులు—మరికొందరు —, తాము సూర్యోపాసకులమని చెప్పికొన్నారు. (పరమ ఆదిత్య భక్తాః) ఈ ప్రభావము తరువాతి కాలమునాటి భాగవతులపై స్పష్టము.

ఋగ్వేదమున పెక్కుపర్యాయములు సూర్యశక్తి ప్రశంసింపబడినది. దానికి రూపకల్పన చేయబడినది. ఐతరేయ బ్రాహ్మణమున ఆ రూపమునకు ఉషస్సు భార్య యని చెప్పినది (15, 4). 'ద్యావాపృథివీ'లు కూడ భార్య. ఈ ఆలంకారిక భావము భవిష్య పురాణమున—విశ్వకర్మ కూతురు సూర్యుని వివాహమాడినట్లు రూపము కట్టినది. విశ్వకర్మ కుమార్తెకున్న బహునామములలో సురేణు (మంచి వెలుగు కిరణము) అని కలదు. సంజ్ఞా (తెలివి) ప్రజ్ఞా, ప్రభా, ద్యౌ అనికూడ కలవు. మానసిక స్థితులకు సూర్యునితో సంబంధము స్పష్టముగా స్థాపితము.

క్రీ.పూ. 5వ శతాబ్దిలో నున్న పాణినికి తెలిసిన భాగవత శాఖ సర్వవ్యాప్తియైన విష్ణు(విశ్వం వేష్టి = వ్యాప్నోతి)వునుండి వచ్చినది. వైదికమండలమున ఆయన సూర్యశక్తి రూపములందొకటి. సవితృ, పూషా, భగ, వివస్వత్, మిత్ర, అర్యమాన్-యితరములు. ప్రసిద్ధమైన ధ్యానశ్లోకమున విష్ణువు 'సవితృమండల మధ్యవర్తి' అని చెప్పబడినది. భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఆదిత్యులందు విష్ణువుగా చెప్పబడినది. (10-21). సంయుక్త సూర్యనారాయణ విగ్రహములు యావద్భారతమున కన్పించుచున్నవి. ఈ సూర్య విష్ణువుల సంబంధమును బట్టియే ఉత్తర భారతమున కొన్ని గుడుల విష్ణు విగ్రహములకు ఒకప్రక్క సరస్వతి మరొకప్రక్క లక్ష్మి వుండుట అవగాహన చేసికొనవలెను. వంగదేశమున బకర్‌గంజి జిల్లాలో లక్ష్మణకటి దగ్గర లభించిన విష్ణు విగ్రహము కూర్చున్నది పాలయుగమున కన్న పూర్వమునిది కలదు. ఆయన చిహ్నములకు దివ్య రూపకల్పన మున్నది. చక్ర పురుష గదాదేవి, కమలా-శంఖము సరస్వతీ రూపముతో పద్మముపై వీణావాదన చేయుచున్నట్లున్నది. (ఢాకా మ్యూజియం విగ్రహముల వివరణ 1929) (సముద్రగుప్తుని నాణెములపై పిల్లనగ్రోవి నూదు విగ్రహము జ్ఞాపకమునకు వచ్చును) దక్షిణ భారతమున విష్ణువు పార్శ్వములందు శ్రీదేవి, భూదేవి ఉందురు. ఉత్తరమున భూదేవి బదులు పుష్టి సరస్వతి. లక్ష్మీతంత్రమున విష్ణు వ్యూహమూర్తియైన ప్రద్యుమ్నునికి భార్యగా సరస్వతి చెప్పబడినది (బ్రహ్మవైవర్త - ప్రకృతికాండ, 1-7) ఈ సంబంధమునకు పురాణము

లందొక వివరణమున్నది. గోలోకమున నిత్యవిహారము చేయుచున్న రాధా మాధవు లందు—రాధాదేవి నాలుక కొసనుండి—పీతవసన, సర్వాభరణ భూషిత, సౌందర్య మూర్తి, వీణాపాణి—సముద్భవించినది. అప్పుడు రాధాదేవి వామపార్శ్వము లక్ష్మీ దేవి యైనది. మాధవుడైన శ్రీకృష్ణుడు చతుర్బాహువులతో విష్ణువును తన వామ పార్శ్వము నుండి సృజించెను. ఆయనకా లక్ష్మీ సరస్వతుల నిచ్చివేసెను.

విష్ణువు లక్ష్మీదేవినే అంటిపెట్టుకొని యుండుటకు పురాణము మరొక వివరణ మిచ్చినది. విష్ణువుకి గంగకూడ భార్యగా లభించినదట. ఒక పర్యాయము విష్ణువు గంగతో క్రీడించుచుండగా అసూయగల సరస్వతి విష్ణువును పక్షపాతముకలవాడని నిందించినదట. అప్పుడు విష్ణువు అదృశ్యుడు కాగా సరస్వతి మరింత కోపించి గంగను కొట్టపోగా లక్ష్మి అడ్డుపడినదట. సరస్వతి కోపము శమింపక లక్ష్మిని వృక్షము కమ్మని శపించినదట. లక్ష్మిమాత్రము శాంతముగా నుండి సరస్వతిని వదలలేదట. అన్యాయముగా లక్ష్మిని సరస్వతి శపించినదని గంగ సరస్వతిపై కోపించి నదివి కమ్మని శపించినదట. సరస్వతి గంగనుకూడ నదిని కమ్మని శపించినదట. గంగా సరస్వతులు నదులైరట. లక్ష్మిమాత్రమే విష్ణువుతో నున్నది.

అయితే సామాన్యముగా—ముఖ్యముగా దక్షిణ భారతమున సరస్వతి బ్రహ్మ భార్య. ఆమె బ్రహ్మదేవుని శక్తి. (సావిత్రి గాయత్రులతో). అంశుమద్భేదాగమ గ్రంథమున బ్రహ్మ సరస్వతు (దక్షు) లతో నుండవలెనని కలదు. (బ్రహ్మ సూర్యుల సారూప్యత గమనార్హము. బ్రహ్మ సూర్య సమిష్టి చిత్రణ మొకటి వీరేంద్ర రీసర్చి మ్యూజియంనందున్నది. 11వ శతాబ్దికి చెందినది. కలకత్తా యూనివర్సిటీ ప్రకటించి గ్రంథము (1956)లో పుట 555). మాల్డాలో నున్న కుడ్యచిత్రణమున త్రిముఖ బ్రహ్మ కళ్లే కలగు, సరస్వతీ బ్రహ్మలను గురించిన పురాణగాథ యొకటి కలదు. (మత్స్యపురాణము 3) సృష్టికర్త బ్రహ్మ యొకప్పుడు తీవ్రతపశ్చర్యలో నుండెను. ఆయన మనస్సు నుండి పదిమంది పుత్రులు, శరీరమునుండి తొమ్మిదిమంది పుత్రులు ఒక కుమార్తె ఉద్భవించిరి. కూతురు (శతరూప సరస్వతి, సావిత్రి గాయత్రి బ్రహ్మణి అని ఆమె నామములు) సౌందర్యవతి. బ్రహ్మకు ఆమెపై మోహము జనించెను. ఆమె భక్తితో ఆయనకు ప్రదక్షిణీకరింపగా—ఆయన ప్రక్కకు తిరుగకయే ఆమెను చూడ దలచి నాలుగు మోములవాడయ్యెను. చతుర్ముఖుడు.

బ్రహ్మ విష్ణువు లొక్కరేయని నిరూపించుట కష్టము. ఆ దృష్టి బలపడుటకు సూచనలున్నవి. ప్రజాపతిగా పరిణమించిన బ్రహ్మ, ఋగ్వేదమున, అథర్వమున

వాజసనేయ సంహితలో, బ్రాహ్మణములందు సర్వోత్కృష్ట దేవతగా భావింపబడినది. తైత్తిరీయ సంహిత యందు శత పథ బ్రాహ్మణమునందు—ప్రజాపతి మత్స్యముగా కూర్మముగా వరాహముగా అవతారములెత్తి సృష్టికార్యము సాగించుట, సంరక్షించుట చేసినాడని కలదు. అయితే యీ అవతారములు విష్ణుమూర్తివని జగద్విదితము. సామాన్య మానవుని మనస్సులో బ్రహ్మ విష్ణువుల కేకత్వమున్నదన్న భావనున్నదా? అయితే భగవద్గీతయందు బ్రహ్మ శబ్దము చాలపర్యాయములు పురుషోత్తమ వాసుదేవుడన్న అర్థముతో ప్రయోగింపబడినది. ఈ విషయముపై నింకెంతయో వెలుగు ప్రసరింపవలసి యున్నది.

తాంత్రికముగా సరస్వతిని గురించిన పరిశీలనమున్నది. మార్కండేయ పురాణమున దేవీ మహాత్మ్యమున పరాదేవి గుప్తరూపిణియై యుండి మూడు మూర్తులు ధరించునట్లున్నది. సరస్వతి ఆమె సాత్వికరూపము లక్ష్మి ఆమె రాజసరూపము. కాళి తామసరూపము. మరల నీ మూడు రూపములందొక్కొక్కటి ద్విధారూపమునా నిలంచినవి. పురుష స్త్రీ రూపములు. అయితే యీ సంగతి యంతయు అతికృతకముగా నుండుట వలన వివరణమక్కరలేదు.

సరస్వతీదేవికి జానపద సన్నిహితత్వముండుట కొంత పరిశీలింతము. జానపద విశ్వాసములను అధికముగా ప్రతిఫలించు (చతుర్థవేదము) అథర్వణమునందు సర్వ విషమును నశింపజేయు దేవతగా సరస్వతీదేవి స్తుతింపబడినది — X-4.14). ఆటవికులు సర్వవిష నివారణకై సరస్వతీ ప్రార్థనము చేసినట్లెన్నియో నిదర్శనములున్నవి. ఈ సందర్భముగా సరస్వతీదేవితో పాటు ఘృతాచినామము అథర్వవేదము (1-11) నందు కన్పించుచున్నది. అక్కడ ఘృతాచి సరస్వతీదేవికి పర్యాయపదము. అమర కోశమున అప్సరఃకాంత (స్వర్గవర్గ 51) తొలుత ఆమె కిరాతకన్య. విష ఉపశమన చాతుర్య ఆమె ఉపాసన నేటికిని ఆటవికుల ఆచరణలో నున్నప్పటికి నాగరికులు విస్మరించినారు. అయితే మహాయాన బౌద్ధులు జ్ఞాపకముంచుకొని నూత్నరూపమును కల్పించి ధ్యానబుద్ధుని శక్తియైన తారాదేవిగా సంభావించిరి. ఆటవిక దేవియైన జాంగులి—వీణావాదన చేయు నాగదేవత ఆమెయే. (బౌద్ధుల విగ్రహములు పుటలు 78.80.29 భట్టాచార్యకృతము) అయితే తరువాత కాలమున జాంగులి విస్మృతముగా వ్యాప్తిచెందిన 'మానస' దేవితో కలసిపోయినది. మానస కశ్యపుని మానస పుత్రి. ఆమె సరస్వతీ దేవి వలెనే కన్పించును. కాని ఆమెపైన పడగల సర్పరాజున్నాడు, ఆమె ధ్యాన శ్లోకములందామె యోగినిగా హంస వాహనము కలదిగా చెప్పబడినది.

వంగదేశమున మిక్కిలి వ్యాప్తియందున్న యీమె ఉపాసననుబట్టి — యీమెకు వైదిక సంబంధమేమిటని పరిశీలన జరిగినది. ఆమె సరస్వతియే యని భావింపవలసి వచ్చుట తప్ప మరేమియు తోచలేదు.

అయితే శాంతినికేతనమునకు చెందిన క్షితి మోహనశాస్త్రి కొంత వివరణ వ్రాసెను. తెలుగు కన్నడము వారు గ్రామదేవతగా పూజించు 'మంచమ్మ' (దాక్షిణాత్య నాగారాధకుల దేవత) బహుశ 11 వ శతాబ్దమున దాక్షిణాత్యులతో వంగదేశమున ప్రవేశించినదని. ఏది ఎట్లున్నను—మానస దేవికున్నవని భావింపబడు నివారణ శక్తులు శతపథ బ్రాహ్మణమున (1, 7, 12) సరస్వతీ దేవికున్నవని చెప్పబడినవే.

ఇంద్రుడొక యజ్ఞ భంగముచేసి—అందువలన రోగపీడితుడయ్యెను. అతని శరీరమన్ని భాగముల నుండి అతని తేజోవీర్యములు వెలికి పోసాగెను. దేవతలు సరస్వతీదేవిని ప్రార్థింపగా ఆమె అతని రోగమును 'వాక్' చేత నివారించెను. కృతజ్ఞుడైన ఇంద్రుడు ఆమె కొక పొటేలును సమర్పించెను. అతని నాసారంధ్రములు నుండి వెలువడిన తేజోవీర్యముల రూపుకట్టగా యేర్పడినదా పొటేలు. వీరేంద్ర రీసర్చి మ్యూజియంలోని చిత్రమున హంసకు బదులు పొటేలు వాహనముగా నున్నది. సరస్వతీదేవికి పొటేళ్ళను బలియిచ్చుట శతపథ బ్రాహ్మణమున (7, 2) నున్నది. అది యీనాటికి బాంగ్లాదేశమున ఢక్కా ప్రాంతమునందాచారములో నున్నదట.

అందరు భావించునదేమనగా—శివగణేశులవలె సర్వతీదేవియు భారతమును ఆర్యులు ప్రవేశింపకమున్నే—ఉన్న దేవతామూర్తి యని. నూతనాగంతకులు మగుల యీ మూర్తులను తమవిగా గ్రహించిరని. అయితే ఆ దేవికి కొన్ని నూతన సౌకుమార్య సౌందర్య లక్షణములు—క్రొత్త ప్రాముఖ్యత వచ్చి చేరినవి.

నేడు శ్రీ సరస్వతీదేవి యని మనము సంభావించు దేవతలో — పూర్వుల భావనలెన్నియో—నామరూపము లెన్నియో సంలీనములైనట్లు తోచుచున్నది.

[మిథిక్ సొసైటీవారి సౌజన్యముతో]

---

Printed & Published by A. Satyanarayana Murthy,
6-3-609/18, Anand Nagar, Khairatabad, Hyderabad - 500 004.
Printed at KRANTI PRESS, MADRAS-600 001.
Editor : T. Ramalingeswara Rao

# ఒక ముఖ్య వార్త

శ్రీ శృంగేరీ జగద్గురు శంకరాచార్య శ్రీ మదభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణులు (జగద్గురు పరంపరలో 35 వారు) ప్రజోత్పత్తి నామ సం॥ర జ్యేష్ఠ శు పంచమినాడు (1931 సం॥) సన్న్యాసాశ్రమము స్వీకరించిరి. అనగా దుర్మతి సం॥ర జ్యేష్ఠశుద్ధ పంచమి శనివారము (6 జూన్ 1981) నాటికి 50 సంవత్సరము లగుచున్నది.

ఆనాడు శ్రీ మహాసన్నిధానమువారి సన్న్యాసాశ్రమ స్వీకార స్వర్ణోత్సవమును చేయుటకు శిష్యమహాజనము పూనుకొనుచున్నది - ఉత్సవము ఎచ్చట జరుగునది - ఉత్సవ వివరములు - మేనెల సంచికలో ప్రకటింపబడును. ఆనాడు శ్రీ శంకరకృప పాఠకుల తరఫునకూడ పాదపూజాదులు నిర్వహించుట సమంజసమన్న సూచన వచ్చినది. ప్రత్యేక సంచికను ప్రకటించుడని మరియొక సూచన - పాఠకుల అభిప్రాయములను తెలుపుడని కోరుచున్నాము. పాదపూజకు ప్రతి వారు రు. 6/= లను పంపవలసియుండును.

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు
సంపాదకుడు

ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి
ప్రకాశకుడు

---

శ్రీ గురుభ్యోనమః

శ్రీ శృంగేరీ జగద్గురు శంకరాచార్య శ్రీ మదభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణులకు ప్రియాంతేవాసులు తత్కరకమల సంజాతులు శ్రీ జగద్గురు భారతీ తీర్థస్వామి చరణుల వార్షిక వర్ధంతి శుభసమయమున శ్రీ మహాసన్నిధానము వారికి భక్తిపూర్వక సాష్టాంగ ప్రణామములు.



దువ్వూరి నరసింహమూర్తి (పరసుఖానంద)
మండవ రాఘవయ్య, సీతారామమ్మ (దంపతులు)
మండవ జగన్మోహనరావు, పార్వతీదేవి(దంపతులు)
మండవ జయరాం, శారదా (దంపతులు)
దేవభక్తుని ఐ. బెనర్జీ, రాజేశ్వరి (దంపతులు)



సోమసుందర రైస్ మిల్
10, క్రొత్తస్ట్రీటు,
తిరువారూరు
తంజావూరు జిల్లా - 610001

శ్రీ జగన్మోహన రైస్ మిల్
7 రేస్‌పార్క్ రోడ్డు
మడువంకరై
మదరాసు - 600032

శ్రీ గురుభ్యోనమః

గురోరనుగ్రహానీశః ఈశ్వరానుగ్రహాద్గురుః
శ్రీ గురోః దర్శనం హేతుః పరమేశ్వర దర్శనమ్

భూమండలాచార్యక సార్వభౌములు తపశ్చక్రవర్తులు
శ్రీ జగద్గురు భారతీతీర్థస్వామి సేవితపాదారవిందులు,
శ్రీ శృంగేరి జగద్గురు శంకరాచార్య శ్రీ మదభినవ
విద్యాతీర్థ మహాసన్నిధానమువారి చరణారవిందములకు

భక్తిభరిత సాష్టాంగ ప్రణామములు

శ్రీ జూపూడి గోపాలకృష్ణరావు
శ్రీమతి జూపూడి వసంత రాజ్యలక్ష్మి

(శ్రీ రాధానిలయము : 3-4-133 బర్కత్ పురా)
హైదరాబాదు
ఫోన్ 41306

శ్రీ శృంగేరి శారదా చంద్రమౌళీశ్వరులకు,
జగద్గురువులకు ప్రణామములతో—

# పోలిసెట్టి సోమసుందరం ప్రైవేట్ లిమిటెడ్

టొబాకో ఎక్స్పోర్టర్స్

పోస్టుబాక్సు నెం. 99

గుంటూరు - 522 001



డైరెక్టర్లు

శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయులు

శ్రీ పి. ఇ. గుప్తా

శ్రీ పి. వి. బాపనయ్య

శ్రీ పి. యస్. హెచ్. ప్రసాదరావు

Regd. No. [illegible]          F/HD 392. SRI SANKARA KRUPA

April 1981

To Dr. Sankaranarayanan

Director, S.V. University

Oriental Research Institute

Tirupati :: Chittoor District

With best Compliments from




INDIAN COMMERCE AND IND[illegible]

(P) LIMITED,

Broadway .. MADRAS



Founded by

**Sri Kowtha Suryanarayana Raogaru**

**in**

**1907**

---

**If undelivered please return to:**

**A. SATYANARAYANA MURTY,**

**Publisher : Sri Sankara Krupa**

**6-3-609/18 Anand Nagar Khairatabad, Hyderabad-500004.**

# శ్రీ శంకర కృప

దక్షిణామ్నాయ

శ్రీశృంగేరీ శారదాపీఠమువారి యాజమాన్యమున వెలువడు

ఆధ్యాత్మిక మాసపత్రిక


| | | |
|---|---|---|
| సంపుటి: 20 | వెల రు. 1 మే, 1981<br>సంవత్సర చందా రు. 10/- | సంచిక: 9 |




దుర్మతి చైత్ర - వైశాఖ (శకాబ్ది ౧౯౦౩)

శంకర జయంతి సంచిక






శ్రీ మహాసన్నిధానమువారి శాద్రి వర్ధంతి ఉత్సవ సభలో
(6-11-80) శ్రీ చరణుల అనుగ్రహ భాషణము

# శ్రీ శంకర కృప

సంపాదకులు: తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

సంపుటి 20 } శంకరశ్శంకర స్సాక్షాత్ వ్యాసో నారాయణో హరిః { సంచిక 9

## శ్రీ శంకర భగవత్పాదాచార్య విరచిత

### శ్రీమత్త్రిపురసుందరీ వేదపాద స్తోత్రము

మూలాధారా దూర్ధ్వమంతశ్చరంతీం
భిత్త్వా గ్రంథీన్మూర్ధ్ని నిర్యత్సుధార్ద్రామ్।
పశ్యంతస్త్వాం యేచ తృప్తిం లభంతే
తేషాంశాన్తిః శాశ్వతీనేత రేషామ్॥ 60

(దీనియందున్న వేదపాదము కఠములోనిది)

తా. మూలాధార చక్రమునకు పైన సంచరించునదియు బ్రహ్మ విష్ణు రుద్ర గ్రంథులను భేదించి సహస్రారకమలమునుండి స్రవించు అమృతముచే తడిసినదియు నగు నీ రూపమును సాక్షాత్కరించి తృప్తిని పొందునట్టి వారికే శాశ్వతమైన శాంతి గాని ఇతరులకు శాంతిలేదు.

విశేషములు: ఇందు శ్రీదేవి సుషుమ్నానాడి గత కుండలినీ శక్తిగా చెప్పబడి నది. అది ఆత్మాభిన్నము. మూలాధారము నుండి షట్చక్రములను (మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక అనాహత, విశుద్ధ, ఆజ్ఞా) గ్రంథిత్రయమును ఛేదించి కుండలిని సహస్రారకమలమును చేరి అక్కడ అమృతవర్షముచే ఉజ్జీవనమగుట శ్రీవిద్య యందు ఆంతర సాధనము అంతరాగ్యము. ఇది జీవబ్రహ్మైక్యాను సంధానమే. ఇట్టి సంధానము చేయువారికే శాంతియని—ముక్తజీవులకే శాంతియని—అన్యులకు లేదని శ్రీ భగవత్పాదులు చెప్పుట. దీనిని ఉపనిషదర్థాను సంధాన మనియే చెప్ప వలెను. జ్ఞానులకే దుఃఖరహిత శాంతియని తాత్పర్యము.

---

# శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి చరణ స్మరణమ్

## వైరాగ్యము

(గతసంచిక తరువాయి)

పై సంఘటనను గమనించిన శిష్యుడొకడు తన ప్రక్కనున్న వృద్ధునితో (అతడు శృంగేరి వాస్తవ్యుడు) దానిని గురించి ప్రస్తావించగా ఆ వృద్ధుడిట్లనెను. "ఇంతకంటె అద్భుతమైన సంఘటనలను నేను చూచితిని. గత సంవత్సరమనుకొందును—లేక అంతకు ముందుసంవత్సరమో—శ్రీ జగద్గురు లిచ్చటకు యిదేవిధమైన పూజ చేయుటకు విచ్చేసిరి. దేవాలయ నిర్వాహకులు శ్రీ జగద్గురువుల ఆగమన సందర్భముగా దేవాలయమున నేలమీదనున్న నూనె మరకలను మట్టిని గీకివేసిరి.

శ్రీ జగద్గురువులు వచ్చి పూజకు కూర్చున్న తరువాత—గర్భాలయమున నేల మీదనున్న ఒక రంధ్రమునుండి—ఎఱ్ఱచీమల దండు ఒకటి బయల్వెడలినది. పరిచారకు డచట నిలువలేక గంతులు వేయవలసి వచ్చెను. నిమిషమునకొకసారి బయటకు వచ్చి కాళ్ళకు పట్టుకొన్న చీమలను దులిపికొనవలసి వచ్చెను. అడవిచీమల క్రూరత్వముతో అవి అతనిని కుట్టసాగినవి. ఆ దినమునకూడ శ్రీ జగద్గురువులు నిశ్చలముగా పూజను సాయంత్రమువరకు చేసి—శ్రమపడనివారివలె—అప్పుడే స్నానము చేసినవారివలె—బయటకు వచ్చిరి. చీమలు ఆయనలో మిత్రునే గుర్తించి ఆయన నిష్ఠకు భంగము కలిగించలేదు."

శ్రీ జగద్గురువులు తుంగానది గట్టున నల్లశాణపు ఱాతిమీద వేసవి యెండలో ఱాయి మాడిపోవుచుండగా గంటల తరబడి కూర్చుండుట చాలమందికి తెలియును. ఆయన వెంటనున్న పరిచారకులు వేసవి సూర్యుని తీక్ష్ణతను భరించలేక – క్రింద నల్ల ఱాయి మంటను భరించలేక దగ్గరలో నున్న చెట్టుకడకు పరుగిడిపోయెడివారు.

దీనినిబట్టి స్పష్టమైనదేమనగా—శ్రీ జగద్గురువుల మనస్సొక్కటే పరిపక్వమై విరాగితాధూర్వహమగుటకాదు—ఆయన శరీరముకూడ ప్రకృతిశక్తుల విజృంభణమును లెక్కచేయని స్థితిని చేరుకొన్నదని స్పష్టము.

నిజమునకు శ్రీ కృష్ణ పరమాత్మ భగవద్గీతలో—మానసిక పరిపక్వత సాధించినవాడు—యిక్కడనే సకల సృష్టిని జయించును—అన్న వాక్యమును శ్రీ జగద్గురువులు నిస్సందేహముగా ఋజువుచేసిరి. (సశేషము)

---

# శ్రీ జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణుల ఉపదేశములు

భగవద్గీత పదునారవ అధ్యాయము "యఃశాస్త్ర విధిం విసృజ్య వర్తతే కామ కారతః న సిద్ధిం అవాప్నోతి న సుఖం న పరాంగతిం"—తస్మాత్ శాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ జ్ఞాత్వాశాస్త్ర విధానోక్తం కర్తుం ఇహార్హసి'—ఎవడు శాస్త్రవిహిత కర్మలను పరిత్యజించి యథేచ్ఛగా ప్రవర్తించునో వాడు సిద్ధి సాధింపలేడు. సుఖము పొందలేడు. పరమమైన గతిని చేరలేడు. అందుచేత ఏమి చేయవలెనో కూడదో తెలిసికొనుటకు శాస్త్రములు ప్రమాణముగా గైకొనుము) అన్నది.

ఇది మరికొంత పరిశీలింతము.

లోకమున మనము మూడు విధములైన దుఃఖములను గమనించుచున్నాము. అధ్యాత్మిక (శారీర రుగ్మతలు మొదలగునవి) ఆధిదైవిక (దైవికముగా వచ్చునవి ఉదాహరణకు తుపాను, అగ్నిబాధ, దుర్భిక్షము) ఆధి భౌతిక (ఇతర జీవులవలన వచ్చునవి. ఉదాహరణకు—పాముకాటు, తేలుకుట్టుట మొదలగునవి.)

శారీరక రుగ్మతలకు వైద్యుడు మందీయవచ్చును. ఆయుర్వేదమునందీ విషయము విపులముగా నున్నది.

అధి దైవిక బాధలకు వేదములలో కర్మకాండ విభాగమున చెప్పబడిన ప్రత్యేక శాంతి పౌష్టిక క్రియలను చేయవచ్చును.

ఆధి భౌతిక బాధల విషయమున నీతిశాస్త్రము హెచ్చరికలు చేయుచున్నది. నాదండో బహిం గచ్ఛేత్. (చేతిలో దండము [కఱ్ఱ] లేకుండా బయటకు పోవలదు) అయితే ముఖ్యమైన సంగతి ఏమనగా ఇట్టి వచనముల వలన శాశ్వతమైన మోచన కలుగుచున్నదా? లేక మరియొక సులభమైన మార్గమేదియేని నిజమైన శాస్త్రములందు చెప్పినదానికంటె-కలదా. శాశ్వతముగా దుఃఖ నివారణకు?—సమాధానము శూన్యము.

పరీక్ష ద్వివిధము, కార్యకారణ విధము. ఒకటి వున్నచో రెండవదికూడ వుండును (అన్వయము). ఒకటి వుండనిచో రెండవది కూడ వుండదు (వ్యతిరేకము). వైద్యుడు మందులు మనకు విముక్తి ప్రసాదింపలేవు శరీర రుగ్మతలనుండి. వారులేకున్న అతంయు రోగములే అనుటకుకూడ వీలులేదు. శాస్త్రములందు చెప్పిన కర్మకాండలు

అవలంబించినందువలన స్వర్గాది లాభములు కలుగివచ్చును. అవి శాశ్వతములు కావు. (క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి). అసలు శాస్త్ర విదిత కర్మకాండలు కొన్ని చేయుటకు చాల కష్టము. అసాధ్యము.

శాశ్వతముగా దుఃఖమును నివారించుకొనుటకు శాస్త్రములు చెప్పిన సారభూత మైన విషయమును గ్రహింపవలెను. అతి స్పష్టమైన-సులభమైన-ఉపదేశమేమనగా-దుఃఖము, బద్ధత్వము, అవిద్యవలన కలుగుచున్నదని—దానిని నిర్మూలించుకొన్నచో సకల దుఃఖములనుండి విముక్తి కలుగునని. శ్రీ శంకర భగవత్పాదులవారు విస్పష్టముగా వ్యాఖ్యానము చేసిన ఉపనిషత్సూక్తి యిది. నిర్గుణ బ్రహ్మధ్యానము అందరికి సాధ్యము కాదు. ఇతరులకు శాస్త్రములు సగుణోపాసన చెప్పుచున్నవి. అనగా సాకార సకల కల్యాణ గుణ సంపన్నమైన మూర్తి ఉపాసన. ప్రతిష్ఠా కలాప మంత్ర పూతము లగుటచేత మాత్రమే కాదు—దేవాలయములలోని విగ్రహములు అర్చకుల విశ్వాసమువలన నిత్య అర్చనలవలన శక్తివంతములగును.

అర్చనలు నిరంతరము సాగుటవలన—కాలగమనముచేత—మూర్తియొక్క విశిష్టత్వమువలన—పావిత్ర్యత పెరుగవచ్చును.

దేవాలయములు సక్రమముగా నిర్వహింపబడునట్లు చూచుట సకలాస్తికజనుల యొక్క బాధ్యత అయివున్నది.

మోక్షార్థియైనవాడు—పరిపూర్ణమైన వైరాగ్యమును అలవరచుకొనవలెను—దేనియందును బంధన లేనియట్లు.

అకృతః మోక్షః కృతేన కర్మణానాస్తి.

(భగవద్గీత యందు సూచింపబడిన శాస్త్రములు కర్మకాండను తెలుపు విభాగములు కావనియు—ఫలాపేక్ష లేకుండా నిష్కామముగా నిత్యనైమిత్తికాదులను నిర్వహించుమని చెప్పుట శాస్త్రసారముగా భగవద్గీత తెలుపుచున్నదని గ్రహింపవలెను).

---

## వ్యాసములు-ఎక్చేంజి కాపీలు, రివ్యూకి గ్రంథములు

మా పత్రికకు పంపదలచిన వ్యాసములను ఎక్చేంజి కాపీలను రివ్యూకి గ్రంథములను (2 కాపీలు) యీ క్రింద చూపిన మా మద్రాసు కార్యాలయము అడ్రసునకే పంపవలెను.

శ్రీ రామలింగేశ్వరరావు,
శ్రీ శంకరకృప సంపాదకుడు,
నెం. 63 కోడంబాకం హైరోడ్డు, త్యాగరాయనగరు, మద్రాసు-600 017.

# శ్రీ జగద్గురు భారతీ తీర్థస్వామి చరణాల ఉపదేశము

## (శృంగేరిలో చేసిన అనుగ్రహ భాషణము)

అందరికీ శ్రేయస్సు పొందవలెననియే ప్రయత్నము. అయితే దానిని సాధించు మార్గము తెలియదు. జీవితమున దుఃఖానుభవము చాల మిక్కుటము. సుఖానుభూతి తక్కువ. దుఃఖమయమైన సంసారమున సుఖమెట్లు సంపాదింపవలెనని వివేకవంతులు ఆలోచింతురు. ప్రతి కార్యమునకు కారణముండవలెను. కారణము నశించినచో కార్యముండదు. వ్రేళ్ళు తీసివేయబడినచో వృక్షముండదు. పై కొమ్మలను కొట్టివేసినప్పటికీ చెట్టు బ్రతికి ఉండి పెరుగును. చావదు. దుఃఖమును నివారించుకొనుటకు దాని కారణమును తెలిసికొనవలెను. తీవ్రముగా పరిశీలించినచో దుఃఖానుభవమునకు కారణము దేహముండుట యని తేలును. ఉపనిషత్తులు శరీరమున్నవానికి మాత్రమే దుఃఖముండు నని చెప్పుచున్నవి. శరీర సంబంధము లేని వానికి దుఃఖ అనుభవము లేదు.

'అశరీరం వావసన్తం ప్రియా ప్రియే స్పృశతః' కాబట్టి శరీరబంధనము లేకుండ చూచుకొనవలెను. అదియే పునర్జన్మ లేకుండ విముక్తి పొందుట. ప్రతివాడు-ఎప్పుడో ఒకప్పుడు—యమలోకప్రవేశము చేయక తప్పదని చెప్పుదురు. ఎవ్వరును శాశ్వతముగ నుండరు కదా! యముడన్న భయమేల? యమలోకము పేరు చెప్పిననే భయమేటికి! అక్కడున్న నరకబాధ మూలమున. అయినను భయమునకు హేతువేమి? మృత్యువు తరువాత కూడ బంధముండుననని, మృత్యువు నుండి తప్పుకొనవలెనన్నచో మరల జన్మ లేకుండ చూచుకొనవలెను.

మృత్యోర్బిభేషికిం మూఢ భీతం ముంచతి కింయమః
అజాతం నైవ గృహ్ణాతి కురుయత్నమ జన్మని

కాబట్టి దుఃఖమును పూర్తిగా నిర్మూలించుకొనదలచినచో దాని హేతువును-అనగా జన్మము—లేకుండ చేసికొనవలెను. మరల జన్మలేకుండ చేసికొనుటకు జ్ఞానలాభ మొక్కటే మార్గము.

పునర్జన్మ ఏల వచ్చును? పాపపుణ్యములవలన జన్మ వచ్చును. మన వైదిక సిద్ధాంతమునుబట్టి పుణ్యపాపములవలను సుఖ కష్టములు భవిష్యజ్జన్మమున కలుగును. ఈ జన్మమున పుణ్యము చేసినచో ముందు జన్మమున సుఖము లభించును. ఈ జన్మమున

పాపము చేసినచో ముందు జన్మమున కష్టములు దుఃఖము. పుణ్యపాపములు సుఖ దుఃఖముల నీయక తప్పదు. వాటి అను భవమునకై జన్మ తప్పదు. సుఖానుభవము దుఃఖానుభవమునీయక పుణ్యపాపములు క్షయముకావు. పుణ్యపాపములు చేయు చున్నంతవరకు జన్మములు తప్పవు. స్వప్నము నందైన "ఏదైన కర్మచేసి, పునర్జన్మ పోగొట్టుకొని దుఃఖము నివారించుకొందును" అని భావింపరాదు. విముక్తి మరెట్లు లభించును? జ్ఞానమువలననే దుఃఖము నశించును. జ్ఞానమే పూర్వజన్మల కర్మఫల మును నశింపచేయును. జ్ఞానముయొక్క శక్తి అట్టిది. ఎంత ఘనమైన ఇంధనమైనా అగ్ని దహించి బూడిదగ మార్చు చేయగలిగినట్లే జ్ఞానము సకల పూర్వజన్మ కర్మ ఫలమును దహింపగలదు. కర్మలు నశించునని చెప్పుటలో భావమేమనగా — అవి సాధారణముగా నీయవలసిన జన్మలను ఇవ్వజాలవని. అందువలన మోక్షము లభించును. శ్రీ శంకరభగవత్పాదులనిరి. 'అశరీరత్వం మోక్షం!'

అయితే అట్టి జ్ఞానము సులభసాధ్యముకాదు. 'మనుష్యాణాం సహస్రేషు కశ్చిత్ యతతి సిద్ధయే' నరులు అనేక కోట్లమంది. వీరిలో ఆత్మజ్ఞానాభిలాష కల వారు చాల తక్కువమంది. ఆత్మజ్ఞానేచ్ఛ అతి తక్కువమంది కేకలుగును. అసలు ఇచ్ఛ కలిగిన తరువాత ప్రయత్నము. అందుకని 'మనుష్యాణాం సహస్రేషు' అన్న శ్రీభగవత్పాదుల వాక్యము సముచితమైనది. ఆత్మజ్ఞానేచ్ఛ కలిగినచో తరువాత గురువును ఆశ్రయించి గుర్వనుగ్రహామువలన జ్ఞానమును పొందవచ్చును.

గురూపదేశమువలననే జ్ఞానము లభించునని సముచిత ఫలము కలుగునని ఉప నిషత్తులు వచించి గురూపదేశమువలననే జ్ఞాన లాభము కలుగునని స్పష్టపరచినవి. గురువును ఆశ్రయించకుండ మనమెంత ప్రయత్నము చేసినను ఎన్ని విధముల కృషి చేసినను ఫలింపదు. కావున జ్ఞాన సంపాదనకు గురువును ఆశ్రయించుట తప్పనిసరి. అందుచేతనే జ్ఞానము కావలెనేని శిష్యుడు గురువును ఆశ్రయింపక తప్పదని శ్రుతి ఉద్ఘోషించును. (సశేషము)

---

# మీకు కృతజ్ఞత కలదా?

శ్రీ శంకరభగవత్పాదుల జయంతి యీ వైశాఖ శుక్ల పంచమి శుక్రవారము (8-5-81) నాడు వచ్చిన సందర్భముగా పాఠకుల కీ ప్రత్యేక విజ్ఞప్తి చేయు చున్నాము.

బౌద్ధమతములో దురాచారము లేర్పడి భారతీయ సంస్కృతి సమూలముగా

నశింపబోయినప్పుడు శ్రీశంకరభగవత్పాదు లవతరించి మన హైందవ (సనాతన) మతమును పునరుజ్జీవనము చేసిరి. కాబట్టి హైందవమతమున అన్ని శాఖలవారును శంకరుని యందు ఋణపడియున్నారు. కాదనుటకు వీలులేదు.

ధర్మరక్షణకు భారతమున నాలుగు మూలలందు శ్రీ శంకరులు నిర్మించిన నాలుగు పీఠములలో ఆంధ్ర ద్రవిడ కన్నడ కేరళాది దేశప్రభేదములకు జగద్గురు స్థానమందున్న యజుర్వేద సంజ్ఞిక శ్రీ శృంగేరి శారదాపీఠము 'తస్యయజురేవశిరః' అన్న శ్రుతిప్రమాణముచేత శిరఃశ్రేష్ఠపీఠము.

శ్రీ శంకరులు అవతరించి పన్నెండు శతాబ్దములు కాబోవుచున్నది. ఆయన యందు కృతజ్ఞత కల మనమందరము—ఆయనకు శాశ్వత స్మృతి చిహ్నముగా—మన కృతజ్ఞతా స్వరూపముగా నేదియైన చేయవలసియున్నది. శృంగేరిలో ఒక కోటి రూపాయల వ్యయముతో నొక సంస్కృత విశ్వకళా పరిషత్తును స్థాపించవలెనని కొందరు శిష్యులు ఆలోచించుచున్నారు.

ఆంధ్రదేశమున—ప్రతి గ్రామమునందును—కనీసము—ప్రతి తాలూకా ముఖ్యస్థానమునందైనను సభ జరిపి—శ్రీ శంకరులయందు మనకు గల కృతజ్ఞత వెల్లడింపవలసియున్నది. ప్రతిచోట శ్రీ శంకరమఠమును నిర్మించుకొనవలసియున్నది, తాలూకా ముఖ్యస్థానములో పదిమంది కలసి విజ్ఞాపనము పంపుకొన్నచో శంకరమఠ స్థాపనకు తగు సలహాలను, సహాయమును శ్రీ జగద్గురువులు చేయుదురు. అయితే విజ్ఞాపనమును 'శ్రీ శంకరకృప' సంపాదకునిద్వారా పంపుకొనవలెను.

ప్రతి తాలూకాలో—వీలున్నచో ప్రతి గ్రామమున శ్రీ శంకరమఠ నిర్మాణమునకై చేయు కృషిలో మీ సంపాదకుడు సర్వవిధముల సహాయము చేయుటకై సిద్ధముగా నున్నాడు.

పాఠకులనుండి సహాయార్థము వచ్చు లేఖలను గ్రహించుటకు చూచుచున్న—


63, కోడంబాకం హైరోడ్డు,
త్యాగరాయనగరు,
మద్రాసు-600 017.

మీ సంపాదకుడు
రామలింగేశ్వరరావు

Printed & Published by A. Satyanarayana Murthy,
6-3-609/18, Anand Nagar, Khairatabad, Hyderabad - 500 004.
Printed at KRANTI PRESS, MADRAS-600 001.
Editor : T. Ramalingeswara Rao

# శ్రీ శంకర భగవత్పాదుల కవితావైభవము

శ్రీ శంకర భగవత్పాద కృతస్తోత్రములు—సూక్తులు—అద్భుతమైన కవితా రామణీయకత కలవి. అతి వివరణ పూర్ణమైన వర్ణనము, హుందాతనముగల భాష, తీవ్రమైన భక్తి, ధారాశుద్ధి కలిగి మధురమైన శైలితో తాత్త్విక ప్రగాఢత్వము—ఆయన రచన లన్నిటిలో ప్రస్ఫుటముగా కన్పించును.

శివానందలహరి, సౌందర్యలహరి—ఉత్తమ కవితారూపము తాల్చిన స్తోత్రములు ప్రసిద్ధములు. అవితాంత్రిక సౌరభపూర్ణములు. మోహముద్గరము—(భజ గోవిందమన్న పేరుతో ప్రసిద్ధము) ప్రగాఢమైన తాత్త్విక విషయములను—అతి శక్తివంతమైన—ప్రజాదరణ పాత్రమైన శైలిలో వెల్లడించుచున్నది. నిజమున కది అజ్ఞానశిలకు సుత్తిపోటు.

శివ, విష్ణు, రామ, దేవి, భుజంగ స్తోత్రములు - చక్కని సంగీత మగ్న లయాత్మకమైన భుజంగ ప్రయాతవృత్తములలో రచింపబడి శ్రవణ పేయముగా హృదయస్పందిగా నున్నవి.

లక్ష్మీదేవిపరమైన కనకధారా స్తోత్రమును గురించి ప్రసిద్ధమైన గాథ కలదు. ఐశ్వర్యలాభాపేక్ష గల జనులు కనకధారాస్తోత్రమును నిత్యపారాయణ చేయు చున్నారు.

దేవీ అపరాధక్షమాపణ స్తోత్రము, శివాపరాధ క్షమాపణ స్తోత్రము—మౌళిక కవితా రచనలు.

వేదాభ్యాసము చేయనివారికి వేదాభ్యాసఫలము లభింపజేయవలయునన్న అవ్యాజకృపాభావముతో రచింపబడినది శ్రీమత్త్రిపురసుందరీ వేదపాదస్తోత్రము. దీనియందు ప్రతి శ్లోకమునకు నాలుగవపాదము—అనంతమైన వేదమునుండి తీసికొనబడిన వాక్యమొకటి నాలుగవ పాదముగా—ఛందోసమీచీనతతో—అర్థ సౌందర్య గాంభీర్యములతో — పొదుగబడి యున్నది. ఇది అనల్పమైన పాండితీ నిదర్శనము.

శ్రీ భగవత్పాదులు రచించిన పంచకములు (అయిదు శ్లోకముల ఖండికలు) అష్టకములు (ఎనిమిది శ్లోకముల ఖండికలు) దక్షిణామూర్తి స్తోత్రములు (రెండు) సముచితముగా మిక్కిలి జనాదరణ పొందినవి.

విష్ణుస్తోత్ర రూపమైన షట్పదీస్తోత్రము అతి సుందరమైనది. లక్ష్మీనృసింహా కరావలంబ స్తోత్రము మిక్కిలి ఆదరణలోనున్నది.

సులభసుందరమైన శైలి — (తార్కికులకు, దార్శనికులకు అవలంబనము కానిది) అతి వేలమైన భక్తి ప్రగాఢత్వము శ్రీ శంకర భగవత్పాదుల కవితారచన లందన్నిటియందు విజృంభణముగా నున్నవి.

శంకర భగవత్పాదుల రచనలందు సాహితీ మర్మములు, అలంకారిక సముద్దీప్తి విరళముగా నున్నవి. శబ్దార్థములతోపాటు లయవిన్యాసము ఉన్నతస్థితి యందుట కలదు. శబ్దార్థాలంకారములు వెల్లివిరియుట, విరోధాభాసములు, శబ్దార్థోభయ శ్లేషలు, ప్రాసలు, అనుప్రాసలు—బహుళముగా పుష్టివంతముగా నున్నవి.

వేదాంత గ్రంథములందు, వ్యాఖ్యానములందు, భాష్యములందు—కూడ శ్రీ భగవత్పాదుల వచన శైలి మనోజ్ఞముగా గాంగ నిర్ఘర సదృగ్ధారాళముగా నున్నది.

గ్రామ పౌరోహిత్యమును, రాత్రించరత్వమును, గ్రామణిత్వమును, మఠము లను నిర్మించుకొని అధిపత్యము చలాయించుట, అసత్యమును పలుకుట కూటసాక్షిత్వ మును—బ్రహ్మద్వేషము, నిర్దయత్వము—శ్రీ శంకర భగవత్పాదులు విరసించిరి.

(పౌరోహిత్యం రజని చరితం గ్రామణిత్వం....
మాతాపత్యం హి అన్ృతవచనం సాక్షివాదః....
బ్రహ్మద్వేషః....ప్రాణినాం నిర్దయత్వం....
మా భూ ద్దేవం మమ పశుపతే జన్మజన్మాంతరేషు)

రసోత్పత్తి పరాకాష్ఠ చెందిన సన్నివేశములుకూడ శ్రీ శంకర భగవత్పాదుల కవితయందు మిక్కుటములు. శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము శాంతరస పరాకాష్ఠయైన రచన. హాస్యముకూడ అనల్పముగా నున్నది. చోరబుద్ధి గల చేతమును హరింపుమని 'తస్కరాణాం పతి' (తస్కరపతి)కి విన్నవించుట హాస్యమధురము. ఇమం — చేతః చోరం—తవ అధీనం కృత్వా!) ఆయన శంకరుడైన విభుడు కదా!

భిక్షుకుడైన శివుడు భిక్షాటనమునకు తిరుగునపుడు వెంట నొక కోతిని తీసికొని పోయి దానిని ఆడించుచున్నచో భిక్ష తేలికగా దొరకును కదా! ఆ కోతి భక్తుని హృదయమే.

ఆయన వేటలో నేర్పరియైన కిరాత ప్రభువు. భక్తుని హృదయమన్న దుర్గ మారణ్యమున ఎన్నియో క్రూరజంతువులున్నవట! ఆయన వచ్చి వేటాడుటకు అను వుగా నున్నదట.

(సదా మోహాటవ్యాం చరతి యువతీనాం కుచగిరౌ
నటత్యాశా శాఖా స్వటతి ఝుడితి స్వైర మభితః।
కపాలిన్ భిక్షో మే హృదయకపి మత్యంత చపలం
దృఢం భక్త్యా బద్ధ్వా శివ భవద ధీనం కురువిభో!
ప్రలోభా ద్యైర్థా హరణ పరతంత్రో ధనిగృహే
ప్రవేశోద్యుక్త స్సన్భ్రమతి బహుధా తస్కరపతే
ఇమం చేతశ్చోరం కథమిహ సహే శంకరవిభో
తవాధీనం కృత్వా మయి నిరపరాధే కురుకృపామ్.
మాగచ్ఛ స్త్వ మిత స్తతో గిరిశ భోమయ్యేవ వాసంకురు
స్వామిన్నాది కిరాత మామక మనః కాంతారసీ మాంతరే
వర్తంతే బహుశో మృగా మదజుషో మాత్సర్యమోహాదయ
స్తాన్హత్వా మృగాయ వినోద రుచితా లాభంచ సంప్రాప్స్యసి).
(శివానందలహరి 20, 22, 43 శ్లోకములు)

ఇట్టే శ్రీ భగవత్పాదులు కవిత—గుణ సన్నిపాతము.

ఆయన ముఖ నిస్సృతములైన పదములు, శ్లోకములు మహా మంత్రములే. పరమశివుడైన ఆయన రచనలు వేదసారములే అనుట అతిశయోక్తికాదు. కేవల స్వభావోక్తి.

---

# ఆధునిక విజ్ఞాన సాధనములతో అద్వైతావగాహనములోని సౌలభ్యము
## (వివేకచూడామణి ఆత్మబోధ ఆధారముగా)

డాక్టర్ నైషధం ప్రభాకరరావు, డైరెక్టర్, ఢిల్లీ
(డిఫెన్సు సైన్సు సర్వీస్)

ఇనుము (లోహము)లో స్వయంప్రకాశ శక్తిలేదు (Iron itself is not incandescent) కాని నిప్పులో కాలినప్పుడు దానికి ప్రకాశ శక్తి వస్తుంది. ఆ శక్తికి కారణం నిప్పు కాని లోహము కాదు.

"అయోఽగ్ని యోగా దివ స త్సమన్వయా
న్మాత్రాది రూపేణ విజృంభతే ధీః" (వివేకచూడామణి)
అల్లే బుద్ధికి శక్తి బ్రహ్మది, బుద్ధిది కాదు.

సూర్య, చంద్ర గ్రహణములకు కారణం భూమి (తానుచుట్టూ తను తిరుగుతూ, సూర్యునిచుట్టూ గూడా తిరుగుతూ, భూమిచుట్టూ చంద్రుడు తిరుగుతూ) పరస్పరం ఒకటి మధ్య ఇంకొకటి రావటంవల్లనే కాక, రాహువు సూర్యుని మింగటంవల్ల కాదు, కేతువు సూర్యచంద్రులను మింగటంవల్లనూ కాదు. ఈ Scientist Explanation శ్రీ శంకర భగవత్పాదులు వివేకచూడామణిలో

"తమసా గ్రస్తవద్భానా దగ్రస్తోఽపి రవిర్జనైః
గ్రస్త ఇత్యుచ్యతే భ్రాన్త్యా హ్యజ్ఞాత్వా వస్తులక్షణమ్" అన్నారు. దీనినిఁబట్టి శంకరాచార్యులవారు ఎంతపెద్ద Scientific యో కనఁబడుతోంది.

ఏ పదార్ధమునమైనా కాల్చినప్పుడు, అది గాలిలోయున్న ప్రాణవాయువు (Oxygen) ని తీసికొని Oxide గా మారి భస్మమవుతుంది.

"పాషాణ వృక్ష తృణ ధాన్య కటాంబరాద్యా
దగ్ధా భవన్తి హిమృదేవ యథాతథైవ" (వివేకచూడామణి)
అల్లే ఈ సృష్టి అంతా చివరకు పరమాత్మగా అవుతుంది (ఉపయాతి పరాత్మ భావమ్)

భౌతిక మిశ్రమము (Physical mixtures with no change in chemical composition) లకు ఉదాహరణలు పాలల్లో పాలు, నీటిలో నీరూ, నూనెలో నూనె కలిపినప్పుడు తయారయ్యే homogenous mixtures.

"క్షీరం క్షీరే యథాక్షిప్తం తైలం తైలే జలం జలే
సంయుక్తమే కతాం యాతి తథాఽత్మన్యాత్మ విన్మునిః" (వివేకచూడామణి)
అల్లే ఆత్మవిత్ ఆత్మలో కలిసిపోతాడు.

సహజంగా నీటికి ఏ రంగూ, వాసన, రుచులు లేవు. (Water is tastless, colourless and odourless).

కాని నీటిలోవున్న inpurities (కల్మషాలను) బట్టి రంగు, వాసన, రుచులు ఏర్పడుతాయి. అల్లే అద్వైతం ప్రకారం ఆత్మకు వాస్తవంగా ఏ లక్షణాలూ లేవు. కాని దాని పైన అధ్యారోపంవల్లనూ, ఉపాధి సహితముగా యుండుటచేతనూ, ఆ గుణాలు ఆపాదిస్తాయి.

"నానో పాధి వశాదేవ జాతి వర్ణాశ్రమాదయః
ఆత్మన్యారోపితాస్తోయే రసవర్ణాది భేదవత్" (ఆత్మబోధ)

Gold is not different from lhe gold bracelet made out of it. అల్లే సృష్టి అంతా పరబ్రహ్మనుండియే వచ్చింది, తద్భిన్నము కాదు.

"సచ్చిదాత్మ న్యను స్యూతే నిత్యే విష్ణౌ ప్రకల్పితా!
వ్యక్తయో వివిధాస్సర్వా హాటకే కటకాదివత్" (ఆత్మబోధ)

Ether sky is indivisible (వాయువు ఆకాశము అవిభాజ్యము. వేరువేరు, చిన్న పెద్ద పాత్రలలో యున్ననూ, వాటిలో యున్న వాయువుయొక్క స్వభావములో భేదము లేదు. అల్లే నానా దేహములలో యున్నను, అంతరాత్మలో ఎట్టి వ్యత్యాసమునూ లేదు.)

"యథాకాశో హృషీకేశో నానోపాధిగతో విభుః
తద్భేదా ద్భిన్నవ ద్భాతి తన్నాశే కేవలోభవేత్" (ఆత్మబోధ)

రంగులేని తెల్లని స్ఫటికమును ఒక రంగు గుడ్డలో చుట్టితే, ఆ రంగు స్ఫటికంగా కనబడుతుంది. A white crystal in a cloured cloth looks like a coloured crystal. అల్లే ఉపాధిలో ఉన్న ఆత్మ ఉపాధి లక్షణ యుతంగా కనబడుతోంది. వాస్తవము కాకపోయిననూ

"పంచకోశాది యోగేన తత్తన్మయ ఇవస్థితః
శుద్ధాత్మా నీలవస్త్రాది యోగేన స్ఫటికోయథా" (ఆత్మబోధ)

నదీ జలంలో యున్న ఒండుమట్టిని విడదీసి నిర్మలోదకాన్ని త్రాగుటకు మనము ఒక ఇందుపగింజని ఉపయోగిస్తాము. అల్లే జ్ఞానము మన అజ్ఞాన కలుషాన్ని వేరు చేయగలదు.

"అజ్ఞాన కలుషం జీవం జ్ఞానాభ్యాసా ద్వినిర్మలమ్
కృత్వా జ్ఞానం స్వయం నశ్యే జ్జలం కతకరేణువత్" (ఆత్మబోధ)

Sedimentation of sand and dirt particles is thus effected

We powder things in a mortar with a pestle. అల్లే రోకలితో వడ్లని దంచి బియ్యం తయ్యారు చేస్తాము. శుద్ధమైన ఆత్మనిగూడ అల్లే అనాత్మనుండి విడదీయవలెను.

"వపుస్తుషాదిభిః కోశైర్యుక్తం యుక్త్యవఘాతతః
ఆత్మాన మన్తరం శుద్ధం వివిచ్యాత్తండులం యథా" (ఆత్మబోధ)

Laws of Reflection ప్రకారం. బింబమునకు ప్రతిబింబము నిర్మలమైన అద్దములోనో, నిర్మలమైన నీటిలోనో బాగుగా కనపడుతుంది. అట్లే ఆత్మగూడా సద్బుద్ధిలోనే ప్రతిబింబిస్తుంది.

“సదా సర్వగతోఽప్యాత్మా న సర్వత్రావ భాసతే
బుద్ధావేవావభాసేత స్వచ్ఛేషు ప్రతిబింబవత్” (ఆత్మబోధ)

Sky appears blue. Sir C.V. Raman explained it is due to SCATTERING OF LIGHT. అట్లే “గగనే నీలతాదివత్” (ఆత్మబోధ!) ఆత్మపైన అధ్యారోపము.

A self-illuminated object does not require anothcr light to illuminate it.

“స్వబోధే నాన్య బోధేచ్ఛా బోధ రూపత యాత్మనః
నదీప స్యాన్య దీపేచ్ఛా యథా స్వాత్మ ప్రకాశనే” (ఆత్మబోధ!)

Sky appears grey due to dust in the air, itself remains uncontaminated by dust.

“ఉపాధి స్థోఽపి తద్ధర్మైర, లిప్తో వ్యోమవన్మునిః
సర్వ విన్మూఢ వత్తిష్ఠే దసక్తో వాయువచ్చరేత్” (ఆత్మబోధ!)

ఎడారిలో ఎండమావులు కనిపిస్తాయి. వాస్తవంగా అక్కడ నీరులేదు. ఎడారియే. అయిననూ నీరుందని అనుకొంటాము. Laws cf reflection/refraction explain it.

“జగద్విలక్షణం బ్రహ్మ బ్రహ్మణో న్యన్న కిఞ్చన
బ్రహ్మాన్యద్భాతి చేన్మిథ్యా యథా మరుమరీచికా” (ఆత్మబోధ!)

Fire destroys the impurities present in the gold and reveals the pure metal. అట్లే జీవుడు జ్ఞానముతో అజ్ఞానమునుండి బయటపడి స్వయం ప్రకాశుడై వెలుగుతాడు (శుద్ధాత్మగా

“శ్రవణాది భిరుద్దీప జ్ఞానాగ్ని పరితాపితః
జీవస్సర్వ మలాన్ముక్తః స్వర్ణవద్ ద్యోతతే స్వయమ్” (ఆత్మబోధ!)

ఉపసంహారము

పైన చూపిన ఉదాహరణవల్ల ఆధునిక విజ్ఞాన సాధనములతో అద్వైత సిద్ధాంతము నెట్లు అవగాహన చేసికొనవచ్చునో విశదమవుతోంది. [According to Modern Physics, matter is made of atoms in perpetual motion (చిత్) the waves of motion are constituted by electrons, protons and neutrons. What we see is different from what really exists (సత్),

and what is real Experience (ఆనంద). Space (ఆకాశ) exists in between atoms, although it looks separated. It is continuous (అభేద, అఖండ, నిష్కల, నిర్విశేష), Matter is condensed Energy (శక్తి), ఇవి అన్నీ అద్వైత మునకు అనుగుణములేను) ]

---

# శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్య విరచిత అపరోక్షానుభూతి

## వ్యాఖ్యానము: శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

[గతసంచిక తరువాయి]

అవ (144 శ్లోకమునకు) రాజయోగము సులభతరమైనదని చెప్పుచున్నారు.

శ్లో॥ పరిపక్వం మనోయేషాం కేవలోఽయంచసిద్ధిదః
గురుదైవతభక్తానాం సర్వేషాం సులభోజవాత్॥ 144

తా॥ మనస్సు చక్కగా పరిపక్వమయినవానికి పాతంజలమగు హఠయోగము యొక్క అపేక్ష లేకుండానే యీ రాజయోగము సిద్ధిని లభింపజేయుచున్నది. గురుభక్తి, దైవభక్తి - కలవారందరకు వారు వీరను భేదము లేకుండా — శీఘ్రముగా యీ రాజయోగము ఫలప్రదము — సులభము.

విశేషములు: పరిపక్వమయిన మనస్సు కలవారనగా రాగద్వేషాదులచే మాలిన్యమైన మనస్థితి పోగొట్టుకొన్నవారికి.

అందరకు అనగా—అన్ని వర్ణములవారికి అన్ని ఆశ్రమములవారికి—స్త్రీలకు పురుషులకు.

ఈ సాధనకు ఆవశ్యకమైనది గురుభక్తి, దైవభక్తి—లేక గురురూపుడైన దైవమునందు భక్తి—.

అవ (145 శ్లో.) ఈ ప్రకరణ గ్రంథమును ఉపసంహరింప బోవుచు జ్ఞాని మహిమను సంగ్రహముగా చెప్పుచున్నారు.

శ్లో॥ తీర్థేఽథవాశ్వపచ గృహేవా నష్టస్మృతిర్వాపరి త్యజన్ దేహమ్
జ్ఞానసమకాలముక్తః కైవల్యం యాతివిగతశోకః॥ 145

తా॥ జ్ఞాని పుణ్యక్షేత్రమునందుగాని—చండాల గృహమునందుగాని స్మృతి

నశించినవాడై గాని దేహము విడచినను—జ్ఞానమున్నవాడగుటచేత—ఆ జ్ఞానము ఉదయించినప్పుడే ముక్తుడై సంసారశోకము వీడినవాడగుటవలన మోక్షమును పొందుచున్నాడు. (సశేషము)

## వేదాంత న్యాయములు (36)

(న్యాయములవంటి ఉదాహరణలు)

[వేదాంత శాస్త్రముతో సూక్ష్మవిషయములను బోధచేయుటకు కొన్ని ఉదాహరణలు సాధారణముగా నుపయోగించెదరు. ఈ ఉదాహరణలు నిత్యజీవితమునకు సంబంధించినవిగా నుండి-వీటిమూలమున దుర్గ్రాహ్యమైన సిద్ధాంత విషయములను అవగాహన చేసికొనుటకు తోడ్పడును. ఈ ఉదాహరణలవలన-సునిశిత ప్రజ్ఞావంతముకాని సామాన్యుని మేధస్సుకూడ సిద్ధాంతమును గ్రహింపగల్గును. సామాన్యపాఠకులకొఱకు వేదాంత న్యాయముల వివరణములను క్రమముగా ప్రకటించుచున్నాము. సంపాదకుడు]

### లవణము - జలము

పెద్ద పాత్రయందున్న జలములో ఉప్పుకణము వేసినచో వెంటనే కరగిపోవును. కంటికి కనిపించదు. చేతికి తగలదు. కాని ఆ పాత్రలోని జలము—ఏ కొంచెము రుచి చూచినను—యీ ఉప్పుకణము యొక్క ఉనికి తెలియును.

ఇదేవిధముగా బ్రహ్మజ్ఞానియైన జీవుడు అఖండాత్మయందు పరిలీనమగును. అనగా సత్, చిత్, ఆనంద నిధిలో కలిసిపోవును. సర్వాత్మయందు సంలీనమగును. అంతయు పరమానందమే. అన్నియెడల నొకేవిధము.

---

## చందాదారులకు విన్నపము-ప్రకాశకుని చిరునామా మార్పు గమనింపుడు

చందాలు బాకీయున్నవారికి పత్రిక పంపబడదు. చందా సొమ్మును ముందుగనే (తమ అడ్రసు మార్పుకూడ వెంటనే) క్రింది చిరునామాకు పంపవలెను.

ఆకెళ్ల సత్యనారాయణమూర్తి,
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు,
6-3-609/18, ఆనందనగర్,
ఖైరతాబాదు, హైద్రాబాదు—500 004.

# శ్రీ విద్యారణ్య విజయగాథ

౯

బ్రహ్మరాక్షసి శృంగి శ్రీవిద్యారణ్యులతో ఆయన వ్యాస దర్శనమునకై కాశీకి పోవుచున్నట్లు తనకు తెలియును గనుక తన్ను వెంట తీసికొనిపోయిన యెడల తాను వ్యాసదర్శనము కలిగింపగలనని చెప్పెను. శ్రీవిద్యారణ్యులంగీకరించిరి.

శృంగి వెంట రాగా శ్రీవిద్యారణ్యులు కాశీప్రయాణమును సాగించిరి.





# శ్రీ శంకర భగవత్పాద విరచిత
# వివేకచూడామణి
## (శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామి విరచిత వ్యాఖ్యాసమేతము)

ఆంధ్రీకరణము: డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు(వేదాంత శిరోమణి, విద్వాన్)
ఎం. ఏ. (సంస్కృత, ఆంగ్ల హిందీ) పి. హెచ్‌డి.

(గత సంచిక తరువాయి)

అవ. ముందు చెప్పిన విషయమునే సహేతుకముగా వివరించుచున్నారు.

మూ. నజాయతే నో మ్రియతే నవర్ధతే
న క్షీయతే నో వికరోతి నిత్యః
విలీయమానేఽపి వపుష్యముష్మిన్
న లీయతే కుంభ ఇవాంబరం స్వయమ్. 135

ప్ర. అ. (ఈ ఆత్మ) నిత్యః = నిత్యమైనది. నజాయతే = జన్మించదు. నమ్రియతే = మరణించదు. నవర్ధతే = వృద్ధి పొందదు. నక్షీయతే = క్షీణించదు. నోవికరోతి = వికారమును చెందించదు. అముష్మిన్ వపుషి = ఈ శరీరము, విలీయమానేఽపి = లయమును పొందినను, కుంభే = ఘటము నశించినను. అంబరమివ = ఆకాశమువలె, స్వయం = తాను మాత్రము, నలీయతే = నశించదు.

వ్యా. అ. పుట్టును, ఉండును, మార్పుచెందును, వృద్ధి పొందును, క్షీణించును, నశించును—ఈ విధముగా శరీరాదులకు జననము, స్థితి, విపరిణామము, వృద్ధి, క్షయము, వినాశము అను ఆరు వికారములు ఉండును. ఈ పరమాత్మ, నిత్యః = ఉత్పత్తి వినాశము మొదలగునవి లేనిది. అందువలన, నజాయతే = పుట్టదు. నోమ్రియతే = నశించదు. ఈ విధముగ మొదటి వికారమైన ఉత్పత్తి, చివరి వికారమైన మరణము అనునవి లేకపోవుటచే, నవర్ధతే = అపక్షయమనెడు వికారమును కూడ పొందదు. ఉత్పత్తి అనేది లేదుగాన, దాని తరువాతి వికారమగు స్థితి కూడ దీనికి లేదు. ఇది నిత్యముగాన అన్వయరహితము. అందుచే విపరిణామము కూడ ఉండదు అని భావము. తాను వికారము చెందెడు వస్తువు మాత్రమే ఇతర పదార్థములయందు కూడ వికారమును కల్గించ కలుగును. ఆత్మ సర్వవిధ వికారరహితమగుటచే ఇతర వస్తువులలో కూడ ఎట్టి వికారమును కలిగించదు. ఈ విధముగ 'నోవికరోతి' అని

పూర్వ శ్లోకములో (135) చెప్పిన విషయమునకు ఈ శ్లోకములో హేతువును ప్రతిపాదించినట్లు అయినదని గ్రహించవలెను. 'నో వికరోతి' అనగా ఇతర పదార్థములలో వికారమును కల్గింపదు అని అర్థము. ఈ శరీరము, విలీయమానేపి = నశించుచున్నను, ఘటము నశించుచున్నను ఆకాశము ఎట్లు నశించదో అట్లే ఈ ఆత్మ నశించదు. ఈ విధముగ తనవలన కలిగిన వికారము గాని, ఇతర పదార్థములవలన కలుగు వికారము గాని ఈ ఆత్మకు లేవని భావము. 136

అవ. యథార్థ జ్ఞానము కలుగుటకై విజ్ఞానాత్మ పరమాత్మల స్వరూపమును కలిపి చెప్పుచున్నారు:—

మూ. ప్రకృతి వికృతి భిన్నః శుద్ధ బోధస్వభావః
సదసదిదమశేషం భాసయన్నిర్విశేషః
విలసతి పరమాత్మా జాగ్రదాదిష్వవస్థా
స్వహమహమితి సాక్షాత్సాక్షి రూపేణ బుద్ధేః.

ప్ర. అ. ప్రకృతి వికృతి భిన్నః = ప్రకృతికంటెను వికృతుల కంటెను వేరైనదియు, శుద్ధబోధ స్వభావః = శుద్ధ జ్ఞానస్వరూపమైనదియు, ఇదం = ఈ, అశేషం = సమస్తమైన, సత్ = సత్ పదార్థజాతమును, అసత్ = అసత్పదార్థజాతమును, భాసయన్ = భాసింప చేయునదియు, నిర్విశేషః = ధర్మరహితమును అగు, పరమాత్మా = పరమాత్మ, జాగ్రదాదిషు = జాగ్రత్తు మొదలైన, అవస్థాసు = అవస్థలయందు, అహమ్ అహమ్ ఇతి = 'నేను' 'నేను' అని, బుద్ధేః = బుద్ధికి, సాక్షిగా, సాక్షాత్ = ప్రత్యక్షముగా, విలసతి = ప్రకాశించుచున్నది.

వ్యా. అ. ప్రకృతి అనగా అవిద్య. ఆకాశాదులు వికృతులు. వాటికంటె భిన్నమైనదని అర్థము. శుద్ధ బోధ స్వభావ: = శుద్ధమైన, అనగా విషయ శూన్యమైన ఏ బోధ—జ్ఞానము—కలదో, అదియే స్వరూపముగా కలది. అనగా కేవల జ్ఞాన స్వరూపమైనది. ఇదం = ప్రత్యక్షాదిగోచరమైన, సత్ = తేజస్సు మొదలైన మూర్త పదార్థమును, అసత్ = ఆకాశవాయ్వాదికమగు అమూర్త పదార్థమును, సమస్తమును, ప్రకాశింప చేయునది, ధర్మరహితమును అగు పరమాత్మ జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి మొదలైన అవస్థలు బుద్ధికి సాక్షిగా ఉండి, సుషుప్త్యవస్థలో కూడ బుద్ధి బీజరూపమున ఉండును గావున అట్టి బుద్ధికి గూడ ఆత్మసాక్షియని చెప్పబడినది. నేను నేను అని ప్రత్యగ్రూపమున ప్రకాశించుచున్నది. 137

(సశేషము)

---

# అద్వైత సిద్ధాంతము ముందు పాశ్చాత్యుల పూర్వపక్ష ఖండన

## (ఆచార్య సుందరము)

(శ్రీ శంకర భగవత్పాద అద్వైత సిద్ధాంతము పైన పాశ్చాత్య విద్వాంసులు కొందరు దుర్బలమైన ప్రతిపక్షవాదములు చేసిరి. ఆ వాదముల ఖండన మీ వ్యాసము. —సంపాదకుడు.)

(గత సంచిక తరువాయి)

సూత్రముల సందర్భముగా యిదివరకే చర్చింపబడిన విషయమును పిమ్మట ధీబా తీసికొనెను. అది బ్రహ్మజ్ఞాన లాభమును పొందినవారి చివరి స్థితిని గురించి. ఆ సందర్భముగా పెక్కు పాఠములను—(అనేక విద్యలు—ఉపాసనలు—వాటిని అనుసరించువారికి బ్రహ్మముయొక్క లోకప్రాప్తి కలిగించునట్టివి) ఉదహరించెను. ధీబా వ్రాసినది—"ఈ పాఠములన్నియు కోరదగినంత స్పష్టముగా నున్నవి. బ్రహ్మజ్ఞాని ఆత్మ సుషుమ్నా మార్గమున నిర్గమించి దేవయానమున ప్రయాణించి బ్రహ్మలోకమును చేరి అక్కడ శాశ్వతముగా ఆనంద స్థితిలో నుండును. కాని శంకరుల మతము ప్రకారము యీ పాఠములన్నియు ఉత్తమ బ్రహ్మజ్ఞానము కలిగిన వానిని గురించి చెప్పునవి కావు. సగుణ బ్రహ్మవేత్తను గురించినవి. రెండు విధములుగా అన్వయించుటకు వీలులేని బృహదారణ్యక ఉపనిషత్తు (VI-2, 15) పాఠమున—అరణ్యములలోని ఋషులు ఉపాసించు 'సత్'—కూడ ఉత్తమ—ఉత్కృష్ట బ్రహ్మము కాకూడదు! హిరణ్యగర్భుడే! ఏల? ఈ అద్వైత సిద్ధాంతమును కోరుచున్నది కాబట్టి, ఉత్కృష్టమైన నిర్గుణబ్రహ్మము నెరిగినవారు విదేహముక్తులైన తరువాత—మరియొక స్థానమునకు చేరక—దానితో నైక్యత భజింతురు కావున."

పైన ఉదాహృత వివరణముల నిచ్చినది శంకరపూర్వ వ్యాఖ్యాత. అవి వ్యాఖ్యావచనములే గాని శ్రుతిపాఠములు కావు. రెండవ ఉదాహరణలో దేవయానమున వెళ్ళినవారు శాశ్వతముగా ఆనంద స్థితిలో నుందురని ధీబా వ్రాసినది తప్పు. పదసూత్ర (రామానుజుని ప్రకారము 9) వ్యాఖ్యానమున (4వ అధ్యాయ 3వ పాదము) "కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్—ఆ లోకము ప్రళయాస్పదమై నశించునపుడు తల్లోకాధిపతితో కలసి ఆ లోకమువారు దానికన్న పై లోకమునకు పోవుదురు—అట్లు శ్రుతి చెప్పినది"—శంకర రామానుజు లిర్వురు 'కార్యాత్యయే' అన్న దానికి ఒకే వివరణము నిచ్చిరి. (బ్రహ్మలోకము ప్రళయము

చెందినవేళ.) రామానుజులు స్పష్టముగా—బ్రహ్మలోకమనగా నిచ్చట హిరణ్యగర్భ లోకమని యే వివరణ వ్రాసెను. శంకరుల అభిప్రాయము కూడ నదియే. కాని ముక్త జీవుల స్థితిని గురించి మాత్రము ఉభయసిద్ధాంతములందు భేదాభిప్రాయమున్నది.

బృహదారణ్యక ఉపనిషత్తులోని VI-2, 15 లో సత్ ని గురించి శంకరులు హిరణ్య గర్భుడని చెప్పినదానికి థీభా అభ్యంతరము నిలవదు. ఏలననగా ఆ భాగము క్రిందనే (ఉపనిషత్తులో) ఆ ఉపాసన చేసినవారు దేవయానమున బ్రహ్మముయొక్క లోకము చేరుదురని యున్నది. కావున పైన వివరించిన సూత్రమునందువలన (శంకర రామానుజులు ఉభయులేకీభవించినట్లు) బ్రహ్మముయొక్క లోకమనగా హిరణ్య గర్భలోకమే. తేలినదేమనగా థీబా మాటలకు స్థానమే లేదని, అతనికి విషయము సరిగా అవగాహన కాలేదని.

బృహదారణ్యక ఉపనిషత్తు VI-4-6, 7 పైన శంకరుల భాష్యముపైన థీబా పిమ్మట దాడిచేసెను. ఈ ఉపనిషత్తు భాగమున—వాంఛలు కలిగినవారు మరణానంతరము మరియొక శరీరమును ప్రవేశించుటయు, వాంఛలు లేని ఋషి స్థితియు పరిశీలింపబడినవి. వ్యాసుని సూత్రములు ii 2, 12-4 పైన శంకరుల భాష్యముపై థీబా చేసిన విమర్శను పరామర్శము చేయు సందర్భమున నిదే విషయ పరిశీలింపబడినది. ఈ సందర్భమున థీబా "ఈ యావదధ్యాయ వివరణము త్రోసి వేయుటకు వీలుకాని సముచితముకాదు. అయితే యిందున్న వాక్యమునకు అర్థము— జీవుడు ప్రాణములు ఎచ్చటకును పోవు—అనగా శ్రోత్ర శరీరమును చేరవు. ఏదో విధముగా కలసిపోయి—బ్రహ్మముతో—శంకరులను కొనునట్లు కాదు — నుండును — ప్రాణములు జీవునితో నుండును—"

శంకరుల వివరణ సరియైనదని సూత్రములు iii, 2 iiల వలన స్పష్టమగు చున్నది. (బ్రహ్మజ్ఞానము కలుగగా వాని ప్రాణము లిచ్చటనే లయించుచున్నవి). 'అత్రైవ సమవనీయంతే' చివరకు డా॥ థీబా 'ఒక నూతన కష్టము' అని 8, 9 భాగములలో ఉదహరించిన శ్లోకములను చూపుచు పలికెను.

మేము యిదివరకే అద్వైత దృష్టిని చెప్పియున్నాము—ప్రకరణ సందర్భ ముగా అన్వయము చేయుట యేక వాక్యతపై ఆధారపడవలెనని. కాబట్టి డా॥ థీబా "ఈ శ్లోకములు 6వ భాగము చివరపర విద్యాత్మకని గురించి చెప్పినదానితో ముడి పెట్టుకొనవలెను" అన్నది సరిగా ఉన్నది.

ఈ శ్లోకములను శంకరులు సందర్భశుద్ధిగా విశదీకరించిరి. అయన మన కీ

సహాయము చేసినందుకు—ఆయన యిట్లు చేయగలిగినందులకు మనము కృతజ్ఞులముగా నుండవలెను. ఈ ఆర్భాటమంతటివలన ఉపనిషత్తులందొక సమీచీన సిద్ధాంతము ప్రతిపాదింపబడలేదనిగాని అట్లు ప్రతిపాదింవబడినదని చెప్పువారు పొరపాటుపడుచున్నారనిగాని కానేకాదు.

ఉపనిషత్తులందు పూర్వభావమొకటి వేత్త దేవయానమున బ్రహ్మమును చేరుచున్నాడని—అర్వాచీన భావమొకటి బ్రహ్మముయొక్క తాత్త్వికజ్ఞానము—ఆత్మాభిన్నమని—గ్రహించుటకు మానవ ప్రయత్నమేమియు అక్కరలేదని—యిట్లు ద్విధాభావించుటకు ఆధారము హేతువు చెప్పకయే తలపోసిన ధీబా చాలా తప్పుచేసెను.

ఇట్లు భావించుటవలన-శంకరులకు వ్యతిరేకముగా నతడు చేసిన పోరాటమంతయు వ్యర్థమై—తాను శంకర సిద్ధాంత మంగీకరించినట్లయినది—అనగా ఉపనిషత్తులందు తక్కువ బ్రహ్మము (సగుణ) ఉత్తమ బ్రహ్మము (నిర్గుణ) రెండు ప్రతిపాదింపబడినవనుట. అందుచేత దానిపై నిలువబడిన సిద్ధాంతమంతయు అంగీకరించినట్లయినది. (సశేషము)

---

# గురువంశ కథా కథనము

(సంస్కృత మూలము: బ్రహ్మశ్రీ కాశీలక్ష్మణశాస్త్రి గురువంశ కావ్యమ్)

తెలుగు: శ్రీ చెఱుకుపల్లె జమదగ్నిశర్మ ఎం. ఏ.

## చతుర్దశ సర్గము

(గత సంచిక తరువాయి)

మూకాంబికా క్షేత్రమగు కొల్లూరునుండి జగద్గురువులు హోలాడి కేగి అక్కడ స్వీయ మఠమున నుండి నృసింహస్వామిని పూజించి దీపారాధనములతో ఉత్సవము చేయించి బ్రాహ్మణ భోజనములు జరిపించిరి. అటనుండి శృంగపురమున కేగుటకై ఘట్టము నధిగమించుట కశ్వారోహమొనర్చిరి 37.

విజయవంతముగా యాత్ర ముగించుకొని స్వామి వచ్చుచున్నారను వార్త వచ్చుటతోడనే ఊరంతయు నలంకృతమైనది. అడుగడుగున తోరణములే! ఇంటింటి గుమ్మమున రంభాస్తంభములే! ప్రతి పదమున కలయంపి చల్లి ముగ్గులు పెట్టిరి.

మేరూన్నతములుగా స్వాగత పతాకలు కట్టిరి. ఇట్లు సర్వాలంకార శోభితయగు శృంగ నగరిలోనికి వంది బృందముల స్తోత్ర పాఠములతో సర్వజన వందితులగుచు జగద్గురువులు ప్రవేశించిరి. (38) తపస్వులైన పూర్వ గురువర్యులు చేయించిన ప్రశస్తమైన వెండి పల్లకి యొకటున్నది. దానినొక మాటు చూచిన మరల మరల చూడవలెననిపించును. విచిత్ర శుకశారికా మయమై నేత్రోత్సవ మొనర్చుచుండును. నిపుణులగు శిల్పివరులు నిర్నిద్రులై తమ పనితనముతో దానిని నింపివైచిరి. దాని అంచుల నుండి విచ్చిన మల్లెపూల గుత్తులు వేలాడుచుండును. (39) గురువర్యులా శుభదినమున ద్విజవరాలయమున సర్వులకు భోజనమున కేర్పాట్లు చేయించి వెచ్చమునకు జంకవలసిన అవసరము లేని ఆ బ్రాహ్మణుడు సర్వ మభీప్సితమయి నట్లొనరింప ఆ మనోహరాందోళిక నధిరోహించి ఊరి వీథులన్నింట విహరించి పురజనుల నేత్రములకు సాఫల్యము కలిగించిరి. (40) పిమ్మట కొన్ని దినములు శృంగపురియందే యుండి పూర్వ గురువులకంటె నధికముగా పురదేవతల నెల్లర నర్చించి పరమానందము నందిన సచ్చిదానంద భారతి యతీశ్వరులు దిగ్విజయ కేళి యాత్ర జరిపి రావలెనని శృంగపురి నుండి బయలుదేరిరి. (41)

శ్రీవారు తమ నగరమునకు వచ్చుచున్నారను వార్త విని సంతోషించిన వరణాధిపుడు బహుభటులతో బయలుదేరి వారదత్తమున్నాశ్రమ ప్రాంతము వరకు నెదురేగి ఫలపుష్ప పాణులై జగద్గురువులను గౌరవించిరి. (42) మహోత్తుంగ హృదయులగు యతీశ్వరులు సర్వులతో తుంగా తీరము వెంట బోయి రామేశ్వర స్వామికి రథోత్సవము చేయించి సహస్ర లింగేశ్వరుని పూజించి సకల భూప సంభావితులు సర్వ విబుధ సంసేవితులు నగుచు (43) వరాహజనది వచ్చి తుంగభద్రలో కలియు సంగమ క్షేత్రమును చేరుకొనిరి. అక్కడికి దగ్గరనున్న వరణ నుండి పదివేల కాల్బలము పౌరుషవంతులై వినీతులగు వీరభటులతో కూడినది వచ్చి చేరినది. (44) ఆ సంగమ క్షేత్ర మఠమున నున్న యతి తన మఠరక్షణమున కని స్వయముగనే ప్రార్థించి పరిభూపతి బలమును తెప్పించి యుంచుకొనెను. ఇప్పుడు వీరు అనుకొనకుండ ఇంత బలగమై వచ్చుట చూచి భయపడి ఆ బలములచే పరివృతుడై మఠమునుండి వెలికి రాక లోపలనే యుండెను (45) అప్పుడు వరణాధిపుడు శత్రు దుర్వృత్తి నెఱింగి

---

44, 45 శ్లోకములు.

సంగమ క్షేత్రమునే కూడలి యందురు. అక్కడ వుండు సన్న్యాసి ఆ కూడలి మఠాధిపతి, ఆ కూడలి మఠము శృంగేరీ జగద్గురు సంస్థానమునకు శాఖా మఠము.

వాని భటులను చూచి తాను బలయుతుడై వారికి బుద్ధిచెప్పెను. ఈ ఉదంత మంతయు తెలిసిన బసర భూపాలుని కుమారుడగు సోమశేఖర భూపాలుడు కుపితుడై ఇట్టి ద్రోహచింతకు శిక్షగా బహుధనము చెల్లింపవలెనని శాసించెను. (46) సర్వత్ర విజయశీలురగు జగద్గురువులు ఆ సంగమక్షేత్రమున స్నానమొనర్చి పురదేవతల కెల్లరకు పూజలు సలిపి షడ్రసోపేత భోజనములతో బ్రాహ్మణులను తృప్తిపరచి అచ్చటి నుండి సైన్యములతో బయలుదేరిరి. (47) మహాబలపతులతో అనుచరులతో పరివేష్టితులైన యతీశ్వరులు పరమ గాంభీర్య యుక్తులై యవనరాజ్యములో నున్న భైరవ స్వామిని మహైశ్వర్యవంతులై అర్చించుటే కాక చిరకాల ముపాసించిరి. (48) అక్కడనున్న జనులతో కొంతకాలము కూడియుండిన జగద్గురువులు తిరిగి మహా సైన్యములతో సంగమక్షేత్రమునకు వచ్చి మఠమునందలి ద్రోహబుద్ధులను బహిష్కరించి శరణాగతుల నౌదార్యముతో ననుగ్రహించిరి. (49) అక్కడనుండి దూరమే అయినను హానుమ భూపాలుని తనయుడు వచ్చి ప్రాధేయపడి వేడికొనగా ఆతని పాలనలోనున్న వంగీపురమున కేగిరి. ఆ రాజక్కడ జగద్గురువుల నత్యంత భక్తి గౌరవములతో సమ్మానించి మఠవ్యయమునకై వృత్తి భూములనుగూడ సమర్పించెను. (50) ఆ రాజును పంపి యతీశ్వరులు సోమపురముచేరి సోమేశ్వరు నవలోకించిరి. అ స్వామి త్రిమూర్తిమయుడని ప్రసిద్ధి. హృద్వికస్వరుడగు నా దేవుని ఏకాగ్రతతో ధ్యానించి సర్వోపచార పూజలొనర్చి బ్రాహ్మణ సమారాధన మొనరించి సర్వుల నానందపరచిరి. (51) నయజ్ఞుడగు తరికేరే పురాధీశ్వరుని సచివులు సద్గురువుల సమక్షమునకు వచ్చి వినయాన్వితులై ప్రణామము లాచరించి తమ పట్టణమునకు వేంచేయవలెనని ప్రార్థింపగా భక్తానుగ్రహ హృదయాళువులగు జగద్గురువు లంగీకరించిరి. (52) శ్రీవారు తత్పురమును సమీపించుచుండ నారాజు మంత్రి సేనాసమన్వితుడై చాల దూర మెదురువచ్చి అత్యంతాదరముతో తీసికొని వెళ్ళి రాజభవనము నందే వుండవలసినదిగా కోరి వారినందు ప్రవేశపెట్టెను. (53) ఆ

---

46 వ శ్లోకము

బసవరాజ సూనుడు సోమశేఖరుడు.

50 వ శ్లోకము.

వంగీ పురము నిప్పుడు భద్రావతి యనుచున్నారు. హానుమభూపాలుని రాజధాని యిదియే.

52 వ శ్లోకము,

తరికేరే పురాధీశ్వరుడే పట్టాభిరామ నామక భూపాలుడు.

పురాధిపతి అసంఖ్యాక సైన్యముల కధీశ్వరుడు. మొగల్ పాదుషా నాశ్రయించిన వాడు. అనేక యుద్ధముల యందు స్వప్రతాప ప్రకటన మొనర్చి విజయము లందిన వాడు. అట్టివాడు గురుచరణుల దివ్యచరణ దర్శన మపేక్షించి శ్రీవారి సన్నిధికేగి బహుధన మర్పించి తామిట్టి అనుగ్రహము చూపుటవలన నా జన్మ చరితార్థత నందిన దని కృతజ్ఞుడై విన్నవించుకొనెను. (54) వెనుక నీ రాజు వైమనస్యము కలిగించిన వాడే యయ్యెను ఇప్పుడు సౌమనస్యముతో భజించుచు బహుధనములు భూములు నొసంగి గురువుల కాహ్లాదము కలిగించెను. ఎల్లప్పుడు సముచితులగు యతీశ్వరు లత డర్పించిన వంగీకరించిరి. (55) తన పూర్వ జన్మార్జిత పాతకముల నన్నింటిని పోగొట్టు కొనవలెనని సద్గురువులకు సర్వోత్కృష్ట భిక్షగూడ చేయించెను. అంజలి బద్ధుడై యెదుట నిలిచి స్వకుల వృద్ధి ననుగ్రహింపుడని దీనుడై యాచించెను. జగద్గురువు లుదారులై వాని నాశీర్వదించిరి. తరువాత ఆ రాజునకు తనయుడు గూడ కలిగెను. (56) అట్లు పట్టాభిరామ నామక భూపతి భక్తితో సమర్పించిన అఖిల గౌరవములనందికొని ఆ రాజు సైన్యయుక్తుడై అనుగమించి చాలదూరము సాగ నంపగా వానిని వెనుదిరిగి పోవుట కనుమతించి మార్గమందలి జనసంఘముల వానం దింప జేయుచు శిష్యానుచరులతో జగద్గురువులు సర్వాలంకార శోభితయగు శృంగ పురిని చేరుకొనిరి. (57)(చతుర్దశ సర్గ సమాప్తము) (సశేషము)

---

54 నుండి 56 వ శ్లోకము వఱకు.

ఇక్కడ వర్ణితుడైన సేనాపతి మొగల్ రాజ ప్రతినిధి యగు శిరా ప్రదేశ పాలకుడు.

---

# జనకమహారాజు వైరాగ్యము

యాజ్ఞవల్క్య మహర్షి మహాత్ముడు. ఆయన తపస్సిద్ధుడు. బ్రహ్మవిద్వరిష్ఠుడు. ఆయనకు పెక్కుమంది శిష్యులున్నారు. ఒకడు జనకమహారాజు. మిగిలినవా రందరు ఋషికుమారులు. యాజ్ఞవల్క్య మహర్షి యొక్క తేజోమండలమే బృహదారణ్యక ఉపనిషత్తు.

యాజ్ఞవల్క్య మహర్షికి జనకమహారాజునం దధికమైన ప్రీతి. మిగిలిన శిష్యు లనుకున్నారు — "మేమింతమంది తపస్వులము, ఋషులము శిష్యులై యుండగా— మాలో యెవ్వరిపైన లేనంత ప్రీతి—యీ జనకమహారాజుపైన—విషయలంపటుడై రాజ్యపాలన చేయుచున్న వానిపైన—గురువుల కేల?" అని. వారి మనస్సులోని

అసూయను మహర్షి గ్రహించెను. వారి మనస్సులందున్న కల్మషభావమును తొలగింప బడినగాని వారికి అభ్యుదయములేదు. మహర్షి తొలగింపదలచెను.

ఒకనాడు అందరు మహర్షి చెంత కూర్చుండి శ్రవణము చేయుచుండగా ఒక వార్తావహుడు వచ్చి జనకమహారాజు రాజధానియైన మిథిలానగరము దగ్ధమగుచున్నదని చెప్పెను. మిగిలిన శిష్యులు మిథిలా ప్రాంతమున తమ ఆశ్రమముల కేమి ప్రమాదము వాటిల్లునో—అల్పమైన తమ గృహోపకరణాదులు దగ్ధమగునో—అని భయపడి—మిథిలానగరమువైపు పరుగెత్తిరి. తమ వస్తువులను సంరక్షించుకొనవలె నన్న ఆతురత వారిది. జనకమహారాజు కదలలేదు. “మిథిలాయాం ప్రదగ్ధాయాం న మే కించిత్ప్రదహ్యతే” (మిథిల దగ్ధమగుచుండగా నాయందేమియు దహింపబడుటలేదు) అని శ్రవణమును ఆపలేదు. నిజముగా మిథిల కేమియు ప్రమాదము జరుగలేదు. మహర్షి అట్టి వార్త కల్పించెను. జనకమహారాజు వైరాగ్యమును చూచి మిగిలినవారు ఆశ్చర్యపడిరి. వారి అసూయ తొలగినది.

శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో జనకమహారాజును గురించి “కర్మణైవ హిసంసిద్ధిమాస్థితా జనకాదయః” (3-20) అని—జనకమహారాజు సిద్ధుడని చెప్పెను.

---

## గ్రంథావలోకనము

**1. జీవిత పరమార్థము:**

మరాటీ మూలము-శ్రీ సమర్థ రామదాసస్వామివారు.
తెలుగు అనువాదము శ్రీ సదానందగారు.
మూల్యము: రు. 1/-
ప్రకాశకులు: శ్రీసీతారామనామ సంకీర్తన సంఘము,
శ్రీరామనామ క్షేత్రము, గుంటూరు-4.

శివాజీ ఛత్రపతికి ఉపదేష్టయై, అనేక మహిమాద్భుతములతో సమకాలీన భారతీయులను సంభ్రమాశ్చర్యచకితులను చేసిన శ్రీ సమర్థ రామదాసస్వామి దేశ ప్రసిద్ధుడు. ఆయన రచించిన ‘దాసబోధ’ యన్న గ్రంథమున మన పోతానామాత్యులవారి ప్రశంస కలదు. శ్రీ రామదాసస్వామివారి ఉపదేశములను కొన్నిటిని తెలుగులో వెలువరించిన అనువాద గ్రంథమిది. అనువాదము సులభశైలిలో నున్నది. ఆస్తిక జనులందరు ఆదరింపవలసిన గ్రంథమిది. (రామహారీత)

2. ఆర్తిగీతాలు:

రచయిత: డా. చల్లా రాధాకృష్ణశర్మ.

ప్రకటన: లక్ష్మీనారాయణ గ్రంథమాల,

9, నాగార్జుననగర్, మద్రాసు-24.

కేంద్ర సాహిత్య అకాడమీకి మద్రాసులో ప్రాంతీయ కార్యదర్శిగా ఉంటూ బహువిధ సాహిత్య ప్రక్రియల్లో కైవాడం చూపిన ప్రజ్ఞాశాలి డా. చల్లా రాధాకృష్ణశర్మ. మానవతా దృష్టిని, సంప్రదాయ భావపరిమళంతో కలపి తాత్త్విక వెలుగును ప్రసరింప ప్రయత్నించిన ముక్తఛందో రచన యిది. సాహిత్య భావుకులు తాత్త్వికులు, మానవతావాదులు ఆదరింపవలసిన రచన. (సాహిత్యవేది)

3. నిశాంతము-(కవిత):

రచన: శ్రీ ఆర్. యస్. సుదర్శనము

(ప్రిన్సిపాలు, గవర్నమెంటు కాలేజి, రాజమహేంద్రవరము.)

వెల: రు. 3/-

ఇదియొక కవితాసంకలనము. అనుభూతిని తీసికొని సర్వజగద్రహస్యములకు వ్యాఖ్యానరూపముగా రూపకాలంకారముల వెలుగులుగా వెలువరింపబడిన పద్యకావ్యమిది. పౌరాణిక కథలతో ప్రపంచ రహస్యములకు వ్యాఖ్యానగర్భములై ప్రణయముద్రితముగా పరమేశ్వర సన్నిధానమునకు సోపానములు కట్టుట యీ కవిత. కవితాత్మయొక్క నిసర్గమోహన స్వరూపముగా నున్న రచన. మున్నుడిలో శ్రీ విశ్వనాథసత్యనారాయణగారన్నట్లు—జీవుని వేదన, సాంద్రమైన సంప్రదాయ బుద్ధి ఆత్మజిజ్ఞాస మొదలగు మధుర రమణీయ గుణము లెన్నియో నీ పద్యములందు వ్యంగ్యభూతములై యున్నవి. శ్రీ సుదర్శనంగారు సాహిత్యంలో 'Priest King' అని శ్రీ శేషేంద్రశర్మగారు సముచితంగా నే అన్నారు. (తురాషాట్)

4. మోక్షాదర్శము:

రచన: శ్రీ కలగ ఆంజనేయశాస్త్రి

అమృతానంద విద్యాపీఠము, సత్యనారాయణపురం, విజయవాడ-11.

వెల: రు. 4/- (ఖర్చులు ప్రత్యేకము).

ప్రసిద్ధమైన సీతారామాంజ సంవాద గ్రంథకర్త శుమారుడు రచించిన శుక చరిత్ర ఆధారముగా శ్రీ ఆంజనేయశాస్త్రి వివరణ వ్యాఖ్యతో రచించిన ఆత్మతత్త్వ గ్రంథ మిది. ఆస్తికులకు ఆదరపాత్రము. (హారీత)

# సంస్కృతభాషను మనమేల ఆదరించి నేర్చుకొనవలెను?
# (39)

ఈ ప్రశ్నకు మన దేశంలో మేధావివర్గంలో మూర్ధన్య మనీషామణులు సమాధానాలు చెప్పారు. గత సంచికలందు కొన్నిటిని తెలుసుకున్నాము. ఇప్పుడు మరికొన్ని. (సంపాదకుడు)

## డా. బదరుద్దీన్ తైయాబ్జీ
(ఉపకులపతి, ఆలిఘర్ విశ్వవిద్యాలయము)

భారతీయ పరంపరను, భారతీయ వాఙ్మయమును ఎవ్వడు తెలియడో వాడు భారతీయత అంటే తెలియనివాడు—గౌరవము లేనివాడు. భారతీయుడు—అతడు హిందువు ఐనా—లేక ముసల్మాను ఐనా—సరే—సంస్కృతభాషాజ్ఞానమును పొంది యుండవలెను. ఎవనికి వ్యాస, వాల్మీకి కాళిదాస భవభూతుల కవితా అమృతము రుచి తెలియదో—వాడెట్లు భారతీయుడౌతాడు? ప్రాచీన భారతీయభాష ఐన యీ సంస్కృత భాషయొక్క జ్ఞానము సకల భారతీయులకు—అనివార్యముగా—పొంద వలసినదై యున్నది.

(ఆలిఘర్ విశ్వవిద్యాలయ సంస్కృత పరిషత్ ఉద్ఘాటనావసరమున చేయ బడిన ప్రసంగమునుండి.)

## శ్రీ మెహర్‌చంద్ మహాజన్
(భారత ప్రధాన న్యాయాధీశ)

మన పూర్వులు తమ భావనావాహకముగ నుపయోగించిన సంస్కృతభాష మనకు వారసత్వముగా లభించినది. మన సంస్కృతి, మతము సంస్కృత వాఙ్మయ మున నిమిడియున్నవి. కాబట్టి దానిని ఉన్నతికి తెచ్చుట మన కర్తవ్యము. ప్రభుత్వ ప్రమేయమక్కరలేదు. మనమందరకు—ఉత్తరమున, దక్షిణమున—అందరు సంస్కృతము నేర్వక తప్పదంటే—అందరు నేర్తురు. మనము ప్రభుత్వమువంక లేక విశ్వ విద్యాలయముల వంక చూచుచు, మన పిల్లలు ఆంగ్ల సాహిత్యదాసులై—అన్ని రకముల నవలలను చదువుచు కాలము వ్యయము చేయుచుండగా—యీ దేశమున ఉత్తమశీలము పటిష్ఠమగుట సాధ్యము కాదు. ఉత్తమశీలము అలవరచుకొనుట—నా అభిప్రాయమున—సంస్కృతభాషవలననే జరుగును.

(స్వర్ణోత్సవ సంచిక మదరాసు సంస్కృత కళాశాల 1956.)

---

# వేదములలో
# ఆధునిక విజ్ఞానశాస్త్ర విషయములు

మన వేదములందు యీనాటికి కూడ ఆధునిక విజ్ఞానశాస్త్ర (Science) వేత్తలకు పూర్తిగా అవగాహన కాని బహు విషయము లున్నవని చెప్పినచో— పాశ్చాత్య వ్యామోహితులగువారు నవ్వుచున్నారు. అది వారి కర్మము. భ్రష్టుల నెవ్వరు బాగుచేయకలరు!

గణితశాస్త్రమునకు పునాదులు కల్పించినవారు మన వైదిక ఋషులు. ఋగ్వేదమునందున్న గణితశాస్త్ర సూత్రము లెన్నియో నేటికిని అవగాహనచేసికొన వలసినవి కలవు. పైథాగరస్ సిద్ధాంతము (Pythogoras theorum) అని విశ్వ విఖ్యాతి పొందిన సిద్ధాంతము అతని కంటె ఎన్నో వేల సంవత్సరములకు ముందు మన వేద వాఙ్మయమున శుల్బసూత్రములం దున్నది. మన విజ్ఞాన శాస్త్రవేత్తలు పైథాగరస్ కే అంజలిపట్టి—మన కిదివరకే యిది తెలియునని పాశ్చాత్యులకు చెప్ప నైన చెప్పరు. ఇది వారి దుర్బుద్ధి, వ్యామోహము.

గణితశాస్త్ర మొక్కటి యేమి? వైద్యశాస్త్రము, వాస్తు నిర్మాణశాస్త్రము, నౌకా నిర్మాణ శాస్త్రము, అర్థ శాస్త్రము, లోహ విషయ శాస్త్రము, ఖగోళ శాస్త్రము, రాజనీతి, భౌతికశాస్త్రములు మనకు స్వతంత్రముగా నున్నవి. మన శాస్త్రములనుండి పాశ్చాత్యు లెంతయో గ్రహించిరి.

ఋగ్వేదమున, అథర్వవేదమున ఖగోళవిషయము లెన్నియో కలవు. గ్రహణ ములను గురించి లెక్కకట్టు పద్ధతులు—కాలపరిమాణమును కొలుచుట తొలిగా మన వేదములు చెప్పినవే. నేటికిని అనుల్లంఘనీయములు.

ఈ మధ్య కాలమున మనము ఆచరణలోకి తెచ్చుకున్న దశాంశ పద్ధతి మన యజుర్వేదమునం దున్నదే. పాశ్చాత్యులు మన కిచ్చిన భిక్ష కానే కాదు. ఒక అంకె 12 రెట్లు (ఉదాహరణకు $12^{12}$) వరకు మనవారు ప్రత్యేకమైన పేర్లు పెట్టిరి (పదార్థము). తరువాత బౌద్ధ జైన గ్రంథములలో 29 రెట్లు ($12^{29}$) 53 రెట్లు ($12^{53}$) కూడ సంభావించి పేర్లు పెట్టబడినవి. పంచవింశ బ్రాహ్మణమునందు arithmetic progression వివరింపబడినది. శత పథ బ్రాహ్మణమున కాలమును అత్యంత సూక్ష్మభాగములుగా విభజించుట కలదు.

నారదీయ పురాణమున ఖగోళశాస్త్ర విభాగ మున్నది. బృహత్సంహిత (బహుళ క్రీ.శ. 5 వ శతాబ్దము) విజ్ఞాన సర్వస్వము వంటిది. దానియందు ఈనాటి

వాతావరణశాస్త్ర (meteorology) విషయము లెన్నియో కలవు. అల్బిరుని అని పేరు గల పర్షియా దేశస్థుడు (క్రీ.శ. 10 లేక 11 శతాబ్దమువాడు) భారతీయుల పురాతన విజ్ఞానశాస్త్రములను, గణితశాస్త్రమును బహుధా ప్రశంసించెను. తరువాత కాలమున అబుల్ ఫజల్ తన 'ఐని అక్బరీ'లో కూడ జోహారు లర్పించెను.

శుల్బ సూత్రములు, వేదాంగ జ్యోతిషము, సూర్యచంద్ర ప్రజ్ఞాప్తి— క్షేత్ర గణిత (జామెట్రీ) ఖగోళశాస్త్ర (astromomy) ముల సంపుటములు మన ఖగోళ శాస్త్రమున గణిత పద్ధతుః లో ఆర్యభటీయ మని, సూర్య సిద్ధాంతమని ప్రసిద్ధ సిద్ధాంతము లున్నవి. భాస్కర (ఇద్దరు) బ్రహ్మగుప్త, వాతేశ్వర, ముంజల, శ్రీపతి, పరమేశ్వర—ప్రసిద్ధులైన భారతీయ ఖగోళ శాస్త్రజ్ఞులు. భూమి స్వంతత్ర గోళమై ఆకాశమున స్వేచ్ఛగా వ్రేలాడుచున్నదని మనవారి కందరకు తెలియును. సూర్యాదిగ్రహములు—నియమిత గమనముతో తిరుగాడు చున్నవనియు తెలియును. చంద్రుడు, బుధుడు, శుక్రుడు, గురువు, శని మొదలగు గ్రహముల గమనవేగములు మనవారికి తెలియును. అవి నేటికిని కాదని చెప్పుటకు వీలులేదు. ఎంతో దూరమున నున్న నక్షత్రముల గమన వేగములు, గమన రేఖలు మనవా రెరుగుదురు. ఖగోళ గణితమునకు ప్రారంభదశ—శూన్యము— (zero) కల్ప ప్రారంభము. మహాయుగ ప్రారంభము, కలియుగ ప్రారంభము—గ్రహముల దూర రేఖలు—నిక్కచ్చిగా సరిగా—తప్పులేనట్లుగా—తేల్చబడినవి. అంకెలోని భాగములు (fractions) మాత్రమేకాదు—Surds—irrational numbers కూడా వేదమున చెప్పబడినవే.

పాశ్చాత్యులు ఊహించుటకు ముందే భారతదేశమున-negative quantities, quadrative ఈక్వేషన్సు, బినోమియల్ సిద్ధాంతము, ఇన్ డిటర్మినేట్ ఈక్వేషన్స్, సున్నతో గణిత క్రియలు, ట్రిగొనామెట్రి, కో ఆర్డినేట్ జామెట్రీ డిఫరెన్షియల్ కేల్క్యులస్—మొదలైనవి రూపుదాల్చినవి.

కౌటిల్యుని అర్థశాస్త్రమున (క్రీస్తుపూర్వము 400 సంవత్సరములు) గనులు త్రవ్వుట గురించి, లోహ శాస్త్రము (మెటలర్జీ) రసాయనిక టెక్నాలజి, బంగారు మిశ్రమ లోహములు, తూకములు, బరువు, కొలతపాత్రలు కాలమును విభాగించుట మొదలగునవి వివరింపబడినవి. వైశంపాయన నీతి శాస్త్రమున ఆయుధముల వివరణ మున్నది. శుక్ర నీతిశాస్త్రమున ప్రేలుడు పదార్థ విషయములున్నవి (missiles) యుక్తి కల్పతరువున నౌకా నిర్మాణ విషయములు, తంత్రములందు ఇంజనీరింగు నిర్మాణ విషయములు కలవు.

'మాయామత', మనసార, విశ్వకర్మ వస్తులక్షణ, శిలారత్న—కొన్ని ప్రాచీన

ఇంజనీరింగు గ్రంథములు. రసాయనిక శాస్త్రమున—రసరత్నాకర, రాజహృదయ మొదలగు గ్రంథములు ప్రసిద్ధములు.

అథర్వవేదమునుండి ఆయుర్వేదము-వైద్యశాస్త్రము ఉత్పత్తియైనది. చరక సంహిత సుశ్రుత సంహిత, అష్టాంగ హృదయము ప్రసిద్ధమైన ఆయుర్వేద గ్రంథములు. బౌద్ధుడైన నాగార్జున డీ శాస్త్రమునకు మహోపకారము చేసెను. 'గర్భోపనిషత్తు' అన్న గ్రంథము గర్భస్థ పిండరక్షణ చెప్పునది. శస్త్ర చికిత్స, ప్లాస్టిక్ సర్జరీ సుశ్రుత సంహిత యందున్నవే. రాజ నిఘంటు వంటివి వస్తుగుణ (materia medica) దీపి కలు. శరీరాంతర భాగములను గురించి, రక్తప్రవాహాదులను గురించి, జీర్ణశక్తిని గురించి అథర్వవేదమునందున్నవి. వైద్యగ్రంథములందు పశువైద్యమును గురించి కూడా కలదు.

వ్యవసాయము—వృక్షశాస్త్రము—ప్రాచీన భారతమున చాల ప్రగతి సాధించినవి. పురాణములం దెన్నియో ప్రసక్తులు కలవు.

వేడి, శబ్దము, అయస్కాంత బలము— మొదలగు భౌతికశాస్త్ర (ఫిజిక్సు) విషయము లెన్నియో మన ప్రాచీన గ్రంథములం దున్నవి.

ఇవి యన్నియు మనము మన ప్రాచీనుల ఉన్నతిని గ్రహించుటకుగాను గుర్తింపవలసినవి. మనము విజ్ఞానశాస్త్రమున సాధించినదేమియు లేదని సిగ్గుపడ నక్కర్లేదు. అంతయు వేదములందు బీజప్రాయముగా నైన నున్నదే.

(ఇది పరిశోధనా దృష్టితో వ్రాయబడిన వ్యాసముకాదు. ఒక సాధారణ సూచనా ప్రాయమైనది. ప్రగాఢ విషయము కాదు.)

---

# సంగీతముతో - అర్చన

మన సంప్రదాయము బహు రమణీయమైనది. మన కళలకు, నిత్య లౌకిక వ్యవహారమునకు కూడ ఆచార మున్నది. సంప్రదాయ మున్నది. ఆ సంప్రదాయము సంస్కృతివిలసితము. మన సంస్కృతిగాని, సంప్రదాయముగాని మానవుని, ఉత్తమ మానవునిగా చేయుటకు - నిత్య లౌకికవ్యవహారమునందు - కళాభ్యాసంగమునందు - కూడ భగవత్సేవను అనుసంధించి - చంచలమైన మనస్సునకు ఏకాగ్రత ఘటింపచేసి, అందువలన శ్రేయఃప్రాప్తి కలిగించు లక్ష్యము కలవి.

ఉదాహరణకు మన సంగీత సంప్రదాయమును గమనింపుడు. మన సంగీత మంతయు భగవత్కైంకర్య ప్రయోజనము కలది. సంగీతమువలన ముక్తి సాధించిన మహాసాధకులు మనకున్నారు. శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులు, పురందరదాసు, నారాయణతీర్థులు, కర్ణాటక సంగీత రత్నత్రయము మొదలగువారు.

తెలుగుదేశమున సంగీత గేయ రూపకమైన నిత్యసేవా సంప్రదాయ మొకటి కలదు. శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులుగారు దానిని ప్రారంభించినాడు. ఆయన కడప మండల (1408-1503)మున అభిజనము కలవాడు. నిజముగా భగవంతుని ప్రభాత సమయమున నిద్ర మేల్కొలుపుట శ్రీమద్రామాయణమున విశ్వామిత్ర మహర్షి ప్రారంభించినాడనిపించును.

కౌసల్య సుప్రజా రామ పూర్వాసంధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్॥

ఈ శ్లోకముతోనే నేడు సకల దేవాలయమునందును సుప్రభాతము జరుగుచున్నది. ఇటీవలి కాలమున వెలసిన సుప్రభాతముల సంగతి మాత్రమే కాదు, పూర్వ కవి విరచితములు కూడ నట్లే యున్నది. శ్రీ వేంకటేశ్వరుని సుప్రభాతము తొండరడిప్పొడి యాళ్వారు (తెనుగున విప్రనారాయణు డందురు) రచించిన సుప్రభాతము నిట్లే యున్నవి.

తెలుగున శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులవారి సంప్రదాయమును వాగ్గేయకారకరత్నమైన శ్రీ త్యాగరాజులవారు 25 కీర్తనలతో పుష్టి నొనరించిరి. కన్నడ దేశమునం దీ సంప్రదాయమును హరిదాసులు నిర్వహించిరి.

ప్రత్యేకమైన యీ 25 త్యాగరాజకీర్తనలందు తాళ రాగ భావములు పరికోటి నందుకొనుట మాత్రమే కాదు - మాధుర్యము పుక్కిలింతలుగా నున్నది. ఈ కీర్తనలలో ఉపయోగింపబడిన రాగములు — కురంజి, నవరోజ్, ఘంటా, ఆహిరి, గోపికావసంతము - మొదలగు అపూర్వ రాగములున్నవి. నవ విధ భక్తి భావములు, షోడశోపచారములు సముద్దీపములై యీ కీర్తనలకు జీవము పోసినవి. అందు కొన్ని వివరములు—

నిద్రమేల్కొనుటకు భగవంతునికి మేలుకొలుపు పాడిన తరువాత - ఆయనను శయ్యనుండి నేలపైన జాగ్రత్తగా కాలుపెట్టుమని హెచ్చరించుట కొక కీర్తనము. "హెచ్చరికగ" — (యదుకులకంభోజి రాగము).

తరువాత కల్యాణోత్సవము — సీతా కల్యాణ వైభోగమె - (కురింజి రాగమున). మనదేశమున వివాహ సమయములందు స్త్రీలు గానముచేయు "గౌరీ కల్యాణము" కీర్తన వంటిదే యిది.

భగవంతుని నలుగుపాట — అభ్యంగన స్నానము చేయించు పాట — "నగుమోము" (మధ్యమావతి రాగమున) అన్న కీర్తన. దానితో కలసి పాడవలసిన కీర్తన "అవనిసుత" — ఇవి మంగళకరములు.

"పతికి హారతి - పతికి మంగళ హారతి" అన్న సురతి రాగకీర్తన భగవంతుని మంగళ నీరాజనమును కల్పించు కీర్తన.

'వదనద్యుతి' అన్న కీర్తన శోభనకరమైనది. భగవంతునికి శోభనకరముగా పాడుట - పంతువరాళి రాగమును పోలునట్టి రాగమున - అపూర్వ సంచారములతో పాడుదురు. ఈ యిరువదియైదు కీర్తనలలో పవళింపు సేవకు చెందినవి మధురాతి మధురములు. 'పూలపాన్పుమీద' (అహిరిరాగమునందున్న కీర్తన) పవళింపు సేవలో చక్కని కీర్తన. త్రిస్ర లఘు గతి కలది. పూలపాన్పుపైన శయనింపుమని భగవంతుని అర్థించుట దీనియందున్నది. 'లాలి లాలయ్య' కేదార గౌళ రాగ కీర్తన. 'లాలి' - నీలాంబరి రాగ కీర్తన. ఇవి లాలిపాటలు.

శహనా రాగమున 'రామ రామ రామలాలి' అన్న కీర్తన చమత్కార సంభాషణ కలది. దీనియందు కౌసల్యా బాల రామచంద్రుల సంభాషణ మున్నది. కౌసల్యాదేవి బాల రాముని "నీ కన్ను లేల ఎఱ్ఱబడినవి?" అని ప్రశ్నించినది. రాముడు "మేము కండ్లను మూసి ఆడుకొను దాగుడుమూతల ఆట ఆడుచున్నాము. నా కన్నులను ఎవ్వరును చేతులతో మూయుటకు వీలులేనంత పెద్దవిగా నున్నవని నాతో ఆడు బాలకు లనుచున్నారు. మరియు నే నెక్కడను దాగికొనుటకు వీలు లేకుండ నున్నది. నా శరీరము యొక్క తేజస్సు నన్ను పట్టియిచ్చు చున్నది. వాళ్ళు ముత్యాలహారములతో కట్టబోయి నా పాదముల మీద పడిపోవుదురు. చివరకు అందరు కలసి నన్ను ఆటలో వారితో ఆడనీయరు. ఊరక సాక్షిగా చూడనిత్తురు. నేను జగత్సాక్షిని కావలెను."

"మేలుకోవయ్యా" — (భౌళిరాగ కీర్తన). 'నారదాదులు నీ సేవ కొరకు వేచియున్నారు' అప్సరఃకాంతలు సేవచేయవలెనని వచ్చియున్నారు. నేను పాలను వెన్నను నీ కొరకు సిద్ధముచేసియున్నాను". ఇట్టి భావములతో నున్న కీర్తన. 'కరుణారసాక్షయ' — ఇది ఘంటారాగమున నున్న (సంస్కృత) మంగళ కీర్తన.

ఇట్లు మన సంగీతము దివ్యసాధనాసోపాన కలితమై ముక్తిలాభము చేకూర్చు చున్నది. భగవంతుడు సన్నిధియందున్నాడని త్రికరణశుద్ధిగా భావించి - అర్పించి - తరించుట కుద్దేశింపబడినది. ఇప్పుడు మనము మన సంగీత సంప్రదాయము విస్మరించి - పిచ్చికేకలు వేయుచు పరవళ్ళు త్రొక్కుచు సంప్రదాయభ్రష్టులమై - దానిని ప్రగతి యన్న భ్రాంతిలో మునిగిపోయినాము.

ఇక భ్రష్టమైన సంగీతమును—దానిని అవలంబించి చిందులు త్రొక్కువారిని భగవంతుడే రక్షింపవలెను.

## శృంగేరి వార్తలు

[illegible] శ్రీ [illegible] (…-1-19…) [illegible] [illegible] సమ్మానించబడిరి.

### శ్రీ [illegible] వారి వర్ధంతి:

[illegible] (…-1-…) [illegible] శ్రీ [illegible] శ్రీ [illegible] ఆయుష్యహోమాదులు [illegible].

సాయంకాలము ప్రవచన మందిరమున సభ జరిగినది. కర్ణాట తమిళ ప్రముఖులు అక్కడ ప్రసంగములు చేసిరి. కన్నడ విద్వాన్ పరమ [illegible] శ్రీ [illegible] అనర్గళముగా ఉపన్యసించెను.

### శ్రీ మహాసన్నిధానమువారి సన్న్యాస స్వీకరణ స్వర్ణోత్సవం:

శ్రీ మహాసన్నిధానమువారు ప్రజోత్పత్తినామసంవత్సరమున సన్న్యాసాశ్రమమును స్వీకరించి—ఈ సంవత్సరమున ఏబది సంవత్సరములు పూర్తి అగుటవలన యీ సంవత్సరము శిష్యమహాజనము స్వర్ణోత్సవములను జరుపుటకు నిర్ణయములైనవి.

శ్రీ జగద్గురువులు శిష్యస్వామిపరివార సమేతముగా దుర్మతినామ సం॥ కార్తిక మాసాంతమున (నవంబరు ప్రాంతము) శృంగేరినుండి బయలుదేరి, బెంగళూరు మదరాసు నగరములలో కొన్ని కార్యక్రమములను (దేవతా ప్రతిష్ఠాదులను) పూర్తిచేసికొని మాఘమాస మధ్యమున (ఫిబ్రవరి ప్రాంతము 1982) ఆంధ్రప్రదేశమును చేరుదురని—ఆ ప్రదేశ సంచారమున కాశీశ్వర దేవస్థాన కుంభాభిషేకము—జగ్గయ్యపేట ప్రాంతమున నూతన వేంకటేశ్వరస్వామి దేవాలయమున ప్రతిష్ఠాదులు నిర్వహింతురని తెలియుచున్నది.

శ్రీ చరణుల సన్న్యాసాశ్రమ స్వీకరణ స్వర్ణోత్సవము దేశమంతటను—జరుగును. శ్రీ చరణులు విజయము చేసినప్పుడు బెంగళూరు మదరాసు నగరములలోను—ఆంధ్రమునందు జరుగును. శ్రీ చరణులు మదరాసు నగరమును 1982 జనేవరి మొదటివారమున చేరి, ఫిబ్రవరి మొదటివారమున విడిపోవుదురని తెలియుచున్నది. మదరాసులో మాఘ శు దశమి (8 ఫిబ్రవరి) నాడు అడయారులో నిర్మింపబడిన [illegible]దేవాలయ కుంభాభిషేకము నడచునని తెలియుచున్నది.

Regd.No. 17726/59 H/HD 392. SRI SANKARA KRUPA
May 1981

To Dr. ... Director,
... University
Oriental Research Institute
TIRUPATHI

ఈ సంచికలో



If undelivered please return to:
A. SATYANARAYANA MURTY,
Publisher : SRI SANKARA KRUPA
6-3-609/18 Anand Nagar Khairatabad, Hyderabad-500004.

# శ్రీ శంకర కృప

దక్షిణామ్నాయ
శ్రీశృంగేరి శారదా పీఠమువారి యాజమాన్యమున వెలువడు
ఆధ్యాత్మిక మాసపత్రిక

సంపుటి: 2 | వెల రు. 1 జూన్, 1981
సంవత్సర చందా రు. 10/- | సంచిక: 10

దుర్మతి వైశాఖ - జ్యేష్ఠము (శకాబ్ది [illegible])




శృంగేరిలో శ్రీ శారదా ధన్వంతరి వైద్యశాలకు మెటర్నిటీ
విభాగమునకు శంకుస్థాపన చేయుచున్న కర్ణాటక ముఖ్యమంత్రి
శ్రీ గుండురావు

# పంచాంగ విశేషములు

## శ్రీ శృంగేరీ జగద్గురు మఠ పంచాంగము ననుసరించి

### దుర్మతి వైశాఖ బ చతుర్దశి (1-6-81) నుండి

### దుర్మతి ఆషాఢ శు చతుర్దశి (15-7-81) బుధవారము వరకు

1-6-81 సోమవారము వైశాఖ చతుర్దశి మాసశివరాత్రి శైవనక్తం

2-6-81 మంగళవారము వైశాఖ అమావాస్య వటసావిత్రి వ్రతం పద్మకయోగం జాహ్నవి స్నానం

3-6-81 బుధవారము జ్యేష్ఠ శు పాడ్యమి

4-6-81 గురువారము జ్యేష్ఠ శు విదియ రంభావ్రతం. శ్రీ జగద్గురు నృసింహ భారతీస్వామ్యాఖ్య పరమేష్ఠి గుర్వారాధన

7-6-81 ఆదివారము మహాసన్నిధానమువారి సన్న్యాస స్వీకారవర్ధంతి (స్వర్ణోత్సవము)

9-6-81 మంగళవారము జ్యేష్ఠ శు అష్టమి శుక్లాదేవి పూజ

11-6-81 గురువారము దశపాపహరాదశమి సేతుబంధన రామేశ్వర ప్రతిష్ఠ

13-6-81 శనివారము జ్యేష్ఠ శు ఏకాదశి సర్వేషాం

14-6-81 ఆదివారము శ్రీశంకర భగవత్పాద కైలాసగమనం మిథున సంక్రమణం

15-6-81 సోమవారము జ్యేష్ఠ శు త్రయోదశి శ్రీ జగద్గురు విద్యారణ్యస్వామి ఆరాధన

17-6-81 బుధవారము జ్యేష్ఠ పౌర్ణమి. ఏరువాక పూర్ణిమ

25-6-81 గురువారము జ్యేష్ఠ బ అష్టమి త్రిలోచన వ్రతము

28-6-81 ఆదివారము జ్యేష్ఠ బ ఏకాదశి సర్వేషాం

30-6-81 మంగళవారము జ్యేష్ఠ బ చతుర్దశి మాసశివరాత్రి కృష్ణాంగారక చతుర్దశి, సావిత్రీవ్రతం

### జూలై మొదటి భాగం

1-7-81 బుధవారము జ్యేష్ఠ అమావాస్య

2-7-81 గురువారము ఆషాఢ శు పాడ్యమి

6-7-81 సోమవారము ఆషాఢ శు పంచమి స్కందపంచమి

7-7-81 మంగళవారము ఆషాఢ శు షష్ఠి కూర్మ షష్ఠి

8-7-81 బుధవారము ఆషాఢ శు సప్తమి వైవస్వత సప్తమి

11-7-81 శనివారము ఆషాఢ శు దశమి చాతుర్మాస్యస్నాన

12-7-81 ఆదివారము ఆషాఢ శు ఏకాదశి సర్వేషాం శయనైకాదశి (తొలి ఏకాదశి) గోపద్మ వ్రత ప్రారంభము

13-7-81 సోమవారము ఆషాఢ శు ద్వాదశి వాసుదేవ ద్వాదశి శాకవ్రతారంభము

# శ్రీ శంకర కృప

సంపాదకులు: తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

సంపుటి 20 } శంకరశ్శంకర స్సాక్షాత్ వ్యాసో నారాయణో హరిః { సంచిక 10


## శ్రీ శంకర భగవత్పాదాచార్య విరచిత

## శ్రీమత్త్రిపురసుందరీ వేదపాద స్తోత్రము

శ్లో॥ మహ్యంద్రుహ్యన్తి యేమాతః త్వద్ధ్యానాసక్త చేతసే
తానంబసాయకై రేభి రవబ్రహ్మద్విషోజహి ॥ 61

(దీనియందున్న వేదపాదము ఋగ్వేదములోనిది. శ్రీ సూక్తమునందును కలదు)

తా. తల్లీ! నిన్ను ధ్యానించుటయందు మగ్నమైన మనస్సుగల నాకు ద్రోహము చేయువారెవ్వరో-బ్రహ్మద్వేషులగు వారిని—నీ బాణములచేత చంపుము.

విశేషములు: బ్రహ్మద్వేషులనగా—సాధువులను ద్వేషించుచు కష్టపెట్టువారని—తపస్సునకు భంగములు కలిగించువారని భావము. శిష్టులను కాపాడుట దుష్టులను శిక్షించుట శ్రీదేవి తన కర్తవ్యముగా స్వీకరించినది. అందుకని యిట్టి ప్రార్థనము.

రామాయణ భారత భాగవతములందు శిష్టులైన సాధువులను బాధలుపెట్టువారిని సంహరించి శిష్టరక్షణము, దుష్టశిక్షణము కన్పించును. అట్లే శ్రీ దేవీపరమైన దేవీ మాహాత్మ్యమునందు దేవీభాగవతమునందు కలదు.

---

## శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి చరణ స్మరణమ్

### వైరాగ్యము

(గతసంచిక తరువాయి)

ఈ మానసిక సమస్థితి శ్రీ జగద్గురువులకు సహజము. అతిబాల్యమునందే యీ స్థితి ప్రస్ఫుటముగా నుండెడిది కావున నిది ఆయనకు పూర్వజన్మము నుండి యీ

జన్మతః సంక్రమించిన గుణముగా తోచుచున్నది. చిన్నప్పటి నుండి యీ గుణమాయనలో స్పష్టముగా నుండెడిది.

ఆయనకు ఏడెనిమిది సంవత్సరముల వయస్సున్నప్పుడు—(అప్పుడాయనకు నరసింహశాస్త్రి యన్న పేరు)—స్థానిక పాఠశాలలో చిన్నతరగతులలో ఆయన చదువుచుండెడివాడు. వీరి ఇంటి ప్రక్కన వసించు గృహస్థునకు కూడా యింతే వయసుగల కుమారుడొక డుండెను. ఆ గృహస్థు సంపన్నుడు. ఆయన అభిమానమునకు నరసింహశాస్త్రి పాత్రుడయ్యెను. తన కుమారునికి పలక, బలపము, పెన్సిలు, లేక పుస్తకము-కొనినప్పుడెల్ల ఆ గృహస్థు మరియొకటి కొని నరసింహశాస్త్రి కిచ్చెడివాడు. సంవత్సరాంతమున ఆయన కుమారుడు తరగతి పరీక్ష తప్పిపోగా నరసింహశాస్త్రి ఉత్తీర్ణుడయ్యెను. ఆ గృహస్థునకు కుమారునిపై కోపము వచ్చి శ్రద్ధగా చదువలేదని మందలించి చెంపకాయలు కొట్టెను. ఆ కుఱ్ఱవాడు గట్టిగా యేడ్చుచు ప్రక్కయింటికి పరుగెత్తుకొని వచ్చి నరసింహశాస్త్రిని కొట్ట మొదలిడెను. "ఇట్లు అకస్మాత్తుగా వచ్చి నన్ను కొట్టుచున్నావేమి?" అని నరసింహశాస్త్రి ఆ బాలుని అడుగగా "నేను పరీక్ష తప్పిపోగా నీవు ఉత్తీర్ణుడైతివి. కాబట్టి మా తండ్రి నన్ను చెంపకాయలు వేసెను. నీవు కూడ తప్పిపోయినచో ఇట్లు జరిగియుండెడిది కాదు" అని ఆ బాలుడు సమాధానము చెప్పెను.

ఆ బాలుడిట్లు ప్రవర్తించుటకు తగిన న్యాయమేమియు లేకపోయినను—పరోక్షముగా తనకు తెలియకుండ తానాతడు చెంపకాయలు తినుటకు కారణమై యుండవచ్చునని నరసింహశాస్త్రి భావించి ఆ బాలుని అసంగత ప్రవర్తనకు తిరుగు చెప్పలేదు.

అరువది సంవత్సరముల కంటె తరువాత ఆ బాలుడు డెబ్బదియేండ్లవాడై యుండగా యీ సంఘటనను మిత్రుని కొకనికి చెప్పి "నా బాల్యమున నేను చేసిన దుండగీడు తనమునకు నన్ను నేను ఎన్నటికి క్షమించుకొనజాలను. ఆ నాడు ఆయన ముఖమునందు నాకు ద్యోతకమైన 'శాంత గంభీరత' నాకు మరపునకు వచ్చుటలేదు.

కొన్నినాళ్ళ తరువాత నరసింహశాస్త్రి మఠపాఠశాలలో విద్యార్థిగా నుండగా—అతనికంటె పొడుగరి బలిష్ఠుడు వయస్సు ఎక్కువ కలవాడు-సహపాఠి-యొకడుండెను. ఆ సహపాఠికి పొడుము పీల్చుట అలవాటు. అతడు పొడుముకాయ—తెరచినప్పుడెల్లా శ్రీ నరసింహశాస్త్రి తలను ప్రక్కకు త్రిప్పుకొనువాడు-అది గమనించుచుండిన ఆ సహపాఠి ఒకసారి కుఱ్ఱతనపు చేష్టలలో-వెనుక నుండి శ్రీ నరసింహ

శాస్త్రిని పట్టుకొని పాడుము వాసన చూపింప యత్నించెను. కాని శ్రీ నరసింహ శాస్త్రి తల క్రిందకు వంచి ముఖమును నేలకు ఆన్చెను. ఎక్కువ బలము కలిగిన ఆ సహపాఠి నరసింహశాస్త్రి ముఖమును తన ప్రక్కకు త్రిప్పుకొనలేకపోయెను—(శ్రీ నరసింహశాస్త్రి గాలిని కుంభకము పట్టినందువలన) చివరకు అతడు తన ప్రయత్నమును విరమించుకొని శ్రీ నరసింహశాస్త్రితో—"అయితే నీకీ పొడుము పీల్చి దానివలన వచ్చు సుఖమును అనుభవించు అదృష్టము లేదు" అనెను. తరువాత మరెప్పుడు శ్రీ నరసింహశాస్త్రిని బాధపెట్టలేదు. శ్రీ నరసింహశాస్త్రి ఆ సహపాఠి ప్రవర్తనకు అతని నెప్పుడును అసహ్యించుకొనలేదు.

తరువాత కొన్ని సంవత్సరముల కా సహపాఠి గొప్ప పండితుడై శ్రీ జగద్గురువుల దర్శనమునకు రావలసివచ్చినప్పుడు—ఆ చిన్ననాటి కుఱ్ఱతనపు చేష్ట ఆయన మనస్సులో మెదలాడెను. మనస్సులో ఏదైన కొంత క్లేశము ఉన్నచో దానిని పోగొట్టు తలంపుతో శ్రీ జగద్గురువులు "మీ రింకను ముక్కుపొడుముపై పూర్వమంత మోజును నిలుపుకొన్నారా?" అని ప్రశ్నించిరి. ఆయనతో వచ్చిన స్నేహితుడొకడు "ఈయనకు ముక్కుపొడుముపై అంత మోజు ఉన్నదా?" అనగా శ్రీ జగద్గురువులు "ఆయనకు మోజు ఉండుట మాత్రమే కాదు. ఆయన కెంత స్వార్థము లేదనగా - ఆ ముక్కుపొడుము వలన కలుగు సుఖము ఇతరులకు కూడ కలుగవలెనని వాంఛించుచు—కొందరికా అదృష్టము లభింపలేదని విచారించెడివాడు" అని చాల సంవత్సరముల క్రింద జరిగిన సంఘటనను—అప్పటి మాటలను గుర్తుకు తెచ్చిరి.

దాదాపు నలువది సంవత్సరములకు పైబడినకాలమాయన శ్రీ మఠమున పీఠాధిపతిగా నుండగా—ఎవ్వరియందు తప్పు చూపుటగాని—కోపించుటగాని—ఫలానా పని చేయుమని శాసించుటగాని జరుగలేదు. అయితే బాహిరముగా శాసింపకపోయినప్పటికి—ఆయన చుట్టు ఉన్నవారి యందు అసాధరణమైన భక్తి గౌరవ విధేయతలను ఆయన కలిగించెడివారు.

మైసూరు మహారాజు శ్రీ కృష్ణరాజ ఒడయరు ఒక పర్యాయ మిట్లనెనట—"పూర్వజగద్గురువులయందు నాకు ప్రేమ గౌరవములున్నవి. ఈ జగద్గురువులు కూడ నా యందు మిక్కిలి వాత్సల్యము కలవారే. అయితే ఆయనయందు నాకు భయభక్తులు కలుగుచున్నవి. కారణము నాకు తెలియదు."

ఆయనకు సహజముగా నున్న నిశ్చలత్వము గాంభీర్యము-బహుశా యిట్టి భావమును కలిగించి యుండవచ్చును. (సశేషము)

---

# శ్రీ జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణుల ఉపదేశములు

జ్ఞానులై ఆత్మసిద్ధి పొందినవారికి పునర్జన్మ లేదని శ్రుతులు కూడ చెప్పుట వినుచున్నాము. కాని మన పురాణేతిహాసములందు పెక్కుమంది ముక్తజీవులు మరల జన్మమును స్వీకరించుట కలదు.

'అపంతరతమస్' అను వైదికఋషిని శ్రీ మహావిష్ణువు వేదవ్యాసునిగా జన్మింపుమని ఆదేశించినట్లు కలదు. అట్లే వశిష్ఠ మహర్షి మైత్రావరుణిగా మరల జన్మించెను. ఆయన అసలు బ్రహ్మమానసపుత్రుడు. ఈ పునర్జన్మ నిమి మహారాజు శాపమువలన వచ్చెను. భృగువు మొదలగు మహర్షులు వరుణుని యాగమున మరలనూ తన శరీరములను స్వీకరించినట్లు కలదు. బ్రహ్మకు మరొక మానసపుత్రుడైన సనత్కుమారుడు రుద్రునికి చెప్పిన మాట ప్రకారము స్కందుడుగా జన్మింపవలసి వచ్చెను.

ఈ ఇతిహాసపురాణ గాథలందు మాత్రమే కాదు - వేదములలోని మంత్ర భాగములందు కూడ నిట్టి కొన్ని పునర్జన్మగాథలు కన్పించుచున్నవి. కొన్ని సందర్భములలో పూర్వశరీరము శిథిలము కాగా నూతన శరీరమును స్వీకరించుట-మరికొన్ని సందర్భములలో తమ తమ యోగశక్తులవలన ఏకకాలమున బహుశరీరములందు ప్రవేశించుట—తొలిశరీరమట్లే చైతన్యవంతముగా నుండగా-కలదు. ఈ మహర్షులందరు జ్ఞానులు కారని, ముక్తజీవులు కారని చెప్పుటకు వీలులేనేలేదు. వీరందరు మహాజ్ఞానులని శ్రుతులే చెప్పుచున్నవి. మరి యీ పునర్జన్మల రహస్య మర్మమేమిటి?

దీనికి సమాధానము బాదరాయణుని సూత్రములందున్నది. "యావదధికారం అవస్థితిః అధికారికానామ్"—(లోక సంగ్రహణము చేయవలసిన భారమున్నవారికి ఆ పని పూర్తికానంతవరకు శరీరముండును). లోకసంగ్రహణము సలుపుట వైదిక ధర్మప్రచారముద్వారా—భగవంతుడు వారి వారికి నిర్దేశించిన విధానములనుబట్టి.

తమకు నిర్దేశింపఁబడిన విధిని పూర్తి చేయుటకు ఆవశ్యకమైనప్పుడు వారు ఒక యింటినుండి మరొక యింటికి మారినట్లే ఒక శరీరమునుండి మరొక శరీరమునకు మారుదురు. పూర్వజన్మముల కర్మఫలములను శూన్యము చేసికొన్నను వారు తమ ఆవశ్యకతలనుబట్టి తమ వ్యక్తిజీవత్వమును నిలుపబెట్టికొనుచు క్రొత్తశరీరములను సృష్టించుకొందురు. ఈ మహర్షులను—కొంత పూర్వజన్మ జ్ఞాపకములున్నవారితో కలుపరాదు.

మహాభారతమునందొక బ్రహ్మజ్ఞానియైన స్త్రీ శ్రీ జనకమహారాజుతో సంవదించుటకలదు—ఆమె తను శరీరమును వదలి మహారాజు శరీరమునే ఆవేశించినది. పిమ్మట అందు సంలీనమైనది. ఇది అపరిపూర్ణ జ్ఞానమునకు ఉదాహరణము కాదు.

భగవద్గీత 4 వ అధ్యాయనమున (5-9 శ్లోకములు) పరమాత్మ అర్జునునితో చెప్పెను—"నీవు నేను అనేక జన్మలను దాటి వచ్చితిమి. నా కవియన్నియు తెలియును. నీకు తెలియదు. పుట్టుకలేనివాడనయ్యు-సర్వజీవేశ్వరుడనయ్యు-నేను నా యోగమాయా విలాసమువలన పెక్కు అవతారములలో భాసింతును—నా సహజ లక్షణములను గూఢముగా నుంతును—నా పుట్టుక-లీలలు దివ్యమైనవి. ఈ రహస్యమంతయు తెలిసికొన్నవానికి శరీరాంతమున మరల జన్మములేదు. నన్ను చేరుదురు."

లోకముయొక్క ఆవశ్యకతనుబట్టి భగవంతుడు తానే అవతరించును. లేక తన దూతలద్వారా కార్యనిర్వహణము చేయును.

జ్ఞానమువలన కర్మము నశించుట తథ్యము. ఏదో కార్యనిర్వహణమునకై శరీరముండవలసినంత మేరకు ముక్తి జాప్యమగును.

"తస్య తావదేవ చిరంయావన్న విమోక్ష్యయే—(ఛాందోగ్యోపనిషత్తు)

లోకసంరక్షణ కొరకు భగవంతుడు—(ఈశ్వరుడు)—ముక్తజీవులకు కొన్ని కొన్ని ప్రత్యేకకార్యములను—విధులను అప్పగింపగలడు—అప్పగించును.

---

# శ్రీ జగద్గురు భారతీ తీర్థస్వామి చరణుల ఉపదేశము

## (శృంగేరిలో చేసిన అనుగ్రహ భాషణము)

### (గతసంచిక తరువాయి)

శాస్త్రములందు ద్విజునకు నాలుగు ఆశ్రమములు చెప్పబడినవి—బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థసన్న్యాసములు. ఇందు మొదటిదగు బ్రహ్మచర్యాశ్రమమున గురుసన్నిధియందు వేదాభ్యాసము చేయుట తదర్థమును అవగాహనచేసికొనుట ముఖ్యము. ఆ తరువాత వారి వారి పరిస్థితులు, అభిప్రాయములుబట్టి గృహస్థాశ్రమ ప్రవేశము. శాస్త్రములందు బ్రహ్మచర్యాశ్రమమునకు చాల ప్రాముఖ్యతయున్నది. బ్రహ్మచర్యమున జ్ఞానమును ఆర్జించి ముక్తి పొందిన మహనీయులను గురించి మనము వినుచున్నాము. ఉదాహరణకు సదాశివ బ్రహ్మేంద్రుని చెప్పవచ్చును. అయన

మహాజ్ఞాని. శృంగేరి జగద్గురువులందరు అట్టివారు. బ్రహ్మచర్యమునకు చాల గణ్యత యివ్వబడినది. బ్రహ్మచర్యమునుండి సన్న్యాసస్వీకారము చాల గొప్ప. అట్లు జరుగని యెడల నైష్ఠిక బ్రహ్మచారిగా జీవించుట కూడ సహజమే. బ్రహ్మచారిగ జీవించుచు ఇంద్రియసుఖములను త్యజించి బ్రతుకుట వివేకవంతమైన జీవితము. శాశ్వత సుఖలాభ ప్రయత్నము ప్రశంసనీయమైనది.

అందరు తప్పక అవలంబింపవలసినది కర్తవ్యనిష్ఠ. ఏమి తలపెట్టినను శ్రద్ధతో జాగ్రత్తతో చేయవలెను. గురుసన్నిధియందు బ్రహ్మచారి యెట్లు ప్రవర్తింపవలెనో ఆపస్తంబ మహర్షి చాల చెప్పెను. గురువు చెప్పినదానిని శ్రద్ధతో తాత్పర్యముతో నిర్వహింపవలెను. తాత్పర్యమనగా అభినివేశమతోనని భావము. అనగా విశ్వాస రాహిత్యముండరాదని. అట్లు చేసినచో అది గుర్వనుగ్రహ హేతుభూతమగును.

మనుష్యుని ప్రకృతియందు ఆలస్యమన్న దొకటి కలదు. అది శత్రువు. దాని మూలమున గురువు చెప్పినదానిని చేయుటలో అనుకొనని జాప్యము కలుగును. గురు వేమియు చెప్పకపోయినను మన ప్రవర్తన అభీష్టసిద్ధిని కలిగింపలేదు. శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతయందు మూడువిధములైన శత్రువులను చెప్పెను.

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ ॥

అవి శత్రువులు. మనము శత్రువులకు స్థానము కల్పింపము కదా! అట్లే యీ శత్రువులకును స్థానము కల్పింపరాదు. ఇది భగవంతుని శాసనము. మనము లౌకిక జీవనులము. మనకు మనఃక్లేశమును కలిగించు సన్నివేశము లెన్నియో కలవు. అట్టి పరిస్థితిలో—యీ పరిస్థితి నాకు సుఖకారి కాదు—అని తెలిసి స్థిరముగా నుండువాడు ధీరుడు. మహాకవి కాళిదాసు 'వికారహేతౌ సతి విక్రియంతే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః' అనెను. తనముందు మనోవికారమును కలిగింపగలదున్నప్పటికి స్థిరముగా నుండువాడు ధీరుడు' తనముందులేని ఆహారవస్తువులపై మనస్సు పోకుండుట గొప్ప కాదు. తనముందు భిన్నభిన్న రుచులతో భక్ష్య భోజ్య లేహ్య పానీయాదులెన్నియో కుప్పలుగా నున్నను వాటిపై మనస్సులేనివాడు ధీరుడు. లోకమున మనమున్న పరిస్థితి యెదురుగా ఆహారవస్తువులు కుప్పలు కుప్పలుగా నున్నట్టిదే. మనస్సును లాగు వస్తువులు కోకొల్లలుగా నున్నప్పటికి మనస్సంయమనముచేసి ఇంద్రియ నిగ్రహము చేయగలిగినచో మనము చక్కని జీవితమును గడుపవచ్చును. ఇది జ్ఞాపకముంచుకొన వలెను.

ప్రతిదినము జీవితమును పరిశీలించుకొనవలెను.

ప్రత్యహం ప్రత్యవేక్షేత నరశ్చరితమాత్మనః
కిన్ను మే పశుభిస్తుల్యం కింతు సత్పురుషైరివ

తాను పశువుగా బ్రతుకుచున్నాడా—సత్పురుషునివలె బ్రతుకుచున్నాడా యని ప్రతిదినము పరిశీలన చేసికొనవలెను. సత్పురుషునివలె బ్రతుకుటకు ప్రయత్నము చేయవలెను. సత్పురుష జీవనము చేయవలెనని దృఢనిశ్చయము చేసికొని అట్లు బ్రతుకుటకు సర్వశః కృషి చేయవలెను.

గురువు ప్రసన్నుడగునట్లు ప్రవర్తించుచుండవలెనన్న విషయము గమనింప వలెను. అనగా గురువు మనస్సులోని భావము ప్రకారము సంచరింపవలెను. మా పరమేష్ఠి గురువులు 'కరణం సర్వసిద్ధీనాం—చింతానుసరణం గురోః' అనిరి. మనమే విధమైన సిద్ధిని వాంఛించినను గురువుల భావానుసారము వర్తింపవలెను. గురువుల అభిప్రాయమెట్టిదైనను సరియే—ఆ ప్రకారమే ప్రవర్తింపవలెను. 'చింతానుసరణం గురోః' అని కదా చెప్పబడినది. మరియొకటి—అహంకారగర్వము చెడ్డది. అది శత్రువు. ఇది అనేక విధములుగా తలయెత్తును. అధికవిద్వత్తు, ఐశ్వర్యము, అధికారము కారణములు కావచ్చును. అట్టి పరిస్థితులలో కూడ అహంకారగర్వము తలయెత్తకుండ చూచుకొన్నచో—అది గొప్పసాధన. అట్టి కృషి చేయవలెను.

ఆ విధముగా మనము బ్రతికినచో మనకు శ్రేయస్సు లభించి మనము కృతకృత్యులమగుదుము.

---

# సంస్కృతభాషను మనమేల ఆదరించి నేర్చుకొనవలెను? (40)

ఈ ప్రశ్నకు మన దేశంలో మేధావివర్గంలో మూర్ధన్య మనీషామణులు సమాధానాలు చెప్పారు. గత సంచికలందు కొన్నిటిని తెలుసుకున్నాము. ఇప్పుడు మరికొన్ని. (సంపాదకుడు)

## శ్రీ యం. పతంజలి శాస్త్రి

(భారత ప్రధాన న్యాయాధిపతి)

మన సంస్కృతి విలువలకు, సంప్రదాయములకు మన మతము భాండారమైనచో సంస్కృతము వాటికి యుగయుగములుగా ముఖ్యమైన అభివ్యక్తీకరణ

సాధనము. కాని విరుద్ధముగా తోచినట్లు—మనకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత సంస్కృత అధ్యయనము సన్నగిల్లుచున్నది. ఇందుకు కారణములను మనము చెప్పుకొన నక్కరలేదు. ఈ మధ్య బీహారు సంస్కృత సమితి స్నాతకోపన్యాసమునందు నేను కొన్ని కారణములను చెప్పియుంటిని.

పాఠశాలలలోను, కళాశాలలలో కళాకత్యులలోను అవశ్యపఠనీయాంశముగా సంస్కృతము నిర్ణయింపవలెనని నేను చెప్పితిని. హిందీ యితర ప్రాంతములందిది సాధ్యముగా నెంచబడలేదు—అక్కడ మూడు భాషలు (ప్రాంతీయభాష, హిందీ, ఆంగ్లము) చదువవలసిన భారమున్నది. అక్కడ హిందీ అవశ్యకాంశము కాదు. దానిబదులు సంస్కృతము చదువవచ్చును. కాని హిందీ జాతీయభాషగా అంగీకరింపబడి, హిందీ భాషాజ్ఞానము వలన ఉద్యోగావకాశము లెక్కువగా నుండుట వలన విద్యార్థులు సంస్కృతము కంటె హిందీని చదువుట కెక్కువ అభీష్టము చూపుదురు. అందుచేత సంస్కృతము పాఠ్యాంశముల నుండి బయటకు త్రోయబడుచున్నది.

ఈ ప్రాంతీయులకు హిందీ ప్రాంతీయభాష కావున—సంస్కృతము అవశ్య పాఠ్యాంశముగా అధ్యయనము చేయబడుటకు అవకాశముండియుండవలెను. హిందీ మాటాడు ప్రాంతములందైన సంస్కృతమున కా స్థితి కలిగింపబడనిచో-స్వాతంత్ర్య భారతమున సంస్కృతమునకు చెప్పుకోతగిన పునరుద్ధరణ కలుగుటకు అవకాశములు చాల తక్కువ.

దీక్షాంతభాషణ హిందూ విశ్వవిద్యాలయ
డిశంబరు 1956, వారాణసీ.

---

## చందాదారులకు విన్నపము-ప్రకాశకుని చిరునామా మార్పు గమనింపుడు

చందాలు బాకీయున్నవారికి పత్రిక పంపబడదు. చందా సొమ్మును ముందుగనే (తమ అడ్రసు మార్పుకూడ వెంటనే) క్రింది చిరునామాకు పంపవలెను.

ఆకెళ్ల సత్యనారాయణమూర్తి,
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు,
6-3-609/18, ఆనందనగర్,
ఖైరతాబాదు, హైద్రాబాదు—500 004.

# శ్రీ విద్యారణ్య విజయగాథ

10

కాశీ పట్టణాన్ని చేరి దానిని ముక్తిస్థలమని శ్రీ విద్యారణ్యులు ప్రస్తుతించిరి. గంగానదిని సకల పాపహారిణి అని స్తుతించి స్నానములు చేశారు.



# శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్య విరచిత
# అపరోక్షానుభూతి

## వ్యాఖ్యానము: శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

[గతసంచిక తరువాయి]

అవ (146 శ్లో) దేహపతనకాలమున జ్ఞాని స్థితిని గూర్చి చెప్పుచున్నారు.

శ్లో॥ రథ్యాంతరే మూత్రపురీష మధ్యే చండాల వేశ్మన్యథవాశ్మశానే
కృతప్రయత్నోఽప్యకృతప్రయత్నో దేహావసానేచ మోక్షమ్॥ 146

తా॥ మార్గమధ్యముననో, మలమూత్రములలోనో, చండాల గృహముననో, శ్మశానములనో-జ్ఞాని-పడియుండినను-ప్రయత్నము చేసినను, చేయకున్నను-దేహావసాన కాలమున మోక్షము పొందుచున్నాడు.

విశేషములు: 'చ' కారము ప్రయోగింపబడుటచే అతడు దేహమున్నప్పుడే ముక్తుడని తాత్పర్యము. జీవన్ముక్తుడు కాబట్టి దేహావసానకాలమున నెచ్చట నున్నాడన్న పరిశీలన ఆవసరముకాదు.

అవ. (147 శ్లో) జ్ఞాని యొక్క ప్రవర్తనను గూర్చి చెప్పుచున్నారు.

శ్లో॥ అతివాదాం స్తితిక్షేతనాఽవ మన్యేత కించన
నచైవ దేహ మాశ్రిత్య వైరం కుర్యాచ్చకేనచిత్॥

తా॥ జ్ఞాని—అతివాదములను—తన్ను గురించి లోకమునందితరులాడుకొను వాక్యములను పట్టించుకొనడు. ఏ వస్తువునైనను-శుభమునుగాని అశుభమునుగాని— అభిమానింపడు. సమముగా నెంచును. మరియు దేహము నాశ్రయించి దానికి బాధకమని దేనితోను—శీతోష్ణాదికముతో—వైరము చేయడు.

శ్లో॥ నకుర్యాన్నవదేత్కించి న్నధ్యాయేత్సాధ్వసాధుషు
ఆత్మారామోఽనయావృత్త్యా విచరేజ్జడ వన్మునిః॥

తా॥ మంచినిగాని చెడ్డనిగాని ఏమి ప్రాప్తించినను జ్ఞాని ఊరకుండును. ఏమియు చేయడు. ఏమియు పలుకడు. ఏమియు ఆలోచింపడు. అతడు ఆత్మా రాముడై యీ వృత్తిచేత జడవస్తువవలె చరించుచుండును.

విశేషము: జడపదార్థము—ఆలోచనాది మనోవృత్తులు లేక నిరుద్దేశముగా ఎట్లుండునో అట్లు వర్తించును. (సశేషము)

---

## వేదాంత న్యాయములు (37)

(న్యాయములవంటి ఉదాహరణలు)

[వేదాంత శాస్త్రముతో సూక్ష్మవిషయములను బోధచేయుటకు కొన్ని ఉదాహరణలు సాధారణముగా నుపయోగించెదరు. ఈ ఉదాహరణలు నిత్యజీవితమునకు సంబంధించినవిగా నుండి-వీటిమూలమున దుర్గ్రాహ్యమైన సిద్ధాంత విషయములను అవగాహన చేసికొనుటకు తోడ్పడును. ఈ ఉదాహరణలవలన-సునిశిత ప్రజ్ఞావంతముకాని సామాన్యుని మేధస్సుకూడ సిద్ధాంతమును గ్రహింపగల్గును. సామాన్యపాఠకులకొఱకు వేదాంత న్యాయముల వివరణములను క్రమముగా ప్రకటించుచున్నాము. సంపాదకుడు]

### రెండు ముళ్లు

కాలిలో ఒక ముల్లు గ్రుచ్చుకొన్నదనుకొందము. అప్పుడు మరియొక ముల్లుగాని, గుండుసూదిగాని — లేక ముల్లువలె సన్నగానున్న మరియొక చేదిగాని తీసికొని దానితో కాలియందు గ్రుచ్చుకొన్న ముల్లును బయటకు త్రోసివేయుదురు.

ఆ పని ముగిసిన తరువాత రెండు ముళ్ళను అవతల గిరవాటువేసి హాయిగా నుందుము.

అదేవిధముగా అవిద్య కారణమువలన కలిగిన దుర్గుణములను, అజ్ఞానమును మంచిగుణములతో జ్ఞానముతో వెడలగొట్టవలెను. పిమ్మట శాంతి లభించిన తరువాత ఆ మంచిగుణములను కూడ త్యజించి భేదముల కతీతముగా ప్రవర్తింపవలెను.

---

# గురువంశ కథా కథనము

(సంస్కృత మూలము : బ్రహ్మశ్రీ కాశీలక్ష్మణశాస్త్రి గురువంశ కావ్యమ్)

తెలుగు: శ్రీ చెఱుకుపల్లె జమదగ్నిశర్మ ఎం. ఏ.

(గత సంచిక తరువాయి)

## పంచదశ సర్గము

జగద్గురువులు శృంగపురిలో కొలది దినములుండి అంతలో సూర్యగ్రహణము వచ్చినందున గోకర్ణేశ్వరుని సేవించు తలంపు కలిగి బయలుదేరిరి. మార్గదర్శులగు నామహర్షులు మార్గమున సర్వజనులను పవిత్రుల నొనర్చుచు గోకర్ణక్షేత్రమును చేరి

క్షేత్రవిధుల నన్నింటిని తీర్చి తపఃపరులై శిష్యసంఘములతో ప్రకాశించిరి. (1) అది పుష్యమాసము. పుష్యసూర్యుడన్న శ్రీవారి కాసక్తి యెక్కువ. ఆ అమావాస్యకే గ్రహణము పట్టుచున్నది. తన్ను దర్శించిన వారిని పోషించుటయందు పూర్ణదీక్షగల మహాబలేశ్వరుని సాక్షాత్కరించుకొని శ్రీవారు ఆ నాడు సముద్ర తీరమున కేగి చూచిరి. (2) ఆ సముద్రు డెంతటివాడు? లోకాంబిక యగు లక్ష్మిని పుత్త్రిగా బడసి ఆమెను విష్ణువున కిల్లాలుగా నీయదగిన ధన్యుడు. ఆతని దౌహిత్రుడే లోకపితామహుడై నాడు. ఇక నా సముద్రుని తనయుడు చంద్రుడు శివునకు శిరోభూషణమైనాడు. నక్షత్రము లాతనికి కోడండ్రు. ఆతడే దేవతల కమృత మొసంగినాడు. ఇంద్రున కాతడే యుచ్చైశ్శ్రవము ఐరావతమును దానమొసంగెను. (3) ఆతని ఇల్లాలు గంగ త్రిభువనపావని. ఆమెవలన శివుడు కూడ ధన్యుడై నాడు. కామధేనువు కల్పవృక్షములు నాతని నుండియే ఆవిర్భవించి సర్వాభీష్ట ప్రదములగుచున్నవి. పరమగంభీరుడై రసికాగ్రణియయి పూర్ణకుటుంబ సౌభాగ్యవంతుడై తన యందలి ప్రేమాతిశయముచే వచ్చి పెనవేసికొను వాహినీ పత్నులయెడ నిరంతరాసక్తుడై వెలుగొందుచుండును. (4) దాతలిట్టుండ వలెనని తనకు సహజమైన ఔదార్యమును ప్రదర్శించుచు తాను కష్టపడి సంపాదించి దాచిపెట్టిన రత్నరాశి నాశ్రయించినవారికి చూఱ యిచ్చుచున్నాడు. సాంయాత్రికరూప దూతల ముఖమున సర్వాభీష్టముల నొసంగుచున్నవాడు. శ్రీరామాది మహాత్ములచే సమ్మానితుడైన వాడు. ఉత్తుంగతరంగ హస్తములతో ప్రేమపూర్వకముగ నాహ్వానించుచున్నాడు. (5) అట్టి సముద్రుని చూచి సంతోషముతో నవగాహన మొనర్చి భూరిదక్షిణలతో వస్త్ర దానములతో భూసురుల నానందపరచి సకలదేవతలను పూజించి యాత్ర సిద్ధించినదని పరితృప్తినంది తత్రత్యులగు నధికారులతో శిష్యబృందములతో సర్వులను పావన మొనర్చుచు జగద్గురువులు విరాజిల్లిరి. (6) జగద్విశ్రుతమగు నా క్షేత్రము నుండి బయలుదేరి ఘట్టము నధిరోహించి బిలిగేపురాదుల యందు భూపాలురచే సమ్మానితులగుచు నిర్మల యశస్సుచే తెల్లనైన మనోహరాందోళిక నెక్కి సర్వుల కానందము కలిగించుచు శివరాత్రినాడు మధులింగేశ్వరుని సేవింపవలయునని శ్రీ గుప్తి దుర్గమును చేరుకొనిరి. (7) జగద్గురువు లచ్చట కారుణ్యాంబు నిధియగు రేణుకాదేవిని వినమ్రులై కొలిచి సర్వోపచార పూజల నొనర్చి భక్తేష్టదాయిని యగు నా తల్లికి

---

7 వ శ్లోకము.

బిలిగే—ఒకానొక రాజు రాజధాని.

ఉత్సవము చేయించిరి. అప్పుడా కస్మికముగా వానవాసీ పురమున కుపప్లవమేర్పడిన దను వార్తరాగా శివైకనిరతులు మహాధైర్యశాలులునగు జగద్గురువు లక్కడికి బయలు దేరిరి. (8) దారిలో వారికా నగరము నుండి ఎందరో కుటుంబులు పరువులెత్తుచు కాందిశీకులై వచ్చువారు కనిపించిరి. భక్తరక్షకుడు సర్వనిధిపాలకుడునగు శివుడు తను వాడను నమ్మకమున్న గురువులు వారినెల్లరును నిలిపి ధైర్యము చెప్పి వానవాసిని చేరుకొనిరి. (9) దేశపాలకుడైన సదాశివ మహారాజుచే తత్పురీ రక్షణకు నియుక్తులైన మంత్రులు సైనికులు వచ్చి కానుకలు నొసంగి తమ్ము ప్రార్థింపగా వారి కిష్టసిద్ధి కలిగించి వరదానదికి పోయి స్నాన మొనర్చి ఆహ్నికములు నిర్వర్తించి జగద్విఖ్యాతుడగు మధులింగేశ్వరుని చూచి పరమానందముతో సాష్టాంగము లొనర్చిరి. (10) శివరాత్రినాడు భవ్యులగు జగద్గురువులు యోగ్యులు స్వచ్ఛముగా తెచ్చిన వేలకొలది పద్మములతోడను కోమలములగు బిల్వదళములతోడను స్వామి నభిషేకపూర్వకముగా సహస్రనామములతో యామ యామ మర్చించి మంగళారాత్రి కానీరాజనాదులర్పించి హృదయపూర్వకముగా స్తుతించిరి. (11) అట నుండి జయల్వోడలి మార్గమధ్యమున సర్వులచే సమ్మానితులగుచు ప్రసిద్ధమగు కేలది నగరము చేరిరి. ఆక్కడి రాజవంశమునకు సర్వాభీష్టదు లగుచున్న రామేశ్వర వీరభద్రులను పూజించి విద్యాసాగరులగు జగద్గురువులు సాగర పురమున కేగిరి. (12) శ్రీవారి పాదపద్మములను సేవించుకొనవలయునని ఇక్కేరీవరణాధిపుడు భక్తి వినయములతో ప్రార్థింప నా నగరమున కేగి అక్కడి అఘోరేశ్వరు నర్చించి అటనుండి ఆరంగనగరమున కేగి అచ్చటి కవినాథేశ్వరు నారాధించి ద్విజవర్య పూజ్యచరణులగు శ్రీచరణులు తపోరాజ్యపాలకులై విరాజిల్లిరి. (13) అటనుండి బయలుదేరి తీర్థరాజమగు తుంగభద్రా నదిని చేరి అందు శిష్యానందన హేతువులగుచు స్నాన మొనరించి సర్వమంగళప్రదయగు శృంగపురిని చేరి భవానీపతి యగు మలహానికరేశ్వరుని, యోగక్షేమద యగు శారదాంబను సమర్చించి ధన్యత భజించిరి. (14) పూర్వ జగద్గురువుల కధికులగుచున్న పీఠాధీశ్వరులు పురప్రజలచే కీర్తితులగుచు నెప్పటికప్పుడు అనేక నూత్నోత్సవములు జరిపించుచు శ్రీ శారదా నవరాత్రోత్సవ

---

8 వ శ్లోకము.

వానవాసి పురము—ఇప్పుడు బనవాసి యనుచున్నారు.

10 వ శ్లోకము.

సదాశివుడు బానవాసి సమీప ప్రదేశాధిపతి.

సమయము రాగా ఆ తొమ్మిది దినములు మహానందముతో వైభవోపేతముగా మహోత్సవములు జరిపించిరి. ఆ ఉత్సవ విశేషముల నశేషముగా వర్ణించుటకు శేషునకును వాక్కులు నిశ్శేషములగును. (15)

ఆశ్వయుజ శుద్ధ ప్రతిపత్తునాడు తుంగభద్రలో ఉషస్స్నానమొనరించి స్వీయాహ్నికములను తీర్చికొని జగద్గురువులు తమ దర్శనమునకై వేచియున్న దేశదేశాగతులను అనుగ్రహించి స్థలవాసులను పలుకరించి వేదపారాయణమునకు, సూక్తపఠనమునకు, మంత్రజపమునకు నియుక్తులైన పండితుల నీక్షించి తాళశంఖాది వాద్యఘోషములతో సానుచరులై శారదా మందిరమునకు విచ్చేసిరి. (16) ఉత్తమగ్రంథములను తెప్పించి శారదా సమక్షమున వానిని మంత్రయుక్తముగ ప్రతిష్ఠించిరి. పిమ్మట వాగ్దేవిని గంథపుష్పాదులతోడను ఆరాత్రికలతోడను సమర్చించిరి. శ్రేష్ఠమైన ఉపాయనముల నర్పించిరి. (17) వేదపారాయణకు వివిధమంత్రజపములకు వచ్చిన బ్రాహ్మణులకు వరుణలిచ్చి ప్రారంభింపజేసిరి. వారొనర్చిన వేదఘోష విన్నప్పుడు శ్రీ శారదాదేవిని చూచుటకై వచ్చిన దేవగణములు ఈ వైభవమునకంతకు కారకులైన శ్రీవారిని వాక్పతి ముఖములతో స్తుతించుచున్నారా అనిపించును. (18) నిత్యమిట్లు పూజలొనర్చుచు ప్రతిదినము సువాసినీ సముదయముకు మొదటి దినమున నొక్కొక్కటి రెండవ దినమున రెండు రెండు నిట్లు ఏకైక వృద్ధితో ఫలపుష్ప సమన్వితముగా నూత్నవస్త్రముల నిత్తురు. వందల కొలది జనులకు మృష్టాన్న సమారాధన సాగుచుండును. రాత్రులయందు దేశదేశాగత విద్వాంసుల సమావేశపరచి తాము సింహాసనాసీనులైయుండి వాగ్దేవికి వివిధోత్సవములు జరిపింతురు. (19) పాడ్యమి మొదలు దినదినము నూత్నాలంకారములతో తీర్చి శారదాదేవిని క్రమముగ హంస, వృష, మయూర, పక్షీంద్ర, హరిణ, సింహ, తురగ, మత్తేభ వాహనారూఢ నొనర్చి యూరేగింతురు. ఆ వైభవమును చూచుటకు ఉన్న రెండు కనులు చాలనే చాలవని చూపరులనుకొందురు. (20) మూలా

---

20 వ శ్లోకము.

శృంగగిరి యందలి నవరాత్ర మహోత్సవములలో శారదాదేవిని దినదినము వేరువేరు వాహనములపై అలంకరించి ఊరేగించుచుందురు.

భక్తి సుధా తరంగిణీ గ్రంథమునందు 99 వ పుటలో మొదలగుచున్న శ్రీ శారదా స్తోత్రములో శ్రీ సచ్చిదానంద శివాభినవ నృసింహ భారతీ మహాస్వామి చరణులు ఆయా వాహనములను వాని తత్త్వార్థములను చక్కగా వివరించియున్నారు.

నక్షత్రమునాడు మల్లికార్జున వధువగు భవానీదేవిని వెండిపల్లకిలో నూరేగించుచు శారదామందిరమునకు తెచ్చి సముచిత స్థానమున నుంచి శ్రీవారు పూజింతురు. అనంతరము శ్రీ శారదాదేవిని పుస్తకములకు అష్టాదశ విద్యలతో పూజింతురు. అంతమున స్తోత్రము చేయుదురు. (21) కమలాసనాసీనయై మందస్మితముతోడి వదనారవిందముతో విలసిల్లుచున్నదై, దినదినము వినూత్న వస్త్రములతో శోభిల్లుచున్నదై సువర్ణదేహముతో రత్నమయ విభూషణములతో ఎప్పటికప్పు డదృష్ట పూర్వ అన్నట్లులే తోచు ఈ శారదాదేవి నా వదనమున నివసించియుండునుగాక. (22) అమ్మా! శారదాదేవీ! నీ ముఖముతోడి సాదృశ్యమును పొందదలచి యే పద్మములు కుత్తుకబంటి నీళ్ళలో నిలిచి తపస్సు చేయుచున్నవి. చంద్రుడు దిగులుపడి కృశించి పోవుచున్నాడు. స్వాభావిక విమలత్వము నే నిలుపుకోగలిగినచో నద్దమేమయిన సదృశమగునేమో! (23) హే శారదాంబా! లావణ్యరాశి యగు నీ వదనమందలి ఆ ముద్ర యేమిటి? భర్తయగు వేధ కల్పించినదా లేక శృంగారవల్లి అంకురమా? సౌభాగ్య శోభాకరమగు వదన చంద్రబింబమున నా అంకయేమిటి? పతిని వశీకరించుకొనుటకు ధరించిన కస్తూరీ తిలకమును, కాటుక రేఖలును కాబోలు! (24) ప్రసన్నానన యగు వాగ్దేవీ! భక్తసోమము నెల్లప్పుడు దయజూచు కరుణారాశి నివసించుటకై నీ కనులు పరమవిశాలములగుచున్నవి. వానితో పగళ్ళు ముడుచుకొని యుండు నీలోత్పలములుగాని రాత్రులందు సంకోచనమునందు పంకజములుగాని, ఔపమ్యమున నెట్లు నిలువగలవు? (25) (సశేషము)

---

# శ్రీ శంకర భగవత్పాద విరచిత

# వివేకచూడామణి

## (శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామి విరచిత వ్యాఖ్యాసమేతము)

**ఆంధ్రీకరణము: డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు(వేదాంత శిరోమణి, విద్వాన్) ఎం. ఏ. (సంస్కృత, ఆంగ్ల హిందీ) పి. హెచ్‌డి.**

(గత సంచిక తరువాయి)

అవ. మనోనిగ్రహము, దానిద్వారా బుద్ధినైర్మల్యము అనునవి అభేద రూపమున పరమాత్మజ్ఞానము కలుగుటకును హేతువులు అని చెప్పుటకై, "బ్రహ్మ

సంస్థో౽మృతత్వమేతి" అను శ్రుతి యొక్క అర్థమునా శిష్యునకు బోధించు చున్నారు:—

మూ. నియమిత మనసాముంత్వం స్వమాత్మా నమాత్మ
న్యయమహమితి సాక్షాద్విద్ధి బుద్ధి ప్రసాదాత్
జని మరణ తరంగా పార సంసారసింధుం
ప్రతరభవ కృతార్థో బ్రహ్మరూపేణ సంస్థః 138

ప్ర. అ. త్వం = నీవు, ఆత్మని = ఆత్మయందు, నియమిత మనసా = ఏకాగ్రముగ చేయబడిన మనస్సుతో, బుద్ధి ప్రసాదాత్ = బుద్ధియొక్క అనాగ్రహమువలన. జని మరణ తరంగా పార సంసార సింధుం = జననము, మరణము అనెడి తరంగములగల అపారమైన సంసార సముద్రమును, ప్రతర = దాటుము. బ్రహ్మరూపేణ = బ్రహ్మరూపమున ఉన్నవాడవై. కృతార్థః = కృతార్థుడవై, భవ = అగుము.

వ్యా. అ. నీవు, ఆత్మయందు, నియమిత మనసా = పంచకోశముల నుండి మరల్పబడినదై శ్రవణ—మనన నిదిధ్యాసనములచే పరమాత్మయందే నిలుపబడిన మనస్సు అనెడి కరణముతో; "మనసైవేద మాప్తవ్యమ్" (ఇది మనస్సుచేతనే పొందదగినది) అని శ్రుతి చెప్పుచున్నది. బుద్ధిప్రసాదాత్ = అసంభావన (సరిగా గ్రహించకపోవుట, సంశయభావన, విపరీతభావన అనెడు దోషములు తొలగి పోవుటచే విశుద్ధమైన సకల దోషశూన్యమైన ఏ బుద్ధికలదో దానియొక్క అను గ్రహము వలన. దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా" (ఏకాగ్రమైన బుద్ధిచేత గ్రహింపబడును) "జ్ఞాన ప్రసాదేన విశుద్ధ సత్త్వః తతస్తు తంపశ్యతే నిష్కలంధ్యాయమానః" (జ్ఞానము యొక్క ప్రసాదముచేత విశుద్ధమైన సత్త్వము కలవాడై, ధ్యానము చేయుచున్నవాడై, పిమ్మట భేదరహితమగు ఆ ఆత్మను చూడకలుగును) అనియు శ్రుతివచనములు. స్వం = స్వస్వరూపమైన, ఆత్మానం = పరమాత్మను "స ఆత్మా తత్త్వమసి" (అదియే ఆత్మ, నీవు అదియే), "అసన్నేవ సభవతి అసద్ బ్రహ్మేతి వేదచేత్" (బ్రహ్మ అసత్తు అని గ్రహించినచో అలా గ్రహించినవాడే అసత్తు అగును) అనియు శ్రుతి వాక్యములవలన పరమాత్మయే ముఖ్యమైనది కదా. (అనగా 'ఆత్మ' అనగా ముఖ్యముగా 'పరమాత్మ' అనియే అర్థము చెప్పవలెను). అయమహమితి సాక్షాత్ విద్ధి = పరమాత్మ వేరు నేను వేరు అని ఇంతవరకును ఉన్న బుద్ధిని విడచి అభేదరూపముతో సాక్షాత్కరింప చేసికొనుము అని అర్థము. దానికి ఫలమును చెప్పుచున్నారు—"జని మరణ తరంగాపార సంసార సింధుం ప్రతర"—బ్రహ్మజ్ఞానము

కలుగునంతవరకును "పునరపి జననం పునరపి మరణమ్" (మరల పుట్టుచుండుట) అను విధమున అవిచ్ఛిన్నముగా సాగుచున్న జన్మ మరణము లనెడు తరంగములతో గూడినదియు, బ్రహ్మ యనెడు పారము (ఆవలి ఒడ్డు) తెలియకపోవుటచే అపారమైనదియు అగు ఏ సంసార సముద్రము కలదో దానిని, ప్రతర = పూర్తిగా దాటివేయుము; వెంటనే ముక్తిని పొందుము అని అర్థము. ఎల్లప్పుడును బ్రహ్మరూపమున ఉన్నవాడవై కృతార్థుడవు, అనగా ఇక చేయవలసిన పని లేనివాడవు, అగుము. ఇందులకు—జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః. నైవాస్తి కించిత్కర్తవ్యమస్తి చేన్న స తత్త్వవిత్" (జ్ఞానామృతముచే తృప్తుడై కృతకృత్యుడైన యోగికి ఇంక చేయవలసినది ఏదియు ఉండదు. ఉన్నచో అతడు తత్త్వవేత్తయే కాదు) అను వాక్యము ప్రమాణము. 138

(సశేషము)

---

# అద్వైత సిద్ధాంతము ముందు పాశ్చాత్యుల పూర్వపక్ష ఖండన

## (ఆచార్య సుందరము)

శ్రీ శంకర భగవత్పాద అద్వైత సిద్ధాంతము పైన పాశ్చాత్య విద్వాంసులు కొందరు దుర్బలమైన ప్రతిపక్షవాదములు చేసిరి. ఆ వాదముల ఖండన మీ వ్యాసము. —సంపాదకుడు.

(గత సంచిక తరువాయి)

పిమ్మట బృహదారణ్యక మూడవ అధ్యాయ రెండవ బ్రాహ్మణమును డా. ధీబా ప్రసక్తికి తెచ్చెను. ఈ రెండవ బ్రాహ్మణము వేరొక విషయమును గురించి ప్రస్తావించుచున్నదని భావించుట డా. ధీబా చేసిన తప్పు. పదియవ భాగమున ప్రశ్న లేవదీయబడినది—మృత్యువునకు మృత్యువు కలదా? అని. (గ్రహాతి గ్రహములకు—(ఇంద్రియములకు మృత్యువు). దీనికి సమాధానము యాజ్ఞవల్క్యమహర్షి అతిక్లిష్టాన్వయ భూయిష్ఠమైన సులభగ్రాహ్యము కాని విధముగా చెప్పెను.

"మృత్యువు అగ్ని—అతనిని జయించునది జలము. కావున అతడు మృత్యువునకు అతీతు డగుచున్నాడు—" అని. దీనికి శ్రీ శంకరభగవత్పాదులు వివరణము వ్రాయుచు—"పరబ్రహ్మము లోకమునకు మృత్యువైన దానిని నశింపచేయును" అనిరి. మృత్యువు అగ్నివంటిది. అగ్ని అన్నిటిని భక్షించి దగ్ధము చేయునప్పటికి

జలముచేత నశింపచేయబడును. అగ్ని జలముల సంగతి ఉదాహరణముగా తీసికొన రాబడినది.

కాబట్టి 10 భాగమున వస్తువు పరబ్రహ్మమే. కఠోపనిషత్తు I 2-9 లో వివరింపబడిన వాదమే. కాబట్టి 11 భాగమున వేరొక విషయము ప్రస్తావింపబడుచున్నదని భావించుట తప్పు.

"అయం పురుషః" అని చెప్పబడిన 13వ భాగమునకు డా. థీబా పరవశ్తైను. ఆ పదములు పరబ్రహ్మమునే సూచించుచున్నవని అంగీకరింపక తప్పదని అతడభిప్రాయపడెను. అయితే అది కేవల జ్ఞానప్రాప్తి లేనివాడు తన కర్మఫలముచేత నితర లోకమునకు పోవుట గురించినది. కాబట్టి దానిని భిన్నముగా వ్యాఖ్యానింపవలెను. ఇట్లు చేయుటలో అసందర్భమేమియు లేదు. కొంత సంబంధమున్న విషయము నేదిగాని ప్రకరణమునందు తీసికొనిరావచ్చునని మేమిదివర కేస్పష్టము చేసితిమి. అందుచేత—ఏక వాక్యత—లక్ష్యైకత్వము—చెడిపోవును. కావున నిట్టి విషయములను ప్రస్తావనకు తెచ్చుటకు అభ్యంతరము పెట్టరాదు. 8వ బ్రాహ్మణమును గురించి డా. థీబా వెలిబుచ్చిన అభిప్రాయములకు కూడ నిదే సమాధానము. అయితే అతడొక అభ్యంతరమును తెలిపెను.

సర్వమునకు అంతర్యామియై పాలించు బ్రహ్మమును—8వ బ్రాహ్మణమున చెప్పిన గుణములు విశేషములు లేని బ్రహ్మమును—యీ బ్రాహ్మణముల చివర లక్షణములు చెప్పబడినవని చూడబడనిది, అన్నిటిని చూచునది, శ్రవణము చేయబడినది—అన్నిటిని వినునది—మొదలగు లక్షణములు. ఈ అభ్యంతరమును తేలికగా త్రోసివేయవచ్చును. ఈ లక్షణముల చెప్పుటలో భిన్నత్వమున్నది. కాబట్టి ఈ లక్షణములను భిన్న భిన్నముగా అవగాహన చేసికొనవలెను. (చెప్పబడుచున్న వస్తువునకు అనుకూల్యముగా అంతర్యామిని గురించి చెప్పబడినప్పుడు చివరకు 'ఏష తే అంతర్యామి అతోఽన్యదార్తే' (ఈ ఆత్మ నీ అంతర పాలకుడు—తదన్యమైన జీవుడు.)—

అనగా అంతర్యామి జీవుడు విభిన్నమైనట్లు స్పష్టము చేయబడినది. ఎనిమిదవ బ్రాహ్మణము చివర లక్షణములను చెప్పుట పూర్తికాగా ముగింపు యీ విధముగానున్నది. 'ఏతస్మిన్ను ఖల్వక్షరే ఆకాశ ఓతశ్చప్రోతశ్చ' (ఈ అక్షరమునందు ఆకాశము ఓతప్రోతముగా నున్నది అని రెండిటికి అభిన్నత చెప్పబడినది. ఇక్కడ అంతర్యామి—అక్షరము నుండి వేరుగా నామముతో చెప్పబడినది.

మరియు 'అథ' (పిమ్మట) అను శబ్దము ప్రయోగింపబడుటవలన 7వ బ్రాహ్మణము తరువాత వేరొక విషయము చెప్పుట స్పష్టము. కావున రెండును ఒకే వస్తువును గురించి చెప్పుటలేదు. ఒక వస్తువు ఒకే దృష్టితో చూచినపుడు—కొన్ని గుణములను కలిగియుండునట్లు లేనియట్లు కూడ చెప్పుటకు వలనుపడదు.

మేమిదివరకే ఉపనిషత్తులలో పరబ్రహ్మమునకు ఈశ్వరునికి భేదమున్నదని నిరూపించితిమి. ఉదాహరహణకు మాండూక్య ఉపనిషత్తు తీసికొనవచ్చును.

తరువాత ధీబా ఛాందోగ్య ఉపనిషత్తును తీసికొని చిన్న మాటతో (శాండిల్య విద్యను గురించి) దానిని త్రోసివేసెను. ఆ చిన్నమాట—"శాండిల్య విద్య—లేక మరెవ్వరి పేరుతో నుండినను—ఆ విద్య—మానవునికి అందుబాటులో నున్న అత్యున్నత సత్యముకన్న భిన్నముగా చూచెనని చెప్పుటకు ఆధారముగా కారణము కన్పించుటలేదు." "మానవునికి అందుబాటులో ఉన్న సమున్నత విద్యతా నెరిగినదేయని శాండిల్యు డెరిగియున్నచో—మన మంతకన్న ఉన్నత సత్యమునకై అన్వేషింపకూడదని లేదు. 'తత్త్వమసి' సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్' మొదలగు మహావాక్యముల సత్యములను ఛాందోగ్య ఉపనిషత్తు బోధించుచున్నది. మనము మన భక్తి సూక్ష్మతను ఉపయోగించి యేది సమున్నత సత్యమో గ్రహింపవలెను.

మరియు శాండిల్య విద్యయందే పాఠమున "ఉపాసీత" అని కలదు. దీనిని విద్య యని—ఉపాసనగా—మనము భావించినప్పటికీ—విద్య, ఉపాసన శబ్దములను ఏకార్థములుగా సూచించు ఉపనిషత్పాఠము లున్నప్పటికీ—మరి కొన్ని ఉపనిషత్పాఠములు (వీటిని మేమిదివరకే సూచించినాము) ఉపాసనా లక్ష్యమైన బ్రహ్మమునకు—జ్ఞానలక్ష్యమైన బ్రహ్మమునకు భేదమును చెప్పునవి—కలవు.

'తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదంయదిదముపాసతే' — (ఉపాసింపబడుతున్న బ్రహ్మము కాదు నీవు కావలసిన బ్రహ్మము అని తెలియుము.)

జ్ఞానమునకు ఉపాస్యబ్రహ్మమునకు గల భేదము కాని శ్రీ శంకర సిద్ధాంతము కల్పించినదని చెప్పుటకు ఆస్కారమే లేదు.

(సశేషము)

---

Printed & Published by A. Satyanarayana Murthy,
6-3-609/18, Anand Nagar, Khairatabad, Hyderabad - 500 004.
Printed at KRANTI PRESS, MADRAS-600 001.
Editor : T. Ramalingeswara Rao

# ప్రకృతి నుండి పాఠములు

శ్రీమద్భాగవతమున (ఏకాదశ స్కంధము) శ్రీకృష్ణుడు ఉద్ధవునికి చేసిన బోధయందొక పూర్వ సన్నివేశమును చెప్పెను. యాదవకుల మూలపురుషుడైన యదువునకు ఒక అవధూతకు మధ్య నడచిన సంవాదమది. అవధూత తాను ప్రకృతి నుండి చాల పాఠములను తెలిసికొంటినని చెప్పెను. ప్రకృతిలో పాఠములు చెప్పిన గురువులు భూమి, వాయువు, ఆకాశము, జలము, అగ్ని, చంద్రుడు, సూర్యుడు, పావురము, కొండచిలువ, సముద్రము, పతంగము, మధుకరము, గజము, మధుహారి లేడి, చేప, పింగళ, వేశ్య, కురరము, అర్భకుడు, కుమారి, శరకారుడు, సర్పము, సాలెపురుగు, పేశకారి. కీటక మన నిరువది నలువురు. ఆ పాఠములు—

భూమినుండి: భూమినుండి నేర్చుకున్నది 'తితీక్ష'—ఓర్పు. ఎంత కష్టము వచ్చినను భరించి ఊరకుండుట—తన విధ్యుక్త ధర్మమును—(ఎట్టి ఉపద్రవము వచ్చినను) విస్మరింపకుండుట. భూమి తన తన గమనమును యే కొంచెము ఆపినను—ప్రళయమే కదా. భూమి పర్వతవృక్షముల రూపమున కొన్ని పాఠములు నేర్పినది.

పర్వతమునుండి: ఇతరుల తన్ను గుర్తింపకపోయినను పర్వతము వారందరి మేలు కొరకే ఉన్నది. అనగా ధర్మయుక్తము గనించియున్నది. ఈ ధర్మయుక్త జీవిత లక్షణమును పర్వతమునుండి నేర్చుకొనెనట.

వృక్షము: ఇతరులకు అన్నివేళల—అన్ని పరిస్థితులలోను ఉపకారము—పరోపకారము—చేయుట—వృక్షమునుండి నేర్చుకొనెనట.

గాలి: గాలి మనకు ప్రాణ (ఉచ్ఛ్వాస నిశ్వాస) రూపముగా జీవింప నాధార మగుచున్నది. ఇంద్రియములు పని చేయుటకు—విషయ భోగాను భావమునకు తోడ్పడుచున్నది. అయితే గాలి—తాను—మాత్రము యే భోగమును అనుభవింపదు. తన పని అయినప్పుడు శరీరమును వదలిపెట్టి పోవుచున్నది. దానికి కర్మబంధము లేదు. మారుతముగా అది సువాసనలను వహించును. దుర్వాసనలను భరించును. అయితే వాసనలు గాలిని మాత్రము చేయునదేమియు లేదు. అది వాహనము మాత్రమే. ఇది ధృతి. నిర్లేపత్వము వాయువువలన నేర్చుకొన్న పాఠము.

ఆకాశము: ఇది సర్వ వ్యాపి. దీనిని యేదియు మూసిపెట్టలేదు. ఇట్లే బ్రహ్మము. గీత 9-4, 6; ఈశావాస్య - 1) ఇది పరమ వైరాగ్యమున కుదాహరణము.

ఆకాశమున సంచరించు మేఘమునతో ఆకాశమున కేమి సంబంధమును లేదు. ఇట్లే ఆత్మకు దేహముతో బంధము లేదు, ఇది ఆకాశము నేర్పిన పాఠము.

నీరు: అన్నిటిని కడిగి శుభ్రము చేసి—ఉపశమనము కూర్చును. వివేకవంతు డిట్లే పరిశుద్ధుడుగా—దయాళువుగా నుండవలెను. తన్ను స్పృశించినవారికి—విన్న వారికి చూచినవారికి—సంతోషము కలిగింపవలెను. స్వచ్ఛత ప్రకృతి స్నిగ్ధత్వ మధురత్వతీర్థ భూతత్వములు తాదృశముగా దర్శన స్పర్శన కీర్తనములవలన పావనత్వము కలిగింపవలెను.

అగ్ని: అన్నిటిని దగ్ధము చేయును. మహాత్ము డట్లే—యే ఆహారము లభించిన దానిని కరతలములతో లేక సరాసరి నోటితోనే—స్వీకరించి తినివేయును. మంట మండునప్పుడు అగ్ని—దాని యందుంచబడిన కొయ్యరూపముగ నుండును. అట్లే ఆత్మ దేహమువలె నుండును. కాని కాదు. దేహము నిత్యప్రళయమునకు లోనగునది. ఆత్మ బ్రహ్మవలె నామరూప రహితము—నిత్యము. దీపమున నూనె వత్తి క్షణక్షణము నకు తగ్గిపోవుచున్నను—అగ్ని అట్లే ఏకాకృతిగా వెలుగును. అజో నిత్యః శాశ్వతోఽయంపురాణో—న హన్యతే—హన్యమానే శరీరే—కాతము.)

విద్యాగ్రహణమువలన, అనుభవమువలన, చింతనవలన మానవుడు ప్రగతి సాధింపవచ్చును. వైరాగ్యమును అగ్ని నేర్పిన పాఠము.

చంద్రుడు: కాలమువలన చంద్రునికి వృద్ధిక్షయములు, గ్రహణములు కలుగు చున్నవి. నిజమున కతనికి మార్పులు లేవు. ఇట్లే శరీరము పరిణమించుటవలన ఆత్మకు మార్పులు లేవు.

సూర్యుడు: మనస్సును నిమిత్తము చేసికొన్నవాడు—బంధము లేకుండా ఇంద్రియ విషయములను అనుభవించును. ఉచిత సమయమున త్యజించును—సూర్యుడు తన కిరణములతో నీటిని ఆవిరిగా పీల్చి మరల విసర్జించునట్లే. ఆత్మ భేదము ఉపాధి కృతమే గాని పారమార్థికము కాదని పాఠము.

పావురము: దుఃఖము లేకుండ చేసికొనదలచినవారు సంసారాదులతో బంధము పెట్టుకొనరాదు. ఆడుపావురము వలలో చిక్కుకొన్నది—తన పిల్లలను వేట గాడు పట్టుకొన్నాడని బాధతో—మగపావురము తన భార్యపిల్లలు గతించినారని ఆత్మహత్య చేసికొన్నది. ప్రేమబంధములతో విష్ణుమాయ బంధించుచున్నది. బయట పడుటకు ఈశ్వరానుగ్రహమే కావలెను. (గీత 13-9) అతి స్నేహము అతి ప్రసంగము నెవ్వరితో చేయతగదని పాఠము.

కొండచిలువ: అది ఆహారము కొరకు వెతకకొనదు. ఆహారమే తన నోటి వద్దకు వచ్చునని వేచియుండును. అవసరమైన ఉపవాసమే ఉండును. యోగి ఇట్లుండ

వలెను. దీనిని అజగరవ్రతమందురు(గీత 4-22).యదృచ్ఛాలబ్ధమును తిని నిరుద్యముడై యుండవలెను. యదృచ్ఛాన్నము లభింపకుండిన నిరాహారుడై యోజస్యహోబలవంతం డైన శరీరమును కర్మలపాలుపక నుండవలెను.

సముద్రము: అనేక నదులు వరదనీటిని తెచ్చి కలిపినప్పుడుగాని—సూర్యుడు నీటిని ఆవిరిగా హరించినప్పుడుగాని—సముద్రము తన నీటినెతిని ఒకేపదతిగా నిలుపు కొనును. (గీత 2-70) విధి యెట్టి కష్టసుఖముల నిచ్చినను మనస్థిమితము కలవాడిట్లే యుండవలెను. ప్రసన్నగంభీరుడై దుర్విగాహ్యుడై అనతిక్రమణీయుడై అనంత సారుడై అక్షోభ్యుడై వర్తింపవలెను.

పతంగము—మిడుత పురుగు: నిప్పును ఆహారమనుకొని యీ పురుగు నిప్పుపైబడి నశించును. తెలివికలవాడు కామినీకనకముల మోహములో పడకూడదు. అనాసక్తి (పతంగము).

తేనెటీగ: తేనెటీగ అనేక పువ్వుల నుండి తేనెను పూర్తిగా పీల్చి తెచ్చును. యోగి అట్లు చేయరాదు. గృహస్థులకు ఏ విధమైన అసౌకర్యము కలిగింపకుండ స్వల్ప మైప ఆహారమును వారినుండి స్వీకరింపవలెను. తేనెటీగవలె ఆహారమును దాచిపెట్ట రాదు. దాచిపెట్టిన తేనె—తేనెపట్టు—చివరకు తేనెటీగలకే ప్రమాదము తెచ్చి పెట్టును. తేనెటీగ సారమును గ్రహించినట్లే—మనమును శాస్త్రసారమును గ్రహింప వలెను.

మాతంగము (మగఏనుగు) ఆడఏనుగు పైనున్న మోహముకొలది మగఏనుగు మానవుల చేతిలో చిక్కుకొనుచున్నది. దీని గుణపాఠము నష్టము. యోగి ఇంద్రియ లౌల్యమునకు వశుడుకాక దూరముగా నుండవలెను.

కురంగము (లౌల్యసంగీతము) ఇంద్రియ లౌల్యమును ఉద్రేకపరచు సంగీతము నుండి దూరముగా నుండవలెను. కురంగాదులట్లే సంగీతప్రీతివలన పట్టుబడుచున్నవి.

చేప: జిహ్వాచాపల్యము వలన చేప ఎఱకు లోబడి పట్టుబడును. ఆ విధముగా జిహ్వాచాపల్యమునకు లోబడరాదు. అభిలాష పోగొట్టుకొనకుండ ఉపవాసమున్న నేమిలాభము? (గీత 3-6)

వేశ్య: పింగళయన్న వేశ్య కోకనాడు అర్ధరాత్రి దాటినా బేరము రాలేదు. అప్పుడామెకు పూర్వజన్మ సంస్కారము వలన విరక్తి కలిగినది. అచ్యుతుని పొందు మాత్రమే ఆశింతుననుకొన్నది. అట్లు శాంతి పొందినది. మానవుడట్లే అచ్యుతుని ఆశ్రయమునకై యత్నించవలెను. ఆశ అతి దుఃఖము. నిరాశత్వమతిసుఖము.

(కురరము)-చిన్న మాంసపుముక్కను ముక్కుతో పట్టుకొని పోవుచున్న చిన్న పక్షిని పెద్దపక్షులు తరుమును. అది మాంసపుముక్కను వదిలివేయగా దానికి శాంతి లభించును. శాంతిగా నుండదలచిన సాధువు తన అవసరమును మించి దేనిని నిలువ చేసికొనరాదు. ఇట్లులేని (అగేహ) విరాగికి మానావమానములు లేవు. ఎట్టి బాధలు లేవు.

బాలుడు. ఏమియు తెలియని పసిబిడ్డకు ఆనందస్థితి. అదేవిధముగా త్రిగుణాతీతుడైనవానికి. ముగ్ధజడుడైన బాలుడు, పరమాత్మ నెరింగినవాడు - వీరిద్దరే నిశ్చింతులు. పరమానందపరిపూర్ణులు.

నదికి అవతలనున్న గురువును దర్శించుటకు పోవువాడు తన పెద్దమూటను వదలిపెట్టినప్పుడే నదిని దాటగలుగుట తెలుపు గాథ—మనము మన ఆధ్యాత్మిక పురోగతికి అడ్డంకులుగా నున్న బంధములను పరిత్యజింపవలయునన్నది మనకు గుణపాఠము.

కుమారి: చాలమంది కలసి వసించునప్పుడు గలాటా-ఇద్దరున్నను అనవసరమైన ప్రసంగము. కన్యచేతికి ఒకేకంకణ మున్నప్పుడు కంకణ క్వణక్వణ ధ్వని లేనట్లు ఏకాంతముగా నున్నప్పుడు శాంతి.

బాణమువదలువాడు సర్వమును విస్మరించి లక్ష్యమును గురిచూచి బాణమును వదలునట్లే సాధకుడు ఏకాగ్రత సాధింపవలెను.

చీమలు పెట్టిన పుట్టలో పాములు హాయిగా వసించును. నశ్వరమైన తన దేహమునకై ఒక నివాసస్థలమునకై యోగి యోచింపకూడదు. లోకములు బ్రహ్మము నుండి ఉద్భవించి మరల బ్రహ్మమునందే లయమగును. సాలెపురుగు తన గర్భమునుండి వచ్చిన దారములతో గూళ్ళు అల్లి మరల ఆ దారములను లోపలకు లాగికొనును. (ముండకోపనిషత్తు. యతోర్ణనాభి)

మోక్షమునకై ప్రయత్నించుటకు తగిన వివేకము మానవునకున్నది. రాగద్వేష రహితమైన వైరాగ్యము—అహంకార విసర్జములతో సాధువు సంచరింపవచ్చును. (గీత 6-43, 45)

ఏవం సంజాత వైరాగ్యో విజ్ఞాలోక ఆత్మని
విచారామి మహీం ఏతాం ముక్తసంగో అనహంకృతిః

---

# పాఠకులతో గోష్ఠి

(పాఠకులు పంపిన ప్రశ్నలకు సంపాదకుడు సమాధానా లీ పుటలో ఉన్నవి. పాఠకులు పంపే ప్రశ్నలతో తమ చందా నెంబరు తెలుపవలెను. వచ్చిన ప్రశ్నలకు వీలువెంట సమాధానములు వ్రాయబడును. —సంపాదకుడు)

ప్రశ్న: నేను రెండు మంత్రాలను ఉపదేశం పొంది జపం చేసుకుంటున్నాను. ఒకప్పుడు ఒక మంత్రం - ధ్యానమూర్తి బదులు మరొక మంత్రం - ధ్యానమూర్తి మనస్సులో నిలుస్తున్నది. ఇది విప్రతిపత్తికి నిదర్శనమా? నేనేమి చేయాలి?

(ఎ. బి. ఆర్. హైదరాబాదు)

సమాధానం: దీనివలన ఆందోళన పడవలసినదేమీ లేదు. మనస్సు చంచలమైనది కదా! జపం మొదలుపెట్టగానే ధ్యానమూర్తిపైన లక్ష్యము కుదరదు. కొంత సేపటికి లక్ష్యం కుదరవచ్చు. మళ్ళీ యింకో మంత్రమూర్తిపై మరలుతున్నదన్నమాట. విస్తృత ప్రపంచంలో అనాంఛనీయమైన వస్తువులపైన సంచరించకుండా మరొక మంత్రమూర్తిపై ప్రసరించడం కొంత మేలేకదా! ప్రయత్నించి మళ్ళీ జపం చేస్తున్న మంత్రము యొక్క మూర్తిపైకి మనస్సును మళ్ళించాలి. అంతంకంటే మారేమి చేయనక్కరలేదు.

అసలు అన్ని మంత్రములకూ ధ్యానమూర్తిగా స్వగురువునే మనస్సునందుంచుకొనడం తేలికమని. అప్పుడు గురుమూర్తిపై మనస్సు అన్ని మంత్రములు జపించినప్పుడూ నిలుపుకోవచ్చు. ఏ మంత్రానికి ఆ మంత్రమూర్తి ప్రత్యేకంగా వుండగా గురుమూర్తిపై మనస్సును ఏకాగ్రతగా నిలుపుట సమంజసం కాదేమోనని శంకింపనక్కరలేదు. ఎందుచేతనంటే గురుబ్రహ్మయని, విష్ణువని, మహేశ్వరుడని, పరబ్రహ్మయని మనకు పెద్దలు చెప్పిన ప్రమాణవచనమున్నది. ఉపనిషత్తు కూడా "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ" అని చెప్పినది. అనగా తల్లిని, తండ్రిని, గురువును దేవతలవలె ఆరాధింపుమని శాసనము. కాబట్టి గురువును-మంత్రోపదేశముతో మహోపకారము చేసినవానిని — దేవతామూర్తిగా భావించుట సమంజసమే. తప్పులేదు. అట్లు చేయుటవలన మానసిక ఏకాగ్రత సాధించుట తేలిక కావచ్చును కూడ.

---

# హనుమత్స్మరణమ్

వాయుపుత్రుడైన హనుమంతుడు రామాయణ మహామాలా రత్నము. రామాయణ మహామాలా మంత్రమునకు హనుమ రత్నము-ముఖ్యశక్తియన్న మాట. ఆయన జానకీ దుఃఖమును పోగొట్టినవాడు. బుద్ధిమతాంవరిష్ఠుడు. శ్రీరాముని కీర్తి స్తంభమాయన.

శ్రీరామ షడక్షరీ మంత్ర జపఫలమును గురించి రామతాపినీ ఉపనిషత్తు వివరించుచున్నది. 'శ్రీరామ శరణంమమ' అను అష్టాక్షరీమంత్ర మహిమను గురించి రామ రహస్యోప నిషత్తు వెల్లడించుచున్నది. మోక్షలాభమునకు మాత్రమే రామ నామ జపము చేయవలెనని ఐహికలాభములైన ఐశ్వర్యాదుల నిచ్చుటకు - తన్ను - రామదాసుని-స్మరించిన చాలునని హనుమంతుడు చెప్పెను. హనుమంతుని స్మరించి నందువలన అన్ని అవరోధములు తొలగును.

"బుద్ధిర్బలం యశోధైర్యమ్ నిర్భయత్వమ్ అరోగతా
అజాడ్యం వాక్పటుత్వం చ హనూమత్ స్మరణాత్ భవేత్"

అశోకవనము సాధారణముగా రాజాంతఃపుర సమీపమున నుండు ఉద్యానవనము. శ్రీరామచంద్రుని పట్టాభిషేక సమయమున శ్రీరాముడు తన ప్రాసాదమును (అశోకవనముతో కలసియున్న దానిని) సుగ్రీవుడు అతని భార్యలకు వసతిగా నీయ ఆజ్ఞాపించెను. (యచ్చ మద్భవనం శ్రేష్ఠం సాశోకవనానికం మహత్—సుగ్రీవాయ నివేదయ.)

తొలుత హనుమంతుడు శ్రీరాముని దర్శించినపుడు హనుమంతుని ఘనతను గ్రహించినప్పటికీ—అతనితో తాను మాట్లాడలేదు. లక్ష్మణునిచేత మాట్లాడించెను. కిష్కింధకు రమ్మన్న ఆహ్వానమును మన్నింపకపోయినప్పుడు తాను మాట్లాడెను. రామసుగ్రీవుల మైత్రిని అగ్నిసాక్షిగా జరిపించినది హనుమంతుడు.

సీతాదేవికి హనుమంతునికి అశోకవనమున జరిగిన సంభాషణలో హనుమంతుని బుద్ధిమతాం వరిష్ఠత్వము బయలుపడినది. సీతాదేవిని తొలుత చూచినప్పుడు హనుమంతునికి కలిగిన భావము అతనికి తగినట్లున్నది. ఒకరాత్రి అశోకవనమున విశ్రాంతి తీసికొమ్మని సీతాదేవి హనుమంతునితో చెప్పినది. అట్లు చేసినచో తనకు కొంత దుఃఖోపశమనము కలుగునన్నది. హనుమంతుడు రామునితో కలిసి తిరిగి రాగలడని ఆమె విశ్వసించితినని చెప్పినది. చివరకు వైదికాశీస్సులతో (శివశ్చ-తే-అధ్వాస్తు) వీడ్కొల్పినది.

హనుమంతుడు సీతాదేవితో వానరుల ప్రతాపమును వర్ణించుటలో కొంత అతిశయోక్తి కలదు. ఆమెకు నమ్మకము కలిగించుట కది ఆవశ్యకము. వానరులు భూమిచుట్టు తిరుగగలరని-ఆకాశమునందెగుర కలరని చెప్పిన మాటలు నేటి అంతరిక్ష గమనమును స్ఫురించుచున్నవి.

రావణుని చూచి అతని వైభవమును మెచ్చుకొనుట-పిమ్మట తన తప్పిదము వలన స్వామికార్యము చెడిపోవునేమో యన్న భీతి - రామదాస యోగ్యముగా నున్నవి. రావణునితో అతడు పలికిన పలుకులు అద్భుతములు.

తనకు హనుమంతుడు చేసిన ఉపకారమునకు ఇంతకంటె మరేమియు చేయజాలనని శ్రీరాముడు అతనిని ఆలింగనము చేసికొన్న ఘట్టము హృదయమును చలించ చేయునట్టిది.

యత్రయత్ర రఘునాథ కీర్తనమ్
తత్రతత్ర కృతమస్తకాంజలిమ్
బాష్పవారి పరిపూర్ణ లోచనమ్
మారుతిం నమత రాక్షసాంతకమ్

---

## గ్రంథావలోకనము

(1) శ్రీ భాస్కర స్తవము: రచయిత — శ్రీ అరిపిరాల వేంకటసోమాచార్యులు (రిటైర్డు ఇంజనీరు, బాపూజినగరు, కొవ్వూరు, ప. గోదావరిజిల్లా పిన్ 534 350) వెల రు. 4/-

దీనియందు మాతాపితృ స్తోత్ర కదంబము (తెలుగు పద్యములు) ఆదిత్య హృదయ ధ్యానము, శ్రీ భాస్కర స్తవము (108 పద్య) కలవు. తెలుగు పద్యములు ధారా శుద్ధి కలిగి భాషాపాటవముతో నున్నవి. రచయిత కూర్చిన మున్నుడి ఆదిత్య తత్త్వసారభూతముగా నున్నది. భావుకులకు ప్రీతికూర్చు రచన. (భాస్కరానంద)

(2) శ్రీ శారదా ధన్వంతరి హాస్పిటల్-ద్వితీయ వార్షికోత్సవ సంచిక. (1981) శృంగేరిలో శ్రీ జగద్గురు అభినవ విద్యాతీర్థ మహాస్వామి పీఠారోహణ రజతోత్సవ సంస్మరణ వైద్య సంస్థాపన-సమితివారు నడుపుచున్న శ్రీ శారదా ధన్వంతరి వైద్యశాల ద్వితీయ వార్షికోత్సవ సందర్భముగా వెలువరింపబడిన సంచిక. శ్రీ జగద్గురువుల అనుగ్రహముతో దినదినాభివృద్ధి పొందుచున్న యీ వైద్యశాల

రెండవ సంవత్సరమున సాధించిన ఘనవిజయములన్నియు దీనియందు నివేదింపబడినవి. సంచిక సుందరముగా రూపుకట్టి ఆకర్షణీయముగా నున్నది.

3. శుభోదయము (పద్యకావ్యము) వెల రు 2/—

4. యాత్ర (పద్యకావ్యము) వెల రు 3/—

పై రెండు కావ్యములకు కర్త: శ్రీ భైరవసు త్రివిక్రమరావు,

7, యన్. జి. గ్రామణి మొదటి వీధి.

తిరువత్తూరు, మద్రాసు—600019.

ఈ రెండు పద్యకావ్యములును, ధారాశుద్ధి కలిగి—తనదియేయైన యొక ప్రత్యేక శైలి కలిగి—ఓజో గుణ ప్రధానములై మాధుర్యస్పందియగు రచనలు. ఈ కవికి త్రిలింగములు, తెనుగు, మొదలగు విషయములందు తనవియైన స్వతంత్ర అభిప్రాయములు కలవు. తన భావములను సూటిగా—మనోజ్ఞముగా చెప్పు నేర్పు కలదు. స్వదేశ భాషాభిమానము వీయనకు ఉచ్ఛ్వాస నిశ్వాసముల వంటివి. ఇట్టి సలక్షణములు కలిగిన కవి లేఖిని మహాకావ్యరచనకు ఉపక్రమించినప్పుడు భావుకులకు పండుగ. సాహిత్య ప్రియులు ఆదరింపవలసిన పద్యకావ్యములు. (తు. రా.)

5. మహా గణపతికల్పః (దీక్షా మందార సంవలితః); సంకలన కర్తా—

శ్రీ పోతుకూచి శ్రీరామమూర్తి:

ప్రకాశకులు : సాధన గ్రంథమండలి,

తెనాలి.

వెల రు 12/—

నిర్గుణ నిరాకార సచ్చిదానందాత్మక శుద్ధ బ్రహ్మతత్త్వమైన గణేశ తత్త్వము సంవిన్మయము. సగుణోపాసను బహిరంగోపాయము. నిర్గుణోపాసనము అంతరంగోపాయము. బహిరంగోపాయ నిష్ణాతుడే అంతరంగోపాయమున కధికారి. నిర్గుణ బ్రహ్మమే సాధకజనసముద్ధరణైక అనుగ్రహ దృష్టితో వక్రతుండ, చింతామణి గణపతి ఇత్యాది బహ్వవతారములు. ఈ యన్నిటి మంత్ర మూర్తుల, అర్చనా విధానముల తాత్త్వికవైభవముల సంకలన మీ గ్రంథము. ప్రామాణికముగా నున్నది.

శ్రీ విద్యాదీక్షా ప్రయోగము—(ఆగమ సిద్ధమైనది) దీనితో జతపరుపబడినది. ఆస్తిక జనులాదరింపవలసిన ప్రమాణ సంకలనము—(సర్వతంత్ర స్వతంత్ర)

# మనమత మెట్టిది?

శ్రుతి (వేదము) స్మృతులు, మన ధర్మమునకు ఆధారములు. పురాణములు ఇతిహాసములైన రామాయణ మహాభారతములు—మన ధర్మమునకు వివరణ వ్యాఖ్యానములవంటివి.

వేదమునందు విధింపబడిన విధులను వివరించుట—వేదమునందు నిషేధింపబడిన కార్యములను గురించి తెలుపుట—ఉపనిషత్తులందు చెప్పబడిన ధార్మిక విషయములును—పరబ్రహ్మ తత్త్వమును గురించిన విషయములును—పురాణేతిహాసములందు వ్యాఖ్యాన రూపముగా చెప్పబడినవి. భిన్న భిన్న రుచులు గలవారికి—భిన్న భిన్న యోగ్యతలు, అధికారము కలవారికి—పురాణేతిహాసములలోని వ్యాఖ్యానములు చక్కగా అవగాహన కాగలవు.

లోకానుగ్రహ బుద్ధితో ఆచార్య పురుషులు ఉపనిషత్సమ్మితమైన మన ధర్మమును వ్యాఖ్యానించిరి. అయితే నిత్యవర్తనమునకు సంబంధించినంతవరకు, నీతి ప్రబోధమునకు సంబంధించినంతవరకు ఆచార్య పురుషులందరిది-ఒకే అభిప్రాయము; ఏక వాక్యత.

పరబ్రహ్మ తత్త్వమును గురించి మాత్రమే ఆచార్య పురుషులకు అభిప్రాయ భేదము. ఆ అభిప్రాయ భేదము కూడ కేవలత్వమును గురించి. సామాన్య సాధకుల కది పట్టింపునకు రావలసినది కాదు. ముఖ్యమైన విషయమేమనగా—ఆచార్య పురుషుల అభిప్రాయ భేదములతో సామాన్యులకు అవసరములేదు. ఎవరి సాధన వారు చేసికొనుచుండవలెను.

---

## వ్యాసములు-ఎక్స్ఛేంజి కాపీలు, రివ్యూకి గ్రంథములు

మా పత్రికకు పంపదలచిన వ్యాసములను ఎక్స్ఛేంజి కాపీలను రివ్యూకి గ్రంథములను (2 కాపీలు) యీ క్రింద చూపిన మా మద్రాసు కార్యాలయము అడ్రసునకే పంపవలెను.

శ్రీ రామలింగేశ్వరరావు,
శ్రీ శంకరకృప సంపాదకుడు,
నెం. 63 కోడంబాకం హైరోడ్డు, త్యాగరాయనగరు, మద్రాసు-600 017.

శ్రీ గురుభ్యోనమః

నారాయణ సమారంభాం శంకరాచార్య మధ్యమాం
అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరామ్॥

శ్రీ శృంగేరి జగద్గురు శంకరాచార్య చరణార
విందములకు ప్రణామములు



శ్రీ గురుభ్యోనమః

నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికం
శివశాసన తశ్శివశాసన తశ్శివశాసన తశ్శివశాసనతః

శ్రీ శృంగేరి జగద్గురు శంకరాచార్య పాదారవిందములకు
ప్రణామములు



శ్రీ గురుభ్యోనమః

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః

శ్రీ శృంగేరి జగద్గురు శంకరాచార్యుల చరణ కమలములకు
ప్రణామములు



పి. వేంకటేశ్వర్లు
వేంకటేశ్వర కోల్ ట్రేడర్సు
1-1-187/2, చిక్కడపల్లి
హైదరాబాదు-500 020

# శృంగేరీ వార్తలు

శ్రీ శంకర భగవత్పాద జయంతి ఉత్సవము వైశాఖ శు పాడ్యమి నుండి పంచమి శుక్రవారము (8-5-81) వరకు శృంగేరిలో వైభవముగా జరిగినది. శ్రీ భగవత్పాదుల దేవస్థానమున ఉపనిషద్భాష్య వేదపారాయణలు, శ్రీ భగవత్పాదులకు నిత్యశతరుద్ర వారాభిషేకములు జరిగెను. శంకరవిజయ పారాయణ జరిగెను. జయంతినాడు శ్రీ జగద్గురువులు శంకర భగవత్పాదులకు కనకాభిషేకము చేసిరి.

సాయంకాలము ప్రవచన మంగళ సభలు జరిగినవి. విద్వాంసులు దేశీయ భాషలలో ప్రసంగములు చేసిరి. శ్రీ జగద్గురువులు అనుగ్రహభాషణలు చేసిరి. విద్వాంసులు సమ్మానింపబడిరి. అక్షయ తృతీయనాడు శంకరజయంతినాడు అధిక సంఖ్యలో ఉపనయనములు జరిగినవి.

శ్రీ శృంగేరీశాఖా మఠము లన్నింట (హైదరాబాదు, విజయవాడ శ్రీశైలము మొ) శ్రీ శంకరజయంతి ఉత్సవములు జరిగినవి.

విజయవాడ మఠమున నిత్యాభిషేక ప్రత్యేకార్చన, శంకరవిజయ పారాయణాదులను శ్రీ గంగా పార్వతీ సమేత చంద్రమౌళీశ్వరస్వామి కల్యాణమును (శ్రీ గిరిరాజు భద్రయ్యగారిచే) పంచమినాడు సంతర్పణయు జరిగినవి. మఠ గౌరవ కార్యనిర్వాహణోద్యోగి శ్రీ విశ్వనాథ సోమశంకరశాస్త్రిగారు, ఉద్యోగి శ్రీ తాడిగడప శేషగిరిరావు ఉత్సవ నిర్వహణ భారమును చక్కగా వహించిరి.

## కర్ణాటక ముఖ్యమంత్రి రాక:

శ్రీ శృంగేరిలో నున్న శారదా ధన్వంతరి వైద్యశాలలో మెటర్నిటీ విభాగ కట్టడమునకు కర్ణాటక ముఖ్యమంత్రి శ్రీ గుండురావు శంకుస్థాపన చేసిరి. పంచాయతీ రాజమంత్రి అధ్యక్షత వహించెను.

## తిరుపతి సత్ర ప్రారంభం:

తిరుమల తిరుపతి దేవస్థానమువారు యాత్రికుల సౌకర్యమునకై శృంగేరిలో నిర్మించిన ధర్మసత్రము (16 గదులు) నకు మే నెల 6వ తేదీ బుధవారము ప్రారంభోత్సవము జరిగినది. శ్రీ జగద్గురువులు ప్రారంభించిరి. తిరుమల తిరుపతి దేవస్థాన కార్య నిర్వహణాధికారి శ్రీ ప్రసాదుగారు స్వాగతభాషణము చేసి సముచితోపన్యాసము కావించిరి. కర్ణాటక దేవాదాయశాఖాధికారి అధ్యక్షత వహించెను. మొదటి అంతస్తులో మరియొక 16 గదులు నిర్మాణములో నున్నవి.

శృంగేరి పట్టణమునకు సమీపమున మఠ అగ్రహారమైన శ్రీ నృసింహపురమున పూర్వమునుండి శ్రీ వేంకటేశ్వర దేవస్థానమున్నది. దానిని జీర్ణోద్ధరణ కావించి శ్రీ మహాసన్నిధానమువారు 15-5-81 (శుక్రవారము) కుంభాభిషేకము కావించిరి.

# శ్రీ శంకర కృప


దక్షిణామ్నాయ
శ్రీశృంగేరి శారదాపీఠమువారి యాజమాన్యమున వెలువడు
ఆధ్యాత్మిక మాసపత్రిక

సంపుటం 20 | వెల రు. 1 జూలై, 1931 | సంచిక 11
సంవత్సర చందా రు. 10/-

దుర్మతి జ్యేష్ఠ ఆషాఢము (శకాబ్ది ౧౯౦౩)






శృంగేరిలో శ్రీ శారదా ధన్వంతరి వైద్యశాల ద్వితీయ వార్షికోత్సవమున శ్రీ జగద్గురు మహాసన్నిధానమువారు వార్షిక నివేదిక సంచికను ఆవిష్కరించుట (ఏప్రెలు 198 ) శ్రీ జగద్గురు సన్నిధానము వారు కర్ణాటక ముఖ్యమంత్రి శ్రీ గుండురావు చిత్రమునందున్నారు.

# శ్రీ శంకర కృప

సంపాదకులు: తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

సంపుటి 21 } శంకరశ్శంకర స్సాక్షాత్ వ్యాసో నారాయణో హరిః { సంచిక 11


# శ్రీ శంకర భగవత్పాదాచార్య విరచిత

## శ్రీమత్త్రిపురసుందరీ వేదపాద స్తోత్రము

శ్లో॥ త్వద్భక్తానామంబ శాంతైషణానాం
బ్రహ్మిష్ఠానాం దృష్టిపాతేన పూతః
పాపీ యాన స్యావృతః సర్వధూభిః।
శోకాతిగో మోదతే స్వర్గలోకే 62

(దీనియందున్న వేదపాఠము కాఠములోనిది)

తా. అంబా! పాపాత్ముడైనవాడు కూడ - ఈషణత్రయ (దారేషణ, ధనేషణ, పుత్రేషణ)ములను శాంతింపజేసికొన్న బ్రహ్మిష్ఠులగు నీ భక్తుల దృష్టి పాతమువలన - పవిత్రుడై స్వర్గలోక స్త్రీలచే సేవింపబడుచు శోకమును అతిక్రమించి స్వర్గలోకమున మోదమును పొందుచున్నాడు.

విశేషములు : శ్రీదేవి భక్తులు బ్రహ్మిష్ఠులు, బ్రహ్మజ్ఞానులు. అందుచేత వారు అరిషడ్వర్గమును (కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య) జయించి ఈ షణత్రయమును (అరిషడ్వర్గమును జయించిన తరువాతనే యీ షణత్రయమును జయింపవలసి వచ్చుట) శాంతింపజేసికొన్నవారు. అట్టివారి దృష్టి సోకినందువలననే మహాపాపులకుకూడ పాపపరిహారమై - స్వర్గలోక సుఖప్రాప్తి.

శ్రీదేవి భక్తులు బ్రహ్మిష్ఠులనగా ఆత్మజ్ఞులు. ఆత్మజ్ఞులను అర్చించినందువలన సకలైశ్వర్యసిద్ధి యని శ్రుతి. ఆత్మజ్ఞుడు - బ్రహ్మయే. అందుచేత సకలానుగ్రహ శక్తియుక్తుడు.

---

# శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి చరణ స్మరణమ్

(గతసంచిక తరువాయి)

## దృఢత్వము

శ్రీ జగద్గురువు లెవ్వరితోను కఠినముగా మాట్లాడి శిక్షింపరన్నచో - ఆయన మఠోద్యోగులు అధర్మముగా ప్రవర్తించినప్పుడు చూడనట్లూరకొందురనిగాని లెక్క చేయరనిగాని, పట్టించుకొనరనిగాని భావము కాదు. ఆయన సరిదిద్దు పద్ధతి మామూలుగా నుండదని - సాధువుగా నుండి - దృఢముగా - రాజీపడనట్లుగా నుండును. కొన్ని ఉదాహరణలవలన నిది స్పష్టమగును.

తిరునల్వేలిలో వకీలుగా నున్న కృష్ణస్వామి అయ్యరు కోర్టుకి వెళ్ళడం తగ్గించుకొన్న తరువాత శ్రీ జగద్గురువులతో తాను శృంగేరిలోనే ఉండిపోవుదు ననెను (శ్రీ చరణుల సమ్మతియైనచో). శ్రీ చరణులు "నీకు ఇంకను కాపాడ వలసిన తల్లిగారున్నది కదా" అనిరి. "అతడు ఆమెను చూచుటకు నాకు తమ్ము లున్నారు" అనెను. శ్రీ చరణులు "అందుచేత నీ బాధ్యత తగ్గను" అనిరి. అతడు శృంగేరిలో నుండదలచిన భావమును వదలుకొనెను. కాని అయిదు సంవత్సరముల తరువాత అతని తల్లి మరణించినప్పుడు ఆమె మరణశయ్య దగ్గర అతనొక్కడే ఉండ గలిగెను. అతని సోదరులు ఆ సమయమునకు రాలేకపోయిరి - ఒకడంతకు ముందే చనిపోయెను. మిగిలినవారు రెండు దినముల తర్వాత వచ్చిరి. శ్రీ జగద్గురువు లీ సంఘటనను ముందుగానే గుర్తింపగలిగిరి.

ఉద్యోగ విరమణముచేసి విశ్రాంతి తీసికొనుచున్న పెద్దమనిషి యొకడు శ్రీ జగద్గురువులతో "నేను సన్న్యాసాశ్రమము తీసికొనుటకు అనుజ్ఞనిప్పింపుడు. నా భార్య గతించి చాల వత్సరము లైనది. నా కుమారుడు పెద్దవాడై నాడు. వానికి నా సహాయ మక్కర లేదు. నాకు కుటుంబ బాధ్యతలు లేవు. ఈ వృద్ధాప్యమును పఠన, మననములతో గడుపవలెనని కోరిక. శ్రీ జగద్గురువులు నన్ను

తురీయము తీసికొన అనుమతి నీయ ప్రార్థన" అని విన్నవించెను. శ్రీ చరణు లతనిని పరిశీలించి "నీ కింకను ధన వ్యామోహము పోలేదు. తురీయమును గైకొను టకు ముందు దానిని పోగొట్టుకొనవలెను" అనిరి. ఆ పెద్దమనిషి తలవంచి శ్రీ చర ణుల ఆజ్ఞను శిరసావహించెను. అతడు వేరొకరినుండి భిక్షను తీసికొనుట కిష్టము లేక తన పెన్షను నుండి భిక్షకు ఏర్పాటు చేసికొనదలచెను. శ్రీ చరణుల ఆజ్ఞ విన్న తరువాతనే ఆయనకు సన్న్యాసము స్వీకరించిన తరువాత పెన్షను తీసికొన రాదని తెలిసెను.

శ్రీ చరణులకు బాగుగా తెలిసినవా డొకడు ఎచ్చటికో పోయి సన్న్యాస మును స్వీకరించి శృంగేరికి వచ్చెను. అతడు వచ్చి ప్రణామము చేయగా శ్రీ చరణు లతని వంకకూడ చూడలేదు. ప్రక్కనున్నవారి కాశ్చర్యమయ్యెను. మిత్రు డొక డతనిని "మీ రెప్పుడు సన్న్యాసము తీసికొంటిరి?" అని ప్రశ్నించగా - ఆయన "నేను ప్రతి సంవత్సరము ఆరు శ్రాద్ధములను (తండ్రికి, తల్లికి, మాతామహునకు, మాతామహికి, ఇద్దరు భార్యలకు) పెట్టవలసి వచ్చుచున్నది. సన్న్యాసమును తీసికొన్న శ్రాద్ధములు పెట్ట నక్కరలేదని మిత్రు డొకడు సలహా చెప్పెను. రెండు నెలల క్రితము సన్న్యాసము తీసికొంటిని" అని ఆయన సమాధానము చెప్పెను. శ్రీ జగద్గురువు లిట్టి సన్న్యాసులను లెక్కపెట్టకుండుట సమంజసమే.

(సశేషము)

---

# శ్రీ జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణుల ఉపదేశము

శ్రీకృష్ణుడు అర్జునునికి ఆత్మసంయమనము చేసికొనవలసిన ఆవశ్యకతను గురించి చెప్పగా—అతడు మనస్సు చంచలమైన దగుటచేత నిశ్చలస్థితి, నిష్ఠకను పడుటలేదని బ్రహ్మమునందు మనస్సు నిలుకడ నొందుట సాధ్యముగా తోచుట లేదని విన్నవించెను. (చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్। తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివసు దుష్కరమ్). భగవంతుడైన పరమాత్మ అర్జునుని సందేహమునకు సమాధానము చెప్పెను.

అభ్యాసముచేత, వైరాగ్యముచేత మనోనిగ్రహమును సాధింపవలెనని చెప్పెను. అభ్యాస మనగా ధ్యాన మని చెప్పుకొనవలెను. 'ధ్యానము' యందు జనులు వలసి

నంత శ్రద్ధ చూపుట లేదు. తన స్వంత సొమ్ము రూపాయిల నోట్ల కట్టలను లెక్కించుకొనునపుడు మానవుడు తన మనస్సును వేరు విషయములపై ప్రసరింపనిచ్చు చున్నాడా? అప్పుడు ఏకాగ్రత భజించుట లేదా? అసలా సొమ్ము మనస్సును అన్యథా వర్తింపనిచ్చునా?

ధ్యాన మెంత ఆవశ్యకమో తెలిసికొన్నవాడు దానిని అభ్యసించుటకు దొరకొనును—అవలంబించి దీర్ఘకాల (నిరంతర) మాచరించును. (సతు దీర్ఘకాల నైరంతర్య సత్కారా సేవితో దృఢభూమిః). సక్రమముగా చేయు ధ్యానమునకు వైరాగ్యమునకు సంబంధ మున్నది. మనస్సు చలించి అన్యథా సంచరించుచుండగా దానిని వెనుకకు లాగి ఏకాగ్రతకు లక్ష్యమైనదానిపై నిలుపవలెను. దీనికి చాల మెలకువ కావలెను. ఏకాగ్రతకు లక్ష్యమైన వస్తువు ఊహా కల్పితము కాదని - నిజముగా కట్టెదుట నున్నదను భావముతో—తన మనస్సు అంతర్ముఖమగుచున్నదన్న స్మృతి నిలుపుకొన్నచో—సిద్ధికి తోడ్పాటగును.

సగుణ ధ్యానము చేయునప్పుడు—ఏ రూపమైన గాని, ఏ శబ్దమైన గాని ఏకాగ్రత సాధించుటకు పనికివచ్చును. నిర్గుణ ధ్యానము ఉత్తమాధికారులకే తగినది. "నేను సత్తును, చిత్తును, ఆనందమును, సకలమునకును సాక్షిని" అన్న భావ మననముతో (సోఽహం వంటి మాటలను మరల మరల ఉచ్చరించుట కాదు)—నిర్గుణ ధ్యానమును ప్రారంభింపవచ్చును. ఈ భావము ఆంతరముగా నిలుపవలెను.

సోమరితనము అతి అభ్యంతరకరమైనది. దానిని తొలుత నుండి విసర్జింపవలెను. సముచితమైన ఉపదేశమును పొందిన తరువాత—ఉపదేశింపబడిన మంత్రమును మననము (జపము) చేయుటవలన చాలవరకు మేలు. ధ్యానము ప్రగాఢమైనప్పుడీ మంత్రమననము నిలచిపోవును.

నిర్గుణ ధ్యానమార్గమునం దొక అవాంతరము వచ్చి పడవచ్చును. మనస్సు మాంద్యముగాలేక—చలించుటకూడ లేనప్పుడు—ఒక మందమైన సంతోషస్ఫురణము కలిగినప్పుడు—అది నిర్వికల్పసమాధివేళ కలుగు ఆనందము కాదు. (స కషాయాం విజానీయాత్). "నేను ఆనందమును అనుభవించువానిని కాదు. నేనే ఆనందమును" అన్న వృత్తిని అవలంబించినచో సాధకుడు తేలికగావృత్తిరహితమైన సమాధిస్థితిని చేరుకొనగలడు.

ఈ సాధనామార్గము—సాధకుని స్థితినిబట్టి నిర్ణయింపవలెను కాబట్టి గురువు చేత నిర్ణయము జరుగవలెను. గురువునుండి నేర్చుకొనవలెను. సాత్త్వికాహారము నే

తీసికొనుట, ఇంద్రియనిగ్రహము నియమము, సంయమనము, ప్రాణాయామము చాల సహాయపడును. పిచ్చి ప్రశ్నలు, సందేహములు పనికిరావు. అనుభవకవేద్యమైన యీ మార్గమును గురించి ప్రసంగ ప్రవచనముల ప్రయోజనము లేదు.

ధ్యానసాధనా మార్గము వలన లభించు ఆనందలాభమే దానికి ముగింపు. సిద్ధినిరూపణము తొలుత లభించిన నిర్వికల్ప సమాధి అనుభవము వలన జగన్మిథ్యాత్వము గోచరమైనపుడు—అనుభవము తేలిపోవచ్చును. కాని దానిని మరల సంపాదించుకొనవచ్చును. తుదకు జీవన్ముక్తస్థితి.

---

# శ్రీ జగద్గురు భారతీ తీర్థస్వామి చరణుల ఉపదేశములు

## (మదరాసు ఇంటిగ్రల్ కోచ్ ఫ్యాక్టరీ నుండి భక్తులు శృంగేరి వచ్చి దర్శనము చేసినప్పుడు సలిపిన అనుగ్రహ భాషణము)

గంగాపూర ప్రచలితజటాగ్రస్త భోగీంద్ర భీతమ్
ఆలింగం తీమచలతనయాం సస్మితం వీక్ష్యమాణః
లీలాపాంగైః ప్రణతజనతాం నందయన్ చంద్రమౌళిః
మో ధ్వాంతం హరతు పరమానందమూర్తిః శివోనః ॥

ఈశ్వరుడు సర్వజ్ఞుడని, మన అభీష్టసిద్ధిని చేకూర్పగలవాడని మనము విశ్వసించు జనులము. మన మట్లే ఆయనను కొలుతుము. ఈశ్వరు నెట్లు ఆరాధింపవలెను, ఆయన కేమి ఉపాయన మీయవలెను—అన్న ప్రశ్నలకు సమాధానముగా శంకర భగవత్పాదులు ఒకచోట నిట్లు చెప్పిరి — "ఓయి పరమేశ్వరా! నేను నీ కిచ్చుట కేమి కలదు? నా శక్తి యేమి? నీ కడలేని వస్తు వేదైన నుండినచో— నేను దానిని నీ కిచ్చుట సమంజసముగా నుండును. ఆలోచన చేయగా అట్టి వస్తు వేదియు లేనియట్లే తోచును."

పరమశివుని స్తుతించు శంకర భగవత్పాదులు "నీకు సువర్ణాభరణముల నిత్తుమన్నచో నీ చేతిలో బంగారు పర్వతము మేరువుకలదాయెను" అనిరి. పరమశివుడు త్రిపురాసురులను సంహరించువేళ మేరుపర్వతమును విల్లుగా ధరించెనని పురాణముల

నుండి మనము తెలిసికొనుచున్నాము. కాబట్టి బంగారముతో ఆయన కేమి యీయ గలము?

అయితే ఆయనకు బంగారముండవచ్చును. ధనము, రత్నములు, మాణిక్యములు కలవా? అట్టివి మన మాయన కీయవచ్చును కదా! కాని సకలధన నిధులకు, రత్నరాసులకు ప్రభువైన కుబేరుడు పరమశివుని పాదసేవకుడుగా నుండి ఆయన ఆజ్ఞలను శిరసావహించుటకు సిద్ధముగా నున్నాడు. కుబేరుని కంటె ఐశ్వర్యవంతుడు లేనే లేడు. కాబట్టి ధన, రత్నాది ఐశ్వర్యములను మన మాయన కీయలేము.

భగవంతునికి వినూతనమైన వస్తువు నేదైన మన మీయవచ్చును కదా! నూతన వస్తు వేదైన లభించినప్పుడు దానిని తమకు ప్రీతిపాత్రులైనవారి కిచ్చుట జనులకు పరిపాటి. ఏదైన నవీన వస్తువును సంపాదించి మనము పరమేశ్వరుని కీయవచ్చు కదా! విదేశముల కేగి తిరిగి వచ్చినవారు తమ బంధువులతో "ఈ వస్తువు మన దేశములో దొరకదు. అతి వినూతనమైనది. దీనిని మీకొరకు విదేశములలో కొని తెచ్చితిని" అని చెప్పుట మన కనుభవమే. అట్లే మన మీయవచ్చును కదా! కాని ఇదియు సాధ్యమగునది కాదు. పాలసముద్రమును త్రచ్చినపుడు కామధేనువు, కల్పవృక్షము ఉద్భవించినవి. కోరినవస్తు వేదైన కాని సమకూర్పగల శక్తి వీని కున్నది. ఇవి పరమేశ్వరుని పాదముల చెంత నుండగా - మన మేమి నవ్య వస్తువును సమర్పింపగలము?

ఒకప్పుడు—ఎండ వేడిమి భరింపలేనంతగా నున్నప్పుడు—శీతలోపచారములు ఆహ్లాదకరములుగ, సుఖకరములుగా నుండవచ్చును. అట్టి శీతలోపచారము లేవైన పరమేశ్వరునికి చేయగలుగుదుమా? హిమకరుడైన చంద్రుని శిరస్సునందుంచుకొన్న వానికి మరింతకన్న శీతలోపచార మేముండును? అసలాయన హిమగిరితనయ నొక రితను శిరస్సునందు, మరొకతెను శరీరమునం దుంచుకొన్నవాడాయెను. మనము చేయగల శీతలోపచార మేమియు లేదు.

ఏదైన మంగళకరమైన వస్తువు నీయవచ్చునా? మంగళకరమైన వస్తువు లన్నియు ఆయన పాదాబ్జములకడనే కలవు. పైగా సర్వమంగళయగు శ్రీఅంబికను ఆయన వామార్ధముగా కలిగినవాడు. అంతియే కాదు. ఆయన శివుడు. మంగళమూర్తి.

ఇక మరే వస్తువును కన్పించుట లేదు. నా మనస్సును నీ పాదముల చెంత నుంతును. అయితే యీ మనస్సు బాహిరమైన వస్తువు కాదు. భౌతికముగా దానిని

ఉంచుటకు వీలులేదు. మనస్సు సమర్పించుట యనగా భగవంతుని నిరంతరము చింతించుట. నిరంతరం భగవచ్చింతన చేయువారు శ్రేయోలాభము పొందెదువారే. మన పురాణేతిహాసము లిది తథ్యమని చెప్పుచున్నవి. అయినను మనము అల్ప ప్రాపంచిక విషయములను గురించి చింతించుచు కాలమును వ్యర్థము చేయుదుము. అట్లు భగవచ్చింతన చేయుట సమంజసము.

సాధారణ పరిస్థితులలో భగవచ్చింతన చేయకుండుట మానవుని సహజ గుణము. కష్టములు వచ్చినప్పుడు చేయును. అందుకనియే కుంతీదేవి శ్రీకృష్ణుని ప్రార్థించినది—'నా కెప్పుడును కష్టములే కలిగింపుము. ఆ సమయమున నేను నిన్నే తలచుచుందును. కష్టములు లేకున్నచో నేను నిన్ను స్మరింపను కదా! దుఃఖములు నిన్ను స్మరించుటకు హేతువులు. అందుచేత వానిని ఉండనిమ్ము". ఆమె భావమున నిరంతర భగవస్మరణ ముండవలెను. కారణ మెట్టిదైన నేమి?

భగవంతుని స్మరించునంత నేంతయగు ననగా—మన కష్టములన్నియు నంతరించును. మన మనస్సులందు చాల కోరికలున్నవి. కొందరు తమ కోరికలను వెల్లడింతురు. కొందరు బయటపెట్టరు. అయితే కోరికలుమాత్ర మున్నవి. కోరికలను తీర్చుకొను మార్గము మాత్రము తెలియదు. బాహిరమైన మార్గములు కొన్ని తోచవచ్చును. ఆంతరమైనది ఈశ్వరానుగ్రహము. ఈశ్వరానుగ్రహము లేనిచో నేమియు లభింపదు. ఎంతో ప్రయత్నముచేసి విజయము సాధించితి మనుకొన్నంతలో— విజయము అలభ్యమైపోవుచున్నదని — ఎందరో వాపోవుట మనకు తెలియును. కారణ మేమనగా కొంత కొంత ఈశ్వరానుగ్రహము వారికి లేకపోవుట.

(సశేషము)

---

## వ్యాసములు-ఎక్ఛేంజి కాపీలు, రివ్యూకి గ్రంథములు

మా పత్రికకు పంపదలచిన వ్యాసములను ఎక్ఛేంజి కాపీలను రివ్యూకి గ్రంథములను (2 కాపీలు) యీ క్రింద చూపిన మా మద్రాసు కార్యాలయము అడ్రసునకే పంపవలెను.

శ్రీ రామలింగేశ్వరరావు,
శ్రీ శంకరకృప సంపాదకుడు,
నెం. 63 కోడంబాకం హైరోడ్డు, త్యాగరాయనగరు, మద్రాసు-600 017.

# శ్రీ జగద్గురు చరణుల చాతుర్మాస్య వ్రతము

యతిపూజ సర్వదేవతా పూజన తుల్యమైనది. ఐశ్వర్యాసి భూతికాముడు బ్రహ్మనిష్ఠుని సేవింపవలెనని శ్రుతి ఉద్బోధించుచున్నది. అట్టి పూజ చాతుర్మాస్య దీక్షా సమయమునందైన మరింత ఫలము. ఆ యతిశ్రేష్ఠుడు సర్వ యతిలోకసార్వ భౌముడై బ్రహ్మవిద్వరిష్ఠుడైనచో అనంతఫలము.

శ్రీ భగవత్పాదులచే తొలుత ప్రతిష్ఠింపబడి—ఆయన చేసిన మఠామ్నాయ శాసనమువలన—శ్రీ భగవత్పాదుల యంతటి జగద్గురు పరంపరచే అలంకరింపబడిన శ్రీ శృంగేరి జగద్గురు శారదాపీఠమును ప్రస్తుతము తేజోభరితము చేయుచున్న శ్రీ చరణులను చాతుర్మాస్యమున పూజించుటకన్న ఉత్తమోత్తమపూజ మరొకటి లేదు.

శ్రీ శంకరకృప పాఠకుల తరఫున ప్రతి సంవత్సరము భాద్రపద పౌర్ణమి నాడు శ్రీ జగద్గురువులకు భిక్షావందన పాదపూజలు నిర్వహింపబడుచున్నవి. ఈ సంవత్సరము కూడ నట్లే చేయుడని పాఠకులు కోరిరి.

శ్రీ జగద్గురు చరణులు శిష్యస్వామిసహితులై శృంగేరిలో తుంగాతటినీ తటస్థ నరసింహ తపోవనమున దుర్మతినామ సంవత్సర చాతుర్మాస్యవ్రతమును ఆషాఢ పౌర్ణమి శుక్రవారమునాడు (17 జులై 1981) ప్రారంభించుచున్నారు. భాద్రపద పౌర్ణమి సోమవారము (14 సెప్టెంబరు 1981) చాతుర్మాస్య దీక్షా విసర్జనము. ఆనాడు శ్రీ శంకరకృప పాఠకుల తరఫున శ్రీ చరణులకు పాదపూజ భిక్షా వందనము జరుపబడును. అందుకు గాను పాఠకులు రూ. 6/-లకు తక్కువకాకుండా తమ తమ విరాళములను యీ క్రింది చిరునామాకు వెంటనే పంపకోరుచున్నాము.

ముందుగా పంపినచో ఏర్పాట్లు చేయుట సుకరమగును.

ఆకెళ్ల సత్యనారాయణమూర్తి,
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు,
6-3-609/18, ఆనందనగర్.
ఖైరతాబాదు, హైద్రాబాదు—500 004.

---

Printed & Published by A. Satyanarayana Murthy,
6-3-609/18, Anand Nagar, Khairatabad, Hyderabad - 500 004.
Printed at KRANTI PRESS, MADRAS-600 001.
Editor : T. Ramalingeswara Rao

# శ్రీ విద్యారణ్య విజయగాథ

11

శ్రీ విద్యారణ్యులు
మణికర్ణికా ఘట్టము
నకు చేరి స్తుతించి
స్నానములు చేసిరి.

డుంఢి విఘ్నేశ్వరుని
దర్శించి సేవించిరి.



# సంస్కృతభాషను మనమేల ఆదరించి నేర్చుకొనవలెను?

## (41)

ఈ ప్రశ్నకు మన దేశంలో మేధావివర్గంలో మూర్ధన్య మనీషామణులు సమాధానాలు చెప్పారు. గత సంచికలందు కొన్నిటిని తెలుసుకున్నాము. ఇప్పుడు మరికొన్ని. (సంపాదకుడు)

### శ్రీ యం. పతంజలి శాస్త్రి

(భారత ప్రధాన న్యాయాధిపతి)

మన కిప్పుడు మన యిష్టానుసారము మన పాఠశాలలలో విద్యార్థులు చదువవలసిన పాఠ్యాంశమును నిర్ణయించుకొను శక్తి సంప్రాప్తమైనది—మరియు దానిని సర్వోత్కృష్టమైన విధముగా సంభావించుటకు, మన సంస్కృతికి ఆధారభూతమైన తేజస్సు అగు సంస్కృతమును మన పాఠశాలలో అధ్యయనము చేయవలసిన విషయముగా నిర్ణయించుకొనవలెను. పిమ్మట మనము దూరదృష్టితో అనతి దూర భవిష్యద్విషయము యోచన చేయవలసియున్నది. ఆంగ్లభాష భారత వ్యవహార రంగమునుండి — అత్యల్ప సమర్థనను విడచి—అంతర్హితమైనప్పుడు—మన సాహిత్య లౌకిక వ్యవహారము పుష్టికి సంస్కృతమే గతి. అందుచేతనే వెంటనే మేల్కాంచి మన విద్యాశిక్షణ విధాన నిర్ణాయకులు మన పాఠశాలలో సంస్కృత అధ్యయనము ప్రారంభింపచేయాలి. సంస్కృత భాషా అధ్యయన శిక్షణలకు ముందుకు సాగవలెను.

దీక్షాంత భాషణ
బీహారు సంస్కృత సమితి, పాట్నా.
1955

### శ్రీ పీ. బీ. గజేంద్రగడ్కర్

(భారత ప్రధాన న్యాయమూర్తి)

మన విద్యా విధానమున సంస్కృతమునకు సముచితస్థాన మిచ్చుట మన ధర్మము.

సంస్కృతము భూత వర్తమానకాలముల మధ్య వారావధి. తన భూతకాలమును విస్మరించిన జాతి యేదికాని ఉజ్జ్వలవంతమైన వర్తమాన భవిష్యత్తులను ఆశింప జాలదు.

హిందూస్థాన్ టైమ్స్, 14 సెప్టెంబరు 1964

# శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్య విరచిత
# అపరోక్షానుభూతి

### వ్యాఖ్యానము: శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

[గతసంచిక తరువాయి]

అవ (149 శ్లో.) జ్ఞానికి కలుగు లాభములను చెప్పుచున్నారు.

శ్లో॥ అకించనస్య దాంతస్య శాంతస్య సమచేతసః
మయా సంతుష్ట మనసస్సర్వా సుఖమయాదిశః॥ 149

తా. జ్ఞాని నిర్ధనుడు — ఏమియు లేనివాడు. అంతరింద్రియ నిగ్రహము కలవాడు. బహిరింద్రియ నిగ్రహము కలవాడు. సర్వత్ర సమమైన మనస్సు కలవాడు. గురూపదేశముచేత సంతుష్టమైన మనస్సు కలవాడు. అట్లున్న అతనికి సర్వదిక్కులందు సుఖమయముగానే ఉండును.

శ్లో॥ నిర్వాసనో నిరాలంబ స్స్వచ్ఛందో ముక్తబంధనః
క్షితౌ సంస్కారవాతేన చేష్టతే శుష్కపర్ణవత్॥ 150

తా॥ జ్ఞాని వాసనారహితుడై—ఆశ్రయహీనుడై తన్నుతాను స్వాధీనమునందుంచుకొన్నవాడై—వదలిపెట్టబడిన బంధములు కలవాడై—పూర్వజన్మ సంస్కారమన్న వాయువుచేత భూమియందు ఎండుటాకువలె చరించుచుండును.

విశేషము: ఎండుటాకు—ఎండి చెట్టునుండి రాలిపోయిన ఆకు — గాలివలన నెట్లు కొట్టుకొనిపోవుచుండునో (అప్పుడా ఎండుటాకునకు సుఖ దుఃఖము లేమియు లేవు)—అదే విధముగా జ్ఞాని దేహము లోకమున చరించుచుండినను అతనికి సుఖము దుఃఖము మొదలగు ప్రపంచ సంబంధము లే మాత్రమును లేవు. (సశేషము)

---

## చందాదారులకు విన్నపము-ప్రకాశకుని చిరునామా మార్పు గమనింపుడు

చందాలు బాకీయున్నవారికి పత్రిక పంపబడదు. చందా సొమ్మును ముందుగనే (తమ అడ్రసు మార్పుకూడ వెంటనే) క్రింది చిరునామాకు పంపవలెను.

ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి,
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు,
6—3—609/18, ఆనందనగర్,
ఖైరతాబాదు, హైద్రాబాదు—500 004.

## వేదాంత న్యాయములు (38)

(న్యాయము: వంటి ఉదాహరణలు)

[వేదాంత శాస్త్రముతో సూక్ష్మవిషయములను బోధచేయుటకు కొన్ని ఉదాహరణలు సాధారణముగా నుపయోగించెదరు. ఈ ఉదాహరణలు నిత్యజీవితమునకు సంబంధించినవిగా నుండి-వీటిమూలమున దుర్గ్రాహ్యమైన సిద్ధాంత విషయములను అవగాహన చేసికొనుటకు తోడ్పడును. ఈ ఉదాహరణలవలన-సునిశిత ప్రజ్ఞావంతముకాని సామాన్యుని మేధస్సుకూడ సిద్ధాంతమును గ్రహింపగల్గును. సామాన్యపాఠకులకొఱకు వేదాంత న్యాయముల వివరణములను క్రమముగా ప్రకటించుచున్నాము. సంపాదకుడు]

### ఖడ్గము-స్పర్శవేది

స్పర్శవేది అను జాతిని ఖడ్గముతో ముట్టుకొన్నచో ఆ ఖడ్గము బంగారమగును. అది ఖడ్గమువలె యింకను ఆకృతియందు కన్పించుచున్నను దానితో నఱకుటకు వీలుపడదు. అదే విధముగా జీవన్ముక్తిని — జ్ఞానసిద్ధులని ఆత్మవ్యక్తి భేదముగా తోచుచున్నప్పటికీ-భౌతికముగా వేరొక దేహమును కలిగియుండినప్పటికీ అది ఆ జీవన్ముక్తిని, జ్ఞానసిద్ధుని మరొక జన్మతో బంధింపలేదు. ఏలననగా—అది అపని బ్రహ్మజ్ఞానస్పర్శవలన శుద్ధసత్త్వముగా పరిణమింపచేయబడినది.

---

# గురువంశ కథా కథనము

(సంస్కృత మూలము: బ్రహ్మశ్రీ కాశీలక్ష్మణశాస్త్రి గురువంశ కావ్యమ్)

తెలుగు: శ్రీ చెఱుకుపల్లె జమదగ్నిశర్మ ఎం. ఏ.

(గత సంచిక తరువాయి)

## పంచదశ సర్గము

తల్లీ! శారదా! నిన్ను భక్తితో ధ్యానించు సజ్జనులు నీ కడకు వచ్చి నిన్ను దర్శించుకొనక మునుపే వారి సకలాభీష్టములు సిద్ధించుచున్నవి. క్షీరాంభోనిధి మహోత్తుంగ తరంగములవంటి నీ కటాక్షాంచల వీచులు పరమాహ్లాద ప్రదములై వారిపై నిత్యము పడుచునే యుండును. (26) అష్టాదశ విద్యలను సమ విభాగ మొనరించి ఉభయపార్శ్వముల నిలిపియున్న దానవగుటచేతనే నీ చెవులు తొమ్మి

దంకెల వలె నొప్పుచున్నవి. దగ్గరకు వచ్చినవానిని చూచుటకే కనులు విశాలము లైనవా? లేక విధిని మోహింపజేయుటకు మన్మథుడు కర్ణాంతముగా నారి లాగి గురి పెట్టిన శరములా అవి? (27) తమ ప్రియుడగు చంద్రుడు నీ చెక్కిళ్ల రూపమును పొందుటచే వానికి సన్నిహితముగ నుండ గోరి వచ్చిన తారక లన్నట్లు నీ చెవి కమ్మల ముత్యము లొప్పుచున్నవి. అదే విధముగా నీ చెక్కిళ్ల యందలి మకరికా పత్రము లా సుందరీమణులు ప్రియునకు పట్టించిన మైపూత యనిపించు చున్నది. (28) శ్రీ వాగ్దేవీ! నీ ఆననము నందు నవరసములు నొకదాని నొకటి మించవలయు నను స్పర్ధ వహించి విలసిల్లుచున్నవి. వానిలో ప్రముఖమైనది హాస్యము. తక్కిన రసము లన్నియు నీ చెవుల కొసలు చేరి తాటంక భావము నందగా ముఖ్య హాస్యము మాత్రము నాసాగ్ర ముక్తాభూషణమైనది. (29) అమ్మా! నీ దగ్గర కవిత్వము నభ్యసింపవలయునని వచ్చిన శుక్రుడా అతడు? లేక దానిమ్మ గింజల వంటి నీ దంతములచే నాకృష్టమై శుకమువచ్చి చేరినదా? చిలుకముక్కున లవలీఫల మున్నట్లు నీ నాసాగ్రమణి ప్రకాశించుచున్నది. (30) ఓ తల్లీ! శారదా! నీ అధరముతో సమమైనది ఎవ్వరికి తెలియదు. నిన్ను చేరి నమస్కరించు చున్న దేవతలకే తత్సదృశము స్ఫురించుట లేదు. మతిమాంద్యకారిణి యగు బింబ ఫల మెట్లు సమానమగును. పల్లవము పల్లవమగుటచేత నే సదృశము కానేరదు. విజ్ఞానభాగ్యప్రదా! విద్రుమమణులు నీ అధరము వలె జ్ఞానప్రదములు కాక ఉత్తేజన కారులు మాత్రమే యగుటచే అవియు సదృశములు కావు. (31) సౌందర్యలక్ష్మి చేతను, రమ్య వాక్యామృతముచేతను, భ్రూకల్పలతచేతను, రదముల నెడి ముక్తాళి చేతను, అధర విద్రుమము చేతను, ప్రకాశించు తాటంక చంద్రునిచేతను, సీమంత మందున్న రత్న కౌస్తుభ రుచిచేతను, దృష్టిసురభిచేతను కలావీచులు వెల్లివిరియు చున్న నీ వదనము సుధాసముద్రమువలెనే భాసించుచున్నది. (32) తల్లీ! నీవు మతిముద్రతో ధీదాన మొనర్తువు. చేతదాల్చిన పుస్తకముతో విద్యల నిత్తువు. అక్షమాలచే నిష్టగణన మొనర్తువు. పీయూష కుంభముతో పోషించుచుందువు. ఇక భక్తుల యభీష్టార్థములను సిద్ధింపజేయుట యంతయు నీ పాదపద్మద్వయము వలననే నిజముగా జరుగుచున్నది. నీతో సమాను లెవరున్నారు? నీకు నమ స్కారము. (33)

ఇట్లు స్తోత్ర మొనర్చి నాలుగగ్రహారముల బ్రాహ్మణుల గృహముల నుండి శారదాలయమునకు వచ్చిన సువాసినులకు కన్యకలకు తల్లి ప్రీతికై మహానందముతో నూత్నవస్త్రము లొసంగి శ్రీ సచ్చిదానంద గురురాజవరులనంత కీర్తిమంతులై విరా

జిల్లిరి. (34) ఇంకను ఆ యోగివర్యు లనేకామూల్య నూత్న వస్త్రములను తెప్పించి వివిధ ప్రాంతములనుండి వచ్చిన సువాసినులకు కన్యలకు లెక్కలేకుండా ఇచ్చి వారెల్లరు నభ్యంగన స్నానము లొనర్చుటకు వలయు తైలాది సంభారము లొసంగిరి. (35) సంకల్పించిన పురశ్చరణ విధి పూర్తియగుటకు పూర్ణాహుతి హోమము లొనర్చి దశమినాడు శారదాదేవికి రథోత్సవము మహావైభవముతో జరిపించిరి. శిబికాధిరోహణ మహోత్సవోత్సవము చేయించిరి. సర్వాంగీణముగ యథాశాస్త్రముగ మహావైభవోపేతముగ నీ నవరాత్రోత్సవములు జరుగుటతో ఎవరినోట విన్నను గురువుల ప్రశంసలే వినవచ్చినవి. (36) ప్రశస్తపర్వ మగు కార్తికపూర్ణిమ నాడు గిరి మల్లికార్జున విభుని ప్రీతికై పరమ భక్తితో లక్షదీపోత్సవ మొనరింప జేసిరి. ఆ దీపముల మధ్య యతీశ్వరులు నక్షత్రముల నడిమి చంద్రుని వలెనే తోచి యా నగర ప్రజల నానందపఱచుచు హృద్యులై వెలుగొందిరి. (37) ఉత్సవానంతరము శ్రీవారటనుండి మఠమునకు వచ్చునపుడు పురజను లెల్లరు ఒకరిని మించి ఒకరు తమ భక్తిగౌరవములను ప్రదర్శింపవలయునను స్పర్థతో ప్రతి మందిరము కడ నాపి నీరాజనము లర్పించి ధన్యులయిరి. సూత్రముపట్టి తీర్చినటులున్న సుదీర్ఘ విపణి వీథులలో నట్లు సమర్పితు లగుచు వచ్చి జగద్గురువులు శ్రీ విద్యాశంకర దేవాలయ దీపావళిని తిలకించిరి. (38) ఆలయములోని కేగి వరదుడగు నా స్వామిని అర్చించి ప్రసాదమును గైకొని శారదాదేవి నర్చించి మంగళారాత్రికలతో నీరాజనము లర్పించి సర్వజనానందకరులగుచు వంది బృందములు స్తుతించుచుండ శ్రీ సచ్చిదానంద యతివరులు మఠములోని కేగిరి. (39)

మాఘ మాసములో మల్లికార్జునస్వామికి విశేష పూజలు చేయించి ఉత్సాహముతో మహోత్సవము జరిపించిరి. దశమినా డచ్చటి కృష్ణస్వామికిని భవానీ శంభులకును వైదిక తాంత్రిక తత్త్వజ్ఞుల సమక్షమున పరమ భక్తితో ధ్వజారోహణోత్సవములు జరిపించిరి. (40) శ్రీ విద్యా శంకరస్వామిని తీసికొని వచ్చుటకు జగద్గురువులు బయలుదేరగా స్వీయమహోత్సవము తిలకించుట కా స్వామియే శిబిక నధిరోహించి ఆలయమునుండి కదిలిరాగా మాంగళ్యాక్షత లొసంగుట ద్వారా వారి నాహ్వానించి యాదరముతో తీసికొని వచ్చి తమ భవనమునందే స్వామిని నిలిపి మిగిలిన ఉత్సవ కార్య మంతయు సంతోషముతో జరిపించిరి. (41) శివరాత్రి పర్వదినము వచ్చుచున్నదనగా నానా స్థలములనుండి వేదవిదులైన బ్రాహ్మణులు శృంగేరి చేరుదురు. పర్వదినమున శ్రీ మల్లికార్జునస్వామికి అభిషేకములు ద్రోణార్క బిల్వాది సంఖ్యాతీతకోమలదళములతో సహస్రనామ పూజలు జరుగును. ఆ నాడా

గిరి యంతయు శివత్వమే పొందినట్లుండును. ఆ వైభవము నెట్లు వర్ణింపగలము? (42) శ్రీ జగద్గురువులు రాత్రివేళ పాదచారులై పరమ భక్తితో కొండ కొమ్మన నున్న స్వామి ఆలయమున కేగి స్వామిని శతరుద్రీయ మంత్రపఠన మొనర్చుచు పంచామృతములతో నభిషేకించి సహస్రనామములతో బిల్వదళము లర్పించి మంగళారాత్రికలతో నీరాజనము లొసంగి సర్వోపచార పూజలునయిన తరువాత తిరిగి మఠమునకు వత్తురు. (43) అమావాస్యనాడా స్వామికి రథోత్సవము. భవానీదేవితో కళ్యాణమహోత్సవము అయిన తరువాత పండితులు పురప్రముఖులు సర్వపౌరులు ననుగమించుచుండ మేళతాళములతో అలంకృతమైన పురమున నూరేగించి తిరిగి ఆలయమున ప్రవేశింపజేసి ఏకాంత సేవ యొనర్తురు. (44) మరునాటి యుదయమున ప్రాతర్వందిజన ప్రబోధములతో స్వామిని మేల్కొలిపి శృంగారి చూడామణి యగు నా ప్రభువునకు మంగళారాత్రిక లర్పించి నృత్త గీత వాద్యాదులతో వినోదము కల్పించి సాయంకాలము కుంకుమోత్సవము నిర్వర్తించి పల్లకిలో విహరింపజేసి ఇట్లు పరంపరగా ననేకోత్సవములు జరిపించుచుందురు. (45) ఇట్లు సర్వదా పురదేవతల కందరకు బహు విధోత్సవములు చేయించుచు, పూర్వ గురువులకంటె అధికముగా అనేక ధర్మము లొనర్చుచు, వేదాంతార్థ విచారణ తత్పరు లగు శ్రీ సచ్చిదానంద భారతీ యోగి వర్యులు శృంగేరి యందు కీర్తిమంతులై యుండి యుండి సోమశేఖర భూపాలుని మాచివత్తమని తలపోసిరి. (46)

జగద్గురువు లిట్టి యాశయముతో నున్నారని నిర్వాణయ్య యను మహాప్రధాని గ్రహించి రాజునకీ వార్త అందించెను. ఆ ప్రభువు నీ వర్తమానమును విప్ఫారిన కళ్లతో పరమానందముగ విని యోగ్యుడగు మంత్రివర్యుని గురువుల సమక్షమునకు విజ్ఞప్తి పత్రముతో పంపించెను. (47) ఆ మంత్రి శృంగేరి చేరి విజ్ఞప్తి పత్రను సమర్పించి గురువులు వంశపురికి దయచేయవలయు నను సోమశేఖరభూపాలుని విన్నపము నందించి జగద్గురువుల యాశయమున కనుగుణముగ వేచియుండి శ్రీవారి ప్రయాణమునకు అన్ని సౌకర్యములు కలిగించుచు వారిని మొదట నాగేంద్ర దేవాలయమునకు చేర్చెను. (48) గురువులు యాత్రకు బయలుదేరినప్పుడు మేరువున

---

**46 వ శ్లోకము**

ద్వితీయ సోమశేఖర నాయకుడు క్రీ.శ. 1715-39.

**47 వ శ్లోకము**

నిర్వాణయ్య - ఈయన ద్వితీయ సోమశేఖర నాయకుని మామగారు, అతనికి మంత్రి.

కేగుచున్న పరమశివుని వెంట దేవర్షు లనుగమించునట్లు సర్వసామాజికులు వారి ననుసరించిరి. నాగేంద్రదేవాలయమునుండి కాశీపురము చేరి అక్కడి దుర్గపాలకునిచే సమ్మానితులై వ్యాఘ్ర శిలాపురము చేరి అక్కడ మఠమున వసించిరి. (49) జగద్గురువుల ఆగమన వార్త రాజమంత్రుల ప్రేరణవలన తెలిసిన సర్వప్రజలు వారి దివ్య పాదపద్మముల సేవించుకొను తలంపుతో రకరకముల అరటిపళ్లు, ద్రాక్షలు, ఖర్జూరములు, చక్కెరలు, కలకండలు, కుంకుమ, అగరు, చందనాది సుగంధ ద్రవ్యములు మొదలైన సర్వార్ఘ్య వస్తువులు సమకూర్చుకొని మార్గమధ్యమున వేచియుండసాగిరి. (50) శ్రీవారు వచ్చిన వెంటనే వాని సన్నిధికి భక్తి శ్రద్ధలతో సమర్పించి ప్రణామము లాచరించి ప్రజలు ధన్యత భజించుచుండిరి. అప్పుడు వత్సరాది వచ్చినది. ఆ ప్లవ ఉగాదినాడు సోమశేఖరభూకాంతుడు సర్వరాజపూరుషామాత్యులతో పంచాంగ శ్రవణ మొనర్చి అబ్దఫలము విని దైవజ్ఞులను సత్కరించి దానవశలు దగుటచే సర్వలోక శ్లాఘ్యుడయ్యెను. (51) రాజాజ్ఞ ననుసరించి మంత్రిముఖ్యుడు నిర్వాణయ్య గజాశ్వ శిబికాదుల సద్ధిరోహించి చాల మంది తన్ననుసరించి శ్రీవారి సమక్షమున కేతెంచి స్వపుర మగు శివగంగకు దయచేయవలయునని అభ్యర్థించి సాదరముగ తీసికొనిపోయి యథోచితముగ సర్వసత్కారము లొనర్చి యోగీంద్రులను పరమరమ్య మగు వంశపురమునకు తీసికొనిపోయెను. (52) (సశేషము)

---

51 వ శ్లోకము
ప్లవనామ సంవత్సరము. క్రీ.శ. 1721.

---

# శ్రీ శంకర భగవత్పాద విరచిత
# వివేకచూడామణి
## (శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామి విరచిత వ్యాఖ్యాసమేతము)

**ఆంధ్రీకరణము: డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు(వేదాంత శిరోమణి, విద్వాన్)**
**ఎం. ఏ. (సంస్కృత, ఆంగ్ల హిందీ) పి. హెచ్‌డి.**

(గత సంచిక తరువాయి)

అవ. ఇంతవరకు—"అస్తి కశ్చిత్స్వయం నిత్యమ్" అని ప్రారంభించి పద

కొండు శ్లోకములచే "పరమః క ఆత్మా" అను ప్రశ్నకు సమాధానము చెప్పి, "కో నామ బంధః" అని శిష్యుడు అడిగిన మొదటి ప్రశ్నకు సమాధానము చెప్పు చున్నారు:—

మూ. అత్రానాత్మన్యహమితి మతిర్బన్ధ ఏషోస్య పుంసః
ప్రాప్తోఽజ్ఞానా జ్జనన మరణ క్లేశ సంతాపహేతుః.
యేనైవాయం వపురిద మసత్సమిత్యాత్మ బుద్ధ్యా
పుష్యత్యుక్షత్యవతి విషయై స్తన్తుభిః కోశకృద్వత్. 139

ప్ర. అ. అస్య పుంసః = ఈ జీవునకు, అత్ర = ఈ, అనాత్మని = ఆత్మకాని దేహాదికమునందు, అహ మితి = నేను, అని, మతిః = బుద్ధియే, బన్ధః = బంధము. అజ్ఞానాత్ = అజ్ఞానము వలన, ప్రాప్తః = వచ్చిన, ఏషం = ఈ బంధమే, జనన మరణ క్లేశ సంపాతహేతుః = జనన మరణముల వలన కలిగిన క్లేశమునందు పడిపోవు టకు హేతువు. యేనైవ = ఏ బంధము చేతనే, అయః = ఇతడు, ఇదం = ఈ, అసత్ = అసత్యమైన, వపుః = శరీరమును, సత్యమితి = సత్యమనుకొని, ఆత్మబుద్ధ్యా = ఆత్మ యనెడు బుద్ధితో, తంతుభిః = దారములతో, కోశకృద్వత్ = కోశముసు అల్లు క్రిమి వలె, విషయైః = విషయముల చేత, పుష్యతి = పోషించుచున్నాడు, ఉక్షతి = నింపు చున్నాడు, అవతి = రక్షించుచున్నాడు.

వ్యా. అ. వెనుక చెప్పిన విధముగ పరమాత్మయే స్వస్వరూపమైనను, అజ్ఞా నాత్ = అనాదిసిద్ధమైన అవిద్య వలన, ప్రాప్తించిన, ఈ పురుషుని యొక్క, అనాత్మని = దేహాదికమునందు, అహమితి మతిః = నేను మనుష్యుడను, నాకు ఆకలి దప్పికలు ఉన్నవి, నేను ఇచ్ఛయించుచున్నాను, చేయుచున్నాను, అనుభవించు చున్నాను. ఇత్యాదికముగా ఏ ఆలోచన గలదో అదియే బంధము అని అన్వయము. "అజ్ఞానాత్ ప్రాప్తః" అనునది ఈ బంధమునకు హేతువు. ఏ భ్రమయైనను దోషము వలననే కలుగును. శరీరాదికము విషయమున భ్రమకలుగుటకు కూడ స్వరూపాజ్ఞానమను దోషమే కారణమని భావము. అత్ర = దేహాదికమైన ఈ అనాత్మ పదార్థజాతము ప్రత్యక్షముగ ఆత్మభిన్నమని తెలియుచున్నను ఇట్టి భ్రాంతి కలుగు చునే ఉన్నదని అర్థము. మూలాజ్ఞానమును అంగీకరించని సాంఖ్యాదిమతములలో బంధమోక్షాది వ్యవస్థ అనుకసన్నమైనది, అనగా బంధ మెట్లు వచ్చును, మోక్ష మెట్లు వచ్చును అని సయుక్తిముగ చెప్పుట కుదరదు, అని గ్రహింపవలెను. బంధము అజ్ఞానకృతము అని చెప్పిన పక్షమున, అజ్ఞానము జ్ఞానమువలన నశించగనే అజ్ఞానకృత

మగు బంధము కూడ తొలగిపోవును అని చెప్పుటకు వీలగును. అట్లు కాక బంధము సత్యమని చెప్పినచో సత్యమైన బంధము జ్ఞానమువలన నశించునని చెప్పుట కుదరదు.

బంధమునకు కార్యమును, అనగా బంధము వలన కలుగు కార్యమును చెప్పుచున్నారు:—"జననమరణక్లేశసంపాతహేతుః" అనగా ఈ బంధము జనన మరణముల వలన కలిగిన దుఃఖములలో మునిగిపోవుటకు హేతువైనది. "జనన మరణ" అనునది ఆకలి దప్పిక మొదలైన దుఃఖహేతువు లన్నింటికిని ఉపలక్షణము. అనగా క్షుత్పిపాసాదులను కూడ గ్రహింపవలెను. లేదా—జననమును, మరణమును, క్లేశములను తన ధర్మములని భావించుటకు హేతువు అని అర్థము చెప్పవచ్చును. ఈ పక్షమున 'క్లేశ' పదమునకు అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము అని అర్థము. "అనాత్మన్య హా మితి మతిర్బంధం" అను వాక్యముచే, పంచక్లేశములలో మొదటిదైన అవిద్య చెప్పబడినది గాన క్లేశపదముచే మిగిలిన నాలిగింటిని గ్రహింపవలెను. "అనిత్యా శుచిదుఃఖానాత్మ సు నిత్యశుచి సుఖాత్మఖ్యాతి రవిద్యా" (అనిత్యమును నిత్య మనియు, అశుచిని శుచి యనియు, దుఃఖమును సుఖమనియు, అనాత్మను ఆత్మయనియు భావించుట అవిద్య) అని యోగసూత్రము. స్థూలదేహమునందు అభిమానము వలన జనన మరణములలో మునుగుచుండుట. ఆనందమయాదికోశములలో అభిమానము వలన రాగ — ద్వేష — అభినివేశములలో మునుగుచుండుట కలుగును. ఈ విధముగ బంధమను నామాంతరము గల, ఆదిమ క్లేశమైన కార్యావిద్యయే సకలవిధ దుఃఖములకును హేతువని గ్రహింపవలెను. యేనైవ = అనాత్మయందు ఆత్మ బుద్ధిరూపమైన ఏ బంధముచేత నే, అయం=ఈ పురుషుడు, అసత్యమైన ఈ శరీరమును, సత్యబుద్ధ్యా=సత్యమని, నేనని అభిమానముచేత, విషయైః = బంధహేతువులైనను అనుకూలమైనవివలె కనబడు రసాది విషయములచే, పోషించుచుండును, తడుపుచుండును, రక్షించుచుండును. "తంతుభిః కోశకృద్వత్" అనునది ఈ విషయమున అనురూపమగు దృష్టాంతము. కోశమును నిర్మించు క్రిమి, తన దేహములోనున్న లాలాజలమును ఖర్చుచేసి, దానితో తంతువులను నిర్మించి, వాటి మధ్యలో ఉన్నచో సురక్షితముగ నుండును అనెడు భ్రాంతితో దానిమధ్య లగ్నమై, బయటకు వెళ్ళజాలక, అనవసరముగ ఎట్లు మరణించునో అట్లే జీవుడు కూడ శరీరమే ఆత్మయని భావించి, దానిని విషయములతో పోషించుచు జన్మ మరణాది సకల దుఃఖములను అనుభవించుచుండునని భావము. కావుననే ఇట్లు చెప్పబడినది — "కోశక్రిమి స్తంతుభిరాత్మదేహ మావేష్ట్య చావేష్ట్య చ గుప్తిమిచ్ఛన్. స్వయం వినిర్గన్తు మశక్త ఏవ సంస్తత స్త దంతర్మ్రియతే చ లగ్నః"

(కోశక్రిమి, తనను రక్షించుకొనవలె నను అభిలాషతో, తన దేహమును తంతువులతో చుట్టి చుట్టి, చివరికి దానిలో తగుల్కొని, బయటకు రాజాలక దానిలోపలనే మరణించును). 'అవనం' అనగా ఉన్నదానిని పరిపాలించుట. పోషణ మనగా వృద్ధి పొందించుట. ఇదియే ఈ రెండింటికిని భేదము. 139

(సశేషము)

---

# అద్వైత సిద్ధాంతము ముందు పాశ్చాత్యుల పూర్వపక్ష ఖండన

## (ఆచార్య సుందరము)

(శ్రీ శంకర భగవత్పాద అద్వైత సిద్ధాంతము పైన పాశ్చాత్య విద్వాంసులు కొందరు దుర్బలమైన ప్రతిపక్షవాదములు చేసిరి. ఆ వాదముల ఖండన మీ వ్యాసము. —సంపాదకుడు.)

(గత సంచిక తరువాయి)

ఈ విషయమును వదలిపెట్టుటకు ముందు డా. థీబా—'ఉపనిషత్తులందున్న నిజమైన తాత్త్వికసారము'ను గురించి తన అభిప్రాయమును వెల్లడించెను.

శ్రీ శంకరుల సిద్ధాంతమునకు వ్యతిరేకముగా అతడు చెప్పిన వాదములన్నియు శుష్కప్రాయములని మే మిదివరకే నిరూపించితిమి. అతని పరిశీలన నిరుపయోగకరమైనదని విస్పష్టమొనర్చితిమి. కావున శ్రీ శంకరుల సిద్ధాంతములు నిష్కళంకముగా విరాజిల్లుచున్నవి. డా. థీబా తన కెట్లు ఉపనిషత్తులందున్న నిజమైన తాత్త్వికసారము లభించినదని చెప్పగలరో మనకు తోచుటలేదు. అయినప్పటికి అతడేమి చెప్పెనో చూతము.

ఇన్ని వ్రాతల తరువాత అతడు తనకు తెలిసినదని వెల్లడించిన రహస్యమేమనగా 'ఉపనిషత్తుల తాత్త్విక దృష్టి అసలు చెప్పుటకు కూడ వీలులేనిది'. షోపెన్‌హోవర్, డేవసేన్, మాక్సుముల్లరు మొదలగువారి భావములు తెలిసినప్పటికీ యీ మాటలనుట సాహసమే. తన పూర్వ అభిప్రాయమునే — (ఉపనిషత్తులు విభిన్నవ్యక్తులు విభిన్న కాలములలో అన్యోన్య సంబంధము లేకుండా ప్రతిపాదించిన సిద్ధాంతములని)—అది ముక్కలుగా ఖండింపబడినప్పటికీ పునరుద్ఘాటించెను. అయితే వెంటనే అవి తాత్త్వికశాస్త్ర బహిస్సూచికలని—సూక్ష్మవివరణలు లక్షింపబడలేదని వ్రాసెను. అయితే యీ బహిస్సూచికలేమిటి? ప్రథమమున — "బ్రహ్మజ్ఞానమొక్కటే—అదెట్లు పరిశీలింపబడినప్పటికి"—తన అభిప్రాయమును విశదీకరించుచు

"బ్రహ్మముసృష్టి, కాద్యమన్న భావము రచయిత మనస్సులో మెదలుచుండగా—(అందే స్థితి యని కూడ) అతడు దాని ప్రత్యేక లక్షణములను — ప్రాపంచిక సంబంధిగా—చెప్పి—ఆత్మయని—సర్వజీవమని, అంతరపాలకుడని — సర్వజ్ఞస్వామి యని—మొదలుగా వివరించును. అయితే బ్రహ్మచైతన్య నిధియని దాని బాహిర వికాసము సృష్టియని భావించినప్పుడు దానికి లక్షణములను తగిలింపజాలమని — అది వర్ణనాతీతమని—అది 'నేతి నేతి' యని గ్రహించును" అని వ్రాసెను.

భారత మహర్షులు తాత్త్వికశాస్త్ర బహిస్సూచికలనే రచించియున్నచో—డా. థీబా చెప్పినది సరికావచ్చును. కాని వారొక మతమును—దాని సిద్ధికి సాధనా వివరణములను వారు లిఖించిరి. మాక్సుముల్లరు వేదాంతమును గురించి చెప్పుచు "అది పరిశుద్ధత్త్వసారమైన తాత్త్వికశాస్త్రము. మిక్కిలి తృప్తిభాజనమైన మతము" అనెను. బ్రహ్మమును (ద్వివిధములుగా) సాధింపవలెనని హిందువుల ప్రయత్నము. అట్టి సాధనాసిద్ధికి అనుభవవిషయమైనప్పుడు—బ్రహ్మమును గురించిన జ్ఞానము ద్వివిధములని - ఒకేఒక సంభావిత సత్యమునకున్న రెండు ముఖములుకావని-మన మనుకొనుటకు మనకు హక్కున్నది. థీబా తప్పు అడుగు వేసెను — (ఒకే ఒక సత్యమునకు అవి రెండు ముఖముల సంభావనలని భావించుటలో — ఒకటి బ్రహ్మమును ప్రాపంచిక సంబంధముతో — మరొకటి బ్రహ్మమును అద్వితీయమైనదిగా — బ్రహ్మమును బ్రహ్మముగా భావించుట.)

మతమునకు తత్త్వశాస్త్రమునకు మధ్యగల భేదాను—మేము సూచించినది—అవగాహన చేసికొన్నచో శ్రీ శంకరులు ప్రతిపాదించిన బ్రహ్మజ్ఞాన విషయముగా నున్న రెండు అంతరములు—(కావున సగుణ నిర్గుణ బ్రహ్మముల అంతరము) నిస్సంశయముగా శంకారహితముగా సత్యమైనదే.

ఉపనిషత్తులు మాయా సిద్ధాంతమును చెప్పుచున్నావా? లేదా? అన్న విషయమును డా. థీబా తరువాత తీసికొనెను. అతడు "ఉపనిషత్తులలో కొన్నియెడల — ముఖ్యముగా బృహదారణ్యకమున - మాయా సిద్ధాంతమునకు బీజము లున్నవని మన మంగీకరింపవలెను" అని వ్రాసెను. డా. థీబాకు బీజముగా తోచినదే యితరులకు పరిణతి పొందిన సంపూర్ణ సిద్ధాంతముగా (ఎ.యి. గొగ్, డా. దేవసేన్ మొదలగు వారికి) తోచినది. ఇచ్చట థీబా దగ్గరనుంచి కనీస మొక అంగీకారము - (వేరొకచోట చేసిన ఉద్ఘాటనకు జీవము పోగొట్టునట్లు) వచ్చినది. ఆ ఉద్ఘాటనము నింతకు ముందే ఉదహరించితిమి. "ఉపనిషత్తులు జగత్తు మిథ్యయన్న వాదమును సమర్థించుటలేద"న్న దా ఉద్ఘాటన.

అయితే డా. థీబా మాయావాద ఆవశ్యకత లేకుండా అవగాహన అగు చున్న శ్రుతిపాఠములలోనికి ఆ వాదమును చొప్పించుటకు సరియైన కారణము కన్పించుట లేదు" అనియు - "యీ అభిప్రాయము మొదట - సృష్టిక్రమమును గురించి చెప్పుచున్న అన్ని శ్రుతిపాఠములకు అన్వయించును" అనియు వ్రాసెను. ఈ పాఠములలో ముఖ్యమైనదిగా తాను భావించుచున్న పాఠమును-ఛాందోగ్య ఉపనిష ద్వాదమును VI. 2.1 అతడు ఉదహరించెను. ఈ పాఠమును మే మింతకు పూర్వమే తీసికొని అది జగన్మిథ్యాత్మవాదమునకు బలమునే చేకూర్చుచున్నదని విస్పష్టముగా ఋజువుచేసితిమి. ఆ భాగమును మరల చూడుడుని పాఠకులను కోరుచున్నాము.

అవ్యక్త(లేక అవ్యాకృత)ము నుండి సృష్టి వెలువడిన విధానమును వివరించు చున్న కఠ, ముండక ఉపనిషత్పాఠములను - డా. థీబా - పిమ్మట ఉదహరించెను. అవ్యక్తమును తెలుపు పాఠమును గాని తరువాత సిథులను తెలుపు పాఠములుగాని - జ్ఞానము వలన నిర్మూలింపబడు భ్రమలుగా ఉపనిషత్తులందెక్కడ లేదని డా. థీబా వ్రాసెను. డా. థీబా వ్యక్తముచేసిన యీ అభిప్రాయమును - అతడే బృహదారణ్యక ఉపనిషత్తును గురించి చెప్పిన అభిప్రాయముతో సమన్వయముచేయుట దుస్సాధ్యము. అట్లే మే మిదివరకే ఛాందోగ్య ఉపనిషత్తుల గురించి వెల్లడించిన భావముతో కూడ. కాని డా. థీబా కఠోపనిషత్తుని గురించి (I–3.10) వ్రాసిన దానిని పరిశీలింతము.

అయితే కఠోపనిషత్తున తరువాత శ్లోకమునందే అవ్యక్తము(I3–11) పురుషుని నుండి వెలువడినదని చెప్పబడుట డా. థీబా విస్మరింపరాదు. చైతన్యవంతమైన ఆత్మనుండి జడపదార్థ మెట్లు ఉత్పన్నమగును? (ఒక భౌతిక పదార్థము మరొక భౌతికపదార్థమునుండివలె) (ఉదాహరణకు మన్నునుండి కుండ వచ్చినట్లు) ఇది అసాధ్యము. నిజముకాని రజతము ముత్తెపుచిప్పనుండి ఉత్పన్నమైనట్లే యిదియు భ్రమజనితమని గుర్తింపవలెను. అంతేకాదు, ఈ కఠోపనిషత్తే తరువాత స్పష్టముగా జగత్తు భ్రమజనితమని జగత్తులో చిన్న చిన్న ఘటనలను సత్యమనుకొను వానిని ఖండించినది.

"నేహ నా నా స్తి కించన, మృత్యోస్స మృత్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి" (ఇందు అనేకత్వ బీజము కూడ ఏ మాత్రము లేదు. దీనిని అనేక విభేదయుతముగా చూచువాడు మృత్యువునుండి మృత్యువునకు పోవును (II–1–11).

(సశేషము)

## "ఆత్మజ్ఞం హి అర్చయేత్ భూతి కామః"

ఐశ్వర్యాదులను వాంఛించువాడు బ్రహ్మనిష్ఠుడైనట్టి ఆత్మజ్ఞానిని అర్చింపవలె నని ముండకోపనిషత్తు చెప్పుచున్నది. శ్రుతివాక్యము దానికి శాంకరభాష్య మిట్లున్నవి.

యంయంలోకం మనసా సంవిభాతి
విశుద్ధ సత్త్వః కామయతే యాంశ్చ కామాన్ ।
తంతం లోకం జయతే తాంశ్చ కామాన్
తస్మాదాత్మజ్ఞం హ్యర్చయేద్భూతి కామః

(ముండకోపనిషత్ 3-1-10)

శాంకరభాష్యమ్: య ఏవం ఉక్తలక్షణం సర్వాత్మానం ఆత్మత్వేన ప్రతిపన్నస్య సర్వాత్మత్వాదేవ సర్వావాప్తి లక్షణం ఫలమాహ—యంయం లోకం పిత్రాది లక్షణం మనసా సంవిభాతి సంకల్పయతి మహ్యం అన్యస్మైవాభ వేదితి। సవిశుద్ధ త్వః క్షీణక్లేశః ఆత్మవిత్ నిర్మలాంతః కరణః కామయతే యాంశ్చకామాన్ ప్రార్థయతే భోగాన్ తస్మాత్ విదుషః సత్యసంకల్పత్వాత్ ఆత్మజ్ఞం ఆత్మజ్ఞానేన విశుద్ధాంతఃకరణం హ్యర్చయేత్ పూజయేత్ పాదప్రక్షాలన శుశ్రూషా నమస్కారాదిభిఃభూతి కామో విభూతికామః। తతః పూజార్హ ఏవాసౌ॥

"సర్వవ్యాపకమైన పరమాత్మను ఆత్మరూపమున సాక్షాత్కరించుకొనిన బ్రహ్మవేత్తకు సమస్త కోరికలు సిద్ధించుచున్నవి. ఆ నిర్మలాంతఃకరణుడు ఏయే లోకములను, ఏయే భోగములను తనకుగాని, తన భక్తులకుగాని కోరుచున్నాడో— అవి యన్నియు పొందబడుచున్నవి. కనుక ఐశ్వర్యకాముడు ఆత్మజ్ఞాన సంపత్తి కలిగిన యతిని పాదప్రక్షాళన శుశ్రూషా నమస్కారాదులద్వారా పూజింపవలెను. అనగా బ్రహ్మవేత్త తప్పక పూజింప తగినవాడు."

సవేదైతత్పరమం బ్రహ్మధామ
యత్ర విశ్వం నిహితం భాతి శుభ్రమ్
ఉపాసతే పురుషం యేహ్యకామా
తేశుక్రమే తదతి వర్తన్తి ధీరాః (ముం. 3-2-1)

సర్వోత్కృష్టమగు నా బ్రహ్మము సర్వకామముల కాశ్రయము. ఈ సమస్త జగత్తు దానియం దర్పితమై యున్నది. బ్రహ్మము స్వయంప్రకాశము. దానిని తెలిసికొనిన పురుషుని నిష్కామ భావనతో పూజించిన జన్మరాహిత్యము కలుగును.

బ్రహ్మను తెలిసినవాడు బ్రహ్మమేగాన బ్రహ్మోపాసనవలన కలుగు ఫలము బ్రహ్మ విదుని ఉపాసించుటవలన కూడ కలుగును.”

ఇట్లే “బ్రహ్మ విదాప్నోతిపరం।....బ్రహ్మణావిపశ్చితేతి” అని తైత్తిరీయోప నిషత్తునందు (2-1) “సయోహవై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవభవతి” (ముం. 3-2-9) చెప్పబడినది. ఛాందోగ్య ఉపనిషత్తునందు ద్వితీయ ఖండమంతయు బ్రహ్మవేత్త సంకల్ప బలమును సూచించును.

యంయం కామయతేసోఽస్య సంకల్పాదేవసముత్తిష్ఠతి। తేన సంపన్నో మహీయతే! (ఛాం. 8- - 0).

ఇట్లు బ్రహ్మవేత్త నారాధించినవారికి అష్టైశ్వర్యములు కలుగునని ఉపనిష త్తులు మరల మరల చెప్పినవి. అష్టైశ్వర్యములనగా ‘విభూతిర్భూతిరైశ్వర్యమణి మాదికమష్టధా” అని అమరకోశము. అణిమాది అష్టసిద్ధులు (అణిమా మహిమాచైవ గరిమా లఘిమాతథా! ప్రాప్తిః ప్రాకామ్యమీశిత్వం వశిత్వంచాష్ట భూతయః) భూతి శబ్దముచేత చెప్పబడినవి. అష్టైశ్వర్యము లనగా దాసులు, భృత్యులు, సుతులు, బంధువులు, వస్తువులు, వాహనములు, ధనములు, ధాన్యములు, (దాసో,భృత్యస్సుతో బంధుః వస్తువాహనమే వచ। ధనధాన్య సమృద్ధిశ్చాష్టభోగాః ప్రకీర్తితా) ఇందన్నియు బ్రహ్మవేత్త నుపాసించినందువలన లభించును. అష్టకష్టముల నివారణకు కూడ బ్రహ్మవేత్త నుపాసింపవలెను.

ఇందుచేతనే బ్రహ్మ విద్వరిష్ఠుడైన వ్యాసుని పూజ. వ్యాసపరంపరలో బ్రహ్మవిద్యా వ్యాఖ్యాన సింహాసనాధిష్టితులైన శ్రీ శృంగేరీ జగద్గురువులకు భిక్షా వందనము పాదపూజలు చేయుట.

---

## వ్యాసభగవానుడు

శ్రీమన్నారాయణుడు వ్యాసరూపముతో అవతరించి వేదములను వింగడించి పురాణములను మహాభారతమును రచించి బ్రహ్మసూత్రములను కల్పించి మన సంస్కృతికి నాగరికతకు మన తత్త్వ దార్శనిక చింతనకు రూపులు కట్టి దిద్దెను. నిజ మునకు మన సంస్కృతి, నాగరికత వ్యాసభగవానునికే నేటికిని ఋణపడియున్నవి. ఇందు సందేహమునకు అవకాశమే లేదు.

మన మతమునకు ప్రధానమైన ప్రమాణములు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత. వీటియందు బ్రహ్మసూత్ర భగవద్గీతలను వ్యాసుడే రచించెను. ఉపనిషత్తులకు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత మూటికి ప్రస్థానత్రయమని పేరు. వీటికి సనాతన ధర్మమునకున్న అన్ని శాఖలవారు వేరు వేరు భాష్యములు వ్రాసికొనిరి.

బ్రహ్మసూత్రముల కిన్ని వ్యాఖ్యానము లున్నవికదా! శాంకర, రామానుజ, మాధ్వ వ్యాఖ్యానములు ప్రధానమైనవి మాత్రమేకాక మరికొన్ని కలవు. ఈ వ్యాఖ్యాన భాష్యములలో నిజముగా వేదవ్యాసుని అభిప్రాయమును తెలుపు వ్యాఖ్యానమేది? ఈ వ్యాఖ్యానములలో ప్రతి వ్యాఖ్యానమును తన దృష్టియే సరియైన దనియు మిగిలిన వ్యాఖ్యానము లన్నియు తప్పుగా నున్నవనియు ఉద్ఘాటించినది.

నిష్పాక్షికముగా—పరిశీలించినచో సత్యము విశదము కాగలదు.

శ్రీమన్నారాయణుని అవతారమైన వ్యాసుడు రచించిన సూత్రములకు పరమేశ్వరావతారమైన శ్రీ శంకరులు సూతసంహిత ఆధారముగా భాష్యమును రచించిరి. నిష్పాక్షికులైనవారే వ్యాఖ్యాన భాష్యముల యాథార్థ్యమును నిర్ణయింపవలెను. కపిల, కాణాద, గౌతమ, పతంజలి, జైమిని తంత్రము లిందుకు తోడ్పడును. వ్యాస తాత్పర్య నిర్ణయమున కివి సాయపడును. కపిలుడు శంకరుని కేవలాద్వైతమునే ఒల పరచెను.

వశిష్టమహర్షి పౌత్రుడైన పరాశరునికి మత్స్యగంధి యందు వ్యాసమహర్షి సద్యోగర్భమున జన్మించి అజన్మ విద్యాసిద్ధుడై ప్రకాశించెను. ఆయన జగదుద్ధరణకు నిత్యకృషి చేసెను. అందులకే అసంఖ్యాకములైన మహారచనలు చేసెను. మానవజీవితమునకు ఆదర్శములైన గుణములను ఆయన తన రచనలో కథా వ్యాఖ్యాన రూపమున ప్రవచించెను, మహాభారతమున ప్రవచించినది ధర్మము.

వ్యాసమహర్షి కుమారుడు అవధూతయైన శుకమహర్షి. ఆయన మూలమున బ్రహ్మవిద్యాసంప్రదాయము అవిచ్ఛిన్నముగా విస్తరించినది. పరమహంస సన్న్యాసులు వ్యాసపూర్ణిమనాడు చేయు వ్యాసపూజా విధానమునందొక రామణీయకత కలదు. పూజాపీఠమున మధ్య శ్రీ గోవిందుడు. చుట్టును చతుర్వ్యూహమూర్తులు. వాటి చుట్టును దేవతారూపములు, మహర్షులు, ఆచార్యపరంపరా పురుషులు. ఇట్లున్నను దానికి వ్యాసపూజ యనియే పేరు.

వ్యాసునిబట్టియే ఆయనకు పూర్వమున్న మహాత్ములతో మనకు సంబంధము. వ్యాసుడే తత్సకలమును గ్రంథస్థము చేసినది. మన మతమును, మన సంస్కృతిని పునరుజ్జీవితము చేసి గ్రంథస్థముచేసి రూపస్థిరత్వము కల్పించిన దాయన. ఆయనయందు మన ఋణము తీర్చరానిది.

ఆయనయందు కృతజ్ఞతా సూచకముగా వ్యాసపూర్ణిమ పూజలు. దానికి గురుపూర్ణిమ యని పేరు.

---

(ఈ నెల వ్యాసపూర్ణిమ (17-7-81) సందర్భముగా యీ వ్యాసము ప్రకటన. —సంపాదకుడు)

# పాఠకులతో గోష్ఠి (2)

**(పాఠకులు పంపిన ప్రశ్నలకు సంపాదకుడు సమాధానా లీ పుటలో ఉన్నవి. పాఠకులు పంపే ప్రశ్నలతో తమ చందా నెంబరు తెలుపవలెను. వచ్చిన ప్రశ్నలకు వీలువెంట సమాధానములు వ్రాయబడును. —సంపాదకుడు)**

ప్రశ్న: నే నొక మంత్రోపదేశము పొందాను. అంతకుముందు అప్పుడప్పుడు సంధ్యావందనం చేస్తూ ఉండేవాడను. ఇప్పుడది వదలి ఉపదేశం పొందిన మంత్రాన్ని జపం చేస్తున్నాను. ఒకరు ఇట్లా చెయ్యడం సమంజసం కాదన్నారు. మీ సలహా ఏమిటి? (స. వి.)

సమాధానం: ఏమి చేసినా—(నిత్యనైమిత్తిక కర్మలు) ముందు సంధ్యావందనం చేసితీరాలి. సంధ్యావందనం బ్రాహ్మణులకు మాత్రమే కాదు. అన్ని వర్ణములవారికిన్నీ ఉన్నది. అయితే విధానంలో తేడాలు ఉన్నవి. ఎవరైనా ముందు సంధ్యావందనం చేసిన తరువాతనే యితర మంత్ర జపాలు చెయ్యాలి. లేకపోతే ఫలించదు. నీరు పొయ్యకుండా నేలలో బీజావాపనం చేసినట్లే.

అయితే ప్రతిదానికీ ఏదో ఫలం ఉండాలి కాబట్టి—సంధ్యావందన రహిత అన్యమంత్ర జపానికి కూడా కొంత ఫలం ఉండితీరాలని అర్థవాదం చేయవచ్చు. సక్రమముగా సంధ్యావందనం చేసిన పిమ్మట అన్యమంత్ర జపాలు చేస్తే ఫలితం అధికాధికమని చెప్పవచ్చు గదా. 'దేహో దేవాలయః ప్రోక్తః'—ఆ దేవాలయాన్ని సంధ్యావందన క్రియవలన పరిశుద్ధము చేసి దేవతా ఆహ్వానయోగ్యము చేయవచ్చును కదా.

కాబట్టి అందరును శాస్త్రవిహితమైన సంధ్యావందనమును కావించి పిమ్మటనే తపస్య జపాదులు చేసికొనవలెను.

ప్రాతఃకాల సంధ్యావందనమును కావించి శుచియై, సంకల్పము చేసికొని— పిమ్మటనే ఆయుష్కర్మ చేసికొను ఆచారము కూడ కొందరు పాటించుచున్నారు.

(సంపాదకుడు.)

---

# అవరోహణ, ఆరోహణ గురువులు

పెద్దలను సేవించి జ్ఞానము సంపాదించుటవలన అధర్మమును వదలిపెట్టి ధర్మమైన మార్గమును అవలంబించుటకు వీలుపడును. జ్ఞానచోదిత మార్గము ధర్మమార్గము. భగవంతుడైన పరమశివునికి వాహనమైన నంది ధర్మమునకు సాంకేతిక రూపము. ఆయన వహించుచున్నది అనంతమైన వాత్సల్యమూర్తిని. ఆ వాత్సల్యమూర్తికి తన శక్తితో నిరంతర అవినాభావము. పరమశివునివామ పాదము అపరజ్ఞానము. దక్షిణ పాదము ప్రజ్ఞానము. అపరజ్ఞానము సాధనవలన ప్రజ్ఞానముగా పరిణమించును. గురువు పరమేశ్వరునివామ దక్షిణపాదముల సంయుక్తరూపమే.

సామాన్య ఉపాధ్యాయుని కుండవలసిన మంచి గుణము లన్నియు అవిద్యా నిర్మూలనముచేయు గురువునకుండవలసినదే. ప్రగాఢమైన విద్వత్తు—ఓర్పు—వాత్సల్యము మొదలగునవి. ఇవిగాక మరెన్నియో సద్గుణములు.

గురువులు అవరోహణ—ఆరోహణ—స్థితులవారని యొక వర్గీకరణము. భగవంతుడు లోక సముద్ధరణ కార్యనిర్వాహణమునకై మహాత్ములను లోకమునందు అవతరింపచేయగా వచ్చినవారు అవరోహణ గురువులు. ఆరోహణ గురువులు సాధనా బలముచేత ఉన్నత కక్ష్యలను సాధించుచున్నవారు.

కొన్ని సిద్ధులను—ఇంద్రజాల శక్తులను—సంపాదించి తామే భగవంతుడనని ప్రచారము చేసికొనుచున్నవారినుండి తప్పుకొనవలెను. వారు అసంప్రదాయిక సిద్ధాంతములను ప్రచారము చేయుదురు. అట్టివారి వలలో పడిపోయినవారు తమతో మరి కొందరిని పాడుచేయుదురు. వేదవ్యాసుడు, శ్రీ శంకరభగవత్పాదులు, శ్రీ విద్యారణ్యులు—యిటీవలి కాలమున శ్రీ చంద్రశేఖర భారతీ మహాస్వామి మొదలగువారు అవరోహణ గురువులకు నిదర్శనములు.

శ్రీ చంద్రశేఖర భారతీ మహాస్వామి చరణులు నిరంతర ఆత్మధ్యానము—స్వస్వరూపాను సంధానముచేయు మహాత్ములు. ఆయన మిక్కిలి కృపాళువు. వాత్సల్య

మూర్తి. సామాన్యులందు అపారమైన కరుణావారిధి. అతి సామాన్యులకు కూడ మేలు చేయగోరి ఆయన అతి సులభమైన సాధనా మార్గమొకటి వెల్లడించిరి.

ప్రతివారు సూర్యోదయమునకు ముందుగనే నిద్ర మేల్కొనవలెను. కాల్యకరణీయములను నిర్వర్తించుకొని—చల్లని నీటితో శిరస్స్నానము చేసి—ప్రారంభము కానున్న దినమున తన్ను సన్మార్గమునుండి దూరము కాకుండ కాపాడుమని భగవంతుని—తనకు వచ్చిన మాటలతో—ప్రార్థింపవలెను. ఈ ప్రార్థన మానసిక ఏకాగ్రతతో—త్రికరణశుద్ధిగా చేయవలెను. ఇట్లు ప్రార్థన చేయు సమయమున భగవంతుని మూర్తిపై లక్ష్యముంచుకొనవలెను. ధ్యాన శ్లోకాదులందు చెప్పబడిన మూర్తులపై మనస్సు నిల్పుకొన కష్టమగునేని—తనకు పరిచయమై గౌరవాస్పదమైన-తల్లిగారి మూర్తినో—తండ్రిగారిమూర్తినో—లక్ష్యముగా నిలుపుకొనవలెను.

రాత్రి నిద్రకు పోవులోపల—ఒక పర్యాయము—తాను చేసిన పనులను గుర్తు చేసికొని—ఏవైనవాటిని మెరుగు చేసికొనుటకు అస్కారమున్నదాయని విచారణ కావించుకొనవలెను. ఇట్టి సులభ మార్గమును శ్రీ చరణులు తెలిపిరి.

ఆయన జీవితవిధానము అతి సామాన్యమైనది. అందరియందు వాత్సల్యము ఆయనకు సహజము. ఒకసారి ఆయనను దర్శించినవారికి విశ్వాసము కలుగుచుండెడిది.

ప్రాథమికముగా యెదురగుచున్న కష్టములను ఓర్పుతో—భగవదర్పిత బుద్ధితో భరించుట. తరువాత ఈశ్వరానుగ్రహము—అట్టి వానికి—తప్పక లభించును.

---

## "యతులవలన సమాజమునకు ప్రయోజనమేమి?"

యతులనగా సన్న్యాసులు. గృహమునందుకూడ నుండక—దేశ సంచారము చేయుచు—శరీర శ్రమచేయక, ఇతరు లొసగు భిక్షపై ఆధారపడి బ్రతుకుచు—. జీవితము గడుపు సన్న్యాసులవలన సంఘమున కేమి ప్రయోజనము? ఈ ప్రశ్నను గృహస్థు లప్పుడప్పుడు ఉద్ఘాటించుట వినుచున్నాము.యతీశ్వరుల నేల పూజింపవలెను? వారి గొప్పతనమేమి? వారును సామాన్య మానవులవలెనే కన్పించుచున్నారు కదా! వారికిని సామాన్య మానవుల కున్నట్లే శారీరక ధర్మము లున్నవి కదా! ఈ ప్రశ్నలన్నిటికి శాస్త్రములందు సముచిత సమాధానము లున్నవి.

యతులను దర్శించుటవలన, పాదములను స్పృశించుటవలన సమస్త పాతక

ములు నశించుచున్నవని, కావున యతులు సర్వకాలములందు పూజింప తగినవారని సూతసంహిత యందున్నది. (దర్శనాత్ స్పర్శనాత్తస్య సర్వం నశ్యతిపాతకమ్। తస్మాత్సర్వేషు కాలేషు పూజ్యః సన్న్యాసమాశ్రితః। సూ.సం. 78). సూతసంహితను పదునెనిమిది పర్యాయములు పారాయణచేసి శ్రీ శంకరభగవత్పాదులు భాష్యత్రయమును రచించిరని ప్రతీతి.

భాగవతమునందు సన్న్యాసులు బ్రహ్మిష్ఠులని శాంతులని లోకపావనులని కలదు. (సాధవో న్యాసినః శాంతాః బ్రహ్మిష్ఠాః లోకపావనాః. భాగవత 9-26) హరంత్యఘం తేఽఙ్గ సంగాత్ తేషాస్తే హ్యఘభిద్ధరిః— సన్న్యాసులే సాధువులు. ఇది ముఖ్యార్థము. సాధునాం దర్శనం పుణ్యం స్పర్శనం పాపనాశనమ్ సంభాషణం కోటితీర్థం వందనం మోక్షదాయకమ్. సాధువుల దర్శనము పుణ్యఫలదమట. స్పర్శ పాపనాశనకరమట. వారితో సంభాషణ కోటి తీర్థాటనఫలదాయకమట. వందనము మోక్షదాయకమట.

యతులను దర్శించుటవలన, స్పృశించుటవలన, వారితో సంభాషించుటవలన, వారిని పూజించుటవలన తత్‌క్షణమే పవిత్రుడగును. కాశీపుర సమీపమున గంగానదిలో మునిగిన వెంటనే పవిత్రుడగునట్లే నిదియును.

దర్శనాత్ స్పర్శనాత్ చైవ భాషణాదర్చనాద్యతేః
తత్‌క్షణాదేవపూతః స్యాత్ కాశ్యాగంగోదకేయదా॥
(ఇది గీతామహాత్మ్యమునందున్న శ్లోకము)

లోకమున యతులను దర్శించి, స్పృశించి మనస్సులందున్న కల్మషములను పోగొట్టుకొని నిర్మలత్వమును పొందినట్లుగా శాస్త్రములందు భగవద్గీతను చూచి, స్పృశించి చిత్తశుద్ధిని పొందుదురు. (యథాలోకే యతిం స్పృష్ట్వాదృష్ట్వాచైవ మనశ్శుచిః).

యతిని దర్శించినందువలన మానవుడు నిష్పాపుడగును (పాపము పోగొట్టుకొన్నవా డగును). యతికి భిక్షమొసంగినచో అశ్వమేధయాగ మొనరించినంత ఫలము కలుగును. యతికి నమస్కరించి కోరికతో దర్శించినచో రాజసూయయాగ ఫలము లభించి తన్మూలమున కోరిక తీరును. (సన్న్యాసి నశ్చస్పర్శేన నిష్పాపోజాయతేనరః। భుక్త్వా సన్న్యాసినం లోకాశ్చాశ్వమేధ ఫలం లభేత్। నత్వాచకామతో దృష్ట్వా రాజసూయ ఫలం లభేత్).

సన్న్యాసుల పాద స్పర్శవలన ధరిత్రి పవిత్రమగుచున్నది. తీర్థములును పవిత్రము లగుచున్నవి. అదెట్లనగా వ్రజభూమి వైష్ణవ అవతారమైన శ్రీకృష్ణునివలన

పవిత్రమైనట్లు. (సన్న్యాసినఃపదస్పర్శాత్ సద్యః పూతావసుంధరా। సద్యపూతాని తీర్థానివైష్ణవస్య యథావ్రజః) పరీక్షన్మహారాజు ప్రాయోపవేశము చేయుచున్న స్థలమునకు పెక్కుమంది మునులు సశిష్యులై భూమిని పవిత్రము చేయుచు వచ్చిరి. తీర్థాటనమన్న మిషతో వారు తీర్థములను పవిత్రము చేయుటకే తీర్థ సంచారము చేయుదురు. వారే ఆ యా తీర్థస్నానాదులవలన తీర్థములను పవిత్రము చేయుదురు కాని వారు పవిత్రులగుటకు కాదు. వారు నిత్యపవిత్రులు (తత్రోపజగ్ముః భువనం పునానా, మహానుభావా మునయస్సశిష్యాః। ప్రాయేణతీర్థాభిగమాపదేశైః॥ స్వయంహి తీర్థాని పునంతి సంతః। ఇట్లు లోకమును పవిత్రము చేయుచు, కామితార్థముల నిచ్చు దేవతా మూర్తులైన యతుల యొక్క ప్రయోజనము సమాజమున కెంతయైన నున్నది.

---

## అవతారములు

ప్రతి యుగమునందు ధర్మసంస్థాపనకై భగవంతుడు అవతరించుచున్నాడు. ఆయన అవతరణ అవతారకృత్యములు దివ్యమైనవి. ఆయన అవతార రహస్యముల నెరిగినవా రాయనను చేరుదురని భగవద్గీత చెప్పుచున్నది (4-8, 9). ప్రతి అవతారమున కొన్ని కొన్ని అద్భుతము లున్నవి. మన బుద్ధి తర్కమునకవి అందవు. అవతార కృత్యములను హేతువాద దృష్టితో పరిశీలింప ప్రయత్నించినవాని కంతయు గగ్గోలుగ తోచును. అప్పు డతనికి శాంతి తగ్గును.

తపశ్చర్య ప్రారంభించినప్పు డట్లే తోచును. అప్పుడు గురువు కావలయును. ఈ సందర్భమును పురస్కరించుకొని వాగ్గేయకారరత్నము త్యాగరాజు చక్కగా పాడెను. "ఒకని గుణములు, పుణ్యములు—ఎంతవైనను తన మానసిక క్షోభయన్న మహారణ్యమును దహించుటకు సద్గురువు సహాయము లేక జ్ఞానలాభమును పొందుటకు వీలులేదు. రామాయణమహాభాగవత గ్రంథముల నెంత పఠించినప్పటికి—భగవంతుడు భూలోకమున స్వీకరించిన అవతారములను గురించి తత్త్వ రహస్యమెరిగిన వారి సహాయము లేకపోయినచో— తెలియున దేమియు లేదు. నాదసరసీరుహభృంగమైన నారదమునీ! నిన్ను శరణువేడుచున్నాను. నన్ను దీవించి నా మానసిక తాపమును తీర్పుము" ('గురువు లేక'—"బుద్ధి రాదు"—"శ్రీ నారదనాదా"—"నారద గురుస్వామి"—కీర్తనలు.)

కబీరుదాసు కూడ నిట్లే పాడెను. (సాధో - సో - సద్గురు - " "సోదరా— నా హృదయము సద్గురువుకై - (నిజమైన ప్రేమతో పాత్ర నింపగలవాని కొరకు - తా నది స్వీకరించి నా కందిచ్చువాని కొరకు - ) తపించుచున్నది. ఆయన నా

కంటిముందున్న తెరను తొలగించి దివ్యదర్శన మనుగ్రహింపకలడు. ఆంతర దివ్య దర్శన మనుగ్రహింపకలడు. ఆంతర దివ్య సంగీతమాయన కృపచేత నా శ్రవణ గోచరమగును.”

త్యాగరాజు మనకొక ఉపదేశము చేయుచున్నాడు. “ఓయి జనులారా! మీరు సీతారాముని, శ్రీకృష్ణుని నామమును పగలు రాత్రి స్మరణ చేయుడు. ఇట్లు చేసినయెడల లభించు ఆనందమెట్టిదో మీ మీ హృదయములే సాక్ష్యము చెప్ప గలవు. (“రామ రామ కృష్ణ”—కీర్తన) కాబట్టి శ్రద్ధాభక్తులతో చేసిన నామ సంకీర్తన-భజన ఫలవంతములే.

భగవంతుని అవతారములను గురించి మనము మనకు తెలిసినంతవరకు గ్రహింతుము. ‘నీటి కొలది తామర’ అన్నారు కదా!

శ్రీ రామావతారమును గురించి త్యాగరాజు బహు రమ్యముగా గానము చేసెను.

“కౌసల్యాదేవికి-కుమారునిగా మాతృప్రేమ చూపించు అవకాశమిచ్చుటకై-‘రామ, రామ’ అని ప్రీతితో పలుమారు పిలుచు అవకాశమును దశరథునికి కల్పించుటకై—నిరంతము సేవించు అవకాశము లక్ష్మణునికి కల్పించుటకై—తాను రామునికి గురువునని విశ్వామిత్రుడు ఆనందపడుటకై—అహల్యకు శాపవిమోచనను కల్పించుటకై - విగ్రహము ధరించిన ధర్మమును శివుని విల్లు స్పృశించుటకై—తన కుమార్తె రామచంద్రుని పాణిగ్రహణము చేయుచుండగా చూచి జనకరాజు పులకించి రాముని హస్తములను పట్టుకొని ఆనందసమాధి పొందుటకై—నారదాది భక్తులు నిత్యకీర్తనలు పాడుకొనుటకై—....త్యాగరాజుని భక్తియే శ్రీ రామావతారము తాల్చినదేమో-” (“శ్రీరామ-రఘురామ-” “చేసిన పెల్ల” కీర్తనలు.)

ఇదే విధముగా శ్రీకృష్ణావతారమును గురించి మననము చేయవచ్చును. ఆయన జగదాకర్షణశీలి, బృందావన సంచారి, వల్లవీజన వల్లభుడు.

ఇట్లు భగవదవతారములను గురించి ఆంతరముగా చింతన-మననము-చేసి-ఆ అవతారము ఆనందరూపమగుట గ్రహించి-ముక్తి సోపానమునపై సాగిపోవచ్చును.

ఇందొక ముఖ్యమైన విషయమున్నది. ప్రతి అవతారమును ఆనందరూపమని చిత్స్వరూపమని సన్మూర్తియని భావించుటే సముచితభావము.

అట్లు కాకుండా—దానికి కొన్ని లౌకిక లక్షణములను అంటగట్టి—ప్రీతులను—అప్రీతులను లక్షించి ఉపాసన చేసినచో ఫలితము భిన్నముగా నుండును. కారణము సువిస్పష్టమే.

ఈ రహస్యమును నర్మముగా వెల్లడించుటకే శ్రీ శంకరభగవత్పూజ్యపాదులు బహుదేవతాస్తోత్రములను రచించి—ఆ యా స్తోత్రములందెల్ల ఆ యా దేవతలకు పౌరాణిక గాథాలక్షిత లక్షణాదులతోపాటు—ఆ యా ధ్యానమూర్తులు సకల కల్యాణ గుణసంపన్నములని, సర్వశక్తి యుక్తములని, విశ్వోత్పత్తి సంస్థితి విపత్తి కరములని, సచ్చిదానంద సాంద్రాకృతులని కూడ స్తుతించిరి. అందుచేతనే ఆయన స్తోత్రములు ఐహికాముష్మిక—ఉభయ—ఫలప్రదాతలు. శతాబ్దములుగా, మంత్రతుల్యములుగా మంత్రములుగా మననము చేయబడి తదుద్దిష్ట ఫల ప్రదాతలగుచున్నవి.

ఇతర శాస్త్రీయులు కొందరు రచించిన స్తోత్రములందు—ఆ యా దేవతలను—నిర్గుణ బ్రహ్మరూపమైన సచ్చిదానందముగా సంభావించుటలేదు. అందుచేత ఆనంద-చరమస్థితికి—హేతువులగుట లేదు.

కేవల ధ్యానము—శ్రీ భగవత్పాదాది మహాత్ముల కృత శ్లోకములతో—కూడ మోక్ష సోపానమే. ఆ ధ్యానింపబడు మూర్తి సచ్చిదానంద రూపమని సంభావన యగునప్పుడని ఉపనిషత్ప్రతిపాదిత సాధన మార్గమే అగుచున్నది. ఉపనిషదర్థానుసంధానమే అగుచున్నది. అది ఆత్మానుసంధానము అనగా స్వస్వరూపానుసంధానము. మోక్షసాధన సామగ్రియందు గరీయసిగా శ్రీ భగవత్పాదులు చెప్పిన భక్తి యిదే. ఇది అందరకు సులభసాధ్యము. అవలంబనీయము.

---

## మానసిక ఏకాగ్రత

మనస్సు సహజముగా చంచలమైనది. అందుకనియే అర్జునుడు పరమాత్మతో 'చంచలంహి మనః కృష్ణ' అని వాపోయినాడు. దేనినిగాని సాధింపదలచినచో మనస్సును చంచలము కాకుండ అరికట్టి యుంచవలెను. మనస్సు అన్యథా చలించుటను జాగ్రత్తగ నిరోధింపవలెను. ఘనమైనదానిని సాధించుటకు పూనుకొన్నప్పుడు అల్పమైన లాభముల కొరకు ప్రయత్నములు విరమించవలెను. మూర్ఖమైన మొండితనమును త్యజింపవలెను.

నరజన్మయొక్క సాఫల్యము ముక్తిలాభమునందున్నది. దానిని సాధించుటకు ముండకోపనిషత్తు "ఉపనిషత్తును బలమైన కోదండముగా గ్రహించి దానిపైన మహాస్త్రశరముగా దీర్ఘ ధ్యానమునుంచి—బ్రహ్మచింతన చేయుచున్న మనస్సుతో దానిని లాగినచో నీవు లక్ష్యమును కొట్టగలవు" అన్నది. (ధనుర్ గృహీత్వౌపనిషదం సందధీత ఆయమ్యతద్భావగీతేనచేతసాలక్ష్యం తదేవ అక్షరం సోమ్యవిద్ధి.)

ఈ ఉద్ఘాటనయందు సాధన సోపానములన్నియు కలవు. గురువుకడ ప్రగాఢ

మైన విద్యాభ్యాసము (శ్రవణము)—దీర్ఘమైన మననము ధ్యానము—(భగవద్గీతలో వివృతము) బ్రహ్మపరమైన నిది ధ్యాస.

జీవిత విధానమున మానసికమైన వ్యగ్రతవలన ఒడుదుడుకులు లేకుండనుండుట మానసికమైన ఏకాగ్రతతోనే అవలంబింపవలెను.

(మన్మనాభవ మద్భక్తోమద్యాజీమాం నమస్కురు

మామే వైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోఽసిమే—గీ. 18-65)

ధ్యానము అవిచ్ఛిన్న తైలధారవలె విరామహీనముగా నుండవలెను.

లౌకిక లక్ష్యముల విషయమునందుకూడ—తన అభిరుచినిబట్టి లక్ష్యమును నిర్ణయించుకొని శ్రద్ధతో సాధించుకొనవలెను. తనకు యోగ్యత లేనిదానికై ప్రయత్నించుట నిరర్థకము. ధర్మయుక్తమైన ప్రవర్తన చాల ముఖ్యము. ఇంద్రియ నిగ్రహము కల బ్రహ్మచారికి మానసిక దృఢత్వమెక్కువ. భౌతికవిజ్ఞాన శాస్త్రజ్ఞులెందరో మానసిక స్థిరత్వము కలిగి పట్టుదలతో ఏకాగ్రతతో పరిశీలనలు చేసి లక్ష్యసిద్ధి సాధించినవారు. ప్రయత్నము విషయమున పరిశుద్ధి ప్రగాఢత్వము కూడ అవసరములే.

క్షీరసాగర మథనము జరిగినప్పుడు మన పురాణగాథల ప్రకారము రాక్షసులు తమ శత్రువులైన దేవతలతో కలసి—ఇరువురకు కావలసిన అమృతమునకై—కృషి చేసిరి. మధ్యలో అవాంతర భోగవస్తువులవలన వారి లక్ష్యశుద్ధి దెబ్బతినలేదు. దేవతలా వస్తువులకై పరితపించిరి. చివరకు రాక్షసులు అమృతభాండమును లాగుకొనిరి. చివరకు భగవంతుడు కల్పించుకొని వారియొక్క బలహీన గుణమైన మోహమును ఉపయోగించి వారిని లోబరచుకొనెను. ధర్మదృష్టి, ఆదరములేని క్రూరుల—దుష్టుల చేతిలో శక్తి చిక్కనేని లోకములకు ముప్పు వాటిల్లెడిది. నేటి రాజకీయ పరిస్థితుల కీ గాథయందెన్నియో సూచనలు.

ధర్మము, న్యాయము పాటించకుండ రాజకీయవాదులు తాము అధికార లాభమునకై—ఏదియేని చేయుదురు. అయితే వారి ఏకాగ్రత ప్రశంసనీయమైనది గాదు.

అయితే లోకమున జీవించుచున్నందువలన—శ్రేయస్సాధకుడు—తనతోటి వారలందరు తనకున్న కర్తవ్యమును—ఎట్టి పరిస్థితిలోను విస్మరింపరాదు. భగవద్గీతా సందేశమిదియే. తానేదో గొప్ప సాధకుడ ననుకొని—యితరులను న్యూనతగా చూచుటవలన తనకే నష్టము. ఇదే వివేకముతో కూడిన స్వార్థలాభ దృష్టి. స్థితప్రజ్ఞుడు లోకమందుండి తన కర్తవ్యము లన్నిటిని నిర్వహించును—తాను మాత్రము లౌకికుడు—లోకమువాడు—మాత్రము కాడు.

---

# శ్రీ జగద్గురు చరణుల చాతుర్మాస్య వ్రతము

మహేశ్వరపూజ సర్వదేవతా పూజకు తుల్యమైనది. ఐశ్వర్యార్థి భూతికాముడు బ్రహ్మనిష్ఠుని సేవింపవలెనని శ్రుతి ఉద్ఘోషించుచున్నది. అట్టి పూజ చాతుర్మాస్య వ్రత సమయమునందైన నెంతటి ఫలము. ఆ యతిశ్రేష్ఠుడు సర్వయతిలోకసార్వభౌముడై బ్రహ్మవిద్వరిష్ఠుడైనచో అనంతఫలము.

శ్రీ భగవత్పాదులచే తొలుత ప్రతిష్ఠింపబడి— ఆయన చేసిన మహామ్నాయ శాసనముల వలన— శ్రీ భగవత్పాదుల యంతటి జగద్గురు పరంపరచే అలంకరింపబడిన శ్రీ శృంగేరి జగద్గురు శారదాపీఠమును ప్రస్తుతము తేజోభరితము చేయుచున్న శ్రీ చరణులను చాతుర్మాస్యమున పూజించుటకన్న ఈ ఉత్తమోత్తమపూజ మరొకటి లేదు.

శ్రీ శంకరకృప పాఠకుల తరఫున ప్రతి సంవత్సరము భాద్రపద పౌర్ణమి నాడు శ్రీ జగద్గురువులకు భిక్షావందన పాదపూజలు నిర్వహింపబడుచున్నవి. ఈ సంవత్సరము కూడ నట్లే చేయుదమని పాఠకులు కోరిరి.

శ్రీ జగద్గురు చరణులు శిష్యస్వామిసహితులై శృంగేరిలో తుంగాతటస్థ నరసింహ తపోవనమున దుర్మతినామ సంవత్సర చాతుర్మాస్యవ్రతమును ఆషాఢ పౌర్ణమి శుక్రవారము నాడు (17 జులై 1981) ప్రారంభించినారు. భాద్రపద పౌర్ణమి సోమవారము (14 సెప్టెంబరు 1981) చాతుర్మాస్య దీక్షా విసర్జనము. ఆనాడు శ్రీ శంకరకృప పాఠకుల తరఫున శ్రీ చరణులకు పాదపూజ భిక్షా వందనము జరుపబడును. అందుకు గాను పాఠకులు రూ. 6/-లకు తక్కువ కాకుండా తమ తమ విరాళములను యీ క్రింది చిరునామాకు వెంటనే పంపకోరుచున్నాము.

ముందుగా పంపినచో ఏర్పాట్లు చేయుట సుకరమగును.

ఈ హెచ్చరిక ప్రకటనను సెప్టెంబరు సంచికలో చేయబడదు.


ఆకెళ్ల సత్యనారాయణమూర్తి

శ్రీ శంకరకృపా ప్రకాశకుడు

6-3-609/18, ఆనందనగర్,

ఖైరతాబాదు, హైదరాబాదు— 00 004.

# శ్రీ శంకర కృప

సంపాదకులు: తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

| | | |
|---|---|---|
| సంపుటి 21 | శంకరశ్శంకర స్సాక్షాత్ వ్యాసో నారాయణో హరిః | సంచిక 12 |

## శ్రీ శంకర భగవత్పాదాచార్య విరచిత

## శ్రీమత్త్రిపురసుందరీ వేదపాద స్తోత్రము

శ్లో॥ సంతు విద్యా జగత్యస్మిన్సంసార భ్రమ హేతవః ।
భజేహం త్వాం యయా విద్వాన్విద్యయా మృత
మశ్నుతే ॥ 63

(దీనియందున్న వేదపాదము ఈశావాస్య ఉపనిషత్తులోనిది)

తా॥ ఈ జగత్తున సంసారభ్రమహేతువులగు విద్యలెన్నియో నుండిన నుండుగాక. బ్రహ్మనిష్ఠుడైన విద్వాంసుడు ఏ విద్యవలన మోక్షమును పొందుచున్నాడో— ఆ విద్యవగు నిన్ను భజింతును.

విశేషములు: శ్రీదేవి మోక్షవిద్యాస్వరూపిణియట. అనగా జ్ఞానస్వరూపిణి యని—ప్రజ్ఞానఘనరూపిణి యని భావము. 'జ్ఞానాదేవతు కైవల్యమ్' అన్న శ్రుతి ప్రమాణముచేత శ్రీదేవి మోక్షవిద్యారూపిణి యనునప్పుడు జ్ఞానస్వరూపిణి యని చెప్పినట్లగుచున్నది.

మరియు అవిద్యానిర్మూలనమే జ్ఞానము. విద్య.

ఇది వేదాంతవాక్య సమ్మతము. శ్రీ శంకరులు శ్రీ మత్త్రిపురసుందరీదేవిని బ్రహ్మవిద్యారూపిణి–పరబ్రహ్మముగా–సంభావించినారన్నమాట. ఉపనిషన్మతమున నిష్క్రియాత్మకమైనప్పుడు నిర్గుణపరబ్రహ్మము. పురుషుడు క్రియా చలనమైనప్పుడు శక్తి, ప్రకృతి, ప్రకాశవిమర్శాంశములు.

---

# శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి చరణ స్మరణమ్

(గతసంచిక తరువాయి)

## దృఢత్వము

ఒక పర్యాయము శ్రీ జగద్గురువులు సంచారవశమునందొక గ్రామమున నుండిరి. ప్రక్కనే బసచేసియున్న సన్న్యాసి యొకడు గట్టిగా తైత్తిరీయోపనిషత్తును పఠించుచుండెను. ఆయన చదువుటలో చాల తప్పులుండి శ్రీ జగద్గురువులకు క్లేశమును కలిగించెను. ఉపనిషత్తును చదువునప్పుడు స్వరము లోపమున్నను లేక అక్షర న్యూనాతిరిక్తములున్నను చదువువానికి అపకారము జరుగుననుట ప్రసిద్ధము. శ్రీ జగద్గురువులా సన్న్యాసికి ఉపనిషత్తు బదులు శ్రీరామనామ స్మరణము చేయుమని కబురు పంపిరి. ఆ సన్న్యాసి అట్లే చేసెను. సాయంత్రము జగద్గురువుల దర్శనమునకు వచ్చినప్పుడు శ్రీరామనామ జపము చేయునప్పుడు ఉపయోగమునకై జపమాల కావలెనని అర్థించెను. శ్రీ జగద్గురువులు "జపమాల అక్కరలేదు. లెక్కపెట్ట నవసరము లేదు" అని చెప్పిపంపిరి. గమనింపవలసిన దేమనగా శ్రీ జగద్గురువులు సన్న్యాసితో ఉపనిషత్తును తప్పుగా చదువుచున్నట్లు చెప్పలేదు. దానిబదులు మరొకటి చేయుమని మాత్రమే చెప్పిరి. రామనామ జపము నిరంతరము చేయుమని ఉపనిషత్తు జోలికి రావలదని చెప్పినట్లు తోచెను.

తిరునల్వేలిజిల్లా కొట్టరం గ్రామమున ధనిక భూస్వామి స్వామినాథశాస్త్రి యను వాడుండెను. అతడు సంస్కృతమున, ఆగమశాస్త్రమున పండితుడు మాత్రమే గాక గొప్ప సంగీతకారుడు. హరికథా నిపుణుడు. శ్రీ జగద్గురువులు సంచారవశమున ఆ గ్రామమునకు విజయము చేసినప్పు డతని గృహమునకు వెళ్ళిరి. అప్పుడతనిని రుక్మిణీ కల్యాణ హరికథా కాలక్షేపము చేయుమనిరి. అతడు చాల చక్కగా చెప్పి శ్రీ జగద్గురువుల ప్రశంసపొందెను. ఆ కాలక్షేపమున అతడు "శ్రీకృష్ణుని ఆనతి మేరకు దారకుడు రథమునకు శైబ్య, బలాహక మొదలగు గుఱ్ఱములను పూన్చెను" అని చెప్పెను. మిగిలిన రెండు గుఱ్ఱముల పేర్లు ఆ క్షణమున మరచిపోయినట్లుండెను. అప్పుడు శ్రీ జగద్గురువులు "సుగ్రీవ, మేఘపుష్ప" అని మిగిలిన రెండు గుఱ్ఱముల పేర్లను అందించిరి. పౌరాణిక వాఙ్మయముతో శ్రీ జగద్గురువులకు పరిచయము

తప్పక కావచ్చునన్న అభిప్రాయ మా శాస్త్రికి కలదేని—అప్పుడది పటాపంచలయ్యెను.

శాస్త్రి కథ చెప్పుచు ముందునకు సాగెను. "ఆ నాలుగు గుఱ్ఱములును అతివేగము కలవి. వేగమును గురించి చెప్పునపుడు, వాయువేగము, గరుడవేగము, మనోవేగము అని ఉదాహరించుట పరిపాటి. అయితే యిక్కడ నాలుగవ గుఱ్ఱముకూడనున్నది. దాని వేగమును—మనమిప్పుడు 'సంధ్యావందనము' చేయు వేగముతో పోల్చవచ్చును" అనెను. అప్పుడు వినుచున్న వారందరు నవ్విరి.

శ్రీ జగద్గురువులు వారివంక తీవ్రతదృష్టితో చూచి "మీరు సంధ్యావందనము చేయుపద్ధతిని అతడు అపహాస్యము చేయుచున్నాడు. మీరు సిగ్గుపడి తలలు వంచుకొనవలసియున్నది. నవ్వుచున్నారేమిటి?" అనగా వారందరు నిశ్చేష్టితులైరి. శ్రీ జగద్గురువులు శాస్త్రివంక చూచుచు "ఇది నవ్వునకు తగిన విషయము కాదు. జనులు సంధ్యావందనమును సరిగా చేయునట్లు చేయుట నీ అభిప్రాయమైనచో దానికిది పద్ధతికాదు" అనిరి. (సశేషము)

---

# శ్రీ జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణుల ఉపదేశము

మానవునికి వివేచన చేయగల శక్తియున్నది. వివేకమున్నది. అయినప్పటికి విలువైన కాలమును, కృషిని భౌతిక విషయలంపటుడై తనకేదో సుఖము కలుగునని భ్రమతో చరించుచున్నాడు. శరీరమునకు నొప్పి కలిగించువాడైనను శరీరమును కోయు వైద్యుని విశ్వసించుచున్నాడు.

తనకు బాహిరమైన వస్తువేదియు మానవునికి సర్వకాలము ప్రీతిగానుండదు. ఉదాహరణకు తీపివస్తువులను చూడుడు. అతిమూత్రవ్యాధి ఉండినవానికి తీపి వస్తువులు పనికిరావు (డయొబెటిస్) - పూర్వము ప్రీతికరములైనప్పటికి. శ్రీ శంకర భగవత్పాదులు "యస్మాత్ యావత్ ప్రియంసాత్ ఇహ హి విషయ తస్తావదస్మిన్ ప్రియత్వం యావత్ దుఃఖంచ యస్మాత్ భవతిఖలు తతస్తావదేవ అప్రియత్వం" అనిరి. అయితే తనయందు తనకున్న ప్రేమస్వాభిమానము—సకలయితర అనురాగాదుల కంటె బలమైనది. వాటిని త్రోసి రాజనగలది.

యాజ్ఞవల్క్య మహర్షి మైత్రేయితో — "ఆత్మ ప్రీతికొరకే అన్ని

వస్తువులు—భార్య, పిల్లలు, ఐశ్వర్యము—ప్రియమగున్నవి" అని ఉపదేశించెను. ఇతరులపై చూపబడు ప్రేమ వారికి సమ్మతము కాకపోవచ్చును. పంచదశి గ్రంథమున దీనికి ఉదాహరణము చూపబడినది. "గడ్డము మీసములున్న తండ్రి ప్రీతితో బిడ్డను ముద్దిడుకొనగా బిడ్డకు గడ్డము మీసములు గ్రుచ్చుకొని బాధ కలిగింపవచ్చును. అప్పుడు బిడ్డ యేడ్చును. తండ్రి బిడ్డను లాలించుచు మరింత గాఢముగా ముద్దిడు కొనగా బిడ్డకు బాధ అధికమగును. తండ్రికి గల సంతోషము బిడ్డకు లేదు."

ఆత్మహత్య చేసికొనువాడు కూడ ఆత్మనాశనమును కోరి చేయుటలేదా పని. ఏదో బాధను, విపత్కర స్థితిని, ఆందోళనను—తప్పించుకొనుటకే చేయుచున్నాడా పని. (మానబ్భావంహి భూ యాసం)

ఇక మనము నిజమైన సుఖమేమిటని విచారణ చేయకూడదా? ఆత్మకు నిజమైన సుఖమేమిటని విచారణకు ముందు—ఆత్మ-అహం-నేను-అనగా భావమేమిటో తెలియ వలెను. ఆలోచన సాగగా—దేహేంద్రియ అంతఃకరణాదులు ఆత్మకాదని—ఆత్మసత్-చిత్-ఆనందమని స్పష్టమగును.

జాగ్రత్స్వప్నములందు ఒక వస్తువును చూచుటకు చూచువాడు-చూడబడు నది-రెండును కలవు. వస్తువు మారుచుండవచ్చును. చూచువాడతడే. గాఢనిద్రనుండి మేల్కొని "నేను హాయిగా నిద్రపోతిని. ఏమియు తెలియలేదు" అనవచ్చును. ఇది ఒక అనుభవమునకు జ్ఞాపిక. అనుభవిత మారుటలేదు. కాబట్టి ఆత్మ ఉనికిగలిగినదై, చైతన్యవంతమై ఆనందరూపమగుచున్నది. ఇది అనుభవమునకు తెచ్చుకొనుటకు అడ్డు పడుచున్నది అవిద్య. ఆత్మ పూర్ణగుప్తముకాదు. సుస్పష్టమునుకాదు. తెలిసి తెలియని స్థితి. పూర్తిగా తెలియనిదైనచో దానిని గురించిన విచారణసాధ్యమగుగా? పూర్తిగా తెలియబడినదైనచో-యీ విచారణ మరెందుకు?

చెఱువు నీటిపై నాచు వ్యాపించినచో—దానిని కాస్త తొలగించి అడుగు చూచుటకు వీలులేదు. పూర్తిగా తొలగింపవలెను. అదేవిధముగా అవిద్యా విషయమున దానిని పూర్తిగా తొలగించినప్పుడే ఆత్మజ్ఞానలాభము. అందుకు గురూప దేశము కావలెను. గురువు తెలిసినవాడై ఉండవలెను. సాధనామార్గముల విశ్లేషణ చేయగలవాడై యుండవలెను. ఆత్మజ్ఞానికి—సాంద్రానందలాభము కలిగి—ఇంద్రియ సుఖముపై రుచిలేదు.

నిరంతరము ఆత్మవిచారము చేయవలెను. లౌకిక భౌతిక విషయ వాసనా లంపటత్వ లౌల్యములు కాదు.

---

# శ్రీ జగద్గురు భారతీ తీర్థస్వామి చరణాల ఉపదేశములు

## (మదరాసు ఇంటిగ్రల్ కోచ్ ఫ్యాక్టరీ నుండి భక్తులు శృంగేరి వచ్చి దర్శనము చేసినప్పుడు సలిపిన అనుగ్రహ భాషణము)

(గతసంచిక తరువాయి)

మనకున్న అనేక పనుల మధ్య మనము భగవంతుని స్మరింతుము. ఈ సందర్భమునందొక గాథ ప్రచారమునందున్నది. నారదుని కొక గర్వమున్నది. తాను విష్ణుభక్తులందు గొప్పవాడనని. "నాతో విష్ణుభక్తియందు సమానుడెవ్వడున్నాడు? నేను నిరంతరము విష్ణునామ స్మరణము చేయుచున్నాను" అని నారదుని తలంపు. భగవంతుడు చిత్రముగా లీలలు ప్రదర్శించును. మనము ధర్మముగా ప్రవర్తించు చున్నంతవరకు ఆయన పట్టించుకొనడు. మనము త్రోవ తప్పితిమా—ఆయన కల్పించు కొనును. భక్తులకు గర్వము కలిగినదో—ఆయన గర్వభంగము చేయును. నారదునికి గర్వము పెరుగుచుండగా—'నారదుడు త్రోవ తప్పుచున్నాడు—అతనిని సరిదిద్ద వలెను'—అని భగవంతుడు నిర్ణయించెను.

నారదుడు మహావిష్ణువుతో—తాను విష్ణుభక్తులందు గొప్పవాడనని—తాను నిరంతరము విష్ణునామస్మరణ చేయుచుంటినని చెప్పగా—మహావిష్ణువు మందస్మిత ముతో "నీవు భక్తుడవు. చాల బాగున్నది. అయితే నీ కన్న గొప్ప భక్తుడున్నాడు" అనెను. ఈ మాటలకు నారదు డాశ్చర్యపడి అసూయాగ్రస్తుడయ్యెను. తాను ఘనుడననుకొన్న మార్గమున మరొకడు తన్ను మించినవాడున్నాడని వినగా సామాన్యులకు అసూయ కలుగుట సహజమే. అట్టి అసూయ నారదునికే కలిగిన దనగా మనవంటివారి సంగతి యేమి?

నారదుడు మహావిష్ణువుతో 'నా కంటె గొప్పభక్తుడైన వానిని నాకు చూపుము' అని కోరెను. శ్రీమహావిష్ణువు సరిలెమ్మనెను. వారిరువురు ఆకాశమార్గమున బయలుదేరి కొంతదూరము పోగా భూమిపైన నొక కృషీవలుడు కల్పించెను. అతనిని నారదునికి చూపించి మహావిష్ణువు "అతడు గొప్పభక్తుడు" అని చెప్పెను. అతనిని చూచి నారదుడు చకితుడై "మహావిష్ణువు నన్ను ఆటపట్టించుచున్నాడా? ఒక

సామాన్య రైతును చూపి నాకంటె గొప్ప భక్తుడను నేమిటి?" అని తలపోయుచు మహావిష్ణువుతో "భగవాన్. అతనిని నేను పరీక్షించిన పిమ్మటగాని సమ్మతింపను" అనగా మహావిష్ణువు 'అట్లే కానిమ్ము' అనెను.

నారదుడు అతనిని నిశితముగా పరిశీలింప దొడగెను. అతడు ఉదయమున నిద్రలేచి భగవన్నామ స్మరణముచేసి పొలము పనులకు పోవుచుండెను. పని ప్రారంభించుచుండెను. పని ముగించి 'భగవాన్-నీ అనుగ్రహమువలన పని ముగిసినది' అని కృతజ్ఞతలు పలికి గృహమునకు తిరిగి వచ్చుచుండెను. నిద్రపోవుటకు ముందు భగవంతుని స్మరించి సాష్టాంగ ప్రణామములు చేసి పండుకొనుచుండెను. నారదుడు లెక్క పెట్టెను. దినమున కొక అరగంటకంటె అధికకాలమతడు భగవంతుని స్మరించుచున్నట్లు తోచుటలేదనుకొనెను.

నారదుడు భగవంతునికడకు తిరిగిరాగా—భగవంతుడు నారదునితో 'అతనిని పరీక్షించితివా' అని ప్రశ్నించెను. నారగుడు 'పరీక్షించితిని' అనెను. 'అయితే నీ నిర్ణయమేమి?' అని భగవంతుని ప్రశ్న. నారదుడు సమాధానము చెప్పెను—'అతడు దినమున కొక అరగంటకంటె అధికకాలము నిన్ను స్మరించుట లేదు. కాని అతడు నాకంటె గొప్పభక్తుడని నీవు చెప్పుచున్నావు.'

భగవంతుడు "అటులనా? అయితే నేను నీకొక పని చెప్పెదను" అనగా నారదుడదేమనెను. భగవంతుడు నారదుని ఒక బావి సమీపమునకు తీసికొనిపోయి-ఆ బావినుండి యిక్కడకు 100 గజముల దూరము-ఒక కుండనిండుగా నీరు చిందకుండునట్లు తీసికొని రమ్మని ఆనతి చేసెను. 'ఇదియేమి పని' అని తలపోసి నారదుడు బావికడకు పోయి కుండను నీటితో నింపుకొని—చిందకుండ జాగ్రత్తగ తీసికొని వచ్చెను. ఎంత జాగ్రత్తగా తెచ్చినాడనగా—ఆ సమయమున అతని మనస్సునందు మరియొక ఆలోచనయేలేదు. ఒక చినుకు కూడ చిందకుండ చూచుటయందే అతని మనస్సు లగ్నమైపోయెను.

అతడు భగవంతునితో "నీ ఆనతిప్రకారము నీ అనుగ్రహముతో తెచ్చితిని" అనెను, భగవంతుడు—"నిజమే. తెచ్చితివి. నీవు కుండను తెచ్చువేళ నన్నుగురించి తలచితివా?" అని ప్రశ్నించెను. నారదుడు "నీవు ఒక్క నీటిబొట్టు కూడ చిందకూడదని ఆజ్ఞాపించితివి కదా? ఆ సమయమున నేను నిన్ను స్మరించుచున్నచో నీరు చిందిపోయెడిది. నేను నీ ఆజ్ఞను పాటించుట జరుగకుండెడిది" అనెను.

భగవంతుడు "నీకు పని ఏమియులేదు. అందుచేత నిరంతరం నన్ను స్మరించు

చున్నావు. నీకు కొలది నిమిషములసేపు పనియున్నచో అప్పుడు నన్ను విస్మరించు చున్నావు. పని లేనప్పుడు నన్ను స్మరించుటలో ఆశ్చర్యములేదు. ఆ కృషీవలుని చూడుము. అతడెంతో పనియున్నను నన్ను స్మరించుచున్నాడు. నీవు ఘనుడవో—అతడు ఘనుడో—నీవే చెప్పుము" అనెను. నారదుడు తన తప్పు తెలిసికొనెను. 'ఆ కృషీవలుడే నాకంటె గొప్ప భక్తుడు' అని అంగీకరించెను.

ఎన్ని పనులలో నున్నను భగవచ్చింతనము ఆవశ్యకము. ఈ సందర్భముగా-భగవచ్చింతనను గురించి మనపూర్వులెన్నో సంఘటనలను చెప్పిరి. భగవంతుని స్మరించుటవలన అమోఘశక్తి యుక్తముగునని గ్రహింపవలెను. భగవచ్చింతన ప్రాముఖ్యతను గుర్తించి తదవలంబనము చేసినచో జీవితమార్గమున అడ్డంకులుండవు.

మన ఆచార్యులవారు మనకు చక్కని ఉపదేశమిచ్చి సాధనమార్గమును చూపి, అందు జయమును పొందుటకుగాను సాహాయ్యము చేయుటకు సిద్ధముగా నున్నారు. గురుతత్త్వమును గురించి మాటాడునపుడు—భగవంతుని ఆగ్రహము వచ్చినను ఫరవాలేదు—గురువు అనుగ్రహము తప్పకున్న చాలు. గురువు ఆగ్రహము వచ్చినచో కాపాడువాడు లేడు. గురువుయొక్క ఘనత అట్టిది. "యావజ్జీవంత్రయో వంద్యాః వేదాంత గురురీశ్వరః"

భగవంతుని శరణు జొచ్చి నిరంతర గురుశుశ్రూషాపరములు కావలెను. అట్లు కావించినచో మనము శ్రేయోమార్గమున అత్యున్నత కక్ష్యలు సాధించిన వారమగుదుము.

---

# పంచాంగ విశేషములు

## శ్రీ శృంగేరీ జగద్గురు మఠ పంచాంగము ననుసరించి

### దుర్మతి శ్రావణ పాడ్యమి శనివారము (1-8-81) నుండి భాద్రపద బ పాడ్యమి (15-9-81) మంగళవారము వరకు

1-8-81 శనివారము శ్రావణ శు పాడ్యమి

4-8-81 మంగళవారము మంగళ గౌరీవ్రతము (11, 18, 25 తేదీలు)

5-8-81 బుధవారము శ్రావణ శు పంచమి సామవేదోపాకర్మ

6-8-81 గురువారము శ్రావణ శు షష్ఠి సూర్యషష్ఠీ

11-8-81 మంగళవారము శ్రావణ శు ఏకాదశి సర్వేషాం

12-8-81 బుధవారము శ్రావణ శు ద్వాదశి దామోదర ద్వాదశి దధివ్రతారంభం
14-8-81 శుక్రవారము వరమహాలక్ష్మీవ్రతము. శృంగేరిలో ప్రత్యేక పూజ
15-8-81 శనివారము శ్రావణ పౌర్ణమి. హయగ్రీవోత్పత్తి ఆపస్తంబ (యజుర్వేద) ఆశ్వలాయన (ఋగ్వేద) ఉపాకర్మ. రక్షాబంధనము
17-8-81 సోమవారము శ్రావణ బ ద్వితీయ సింహసంక్రాంతి కృతయుగాంతము
22-8-81 శనివారము శ్రీకృష్ణజయంతి, దుర్గాజయంతి. శృంగేరిలో శ్రీకృష్ణ జయంతి ప్రత్యేక పూజలు
23-8-81 ఆదివారము వైష్ణవ శ్రీకృష్ణ జన్మాష్టమి
25-8-81 మంగళవారము శ్రావణ బ ఏకాదశి సర్వేషాం
28-8-81 శుక్రవారము మాసశివరాత్రి
29-8-31 శనివారము శ్రావణ అమావాస్య. అగ్నిసావర్ణికమన్వాది

## సెప్టెంబరు

1-9-81 మంగళవారము భాద్రపద శు తృతీయ షోడశోమావ్రతము తామస మన్వాది. బలభద్ర జయంతి
2-9-81 బుధవారము భాద్రపద శు చతుర్థి. వినాయక చతుర్థి. నేటినుండి భాద్రపద పౌర్ణమి వరకు శృంగేరిలో గణపతి నవరాత్రి ఉత్సవములు. వాకార్థవిద్వత్సభలు
3-9-81 గురువారము ఋషిపంచమి
5-9-81 శనివారము ఆముక్తాభరణ సప్తమి
7-9-81 సోమవారము నందానవమి కేదారనవమి. శృంగేరిలో కేదారనవమి వ్రతము
10-9-81 గురువారము భాద్రపద శు ఏకాదశి సర్వేషాం పరివర్తనైకాదశి. వామన జయంతి. శృంగేరిలో వామనజయంతి ప్రత్యేకపూజ
11-9-81 శుక్రవారము శ్రావణద్వాదశి శక్రధ్వజోత్థాన కల్కి ద్వాదశి క్షీర వ్రతారంభము.
13-9-81 ఆదివారము అనంతపద్మనాభ వ్రతము
14-9-81 సోమవారము భాద్రపద పౌర్ణమి ఉమామహేశ్వర వ్రతము శంగేరిలో ప్రత్యేకపూజ. యతీనాందీక్షా విసర్జన, సీమోల్లంఘన. శ్రీ జగద్గురువుల

చాతుర్మాస్య దీక్షావిసర్జన. మహాలయ పక్షప్రారంభము. శ్రీ శంకరకృప పాఠకుల తరఫున పాదపూజ.

15-9-81 మంగళవారము బార్హస్పత్యాబ్ద ప్రారంభము

---

# సంస్కృతభాషను మనమేల ఆదరించి నేర్చుకొనవలెను? (42)

ఈ ప్రశ్నకు మన దేశంలో మేధావివర్గంలో మూర్ధన్య మనీషామణులు సమాధానాలు చెప్పారు. గత సంచికలందు కొన్నిటిని తెలుసుకున్నాము. ఇప్పుడు మరికొన్ని. (సంపాదకుడు)

## శ్రీ టి. యల్. వెంకటరామయ్యరు

సుప్రీంకోర్టు న్యాయమూర్తి

ఈ దేశమునకు ఉజ్జ్వలమైన భవిష్యత్తు కావలసినచో అది తన సంస్కృతి మార్గములలో ప్రగతి సాధించుటవలననే లభించును. అయితే సంస్కృతము లేకుండా భారతీయ సంస్కృతి ఏమిటి?

ఈ దేశపు యొక్క మహామనీషామణులు వేలాది సంవత్సరములుగా ఆ భాషలో (సంస్కృతమున) తమ భావములను వ్యక్తము చేసి ఒక మహామతమును, తత్త్వదార్శనిక శాస్త్రములను, సాహిత్య వాఙ్మయములను, కళలను నిర్మించిరి, వాటిని—మనముకాదు—మానవ జాతి—పోగొట్టుకొనజాలిన స్థితిలోలేదు.

స్వర్ణోత్సవ సంచిక
మదరాసు సంస్కృత కళాశాల 1956.

## శ్రీ పి. గోవింద మీనన్

న్యాయాధీశ (తరువాత ప్రధాన న్యాయాధీశ) మదరాసు హైకోర్టు

ప్రతిభారతీయుడు మన పురాతన మహాగ్రంథములను గురించి కొంత సామాన్యజ్ఞానము కలిగియుండుట చాల ఆవశ్యకము. అందుకుగాను సంస్కృతభాష యందు వ్యవహారజ్ఞానమును సంపాదింపక తప్పదు. మన యువకులు కాళిదాస భవభూతి మహాకవుల రచనలను స్వయముగా చదివి ఆనందింపగలిగియుండవలెను.

స్వర్ణోత్సవ సంచిక
మదరాసు సంస్కృత కళాశాల 1956.

---

# శ్రీ విద్యారణ్య విజయగాథ



12

శ్రీవిద్యారణ్యులు
శ్రీవిశ్వనాథుని
దర్శించి అభిషే
కాది సేవలు
చేసిరి.

శక్తిపీఠనివాసిని
విశాలాక్షిని,
అన్నపూర్ణాదేవిని
దర్శించి సేవించిరి.



# వేదాంత న్యాయములు (39)

న్యాయములవంటి ఉదాహరణలు)

[వేదాంత శాస్త్రముతో సూక్ష్మవిషయములను బోధచేయుటకు కొన్ని ఉదాహరణలు సాధారణముగా నుపయోగించెదరు. ఈ ఉదాహరణలు నిత్యజీవితమునకు సంబంధించినవిగా నుండి-వీటిమూలమున దుర్గ్రాహ్యమైన సిద్ధాంత విషయములను అవగాహన చేసికొనుటకు తోడ్పడును. ఈ ఉదాహరణలవలన-సునిశిత ప్రజ్ఞావంతముకాని సామాన్యుని మేధస్సుకూడ సిద్ధాంతమును గ్రహింపగల్గును. సామాన్యపాఠకులకొఱకు వేదాంత న్యాయముల వివరణములను క్రమముగా ప్రకటించుచున్నాము. సంపాదకుడు]

## రెండు పక్షులు

ఒక చెట్టుకొమ్మపై రెండుపక్షులు—సహచరులుగా నున్నవి. అందొక పక్షి ఆ చెట్టుయొక్క తీయని పండ్లని తినుచు భ్రాంతియుక్తయగుచున్నది. రెండవపక్షి ఏమియు తినుట లేదు. కేవలము నిరంతర సాక్షీభూతముగానున్నది. ఈ ఉదాహరణము ఋగ్వేదమునందు ముండక ఉపనిషత్తునందు చెప్పబడినది. జీవుడు పరమాత్మ ఒకే దానియందున్నవని, అయితే జీవుడు సంసార సుఖ దుఃఖములను అనుభవించు చున్నాడని, కాని పరమాత్మ-(కూటస్థబ్రహ్మము) సాక్షీభూతముగా నుండి కేవలత్వ నిరూపిలో నుండునని వ్యాఖ్యానము.

---

# శ్రీ మచ్ఛంకర భగవత్పాదాచార్య విరచిత అపరోక్షానుభూతి

### వ్యాఖ్యానము: శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

[గతసంచిక తరువాయి]

అవ (150 శ్లో.) మోక్షమును గురించి చెప్పుచున్నారు.

శ్లో॥ మోక్షస్యనహివా సోఽప్తి న గ్రామాంతర మేవవా
అజ్ఞానహృదయగ్రంథి నాశో మోక్షస్సద్భి రుచ్యతే॥ 151

తా. మోక్షమునకు గృహము లేదుకదా! గ్రామాంతరమునులేదు, గృహాంత రమునకుగాని గ్రామాంతరమునకుగాని పోవుట మోక్షము కాదు. అజ్ఞానరూపమైన హృదయగ్రంథియొక్క నాశమే-అజ్ఞాననాశమే-మోక్షమని సత్పురుషులచే చెప్పబడు

చున్నది. (అజ్ఞానము నశించినప్పుడే జ్ఞాని ముక్తుడయ్యెనని అందుచేత దేహావసాన సమయమున (శ్లోకము 146) నెచ్చట నున్నను నొక్కటే యని స్పష్టము)

శ్లో॥ అహిమివ జనయోగం సర్వదా వర్జయేద్యః
కుణపమివ సునారీం త్యక్తకామో విరాగే
విషమివ విషయాప్తిం మన్యమానో దురంతాః
జయతి పరమ హంసో ముక్తిం భావం సమేతి॥ 152

తా. అభిలాషలను విడచినవాడై విరక్తుడై జనసాంగత్యమును సర్పమునువలె ఎప్పుడు సర్వదా విడచునో-సుందర స్త్రీని శవమునువలె విడచునో-అట్టి పరమహంస-సమస్తమును సన్న్యసించినవాడు - సర్వోత్కృష్టుడై వర్తించుచున్నాడు. అతడు మోక్షమును పొందుచున్నాడు(వైరాగ్యమున్నగాని జ్ఞానము సాధించుటకు వీలుకాదని ఉపదిష్టము)

(అపరోక్షానుభూతి సంపూర్ణము)

విన్నపము: అపరోక్షానుభూతి వ్యాఖ్యానము సులభసుందరముగా సామాన్యులకు తేలికగా అవగాహన అగునట్లున్నదని పెక్కు ప్రశంసాపత్రములు వచ్చినవి. అట్లు వ్రాసినవారందరకు వ్యాఖ్యాతకృతజ్ఞతలు.

దీనిని పుస్తకరూపమున కావలెనని కొందరు వ్రాసిరి. ఎవరైన ఉదారులు పూనుకొన్న అభ్యంతరములేదు. (సంపాదకుడు)

---

# గురువంశ కథా కథనము

(సంస్కృత మూలము: బ్రహ్మశ్రీ కాశీలక్ష్మణశాస్త్రి గురువంశ కావ్యమ్)

తెలుగు: శ్రీ చెఱుకుపల్లె జమదగ్నిశర్మ ఎం. ఏ.

(గత సంచిక తరువాయి)

## పంచదశ సర్గము

చూపరుల నేత్రయుగముల కత్యానందము కలిగించుచు దివాదీపికాని సర్వ రాజలాంఛనములతో సర్వవాద్యఘోషములతో వందిబృందముల స్తోత్రపాఠములతో విద్వాంసుల వేదవాదములతో సంగీతకుల గాన విశేషములతో మహావైభవోపేతులై

జగద్గురువులు పంపాపురిలో ప్రవేశించిరి. (53) ఆనతులకు సర్వాభీష్టముల నొసంగు దయాళువగు శ్రీనీలకంఠేశ్వరుని చూచి నమస్కరించి ఆ రాత్రి కలతో నీరాజన మొసంగి ప్రసాదము స్వీకరించి పురమున దేదీప్యమానులై ఊరేగుచు స్వీయమఠము చేరుకొనిరి. (54) పిమ్మట తన సౌధమునకు దయచేయవలసినదని అభ్యర్థించుచున్న రాజుకోరికను మన్నించి జగద్గురువు లొక శుభదినమున ఆప్తతములు శతాధిక విద్వాంసులు తమ్మనుసరించుచుండ సర్వబిరుదములతో వాద్యఘోషములతో మఠమునుండి బయలుదేరి పురప్రజల దృగ్దీపికా మాలలచే నీరాజితులగు షడ్దర్శన స్థాపనాచార్యులగు నా మహామహులు రాజసౌధమున కేగిరి. (55) అట్లు సమీపించి సముచితముగా తమకు ఎదురు వచ్చిన రాజుతో కలిసి లోనికేగి రమ్యమంటపమునందుపస్థితమైయున్న రత్నసింహాసనమున తా మధివసించి ఆసీనుడవు కమ్మని రాజు ననుమతింప నా సభలో వారిరువురు సూర్యేందులవలె దేదీప్యమానులై ప్రకాశించిరి. (56) అప్పుడు యోగీంద్రులు పరమ గంభీర సుమధుర ప్రసంగ మొనర్చిరి. శ్రోతలెల్లరు పరమానందభరితులయిరి. రాజు సంతోషమునకు మేరయేలేదు. విబుధులెల్లరు ప్రశంసించిరి. క్షోణీశమానీశ్వరు లింద్ర బృహస్పతులవలె నున్నారని సర్వులానందించిరి. (57) యుక్తజ్ఞుడగు మంత్రీశ్వరు డప్పుడు లేచినిలబడి "ప్రభూ! ఈ శృంగపురి శ్రీమఠ మెల్లప్పుడు రాజాధిరాజులచే సమాదృతమగుచున్నది. ప్రస్తుత మీ మఠమునకు కొంత ఋణభార మేర్పడినది. అది వడ్డీలు పెరిగి దినదినమున కెక్కువగుచున్నది. అందుచే తా మౌదార్యముతో ఆ ఋణమంతయు పరిష్కరించుట కాదేశింపవలెనని మనవి చేయుచున్నాను" అని రాజునకు విజ్ఞప్తి నొనర్చెను. (58) ఆ మాటలు వినుచునే రాజు హర్షముతో శ్రీ మఠ ఋణమంతయు తీర్చివేయవలసినదని తన కోశాధిపతి నాజ్ఞాపించెను. జగద్గురువుల నధిక సన్మానములతో నలరించెను. వారును రాజును మనసార ఆశీర్వదించి స్వీయమఠమునకు తిరిగి వచ్చిరి. (59)

ఆ నిర్వాణయ్య మంత్రేశ్వరుడు బహుముఖ ప్రజ్ఞావంతుడు. ఆయన వృషోద్యానమును ఉపవనమును బహుకాల పరిశ్రమ కోర్చి పరమ రమణీయముగ పెంచి అందనేక ఆశ్చర్యములను కల్పించెను. ఆతడు గురువుల నా ఉపవనమునకు వచ్చి చూడవలసినదిగా వినీతుడై అర్థించెను. శ్రీవా రంగీకరించి ఆ వృషవనమును చూచుట కేగిరి. అందు లక్షాధిక వృక్షములున్నవి. నయనానందకరమగు నా ఉద్యానవనము నందనమో చైత్రరథమో అనిపించుచుండును. (60) అచ్చట లక్ష్మీనివాస పద్మానేక శోభిత పద్మాకరము లున్నవి. పరమ విశాలమై ఎన్నో వైచిత్ర్యములున్న వన

మంతటిని నిర్మాత నిర్మాణయ్య మహామంత్రి దగ్గరవుండి జగద్గురువులకు చూపించెను. (61) బహుదూర దేశము నుండి అపురూప వృక్షముల నెన్నింటినో తెప్పించి ఆయన తన వనములో నాటించెను. వాటిని ప్రత్యేక పద్ధతులవలంబించి శ్రద్ధతో పెంచెను. వాని నన్నింటిని పేర్లు చెప్పుచు గురువులకు చూపెను. అక్కడలేని వృక్షజాతి ఉండనే వుండదేమో! ఆమ్రాశోక సునారికేళ పనసప్లక్షేక్షు ఖర్జూరికా బీజాపూర మధూక పూగ వకుళ శ్రీ వృక్షలోధ్రాదికము లనేకము లున్నవి. (62) తాంబూలీలవలీ పటోలపటలీ బింబ్యేల కోర్వారుకీ తుంబీ కర్కటికా లవంగ విలసత్కూశ్మాండ కోశాతకీ ద్రాక్షా విప్పల కారవేల్లికాది లతా విశేషము లెన్నియోయున్నవి. మల్లికా మాలతీ జాతీ కుంద గిరి కర్ణికాది పుష్పలతా విశేషము లనంతముగా నున్నది. (63) శివార్చనా యోగ్యములగు పుష్పజాతుల నచ్చట చూచి ఆనందించి ఆ మంత్రిని మనసార అభినందించి జగద్గురువులు శివార్చనోత్సుకులయిరి. అక్కడి సరోవరము లన్నిట నా మంత్రి రకరకముల జలయంత్రము లేర్పరచెను. అవి నీటిని విచిత్రభంగిమలలో వెదజల్లుచుండును. చూడచూడ నా వనము భూమండలముననే పరమాద్భుత మనిపించినది. (64) ఆ జలయంత్రములు కొన్ని పద్మాకారములు, కొన్ని ఎత్తిన పాముపడగల వంటివి, కొన్ని గొడుగుల వంటివి, కొన్ని ముత్యాల జాలరులున్న ధ్వజచామరముల వంటివి, ఆకాశమునంటు మహోన్నత దండములవంటివి కొన్ని, కొన్ని లింగాకారములు, కొన్ని తరంగ నిభములు, పైన గిరగిర తిరుగుచు ముత్తెములు కురియుచున్నట్లు నీటిని చిమ్మునవి కొన్ని. (65) ఆ విచిత్రములన్నియు చూచిన ప్రతివారును దానితో సమానమైన రమ్యప్రదేశ మింకొకటి యన్యత్ర యుండదని ప్రశంసాపరులగుదురు. ఆ తటాకములు కొన్నిటిలో అందమైన నావలున్నవి. ఆ నావలలో నిజమైన నావికులనిపించు బొమ్మలున్నవి. ఎక్కి కూర్చున్నచో ఆ బొమ్మలే పడవలు నడిపి కొలనులో విహరింపజేయును. సముద్రములవంటి ఆ చెరువులు పరమాశ్చర్యకరములు. (66) అప్పుడే విచ్చిన అపురూప పుష్పములు కొన్నింటిని ద్రాక్షాదిఫల విశేషములను గురువులకు భక్త్యాదరములతో సమర్పించి వారా సందర్భమున ననుగ్రహించిన హితవచనములను శిరసావహించి నిర్మాణయ్య మంత్రి తన కృతజ్ఞత తెలుపుకొనెను. పిమ్మట శ్రీవారట నుండి మెల్లగ కదిలి శ్రీమఠమునకు విచ్చేసిరి. (67)

తరువాత సోమశేఖర నృపతి సర్వామాత్యులతో సైన్యములతో మఠమునకేగి శ్రీవారిని దర్శించుకొని అధికాదరముతో విశేష సమ్మానము లొనరించి శ్రీచంద్రమౌళీశ్వరుని భక్తి గౌరవములతో నర్చించుకొని తాను శృంగపురికి

రా నెంచుచున్నట్లు మనవిచేసి శ్రీవారి అనుమతిని గూడ పొందెను. (68) పిమ్మట జగద్గురువులు పురప్రజల కందర కానందము కలిగించి శిష్యుల కెల్లర కాశీర్మంత్రాక్షత లొసంగి వంశపురి నుండి బయలుదేరిరి. అటనుండి శృంగపురి కభిముఖులై వచ్చుచున్నారను వార్త వినవచ్చినంతనే ప్రజలెల్లరు పట్టణము నలంకరించిరి. ఆశ్రితాభీష్ట ప్రదయు శోభాజితామరావతియునగు నా శృంగపురి అప్పుడు నూత్నశోభతో వెలుగొందినది. (69) ఆ శృంగపురి యందలి బ్రాహ్మణులెల్లరు వేదాంత విజ్ఞాన మహితులు. అష్టాదశ విద్యాపారంగతులు. శ్రేష్ఠసముదాచార పరాయణులు. ఉత్తమ మంత్ర జపాది నియమనిష్ఠాపరులు. యాగాద్యుత్తమ కర్మతత్పరమతులు. సర్వరాజుల కధిక సన్మాన్యులు. స్వయముగా భాగ్యవంతులై భగవదనుగ్రహమున సుఖమున్న వారు. (70) అక్కడి ప్రజ లొనర్చిన సత్కార్మ పరంపరలకు మెచ్చి దేవగణము లొసంగిన మణిమాలయన్నట్టు లా పురమున ననేక దేవాలయ గోపురములు ప్రకాశించుచుండును. ఆ మాలలో శ్రీ విద్యాశంకర దేవాలయ గోపురము శిరోరత్నమై మహోజ్జ్వలముగా ప్రకాశించుచుండును. వీథులన్నియు నుభయ పార్శ్వముల యందలి సౌధములతో కలకలలాడుచుండును. (71) శ్రీ విద్యాశంకర భవన గోపుర శిఖరములు తగులునన్న భయము చేతనే సూర్యు డాకాశమున సూటిగా పోక వాని పైభాగమును విడిచిపెట్టి దక్షిణమునకో ఉత్తరమునకో యొరిగి ప్రక్కగా పోవుచుండును. ఆ శిఖరము లాతింటి ప్రకాశము తన్ను మించిపోవుచుండుటచే వానిలో స్వరూపహించియే తాను ద్వాదశాత్ముడై నాడు కాబోలును. (72) శ్రీ విద్యాశంకరాలయ గోపురౌన్నత్యము గమనించిన భావుకులైన ఆర్యులు ఆదియు కొండమీదనున్న మల్లికార్జు నాలయమును శృంగపురీ దేవకాంతకు స్తన యుగమని భావింతురు. ప్రక్కన పాఱుచున్న తుంగభద్రయే ఆ దివ్యనారి ధరించు సితదుకూలము. (73) కంతాలంకరణముల వంటి తోరణములతో, పటాంచల ప్రక్షేపములచే నాకాధిపుని పరిహసించుచున్న ఉత్తాల ధ్వజములతో, సేవించుకొనుటకై వచ్చిన కులాచలము లన్నట్లొప్పుచున్న ఉపమేరు నిర్మాణములతో కలకలలాడుచున్న శృంగపురి నా యోగీంద్రు లానందోత్సాహములతో ప్రవేశించిరి. (74) విద్వాంసులతో, సచివోత్తములతో, అనుచరులతో, వంది గాయక బృందములతో హృద్యవాద్య విశేషములతో, తాళములు మ్రోగించుచు నృత్యమొనరించుచున్న నటులతో శృంగగిరి ప్రవేశించిన జగద్గురువులు పురప్రజ లెల్లరు నానందోత్సాహములతో తిలకించుచుండ ముమ్మొదట మల్లికార్జున విభుదర్శన మొనర్చుకొనిరి. (75) యతివర్యు లాస్వామి నధికాదరముతో పూజించి భవానీదేవి కంజలించి హేరంబు

నుపాసించి ఒక్కొక్కరికి వేర్వేరుగా ఆ రాత్రి కలతో నీరాజనము లర్పించి మహా నందముతో స్వమఠమునకు విచ్చేసిరి. (76) శారదా మందిరమున కేగి ఆ తల్లి నత్యంతభక్తితో చిరకాలము ధ్యానించి సర్వోపచార పూజలతో తృప్తిపఱచి వెంట నున్న యందరను సముచిత వచనములతో స్వగృహముల కేగుటకు అనుమతించి తాము తమ నివాసస్థలము నాదరముతో చేరుకొనిరి. (77) పూర్ణ ఋణ విమోచన మగు టచే వచ్చిన ఆభరణము లన్నింటిని ఆయా దేవతలకు పూజా పురస్సరముగ నర్పించి శిష్ట ద్విజవరుల నెల్లరను శ్రీమఠమున మృష్టాన్న భోజనములతో తృప్తిపరచి పుర దేవతల నెల్లరను పూజించుచు ప్రీతులై యతివర్యులు శృంగగిరి యందుండిరి. (78) తమ గురువులైన శ్రీ నరసింహ భారతీస్వామి వారికి సచ్చిదానంద భారతీ యోగీంద్రులు రమ్య శిల్పశోభితమగు దేవాలయమును ప్రీతితో కట్టించి అందు భక్త కామదమగు శివలింగమును ప్రతిష్ఠించి సన్మార్గ ప్రవర్తకులగుచు అనంతకీర్తి నార్జించిరి. (79) వారు నిత్యము పండితులతో వేదాంతశాస్త్ర గోష్ఠులలో నిమగ్నులగుచు ప్రాజ్ఞులకెల్లరకు కల్పవృక్షములై సర్వాభీష్టము లొసంగుచు సర్వజనకీర్తితులై మహారాజమకుట నీరాజిత పాదులగుచు యోగరాజ్య సింహాసనస్థులై వెలుగొందిరి. (80) యోగి సార్వభౌములగు సచ్చిదానంద భారతీ మహాస్వామి చరణులు జంబూద్వీపమునకే పరమశోభ కూర్చుచున్న జగద్గురు మణిమాలలో మధ్యమణివంటి వారు. విద్యావిద్యలను విస్పష్టముగా నెదిరించు స్వచ్ఛ ప్రకాశదీపస్వరూపులు. విరుద్ధ మతవాది మత్తమతంగజ పంచాననులు. సర్వరాజ్య సమ్మానితులు. దిగంత విశ్రాంతి కీర్తి ధురంధరులు. వారు జగజ్జేతలై ప్రకాశించుచున్నారు. (78)

(సశేషము)

---

## వ్యాసములు-ఎక్ఛేంజి కాపీలు, రివ్యూకి గ్రంథములు

మా పత్రికకు పంపదలచిన వ్యాసములను ఎక్ఛేంజి కాపీలను రివ్యూకి గ్రంథములను (2 కాపీలు) యీ క్రింద చూపిన మా మద్రాసు కార్యాలయము అడ్రసునకే పంపవలెను.

శ్రీ రామలింగేశ్వరరావు,

నెం. 63 కోడంబాకం హైరోడ్డు, త్యాగరాయనగరు, మద్రాసు-600 017.

# శ్రీ శంకర భగవత్పాద విరచిత
# వివేకచూడామణి
## (శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామి విరచిత వ్యాఖ్యాసమేతము)

ఆంధ్రీకరణము: డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు(వేదాంత శిరోమణి, విద్వాన్)
ఎం. ఏ. (సంస్కృత, ఆంగ్ల హిందీ) పి. హెచ్‌డి.

(గత సంచిక తరువాయి)

అవ. ఆరోపాధిష్ఠానము ఆరోపింపబడునదియు వేరువేరని తెలిసినచో అధ్యాసమనునదియే ఉండదు. అందుచేత మూలకారణమగు అధ్యాసము, కేవలము అవివేకము (భేదజ్ఞానము లేకపోవుట) ద్వారా బంధమునకు హేతువగుచున్నది అను విషయమును దృష్టాంత పూర్వకముగా విశదీకరించుచు, 'బంధ' శబ్దమునకు అర్థమైన అధ్యాసమును చెప్పుచున్నారు:—

మూ. అతస్మింస్తద్బుద్ధిః ప్రభవతి విమూఢస్య తమసా
వివేకాభావాద్వై స్ఫురతి భుజగే రజ్జుధిషణా.
తతోఽనర్థవ్రాతో నిపతతి సమాదాతురధికః
తతో యోఽసద్గ్రాహః సహి భవతి బన్ధః శ్రృణుసఖే. 140

ప్ర.అ. తమసా=అజ్ఞానముచేత, విమూఢస్య=వివేక రహితుడైన పురుషునకు, అతస్మిన్=ఆత్మకాని దానియందు, తద్బుద్ధిః=ఆత్మయనెడు బుద్ధి, ప్రభవతి=కలుగుచున్నది. వివేకా భావాద్వై=వివేకము లేకపోవుటవలననే, స్ఫురతి=కదులుచున్న, భుజగే=సర్పమునందు, రజ్జుధిషణా=త్రాడు అనెడి బుద్ధి, భవతి=కలుగును, తతః=అటుపిమ్మట, సమాధాతుః=దానిని గ్రహించినవానికి, అధికః=అధికమైన, అనర్థవ్రాతః=అనర్థముల సముదాయము, నిపతతి=వచ్చిపడును. తతః=అందువలన, యః=ఏ, అసద్గ్రాహః=లేనివస్తువు యొక్క జ్ఞానమున్నదో, సహి=అదియే, బంధః=బంధముగా, భవతి=అగును. సఖే=ఓ స్నేహితుడా, శృణు=వినుము,

వ్యా. అ. అజ్ఞానముచేత, వివేకరహితమైన చిత్తముగల పురుషునకు, అతస్మిన్=ఆత్మభిన్నమైన దేహాదికమునందు, ఆత్మబుద్ధి కలుగుచున్నది. అదెట్లనగా= వివేకము లేకపోవుటవలననే, స్ఫురతి=భాసించుచున్న, సర్పమునందు ఇది రజ్జువుకాదు

కామ క్రోధ ప్రభృతిభిః=కామము క్రోధము మొదలైన, బన్ధకగుణైః=బంధహేతువులగు గుణములచే, పరం=అత్యధికముగ, వ్యథయతి=పీడించును.

వ్యా. అ. అమలతర తేజోవతి=అతిస్వచ్ఛమైన ప్రకాశముగల, స్వాత్మని=స్వస్వరూపము, పరమాత్మ అజ్ఞానములో నున్న ఆవరణశక్తిచేత, తిరోభూతే=కప్పబడినదగుచుండగా, స్పష్టముగా భాసించకుండా ఉండగా, పుమాన్=జీవుడు, మోహాత్=అవివేకమువలన, అనాత్మానం=ఆత్మభిన్నమైన, శరీరమును, తాదాత్మ్యబుద్ధితో శరీరమే నేను అని, భావించుచున్నాడు. తతః=శరీరమునందు తాదాత్మ్యాభిమానము కలిగిన పిమ్మట, ఈ జీవుని, విక్షేపమను పేరుగల రజోగుణ సంబంధమగు ప్రబలశక్తి, కామ క్రోధ ప్రభృతిభిః=కామక్రోధములు ఏలోభ-దంభ-అసూయా-అహంకార-ఈర్ష్య-మత్సరాదులకు-ఆదియందున్నవో అవి కామ క్రోధప్రభృతులు అట్టి, బంధక గుణైః=అధ్యాసము యొక్క వృద్ధికి హేతువులగు ధర్మములచే, పరం=అత్యంతము, వ్యథయతి=పీడించును-దుఃఖములలో చిక్కుకొన్న వానినిగా చేయును. శరీరాభిమానముగా కలవానికి శరీరమునకు అనుకూలముగా నుండు వస్తువు విషయమున కామము కలుగును. ఆ వస్తువు లభింపకున్నచో క్రోధము కలుగును, అది లభించిన పిమ్మట లోభము (దానిని విడువకూడదు అనుబుద్ధి) కలుగును, ఇదియంతియు లోక ప్రసిద్ధమే కదా? త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః కామః క్రోధ స్తథా లోభ స్తస్మాదేతత్త్రయం త్యజేత్"—(కామము, క్రోధము, లోభము అనునవి ఆత్మనాశహేతువగు మూడువిధములైన నరకద్వారములు. అందుచే ఈ మూడింటిని విడువవలెను) అని గీతలో కూడ చెప్పబడినది. 142

(సశేషము)

## చందాదారులకు విన్నపము-ప్రకాశకుని చిరునామా మార్పు గమనింపుడు

చందాలు బాకీయున్నవారికి పత్రిక పంపబడదు. చందా సొమ్మును ముందుగనే (తమ అడ్రసు మార్పుకూడ వెంటనే) క్రింది చిరునామాకు పంపవలెను.

ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి,
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు,
6—3—609/18, ఆనందనగర్,
ఖైరతాబాదు, హైద్రాబాదు—500 004.

# అద్వైత సిద్ధాంతము ముందు పాశ్చాత్యుల పూర్వపక్ష ఖండన

## (ఆచార్య సుందరము)

(శ్రీ శంకర భగవత్పాద అద్వైత సిద్ధాంతము పైన పాశ్చాత్య విద్వాంసులు కొందరు దుర్బలమైన ప్రతిపక్షవాదములు చేసిరి. ఆ వాదముల ఖండన మీ వ్యాసము. —సంపాదకుడు.)

(గత సంచిక తరువాయి)

డా. థీబొ తరువాత తీసికొన్నది ముండకోపనిషత్తు (II-1-2) పాఠము. అతడు "కఠ ఉపనిషత్తులో 'అవ్యక్తము' బదులు ముండకోపనిషత్తునందు ఘనమై నశింపనిది సత్యమైనదే కాని భ్రమజనితము కాదు" అని వ్రాసెను. ఈ విషయముపై మరింత వ్రాయనవసరములేదు. అయినను ముండకోపనిషత్తు (II 1, 1, మరియు 2) పాఠములను-(బ్రహ్మము గురించి దాని నుండి జరుగుసృష్టిని గురించి చెప్పినవి) పరిశీలింతము.

మొదటి శ్లోకమున బ్రహ్మము సత్యమని చెప్పబడినది. అనగా మిగిలినదంతయు మిథ్యయని స్పష్టము. తరువాత శ్లోకమునందది అమృతమని, అప్రాణమని, అమనమని మొదలుగా చెప్పబడినది. కావున దానికి భౌతికరూపాది లక్షణములుగాని జ్ఞానకర్మేంద్రియములుగాని లేవనుట స్పష్టము. తరువాత (ii 2, 9) నది 'నిష్కల' (భాగములు లేనిది) అని చెప్పబడినది. అయినను దానినుండి భౌతికజగత్తు ఉత్పన్నమగుచున్నదని చెప్పబడినది. ఇది ఎట్లు సాధ్యమగునవగా-బ్రహ్మము నుండి ఉత్పన్నమగు భౌతిక వస్తుజాలము మిథ్య-భ్రమజనితమైనప్పుడు. మరియు నీ ఉపనిషత్తునందే బ్రహ్మము 'తమసః పరస్తాత్' తమస్సునకు అతీతము (ii 2, 6) అని యున్నది. బ్రహ్మము కానిదంతయు తమస్సు. బ్రహ్మము సత్యము కాబట్టి—యిది తద్విరుద్ధము మిథ్య.

మరియు ఉపనిషత్తునందు "విద్వాన్నామరూపాద్విముక్తః" (బ్రహ్మము నెరిగినవాడు నామరూపాది భౌతికముల నుండి (ii -2-8) విముక్తుడు) అనియున్నది. మనముందున్న రెండు వస్తువులు సత్యమైన యెడల అందు ఒకదానిని గురించిన జ్ఞానము రెండవదాని ఉనికినుండి మనకు విముక్తి లభించు టెట్లు? రెండవది మొదటి దానిపై నిర్మూలింపబడినప్పుడే యిది సాధ్యము. భ్రమకల్పిత రజతము ముత్తెపు చిప్పయందణగిపోయినట్లు. ముత్తెపుచిప్పను గమనింపగా వెండి అదృశ్యమగుచున్నది.

అట్లే బ్రహ్మము తెలియబడగా దానియందు ఆరోపింపబడిన భౌతికజగత్తు మిథ్య యగుచున్నది. నామరూపాత్మకమైన జగత్తునకు భిన్నమైన ఉనికి లేదని ఉపనిషత్తు చెప్పుచుండగా—బ్రహ్మజ్ఞానము మనలను దాని ఉనికి నుండి విముక్తి కల్పించుటెట్లు?

బృహదారణ్యక ఉపనిషత్తునందున్న పాఠమును - భౌతికవస్తుజాలమునకు "ఇవ" (వలె) తగిలింపబడిన దానిని (వాటి మిథ్యాత్వమును నిరూపించుటకు)— డా. థీబా దాటి రాలేకుండ నుండెను. 'యత్రాన్య దివస్యాత్'—(ఎచ్చట వేరొకటి ఉన్నది వలెనుండెనో) 'యత్రహి ద్వైతమివభవం' (ఎచ్చట ద్వైతమున్నది వలె నున్నదో)

'ఆత్మాధ్యాయతీత లేలాయతీవ' (ఆత్మ ఆలోచించుచున్నదివలె-చలించుచున్నది వలె). డా. థీబా తిరుమబడినవానివలె అంగీకారమిట్లు తెలుపక తప్పలేదు. "ఈ 'ఇవ'లు చేయు సూచనలను—(నేను సమ్మతించుటకు సిద్ధముగా నున్నాను) గమనింపగా ఆ రచయిత యొక్క ఆలోచనలందు—(శంకరుల మాయాసిద్ధాంతము వలె విస్పష్టము కాకపోయినను కొంతవరకట్టిదే) ఒక మాయాభావమున్నట్లు చెప్పుటకు వీలున్నది."

ఉపనిషత్తుల భావప్రవాహమంతయు మాయాసిద్ధాంతోపస్థాపకము నున్నదని-మేము వలసినదానికంటె అధికముగనే—వివరించితిమి. వ్యాససూత్రములు కూడ దీనినే బోధించుచున్నవని నిరూపించితిమి.

చివరకు డా. థీబా జీవాత్మలకు పరమాత్మతోగల సంబంధమును గురించి ప్రస్తావనచేసెను. ఆ సందర్భమునం దత డిట్లు వ్రాసెను. "ఇచట మనమిక సంకోచింపక సమ్మతింపవలెను—ఉపనిషత్తులందు ప్రముఖముగా నున్న యొక సిద్ధాంతమునకు శంకరుల ప్రతిపాదన ప్రతిపద విధేయముగా—నిరాక్షేపణీయముగా నున్నదని-ఆ సిద్ధాంతమేమనగా — ఋషియొక్క ఆత్మ—తొలుత బ్రహ్మముతో దానికెట్టి సంబంధమున్నప్పటికీ—చివరకు భేదములేని విధముగ విశ్వాత్మతో పరలీనమగునని" అయితే అతని అభిప్రాయమున 'తొలుతనది బ్రహ్మమునుండి పరిక్రమించుచు దానియందొక భాగముగా నున్నదని'. అయితే భాగము—పరిపూర్ణమెట్లగును? భాగములు లేనిదానితో, పరిణామము లేనిదానితో మరొకటి సంలీనమగుటెట్లు? ఇది అవగాహన కందని విషయము. డా. థీబా 'తురీయముగా జీవబ్రహ్మ ఏకరూపత్వము'ను చెప్పెను. పై కారణములవలన నిదియు సరికాదు. ఐక్యత సాధ్యమగుట కొక్కటే మార్గము-నామరూపాత్మక భౌతికముల మిథ్యాత్వమును తొలగించుకొనుట. ఆత్మ

యొక్క సహజస్థితిని తెలియని అజ్ఞానమును పోగొట్టుకొని అధ్యారోపింపబడిన బహురూపత్వ భ్రమను నిర్మూలించుకొనుట ఇక్కడ కూడ—యితర సందర్భములందు వలెనే—డా. థీబా—శంకర సిద్ధాంతమని తాను చెప్పుదానిని సరిగా అవగాహన చేసికొనలేకపోవుట విచార్యము. (అదే ఉపనిషత్తులోని ప్రముఖభావమని అతడన్నాడు)

నిగమనమున డా. థీబా తన అభిప్రాయములనిట్లు సంగ్రహించెను. "ఉపనిషత్తుల యావత్తుబోధలను—ఒక సమ్యక్ సిద్ధాంతముగా సంగ్రహించుట అసాధ్యమని యింతకుముందే చెప్పబడినది. అయితే అట్టి ప్రయత్నములు జరిగినచో—అందు శ్రీ శంకరుల సిద్ధాంతమే అత్యుత్తమమైనదని సమ్మతించుటకు మేము సిద్ధముగా నున్నాము" ఈ నిగమనమును చేరుటకతడు చేసిన వాదనలు నిరాధారములని—ఉపనిషత్తులను, బ్రహ్మసూత్రములను డా. థీబా సరిగా అవగాహన చేసికొనలేదని మేము తగినంతగా నిరూపించితిమి. ఉపనిషత్సిద్ధాంతమును అవగాహన చేసికొనుటకు వ్యాఖ్యానించుటకు, పూనుకొనుట కతనికి కావలసిన శక్తిసామర్థ్యములు లేవు. శంకరభాష్యమున కతడు చేసిన అనువాదము నిండ బహుదోషములు.

మేమొక ఉదాహరణ చూపవచ్చును 'దుందుభి దృష్టాంతము'నకు సంబంధించిన దానిని. 'ఆత్మని విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతంభవతి' అన్న వాక్యమును వివరించుటకిది అవసరము. (ఆత్మను గురించి తెలియబడగా—యీ జగత్తు అంతయు తెలియబడును). ఈ వాక్యము అద్వైతసిద్ధాంతమునకు ముఖ్యమైనది. సూచింపబడిన బృహదారణ్యక ఉపనిషత్తుపాఠము (vi ౫, ౯)—"స యథా దుంధుభేర్హన్యమానస్య న బాహ్యాఞ్ఛబ్దాఞ్ఛక్నుయాద్గ్రహణాయ దుందుభేస్తు గ్రహణేన దుందుభ్యాఘాతస్య చ శబ్దో గృహీతః" డా. థీబా దీనికి గల శంకరభాష్యమును చూచియుండవలసినది. లేక సూత్రభాష్యముపై గోవిందానందుని వ్యాఖ్యానమును చూడవలసినది. ఈ శ్రుతిపాఠమునకు సరియగు అనువాదము (అది తయారుచేయబడిన వస్తువువలన, దానిని మ్రోయించువాని శక్తిసామర్థ్యమువలన దాని మ్రోతకు కలుగు ప్రత్యేక వైలక్షణ్యములను—(అసలు దాని సామాన్య స్వలక్షణములను తెలియనిదే)—గ్రహింపవలనుపడదు. (దుందుభికంటె వేరు వాద్యము మ్రోతకు దీనికిగల భేదమునుబట్టి దీని స్వలక్షణము) దుందుభియొక్క సామాన్య స్వలక్షణ ధ్వని (దుందుభిధ్వని లక్షణము మరివేరు వాద్యధ్వని కాదన్నది) గుర్తింపగల్గినప్పుడు—పై ప్రత్యేకతల వలన దాని ధ్వనిలో కలుగు మార్పులను తేలికగా గుర్తింపవచ్చును.)—

దుందుభి సామాన్య స్వలక్షణము ఆత్మయొక్క స్థానమును తీసికొనును. మారుపుచెందిన ప్రత్యేక ధ్వనులు ఉపాధిహేతువుగా కన్పించు ఆత్మస్థానమును. డా. ధీబా అనువాదము నవ్వు తెప్పించునదిగా నున్నది. "దుందుభి ధ్వనులు— బాహిరముగా పట్టుకొనలేము—అయితే దుందుభిని కాని—దానిని మ్రోయించువానిని గాని పట్టుకొనినప్పుడు దాని ధ్వనులను పట్టుకొనవచ్చును," (సశేషము)

---

# పాఠకులతో గోష్ఠి (3)

**(పాఠకులు పంపిన ప్రశ్నలకు సంపాదకుని సమాధానము లీ పుటలో నున్నవి. పాఠకులు పంపే ప్రశ్నలతో తమ చందా నెంబరు తెలుపవలెను. వచ్చిన ప్రశ్నలకు వీలువెంట సమాధానములు వ్రాయబడును. —సంపాదకుడు)**

ప్రశ్న : నేనొక సద్గురువును సేవించి ఉపదేశమును పొంది తరింపవలెనని తపనపడుచున్నాను. కొన్ని కారణములవలన (శరీరస్థితి) నేను ఇల్లు వదలి బయటకు పోగల స్థితిలో లేను. మరి నా గతి మేమి? (యస్.వి. రాయుశర్మ)

సమాధానము: మీ రేమియు అధైర్యపడ నక్కరలేదు. ముందు మీరు మీ స్థితికి (ఆశ్రమాదులకు తగిన) విధ్యుక్తధర్మములను యథావిధిగా నిర్వహింపుచుండుడు. మరియు సత్యము, అస్తేయము, అహింస మొదలగు సద్గుణములను అవలంబింపుడు. దుర్జనసాంగత్యము దరికి పోకుండ నుండుడు. ధనార్జన గురించి, శత్రువుల గురించి, స్త్రీలను గురించి జరుగు మాటలను వినకుండ నుండుడు. నాస్తిక వాదములు చేయువారిని దగ్గరకు రానీయకుడు.

మీ విధ్యుక్త కార్యక్రమమును నిర్వహించుచు, జీవితమున అవసరమైన వృత్తి ధర్మమును పాటించుచు, తీరికవేళల భగవన్నామసంకీర్తనము చేయుట — సద్గ్రంథ పఠనము చేయుట, సజ్జనులతో గోష్ఠి చేయుట సలుపవలెను.

ఇట్టి ఉత్తమ విధానములో మీరు జీవితమును గడుపుదురేని — మీకు మంచి యోగ్యత లభించి—మిమ్ము ఉద్ధరింపగల సద్గురువు సన్నిధి దాని యంతట అదియే లభించును. సందేహము లేదు. మీరు మాత్రము ఎట్టి పరిస్థితిలోను ధర్మవ్యతిరిక్తము చేయరాదు. సంకట పరిస్థితులలో ధర్మమేదియో—మీ హృదయమునకు తెలియును. పెద్దల ధర్మవేత్తల నడవడికవలన తెలియును. ధర్మమును మీరు కాపాడినచో మిమ్ము ధర్మము కాపాడును.

---

# 'సర్వేజనాస్సుఖినోభవంతు'

'లోకాః సమస్తాః సుఖినోభవంతు' అనీ, 'సర్వేజనాఃసుఖినోభవంతు' అనీ పెద్దలు చెప్పుట మనము వినుచున్నాము. కొందరు కొందరు స్వార్థపరులుకూడ తాము సర్వజనుల సుఖముకై పాటుపడుచున్నామని డాంభికోక్తులు పలుకుట లోకమున కలదు. నిజమునకు సర్వజనులు సుఖింపవలెనన్నచో—మనము—ఎవరికివారు చేయవలసినదేమి? బాగుగా ఆలోచించినచో—యీ ప్రశ్నకు సమాధానము — ఎవరికివారు, వారి వారి ధర్మములను (స్వధర్మమును) నిర్వహించినప్పుడే సర్వజనులు సుఖింతురని స్పష్టమగుచున్నది. ఎవరి ధర్మమును వా రాచరించినందువలన దుష్ఫలితము లేమియు నుండవు. అందరికి—ముఖ్యముగా తన ధర్మమును ఆచరించువారికి శ్రేయస్సు లభించును. ధర్మమార్గమున ముందుకు సాగు సోపానములు మోక్షమును లభింపచేయును.

ధర్మమునందు సత్ప్రవర్తన చాల ముఖ్యము (ఆచార ప్రభవో ధర్మః). వేదములను మరచిపోయినచో మరల నేర్చుకొనవచ్చును. సత్ప్రవర్తన పోగొట్టుకొన్నచో—అది మరల లభింపదు. సత్ప్రవర్తనలేని మానవునికి వేదములు తోడ్పడవు. సాంగము వేదాధ్యయనము చేసినప్పటికీ సత్ప్రవర్తన లేనివానికి వాటి ఉపయోగము లేదు (ఆచార హీనం న పునంతి వేదా హద్యప్యధీతాః సహ షడ్భిరంగైః - వశిష్టస్మృతి).

సామాన్యముగా అవలంబించవలసిన ధర్మములు పది యని మనుస్మృతి చెప్పుచున్నది. ధృతి, క్షమాదమః అస్తేయం శౌచం ఇంద్రియ నిగ్రహః ధీః విద్యా సత్యం అక్రోధః దశకం ధర్మలక్షణం—తన్ను తాను భరించుకొనియుండుట—ఓర్పు, అంతర, ఇంద్రియములను నిగ్రహించుకొనుట—దొంగతనము చేయకుండుట, ఋజువర్తనము, బాహిరింద్రియ నిగ్రహము, బుద్ధివికసనము కలిగించుకొనుట, జ్ఞానసముపార్జనము, సత్యవ్రతము, కోపమును పోగొట్టుకొనుట.

తైత్తిరీయ ఉపనిషత్తు శిక్షావల్లియందు విద్యాభ్యాసము చేయునపుడు, గృహస్థుగా నున్నపుడు పాటించవలసిన ధర్మములు విశదీకరింపబడినవి.

లోకమున మనము గమనించుచున్నాము—వయస్సునుబట్టి వస్త్రధారణము—ఆభరణములు. అదే విధముగా ప్రవర్తన జీవితము. అన్నివేళల సరియైన ప్రవర్తన (సర్వత్రశీలం) — అందరియందు — ఎల్లయెడల సముచితప్రవర్తన కావలయును. త్రికరణశుద్ధి (మనస్సు - వాక్కు - కాయముల) అవసరము. ద్రోహము విశ్వాసరాహిత్యము — హేయములు. అద్రోహః సర్వభూతేషు — ఎవ్వరికి ద్రోహముచేయకుండుట అత్యవసరము.

భూతదయ, ఔదార్యము—వీటి వలన కీర్తి, ఐశ్వర్యము, యోగక్షేమములు శ్రేయస్సు, ప్రేయస్సు లభించును. పోయిన ధనము తిరిగి లభింపవచ్చును. పోయిన ధర్మము—తిరిగి దొరుకదు. ధర్మ మాచరించువానికి సర్వభూతములు, సర్వజీవులు తోడ్పడును. అధర్మప్రవర్తనుని కెవ్వరును సాయము చేయరు. చెయ్యరాదు.

భయముచేత తన విధ్యుక్తధర్మమును చేయకుండుట మానవ లక్షణము కాదు. "కర్తవ్యమేవ కర్తవ్యం ప్రాణైః కంఠగతై రపి—అకర్తవ్యం నకర్తవ్యం ప్రాణైః కంఠగతై రపి."

జీవితమున ప్రథమ దశ విద్యాభ్యాసము కొరకు. జ్ఞానసముపార్జనకు. పిమ్మట అర్థకామములు (ధర్మమార్గమున). తరువాత పుణ్యసముపార్జన. దయాదాక్షిణ్యములు లేని మానవుడు మానవుడు కాదు. రాక్షసుడే.

పూర్వజన్మ కర్మ ఫలితముగా—మంచివారికి కూడ కష్టసుఖములు. అందుకని ధర్మ మార్గచ్యుతి పొందరాదు.

తాను చేయుచున్న ధర్మమును గురించి తాను ఆడంబర ప్రచారములు చేసి కొనరాదు. వృక్షము భూమిపైన నిలచియుండుటకు కారణమైన (బలమిచ్చునది) వ్రేళ్ళు భూమిలోపల—అదృశ్యముగా నున్నవి. అట్లే మన ధర్మాచరణము కూడ.

ధర్మము చేసినందువలన ఫలితము ఆలస్యముగా వచ్చును. అది సాకుగా తీసికొని మనము ధర్మమును చేయుట ఆలస్యము చేయరాదు. ఎల్లప్పుడు—నిరంతరము—సతతము—ధర్మమునే చేయుచుండవలెను.

తన కితరు లేది చేసిన అపకారమగునో దా నితరుల కది చేయకూడదు. అదియే సంస్కృతి, మానవత్వము.

మనము చేసిన కర్మముల ఫలము—మన మెచ్చట దాగికొన్నను పట్టుకొని అనుభవింపచేయును (అవశ్య మనుభవోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్) సందియములేదు.

దుష్టాలోచన, దురాలోచన, దుష్టవాక్కు, దుష్టకర్మ—వీటివలన రాబోవు జన్మ—అతి నీచ జన్మగా పరిణమింపగలదని మనశాస్త్రములు ఉద్ఘాటించుచున్నవి. వృక్షజన్మ, పక్షిజన్మ, జలచరజన్మ, మూషికజన్మ, కాకజన్మ — అతి నీచబ్రతుకు మొదలగునవి. దైవభక్తి ధర్మమునందనురక్తి—జీవితము ఫలవంతమగుటకు తప్పనిసరి.

మన మన సుఖములకొరకే కాదు - సర్వజనుల సుఖము కొరకు - మనము ధర్మము నాశ్రయింపక తప్పదు.

---

# 'కర్మసు కౌశలమ్'

భగవద్గీతను గురించి సాధారణముగా మన మందరము విని యున్నాము. చాల మందికి దానిపైన భక్తి గౌరవములు. కొందరు పారాయణ చేయుదురు. నిజముగా దానిని గౌరవించుట యెట్లు?

అర్జునుడు విజ్ఞాన వివేకములు కలవాడు. మహావీరుడు. మానవసహజమైన భావములు కలవాడు. హృదయ పరిస్పందనము కలవాడు. అందుకని-క్లిష్టమైన సమస్య తన్నెదుర్కొన్నవేళ—సన్నిహితుల, రక్తబంధువుల, మిత్రుల — తానే సంహరింపవలసివచ్చినవేళ — చేయుటయా - చేయకుండుటయా-అవలంబించుటయా - పతనము చెందుటయా-అన్న సమస్య తన్నెదుర్కొన్నవేళ - అతడు కలవరపడినాడు. అర్జునుడు మానవజాతికి ప్రతినిధిగా గంద్రగోళము పడినాడు.

అట్టి కలవరము, గంద్రగోళము - జీవితములో మన యందరికి-ఒకప్పుడు యెదురగుచున్నదే. కాబట్టి ఆ గడ్డుసమస్యా పరిష్కారమునకు శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకేమి ఉపదేశించెనో—ఆ ఉపదేశమే-సరిగా అవగాహన చేసికొన్నచో-మనకు-మన మెదుర్కొనుచున్న సమస్యల పరిష్కార సమయమున-ప్రయోజనకారి కాగలదు. అనగా ఉపయోగపడును.

శరీరము, హృదయము, మనస్సు - మానవునకున్నవి. అనగా శరీరముతోపాటు అంతఃకరణ చతుష్టయ మున్నది. మానవుడు అవలంబించు పథము హృదయమునకు, మనస్సునకు తృప్తిగా, శరీరమునకు సుఖకారిగా నుండవలెనన్నమాట. శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో ఉపదేశించిన ఉపదేశము—యీ మాటికి కావలసిన దిచ్చుచున్నది. కర్మ జ్ఞాన భక్తి మార్గములను సముచితముగ మిశ్రమము చేసి సారభూతముగా భగవద్గీత మన కందించుచున్నది. ఈ మూడిటిని కర్మ జ్ఞాన భక్తి మార్గములను దేనికది వేరువేరుగా నుంచుటగాని, ఒకదానిని అనుసరించుచు మిగిలినవాటిని పరిత్యజించుటగాని సక్రమముకాదు. అట్లే భగవద్గీతయందున్న తాత్త్విక, దార్శనిక, ప్రగాఢ మర్మములను గ్రహించుట, సంప్రదించుట వలన ప్రయోజనము లేదు. భగవద్గీతను భగవంతుని ఉపదేశ గ్రంథముగా ఆరాధించుచు, కంఠస్థము చేయుటవలన కూడా ప్రయోజనము లేదు. గీతాసారమును నిత్యజీవితమున అనుసంధించుకొన్నప్పుడే ప్రయోజనము.

మన వృత్తి యేమిటని - యెట్టిదని - ప్రశ్న లేదు. దానికి ఉత్తమాధమ లక్షణములు లేవు. కావలసినది—నీ వృత్తియందు నీకున్న శ్రద్ధ యెట్టిదని. నీ కున్న శ్రద్ధ ఉత్తమమైనచో నీ వృత్తి ఉత్తమమైనది. నీకు లభించు ఫలితము ఉత్తమ

మగును. మహాభారతమున "ధర్మవ్యాధోపాఖ్యానము" - యీ విషయమున విశదీకరించుచున్నది. నీ వృత్తి యందు శ్రద్ధ పూని శక్తి వంచన లేకుండా (ఒడలు దాచుకొనకుండా) పనిచేయుటయే "యోగము" (కర్మసు కౌశలమ్).

మన విధ్యుక్త ధర్మమును, విహితకర్మను మనము చేయగా ఫలితము వ్యతిరేకమగుచుండినచో మనస్సు పాడుచేసికొనరాదు. మనము చేయవలసినదానిని మనము యథాశక్తిగ చేసితి మన్న తృప్తి మనకు చాలును. ఇది కర్మసంతుష్టి. ఇది పురోగమనమునకు సాయపడును.

అన్నిటియందు సమత్వదృష్టిని అలవరచుకొని కష్టసుఖములను, సుఖదుఃఖములను సమముగా చూచుట, ఆచరణములోనికి తెచ్చుకొనుట యోగమే. ఇది వివేకవంతుని మార్గము. తత్త్వశాస్త్రసార మెరిగి దానిని ఆచరణలోనికి తెచ్చుకొన్నవాని మార్గము. అట్టివానికి ఎప్పుడును, ఎట్టి సందర్భమునందైన కలవరముండదు. ఆందోళన ముండదు. మనశ్శాంతి సతతముండును.

కర్మయోగ మనగా మతమునందు చెప్పబడిన కర్మలను - యజ్ఞయాగాదుల ఆచరణమే. కాదు.

మన జన్మము, స్వభావము - పూర్వజన్మ కర్మఫల నిర్మితనులు. సాధారణముగా అనుల్లంఘనీయములు. కాబట్టి స్వధర్మమును అవలంబించుట శ్రేయస్కరము. మేలుగా కన్పించుచున్నదని పర ధర్మమును ఆచరించుటకు పూనుకొనుట మంచిది కాదు. నిజముగా స్వభావసిద్ధమైన విధ్యుక్తధర్మ నిర్వహణమే ధర్మము.

భగవద్గీతయందు ప్రతి అధ్యాయమును 'యోగము'గా చెప్పుట పాతంజల యోగముతో సంబంధమును సూచించుట కాదు. ప్రతి దశలోను-సంపూర్ణ శ్రద్ధ-(యుక్తము)ను సూచించుట. ఫలితమును గురించి యోచనలేకుండా విధ్యుక్తధర్మము నాచరించుట, సర్వశక్తి వంతమైన ఈశ్వరభావమునందు పరిపూర్ణ విశ్వాసముంచుట, ఆ శక్తి సుదూరముగా నుండలేదని, అంతరముగా ప్రతివానియందున్నదని—సార్వజనీనమైన, సంక్షేపరూపమైన సందేశసారము.

ఏదో యొక పని-క్రియ - చేయకుండ నుండలేము. మానసిక ఆలోచన కూడ క్రియయే. ప్రతిపనియు నొక ధర్మయజ్ఞముగా సంభావించి కావించుచుండవలెను. అంతయు ఈశ్వరార్పణ బుద్ధితో చేయవలెను (అది భగవద్గీత 17వ అధ్యాయమున వివరింపబడినది). తపస్సు మానసిక, వాక్సంబంధ, శారీరకములుగా-త్రివిధములుగా-నున్నది. ఋజువర్తనము, నిగ్రహము, అహింస, సత్యవ్రతము, దానము, తుష్టి,

భగవద్ధ్యానము - విశ్వాసముతో, నిష్కామముగా అవలంబించుట తపస్సే. పెద్దలను సేవించుట కాయికమైన తపస్సు. స్వాధ్యాయము వాగ్రూపమైన తపస్సు. ధ్యానము, మననము - మానసికమైన తపస్సు.

నిష్కామకర్మలవలన చిత్తశుద్ధిని సంపాదించుకొని - ఆ శుద్ధచిత్తముతో భగవంతునియందు భక్తిని పూనుటవలన ఈశ్వరానుగ్రహలాభము పొంది తద్ద్వారా జ్ఞానమును పొందవలెను.

---

## ఋగ్వేదములోని కొన్ని విషయములు

ఋగ్వేదములోని మంత్రములందు 'బ్రహ్మణస్పతి' యని చెప్పబడిన దైవము 'గణపతి'యే (విప్ర - ప్రథమం కవీనాం). ఏ పని చేయవలసి వచ్చినప్పటికి తొలుత నతి చేయవలసిన దైవము. ఆయన అన్ని ఆడ్డంకులను, విఘ్నములను, శత్రువులను నిర్మూలించువాడు. మహాపర్వతశిఖరమున కదలింపరాని వృక్షము బోలెడువంటివాడు.

అర్చింపవలసిన జగన్మాత సరస్వతీదేవి - అంతర్వాహినియై గంగా యమునా నదులతో త్రివేణికడ సంగమించు నదితో (ప్రయాగకడ) మూర్తిభేదము లేనిది. పిమ్మట గురువును అర్చింపవలెను. గురువు - శంకర - సవితృ. విశ్వామిత్రుడు తన గురువు నుద్దేశించి ఋగ్వేదమండలమునందొక ఋక్కునకు ద్రష్టయయ్యెను. అయితే ఆయన గురు వెవ్వరో పేరు మాత్రము తెలియదు.

వేదపురుషుని కొక స్వరూప మున్నది. అందు సకలదేవత లున్నారు. అన్నము హవిస్సుగా ఋగ్వేదమంత్రములతో హింసా రహితముగా యజ్ఞము చేయ వచ్చును.

ఋగ్వేదమున శునశ్శేపుని వృత్తాంత మున్నది. హరిశ్చంద్రు డన్న రాజు చేయదలచిన 'నరమేధము'నం దాతడు- శునశ్శేపుడు - యజ్ఞపశువు. విశ్వామిత్రుని వాత్సల్యబలముచేత శునశ్శేపుడు మంత్రద్రష్టయై దేవతలచే రక్షింపబడినాడు. శునశ్శేపునిచే ద్రష్టవ్యమైన మంత్రము వరుణదేవతోద్దిష్టమని ఒక అభిప్రాయ మున్నది. దానిని 'కః' దేవతాకము (ఎవరు?) అని, బ్రహ్మోద్దిష్టమని భావించుట కూడ కలదు. కథా వృత్తాంతమునుబట్టి ఇంద్ర, వాయు, వరుణాది దేవతలందరు యజింప బడిరి. 'కః' అనగా యజింపవలసిన - దేవత - (పేరు తెలియని)గా భావింప వచ్చును. "కస్మై దేవాయ హవిషా విధేమ?" (ఋగ్వేదము X-121-2).

లౌకిక దృష్టితో చూచినచో తన సంతానముపై చూపవలసిన కారుణ్యము, రక్షణ-చూపని తండ్రిని గురించిన గాథగా తోచును. శునశ్శేఫుడు తన తండ్రిచేత పరిత్యజింపబడి విశ్వామిత్రుని గోత్రమునకు వచ్చి సంరక్షింపబడి దేవరాతుడని ప్రఖ్యాతి పొందెను. విశ్వామిత్రుని పుత్ర, పౌత్ర (ద్రష్టవ్యములైన) మంత్రములకు ప్రాముఖ్యత కలదు.

గాయత్రి మంత్రము సూర్యదేవతాకమని భావింపబడుచున్నది. ఇది అత్యంత మహిమోత్కృష్టమైనది. ఈ సందర్భమున ప్రాదేశిక అనుకూల్యత యొక్క ఆవశ్యకత వివరింపబడుచున్నది.

ఋగ్వేదమున అగస్త్యలోపాముద్రల గాథ యొక్కటి కలదు. అందు తపస్సు యొక్క ఉత్కృష్టత వెల్లడింపబడుచున్నది. లోపాముద్రాదేవిని వివాహ మాడిన అగస్త్యమహర్షి తపస్సమాధియందుండి ఆమె వృద్ధురాలగువరకు - ఆమెకు స్త్రీ సహజమైన వాంఛ కలదనియే గుర్తింపలేకపోయెను. వృద్ధురాలైన పిమ్మట ఆమె - తన్ను భార్యగా స్వీకరించియు పురుషుడైన అగస్త్యుడు పురుషునిగా ప్రవర్తింపలేదని నిష్ఠురోక్తులాడినది. అప్పుడు అగస్త్యుడు జరిగిన నిరాదరణను గుర్తించి కామావేశముతో తన తపస్సునకు భంగము లేకుండా - లోపాముద్రాదేవి కోరికను పూర్తిగా తీర్చెను.

అగస్త్యలోపాముద్రల మధ్య సాంసారిక విషయమున జరిగిన సంభాషణను అగస్త్యశిష్యుడొకడు వినుట తటస్థించి - అందులకు చాల పరితపించి ప్రాయశ్చిత్తార్థముగా కొన్ని మంత్రములకు ద్రష్టయయ్యెను. ఋగ్వేదమున లోపాముద్రా దేవి మంత్రములను (I-179-2) చూచినప్పుడిది తోచును.

సాంఘిక సమైక్యత కొక మంత్రమున్నది. సం గచ్ఛత్వం సం వదధ్వం - సమానం అస్తువో మనో యథా వః సుసహాసతి (ఋగ్వేదము X-191).

---

# సత్యజీవనము

సత్యవ్రత మనుష్ఠించుట తపోజీవనమే. సత్యము తపమే. సత్యావలంబనము తేలిక పని కాదు. నేటి కాలమాన పరిస్థితులు నాటి నాటికి కశ్మలదూషితము లగుచున్నవి. పరిస్థితులు దిగజారిపోవుచున్నవి. విశ్వమున నిలువద్రొక్కుకున్న

మతములందు సత్యమున్నప్పటికీ అసుయాయావర్గమున ఐక్యభావ సంఘటన కన్పించుట లేదు. మానవులు తమయందు నిక్షిప్తముగా నున్న శక్తిని విస్మరించినారు. తమ శక్తిని జాగరితముచేసి ప్రపంచ పరిస్థితులను చక్కదిద్దుకొన-మేలుచేసికొన-అవకాశ మున్నదని మానవులు గుర్తింపలేదు. దేవాలయములందున్న విగ్రహములు కాని, గృహములందర్చింపబడుచున్న ప్రతిమలుగాని శక్తివంతములగుట ఆ యా విగ్రహము లను అర్చించు, ఆరాధించు, పూజించు వారిపైననే ఆధారపడియున్నది.

కొన్ని మూఢనమ్మకములవలన, ఆడంబరముగా కొన్ని వ్రతాదులను చేసి కొనుటవలన ప్రయోజనము లేదు. జీవితములో, జీవనమున - సత్యమునకు, విశ్వాస మునకు, శ్రద్ధకు బలము పుష్టి చేకూర్చవలెను.

ఆత్మ సత్యమైనది, ఆత్మజ్ఞుని శక్తికి పరిమితులు లేవు. ఆతడు సర్వజ్ఞుడు. సర్వశక్తిమంతుడు. ఆత్మతత్త్వము - బ్రహ్మతత్త్వమే. ఆత్మతత్త్వమును తెలిసి కొనుటకు బాహిరముగా వెదకికొనుట కేమియు లేదు. అన్వేషణము ఆంతరము కావలెను. ఎవని జీవితము - జీవితవిధానము - వాని చేతలపై నున్నది. జీవితమును స్వర్గముగా లేక నరకముగా చేసికొనుట వానిపై అధారపడియున్నది. వివేకము - ఒకరినుండి సంపాదించుకొనునది కాదు.

మన మహర్షులు లోక శ్రేయస్సుకై—లోక సంగ్రహణార్థమై—యెంతయో చేసిపెట్టిరి. వారి అడుగుజాడలలో మనము పయనించిన చాలును. మనము జీవితము నెంత దివ్యముగా—శుద్ధముగా నడుపుకొనుచుందుమో—అంతవరకే మనకు జ్ఞానము—వివేకము—(అంత పరిమితివరకే) లభించును. అపారమైన భూతదయను, అపరి మితమైన విశ్వాసమును శ్రద్ధను అవలంబించి ఔదార్యముతో అన్యుల కష్టములను తొలగించుటకు పూనుకొనవలెను. అధర్మమును నిర్మూలింప యత్నింపవలెను. ద్వేష దోషములను సమయింపచేయవలెను. విశ్వాసమును పూని పెద్దల మాటలను నమ్మి శ్రద్ధతో ముందునకు సాగవలెను.

నిజమైన జ్ఞానము మనస్సుచేత పొందబడినది కానేకాదు. ఆధ్యాత్మికమైనది తెలుసుకొనువాడు, తెలిసికొనబడునది—ఐక్యత భజించుటను అనుభవమునకు తెచ్చు కొనుట అది. నిజముగా ప్రతివాడును బ్రహ్మచైతన్యమైనప్పుడు నీకెవ్వరితో విరోధము? ఎవ్వరు అక్కరలేనివారు?

"ఉన్నది చాలు—మన కర్మమనమనుభవింతుము — ఏమిచేసినను కర్మను అతిక్రమింపలేము" అని నిరుత్సాహపడి ఊరకొనుట మంచిది కాదు. కర్మను అతిక్రమించుటకుగాను జ్ఞానసముపార్జనకు ప్రయత్నింపవలెను. విశ్వాసమును దృఢము చేసికొని జీవితములో దానిని మేళవించి—దానిని సత్యముగా అనుభవమునకు తెచ్చుకొనవలెను. జీవితము భాగ విభాగముల పెట్టె కాదు. అది సమిష్టి సంపుటీకరణము.

సత్యము యొక్క శక్తి అదృశ్యము. ఊహాతీతము. అపరిమితము. బీభత్స ఉన్ముఖమైన పరిస్థితులను అరికట్టి శాంత సామరస్యములను పెంపొందింపవచ్చును. ఈ భావమును సువ్యక్తము చేయుటకై ఉపనిషన్మహర్షులు "సత్యమేవజయతే" అని చెప్పిరి.

కావున సత్యమును జీవితమున నులచికొన్న సర్వమును పొందినట్లే. అట్లు చేసికొనుటకు తేలిక మార్గము—ఒకేఒక మార్గము ధర్మమును అవలంబించుటే—అనుసరించుటే. ధర్మాచరణము చేయుటే.

---

## పాఠకులకు ప్రత్యేక గమనిక

ప్రతి సంవత్సరము శ్రీ శంకరకృప పాఠకుల తరఫున శ్రీ జగద్గురువులకు మూడుసార్లు పాదపూజలు చేయబడుచున్నవి.

1. చైత్ర శు షష్ఠినాడు: శ్రీ సన్నిధానమువారి జన్మదినము సందర్భముగా పాదపూజ.
2. భాద్రపద పౌర్ణమి: చాతుర్మాస్య దీక్షావిరమణము సందర్భముగా భిక్షావందన పాదపూజలు.
3. ఆశ్వియుజ బ చతుర్దశి (నరక): శ్రీ మహాసన్నిధానమువారి జన్మదిన సందర్భముగా పాదపూజ.

పాఠకులీ సమిష్టి కార్యక్రమములలో యథాశక్తి పాల్గొనగలరని విశ్వసించుచున్నాము.

సంపాదకుడు.
ప్రకాశకుడు.

Printed & Published by A. Satyanarayana Murthy, at
6-3-609/18, Anand Nagar, Khairatabad, Hyderabad - 500 004.
Printed at KRANTI PRESS, MADRAS-600 001.
Editor : T. Ramalingeswara Rao

# శృంగేరీవార్తలు

జూను

జ్యేష్ఠ శుద్ధ పంచమి ఆదివారమునాడు (7-6-1981) శ్రీ మహాసన్నిధానము వారు ఆశ్రమ స్వీకారము చేసి 50 సంవత్సరములయినది. ఆ సందర్భముగా శ్రీ మహాసన్నిధానమువారు, ఆ రోజు ఉదయం, అక్కడ ఉన్న దేవస్థానములలోను దేవతా దర్శనము చేసినారు. తరువాత వారి గురువులవారగు శ్రీ చంద్రశేఖర భారతీ మహాస్వామివారి అధిష్ఠానములో అభిషేకము, విశేషపూజ నొనరించినారు. రాత్రి శ్రీ శారదా అమ్మవారికి జరిగిన వెండి ఉత్సవమునకు దయచేసినారు. దేశము నలుమూలలనుండి భక్తులు వచ్చి ఈ కార్యక్రమములను తిలకించి, శ్రీ చరణుల అనుగ్రహమును పొందినారు. తిరునల్వేలి శ్రీ కాశీ విశ్వనాథయ్యర్ అనువారు వేద పోషక నిధికిగాను రు. 25,000 (ఇరవైయయిదు వేల రూపాయలు) శ్రీ చరణుల సన్నిధిని సమర్పించినారు.

ఆ రోజు ఉ॥ శ్రీ సన్నిధానమువారు శివమొగ్గ విజయము చేసినారు. అక్కడ శంకర మఠములో రుద్రహోమము జరిగినది. తరువాత శ్రీ సన్నిధానము వారు అనుగ్రహ భాషణ మొనరించి, అక్కడ చేరిన భక్త బృందమును ఆశీర్వదించినారు, ఈ సందర్భములో శివమొగ్గ భక్తజనులు శృంగేరిలో నున్న శ్రీ శారదా ధన్వంతరి హాస్పిటల్ కు రు. 20,000/-(ఇరవై వేల రూపాయలు) ఇచ్చినారు.

ఈ నెల 9 వ తేదీన సుప్రీంకోర్టు న్యాయమూర్తి శ్రీ E. S వెంకటరామయ్యగారు వచ్చి ఉభయ శ్రీ చరణులను దర్శించి వెళ్ళినారు.

జూన్ 18వ తేదినుంచి 28వ తేదీవరకు కరీంనగర్ వాస్తవ్యులు శ్రీ శంకర నారాయణభట్టుగారు ఇక్కడ ఋక్సంహితా యాగమును జరిపినారు.

జూన్ 21వ తేదీ ఆదివారం కాంగ్రెస్ (I) జనరల్ సెక్రటరీ శ్రీ సత్యనారాయణగారు, కర్ణాటక రాజ్య పంచాయితీ శాఖామాత్యులు శ్రీ బి. రామయ్యగారు, K. P. C. C (I) ప్రెసిడెంట్ శ్రీ రాథోడ్ గారు వచ్చి, ఉభయ శ్రీ చరణులను దర్శించి వెళ్ళినారు.

జులై

శ్రీ జగద్గురువులు శిష్యస్వామి సమేతులై శృంగేరిలో నృసింహ తపోవనమున ఆషాఢ పూర్ణిమ శుక్రవారము (17-7-81) నాడు వ్యాస పూజ చేసి చాతుర్మాస్యదీక్షను ప్రారంభించిరి. చాలామంది భక్తులు పెక్కు ప్రాంతములనుండి వచ్చి వ్యాస పూజను తిలకించి శ్రీ చరణుల ఆశీరనుగ్రహములను సంపాదించుకొనిరి.

—+—

# శ్రీ శంకర కృప

దక్షిణామ్నాయ

శ్రీశృంగేరీ శారదాపీఠము వారి యాజమాన్యమున వెలువడు

ఆధ్యాత్మిక మాసపత్రిక


| సంపుటి: 21 | వెల రు. 1 సెప్టెంబరు, 1981<br>సంవత్సర చందా రు. 10/- | సంచిక: 1 |
|---|---|---|


దుర్మతి భాద్రపద-ఆశ్వీయుజ (శకాబ్ది ౧౯౦౩)



శ్రీ జగద్గురువులు ఆషాఢ శు పౌర్ణమి శుక్రవారము (17-7-81) చాతుర్మాస్య వ్రతమున వ్యాస పూజచేయుట.

᳚

# శ్రీ శంకర కృప

సంపాదకులు: తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

| సంపుటి 21 | శంకరశ్శంకర స్సాక్షాత్ వ్యాసో నారాయణోహరిః | సంచిక 1 |
|---|---|---|


## శ్రీ శంకర భగవత్పాదాచార్య విరచిత

## శ్రీమత్త్రిపుర సుందరీ వేదపాద స్తోత్రము

శ్లో॥ విద్యున్మాణిక్య విద్రుమాభాం విశాల
శ్రోణీశింజన్మేఖలా కింకిణీకమ్
చంద్రోత్తంసం చిన్మయం వస్తుకించి
ద్విద్వత్త్వమేతం నిహితం గుహాయామ్॥ ॥64

(దీనియందున్న వేదపాదము కాఠము లోనిది)

తా॥ పగడమువంటి కాంతివంటి కాంతి కలదియు, విశాలమగు శ్రోణీ (పిఱుదు) భాగమున ధ్వనించుచున్న యొడ్డాణపు చిరుమువ్వలు కలదియు, చంద్రుని శిరోభూషణముగా కలదియు, చిద్రూపమయునగు నొకానొక వస్తువును (హృదయమన్న) గుహయందు దాచబడిన దానిని విద్వద్వరులచే తెలిసికొనుము.

విశేషములు: శ్రీ దేవిని చిన్మయరూపమైన వస్తువుగా అనగా బ్రహ్మపదార్థముగా చెప్పియున్నారు. దానిని విద్వద్వర్యులచేత—అనగా బ్రహ్మవిద్వద్వర్యులచేత తెలిసికొనవలెనట. తాత్పర్యమేమనగా గురువులను ఆశ్రయించి (గురూపసదము చేసి) బ్రహ్మజ్ఞానమును పొందవలెనని. దీనినే శ్రుతి "తద్విజ్ఞానార్థం గురుమేవాభిగచ్ఛేత్, సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మ నిష్ఠమ్" అని చెప్పినది.

శ్రీ శంకరులు చెప్పినది ఉపనిషత్సమ్మతమే. ఆయన చేయుమనుచున్నది ఉపనిషదర్థానుసంధానమే. స్తోత్రము నందున్నది బ్రహ్మవిచారణే.

శ్రీ శంకర భగవత్పాదులు శ్రీమత్త్రిపురసుందరీ వేదపాద స్తోత్రమున - సామాన్యజనుల యెడ పరమకృపామూర్తులై ఉపనిషత్సారమును - (వేదసారమును) స్తోత్రరూపమున ప్రతిపాదించిరి.

---

# శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి చరణ స్మరణమ్

## దృఢత్వము

(గతసంచిక తరువాయి)

బహు యజ్ఞములను చేసిన సోమయాజి-దీక్షితుడు-ఒకసారి శ్రీ జగద్గురువుల దర్శనమునకు వచ్చెను. శ్రీ జగద్గురువుల సన్నిధిలో జరిగిన ప్రసంగమున శ్రీ జగద్గురువు లొక యజ్ఞము నందొక హుతమును గురించి ప్రశ్నించిరి. అది యెట్లు చేయవలెనో ఆ దీక్షితుడు వివరించెను. 'శ్రౌత సూత్రములందట్లున్నదా?' యని శ్రీ జగద్గురువులు ప్రశ్నించిరి. దీక్షితుడు "ఈ సందర్భముగా శ్రౌత సూత్రము లేదు. బహుకాలముగా ఆచార సంప్రదాయమట్లున్నది" అని సమాధానము చెప్పెను. వెంటనే శ్రీ జగద్గురువులు "అట్లు చెప్పుదువేల? శ్రౌత సూత్రమున్నది. నీవు చెప్పిన పద్ధతికి విరుద్ధముగా నున్నది" అని శ్రౌత సూత్రమును చెప్పిరి. దీక్షితుడు దిగ్భ్రాంతి పొంది— "కావచ్చు. కాని మేమా ఆచార పద్ధతినే అవలబించి చేయుచున్నాము" అనెను, శ్రీ జగద్గురువులు "సూత్రము తెలియనివారు ఆచారములో నున్నదని చేయుట జరుగ వచ్చును. కాని సూత్రము లెరిగిన మీవంటివారి కది తగునా?" అనిరి. సూత్రము ప్రకారమే చేయవలెనని దీక్షితు లంగీకరించి—ఏ ఒక్క యజ్ఞము చేయుట లేనే లేదు—చూచుటకూడ లేని శ్రీ జగద్గురువుల కింత శ్రౌత పరిజ్ఞానముండుట కాశ్చర్య పడెను.

ఒక శిష్యుడు కొన్ని సంస్కృత శ్లోకములను శ్రీ జగద్గురువులకు సమర్పించుటకు పంపెను. వాటిని తీసుకొన్న మఠోద్యోగి మరియొకని చేతి కిచ్చి సమర్పింపుమని చెప్పెను. ఆ రెండవవాడు దానిని తన గది కిటికీలో పెట్టి మరచిపోయెను. రెండు నెలల తరువాత నతడు ఆ గదిని విడిచి వెళ్ళిపోగా—ఆ గది కిటికీలో ఆ సంస్కృత శ్లోకముల కాగితమున్నది. శ్రీ జగద్గురువు లా గదిలోనికి కాకతాళీయముగా వెళ్లగా ఆ కాగితము కన్పించినది. దానిని వారు తీసికొని శ్లోకములను చదివిరి.

ఈ యంతయు కాగితము తీసికొన్న మఠోద్యోగికి తెలియగా అతడు—తానే ఆ కాగితమును స్వయముగా నిచ్చియుండవలసినదని—లేక కనీసము శ్రీ చరణులకు సమర్పింపబడినదాయని విచికిత్స చేసియుండవలసినదని పశ్చాత్తాపమును పొంది—

శ్రీ చరణుల సన్నిధికి పోయి క్షమాపణ చెప్పుకొనగా శ్రీ జగద్గురువు లిట్లనిరి. "ఫరవాలేదు. ఎవరికి చేరవలెనని ఉద్దేశింపబడెనో—చివరకు ఎట్లో ఒకట్లు—అచటకే చేరినది కదా?" ఈ మృదుభాషణము—తీవ్ర అభిశంసనముకంటె గాఢమైనది.

(సశేషము)

—:o:—

# శ్రీ జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణుల ఉపదేశము

మత దురభిమానము—అసహనము నిజమైన భక్తి విశ్వాసములతో పొంతన లేనివి. భగవంతుని తరపున తమ్ము తాము ప్రతినిధులుగా భావించుకొనువారు తమ తోటివారిపైనహింసాకాండను జరిపి బహుబాధలను కల్పించినారు. దయావాత్సల్య సముద్రుడైన భగవంతు డిట్టి క్రూరత్వములవలన (తన భక్తులమని చెప్పుకొనువారు చేసినవి)సంతోషింపడు.

హిందువులలో—విష్ణువు గొప్పవాడా, శివుడు గొప్పవాడా—అని వివాదమున్నది. ఆ వివాదమునకు వాదిప్రతివాదులు—శాస్త్రప్రమాణములను చూపుచు తగవులాడుదురు. ఈ వివాదము నిజముగా క్షమింపరాని మేధా దుర్వినియోగము. ప్రతివారికొక 'ఇష్ట దేవత' ఉండుట సహజము. తప్పులేనిది. ఇష్టదేవత—ఒక ప్రత్యేక దేవతామూర్తి. అతడా ఇష్టదేవతామూర్తియందు భక్తి విశ్వాసములను పెంచుకొనును. అట్లని అతడు ఇతర దేవతారూపములను దూషించుటకు—అధికారము లేదు. ఒక ప్రత్యేకరూపముతో భగవంతుని నేను ప్రత్యక్షముగా చూచితిని, మాటాడితిని—అని నిశ్చయముగా చెప్పజాలనంతవరకు—మిగిలిన దేవతారూపములను దూషించుట, అపహసించుట తగదు. సర్వశక్తివంతుడైన భగవంతు డేరూపముతో నైన అవతరింపగలడు.

విష్ణువునకు, శివునకు భేదమున్నదని భావించువాడు తరువాత జన్మమున భరింపరాని కడుపునొప్పితో బాధపడు నని కర్మవిపాకమన్న శాస్త్ర గ్రంథము చెప్పుచున్నది. అట్టి బాధ తొలగించుకొనుటకు ప్రాయశ్చిత్త విధానము చెప్పబడినది.

పరిపూర్ణ జ్ఞానమూర్తియైన భగవంతుడొక జీవిని—ఒక ప్రత్యేక మత విశ్వాసము కల కుటుంబములో జన్మించునట్లు చేయును. ఆ జీవికి యేది మంచిదో భగవంతునికి తెలియును కదా! విదేశములనుండి క్రైస్తవు డొకడు శ్రీ శృంగేరి జగద్గురు

చంద్రశేఖరభారతీ మహాస్వామి చరణులను (పరంపరలో 34 వారు) తానేమి మత్త మును స్వీకరించిన శీఘ్రముక్తి లభింపగలదని ప్రశ్నింపగా శ్రీ జగద్గురువులు—'నీవు ఉత్తమ క్రైస్తవుడగుటకు ప్రయత్నింపు'మని ఉద్బోధించిరి.

దేవాలయమున దేవతా విగ్రహము ముందు సనాతనధర్మ మవలంభించువాడు మ్రొక్కి ప్రార్థించునపుడు—ఆ విగ్రహమున భగవంతుడున్నాడని సంభావించును. ఆ విగ్రహ మే పదార్థముతో తయారుచేయబడినదన్న ఆలోచన ఉండదు. ఇదే పద్ధతి అన్ని విధములైన అర్చనలకు. భగవంతునికి అతిలోకమైన శక్తులున్నవని అంగీకరించుచున్నాము కాబట్టి—మన ఇష్టదేవతామూర్తి యొక్కటే భగవంతునికి సాధ్యమైన రూపమని భావించుట అసంభావ్యము.

'అద్వేష్టా సర్వభూతానాం' అని కదా శ్రీకృష్ణపరమాత్మ బోధ. నాస్తికులు కూడ లోకమున నిర్వహింపవలసిన పాత్రయున్నది. భగవంతుడు అనేక విధములుగా తన పరిపూర్ణత వెల్లడించును.

---

# శ్రీ జగద్గురు భారతీ తీర్థస్వామి చరణుల ఉపదేశములు

## (మదరాసు బీసెంటు నగరున 1977 లో చేసిన అనుగ్రహ భాషణము)

వేదధర్మమును సముద్ధరించి, బహుప్రబోధ గ్రంథములను రచించి, శ్రీ శంకర భగవత్పాదులు మనకెంతో మేలుచేసిరి. న్యాయశాస్త్రములందు నిష్ణాతులగు వారి కొరకు సూత్రభాష్యమును రచించి, 'దీనిని గ్రహించుడు. దీనిని అధ్యయనము చేసినందువలన—'సత్య మెట్టిదో తెలియనగును' అని ప్రబోధించిరి. అట్టి శాస్త్ర సామర్థ్యము లేనివారి కొరకు వివేకచూడామణి, సర్వ వేదాంతసారసంగ్రహము, ప్రబోధ సుధాకరము, మొదలగు గ్రంథములను ప్రసాదించిరి. ఈ గ్రంథములు 500 నుండి 1200 వరకు శ్లోక సంఖ్య కలవి.

అంతకంటె క్లుప్తముగా తత్త్వసారము కావలెనన్న వారికి 'శత శ్లోకి' (100 శ్లోకముల గ్రంథము) నిచ్చిరి. ఇంకను తక్కువలో కావలెనన్నవారికి 'దశ శ్లోకి' (పది శ్లోకములు) చెప్పిరి. ఆయన అత్యల్ప పదములలో సత్యమును చెప్పాదునని 'ఏక శ్లోకి' (ఒకే శ్లోకమున) యందు తత్త్వార్థమును ప్రకటించిరి. ఆయనకు మానవుల

యందున్న అనుకంప—వాత్సల్యము—అపారము—మన ఊహలకందని ప్రమాణమున నున్నవి. ఆయనకు సాష్టాంగ ప్రణామములు చేయుటకంటె మనకు చేతనైనది మరి యొకటి లేదు.

ఇట్టి వేదాంత గ్రంథములనే కాక, ఆయన స్తోత్రముల నెన్నింటినో రచించిరి. సగుణబ్రహ్మము నుపాసింపనిచ్ఛగల వారి కీ స్తోత్రములందు కూడ నెన్నియో ముఖ్య వేదాంత సత్యములు. ఆయన రచించిన స్తోత్రములు కేవలము హస్త నేత్రాది వర్ణనములు కావు. ఎంతయో సదుపదేశమున్నది.

ఒక ఉదాహరణము. శ్రీ భగవత్పాదుల భావములు మనకు తెలిసినవే. ఉన్నది ఒక్క సచ్చిదానంద బ్రహ్మమే. మిగిలినదంతయు అధ్యారోపితము. బ్రహ్మజ్ఞాన లాభమువలన జగన్మిథ్యాత్వము అనుభవమగును. ఆత్మసాక్షాత్కారమువలన ముక్తి. ఇది ఉపనిషత్సారము,

సాధకుని హితము కోరి—యీ బ్రహ్మము—శివవిష్ణ్వాది రూపములను స్వీకరించును. ఇది శ్రుతిసమర్థమైన విషయము. బ్రహ్మమునకు రూపకల్పన—అనేకముగా నున్నది. శివ, విష్ణు, దేవి,సూర్య,గణపతి—మొదలగునవి. మరల విష్ణువునకు పెక్కు అవతారములు—రామ, కృష్ణ, నృసింహాదులు.

శ్రీ భగవత్పాదు లీ సకల దేవతలపై—ఒకటి—లేక మరికొన్ని స్తోత్రములను రచించిరి. శ్రీ నృసింహునిపైన నొక స్తుతి యున్నది. శ్రీ భగవత్పాదుల దృష్టి—లక్ష్యము నిర్గుణ పరబ్రహ్మముపైననే. అందుచేతనే ఆయన సగుణ బ్రహ్మము—ఈశ్వర—రూపములను భిన్నముగా చూడలేదు. అవియు హితకారకము లనియే ఆయన నిరూపణము. (సశేషము)

—o—

## చందాదారులకు విన్నపము-ప్రకాశకుని చిరునామా మార్పు గమనింపుడు

చందాలు బాకీయున్నవారికి పత్రిక పంపబడదు. చందా సొమ్మును ముందుగనే (తమ అడ్రసు మార్పుకూడ వెంటనే) క్రింది చిరునామాకు పంపవలెను.

ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి,
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు,
6—3—609/18, ఆనందనగర్,
ఖైరతాబాదు, హైద్రాబాదు—500 004.

# ప్రస్తావన

శ్రీ శంకరకృప వింశతి వత్సరములను పూర్తి చేసి—యీ సంచికతో — ఇరువదియొకటవ సంవత్సరమును ప్రారంభించుచున్నది.

కాగితపు ధరలు విపరీతముగా పెరుగుట-ముద్రణాలయ వ్యయము పెరుగుట- మొదలగు అధిక వ్యయములవలన పత్రికా నిర్వహణము కష్టతరముగా నున్నది.

మన భాష, మన సంస్కృతి, మన సంప్రదాయము—నేటి యువతరము వారిలో చాలమందికి హేయపదార్థములై పోయి—పాశ్చాత్య భావ దాస్యములో పడి పోయినవారికి మనకొక మహోత్కృష్టమైన సంస్కృతి, తాత్త్విక దార్శనిక సంపన్నత కలవనియే తెలియని విషమకాలములో మనమిప్పుడున్నాము. అందుచేత యువక వర్గమువారి ఆదరమునకు మన పత్రికలవంటి పత్రికలు ఆశించి ప్రయోజనము లేదు.

మనకున్న మహా దురదృష్టమేమనగా-మన దేవాలయములు, దేవదాయ, ధర్మదాయములు కూడ భావదాస్య ప్రబుద్ధుల కైవసములై—అట్టి సంస్థలనుండి కూడ రాతగినంత ఆదరము లభించుటలేదు.

ఏది యెట్లున్నను. శ్రీ జగద్గురువుల ఆశీర్బలమువలన—శ్రీవారి ఆనతిమేరకు- విరామములేని యీ పత్రికా నిర్వహణయాత్ర సాగుచు నేయున్నది. అయితే మొదటి నుండి కొందరు పాఠకులు తమ ఆదరాభిమానములను మా యందు అవిచ్ఛిన్నముగా చూపుచునే యున్నారు. అది మాకు సముచిత ప్రోత్సాహకారిగా నుండి—భారమైన ఈ పత్రికా నిర్వహణను కొంత సుకరము చేయుచున్నది.

మా పాఠకులను మేము కోరునదేమనగా—ప్రతివారు మరిద్దరు చందాదారులను (సంవత్సరమున కొకసారి) చేర్పింపుడని.

ఈ నూతన వర్షారంభ సంచికా ప్రకాశనవేళ—శ్రీ శంకర భగవత్పూజ్యపాదస్థానమున తత్ప్రతినిధులుగా ప్రకాశించుచున్న శ్రీ శృంగేరీ జగద్గురు మహాసన్నిధానమువారి చరణకమలములకు ప్రణామించి—యీ నూతన సంచికను పాఠకుల కరకమలములందుంచుచు—పాఠకుల యితోధిక ఆదరాభిమానములను అభిలషించుచున్నాము.

దుర్మతి భాద్రపద
శుక్ల తృతీయా
మంగళవారము
1-9-1981



తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు
సంపాదకుడు

ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి
ప్రకాశకుడు.

# సంస్కృతభాషను మనమేల ఆదరించి నేర్చుకొనవలెను?
# (43)

ఈ ప్రశ్నకు మన దేశంలో మేధావివర్గంలో మూర్ధన్య మనీషామణులు సమాధానాలు చెప్పారు. గత సంచికలందు కొన్నిటిని తెలుసుకున్నాము. ఇప్పుడు మరికొన్ని. (సంపాదకుడు)

## శ్రీ ప్రశాంత బిహారీ ముఖర్జీ
న్యాయభారతీ న్యాయాధీశ, కలకత్తా హైకోర్టు

ఈ మహాదేశ పౌరులందు యావద్భారత దృష్టి కలిగింప గల భాష సంస్కృత మొక్కటేనని నా దృఢవిశ్వాసము. అమూల్యములైన మన తాత్త్విక దార్శనిక శాస్త్రములు, సాంఘికశాస్త్రము, ఇతిహాసము—ఘనమైన మన సంప్రదాయము—వ్యాఖ్యానింపబడి తమ కంఠస్వరమును సంస్కృతమున సంస్కృత భాషతో పలుకుచున్నవి. ఈ స్వతంత్ర భారతదేశముయొక్క పౌరుడు, తన తాత్త్విక దార్శనిక ఇతిహాస సంప్రదాయభావము లే భాషయందున్నవో ఆ భాషను నేర్పబడక—తెలుపబడక—పోయినచో—అతనికి అతని వారసత్వము తొలగింపబడినట్లే.

ఆధునిక విజ్ఞాన దృష్టితో పరిశీలించినప్పటికి సంస్కృతము చాల ముఖ్యమైన భాష. ఈ నవ్యయుగము విజ్ఞాన శాస్త్రయుగ మనుచున్నారు. సంస్కృతమున అమూల్యమైన భౌతికశాస్త్ర, రసాయనికశాస్త్ర, గణితశాస్త్ర, ఖగోళశాస్త్ర, జ్యోతిషశాస్త్ర, శారీరకశాస్త్ర విషయము లెన్నియో కలవు. వాటిని మన విద్యావేత్తలు ఏ మాత్రము విస్మరింప తగదు.

వంగీయ సంస్కృత శిక్షా పరిషద్, కలకత్తా
(సభ) అధ్యక్షీయ భాషణ 1957.

---

## వ్యాసములు-ఎక్చేంజి కాపీలు, రివ్యూకి గ్రంథములు

మా పత్రికకు పంపదలచిన వ్యాసములను ఎక్చేంజి కాపీలను రివ్యూకి గ్రంథములను (2 కాపీలు) యీ క్రింద చూపిన మా మద్రాసు కార్యాలయము అడ్రసునకే పంపవలెను.

శ్రీ రామలింగేశ్వరరావు,
నెం. 68 కోడంబాకం హైరోడ్డు, త్యాగరాయనగరు, మద్రాసు-600 017.

# శ్రీ విద్యారణ్య విజయగాథ



13

శ్రీవిద్యారణ్యులు వ్యాస మహర్షి కోసమై కాశీ పురమంతా గాలించారు. ఆయన కన్పించక పోగా నిస్పృహ చెందారు.

అప్పుడు వెంట నున్న శృంగి వ్యాస మహర్షి ఏరూప ముతో వచ్చి నిత్య ము విశ్వనాథుని దర్శించి పోతారా— ఆ రహస్యము విద్యారణ్యులకు చెప్పాడు.



# వేదాంత న్యాయములు (40)

న్యాయములవంటి ఉదాహరణలు)

[వేదాంత శాస్త్రముతో సూక్ష్మవిషయములను బోధచేయుటకు కొన్ని ఉదారణహాలు సాధారణముగా నుపయోగించెదరు. ఈ ఉదాహరణలు నిత్యజీవితమునకు సంబంధించినవిగా నుండి-వీటిమూలమున దుర్గ్రాహ్యమైన సిద్ధాంత విషయములను అవగాహన చేసికొనుటకు తోడ్పడును. ఈ ఉదాహరణలవలన-సునిశిత ప్రజ్ఞావంతముకాని సామాన్యుని మేధస్సుకూడ సిద్ధాంతమును గ్రహింపగల్గును. సామాన్యపాఠకులకొఱకు వేదాంత న్యాయముల వివరణములను క్రమముగా ప్రకటించుచున్నాము. సంపాదకుడు]

## మనిషి-కంఠహారము

ఒక వనిత బంగారు కంఠహారమును మెడలో వేసికొన్నది. కాని కొంత సేపటికి తాను హారమును ధరించినట్లు మరచిపోయినది. అప్పుడు హారముకొరకు వెదకుట ప్రారంభించి ఇల్లంతయు గాలించినది. కంఠహారము పోయినదని వెతతో గగ్గోలుపడినది. హారము తన కంఠమునందే యున్నను ఆమెకు కన్పించలేదు.

ఆదేవిధముగా జీవుడు పరిపూర్ణత్వముకొరకు, ఆనందముకొరకు బాహిరమున నెల్లెడల అన్వేషించును. ఆత్మ-(తన) ఆత్మ-బ్రహ్మపదార్థమేనని నిత్యశుద్ధబుద్ధముక్తుడని తెలియక తపించును.

---

## శ్రీ శంకర భగవత్పాద విరచిత వేదాంత డిండిమము

అవతారిక (మొదటి శ్లోకము) వేదాంతమునందలి ముఖ్యభావములను ప్రకరణ గ్రంథముగా రచింపదలచి శ్రీ శంకర భగవత్పాదులు మంగళాచరణము చేయుచున్నారు.

శ్లో॥ వేదాంత డిండిమా స్తత్త్వమేకముద్ఘోష యన్తియత్
ఆస్తాం పురాస్తాత్తేజో దక్షిణామూర్తి సంజ్ఞితమ్॥

తా॥ వేదాంతములన్న డిండిమములు (భేరి-భేరులు-) యేది యొక్కటే తత్త్వమని యుద్ఘోషించుచున్నవో—శ్రీ దక్షిణామూర్తి యన్న పేరు గల ఆ తేజస్సు ముందు నిలుచును గాక!

విశేషములు: వేదాంతములయొక్క ఉద్ఘోష భేరినాదములతో పోల్చి శ్రీ శ్రీ భగవత్పాదులు రూపకాలంకారముగా చెప్పినారు.

సర్వ మొక్కటేయైన తత్త్వమును శ్రీ భగవత్పాదుల దక్షిణామూర్తి

తేజస్సుగా నిచ్చట సంభావించిరి. జ్ఞానమును బోధించు శ్రీ గురుమూర్తియైన దక్షిణామూర్తిని సాంకేతికముగా జ్ఞానరూపమని-బ్రహ్మతత్త్వమని చెప్పిరి.

అవ. (2వ శ్లోకము) వ్యావహారిక జగత్తునందు రెండే పదార్థములున్నవని చెప్పుచున్నారు.

శ్లో॥ ఆత్మాఽఽనాత్మా పదార్థౌ ద్వౌ భోక్తృ భోగ్యత్వ లక్షణౌ
బ్రహ్మైవాఽఽత్మాన దేహాదిరితి వేదాంత డిండిమః॥

తా॥ ఆత్మ అనాత్మ యని రెండు పదార్థములు. ఆత్మభోక్త. అనాత్మ భోగ్యము. ఆత్మ బ్రహ్మమే అగును. దేహాదులు ఆత్మ కాదు—అని వేదాంతడిండిమములు ఘోషించుచున్నవి.

విశేషములు: ఆత్మ - చైతన్యము; అనాత్మజడము. ఆత్మానాత్మ వివేకమువలన ఆత్మను గుర్తింపవలెను.

(సశేషము)

శ్రీ శంకరకృప 21 సంపుటి ప్రారంభ సంచికతో—యీ నూతన ప్రకరణ గ్రంథ వ్యాఖ్యానమును ప్రకటించుటకు సంతోషపడుచున్నాము.

—సంపాదకుడు.

---

# గురువంశ కథా కథనము

(సంస్కృత మూలము: బ్రహ్మశ్రీ కాశీలక్ష్మణశాస్త్రి గురువంశ కావ్యమ్)

తెలుగు: శ్రీ చెఱుకుపల్లె జమదగ్నిశర్మ ఎం. ఏ.

(గత సంచిక తరువాయి)

## షోడశసర్గము

గురుచంద్రులు పూర్ణవికాశమంది ప్రకాశించుచుండగా జననయన కైరవములు వికసించినవి. బుధహర్ష మహాంబునిధి యుప్పొంగినది. ప్రతిపక్ష చోరులు పలాయితులయిరి. (1) హిమధరావధిగా సర్వమహీతలము గురువుల కీర్తిచంద్రికలచే ధవళికమైనది. చంద్రుడు పగతుడై క్షీణించిపోయినాడు. గత బలున కభివృద్ధి యెట్లు కలుగును? (2) శ్రీవారి తపః పావకుడు ప్రజ్వలించుచుండగా సర్వ దుర్వాద ప్రతి

చాదులును భయాకులులై శలభీభూతులయిరి. (3) వారు విద్వాంసుల కెల్లరకు అభిమతార్థములను విరివిగా ప్రతిదినము నిచ్చుచుండుటచే భూలోక కల్పవృక్షములైన వారి ఆశ్రమములో బుధజను లెల్లరు నమరులవలె నభివృద్ధి చెందిరి. (4) బహుదేశ సమాగతులైన వేదవేత్తలను నియోగించి నిరంతరము వివిధ యాగములు చేయించుచున్న గురువరుల వలన తృప్తులైన దేవతలు వీరే ఇంద్రులని స్తుతింపసాగిరి. (5) దేశదేశముల విఖ్యాతులైన రాజు లెల్లరు దిగంత వ్యాప్తమైన గురువుల కీర్తి నెఱిగి వచ్చి దినదినము శ్రీవారి చరణములను శిరః కిరీట మణికాంతులతో నర్చించుచుందురు. (6) ఆ రాజు లెల్లరు తమ అభ్యుదయమున కంతకు శ్రీవారి అనుగ్రహమే హేతువని యెంచి వివిధామూల్య వస్తువాహనాదులను బహుధనము లర్పించి వారి నానందపరచుచుందురు. (7) క్షితిపతు లొసంగు మహా ధనములను అంగీకరించి ఆనందించు యతి పతులు ఈ రాజు లెల్లరు రఘువంశీయులవలె నభ్యుదయమందవలెనని ఆశీర్వదింతురు. (8) శృంగపురియందే నివసించుచు శ్రీవారు కాలక్షేప మొనర్చుచున్న వివరమంతయు నెఱింగిన బసవభూపాల పుత్త్రుడగు సోమశేఖర నాయకుడు శృంగపురి కేగి గురువుల నర్చించుకొన నెంచెను. (9).

వెంటనే ఆ రాజు ఆత్మహితార్థులగు మంత్రులతో గజతురగ పదాతి సైన్యములతో సకల పరివారజనముతో నగరమునుండి బయలుదేరెను. (10) సకల జానపదులు నుపదలతో నర్చించుచుండ, సురభిశీతల గంధపవనములు వీచుచుండ, ప్రమదా జనములతో నృత్తగీత వాద్య వినోదములతో నతని ప్రయాణము సాగినది. (11) అట్లు పోయి పోయి అతడు కారవ దుర్గమునకు పోవు దారిలో నున్న తీర్థపురమును చేరుకొనెను. అక్కడ వరాహజనది సర్వపాప వినాశినియై ప్రవహించుచున్నది. (12) సలిలకేళీ విహారప్రియుడగు నతడు అక్కడ కొన్ని దినములు గడపదలచి తన ఆగమనమును ముందుగా తెలుపుటకొరకై నీవు ముందుపోయి మేమిట్లు వచ్చుచున్నామని యతీంద్రులకు మనవిచేయుమని యొక దూతను పంపెను. (13) వాడు పోయి "స్వామీ! బసవరాజ తనూజుడగు ద్వితీయ సోమశేఖర భూపాలుడు తమ ఆశీస్సుల నపేక్షించి సేవించుకొనుటకై సాంతఃపురుడై సైన్యములతో వచ్చుచున్నా"డని మనవి చేసెను. (14) ఆ వార్త విన్న గురువర్యులు హృష్టమనస్కులై ఆ రాజు వచ్చి నప్పుడుండుట కొక దివ్యభవనమును సిద్ధము చేయించిరి. అది అమరశిల్పి నూతనముగా నిర్మించెనా అన్నంత శోభతో సర్వవస్తు సంభరితమై యొప్పినది. (15) ఊరంతటిని

9 వ శ్లోకము: బసవరాజ తనూజాదన్నచో సోమశేఖరభూపతి (చూ. 60 శ్లో)

ధ్వజతోరణావళులతో అలంకరింపజేసిరి. సౌధములకు వెల్లలు వేయించి రాజమార్గముల నుభయ పార్శ్వముల యందును ప్రతి యింటియొద్ద కదళికా స్తంభాదులు కట్టింపజేసిరి. (16) మంచి గంధపునీళ్లతో కలయంపులు చల్లించి సువాసనను వెల్లివిరియజేసిరి. రాజపరివార ముండుటకును తగిన వసతి గృహములు సిద్ధము చేయుంచిరి. (17).

అప్పుడు రాజు తీర్థపురమునుండి సబలుడు సామాత్యుడు సాంతఃపురుడునై బయలుదేరెను. దారిపొడుగున ప్రజల ననురంజించుచు నాతడు శృంగపురిని చేరవచ్చెను. (18) అతడు పురము సమీపించుచున్న వార్త తెలిసిన వెంటనే యతివర్యులాతని నెదుర్కొని సగౌరవముగా తీసికొనివచ్చి సిద్ధమై యున్న విడిదులలో విడియజేయుటకై తగిన వ్యక్తుల లాతని కడకు పంపిరి. (19) వారు పోయి గురువులు చెప్పినట్లు రాజు నన్నివిధముల గౌరవించి మేళతాళములతో వందిగానములతో మహావైభవముగా శృంగపురికి తెచ్చిరి. (20) అమరావతివలె సర్వవస్తు సమృద్ధమై విభవోపేతమై యున్న శృంగపురి నన్నివైపుల గమనించి తన రాజధానికంటె నిది మిన్నగా నున్నదని రాజు ఆశ్చర్యమునందెను. (21) వ్రేలాడుచున్న కత్తుల తళతళలతోడి కాల్బలములుగజతురగ సైన్యములు చుట్టును చేరి పటురవముల కాకరమగుచుండ నా పురమప్పుడు ఉరుములు మెరుములతోడి మేఘజాలములచే నావృతమైనట్లే యొప్పినది. (22)అప్పుడు రాజును వంది జనస్తోత్రములతో మేళతాలములతో నతనికై సిద్ధము చేసియుంచిన దేవేంద్రభవనమువంటి భవనములో విడియింపజేసిరి. (23) ఆ భవనము నుండి తుంగభద్రా నదినుండి వీచుచున్న సురభిళ మందపవనములతో విచ్చిన పూల సువాసనలు గుప్పుమనుచుండ ప్రమదాగణసేవితుడై రాజు విశ్రాంతి నందెను. (24) నదియొడ్డుననే యున్న దిగుడుబావియొద్ద మల్లికామాలతీ చంపకాది బహుసుగంధి పుష్పములతో శివార్చన ముగించుకొని సోమశేఖరు డానందించెను. (25) క్షితిసురులతో సురలతో పరివేష్టితులై యుండు యతివరులను మలహానికరేశ్వరులను సేవించుకొనవలయునని రాజప్పుడు సముచిత పరివారసమేతుడై విడిది భవనము నుండి బయలుదేరెను. (26) కొండయెక్కి మలహానికరేశ్వరుని భవానీదేవితో సమర్చించుకొని సర్వ దేవగణములతో కైలాస శిఖరమున శివుని చూచినట్లే రాజానందించెను. (27) గిరిజా పరిరక్షితనగుచుండుటచే నిచ్చట నాకెట్టి దానవ భీతియు నుండదను విశ్వాసముతో రజతాచలమే పరచుకొని యున్నదా యన్నట్లు చుట్టునున్న పురవీథులొప్పారినవి. (28) భక్తమనోరథములు నేను తీర్తును నేను తీర్తు ననుచు స్పర్ధ

వహించునట్లుగా సర్వ విఘ్నవిదారణ పటువులగు గిరిజా తనయు లిరువురు పురస్థితులై యుండిరి. (29).

ఇట్లు తలపోయుచు రాజకుమారుడు పరమశివ పాదారవిందములకు ప్రణామము లాచరించి యతివర్యులను దర్శించుకొనవలయునను నాతురతతో కొండ దిగి మఠమున కేగు మార్గము పట్టెను. (30) దారిలో రాజు సర్వదేవతామూర్తులతో నతిరమణీయమై మేరువువలె నొప్పు విద్యాశంకర మందిరమును నదియొడ్డున దర్శించెను. (31) రాజు శారదామందిరము చేరునప్పటికి యతివర్యులు నచ్చటికి విచ్చేసి యుండిరి. అక్కడ వారిరువురి సమావేశము గాఢమిత్రులగు అలకాపతి కైలాసపతుల సమావేశమువలెనే యొప్పినది. (32) పరస్పర కుశలప్రశ్నము లొనర్చికొని ముదావహు లగుచున్న యతిరాజ నృపోత్తము లిరువురును గుణమణి నిర్భరులగు హిమహేమ గిరులవలె విలసిల్లిరి. (33) తరువాత ఏర్పాటైన సదస్సులో యతివరులు రాజునకు నృపవరార్హ విశిష్టవస్తువు లిప్పించి సంతోషపరచుచు బృహస్పతి ఇంద్రునివలె ఇతోధిక వృద్ధినందవలెనని ఆశీర్వదించిరి. (34) అప్పుడు రాజు "స్వామీ! ఈనా సంపదయంతయు భవదుపాత్త తపోబల వరిష్ఠతనీమైనదే! తాము పూర్ణచంద్రులు, నిది పండు వెన్నెల" అని యోగివర్యులకు వినీతుడై మనవి చేసెను. (35) పిమ్మట సర్వాభీష్టదయగు శారద నర్చించుకొనినవారై ప్రసాదమును స్వీకరించి వారిరువురును తమ తమ నిలయముల కేగిరి. (36) "ఈ పురముకంటె నధికముగా నున్నది, దీనితో సమానమైనది భూతలమున మరేదియు లేదు" అని రాజనందనుడు శృంగపురిని గూర్చియే విస్మయముతో నాలోచించెను. (37) మంత్రిని రప్పించి "నాకు కీర్తికరము, యతిపతులకు సమ్మతము నగు సత్కార్మ నేదైన ఇక్కడ మిక్కిలి త్వరలో చేయవలె"నని ఆదేశించెను. (38) స్వమతాభిమాని యగు నా మంత్రి గురుమఠమునకు దగ్గరనున్న తుంగభద్రానది యుభయ పార్శ్వములను చక్కగా విచారించి రాజు చెప్పినందువలననే అయినను స్వమతమును స్మరించుకొనుచు తదనుయాయులకని రెండు మఠములను కట్టించెను.(39) బసవరాజసుతుడు డా పిమ్మట వసిష్ఠాశ్రమమున కుశికాత్మజుడున్నట్లు సర్వసుఖముల ననుభవించి కలశేశ్వరుని దర్శించుకొనవలెనని శృంగపురినుండి అక్కడకు వెళ్ళెను. (40).

తరువాత యతీశ్వరులు ఆత్మీయులగు మఠాధికారులవలన రాజొనర్చిన పనుల వివరములు తెలిసి ధృతివంతులై నిర్భయముగ నుండిరి. కాలవేత్తలగు తపస్వివరులకు పరభీతి యుండదు గదా! (41) గురువరు లప్పుడు బహు గుణవంతులు నయశాస్త్ర

విశారదులు నగు నాత్మీయుల నెల్లరను తమ నివాసభవనమునందు ఏకాంత ప్రదేశమున సమావేశపరచి వారితో గూడి ప్రకృతకార్య హితాహిత చింతన మొనర్చిరి. (42) సమావిష్టుల కందరకు తమ హృదయము నావిష్కరించి "మనకు హితులైన వారి యెడల సామమే మహోదయ హేతువగును. మరియు నవసరమగుచో భేదమవలం బింపవచ్చును. ఇతరోపాయముల కిచ్చట పనిలేదు" అని పలికిరి. (43) గురూక్త వచనములు విన్న హితులెల్లరు వారిని పూజించి "తామన్న పద్ధతియే సమంజసముగా నున్నది. అంతయు త్వరలోనే చక్కబడగలదని ఆశింతుము" అని మనవి చేసిరి.(44) ఇట్లు నిశ్చితమతులైన గురువర్యులు శైవజనులతో నిండిపోయిన శృంగపురిని వదలి నివాసయోగ్యమగు కడుప నిగరమున కేగ నిశ్చయించిరి. (45).

అట్లు శృంగపురిని వీడి వెడలుచున్న గురుపుంగవుల వెంట పురజను లెల్లరు ననుగమించిరి. దారి బట్టిన కామధేనువు వెంట దేవతలు అనుగమించినట్లే వారి నిర్గమన మొప్పినది. (46) దేవపురోపమమై సమస్త సుఖావహ మగుచున్న కడుప నగరములో పురజనలు నెల్లరను రక్షించుకొనుచు గురుపుంగవులు నిత్యాహ్నిక తత్పరులై సుఖముండిరి. (47) అచ్చట సురాసురమౌళి మహామణియగు పర శివదేవుని పాదపద్మములయందు మనసు నర్పించిన యతీశ్వరులు శివపురాణ కథామృతము నాస్వాదించుచు మహానందముతో నుండిరి. (48) చుట్టును నారికేళ వృక్షములు పెరిగి బహుశీతల జలములతో అమృతవాపివలె నున్న సరోవరములో నిత్యస్నానము లొనర్చుచు వి క్లేశము నెరుగకున్న పరిజనులు కూడ వివిధ భోగము లనుభవించుచు విరాజిల్లిరి. (49) జగద్గురువు లొనర్చుచున్న మహోత్సవములచే పరితుష్టుడైన కడు పాధిప దేవుడును "ఓ మునివర్యా! నీ ఈప్సితము త్వరలోనే నెరవేరగలదు. స్వపుర మున కేగక ఇక్కడనే ఉండుము" అని అనుగ్రహించెను. (50) దధ్యాజ్యభక్ష్య విశేషములతో నిత్యబ్రాహ్మణ సమారాధనలు చేయించుచు యుధిష్ఠిరునివలె గురువులు నిశ్చింతులై యుండిరి. (51).

అటుపిమ్మట బసవరాజ తనూజుడు కలిశేశ్వర (కలశేశ్వర) సన్నిధినుండి కుమారస్వామి వాసుకి రూపముననున్న ధారానదీతీరమునందలి కుక్కపురమున కేగెను. (52) అక్కడ శరవణభవునకు మహోత్సవము చేయించి స్వామికి సంతోషము కలి గించి మార్గ మధ్యమున పాల్యులనుండి కరములు స్వీకరించుచు మంగళ గ్రామము చేరెను. (53) జలధి విహారప్రియుడగు వా రాజక్కడ నౌకావిహారము లొనర్చి సరస నృత్యగాన వినోదముల తేలియాడుచు కొన్నాళ్ళుండెను. (54) అక్కడికి వచ్చిన జనులవలన జగద్గురువులు శృంగగిరిని వీడి కడుపనగరమున నివసించుచున్న వార్త విని

వారి నక్కడనుండగనే చూచి సేవించుకొనిరావలయునని నిశ్చయించుకొనెను.(55) వెంటనే ఆతడు బలవాహన మంత్రి పురోహితాదులతో గూడి జగద్గురువుల సన్నిధికి వచ్చి ఈ కడుపలో నివసించుటకు కారణ మేమిటని తిరిగి తిరిగి ప్రాధేయపడి అడిగెను. (56) అట్లు ప్రియావచనములతో ఆతురత నందుచు పదేపదే అడిగిన రాజ నందునితో యతివర్యులు "ఓ రాజా! ఇట్లు నీతో మాట్లాడినందువల్ల మా మనస్సునకు సంతోష మైనది. మరేమియులేదు" అని సంతోషముతో పలికిరి. (57) యతివర్యుల వచనములతో పరితుష్టుడయిన రాజు వారితో "అట్లయిన తమ మనస్సునకు అనుగుణ ముగనే సర్వము జరుగగలదు. తాము సత్వరముగ స్వపురమును చేరుకొనుడు" అని మనవి చేసెను. (58) పిమ్మట జగద్గురువులు సరోవర సమీపమందలి దిగుడు బావి యొడ్డున కోమల బిల్వదళములతో శివార్చన పూర్తి చేసి రాజనందనునకు ప్రసాదో పదలిచ్చి సంతోషపరిచిరి.(59) ఆ సోమశేఖరభూపతిని బహువిధములుగా హృదయ పూర్వకముగ నాశీర్వదించి ఆతనినుండి అనేకామూల్య సమ్మానములను నిండు మనసుతో స్వీకరించిరి. (60) ఈ విధముగా బసవరాజు తనూజుడైన ద్వితీయ సోమ శేఖరభూపతి శ్రీ సచ్చిదానందభారతీ మహాస్వామివారిని సమధికముగా సమ్మానించి మార్గమున తటస్థపడు సర్వదేవతలను దర్శించుకొనుచు రాజులందరిచే సమ్మానితు డగుచు తన రాజధానికి వెళ్ళెను. (61). (సశేషము)

58 వ శ్లోకము: మంగళాపురము - నేటి మాంగళూరు.

—o—

# శ్రీ శంకర భగవత్పాద విరచిత
# వివేకచూడామణి
## (శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామి విరచిత వ్యాఖ్యాసమేతము)

ఆంధ్రీకరణము: డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు(వేదాంత శిరోమణి, విద్వాన్) ఎం. ఏ. (సంస్కృత, ఆంగ్ల హిందీ) పి. హెచ్‌డి.

(గత సంచిక తరువాయి)

అవ. ఈ విధముగ ఆవరణ విక్షేపశక్తులద్వారా అన్ని అర్థములకును మూల కారణమని చెప్పబడిన అజ్ఞానమును మహామోహాత్యాది శ్లోకములచే మరల విశదీక రించుచున్నారు:—

మూ. మహామోహగ్రాహగ్రసన గలితాత్మావగమనో
ధియో నానావస్థాః స్వయమభినయం స్తద్గుణతయా
అపారే సంసారే విషయవిషపూరే జలనిధౌ
నిమజ్జ్యోన్మజ్జ్యాయం భ్రమతి కుమతిః కుత్సితగతిః. 143

ప్ర.అ. మహామోహ.... అవగతునః—మహామోహ = గొప్ప మోహము నెడు, గ్రాహ= మొసలి, గ్రసన=మ్రింగుటచే, గలిత=తొలగిపోయిన, ఆత్మావగమనః=ఆత్మ యథార్థజ్ఞానము కలవాడై, ధియః=బుద్ధియొక్క, నానావస్థాః=బహువిధమైన అవస్థలను, తద్గుణతయా=ఆ బుద్ధియొక్క గుణములు కలవాడగుటచే, స్వయం=తాను, అభినయన్=తనపై ఆరోపించుకొనుచు, విషయ విషపూరే=విషయముల నెడు విష ప్రవాహముతో నిండిన, అపారే=అపారమైన, సంసారే జలనిధౌ = సంసార సముద్రమునందు, నిమజ్జ్య=మునిగి, ఉన్మజ్జ్య= తేలి, అయం=ఈ జీవుడు, కుమతిః=చెడ్డ బుద్ధికలవాడై, కుత్సిత గతిః = కుత్సితమైన గతి కలవాడై, భ్రమతి = తిరుగు చుండును.

వ్యా.అ. మహామోహము, అనగా అతి దృఢమైన అవివేకమే మొసలి; అది మ్రింగివేయుటచే నశించిన ఆత్మావగమనము, అనగా ఆత్మయొక్క యథార్థజ్ఞానము లేనివాడై, అనగా ఆత్మయొక్క యథార్థ స్వరూపమును తెలియజాలనివాడై, బుద్ధియొక్క, నానావస్థాః=అనేకవిధములైన పరిణామములను, తద్గుణతయా—దాని గుణములు కలవాడగుటచే, అనగా దానిని అధీనుడై యుండుటచే; ఉపాధి ప్రతిబింబపక్షపాతి కదా. (అనగా—ఘటములోనున్న జలములో సూర్యుడు ప్రతిబింబించుచున్నాడు. అందుచే ఆ సూర్యునకు ఘటస్థజలము ఉపాధి. ఈ ఉపాధి ప్రతిబింబమునందు అనేక వికారములను కల్పించుచుండుటయే ప్రతిబింబ పక్షపాతిత్వము). నీరు కదలినపుడు అందులో కనపడుచున్న సూర్యబింబము కూడ కదలుచున్నది అని లోకములో ప్రసిద్ధమే కదా? "సమానః సన్ ఉభౌ లోకౌ అనుసంచరతి. సధీఃస్వప్నో భూత్వా ధ్యాయతీవ లేలాయతీవ" (ఆత్మసమానుడై (బుద్ధిసహితుడై) రెండు లోకములను (స్వప్నజాగరితములను) అనుభవించుచున్నాడు. బుద్ధితో సహితుడై, స్వప్నమునందున్నవాడై ధ్యానించుచున్నట్లుండును; కదలుచున్నట్లుండును) అని శ్రుతి. స్వయమభినయన్ = తనపై ఆరోపించుకొనుచు, అపారే = అవధి లేనిదియు, విషయ విషపూరే = విషయము లనెడు విషముయొక్క ప్రవాహముతో (మాపుతో) నిండినదియు అగు, సంసారే జలనిధౌ=సంసారరూపమైన సముద్రమునందు. సప్తమీ

విభక్తి ("సంసారే" అనునపుడు) సామానాధికరణ్యమును బోధించును. అనగా "సంసారమునందు" అని కాక "సంసారమే సముద్రము" అను అర్థము చెప్పుకొనవలెను. కుమతిః = కుత్సితమైన, అనగా బ్రహ్మను చేరని బుద్ధి కలవాడై, కావుననే, కుత్సితగతిః = నింద్యమైన గతి, అనగా జ్ఞానము కలవాడై, లేదా 'గతి' అనగా నరకాద్యధో లోక గతియని అర్థము, అయం = ఈ పురుషుడు, నిమజ్జ్య ఉన్మజ్జ్య= అస్వతంత్రుడై క్రిందికి మీదికి పోవుచు, తిరుగుచుండును. బుద్ధిని వశములో నుంచుకొనలేనివాడు ఇంద్రియ చాపల్యముచే విషయాధీనుడై ఒకదాని తరువాత ఒక భ్రాంతిని పొందుచుండును గాని, సంసారమునకు అవలి ఒడ్డు అయిన బ్రహ్మమును పొందజాలడు అని అర్థము.

అవ. తన కార్యము (తననుండి పుట్టినది) తనకు కప్పివేయును అను విషయమును దృష్టాంతముతో నిరూపించుచున్నారు.

మూ. భాను ప్రభా సంజనితాభ్ర పంక్తిః భానుంతిరోధాయ యథా విజృమ్భతే
ఆత్మోదితాహం కృతిరాత్మ తత్త్వం తథా తిరోధాయ విజృమ్భతే స్వయమ్. 141

ప్ర.అ. భాను....పంక్తిః = సూర్యుని కాంతివలన జనించిన మేఘముల పంక్తి, యథా = ఏ విధముగా, భానుం = సూర్యుని, తిరోధాయ = కప్పివేసి, విజృమ్భతే = విజృంభించునో, తథా = అట్లే, ఆత్మోదితాహం కృతిః = ఆత్మనుండి జనించిన అహంకారము, ఆత్మ తత్త్వం=ఆత్మ యథార్థ స్వరూపమును, తిరోధాయ= కప్పివేసి, స్వయం = తాను, విజృంభతే = విజృంభించును.

వ్యా.అ. సూర్యకిరణములచే పుట్టింపబడిన మేఘపంక్తి, ('అభ్ర' శబ్దమునకు "అపః బిభ్రతి" అని విగ్రహము. "నీటిని ధరించునవి"). గ్రీష్మమున సూర్యకిరణములచే ఆకర్షింపబడిన ఉదకమే మేఘముగా ఏర్పడునని ప్రసిద్ధి. తనను పుట్టించిన సూర్యుని కప్పివేసి తాను ముందుకు వచ్చును. సూర్యుని నుండియే పుట్టుట. ఆ సూర్యునే కప్పివేసి తాను భాసించుట అను అన్ని అంశములందును ఇది దృష్టాంతము. అట్లే, ఆత్మోదితాహంకృతిః = ఆత్మనుండి పుట్టిన ఏ అహంకారము అనగా దేహాదుల విషయమున "నేను" అను బుద్ధి కలదో అది ఆత్మాధీనమైన సత్తాస్ఫూర్తులు కలదైనను, అనగా అహంకారముయొక్క ఉనికియు, దాని అవభాసనము కూడ ఆత్మ మీదనే ఆధారపడియున్నవి. అయినను. ఆత్మతత్త్వం = నిత్యత్వము, జ్ఞానస్వరూప

త్వము, నిత్యముక్తత్వము అనెడు ఆత్మయొక్క యథార్థ స్వరూపమును, తిరోధాయ = కప్పివేసి, ఆత్మ స్పష్టముగా భాసించకుండునట్లు అడ్డు నిలచి, తాను ముందుకు వచ్చి ప్రకాశించుచున్నది. లేదా "అహంకృతిః" అను పదమునకు "బుద్ధి" అని అర్థము చెప్పవచ్చును. ఏలనన, బుద్ధికూడ ఆత్మనుండియే జనించినను; విజ్ఞానమయకోశముగా ఆత్మను ఆవరించుచున్నది. 144

అవ. ఇపుడు ఆవరణ విక్షేపశక్తులు చేయు పనిని దృష్టాంతపూర్వకముగా చెప్పుచున్నారు.

మూ. కబలిత నాథే దుర్దినే సాన్ద్రమేఘై-
ర్వ్యథయతి హిమఝంఝావాయురుగ్రో యథైతాన్
అవిరత తమసాత్మన్యావృతే మూఢబుద్ధిం
క్షపయతి బహుదుఃఖైస్తీవ్రవిక్షేపశక్తిః. 145

ప్ర.అ. సాంద్రమేఘైః = దట్టమైన మేఘములచేత, కబలిత దిన నాథే = మ్రింగివేయబడిన సూర్యుడు గల, దుర్దినే = దుర్దినమునందు, ఉగ్రః = భయంకరమైన, ఝంఝావాయుః = పెనుగాలి, ఏతాన్ = ఈ పాంథులను, యథా = ఎట్లు, వ్యథయతి = పీడించునో, (అట్లే) అవిరత తమసా = అనంతమైన తమస్సుచే, ఆత్మని = ఆత్మ, ఆవృతే = ఆవరింపబడినదగుచుండగా, మూఢబుద్ధిం = మూఢబుద్ధియైన పురుషుని, తీవ్రవిక్షేపశక్తిః = తీవ్రమైన విక్షేపశక్తి, బహుదుఃఖైః = అనేక దుఃఖములచే, క్షపయతి = పీడించును.

వ్యా.అ. దట్టమైన మేఘములచే మ్రింగివేయబడి సూర్యుడు గల దుర్దినమునందు, "మేఘచ్ఛన్నేహ్ని దుర్దినమ్" (మేఘముచే పూర్తిగా కప్పివేయబడిన దినమునకు దుర్దినమని పేరు) అని కోశము ననుసరించి సూర్యుడు కనబడకపోవుటచే ప్రకాశవిహీనమైన దివసమునందు అని అర్థము. ఉగ్రః = భయంకరమైన, హిమఝంఝావాయుః— "ఝంఝావాతః సవృష్టికః" (వర్షముతో కూడిన) పెనుగాలి ఝంఝావాతము) అను కోశము ననుసరించి మంచుతో కూడిన వృష్టిసహితమైన వాయువు అని యర్థము. ఎట్లు ఈ పాంథులను పీడించునో సూర్యప్రకాశ లేదు; మార్గమధ్యములో ఉండిపోవుట; మంచుతోటి, వర్షముతోటి కూడిన గొప్ప గాలి వీచుచున్నది. ఆ బాటసారుల బాధ చెప్ప నలవికానిది. ఈ విధముగా; అవిరత తమసా = దట్టమైన మేఘమువలె గాఢమైన తమస్సుచే, సూర్యస్థానీయుడైన (సూర్యునివంటి) ఆత్మ ఆవరింపబడగా, అనగా స్ఫుటముగా కానరాక నశించిపోయినట్లు, అనగా, తీవ్ర

విక్షేపశక్తిః = కామ క్రోధాదిరూపమున పరిణమించుచున్న, రజోగుణమునకు సంబంధించిన, ప్రబలమైన విక్షేపశక్తి, మూఢబుద్ధిం = తమోగుణమునకు సంబంధించిన ఆవరణశక్తిచే మూఢమైన, అనగా తెలుసుకొను శక్తి తొలగిపోయిన, బుద్ధి గల పురుషుని, బహుదుఃఖైః = జన్మ, మృత్యువు, జర, రోగము మొదలగు వాటివలన కలిగిన అనేక దుఃఖముల చేత, నశింపచేయును. నిరంతరము దుఃఖపరంపరలలో మునిగిపోయిన ఆత్మకు ఆనందరూపమైన స్వస్వరూపముయొక్క జ్ఞానము ఎక్కడిది? అది లేకపోవుటతో ఆత్మ స్వస్వరూపమును తెలిసికొనజాలక నశించిపోయినట్లు అగును అని భావము. 145

అవ. "కథమేష ఆగతః" అను ప్రశ్నకు ఇంతవరకును చెప్పిన ఉత్తరమును, స్పష్టముగ తెలియుటకై "ఏతా భ్యామ్" అను శ్లోకముచే ఉపసంహరించు చున్నారు:—

మూ. ఏతా భ్యామేవ శక్తిభ్యాం బద్ధః పుంసః సమాగత

యాభ్యాం విమోహితో దేహం మత్వా త్మానం భ్రమత్యయమ్. 146

ప్ర.అ. పుంసః = పురుషునియొక్క, బంధః = బంధము, ఏతాభ్యాం = ఈ, శక్తి భ్యామేవ = రెండు శక్తులవలననే, సమాగతః=వచ్చినది, యాభ్యాం=వేటిచే, విమోహితః = మోహింపబడినవాడై, అయం = ఈ పురుషుడు, దేహం=దేహమును, ఆత్మానం = ఆత్మనుగా. మత్వా = భావించి, భ్రమతి=తిరుగుచున్నాడో.

వ్యా.అ. ఏతాభ్యాం = గుణత్రయరూపమైన అజ్ఞానములో నున్న తమోగుణ రజోగుణములకు సంబంధించిన ఈ ఆవృతిశక్తి విక్షేపశక్తుల చేత, పురుషునకు, బంధః=అది కాని దానిని అదిగా భావించుట అనురూపము గల అధ్యాసము, వచ్చినది. ఇది బాగా స్థిరమైనదియు సాధన చతుష్టయముతో ప్రారంభమైన వేదాంత వాక్య విచారమువలన కలిగినదియు అగు ఆత్మసాక్షాత్కారము కలుగనంతవరకు తొలగింప శక్యముకానిది. యాభ్యాం= వెనుక చెప్పబడిన శక్తుల చే, విమోహితః= తెలియదగిన దాని జ్ఞానము లేనివాడై, దేహం = స్థూలదేహాదికమును, ఆత్మానం మత్వా = నేను అని భావించి, ఈ పురుషుడు సంసారమనెడు మహారణ్యమునందు తిరుగుచున్నాడు.

(సశేషము).

—o—

# అద్వైత సిద్ధాంతము ముందు పాశ్చాత్యుల పూర్వపక్ష ఖండన

## (ఆచార్య సుందరము)

(శ్రీ శంకర భగవత్పాద అద్వైత సిద్ధాంతము పైన పాశ్చాత్య విద్వాంసులు కొందరు మర్మలమైన ప్రతిపక్షవాదములు చేసిరి. ఆ వాదముల ఖండన మీ వ్యాసము. —సంపాదకుడు.)

(గత సంచిక తరువాయి)

శంకర వేదాంత సిద్ధాంతముపై డా. ధీబా చేసిన తీవ్ర దీర్ఘ పరిశీలనా వ్యాససారమును మేము పూర్వపక్షము చేయుట ముగిసినది. డా. ధీబా అభిప్రాయములు నిరాధారములు. ఉపనిషత్తులందు ప్రవచింపబడిన యీ అద్వైత సిద్ధాంతమును, బ్రహ్మసూత్రములందు వివరింపబడిన దానిని—డా. ధీబా ఎంత తప్పుగా అవగాహన చేసికొనెనో స్పష్టమైనది—

ఇక కలనెల్ జాకోబ్ అభిప్రాయమైన "డా. ధీబా కొసకు వెలిబుచ్చిన అభిప్రాయమును కాదనుటకు వీలులేదు" అన్నది నేలపై దొర్లిపోవును. మాయా శబ్దార్థమును గురించి మాయా సిద్ధాంతమును గురించి కలొనెల్‌కి ఉన్న అభిప్రాయమెంత దోషభూయిష్టమో మేము నిరూపించితిమి.

బొంబాయిలో ప్రకటితమైన 'వేదాంతసార'మున కతడు వ్రాసిన పీఠికలో (iii) అద్వైత వాదమును గురించి స్వవచోఘాతముగా నత డీ వాక్యములు వ్రాసెను.

"దేవతకు మానవునకు మధ్యగా కన్పించుచున్న తేడాలు కారణముగా— యీ వాదమునకు సంబంధించిన రచయితలు పర ముఖ్య, నిర్గుణ అను విశేషణములను శుద్ధ, బద్ధముక్త బ్రహ్మమును గురించి వాడుచు—అపర అముఖ్య సగుణ అను విశేషణములను అవిద్యవలన దేవతామూర్తిగా చూడబడుచున్న బ్రహ్మముయొక్క భాగమును గురించి వాడుదురు."

అద్వైత సిద్ధాంతమే కొంచెము తెలిసినవారికైనను శుద్ధబ్రహ్మము అమూర్తమని—రూపహీనమని — అందుచేత నిష్కల — (భాగములుగా విభజింపరానిదని) తెలియును. సగుణబ్రహ్మమును శుద్ధబ్రహ్మమునందొక భాగముగా కలొనెల్ జాకబ్ వ్రాసినప్పుడు—తాను వివరించుచున్న విషయమునకు అనుచితమైన భాషను ఉపయోగించెను.

'శంకరులు తానే ప్రతిపాదించిన విభిన్నత్వమును మరల మరల విస్మరించె'నని కలొనెల్ జాకబ్ పలుకదొడగెను. అయితే మానవజాతిలో ప్రభవించిన మహోత్తమ మేధావియైన శంకరులు ఇట్టి దోషము చేసిరని కలొనెల్ జాకబ్ సాహసించి పలికినట్లు డా. ధీబా అనుటకు పూనుకొనలేదు. శంకరులు తన సిద్ధాంతమును తానే విరుద్ధముగా వ్రాసెనని కలొనెల్ జాకబ్ రెండు ఉదాహరణలనిచ్చెను. మొదటి ఉదాహరణము బ్రహ్మసూత్రములలో 11, 12 (I) సందర్భముగా. అతని వ్రాత— "ఇక్కడ పరం బ్రహ్మకు—మరొకదానికి మధ్య విషయగ్రహణము. ఇందు రెండవది చివరకు త్రోసివేయబడుచున్నది కాబట్టి—మొదటిది— (యిట్టి అన్ని సందర్భము లందువలెనే) గ్రహింపబడుచున్నది. కావున 'పర ఆత్మ' అను ప్రయోగమును సిద్ధాంతి పరబ్రహ్మమన్న అర్థముతోనే ప్రయోగింపవలెను. కాని i, 1, 11), యిక్కడ పరమాత్మ అనగా ఈశ్వరుడు అనియే...."—

శంకరులు సగుణబ్రహ్మకు (ఈశ్వర) నిర్గుణబ్రహ్మకు పర్యాయపదముగా 'పరమాత్మ' పదప్రయోగము చేయుదురని కలొనెల్ జాకబ్ విస్మరించెను. సందర్భశుద్ధిని బట్టి ఆయన భావించిన దేదియో గ్రహింపవలెను. కలొనెల్ జాకబ్ మరల కొన్ని సార్లు శబ్దప్రయోగ విషయములో శంకరులపై ఆరోపించిన దోషముల నివారణకీ సమాధానము చాలును. రెండవది (i, 1, 11) శంకరులు పరమాత్మగా చెప్పిన ఈశ్వరుడు సగుణబ్రహ్మము. ఏలననగా శంకరులు మొదట అధికరణములోని అన్ని సూత్రములను వృత్తికారుని దృష్టిప్రకారము వివరింతురు. వృత్తికారుడు యీ అధికరణమున స్థాపింపబడిన పరమాత్మ ఈశ్వరుడే కాని నిర్గుణబ్రహ్మము కాదనెను. తరువాత దీనిని శంకరులు తమ సిద్ధాంతము ప్రకారము వివరించిరి. కాబట్టి శంకరుల వ్రాతలలో పరస్పర విరుద్ధత్వములేదు. సూత్రము 16 పైశబరభాష్యమును ఉదాహరించిన వెంటనే కలొనెల్ జాకబ్ తానే యీ విషయమును చెప్పెను.

అసలు విషయమేనగా—సంప్రదాయ శుద్ధముగా అద్వైత సిద్ధాంతము నెరిగిన పండితులనుండి మొదట కంకరాచార్యులవారి గ్రంథములను శ్రవణము చేయవలెను. భారతదేశమునందెవ్వరుగాని తామే స్వయముగా చదివి సర్వ మర్మములను గ్రహింపగల్గితిమని చెప్పరు. అట్లు అంగీకరింపబడకూడదు. ఏలననగా వేదాంతభాష్యమున చాల ప్రగాఢ—అతి క్లిష్ట—సమన్వయములు—తెలియనిచో పాతాళమున పడిపోవుటే. ఈ దినములలో అందరకూ ఎన్నో కార్యాంతరములు, పండితుల పాదముల చెంత కూర్చుని సంప్రదాయక్రమములో వేదాంత గ్రంథములను శ్రవణము చేయుటకు అవకాశమేది?

మరియొక సంగతి. పూర్వ సంప్రదాయక్రమముగా వేదాంతశాస్త్ర మధ్యయనము చేసిన పండితులు నాటి నాటికి తగ్గిపోవుచున్నారు. వారే వేదాంతమును ఓర్పుతో, ప్రగాఢముగా సంపూర్ణముగా పెద్దలకడ అధ్యయనము చేసినవారై—ఆ ఆ సంప్రదాయమునకు విరుద్ధముగా నేడు గురువు ముందు ప్రవర్తింపవలసిన విధేయతాదులు లేని మనవారికిగాని—విదేశీయులకిగాని—వేదాంతశాస్త్ర మర్మములను ఉపదేశించుటకు ఇచ్ఛలేనివారుగా నున్నారు—కాబట్టి తప్పులు—చోటు చేసికొని—ముఖమునుండి ముఖమునకు ప్రయాణించి యథార్థములుగా చలామణి యగుచున్నవి. దీనికి నివారణోపాయ మేమనగా సంప్రదాయక్రమముగా వేదాంతాధ్యాయనము నిలుపబెట్టబడుట. అందువలన భారతమునకు—మన ద్వారా యితరులకు సత్యము అలభ్యము కాకుండ మిగులును.

ఇట్టి సంప్రదాయక్రమ అధ్యయనము భారతమున అదృశ్యమైనచో—ఆ నాడు ఆధ్యాత్మికలోకమున భారతము యిన్ని యుగములుగా ధరించిన కిరీటము క్రింద పడిపోవును. మన జాతికి నిలయమైన పవిత్ర భూమిగా గణన పోగొట్టుకొనును. రాజకీయ, భౌతికైశ్వర్య కేంద్రములు కాలక్రమమున మారుతూ వచ్చినవి. కాని అన్ని యుగములలో ఆత్మజ్ఞాన విషయమున భారతదేశము మౌళిక స్థానమందే నిలచి వచ్చుచున్నది. అందుకనియే—పాశ్చాత్య రచయితలు, రాజకీయవేత్తలు—తాత్త్వికులు—"ఒకనాడు భారత మహర్షుల ప్రగాఢ ఆధ్యాత్మికచింతన ఐరోపీయ అతి భౌతిక దృక్పథమును ఆధ్యాత్మికము చేయజాలునని ఆశించుటకు అవకాశమేర్పడినది. ఈ సందర్భమున ఆచార్య మాక్సుముల్లరు వివేకోజ్జ్వలముగా చెప్పిన మాటలు ఆశాజనకముగా నున్నవి — "ఈ పురాతన (anthropomorphic) ఈశ్వరునికి మనుష్యరూపారోపణ భావములు—

ఉపజాతులవలన విమర్శలవలన సమర్థింపబడినప్పటికి వాటిని మరల మరల త్రోసివేయుట జరిగినదే కాని వాటి స్థానమున మరే యొకటియు నిలుపబడలేదు. అందుచేత నవి మరల క్రొత్త పురుషాంతరమునం దొక్క చోట మాత్రమే మానవుని మేధస్సు యీ స్థితిని అధిగమించినది—తొలుత ఊహలతో—ప్రమాణభావనలతో—(మనకు ఉపనిషత్తులందు కన్పించుచున్నవి)-తరువాత స్థిరమైన హేతుతర్కముతో—(వేదాంతసూత్రములందున్నట్లు) మరింకను శంకరుల భాష్యములందున్నట్లు సహేతుకమైన యుక్తితో వేదాంతము—దానిని మనము తాత్త్విక శాస్త్రమన్నను, మతమన్నను—anthropomorphic భావనలలో దైవమునకున్న నిర్వచనమును అతిక్ర

మించి—జీవుడు భగవంతుని సింహాసనమును సమీపించుటన్న భావమును త్రోసి రాజన్నదై—ఐరోపీయ మహామేధావులకు తెలియని నూతనచింతనా ప్రగతిమార్గము లను తెరచినది.”

ఈ వాక్యములలో ప్రతిపదముతో మనకు సమ్మతిలేదు—ఇందున్న అభిప్రాయ సారముతో చాల భాగముతో కూడ సమ్మతిలేదు. కాని దీనియందు చాల కలదు—ఈ ప్రస్తుత నిరుత్సాహ కలిత దుష్టవాతావరణమున — రాజోవు సాంఘిక నైతిక పతనముల సామీప్యమున బ్రతుకుచున్నవారిని ఉత్సాహపరచుటకు-వైదిక ఆదర్శ ములు లక్ష్యముగా జీవయాత్ర గడుపువారిని ఉత్తేజపరచుటకు, సత్యముయొక్క వెలుగును—పావిత్ర్యముయొక్క దూషితము కాని మనోహరత్వమును ఈ పవిత్ర భూమిలో ముందు తరములవారికి అందించి—ఆర్యావర్తము సర్వకాలము, ఆత్మజ్ఞాన రత్నకిరీటమును (పూర్వము శ్రీకృష్ణపరమాత్ముడు, వ్యాసభగవానుడు ఆమె శిరస్సుపై నుంచినది) ధరించుచుండవలె నని శ్రమించు వారికి బలము చేకూర్చు చున్నవి. (సంపూర్ణము)

(ఈ ధారావాహిక వ్యాసమును శ్రీ ఆచార్య కె. సుందరము క్రీ.శ. 1911లో శ్రీరంగము వాణీవిలాస ముద్రణాలయమువారు ప్రకటించిన సదానందుని వేదాంత సారమునకు (ఆపదేవుని బాలబోధిని వ్యాఖ్యాసమేతము) పీఠికగా రచింపబడినది.

దీనిని పుస్తకరూపములో ప్రకటించుడని కొందరు కోరిరి. ఔదార్యవంతు లెవరైన పూనుకొన్నచో సంతోషము.

—సంపాదకుడు)

---

## శ్రీ జగద్గురు మహాసన్నిధానమువారి వర్ధంతి ఉత్సవము

శ్రీ శంకర భగవత్పాద ప్రతిష్ఠాపిత శ్రీ శృంగేరీ శారదాపీఠాలంకారులై దక్షిణామ్నాయసంజ్ఞక యజుర్వేద ప్రధాన వ్యాఖ్యాన సింహాసనాధిష్ఠితులైన శ్రీ జగద్గురు శ్రీ మదభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణుల 65వ వర్ధంతి ఉత్సవము దుర్మతినామ సం॥ ఆశ్వియుజ బహుళ చతుర్దశి సోమవారము (27-10-81) శృంగేరిలో జరుగుచున్నది.

శ్రీ శంకరకృప పాఠకుల తరఫున ఆ నాడు శ్రీ జగద్గురువులకు పాదపూజ గత సంవత్సరములందు జరిగినట్లే ఈ సంవత్సరము కూడ చేయుట సముచితమను అభి

ప్రాయమును కొందరు పాఠకులు తెలిపియున్నారు. ఆ ప్రకారము జరుపుటకు నిశ్చయించినాము.

పాఠకులు యెవరికి తోచినది వారు రు. 6/- లకు తక్కువ లేకుండా-విరాళము ను శ్రీ శంకరకృప ప్రకాశకుని పేర వెంటనే పంపకోరుచున్నాము. ఆ నాడు పాదపూజ చేసి శ్రీ జగద్గురువుల సన్నిధినుండి-విరాళములు పంపినవారికి ఆశీర్మంత్రాక్షతలు శ్రీ శారదాచంద్రమౌళీశ్వర ప్రసాదము (కుంకుమ) బట్వాడా చేయబడునట్లు యేర్పాటు జరుగును.

ఆకెళ్ల సత్యనారాయణమూర్తి,
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు,
6-3-609/18, ఆనందనగర్.
ఖైరతాబాదు, హైద్రాబాదు—500 004.

---

# గ్రంథావలోకనము

1. జీవయాత్ర/రాజమార్గము. శ్రీ కలగ ఆంజనేయశాస్త్రి 73వ జన్మదినోత్సవ కానుక.

ప్రాప్తిస్థానము: అమృతానంద విద్యాపీఠము. సత్యనారాయణపురము, విజయవాడ-590011. వెల: రు. 3/- ఖర్చులు ప్రత్యేకము.

ఇది శ్రీకలగ ఆంజనేయశాస్త్రిగారు తన 73వ జన్మదినోత్సవము సందర్భముగా రచించి ప్రకటించిన గ్రంథము. సహజముగా ఆయన రచనల కన్నిటికి ఉన్నట్లే దీనికిని ఆధ్యాత్మిక వాసనయొక్క గుబాళింపు కలదు ఆస్తికులకు ఆదరపాత్రమైనది.

(గురునాథ)

2. సిరినోము (తిరుప్పావై మొదలైన ఆరు ద్రవిడ ప్రబంధాల తెలుగు ప్రతిధ్వనులు).

రచయిత: శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు. కల్యాణీ ప్రచురణ 33, గజపతిలాలా వీధి, మద్రాసు-5. మూల్యము రు. 5/-.

భక్తిరసభరితమైన ద్రవిడ ప్రబంధ కవితను, తెలుగులో అలతి అలతి పదాలతో ధ్వని నిర్భరముగా, గుణవిశిష్టముగా, భక్తిభావసురభిళంగా అనువదింపబడిన రచన. తెలుగు జిలుగుల బిగితో మధురోదార భావనామయంగా ముద్దు ముద్దుగా

సాగిన కవితా స్రవంతి. భక్తిరసాయనముపై అపేక్ష కలవారీ "సుకృతమ్ముల ప్రోవు"ను చదివితే మధురానుభూతి పొందగలరు. (అమృతవాణి)

3-6. పరమహంస శ్రీ సచ్చిదానందేంద్ర సరస్వతీస్వామివారి నాలుగు గ్రంథములు.

ప్రాప్తిస్థానము: మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, వైగ్రాంరోడ్డు, ఇన్నీసుపేట, రాజమండ్రి.

3. భక్తిరస వ్యాఖ్య: మూల్యము రు. 3/-

సంస్కృతమున వంశీధరశర్మ శ్రీమద్భాగవతమున మూడవ శ్లోకమునకు భక్తిరసస్ఫోరకముగా వ్రాసిన వ్యాఖ్యకిది అనువాదము. సమూలము- తెలుగు రచన సరళముగా సుబోధకముగా నున్నది. ఆస్తికజన ఆదరపాత్రము.

4. కౌశిక సంహితార్గత శ్రీమద్భాగవత మాహాత్మ్యము (రు. 3/-)

పద్మపురాణాంతర్గతమైన శ్రీమద్భాగవత మాహాత్మ్యము ఆంధ్రదేశమున ప్రసిద్ధముగా నున్నది. ఇది కౌశికసంహితార్గతము. మాహాత్మ్య గాథలు మనోజ్ఞముగా నున్నవి. ఆస్తికజన ఆదరపాత్రము.

5. భక్తకథాష్టకము: రు. 3/-

ఇందు ఆంధ్రమునకు పరిచితముకాని భక్తుల కథలున్నవి. వారి భక్తి ప్రొత్త పద్ధతులలో వ్యక్తమైనది. ఈ కథాపఠనము "జనతాఘ విప్లవః" అను సూక్తి భావమును యాథార్థము చేయును. ఆస్తికులు చదువవలసిన గ్రంథము.

6. శ్రీ శంకర జయంతి: (రు. 3/-)

శ్రీ శంకరజయంతి ఉత్సవము చేయవలసిన ఆవశ్యకత, యతిస్వరూపము, యతులను పూజించినందువలన ప్రయోజనము, బ్రహ్మవేత్తల మహిమా మాహాత్మ్యములు మొదలగు విషయములు శాస్త్ర ప్రమాణములతో—ఆసక్తిజనకముగా వ్రాయబడినవి. సనాతన భారతసంస్కృతిలో మిక్కిలి విలువకలదైన వైరాగ్యమును గౌరవించువారీ గ్రంథమును తప్పక చదువవలెను. (హారీత)

7. భగవద్వాణి:

రచయిత: మద్దూరి గణపతిరావు, బుద్ధవరపువారి వీధి, కాకినాడ. వెల: అమూల్యము. దీనియందు బ్రాహ్మణజన్మ (దాని ఉత్కృష్టత-) కర్తవ్యము, గీతాధ్యాయసారము, గీతా తత్త్వసార సంగ్రహము, దశరత్నములు అను విషయములు కలవు. ఆస్తికజనులు పరిశీలింపవలసిన గ్రంథము. (ద్విజేంద్ర)

8. శ్రీ మద్భాగవత మణిహారము: (ప్రథమ సంపుటము)

సంకలన, (సంపాదన, ప్రకాశన) కర్తలు: శ్రీ దర్భా సూర్యనారాయణ గారు (శ్రీనివాస నిలయము, 14/139 గాంధినగరము-2 రాజమహేంద్రవరము-3), మూల్యము శ్రద్ధాభక్తులు.

పరమభక్తులగు శ్రీ దర్భా సూర్యనారాయణగారు తమ సతీమణి శ్రీమతి సుబ్బలక్ష్మి, కుమారుడు వేంకటరమణనటరాజప్రభాకర గార్ల సహకారముతో వ్యాస కృత శ్రీమద్భాగవతములోని మణితుల్యములైన ఉపదేశవాక్యములను సంకలించి— వాటితో పాటు తత్తత్ స్థానములలో శ్రీ పోతన్నగారి గద్యపద్యానువాదములను సమీకరించి ప్రకటించిన గ్రంథ మిది. (78+472 పుటలు) అష్టమస్కంధము వరకు సాగిన యీ మణిహారము ఉజ్జ్వలమై, ఓజోపూర్ణమై సర్వాస్తిక జను లకు మహోపకారకమై పండిత ప్రకాండుల ప్రశంసాపాత్రమై అలరారుచున్నది. సంకలనకర్తలు దీని మూల్యమును శ్రద్ధాభక్తులుగా నిర్ణయించినారు. శ్రద్ధ యనగా వేదప్రమాణమునందు కర్మఫలమగు పునర్జన్మమునందు, పరమేశ్వర కృపా విశేషమునందు గురువాక్యములందు నమ్మకమనీ—భక్తి యనగా పరమేశ్వరునియందు నిర్వ్యాజమైన అచంచలమగు పరానురక్తి యని సంకలనకర్తల నిర్వచనము. దీనిని బట్టి గ్రంథముయొక్క పావిత్ర్యత, సంకలనకర్తల భక్తివిశ్వాసములు విద్యమాన మగుచున్నవి. సర్వాస్తికజన ఆదరపాత్రమైన సంకలనము. (అంబరీష)

—‡—

# శృంగేరీ వార్తలు

శ్రీ జగద్గురువుల చాతుర్మాస్య సంకల్పము—వివరణ వార్తలు:

శృంగేరిలో తుంగాతటినీతటస్థ నృసింహతపోవనమున శ్రీ జగద్గురు మహా సన్నిధానమువారు, (శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణులు) శిష్యస్వాము లైన శ్రీ జగద్గురు సన్నిధానమువారును (శ్రీ భారతీతీర్థస్వామిచరణులు) దుర్మతి ఆషాఢ పౌర్ణమి శుక్రవారము (17-7-81) నాడు—అధిష్ఠాన ముఖమంటపమున చాతుర్మాస్య వ్రతసంకల్పము చేసిరి.

నృసింహతపోవనమున పరమేష్ఠి గురువులైన శ్రీ జగద్గురు సచ్చిదానందశివాభి నవ నృసింహభారతీ మహాస్వాముల (పరంపరలో 33వ వారు) యొక్కయు, పరమ గురువులైన శ్రీ జగద్గురు చంద్రశేఖరభారతీమహాస్వాముల(పరంపరలో 34వ వారు— ప్రస్తుతము పీఠాలంకారులైన శ్రీ మహాసన్నిధానమువారికి గురువులు) యొక్కయు

అధిష్ఠానములు (సమాధులు) రెండును, ప్రక్క ప్రక్క కలవు. వాటిముందు పెద్ద ముఖమంటపమున్నది. అది విశాలమైనది. అచ్చటనే చాతుర్మాస్య సంకల్పము జరిగినది. అతి పవిత్రముగా—నిర్వహింపబడుచున్న—ఈ చాతుర్మాస్య సంకల్పోత్సవ దర్శనాభిలాషలై దేశము నలుమూలల నుండి భక్తజనము తండోప తండములుగా వచ్చిరి. (ముఖ్యముగా తిరునల్వేలి, మదరాసు, కొచ్చిన్, తిరువనంతపురము, బొంబాయి, లక్నో, కలకత్తా, విజయవాడ, గుంటూరు, హైదరాబాదు, కోయంబత్తూరు, మైసూరు, బెంగళూరు మొ॥ ప్రాంతముల నుండి).

ఆ నాటి ఉదయము శ్రీ జగద్గురువులు గురుదేవతా దర్శనములు చేసి, నిత్యానుష్ఠానములు చేసి, దీక్షావిసర్జనము (ఆయుష్కర్మ) చేసి, తుంగా నది పవిత్ర జలమునందు స్నానములు చేసిరి. శ్రీ జగద్గురువులు అధిష్ఠానముఖ మంటపమునకు విజయము చేయుటకు ముందే ఆగంతుకజనము క్రిక్కిరిసి యుండిరి. నాదస్వర మంగళవాద్యములతో—వేదఘోషతో శ్రీ జగద్గురువులను శిష్యమహాజనము తోడ్కొనివచ్చిరి.

ముఖమంటపమున పరమేష్ఠి గురువుల అధిష్ఠానమున కెదురుగా సుందరముగా అలంకరింపబడిన తోరణములతో సొగసుగా నున్న చాందిని క్రింద చక్కగా నున్న చలువ పప్పరమునందు శ్రీ వేదవ్యాస శ్రీ శంకర భగవత్పాద పటము లుంచబడినవి. మఠ పురోహితుడైన శ్రీ గణపతి సుబ్రహ్మణ్య అవధాని పౌరోహిత్యము వహించి పూజాకార్యక్రమమును నడిపెను. శ్రీ జగద్గురు సన్నిధానమువారు ప్రక్కనే ఉపవిష్టులై యుండగా శ్రీ జగద్గురు మహాసన్నిధానమువారు బ్రహ్మవిద్యా ఆచార్య పురుషులకు పూజోపచారములను కావించిరి. ఈ బ్రహ్మవిద్యా ఆచార్య పూజా నిర్వహణతో నాలుగు ఆచార వర్గములవారికి (తొలి మూడు వర్గమునందు అయిదుమంది ఆచార్య పురుషులు) పూజాదికము జరిగినది.

అందు కృష్ణపంచకము మొదటిది. ఈ వర్గమునకు మధ్య శ్రీకృష్ణుడు—నాలుగు దిక్కులందు ఆయన నాలుగు వ్యూహమూర్తులు—(సనక సనందన, సనత్కుమార సనత్సుజాత).

రెండవది వ్యాసపంచకము. ఈ వర్గమునకు మధ్య వేదవ్యాసభగవానుడు. నాలుగు దిక్కులందు ఆయన శిష్యులైన సుమంత, జైమిని, వైశంపాయన, పైలులు.

మూడవది శ్రీ శంకరాచార్య పంచకము. ఈ వర్గము నందు శ్రీ శంకర భగవత్పాదులు మధ్యయందుండగా ఆయన శిష్యులైన పద్మపాద, సురేశ్వర, హస్తామలక తోటకులు చతుర్దిక్కులందు.

నాలుగవది గురుపంక్తి (వర్గము—మండలము) ఈ పంక్తియందు శ్రీ శృంగేరి

జగద్గురు పరంపరలో సదాశివుని మొదలు సదాత్మధ్యాన నిరతులైన శ్రీ చంద్ర శేఖర భారతీ మహాస్వామి చరణులవరకు అందరినీ పూజించినారు.

ప్రతివర్గమునకు పూజచేసి శ్రీ మహాసన్నిధానమువారు మంగళహారతి నిచ్చిరి. విద్వాంసులు వేదఘోష చేసిరి. తైత్తిరీయ శిక్షా ఆనందభృగువల్లులను, నారాయణోపనిషత్తును విప్రులు ఏకకంఠమున ఘోషించిరి. ఒక అపూర్వ పావిత్రస్ఫూర్తి మత్తమైన వాతావరణముతో శ్రీ జగద్గురువుల దర్శనము దివ్యానుభవప్రదముగా విలసిల్లినది. శ్రీ మహాసన్నిధానము, శ్రీసన్నిధానముతోపాటు మరి యిద్దరు పరమహంస సన్న్యాసులు కూడ సంకల్పము చేసిరి.

వర్షాకాలమున పరివ్రాజకులు ఒకే స్థలమునందు నాలుగు మాసములుందురు. "పక్షా వై మాసాః" అన్న శ్రుతిపాఠము ప్రకారము పక్షము (15 దినములు)నే మాసముగా గ్రహించి రెండు నెలలే చాతుర్మాస్యవ్రత మనుష్ఠించుట ఆచారమైనది. అశ్వలాయనుని వచనము ప్రకారము సన్న్యాసి గ్రామమునం దొక రాత్రియు నగరము నందైదు రాత్రులును వసింపవచ్చును. వర్షాకాలమునం దొకచోటనే వసించి బ్రహ్మ విచారము చేయుచు—మనన నిదిధ్యాసలతో—గడుపవచ్చును. 'ఏకరాత్రం వసేద్ గ్రామే నగరే పాంచరాత్రకమ్, వర్షాస్వేకత్ర తిష్ఠేత స్థానే పుణ్య జలావృతే।'

జీవహింస చేయరాని పరివ్రాజకులు వర్షాకాలమున సంచారము చేసినచో—అప్పుడెక్కువగా విహరించు క్రిమికీటకాదులకు అపాయము కల్పింపవచ్చు. అందుచేత పరివ్రాజకు లొక స్థలమునందే వర్షాకాలమంతయు నుండి-బ్రహ్మవిచారము చేయుచు-తమ్ము అర్థించినవారికి సాధనారహస్యములు చెప్పుచుందురు. ఈ చాతుర్మాస్యవ్రతానుష్ఠానమునకు ముందుగా ఆషాఢ పూర్ణిమనాడు (గురుపూర్ణిమ) వ్యాసపూజ చేయుదురు.

పూజానంతరము చాతుర్మాస్యవ్రత సంకల్పమిట్లు జరిగినది. శ్రీ జగద్గురువులిద్దరు—శిష్యుల నుద్దేశించి "ప్రాయేణ ప్రావృషి ప్రాణి సంకులవర్త్మ దృశ్యతే అతస్తేషాం అహింసార్థం పక్షా వై శ్రుతి చోదనాత్ స్థాస్యామశ్చతురో మాసాన త్రైవాసతి బాధకే॥" అనగా—అచ్చట నున్న శిష్యులందరు ఏక కంఠమున "నివసన్తు సుఖేనాత్ర గమిష్యామో కృతార్థతామ్ యథాశక్తిం చశుశ్రూషా కరిష్యామోవయంముదా" (మీ రిచ్చట సుఖముగా నుండుడు. మేము యథాశక్తి తమకు శుశ్రూషలు చేసి తృప్తితో గృహములకు పోయెదము) అని విన్నవించిరి.

పిమ్మట శ్రీ శృంగేరి జగద్గురు పరంపరాస్తోత్రము పఠింపబడగా శ్రీ జగద్గురువులు పరంపరా జగద్గురువులకు పుష్పాంజలులు ఘటించిరి.

పిమ్మట మహాసన్నిధానమువారు శిష్యలోకమును అనుగ్రహించి ఆశ్రమమునకు వెళ్ళిరి. శ్రీసన్నిధానమువారి సమక్షమున మహాసన్నిధానమువారి పాదుకలను షోడ సోపచారములతో పూజించిరి.

తరువాత మైసూరుమహారాజా, బరోడామహారాజా, గ్వాలియరు రాజమాత మొదలగువారి తరఫున శ్రీ జగద్గురువులకు పాదకానికలు సమర్పింపబడినవి. శృంగ పుర, విద్యారణ్యపుర, నృసింహపుర, సచ్చిదానందపుర శిష్యులు కానుకలు సమ ర్పించిరి. కొందరు శిష్యులు పాదకానికలు సమర్పించిరి. కొన్ని పాదపూజలు జరిగినవి. యావద్భారతములోని శిష్య మహాజనము తరఫున సమిష్టి భిక్షావందనము జరిగినది. శ్రీ సన్నిధానమువారు శిష్య మహాజనమునకు తీర్థ ప్రసాదముల ననుగ్రహించిరి.

చాతుర్మాస్యమున శ్రీ జగద్గురువులను దర్శించుట, పాదపూజలు చేయుట, భిక్షావందనముచేయుట అధిక ఫలప్రదము కావున బహుప్రాంతములనుండి శిష్యజనము శృంగేరికి అరుదెంచి శ్రీ జగద్గురువులను బహు విధములుగా సేవించుచున్నారు.

## గంగాపూజ

ఆషాఢ శుక్ల చతుర్దశి గురువారము (16-7-81) నాడు శ్రీ జగద్గురు సన్ని ధానమువారు—వరదలలో నున్న తుంగానదికి—గంగాపూజ కావించిరి. శ్రీ మఠము లోని సకల దేవతా యతనములకు విజయముచేసి—నీరాజనముల నిచ్చి సేవించిరి.

## వరమహాలక్ష్మి పూజ

శ్రావణ చతుర్దశి శుక్రవారము (14-8-81) శృంగేరిలో ప్రత్యేకముగా శ్రీ వరమహాలక్ష్మిపూజ జరిగినది. పెక్కుమంది వచ్చి తిలకించి ప్రసాదములు తీసికొని శ్రీ జగద్గురువుల అనుగ్రహపాత్రులైరి.

## శ్రీకృష్ణాష్టమీ వ్రతము

శ్రావణ బ సప్తమి శనివారము రాత్రి శ్రీ జగద్గురువులు శ్రీకృష్ణాష్టమీ వ్రతమును కావించిరి. భక్తజనము అశేషముగా వచ్చి పూజను చూచి ప్రసాదములను స్వీకరించి శ్రీకృష్ణపరమాత్మ యొక్కయు జగద్గురువులయొక్కయు అనుగ్రహమును సంపాదించుకొనిరి.

కొత్త అడ్మినిస్ట్రేటరు: శ్రీమహాసన్నిధానము వారు జూలై 1 వ తేదీనుండి మఠ ఆస్తుల పరిపాలనాకార్యమునకు అడ్మినిస్ట్రేటరుగా శ్రీ సి. వి. గిరిధరశాస్త్రిని నియమించిరి. ఆయన స్థానే ఆ ప్తకార్యదర్శిగా శ్రీ బాలసుబ్రహ్మణ్యము నియమింప బడెను. (జూలై, ఆగస్టు వార్తల వివరములు తరువాయి సంచికలో ప్రకటింపబడును.)

—:o:—

# శ్రీ శృంగేరి శారదాదేవి నవరాత్రి మహోత్సవములు

ప్రతి సంవత్సరమువలెనే యీ దుర్మతినామ సంవత్సరమున కూడ శృంగేరిలో శ్రీ శారదాదేవికి ఆశ్వీయుజ శుద్ధ పాడ్యమినాటినుండి శరన్నవరాత్రి విశేషోత్సవములు మహా వైభవముగా జరుగును.

దుర్మతి భాద్రపద అమావాస్య (మిగులు) సోమవారము (28-9-198`) శ్రీ శారదాదేవికి మహాభిషేకము జరిగి జగత్ప్రసు (బాలెంతరాలు) అలంకారము జరుగును. విశేషపూజ జరుగును.

మరునాడు ఆశ్వీయుజ శుక్ల పాడ్యమి మంగళవారము [24-9-81] కలశస్థాపన జరిగి నవరాత్రి మహోత్సవములు ప్రారంభమగును. ప్రతిదినము శ్రీ శారదాదేవికి ఒక్కొక్క మాతృక అలంకారము జరుగును. వేదపారాయణలు, సప్తశతి లలితోపాఖ్యాన దేవీభాగవతాది పారాయణలు, ఉపనిషత్పారాయణలు జరుగును. శ్రీ జగద్గురువులు స్వయముగా శ్రీ దేవిని అర్చించి ప్రార్థింతురు. దర్బారు జరుగును.

ఆశ్వీయుజ శుక్ల నవమి బుధవారము [7-10-81] శతచండీ హోమము జరుగును. గురువారము [8-10-81] విజయదశమినాడు విశేషపూజ జరుగును. శ్రీ జగద్గురువుల దర్బారులో ప్రత్యేక కార్యక్రమము. శుద్ధ ఏకాదశి శుక్రవారము శ్రీ శారదాదేవికి రథోత్సవము జరుగును. ఆశ్వీయుజపౌర్ణమి మంగళవారము [13-10-81] తుంగానదీ జలములలో శ్రీ శారదాదేవికి, శృంగేరిలో వేంచేసియున్న ఇతర దేవతామూర్తులకు తెప్ప ఉత్సవము, కౌముదీపూజ జరుగును.

లలితా సహస్రనామములందు చెప్పినట్లు ప్రతిపత్తు [పాడ్యమి] నుండి పౌర్ణమి వరకు శ్రీ శారదాదేవికి విశేషోత్సవములు జరుగును.

ఈ ఉత్సవములలో పాల్గొనదలచినవారు, చూడదలచినవారు శృంగేరి వెళ్ళవచ్చును. యథాశక్తి తోడ్పడదలచినవారు తమ గోత్రనామములతో శ్రీ జగద్గురువుల ఆప్తకార్యదర్శి పేర విరాళములు పంపవచ్చును. లేక అడ్మినిస్ట్రేటరుకైనను పంపవచ్చును.

విలాసము:

శ్రీ జగద్గువుల ఆప్తకార్యదర్శి
[ప్రయివేటు సెక్రటరీ]
[లేక]
అడ్మినిస్ట్రేటరు,
శ్రీ శృంగేరి జగద్గురు మహాసంస్థానము
శృంగేరి. [కర్ణాటక] 577 139

# పాఠకులకు ప్రత్యేక విజ్ఞప్తి

శ్రీ శంకరకృప వింశతి [20] సంవత్సరములు పూర్తి చేసి 21వ సంవత్సరమున కాలిడుచున్న యీ సందర్భమును పురస్కరించుకొని పాఠకలోకమును—యితోధిక సహకారమును అర్థించుచున్నాము.

ధర్మాభిమానమును కలిగి—ధర్మావలంబకులైన మా పాఠకులు-ధర్మప్రచారమే ఏకైక లక్ష్యముగా నుండి అచంచలదీక్షతో ధర్మసేవగా సాగుచున్న యీ శ్రీ శంకరకృపకు చేయవలసిన సహకారమెట్టిదనగా—

1. ఒక్కొక్క పాఠకుడు కనీసము అయిదుమంది వార్షిక చందాదారులను చేర్పించుట.

2. అవకాశమున్న చందాదారులు—రూ. 116/-లు పంపి యావజ్జీవ సభ్యులగుట. తమ మిత్రుల నట్లు చేర్పించుట.

3. తమ తమ చందాలను సకాలములో పంపుట.

4. వీలున్నచో సంవత్సరమునకు ఒకటి రెండు పుటలు ప్రకటనలను—తాముగాని—తమ మిత్రుల తరఫునగాని తీసికొనుట.

మేము చేసిన ఈ విజ్ఞప్తిని మా పాఠకులు మన్నింపగలరని ఆశించుచున్నాము.

ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు
6-3-609/18 ఆనందనగరు
ఖైరతాబాదు, హైదరాబాదు-500 004.

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు
శ్రీ శంకరకృప సంపాదకుడు

---

Printed & Published by A. Satyanarayana Murthy, at
6-3-609/18, Anand Nagar, Khairatabad, Hyderabad - 500 004.
Printed at KRANTI PRESS, MADRAS-600 001.
Editor : T. Ramalingeswara Rao

# శ్రీ శంకర కృప


దక్షిణామ్నాయ
శ్రీశృంగేరీ శారదాపీఠము వారి యాజమాన్యమున వెలువడు
ఆధ్యాత్మిక మాసపత్రిక

సంపుటి: [illegible] | వెల రు. 1 అక్టోబరు, 1981<br>సంవత్సర చందా రు. 10/- | సంచిక: 2






శ్రీ మహాసన్నిధానము వారి సన్నిధి సంచిక

దుర్మతి ఆశ్వయుజ - కార్తీక (శకాబ్ది ౧౯౦౩)



శృంగేరిలో తిరుమల తిరుపతి దేవస్థానమువారు నిర్మించిన ధర్మశాల ప్రారంభోత్సవమున శ్రీ జగద్గురువులతో తిరుపతి తిరుమల దేవస్థానం కార్యనిర్వాహణాధికారి

# శ్రీ శంకర కృప

సంపాదకులు: తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

సంపుటి 21 | శంకరశ్శంకర స్సాక్షాత్ వ్యాసో నారాయణో హరిః | సంచిక 2





## శ్రీ శంకర భగవత్పాదాచార్య విరచిత

## శ్రీమత్త్రిపురసుందరీ వేదపాద స్తోత్రము

శ్లో॥ నవిస్మరామి చిన్మూర్తి మిక్షుకోదండశాలినీమ్।
మునయఃసనకప్రేష్ఠాస్తామాహుః పరమాంగతిమ్॥ 65

(దీనియందున్న వేదపాదము కాఠకములోనిది)

తా॥ చెఱకు విల్లును ధరించినట్టి చిన్మూర్తిని నే నెప్పటికిని మరువను. సనకుడు మొదలగు మునిశ్రేష్ఠులా చిన్మూర్తినే ఉత్కృష్టమయిన—పరమమయిన గతిగా గమ్యముగా చెప్పుచున్నారు.

విశేషములు: శ్రీదేవి చిన్మూర్తియట. శుద్ధచైతన్యమని భావము. లలితా సహస్రనామములందు శ్రీదేవి చిదగ్నిసంభూతగా చెప్పబడినది. (చిదగ్నికుండ సంభూతా—4వ నామము). ఆమె చిచ్ఛక్తియట (416వ నామము). చిన్మూర్తియే చిచ్ఛక్తి. సర్వప్రాణులందున్న జీవకళయే ప్రకాశరూపమైన శక్తి—చిచ్ఛక్తి. శ్రీదేవి చితిః (చిత్యై) (362వ నామము) అనగా చిద్రూపిణి. చిన్మూర్తి అట్లే శ్రీదేవి చిదానందరసరూపిణియట (364వ నామము). శ్రీదేవి చిత్కళయట (728వ నామము). చిన్మయి (251వ నామము). ఫలితార్థమేమనగా శ్రీదేవి పరబ్రహ్మమేనని.

అందుకనియే మునిశ్రేష్ఠుల—సనకాదులు—ఆమెను—పరమమైనగతి—గా—కైవల్యముగా నిత్యశుద్ధబుద్ధముక్తముగా—చెప్పుచున్నారు. శ్రీదేవి పాదాబ్జములందైక్యము పొందుటే పరమమైన గతి. మోక్షము. అదియే ఉపనిషన్మతము. శ్రీ భగవత్పాదులవారు కావ్యధోరణిలో—యీ స్తోత్రమున—అద్వైత సిద్ధాంతభావమునే ఆలంకారికముగా చెప్పుచున్నారు.

—:o:—

# శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి చరణ స్మరణమ్

(గతసంచిక తరువాయి)

## గురుభక్తి

శ్రీ జగద్గురువు లెల్లప్పుడు సామాన్య మానవులకంటె—ఎంతో సమున్నతమైన స్థితి యందుండెడివారు. అందువలన అతి సామాన్యునితో ప్రసంగించుచున్నప్పుడుకూడ—ఆ ప్రసంగమును జీవితములో పాఠముగా పరిణమిల్లునట్లు చేయువారు. అతి సామాన్య సంఘటనను చాల విలువైనదానిగా—ఎంతో నేర్చుకొనవలసిన సన్నివేశముగా మార్పుచేయగలవారు. ఇట్టి సంఘటనలను ఉదహరించుటకు ముందు—ఆయనకు శ్రీ శంకరభగవత్పాదులయందును, తమకు ముందు పీఠాధిపతులయిన శ్రీ జగద్గురు సచ్చిదానంద శివాభినవ నృసింహభారతీ మహాస్వామివారియందును గల భక్తిని గురించి కొంత వివరించుట అవశ్యకముగా తోచుచున్నది. వారిద్దరిని కేవలము మహాత్ములుగా శ్రీచరణులు భావింపలేదు. భగవంతుడే ఆ రూపములతో నున్నట్లు తలపోసెడివారు. సామాన్యముగా మనము చెప్పుకొను శ్లోకము—గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః గురుస్సాక్షాత్ పరంబ్రహ్మా" గురువును బ్రహ్మతో, విష్ణువుతో, మహేశ్వరునితో—పరబ్రహ్మతో సమానుడని ప్రశంసించుట ఆలంకారికముగా—అని కాదు శ్రీచరణుల అభిప్రాయము. సత్యముగా గురువు అట్టివాడే నని వారి నిశ్చయము. అది మన మెన్నటికీ మరువరాదని ఆయన శాసనము.

ఒక పెద్దమనిషి శ్రీ జగద్గురువుల దర్శనమునకు వచ్చి శృంగేరిని చూడగలుగుట సంతోషకరముగ నున్నదని విన్నవించెను.

పెద్దమనిషి : ఎంత సుందర దృశ్యము! కొండలలో అడవులలో గూఢముగా నున్న మనోహరస్థలము! తుంగానదీ జలములెంత శుద్ధముగానున్నవి! రైళ్ళు, మోటారుకార్లు సదుపాయములున్న వర్తమాన కాలమున మేమెట్లో యిక్కడకువచ్చి యీ అపూర్వ సుందర దృశ్యమును తిలకించి ఆనందింప గలుగుచున్నాము. శ్రీ శంకరభగవత్పాదుల కాలమునం దిట్టి సదుపాయములు లేవు. ఆయన దేశమునం దంతయు పాదసంచారమే చేసెను. ఇట్టి మనోహర స్థలమిచ్చట నున్నదని ఆయ

నెట్లు తెలిసికొనగలిగెనో? ఈ ఆలోచన రాగా నేను ఆశ్చర్యమున మునిగిపోవు చున్నాను. ఆయనయందు భక్తి గౌరవభావభరితుడ నగుచున్నాను.

శ్రీజగద్గురువులు: ప్రపంచమును సృష్టిచేసినవానికి తన సృష్టియం దెక్కడ నేమి యున్నదని అన్వేషణ చేయవలసియున్నదా? ఏది ఎక్కడ నున్నదో— సామాన్యవిషయ ప్రతీతిగా—(వాటిని ఆయనయే అక్కడక్కడ పెట్టినాడు కావున) తెలియదా? కాబట్టి శ్రీ భగవత్పాదులు యీ శృంగేరిని ఆదర్శస్థలముగా నెన్నుకొనుటయందు (నీ వాయన పరమేశ్వరుడే యన్న సంగతి మరచిపోయి ఆయన ఒక సామాన్య మానవుడు మాత్రమేనని తలచుచున్నప్పుడు తప్ప) ఆశ్చర్యపడవలసిన అవసరమేలేదు. శ్రీ భగవత్పాదులు సామాన్య మానవుడన్న భావము ప్రబలముగా నున్నప్పుడు మాత్రమే ఆయనచేసిన పనులను గమనము చేసికొన్నప్పుడు ఆశ్చర్యము కలుగుట—మెచ్చుకోలు తలపులు వచ్చుట జరుగును. (సశేషము)

---

# శ్రీ జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణాల ఉపదేశము

శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో తొలుత అర్జునునికి — (అతనిద్వారా మన కందరకు) చేసిన హెచ్చరిక — 'ఓయి అర్జునా! క్లైబ్యమునకు లొంగవలదు. హృదయ దౌర్బల్యమును వదలిపెట్టుము! అది నీకు తగినదికాదు. లెమ్ము! శత్రు వినాశకుడవగు పరంతపా! లెమ్ము'—

క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప! (గీ 2-3)

ఈ శ్లోకమునందు ముందు అర్జునిని 'పార్థ' అని సంబోధించెను. పార్థుడనగా పృథయన్న పేరుగల కుంతీదేవి పుత్రుడని. ఆమె మనోధైర్యముగల క్షత్రియ. తన బిడ్డలను అడవులకంపి ధైర్యముతో నిలువబడిన క్షత్రియాంగన. "మీ హక్కుల కొరకు క్షత్రియోచితముగా యుద్ధము చేయుడు" అని శ్రీకృష్ణునిద్వారా తన పుత్రులకు సందేశము పంపిన వీరమాత. ఆమె (ఒక స్త్రీ) తన పుత్రులను పురుషులుగా వీరులుగా—బ్రతుకుడని ప్రబోధించినది. అనగా మానవులుగా వర్తింపుడని. (మనిషిని మానవుని చేయగలదే నిజముగా మతము).

ఉపనిషత్తులందు ప్రధానముగా నున్నది "అభయము"—"ఉత్తిష్ఠత జాగ్రత

అవునది అట్లే. అది హేతుబద్ధముగా నున్నదని నేను నిరూపింతును. శాస్త్రములందు ఈశ్వరుడు—జీవుడు—బింబ ప్రతిబింబములవంటి వారని చెప్పబడినది. అద్దమునందు కన్పించునది ప్రతిబింబము. దేనిరూపము అద్దమునందు ప్రతిబింబముగా నున్నదో—అసలది బింబము. అద్దము ఉపాధి. బింబము, ఉపాధి, ప్రతిబింబము అని మూడున్నవి. ఉపాధిగతమైనది ప్రతిబింబము, అద్దములో చూచుకొన్నచో ఎవరి ప్రతిబింబము వారికి కన్పించును. ప్రతిబింబముయొక్క ముఖలలాటము నిరలంకారముగ నున్నదనుకొనుడు. అప్పు డేమనిపించును? ఆధునికుల కేమియు ననిపించకపోవచ్చును. అట్లుండుట వారికి సంతోషమే కల్పింపవచ్చును. కాని వైదికాచార సంపత్తుకలవారికి—ఫాలము నిరలంకారముగ నున్నదని—విభూతి పెట్టిన బాగుండునని తోచును.

ప్రతిబింబమునకు విభూతి అలంకరణలేదు. దానికా అలంకరణ ఉండవలెనన్నచో—అద్దమునకు పెట్టవలయునా? అందువలన ప్రయోజనమేమియు నుండదు కాబట్టి అట్లుచేయ నక్కరలేదు. అద్దమునకు పెట్టినచో—ప్రతిబింబము ప్రక్కకు తొలగినప్పుడు విభూతి దాని ముఖమునం దుండదు. ప్రతిబింబము ముఖమున యుండవలెనన్నచో బింబముయొక్క ముఖమునందే విభూతి పెట్టవలెను. అదేవిధముగా బింబముయొక్క ముఖమునందు నామము పెట్టినచో—అది ప్రతిబింబముయొక్క ముఖమునందుకూడ కన్పించును. కాబట్టి ప్రతిబింబమును అలంకరింప దలచినచో బింబమునే అలంకరింపవలయునన్నది రూఢి.

శాస్త్రములందు ఈశ్వరజీవులు బింబప్రతిబింబములనికదా చెప్పబడినది. ఉపాధి మాయ, అవిద్య. కొందరు మాయ యని కొందరు అవిద్యయని చెప్పుదురు. ఈ పదప్రయోగము విషయమున కొంత భేదముకలదు. దేనియందు ప్రతిబింబము కన్పించుచున్నదో దానిని ఉపాధి యనినాముకదా! మాయ లేక అవిద్యయని చెప్పబడు ఉపాధియందు జీవుడను ప్రతిబింబము. ప్రతిబింబమును సరిదిద్ద దలచినచో బింబమును సరిదిద్దవలెను. ఇది లౌకిక విషయములందును నిజము. కావున ప్రతిబింబమైన జీవుడు బాగుండవలెనన్నచో బింబమైన సగుణ ఈశ్వరుని ఉపాసింపవలెను—సేవింపవలెను. అప్పుడు కోరిక ఫలించును. జీవుడు ఆనంద మనుభవించును. శ్రీ భగవత్పాదులు లక్ష్మీనృసింహ పంచరత్న స్తోత్రమునందు మనలను ఎంత ముందునకు తీసికొనిపోయిరో విశదమగుచున్నది.

ఇదేవిధముగా దీక్షితేంద్రు డొకచో చెప్పెను—"అయి భ్రాతశ్చేతః పరమ

ముపదేశం శృణు మముస్మరింశేరర్చ్యయాం పటుషు కరిణేషు స్మరఫలం" (నేను నీకు మంచి ఉపదేశము చేయుచున్నాను. ఇంద్రియములు చక్కగానున్నప్పుడే ఈశ్వరుని అర్చన చేయుము. వృద్ధుడవై బలహీనుడవై యున్నప్పు డర్చింప కోరికయున్నను వీలుండదు. నీవు శివరాత్రినాడు జాగరము చేయ కోరవచ్చును. జన్మాష్టమినాడు రాత్రి శ్రీకృష్ణపూజ చేయ కోరవచ్చును. కాని బలహీనములైన నీ యింద్రియములు నీకు తోడ్పడవు.

జీవుడు ఈశ్వరుని ప్రతిబింబ మన్న విషయము. జీవునికి సుఖము కలిగింప దలచినచో ఈశ్వరునికి సుఖము కలిగింపవలెను. అర్చింపవలెను. ఈ భావమునే శ్రీభగవత్పాదు లీ నృసింహ పంచరత్నస్తోత్రమున చెప్పిరి. ఆయన మరెన్నియో విషయము లెన్నియో సందర్భములందు చెప్పెను. ఈ స్తోత్రము ముగింపు నందినట్లు చెప్పిరి.

"తవహిత మేకం వచనం వక్ష్యే శృణు సుఖకామో యది సతతం॥ స్వప్నే దృష్టం సకలం హి మృషా జాగ్రతి చస్మర తద్వదితి॥"

సంసార దుఃఖానుభవ మేల? జాగ్రదవస్థలలో చూడబడుచున్న దెల్ల నిజమునకు భ్రమకలితము. దుఃఖ కారణము. కాబట్టి యీ భ్రమను పోగొట్టుకొనుము. ఎట్లు? స్వప్నములున్నవి. అందెన్నియో కన్పించును. స్వప్నము నడచుచున్నంత వరకు అవి నిజములుగా లోచును. శ్రుతియందొకచోట నిట్లున్నది.

అథ రథాన్ రథయోగాన్ పథః సృజతే। అక్కడ నిజముగ గుఱ్ఱము లున్నవా? నతత్ర రథా న రథయోగాన పంథానః॥ నిజమునకు గుఱ్ఱము లచ్చటలేవు. రథములు లేవు. స్వప్నమున గుఱ్ఱములున్నవి. ప్రయాణించుట యున్నది. నిద్ర మేల్కొనిన తరువాత అడుగగా—స్వప్నమునం దేదో చూచితిని. అదియంతయు నిజముకాదు. కల—అందురు. అదేవిధముగా మనకంటికి కన్పించునదంతయు మిథ్య. నిజముకాదు.

స్వప్నము నిజముకాదని స్వప్నానంతరము తెలియుచున్నది. జాగ్రదవస్థలోని దంతయు మిథ్యయన్న అనుభవము తేలికగా కలుగుటలేదు. తెలిసినవారికే అది సాధ్యము. నీకు సత్యము తెలిసినచో నీవు చెప్పగలవు. అందుకని "తవహిత మేకం వచనం వక్ష్యే శృణు సుఖకామో యది సతతమ్" చెప్పుట. క్షణికమైనదికాక శాశ్వతానందమును కోరినచో యీ ఉపదేశమును పాటించుము. 'స్వప్నే దృష్టం సకలం హిమృషా', 'హి' అని ప్రయోగించుట ప్రాముఖ్యతను స్పష్టపరచుటకు. స్వప్న మిథ్యాత్వము నీకు తెలియును. 'జాగ్రతి చ స్మర తద్వదితి' — జాగ్రదవస్థకూడ

నట్టిదే. ఈ యంతయు యీ స్తోత్రమునందున్నది. కాబట్టి స్తోత్రములను పఠించునపుడు, ఊరక పఠించుటకంటె అర్థముపై దృష్టిపెట్టి చదువుట నుంచిది. మంత్ర జపము చేయునపుడు—అర్థమును అవగాహన చేసికొని జపము చేసినచో ఉత్తమ ఫలితము లుండునని చెప్పబడినది. అదేవిధముగా యీ స్తోత్రములను పఠించునపుడు అర్థము గ్రహించి పఠించినచో ఫలితము అధికము. ఈశ్వరానుగ్రహము లభించి, జ్ఞానముకలిగి సత్యస్వరూప మననమునకు అవకాశము కలుగును. శ్రీ భగవత్పాదు లీ అవకాశము మనకు కల్గించిరి. మన మది విస్మరించి లౌకిక ప్రజ్ఞాధురంధరుల మైతిమి. అది సరికాదు. ఆయన స్తోత్రములను వేదాంతగ్రంథములను మనము చదువవలెను. భగవంతుడు "స్వల్పమపి అస్యధర్మస్య త్రాయతే మహత్ భయాత్" అనెను. కాలము నిష్ఫల లౌకికకార్యములతో వ్యయముచేయక భగవత్పాదులయందు వారి స్తోత్రములందు మనస్సు నిల్పినచో శ్రేయస్సంతో లభించును. ఇది గ్రహించి అట్లు ప్రవర్తించవలెను.

---

# భక్త్యంజలి

సాక్షాత్తు శంకరులైన శ్రీ శంకరభగవత్పాదులచే ధర్మరక్షణకై భారతమున నాలుగు దిక్కులందు స్థాపింపబడిన చతురామ్నాయ పీఠములలో దక్షిణామ్నాయ సంజ్ఞిక యజుర్వేదీయ శృంగగిరి శ్రీశారదాపీఠము "తస్య యజురేవశిరః" అను శ్రుతిప్రమాణముచేత సర్వశిరః ప్రధానపీఠమై—అవిచ్ఛిన్న గురుపరంపరా దీప్తమై అలరారుచు, శ్రీ శంకరభగవత్పాద విరచిత మఠామ్నాయ శాసనము ప్రకారము ఆంధ్ర ద్రవిడ కర్ణాట కేరళ దేశప్రభేదములకు జగద్గురు స్థానమై విలసిల్లుచున్నది.

నేడు శ్రీ శారదాపీఠ వ్యాఖ్యాన సింహాసనమును తేజోభరితము చేయుచున్న శ్రీ జగద్గురు అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణులు పరంపరలో 35 వ వారు. ఈ మహాసన్నిధానమువారు శ్రీ భగవత్పాదులవలె ఆసేతుశీతనగ పర్యంత భూమియందు సంచరించి ధర్మప్రబోధముచేసి సనాతన మతపునరుజ్జీవన కార్యమును సఫలముచేసిన మహాత్ములు.

శ్రీ శంకరభగవత్పాదులవారి వచనము ప్రకారము శృంగగిరి శ్రీ శారదాపీఠాధిపతులయినవా రందరు శ్రీ భగవత్పాదులంతటి పరివ్రాట్టులు. అట్లే గౌరవింపవలసిన వారు.

శ్రీ జగద్గురు అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణుల 65వ వర్ధంతి దుర్మతి నామ సంవత్సర ఆశ్వయుజ బ చతుర్దశి సోమవారము (26-10-81) మైసూరులో వైభవముగా జరుగనున్నది.

శిష్యస్వామి సేవిత పాదారవిందులై శ్రీ మహాసన్నిధానమువారు ఇట్లే మరి యొక శతసంవత్సరములు శిష్యలోకమును కృపాకటాక్షములతో పాలింతురుగాత యని శ్రీ శృంగేరీపీఠ దేవతలను ప్రార్థించుచున్నాము.

జయతు జయతు తుంగాతీరగా శారదాంబా
జయతు జయతు శ్రీమచ్చంద్రమౌళీ సురేశ్వరః
జయతు జయతు విఘ్నద్రత్నగర్భో గణేశో
జయతు జయతు విద్యాతీర్థనామో గురుర్నః॥

దుర్మతి ఆశ్వయుజ శు గురువారము,
1-10-1981.

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు,
సంపాదకుడు.

ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి,
ప్రకాశకుడు.

—:o:—

# మాగడతఊకలు

గురురేకో జగత్సర్వం బ్రహ్మవిష్ణుశివాత్మకమ్।
గురోః పరతరం నాస్తి తస్మాత్సం పూజయేద్గురున్॥

(బ్రహ్మ విష్ణు శివాత్మకమైన సర్వజగత్తును గురురూపమే. గురువుకన్న పరమైనది లేనేలేదు. కావున గురువును పూజింపవలెను).

గురుర్మూర్తిం స్మరేన్నిత్యం గురోర్నామ సదా జపేత్।
గురోరాజ్ఞాం ప్రకుర్వీత గురోరన్యం నభావయేత్॥

(గురువుయొక్క మూర్తినే నిరంతరము ధ్యానింపవలెను. గురునామమునే సదా జపింపవలెను. గుర్వాజ్ఞప్రకారము ప్రవర్తించవలెను. గురువుకంటె అన్యుల నెవ్వరిని సంభావింపరాదు.)

ధ్యానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోఃపదమ్।
మంత్రమూలం గురోర్వాక్యం ముక్తిమూలం గురోఃకృపా॥

(ధ్యానము చేయుటకు గురువుయొక్క మూర్తి ఆలంబనము. పూజచేయుటకు గురువుయొక్క పాదములు అవలంబనము. గురువుయొక్క ఉపదేశ వాక్యముతే

తమ గురువులవలెనే తాముసు సదాత్మధ్యాన నిరతులై, విషయపరాఙ్ముఖులై శాస్త్రనిష్ణాతులై — శిష్యవాత్సల్యమాత్ర క్రియాచణులై విలసిల్లుచున్న శ్రీజగద్గురు మహాసన్నిధానమువారు సర్వోత్కృష్టముగా సర్వోత్కర్షతో విరాజిల్లుదురు గాక.

—o—

# పంచాంగ విశేషములు

## శ్రీ శృంగేరీ జగద్గురు మఠ పంచాంగము ననుసరించి

### దుర్మతి ఆశ్వయుజ శు తృతీయ గురువారము (1-10-81) నుండి కార్తిక బ చతుర్థి ఆదివారము (15-11-81) వరకు.

1-10-81 నుండి 13-10-81 వరకు విశేషములు గతనెల సంచికలో కలవు.

16-10-81 శుక్రవారము చంద్రోదయోమా వ్రతము అట్లతద్దె.

18-10-81 ఆదివారము ఆశ్వయుజ శు పంచమి శ్రీ శృంగేరి జగద్గురు శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామి పట్టాభిషేక దినం.

17-10-81 శనివారము తులాసంక్రాంతి.

23-10-81 శుక్రవారము శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామివారి జయంతి, ఏకాదశి.

26-10-81 సోమవారము నరక చతుర్దశి, శ్రీ జగద్గురు అభినవవిద్యాతీర్థ మహాస్వామివారి వర్థంతి, గురుమూర్తమి త్యాగము.

27-10-81 మంగళవారం దీపావళీ అమావాస్య ధనలక్ష్మి పూజ కేదారవ్రతము.

28-10-81 బుధవారం కార్తిక శు పాడ్యమి, గోపూజ కార్తికస్నానారంభము.

29-10-8 గురువారం భగినీహస్త భోజనం, కావేరీ పుష్కరం.

31-10-81 నాగుల చవితి.

## నవంబరు

2-11-81 సోమవారము (కార్తిక సోమవారములు 9, 16, 23 తేదీలు) శృంగేరిలో ప్రత్యేకపూజలు (శ్రీ చంద్రమౌళీశ్వరునికి).

5-11-81 గురువారము కార్తిక శు అష్టమి. శృంగేరిలో శ్రీ విద్యాశంకర రథోత్సవము.

6-11-81 శుక్రవారము కృతయుగాది.

7-11-81 శనివారము ఆరోగ్యలక్ష్మీవ్రతము.

8-11-81 ఆదివారము ఉత్థానైకాదశి (బోధన) భీష్మపంచకవ్రతము.

9-11-81 సోమవారము క్షీరాబ్ధి (చిల్కు) ద్వాదశియోగినీ ద్వాదశి, స్వాయంభువు మన్వాది.

10-11-81 మంగళవారము వైకుంఠ చతుర్దశి తులస్యుద్వాసన.

11-11-81 బుధవారము కార్తికపౌర్ణమి (అకామావై) కేశబంధన గౌరీవ్రతము. జ్వాలాతోరణము ధాత్రిపూజ శృంగేరిలో కృత్తికా దీపోత్సవము.

—o—

# సంస్కృతభాషను మనమేల ఆదరించి నేర్చుకొనవలెను? (43)

ఈ ప్రశ్నకు మన దేశంలో మేధావివర్గంలో మూర్ధన్య మనీషామణులు సమాధానాలు చెప్పారు. గత సంచికలందు కొన్నిటిని తెలుసుకున్నాము. ఇప్పుడు మరికొన్ని. (సంపాదకుడు)

## శ్రీ పి. వి. రాజమన్నారు,

(మదరాసు ప్రధాన న్యాయమూర్తి.)

ప్రతిబాలుడు, బాలిక—(వర్ణము, జాతి విచక్షణ లేకుండా) సంస్కృత అధ్యయనము చేసి తీరవలెనని నా అభిలాష. మన పూర్వసంస్కృతి, మన పూర్వ మేధావులు ఆలోచించినదంతయు వచించినదంతయు ఆ భాషయందున్నదనిమాత్రము కాదు-ప్రపంచమున ఉత్తమోత్తము సాహిత్యము ఆ భాషయందున్నదనియు కాదు— యువజనుల విద్యామూల్యముగా దానికున్న ఘనతవలన యువకులందరు సంస్కృతమును అధ్యయనముచేసి తీరవలెనని నా అభిప్రాయము.

సంస్కృత సాహిత్యమున మన మాతృదేశ సంస్కృతియంతయు నున్నది. ఆ సంస్కృతి మనకు కావలసినచో—మనము సంస్కృతముకడకు పోవలెను. మన సంస్కృతిని మనము విస్మరింపవలెనని త్యజింపవలెనని మనము నిశ్చయించుకొని దృఢము చేసికొనక పోయినచో—మన బాలబాలికలకు సంస్కృతమును అభ్యసించుటకొక అవకాశమును మన మీయవలెను—మన పాఠశాలలలో సంస్కృత అధ్యయనమును మనము తప్పనిసరి చేయవలెను.

ఇండియాలో సంస్కృతము పుట 12

## శ్రీ డా. శ్యామాప్రసాదముఖర్జీ

ఇప్పటికి పరిమితులు లేని జ్ఞాన—విద్యా నిధిగానున్న సంస్కృతము (దాని నుండియే జ్ఞానము వివేకము నాగరిక ప్రపంచమునకు ప్రవహించినది) మరల మన జాతీయ విద్యాశిక్షణ పథకమున ఉత్తమ గౌరవస్థానము నందుంచబడవలెను.

(సంసద్ భాషణ)

---

# శ్రీ శంకర భగవత్పాద విరచిత వేదాంత డిండిమము

## వ్యాఖ్యానము : తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

అవ. (నవ శ్లోకము) జ్ఞానాజ్ఞానములను గురించి చెప్పుచున్నారు.

శ్లో॥ జ్ఞానాఽజ్ఞానే పదార్థౌద్వో ఆత్మనో బంధముక్తిదౌ
జ్ఞానాన్ముక్తిర్నిబంధోఽన్యదితి వేదాంత డిండిమః 3

తా॥ జ్ఞానము, అజ్ఞానము అను పదార్థములు రెండు. అజ్ఞానము ఆత్మకు బంధము నొసంగును. జ్ఞానము మోక్షము నొసంగును. జ్ఞానము వలననే మోక్షము కలుగుననియు—యితరము—అజ్ఞానమువలన బంధమే యనియు వేదాంత డిండిమము.

విశేషము: భేరీమ్రోతగా చెప్పుమాటలు శ్లోకములందు చెప్పబడుచున్నవి కావున నివి శాస్త్ర సారభూతములై—మహార్థగర్భితములైన—వాక్యములే చెప్ప బడుచున్నవి. 'జ్ఞానాదేవతు కైవల్యమ్' అన్న శ్రుతివాక్యభావ మీ శ్లోకము ఘోషించుచున్నది.

అవ. జ్ఞాతజ్ఞేయములను గురించి చెప్పుచున్నారు.

శ్లో॥ జ్ఞాతృజ్ఞేయం పదార్థౌద్వౌ భాస్యభాసక లక్షణౌ
జ్ఞాతాబ్రహ్మ జగజ్ఞేయ మితి వేదాంత డిండిమః. 4

తా॥ జ్ఞాత జ్ఞేయము అని పదార్థములు రెండు. అందు జ్ఞేయము స్వప్రకాశము లేనిది. ప్రకాశింప జేయదగినది. జ్ఞాత భాసకుడు. ప్రకాశింపజేయువాడు. జ్ఞాతయే బ్రహ్మము. జ్ఞేయము జగత్తు అని వేదాంతడిండిమము.

విశేషము: మిథ్యయగు జగత్తును—సత్యమగు ఆత్మ—బ్రహ్మను—గురించి చెప్పుచు వ్యావహారిక మెట్టిదో తెలిపిరి. (సశేషము)

---

# శ్రీ విద్యారణ్య విజయగాథ



14

ఒకనాడు బదరీవనము నుండి విశ్వనాథ దేవాలయమునకు వేదవ్యాసములు వెంబడించగా పోవుచున్న మహాత్ములను చూచి వేదవ్యాసులని నిశ్చయించుకొని శ్రీ విద్యారణ్యులు సాష్టాంగ ప్రణామము చేసిరి.

తన నిజాకృతిని ప్రకటింప నిష్టములేని వ్యాసులు శ్రీ విద్యారణ్యులతో "నన్ను తాకవద్దు" అని వారించుచుండగా శ్రీ విద్యారణ్యులు ఆయనపాద పద్మములను వదలలేదు.



# గురువంశ కథా కథనము

(సంస్కృత మూలము: బ్రహ్మశ్రీ కాశీలక్ష్మణశాస్త్రి
గురువంశ కావ్యమ్)

తెలుగు: శ్రీ చెఱుకుపల్లె జమదగ్నిశర్మ ఎం. ఏ.

(గత సంచిక తరువాయి)

## సప్తదశ సర్గము

సోమశేఖరభూపతి నటుపంపి శ్రీ సచ్చిదానంద యతీశ్వరులు కుసుమపాంథ దైవమగు అనంతేశ్వరుడు పూర్వము తమతో అన్నమాటలు స్మృతికి తెచ్చుకొని అవి ఫలించు కాలము నిరీక్షించుచు కొన్నిదినములా నగరములోనే గడపిరి. (1) ఆ స్వామికి రత్నఖచిత కవచము చేయించి సమర్పించి దీపారాధనోత్సవములు జరిపి భక్తిపూర్వకముగా దానిని సమర్పించి యతివర్యులు ముదమందిరి (2). రజతపూజోత్సవ సాధనములు చేయించి భక్తాభీష్ట ప్రదాతయగు అనంతేశ్వరునకు వానిని గూడ సమర్పించిరి (3). అప్పుడు మంగళపురాధీశ్వరుడు కుసుమపము వచ్చి యతీశ్వరులను పూజించి తన పాపములను క్షాళన మొనర్చుకొను తలంపుతో శ్రీవారిని తన గ్రామమునకు రావలసినదని మరిమరి ప్రార్థించెను (4). భక్తాభ భక్తిపరులగు యతీంద్రులు వారి ప్రార్థన మంగీకరించి శిష్యాన్వయాతులై బయలుదేరి తత్పురజను లెదురువచ్చి సాదరముగ తీసికొనిపోవ నా మంగళపురమును ప్రవేశించిరి (5). ఆ రాజక్కడ యతీశ్వరులను సముద్రజాత విచిత్ర వస్తువులతో సర్వరాజోపచారములతో పూజించి వారి పాదతీర్థమును భక్తితో గ్రోలి కృతకృత్యుడనైతినని సంతోషించెను (6). జగద్గురువు లా రాజు నాశీర్వదించి దగ్గరనున్న కారంజదేవుని చూడవలెనని రాజు పంపిన బలములు తమ్మనుగమించుచుండ మంగళపురమును నిర్గమించిరి (7). పిమ్మట యతీంద్రులు కారంజపురమును చేరిరి. అక్కడ శివుడు గిరీంద్రమధ్య వసించియున్నాడు. అక్కడ కపులు ప్లవంగములనే తమ భృత్యులుగా చేసికొని రాజ్యమును పాలించినవి (8). ఆ కారంజదేవుని పూజించుకొన్న తరువాత మాధ్వయతీశ్వరులచే ప్రార్థితులై కమనీయ వేషుడగు కృష్ణస్వామిని సేవించుకొనుటకై ఉడిపి కేగిరి (9) కృష్ణస్వామి నర్చించి మాధ్వయతీశ్వరులచే నర్చితులై యటనుండి లక్ష్మీనృసింహస్వామి వేంచేసియున్న హోలాడి నగరమున కేగిరి (10). అక్కడ కొన్ని దినములుండి లక్ష్మీనృసింహార్చన తత్పరులై గడపి పిమ్మట యోగిరాజు లక్కడనుండి తీర్థరాజ పురమున

శేగిరి (11). అక్కడ సర్వభద్రముల నొసంగుచు తుంగభద్ర రంగత్తరంగోజ్జ్వల ముగా ప్రకాశించుచున్నది. ఆ నదీమతల్లి జనాఘదూరీకరణదక్ష యగుచున్నది (12) ప్రౌఢాంగన తన పతిని చేరునట్లే యా సరిద్వర సైకతశ్రోణియై పర్వతస్తనియై ప్రియకాంతుడగు సరిత్పతిని చేరుచున్నది (13). ఆ నదీతీర సైకతములు ముని సంఘములతో నిండిన ఆశ్రమములతో కలకలలాడుచున్నవై మకరికాపత్ర విరచన మొనర్చిన నదీమతల్లి గండస్థలములవలె నొప్పుచున్నవి (14). తనయందు వికసించిన నీలోత్పలముల మకరందముల నానుచు మొరయుచున్న భృంగ నినాదముల చేతను, తరంగహస్త సంచాలముల చేతను స్నానము చేయ రండని జనుల నాహ్వానించుచున్నదా యనిపించుచుండును (15). ఆ నదీతీర్థము మహా పాపవినాశిని యని ప్రఖ్యాతి నంది నది. దానిని నోటనూని భక్తితో గ్రోలగలిగిన పుణ్యాత్ములకు మరల జన్మముండునా (16). ఆ నదియందే జగత్ప్రసిద్ధినందిన రామకుండ తీర్థమున్నది. స్త్రీ బాల వృద్ధు లనుకూడ విడువకుండ ముయ్యేడుమారులు భూప్రదక్షిణ మొనర్చి వెదకి వెదకి రాజు లను వధించిన జామదగ్న్యుడు ఆ రామకుండమున స్నానమాడియే సర్వపాప విముక్తు డయ్యెను (17). పూర్వగురువులయిన శ్రీ సచ్చిదానంద యతీంద్రవర్యు లక్కడనే శిలాతలమున విద్యావిశ్వేశ్వరులను పేరుతో నొక శివలింగమును ప్రతిష్ఠించి అర్చించి యున్నారు (18). ఆనది ఉభయతీరము లందును బ్రాహ్మణ గృహములు తపస్వి సిద్ధౌఘముల పర్ణశాలలు రెండు భుజములమీది రత్నభూషణముల వలె ప్రకాశించు చున్నవి (19). ఈ సచ్చిదానంద యతీశ్వరులు అక్కడి బ్రాహ్మణాగ్రహారవాసులు వచ్చి తమతో కొన్నాళ్ళుండి ఈతిబాధలను నివారించవలసినదని ప్రార్థింపగా వారి ననుగ్రహించుటకై అచట కొన్నిదినము లుండదలచిరి (20). యతిసార్వభౌము లా యగ్రహారమున నుండి చంద్రమౌళీశ్వరార్చన మొనర్చుచు నున్నారని తెలిసి దేశ దేశములనుండి వచ్చిన బ్రాహ్మణుల కెందరికో అభీప్సితములు ఫలింపజేయుచు తని యింపజేసిరి (21).

జగద్గురువుల పాదసరోజ తీర్థములచే పాపవిముక్తులయిన వారు తమ తమ స్థలములకుపోయి శ్రీవారి ఉనికినిగూర్చిన వార్తను పదిదిక్కుల వ్యాపింపజేసిరి(22). స్వమఠమున్న శృంగగిరిని విడిచి స్థలాంతరవాస మనస్కులగుటకు కారణమేమిటా యని దేశదేశ రాజులును ఛాత్రసంఘములును శంకాన్వితులై పరిపరివిధముల నూహింప సాగిరి (23). చాలమందిరాజులు తమ చారులను గురువులున్నచోటికి పంపి శృంగే

రికి పంపి వారినుండి గ్రహించిన యథార్థ విషయములను బట్టి అందరుకూడి కర్తవ్య నిర్ణయమున కాలోచించిరి (24). వారందరు మొట్టమొదట చేయవలసినది గురు దర్శనమని నిశ్చయించుకొని తమతోకూడి రావలసినదిగా కోరుచు ఇక్కేరి భూపాలకునకు గూడ తమ సంకల్పము నెఱింగించు పత్రికను పంపిరి (25). ఆ పత్రికను దానిని తెచ్చిన దూతలను నిరసించి యా వార్తనుకూడ రాజునకు తెలియపరచక వంచకుడయిన దుష్టమంత్రి ఏమియుజరగ నట్లూరకుండెను (26). అట్లా మంత్రిచే నిరస్తులైన దూతలు తిరిగివచ్చి తమ్ముపంపిన రాజులకా వార్త నెఱింగించిరి. బహు దేశాధీశులగు వారందరు కోపించి ఇక్కేరిపై దండయాత్ర జరిపి యా రాజును శాసింపవలెనని నిశ్చయించుకొనిరి (27). క్రోధపరీత చిత్తులగు నా రాజుల నందరను మహారాష్ట్రప్రభువు సాంత్వనపరచి జగద్గురువుల కార్యము సాధించుకొని రమ్మని బాజీరావు తనమంత్రిని తగిన బలగముతో నియోగించెను (28). "శృంగేరిలో వాడు కట్టిన శైవమఠములను పెల్లగించివేసి జగద్గురువులను ప్రార్థించి తోడ్కొనిపోయి వారి మఠమున ప్రవేశపెట్టి రమ్ము" అని ఆ శాహుమహీమహేంద్రుడు తన మంత్రిని గట్టిగా ఆదేశించెను (29).

యుద్ధసన్నద్ధ మనస్కుడైయున్న ఆ మంత్రి చతురంగబల సమేతుడైయుండి గురుపుంగవుల కార్యమప్పటి కప్పుడు తీరిపోయినట్లే భావించెను (30) తా నిక్కేరికి బలసమన్వితుడై పోవుచు దారిలో తటస్థపడిన విమత భూపతుల నోడించి వారివారి రాజ్యముల నాక్రమించుకొనుచు పోయిపోయి ఇక్కేరి రాజ్యమును సమీపించి బలములను విడియించెను (31). బలవంతములైన ఈ సైన్యములు చుట్టుముట్టుటతోడనే దావానలము వ్యాపించినప్పుడు గూళ్ళను విడిచి పక్షులు పారిపోవునట్లే జనులెల్లరు భయభ్రాంతులై నివాసములను వీడి పారిపోయిరి (32). ఘోర యుద్ధమునకయినను కృతనిశ్చయుడై యున్న ఆ బాజీరావు చెప్పవలసిన మాటలు చెప్పిరమ్మని ముఖ్యదూతలను వంశపురి కంపించెను (33). ఆ దూతలు చెప్పిన మాటలువిని హాహాకారము లొనర్చుచున్న వంశపురినిచూచి, మార్గదుర్గపరిఖాది రక్షణకు తగిన వారిని నియోగించి ఆ దుష్టమంత్రి సేనాధిపతితో నిట్లు పలికెను (34). "ఓ సేనాపతీ! నీవు నీ బలము లన్నిటిని కదలించి ఈ చుట్టుముట్టిన

---

**28 శ్లో. క్రీ. శ. 1726-27 సం॥మున కర్ణాటకదేశమున యుద్ధమొనర్చి బాజీరావు సర్వత్ర విజయమందెను. సోమరశేఖరనాయకుడుకూడ వానిచే విజితుడై మహారాష్ట్ర ప్రభువునకు 'చౌత్' అను కప్పమును కట్టుచుండుట కంగీకరించెను.**

సైన్యములచు తరిమి గజాశ్వాదులన్నిటిని స్వాధీనమొనర్చుకొని మనమీది కెత్తివచ్చిన ఈ సేనాపతిని బంధించి తెమ్ము". (35) అట్లు ఆ సేనాపతిని నియోగించి ఆ మంత్రి సభామందిరమున కూర్చుండి శృంగేరి రాజ్యమంతయు రాజాధీనము చేసికొనఁబడినదని ఆజ్ఞాపత్రము వ్రాసి అక్కడ తన అధికారము సాగించుటకొక దుష్టబుద్ధిని పంపించెను (36). ఇక్కడీ సేనాపతి యుద్ధవార్త రాజునకు తెలిపి సర్వసన్నద్ధుడయ్యెను. బాజీరావునకు వానికి దేవేంద్ర దైత్యాధిపుల కైనట్లు మహాయుద్ధము జరిగినది (37). బాజీరావు సైనికులు పరిఖను భగ్నముచేసి దుర్గమును ప్రవేశించి లోనున్న శైవ మఠములను తగులబెట్టిరి (38). ఆ మఠములు తగులబడిపోగా అక్కడున్న మఠాధికారులయిన శైవులెట్లో పారిపోయి మఠములు తగులబెట్టబడిన వనియు ధనమంతయు నపహృతమైనదనియు దుఃఖించుచు రాజునకు చెప్పిరి (39). ఆయన విని ఆశ్చర్యపడి మంత్రిని పిలిపించి ఆతనిని "ఈ యుద్ధమెందుకు ఆరంభమైనదో మూలకారణము బాగుగ విచారించి చెప్పుమని ఆడిగెను. (40) శత్రుభీతిచే కాందిశీకులయి పారిపోయి వచ్చివారి మాటలతో ఖిన్నుడయిన రాజడిగిన ప్రశ్నము విని మంత్రి (41) "నీవు శృంగేరిలో ఉండివచ్చినప్పటినుండి యతీంద్రులు తమ మఠములో నుండుట లేదు. ఎప్పుడు నెక్కడనో స్థలాంతరములయందే కాలక్షేపము చేయుచున్నారు. అందుచే ఈ యుద్ధమేర్పడినది" అని బదులు చెప్పెను. (42) నే నక్కడనుండి వచ్చుట యతీశ్వరుల ప్రవాసమున కెట్లు హేతువయినది. అది వివరింపుము" అని రాజడిగెను (43). "మీ రక్కడ నుండగా మఠములను కట్టించుట జరిగినది కదా! రాజిట్టి యనుచిత మొనర్చినచో మన మిక్కడ నుండ నేకూడదని తలచి యతీశ్వరులు వెడలిపోయిరి (44). మహారాష్ట్ర శాహురాజు వారి శిష్యుడు. తన మంత్రియైన బాజీరావును ఆ మఠములను ధ్వంసమొనర్పుమని పంపెను. ఆతడు మనరాజ్యము నే బాధించుచున్నాడు" అని మంత్రి బదులు పలికెను. (45) ఆతని సమాధానమువిన్న రాజు "అక్కడ మఠములు కట్టించుమని నీ కెవరు చెప్పిరి? నేను నీతో నన్నది యతివర్య ప్రీతికరమైన ధర్మమేదయినా చేయుమని. నీవు దానికి తలక్రిందు లొనర్చితివి. కాబట్టి ఈ యనర్థమంతయు స్వదోషమూల మన్నమాట" (46) అని పలికి రాజు అంతటితో నూరుకొనక ఆ ప్రధానితో "నీ వక్కడికిపోయి ఆ మఠములు నిర్మూలించి యతివర్యులను సాంత్వన పరచి రమ్ము" అని ఆజ్ఞాపించెను. (47) రాజుచేత నే నియుక్తుడయిన ముఖ్యదూత అక్కడకు వెళ్ళి ఆ మఠములను నిర్మూలించెను. అందు నివసించుచున్న శైవులందరు వంగివంగి నమస్కరించుచు సిగ్గుచే పలాయనము చిత్త

గించిరి (48) పిమ్మట రాజే జరిగిన యథార్థమంతయు మనవి చేయుచు శిరసా స్కారములు సమర్పించుకొని యతివర్యులను స్వపురమునకు చేరికొనవలసినదిగ ప్రార్థించెను. (49) అతనితో గురుసార్వభౌములు "మా అభీప్సిత మిదికానేకాదు మతద్వయ ముండనిండు పోనిండు. మద్వాంఛితము రాజ సంతోషమే." అని ప కిరి. (50) అమీదట రాజు సర్వోపాయ ప్రవీణుడగు నొక సేనాధిపతిని సైన్య యుక్తముగా బాజీరావు కడకు పంపి వానితో నైకైన సంధి సాధించుకొనిరమ్మని పంపెను. (51) నృపాజ్ఞను శిరసావహించి వాడు సైన్యయుక్తుడై పోయి బాజీ రావును చూచి ప్రేమతో కుశల ప్రశ్నాదిక మొనర్చి ధీరుడై సంధి ప్రస్తావన మొన ర్చెను. (52) వాడు చెప్పినది విని అట్లైనచో సరే అని మోదముతో నంగీకరించి యథాపూర్వముగ మాటాడి మీరాజు రాజ్యబలకోశ మిత్రవర్గాదుల యందు మాకును ప్రయోజన ముండవలయును గదా యని బాజీరావు పలికెను. (53) అప్పుడు ఆ ఇక్కేరి రాజసేనాపతి రాజాశయమునంతయు నతనికి సంక్షిప్త శబ్దార్థవిశేష యుక్త ముగ నెఱింగించిరి. (54) "ఓయి శాహురాజమంత్రీ! మీ రేపనికై ఇక్కడికివచ్చి యున్నారో ఆ పనిని మారాజే స్వయముగా చేసియున్నాడు. కాబట్టి మీ కిరు వురకు స్నేహముగుట న్యాయముకదా" అని అనెను. (55) అతని మాటలు విని బాజీరావు నిజమే అని సంభావించి అతనితో మేము వచ్చినది గురుదర్శనము కొఱకు. ఆ ప్రయోజనము నెరవేర్చికొని పిమ్మట సైన్యయుక్తముగా స్వపురమున కేగెదము. (56) మా సైన్యము లింకను నిక్కడ నిలిచియుండుట వలన మీదేశమునకు దుర్భిక్ష భయమున్నదని మీరాజు తలంచు నట్లయిన గురువుల కీ విషయమై శీఘ్రముగ నేనే విజ్ఞప్తి పత్రమును పంపికొనెదను. (57) నేను వారి ఆశీర్వచనములను పాదతీర్థ మును ప్రసాదానుమతి పత్రములను పొందునంతవరకు నీవు నాతోనే వుండవలసినది. ఈ విషయమింతయు మీ రాజునకు దూతనుపంపి విన్నవింపుము" అని పలికెను. (58) అప్పుడా ఇక్కేరి సేనాపతి కాలోచిత కార్యవేత్తయయి బాజీరావు వచనానుసార ముగ రాజుకడకు సర్వసమాచార యుక్తముగ నిపుణుడగు దూతను పంపి తా నాత నితో కలిసి వెళ్ళెను. (59) ఆ దూతవలన సమస్త మెఱింగిన ఇక్కేరిరాజు సర్వ సమాచారమును యతివర్యులకు మనవి చేయవలసినదని కొందరు దూతలను తానే యతివర్యుల కడకు పంపెను. (60) రాజు పంపిన దూతలవలన సర్వము తెలిసిన గురువర్యులు "ఈ నిమిత్తమున రాజ్యమునకు భీతి కలుగకుండుగాక. మేము సంతో షముతో శృంగగిరికి తిరిగి వెళ్ళెద"మని శిష్యపరివారములతో బయల్వెడలిరి. (61)

క్కడనుండి బయలుదేరి సిద్ధగిరి యందున్న సిద్ధిప్రదగణేశుని పూజించి తత్ప్రసా

దమును పొంది మాండవ్య మున్యాశ్రమమును చేరిరి. (62) యోగిరాజులగు గురువర్యు లట్లు దక్షిణదిశను విడిచి యుత్తరదిశకేగు సహస్ర కిరణునివలె ససంభ్రములై ప్రయాణ మొనర్చుచుండ వెనుకటి దుష్టమంత్రి వారికి మార్గావరోధము కల్పించెను. (63) అప్పుడు వారు స్వప్రభావముచేత నే సూర్యుడు మేఘజాలములను భిన్న మొనర్చు నట్లు వాడు కల్పించిన అవరోధములను నిర్భిన్న మొనర్చి హరదత్త క్షేత్రమును చేరు కొని అక్కడనున్న స్వీయమఠమున నివసించిరి. (64) అప్పుడు తత్ప్రాంత వాసు లెల్లరు తమకింతటి అదృష్టము పూర్వమెప్పుడు కలుగలేదని జగద్గురు సేవాతత్పర మతులై నిర్ధూతపాపులై శ్రీవారిదర్శన మొనర్చికొని తమతమ భాగధేయములతో సకలార్థులగు వారిని అర్చించుకొనుచు అక్కడ శ్రీవారికంతయు ననుకూల మొనర్చిరి. (65) (సశేషము)

# వేదాంత న్యాయములు (41)

న్యాయములు(అంటే ఉదాహరణలు)

[వేదాంత శాస్త్రముతో సూక్ష్మవిషయములను బోధచేయుటకు కొన్ని ఉదాహరణలు సాధారణముగా నుపయోగించెదరు. ఈ ఉదాహరణలు నిత్యజీవితమునకు సంబంధించినవిగా నుండి-వీటిమూలమున దుర్గ్రాహ్యమైన సిద్ధాంత విషయములను అవగాహన చేసికొనుటకు తోడ్పడును. ఈ ఉదాహరణలవలన-సునిశిత ప్రజ్ఞావంతముకాని సామాన్యుని మేధస్సుకూడ సిద్ధాంతమును గ్రహింపగల్గును. సామాన్యపాఠకులకొఱకు వేదాంత న్యాయముల వివరణములను క్రమముగా ప్రకటించుచున్నాము. సంపాదకుడు]

## పట్టుపురుగు

పట్టుపురుగు తన నోటినుండి పట్టుదారమును వెలువరించి దానితో తనచుట్టు పంజరమువంటి గూడును అల్లుకొని దానిలో తన్ను బంధించుకొనును.

అదేవిధముగ జీవుడు అజ్ఞానమువలన — రాగమువలన తనకు బంధములను కల్పించుకొనును. అందువలన పునరపి జననం పునరపి మరణం—జనన మరణములతో నిరంతరము సతమతమగుచుండును.

ఓం శాంతిః.

వేదాంతన్యాయములన్న యీ శీర్షిక క్రింద 41 వ్యాసములను ప్రకటించి ప్రగాఢమైన శాస్త్రరహస్యముల నీ శీర్షికలో సులభగ్రాహ్యములుగా వెలువరించుట జరిగినదని పాఠకులు ప్రశంసించిరి. వారందరికి కృతజ్ఞతలు.

ఇంతటితో యీ 'వేదాంతన్యాయములు' అన్న ధారావాహిక శీర్షికను ముగింపు చేయుచున్నాము. —సంపాదకుడు.

# శ్రీ జగద్గురు మహాసన్నిధానమువారి సందేశము

(నేటికాలమున దక్షిణతమిళనాడులోని హరిజనులు కొందరు మతాంతరు లగుచున్న సందర్భమును పురస్కరించుకొని—రాజకీయనాయకులు, సాంఘిక నాయకులు కల్పించిన యీ సమస్య విషయమున శ్రీ జగద్గురువు లీ సందేశ మొసగినారు)

—సంపాదకుడు.

మతము మార్చుకొన్న హరిజనులకు—వారి కిదివరకున్న ప్రత్యేక అనుకూల్యము లన్నియు ప్రభుత్వము రద్దుచేయవలెను. మతము మార్చుకొన్న తరువాత వారు హరిజనులు కాదుకదా! కావున హరిజనుల కుద్దేశించిన సదుపాయములను యీ నూతన మతాంతరుల కీయరాదు.

నిజమునకు హిందువుని—వేరొక మతములోనికి మార్పుచేయుట శాస్త్రము లంగీకరింపవు. హిందువుగా పుట్టినవాని పుట్టుక నెట్లు మార్తురు? కావున యీ మతము మార్చుకున్నవారు పశ్చాత్తాపము పొందినచో వారిని—హిందువులుగనే—ఏమియు జరుగనట్లే—భావింపవచ్చును.

ధర్మము తన్ను రక్షించువానిని రక్షించును. (ధర్మోరక్షతి రక్షితః) ఎవరి ధర్మమును వారు అనుష్ఠించుటకంటె ఉత్తమమైనది మరొకటిలేదు. ఇది దృష్టియందుంచుకొని—పనులు చేయుట కుపక్రమింపవలెను.

ఇతరులకు కష్టములు, బాధలు కలిగించునట్లు ప్రవర్తింప నేరాదు. బావులను దేవతాయతనములను—ఉపయోగించుటకు అందరికి హక్కు కలదు. ఎవరిని అభ్యంతరము పెట్టరాదు. అట్టి సర్వజనోపకరములయిన వాటిని ఉపయోగించుకొనరాదని అభ్యంతరము పెట్టువారిని ప్రభుత్వము శిక్షింపవలెను.

(రాజకీయ నాయకులు, విధర్మీయులు, మతోన్మాదులు, యీ సమస్యను సృష్టించి ఎన్నెన్నియో అధికప్రసంగములను, ప్రలాపములను చేయుచున్నారు. వారి వారి ప్రలాపములకు సమాధానమీయ నక్కరలేదు. అధికారమున్నవారి బలములేక మతనాయకులు చేయగలది తక్కువ. ఏది ఏట్లున్నను—ఎవరికి వారు తమతమ ధర్మములను అనుష్ఠించుకొనుచు — పేదలను, దుర్బలులను, బలహీనవర్గములవారిని— చక్కగా చూచుచుండవలెను. ఈ సమస్యపై 'శ్రీ శంకరకృప' చెప్పుటకు మరేమియు లేదు.

—సంపాదకుడు.)

# శ్రీ జగద్గురువుల సంచార కార్యక్రమము

శ్రీ జగద్గురువులు 19-10-81 ఉదయము మంగుళూరు వెళ్ళి అక్కడ నొక శంకరమఠ నిర్మాణమునకు స్థలాదినిర్ణయము చేసి సాయంత్రమే తిరిగి శృంగేరి వచ్చెదరు.

22-10-81 గురువారము శృంగేరిలో సాయంత్రము బయలుదేరి చిక్కమగళూరు చేరి స్వకీయ మఠమున విడిదిచేసెదరు.

23-10-81 శుక్రవారము సాయంత్రము చిక్కమగలూరునుండి హాసన్ చేరి అక్కడ స్వకీయమఠమున విడిదిచేసెదరు.

24-10-81 శనివారము హాస్సన్‌నుండి సాయంత్రము బయలుదేరి మైసూరు చేరి స్వకీయమఠమున (అభినవ శంకరాలయమున) విడిదిచేసెదరు. మైసూరున శ్రీ మహాసన్నిధానమువారి వార్షిక వర్ధంతి ఉత్సవము శరదుత్సవముగా నడచును.

25-10-81 ధర్మసమ్మేళనము, 26-10-81 వర్ధంతి ఉత్సవము, 27-10-81 సాహిత్య సమ్మేళనము, 28-10-81 వేదపండితుల సన్మానసభ జరుగును

29-1031 మంగళవారము సాయంత్రము మైసూరునుండి బయలుదేరి బెంగళూరు చేరి స్వకీయ మఠమున (శంకరమఠము, శంకరపురము, బెంగళూరు-4) విడిది చేయుదురు. బెంగుళూరులో 30, 31 అక్టోబరున మకాము.

## నవంబరులో

నవంబరు 1, ఆదివారము సాయంత్రము బెంగుళూరున బయలుదేరి సేలము చేరి స్వకీయమఠమున విడిదిచేయుదురు (II అగ్రహారము, సేలము-1). నవంబరు 3 మంగళవారము సాయంత్రము సేలమునుండి బయలుదేరి కోయంబత్తూరు చేరి రేస్ కోర్స్ రోడ్డులోనున్న 'సూలూరు హౌస్'లో విడిది చేయుదురు. నవంబరు 6 శుక్రవారం కోయంబత్తూరునుండి సాయంకాలము బయలుదేరి పాలఘాటు చేరుదురు. మరునాడు శనివారము (7 నవంబరు) సాయంత్రము కాలడిచేరి స్వకీయమఠమున విడిదిచేయుదురు. 12 నవంబరు గురువారము సాయంత్రము కాలడినుండి బయలుదేరి కొచ్చిన్ చేరుదురు. మరునాడు (13 నవంబరు శుక్రవారము) సాయంత్రము కొచ్చిన్‌నుండి కోట్టయము చేరుదురు. నవంబరు 14 శనివారము సాయంత్రము తిరువనంతపురము (త్రివేండ్రము) చేరి సౌత్ వీధిలో (త్రివేండ్రము-23) నున్న స్వకీయ మఠమున విడిదిచేయుదురు. (15 నవంబరు తిరువనంతపురమున మకాము).

నవంబరు 16 సోమవారము సాయంత్రము షెంకోట చేరుదురు. నవంబరు

18 బుధవారము సాయంత్రము తిరునల్వేలి చేరి శివపురం వీధిలో (తినల్వేలి జంక్షన్) నున్న స్వకీయమఠ కల్యాణమందిరమున విడిది చేయుదురు. 19 నవంబరునుండి 22 నవంబరు వరకు తిరునల్వేలిలో మకాము.

23 నవంబరు బుధవారము సాయంత్రము తిరునల్వేలినుండి కల్లడైకురిచ్చి చేరి (యస్. యన్. యస్. హాన్, రామచంద్రపురం వీధి) 24 నవంబరునుండి 6 డిశంబరు వరకు అక్కడనే విడిది చేయుదురు.

కల్లడైకురిచ్చిలో అతిరుద్రమహాయాగము శ్రీ జగద్గురువుల సన్నిధిలో జరుగును.

---

# కల్పవృక్షం

ముదివేడు ప్రభాకరరావు,
రీసెర్చి అసిస్టెంటు, ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్,
శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ, తిరుపతి-2.

ఆశాపాశము దాఁగడున్ నిడుపు లేదంతంబు రాజేంద్ర! వా
రాశి ప్రావృత మేదినీ వలయ సామ్రాజ్యంబు చేకూడ డియుం
గాసిం బొందిరి గాక వైన్యగయ భూకాంతాదులు స్వర్గకా
మాశన్ బాయగ నేర్చిరే మును నిజాశాంతంబులం జూచిరే.

—పోతన భాగవతం.

భారతీయ ఉపాఖ్యానాల్లో కల్పవృక్షపుకథ యెంతో రమణీయమైయుంది. కల్పవృక్షం స్వర్గలోకంలోని సనాతన మహావృక్షమని చెప్పబడుతూవుంది. ఆచెట్టు నీడలో మనమేది కోరితే అది తప్పక లభిస్తుంది. కల్పవృక్షానికుండే వరప్రదాన శక్తి అమోఘమైంది. స్వర్గానికీ, భూమికీమధ్య యెటువంటి దుర్లభమైన వస్తువయినా సరే కల్పవృక్షం క్రింద సంకల్పమాత్రంచేత యిట్టే సిద్ధిస్తుంది. మానవుని మనస్సు కోర్కెలపుట్ట. ఒకప్పుడు ధనధాన్యాలు కోరితే మరొకప్పుడు బంగారు లంకె బిందెలు; ఒకప్పుడు రాజ్యాధిపత్యాన్ని వాంఛిస్తే మరొకప్పుడు దేవేంద్రభోగాల్ని; ఒకనాడు సుందరాంగిపై కోర్కెపుడితే మరొకనాడు ఆయురారోగ్యాలు గలిగిన పుత్రపౌత్రుల్ని; ఒకసారి దీర్ఘమైన ఆయుర్దాయాన్ని అభిలషిస్తే మరొకసారి జ్ఞాన విద్యా సముద్రాన్ని ఆపోశనం పట్టాలని తాపత్రయపడతాడు. భూమిపై శ్వాస

తీర్చే ఏ ప్రాణికూడా బహుముఖీనమైన యీ కోర్కెలబారినుండి తప్పించుకొన్న వాడు లేడు. అందుకే మన పోతనామాత్యుడు ఆశకు అంతులేదన్నాడు. ఒక్కసారి భావించి చూడండి! మనం ఏదో విధంగా ఒకసారి కల్పవృక్షం క్రిందికి చేరుకోవడం జరిగితే అప్పుడీ పైన పేర్కొన్న కోర్కెలు ఫలించడంలో యేమైనా వుంటుందా? అని. కల్పవృక్షం నిజంగా సమస్తమయిన సద్ధికి, సమృద్ధికి అపూర్వాశ్రయ స్థానమౌతుంది. దాని అక్షయాభండారంలో మంటిజీవుల అభిలాషల్ని తీర్చే సాధనాల సమిష్టి శక్తివుంది.

## కల్పవృక్ష మంటే ఏమిటి? :

భారతీయ ఉపాఖ్యానాల్లోని యీ కావ్యకల్పనలోగల రహస్యార్థమేమిటి? నేలపై పుట్టిన ప్రతిజీవి స్వర్గలోకంలోని యీ అపూర్వ వృక్షంతో పరిచయం సంపాదించుకో గలడా? ఒకవేళ మర్త్యలోకంలోని మనిషి స్వర్గంలోని యీ వనస్పతితో పరిచయం సంపాదించుకో గలిగితే దానిచే మానవ సమాజానికి యెటువంటి సౌభాగ్యం, అభ్యుదయం సిద్ధిస్తుంది? మానవుడు తన దైనందిన జీవితాన్ని సుఖమయం, శాంతిమయం చేసుకోడానికి కల్పవృక్షమిచ్చే అమోఘమైన వరాలు ఏ విధంగా అందుబాటులోకి రాగలుగుతుంది? ఈ ప్రశ్నలకు సరియైన సమాధానం లభిస్తేనే మనం కల్పవృక్ష రహస్యం సంపూర్ణంగా తెలుసుకోగలం. దీనికై సముద్ర మంథన కథారహస్యాన్ని తెలుసుకోవడం ముఖ్యం.

## సముద్ర మంథనకథ :

మహాభారతం ఆదిపర్వంలో దేవాసురులద్వారా సముద్ర మంథనం జరిగినట్లు కథ చెప్పబడింది. (అధ్యాయాలు 17-18). ఇతర పురాణాల్లోకూడా ఈ కథే విస్తరించి వివిధంగా చెప్పబడింది. కాని మహాభారతంలోని వర్ణనే ఆ కథయొక్క ఆధ్యాత్మిక భావానికి మిక్కిలి దగ్గరగావుంది. కలశరూపమైన ఉదధి (కలశోదధి)ని మథించాలని ఆ మథనంచే అమృతం లభిస్తుందని దేవతలు, అసురులు తలపోశారు. సర్వ ఔషధాలను, సర్వరత్నాలను పొందిన తర్వాతనే అమృతం లభిస్తుందని వారు భావించారు. 'అమృతం జలంనుండి పుడుతుంది. కాబట్టి జలాన్ని మథింపుదాం' అన్నారు దేవతలు. వాళ్ళు సముద్రానికి ఉపస్థానం చేశారు. అంటే సముద్రం దగ్గరికి వెళ్ళారు. "నాకుకూడా అమృతంలో కొంతభాగం యిచ్చే పక్షంలో మంధరభ్రమణంచేత కలిగే క్లేశాన్ని సహిస్తాను" అన్నాడు సముద్రుడు.

విష్ణువు ప్రేరణతో అనంతుడనే మహాసర్పం మందరపర్వతాన్ని పెళ్ళగించాడు. సముద్రపు టొడ్డునుండి కూర్మరాజుతో "ఈ మందరగిరిని నీ వీపుపై భరించవయ్యా!" అన్నారు. కూర్మం వీపుపై మందరాన్ని పెట్టి వాసుకి అనే సర్పరాజును త్రాడుగా చుట్టి (సంస్కృతంలో దీన్నే 'నేత్రసూత్ర' మంటారు.) ఇంద్రుడు మంథనక్రియ ప్రారంభించాడు. సర్పం నోటివైపుగా అసురులు, తోకవైపుగా దేవతలు పట్టుకొని సముద్రాన్ని మథించడం ప్రారంభించారు. ఆ సంఘర్షణచే అగ్ని ఉద్భవించసాగింది. దానిని ఇంద్రుడు మేఘజలంతో శాంతింపజేశాడు.

అప్పుడు సంభవించిన మహాఘర్షణవల్ల పెద్దపెద్ద వృక్షాలలోని పాలు, ఔషధీరసాలు సముద్రజలంలో ధారాపాతంగా కలువసాగాయి. అలాంటి అమృత వీర్యరస సమ్మిశ్రితమైన దుగ్ధంచే దేవతలకు అమృతత్వం సిద్ధింపసాగింది. అదే జలంలో సువర్ణరసంకూడా మిళితమైంది. ఈ ప్రకారంగా అనేక ఉత్తమ రసాలచే ఓతప్రోతమైన సముద్రజలం పాలసంద్రమైపోయింది. ఆ క్షీరం చిలకబడి నెయ్యిగా మారింది. అప్పుడందరూ శ్రమకు లోనుకావడం గమనించి విష్ణువు వాళ్ళ కుత్సాహాన్ని రేకెత్తిస్తూ 'మంధర పర్వత పరిభ్రమణంచే కలశాన్ని' క్షుభితంచేయండి" అని ప్రోత్సహించాడు.

కలశోద్భవమయింది. ఆ కలశంనుండి చంద్రుడు పుట్టాడు. తరువాత లక్ష్మి పుట్టింది. పిమ్మట సురాదేవి, మనస్సుతో సమానవేగం గలిగి (మనోజవం) ఏడు ముఖాలుగల 'ఉచ్చైశ్శ్రవం' అనే పేరుగల్గిన అశ్వం పుట్టింది. ఈ నాలుగూ ఆదిత్యమార్గాన్ని అనుసరిస్తూ దేవగణాలుండే చోటికి వెళ్ళిపోయాయి. మరీచులతో ప్రకాశమైన దివ్యమణి కౌస్తుభం నారాయణ విష్ణువు వక్షస్థలంపై అధివసించింది. దీని తర్వాత శ్వేతకమండలువును ధరించి భగవంతుడయిన ధన్వంతరి ప్రభవించాడు. ఆ కమండలంలో అమృతముంది. అదేసమయంలో పుట్టినవే పారిజానం, కల్పవృక్షం నాల్గు దంతాలున్న ఐరావతమనే ఏనుగూ, కాలకూట విషమున్నూ. బ్రహ్మ చెప్పిన మాటవిని శివుడు కాలకూట విషాన్ని కంఠంలో ధరించి నీలకంఠుడయ్యాడు. ఆ సముద్ర మంథనంనుండే కామధేనువనే గోవూ, పాంచజన్యమనే శంఖం, విష్ణువు యొక్క ధనుస్సూ, దేవాంగనలయిన రంభాద్యప్సరసలూ పుట్టారు. ఎట్టకేలకు దేవతలు జయాన్ని పొంది మంథరపర్వతాన్ని యథోచిత సత్కారంచేసి దాన్ని యథాస్థానంలో ప్రతిష్ఠించి ఆనందితులయ్యారు.

పై ఉపాఖ్యానంలోని రహస్యార్థం :

సముద్రమంథన ఉపాఖ్యానాన్ని ఆధ్యాత్మిక దృష్టితో వీక్షించి స్తే మానవాంతర్గత దైవాసురవృత్తుల సంఘర్షణ అని స్పష్టమౌతుంది. మనస్సు—మానవునికి గల సర్వశ్రేష్ఠమయిన నిధి. మననాత్మకమైన అంశమే మానవునిలోని దైవీ అంశం. శరీరభాగం పార్థివం. మనోభాగం స్వర్గీయం. మరోరకంగా చెబితే శరీరం మృత్యువు. మనస్సు అమృతం. శరీర సంబంధమైంది నశ్వరం. మనస్సుతోడి సంబంధం అనశ్వరం. అది కల్పాంత స్థాయి. అందుకే "శీర్యతే యితి శరీరం" "మనోవై దేవవాహనం" అన్నారు. 'తను విస్తారే, తన్యతే విస్తార్యతే ఇతి తనుః' అని అమరం (2-71) మనస్సుశక్తుల వికాసంచేతనే వ్యక్తి వర్చస్వి అవుతున్నాడు. అంటే మనస్సుచేతనే శరీరం వికసిస్తోందని అర్థం. మనస్సును మథించగా పుట్టిన వాడు మన్మథుడు. వీనికే అతనుడు అని పేరు. అంటే తనువు లేనివాడు. స్త్రీ పుం సంయోగంచే అతినుడు తన్మాహితుడై పుడుతున్నాడు.

ఏ విజ్ఞానశాఖను పరిశీలించినా మనోశక్తి శారీరక శక్తికంటే బృహత్తరమైందని, విశిష్టమైందని తెలియగలదు. యోగుల శరీరం కృశించి వుంటుంది. కాని మనస్సుమాత్రం మహాశక్తివంతమై వుంటుంది. ఋగ్వేద సంబంధమైన ఐతరేయ బ్రాహ్మణంలో మానవాంతర్నిహితమైన మనస్సులోనే ప్రజాపతి తన అలౌకిక స్వరూపాన్ని సన్నివిష్టం చేశాడని చెప్పబడింది.

'అపూర్వా ప్రజాపతేస్తనూ విశేషః తన్మనః'—(5-25)

మానవ శరీరంలోని మనస్సే దేవాసురుల సంఘర్షణకు రంగస్థలం. వైదిక పరిభాషలో మానవశరీరం "ఘటం" లేదా "కలశ"మని చెప్పబడింది. జైమినీయ-ఉపబ్రాహ్మణంలో పురుషుడు సముద్రంతో పోల్చబడినాడు.

"పురుషో వై సముద్రః"—(3-35-5)

సముద్రమంథన మనేది ప్రతిప్రాణి జీవితంలో తప్పక జరిగితీరవలసిన గొప్ప అంశం. దీనిచే అనేక దివ్యరత్నాలు ఉద్భవిస్తాయి. కవి సమాధ్యవస్థలో కావ్య రచన చేస్తున్నాడు. సహృదయుని మననంచే కావ్యరసానందం కలుగుతోంది. తాత్త్వికుని చింతనచే దర్శనగ్రంథాలు పుడుతున్నాయి. సదసద్వివేకంచేత వ్యక్తి లోకంలో రాణిస్తున్నాడు. ఈ మంథనం నుండి పుట్టే అమృతం లేదా ప్రాణభూతమైన మూలదుంప యేదయితేవుందో దాని అంశ దేవతలకు చెందాలి. అసురులు జీవితసూత్రంపై అధికారం చెలాయించడం ప్రారంభిస్తే మానవుడు మృత్యుముఖానికి పోతాడు.

జీవన వృక్షమే కల్పవృక్షం :

ప్రాచ్య పాశ్చాత్య సాహిత్యంలో కేంద్రనాడీమండల వర్ణనం ఒక వృక్ష స్వరూపంతో పోల్చబడింది. పాశ్చాత్య పరిభాషలో దీని పేరు జీవనవృక్షం (ARBOR VITAE). భారతీయులుకూడా జీవనాన్ని, వంశాన్ని, సంసారాన్ని వృక్షంతో పోల్చుతారు. ఉదాహరణకు జీవనవృక్షం, వంశవృక్షం, సంసారవృక్షం. "The Central Nervous is the Tree of Life" కేంద్రనాడీమండలమే జీవన వృక్షం అన్నారు పాశ్చాత్యులు. మరి కల్పవృక్షం మాటేమిటి? కల్పింపబడిన వృక్షం కల్పవృక్షం. ఇది సాధారణ భూరుహాంకంటె విలక్షణమైంది, విశిష్టమైందని చెప్పడానికే యిలా కల్పింపబడింది.

ఊర్ధ్వమూల మధశ్శాఖం అశ్వత్థం ప్రాహురవ్యయమ్।
ఛందాంసి యస్య పర్ణాని య స్తంవేద స వేదవిత్॥ (15-1)

అని భగవంతుని వాక్కు. ఆయుస్సునూ, సంతానాన్నీ పొందడానికి వృక్ష పూజ మనదేశంలో ప్రాచీనకాలాలనుండి వస్తూవున్న గొప్ప ఆచారం. తులసి, బిల్వ, అశ్వత్థవృక్షాల నిందుకే పూజిస్తారు. క్రీస్తుపూర్వం మొదటి శతాబ్దికి చెందిన మధురదేశ శిల్పం మనకు లభించిన వాటిలో వృక్షపూజకు ప్రథమోదాహరణం.

ప్రతి మానవుని శరీరంలో ఒక వృక్షమున్నది. నాడీమండలములోని శాఖలు, ఉపశాఖలు ఈ వృక్షంయొక్క అంగప్రత్యంగాలు. మానవుని ఆరోగ్యం, ఆయు ర్దాయం ఈ నాడీసంస్థపై ఆధారపడివుంది. ఈ వనస్పతియే మానవ జీవనకేంద్రంలో స్థాపింపబడిన యూపం.[1] దీనితోనే మానవ జీవితాయుష్కాలం ముడిపడివుంది.

సంకల్ప వికల్పాలు :

భారతీయపరిభాషలో ఈ వృక్షానికే కల్పవృక్షమని పేరు. 'కల్పం' 'కల్పన' అనే రెండుపదాలు ఒకేధాతువునుండి పుట్టాయి. 1. సంకల్పం 2. వికల్పం. 'కల్ప' మనే పదానికి 'సమ్' లేదా 'వి' అనే ఉపసర్గలు జోడిస్తే పైరెండు రూపా లేర్పడుతాయి.

---

1. యజ్ఞపశువును కట్టివేయడానికి వాడే కొయ్యనే యూపం అంటారు. యజ్ఞంలో పొంద బోయే వివిధ ఫలితాలనుబట్టి ఈ కొయ్యను పలాశ, ఖదిర, బిల్వ, రౌహీతక వృక్షాల నుండి కోసి తయారుచేస్తారు.—ఆప స్తంబశ్రౌతసూత్రం 7-1-16.

సమ్ + కల్పం = సంకల్పం

వి + కల్పం = వికల్పం

ఇవే ఉపసర్గలు సమాధి, వ్యాధి అనే పదాల్లోకూడా వాడబడుతాయి.

సమ్ + ఆధి = సమాధి

వి + ఆధి = వ్యాధి

'సమ్' అనే ఉపసర్గ జీవితంలోని అంతర్ముఖీనగతిని గూర్చి చెప్పగా, 'వి' అనే ఉపసర్గ బహిర్ముఖమైన గతిని చెబుతున్నది. సంకల్పం వ్యక్తిని సమాధి వైపుకు తీసుకొనిపోతే, వికల్పం వ్యాధివైపుకు లాక్కొని పోతుంది. తత్ఫలితంగా తేలిందేమంటే

సంకల్పం = సమాధి

వికల్పం = వ్యాధి

మనోశక్తులయొక్క రహస్యం సంకల్పం లేదా సమాధి. మనస్సు సంకల్ప వికల్పాత్మకమైంది. దానిని సంకల్పం వైపుకు మళ్ళించడానికి మనోనిగ్రహం కావాలి. అప్పుడే సంకల్పమనే బీజం సమాధిసిద్ధిచే కల్పవృక్షమై ప్రతిమానవునిలో భాసిల్లగలదు.

మానవ శరీరంలోని వెన్నెముక కల్పవృక్షకాండం వెన్నెముకపై డిప్పెగా బోర్లింపబడివున్న మస్తిష్కమే పుంఖాను పుంఖములుగా, శాఖోపశాఖలుగా విస్తరిల్లిన వృక్షం. ఇదే కల్పవృక్షం. కవిలో కవితాసంకల్ప బీజం సమాధ్యవస్థలో మహాకావ్యంగా రూపొందుతూవుంది. శ్రీ విశ్వనాథ మహాకవిలో రామకథాబీజం రామాయణ కల్పవృక్షంగా ప్రాదుర్భవించింది. ఇది నారాయణ మూలమయిన తరువు. రాముడు బోద. లక్ష్మణుడు పంగ. ఆ మహాకావ్యం అద్వైతమనే బోదె గుండా ప్రవహించి స్వర్గతుల్యమైన శాంతరస మహాసముద్రంలో పర్యవసించింది.

నానా వికల్పాలతో కూడుకొన్న మనస్సు వ్యాధివైపుకు పయనిస్తోంది. దానిచే మనశ్శక్తి క్షీణిస్తోంది. ఆధివ్యాధు లంటారు. వ్యాధి అంటే శరీరంయొక్క అనారోగ్యం. ఆధి అంటే మనస్సుయొక్క అనారోగ్యం. మనోవ్యాధికి మందు లేదని సామెత. ఆధునిక కాలంలో మనోవ్యాధులు యెక్కువ కావటానికి కారణం మనిషి లోపలా బయటా సమన్వయం దెబ్బతినడమే. దీనినే విశ్వనాథవారి 'వేయి పడగలు' వర్ణిస్తోంది. పుట్టిన ప్రతిజీవుడూ కామసర్పదష్టుడై వ్యాధిగ్రస్తుడవుతున్నాడు. మానవుడి మనస్సే సంకల్ప కల్పద్రుమం. 'మనస్సంకల్ప కల్పద్రుమః'

అనటం యిందుకే. కాళిదాసు కుమారసంభవంలో 'కామదహన' ఘట్టమూ, విశ్వనాథ విరచిత 'వేయిపడగలు' నవలలోని కామదహన నాటకమూ సత్సంకల్ప ప్రాదుర్భావంచేత సత్సంతానం, సన్మార్గమూ అభిస్తాయని తెలుపడానికే వర్ణింపబడ్డాయి.

మనన శక్తి :

ఈ విధమైన కల్పవృక్షాన్ని ప్రకృతి ప్రతిప్రాణిలోపలా నిక్షిప్తపరచింది. మననం లేదా విచారం మానవస్వభావం. ఇదే చింతామణి. విష్ణువు వక్షస్థలంపైనున్న కౌస్తుభం. సంకల్పం సమాధి స్థితికి చేరుకోడానికి సాధనమార్గం మననం. "మననాత్ మునిరుచ్యతే' మనన దరితీర్ణ విద్యార్ణవో జగన్నాథ పండిత నరేంద్రః' మననంచేత విద్యాసముద్రాన్ని తరించి ఆవలిగట్టుకు చేరానని గజయాతగాడయిన జగన్నాథ పండితనరేంద్రుడు సాక్ష్యమిస్తున్నాడు. కాబట్టి సాహిత్యం ఆలోచనామృతం. ఆలోచన అంటే మననం, చింతన. ఆంగ్లంలో meditation అంటారు. శ్రీశంకరులు "రూక్షచింతన" అన్నారు. 'అతిరూక్ష చింతనాగ్రనిశిత తేజము శివుడు నన్ను జెందెడుగాతన్' అనిచెప్పిన విశ్వనాథ మహాకవి మననంలో పరాకాష్ఠ స్థితిచే లభించే కావ్యరసానందం వద్దని పునరావృత్తంలేని శివైక్యం కావాలని కోరుకొన్నాడు. ఇది సర్వోత్కృష్టమైన కాంక్ష.

మననంచేత మానవుడు ఉన్నతపథాలలో పయనించగలడు. విస్తారమైన విచార సామ్రాజ్యపు సరిహద్దుల్ని యింతవరకు యెవ్వడూ నిర్ణయించలేదు. కాబట్టే కాళిదాస మహాకవి 'మనోరథానా మగతిర్నవిద్యతే' (కుమారసంభవం 5-64) అన్నాడు. మనస్సు అనే రథంయొక్క వేగాన్ని ఎవరూ ఆపలేరు. మనోరథాల జగత్తులో అప్రాప్యవస్తువేదీ లేదు. వాయువేగ మనోవేగా లంటారు. మనస్సు గాలికంటే వేగవంతమైనది. అది క్షణక్షణం నూత్నరూపాలను సృష్టించుకొనే శక్తిగలది. "క్షణేక్షణేయన్నవతా ముపైతి తదేవరూపం రమణీయతాయాః" అని ఆలంకారికోక్తి. ప్రజాపతికూడా 'బహుస్యాం ప్రజాయేయేతి' అని సంకల్పించే సృష్టిచేశాడు. 'తం సృష్ట్వా తదనుప్రావిశత్' సృష్టించి శరీరంలో ప్రాణంగా కూర్చున్నాడు.

మననం మస్తిష్కంనుండి పుడుతుంది. మస్తిష్కానికే మరోపేరు స్వర్గం. అక్కడే జ్యోతిర్లోక ముంది. ఇందుకే కల్పవృక్షం స్వర్గలోకపు వృక్షంగా చెప్పబడుతూవుంది. వ్యోమంలో కల్పవృక్ష నక్షత్రాలున్నాయి. దీనిని పాశ్చాత్యులు

కూడా గుర్తించారు. కల్పవృక్షానికే పారిజాతమని పేరు. శ్రీకృష్ణభగవానుడు దివినుండి భువికి పారిజాతవృక్షాన్ని తెచ్చాడు.

మానవజీవితం, మనస్సుయొక్క అంతర్నిహిత శక్తుల క్రమికోద్ఘాటనం. ఇది జననం మొదలు మరణంవరకుగల మానవజీవిత వికాసానికి గీటురాయి. ఒక బాలునికి, యువకునికి మధ్య తారతమ్య నిర్ణయం మనస్సుయొక్క అవస్థాభేదంచేత చేయబడుతోంది. ప్రపంచంలో ఉత్కృష్ట మస్తిష్కంగల సంకల్పవంతమైన ప్రాణికి, ఒక సాధారణప్రాణికి మధ్యగల భేదానికి మనోశక్తులభేదమే అసలయిన కారణం. మనస్సే మనిషికీ మనిషికి మధ్యనున్న భేదాన్ని గుర్తింపజేసే కొలమానం.

## సత్సంకల్పమే సామాజిక చైతన్యం :

ఎవడు తనలో సత్సంకల్పమైన మనస్సును గల్గివుంటాడో వాడే దేశానికి పెన్నిధి వంటివాడు. అనేక విధాలైన దుర్బల వికల్పాలతో ప్రతాడితమైన మనస్సుగల, అస్థిరచిత్త వ్యక్తులతో కూడిన సమాజానికి ఏం విలువ వుంటుంది? ఎందరో ఆచార్యులద్వారా విశ్వవిద్యాలయాల్లో విద్యాబోధనకు ప్రణాళికలు ఏర్పరచటం దేనికోసమంటే సత్సంకల్ప పూరితమై, మనశ్శక్తిచే బలిష్ఠమైన మానవ సమాజ నిర్మాణం కోసమే. "ఈసురోమని మనుషులుంటే దేశమేగతి బాగుపడునోయ్" అన్నాడు గురజాడకవి. దుర్బలచిత్తుడు హత్యకు, ఆత్మహత్యకు పాల్పడవచ్చు. దానిచే సంఘంలో అస్థిరత్వం తప్పదు.

కల్పవృక్షం స్వర్గీయ దివ్య వనస్పతి. యజుర్వేదంలో మనస్సుకు 'దైవ' మనే విశేషణం ప్రయోగించబడింది. 'మనస్సాక్షి' అనే మాట యిక్కడనుండి పుట్టిందే. మన మీ స్వర్గీయ వనస్పతితో పరిచయం పొంది యెటువంటి అభ్యుదయాన్ని పొందగలం? అనేది ప్రశ్న. కల్పవృక్షమనే పేరే అది కల్పనా ప్రధానమని చెప్పక చెబుతున్నది. కల్పన లేదా సంకల్పం రెండు విధాలు. 1. శివం 2. అశివం. శివ సంకల్పమే మానవ కల్యాణ హేతువు. శివమంటే మంగళకరం. అశివమంటే అమంగళకరం. అందుకే శ్రేయోభిలాషులైన పెద్దలు "శివాస్తే పంథానః సంతు" అని చిన్నవాళ్ళను ఆశీర్వదిస్తూ ఉంటారు. వేదంలో శివసంకల్ప సూక్తులున్నాయి. ఆ సూక్తద్రష్ట పేరు కూడా అదే.

పౌరాణిక ఉపాఖ్యానాల్లో ప్రసిద్ధమైన విషయమేమంటే మనం కల్పవృక్షపు నీడలో నిలబడి అమృతం కావాలని కోరుకుంటే అదే దొరుకుతుంది. కాని భయంచేత, దుర్బల సంకల్పంచేత మానసిక వికల్ప కారణంచేత మృత్యువును

గూర్చి మనస్సు తలపోస్తే అది కూడా వెంటనే కలుగుతుంది. మనస్సే మానవుని సుగతి దుర్గతులకు మూలహేతువని గీతాచార్యుని ప్రవచనం "మన ఏవ మనుష్యాణాం బంధమోక్షయోః"

మనస్సు { సత్సంకల్పం——సమాధి——మోక్షం
దుస్సంకల్పం——వ్యాధి——బంధం }

మనస్సు చంచలమైంది. "మే హృదయకపి మత్యంత చపలం దృఢం భక్త్యా బద్ధ్వా భవదధీనం కురు విభో" అన్నారు శ్రీ శంకరులు. చంచలమైన మనస్సు ఒక్క క్షణంలో వెయ్యి కోతుల్ని సృష్టించుకొంటుందన్నారు మహాకవి. 'కల్ప వృక్షంలో' వేయిపడగల నే ఆధునిక మహేతిహాసంలో, మంగమ్మ పాత్ర మనస్తత్వానికి ప్రతీకగా 'వాలి' అనే కోతిని ఆమె పెంపుడు జంతువుగా సృష్టించారు. అందుకే, "యాదృశీ భావనా యత్రసిద్ధిర్భవతి తాదృశీ" అని గీత.

కల్పవృక్షం అవతరించిన జగత్తులో మానవ కల్యాణం శివసంకల్పం చేత నే సిద్ధిస్తుంది. 'కవితారూప తపస్సు' చే ప్రభవించిన కల్పవృక్షాన్ని కవిసామ్రాట్టు యోగీశ్వరేశ్వరుడైన శివమహాదేవునికి అంకితంచేసి ధన్యుడైనాడు. కామితార్థ ఫలప్రదమై విరాజిల్లుతూ ఉంది.

జగత్తులో సర్వశ్రేయస్సులను సాధించడానికి—కామితార్థప్రదాతయైన కల్పవృక్షం—అందరకీ అందుబాటులో ఉన్నది. అది గురుమూర్తి. దానిని ఆశ్రయించిన వారికి—'మాకశ్చిద్దుఃఖమాప్నుయాత్"

(కీ॥శే॥డా॥ వాసుదేవశరణ్ అగ్రవాలాగారి రచన దీనికి కొంత ఆధారము)

## చందాదారులకు విన్నపము-ప్రకాశకుని చిరునామా మార్పు గమనింపుడు

చందాలు బాకీయున్నవారికి పత్రిక పంపబడదు. చందా సొమ్మును ముందుగనే (తమ అడ్రసు మార్పుకూడ వెంటనే) క్రింది చిరునామాకు పంపవలెను.

ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి,
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు,
6—3—1 09/18, ఆనందనగర్,
ఖైరతాబాదు, హైద్రాబాదు—500 004.

# శ్రీ జగద్గురు మహాసన్నిధానమువారి వర్ధంతి ఉత్సవము

శ్రీ శంకర భగవత్పాద ప్రతిష్ఠాపిత శ్రీ శృంగేరీ శారదాపీఠాలంకారులై దక్షిణామ్నాయసంజ్ఞిక యజుర్వేద ప్రధాన వ్యాఖ్యాన సింహాసనాధిష్ఠితులైన శ్రీ జగద్గురు శ్రీ మదభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణుల 65వ వర్ధంతి ఉత్సవము దుర్మతినామ సం॥ ఆశ్వయుజ బహుళ చతుర్దశీ సోమవారము (27-10-81) మైసూరులో జరుగుచున్నది.

శ్రీ శంకరకృప పాఠకుల తరఫున ఆనాడు శ్రీ జగద్గురువులకు పాదపూజ గత సంవత్సరములందు జరిగినట్లే ఈ సంవత్సరము కూడ చేయుట సముచితమను అభిప్రాయమును కొందరు పాఠకులు తెలిపియున్నారు. ఆ ప్రకారము జరుపుటకు నిశ్చయించినాము.

పాఠకులు యెవరికి తోచినది వారు రు. 6/- లకు తక్కువ లేకుండా-విరాళమును శ్రీ శంకరకృప ప్రకాశకుని పేర వెంటనే పంపకోరుచున్నాము. ఆ నాడు పాదపూజ చేసి శ్రీ జగద్గురువుల సన్నిధినుండి-విరాళములు పంపినవారికి ఆశీర్మంత్రాక్షతలు శ్రీ శారదాచంద్రమౌళీశ్వర ప్రసాదము (కుంకుమ) బట్వాడా చేయబడుటకు యేర్పాటు జరుగును.

ఆకెళ్ల సత్యనారాయణమూర్తి,
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు,
6-3-609/18, ఆనందనగర్.
ఖైరతాబాదు, హైద్రాబాదు—500 004.

—‡—

# కొన్ని నీతిదాయక సంఘటనలు

మన పురాణములందు ఇతిహాసములందు మనకు నీతిని ఉద్బోధించు సంఘటన లెన్నియో కలవు.

దుర్మార్గులయొక్క ఆతిథ్యమును స్వీకరించినందువలన, లేక వారినుండి కొన్ని బహుమతులను స్వీకరించినందువలన పాపము వచ్చునని—తీసికొన్నవాని మంచి గుణము లకు వినాశము వాటిల్లునని మనవారు చెప్పుదురు. దుర్మార్గుడనగా క్రూరుడు కావచ్చును—దురాశాపరుడు కావచ్చును. దుష్టుడు కావచ్చును. [యచ్చ ఉగ్రాత్ పరిగ్రహాత్ త స్మేవరుణో రాజా పాణినా అవమర్శతు కృష్ణయజుర్వేద]

మహాభారతమునందు చిన్న వృత్తాంతము కలదు. అది పై నీతిని వెల్లడించుచున్నది. భీష్ముడు భారతయుద్ధమున నేలపైకి ఒరిగిపోగా అర్జునుడాయనకు బాణములతో 'అంపశయ్య'ను తయారుచేసెను. ఉత్తరాయణమున ప్రాణములు విడచుటకై భీష్ముడా అంపశయ్యపై వేచియుండెను. మహాభారతయుద్ధము ముగిసిన తరువాత ధర్మరాజు పట్టాభిషేకము కావించుకొనెను. పిమ్మట ద్రౌపది, తమ్ములు, శ్రీకృష్ణుడు పరివారము వెంటరాగా భీష్మునికడకు పోయి తనకు ధర్మము ఉపదేశింపుమని కోరెను. భీష్ముడా ధర్మరాజునకు ధర్మమును గురించి చెప్ప మొదలిడగా ద్రౌపది ఫక్కున నవ్వెను. ఆమె నవ్వుటకు గల కారణము చెప్పుమని ధర్మరాజు మొదలగువారు ఆమెను ఒత్తిడి చేయగా ఆమె చెప్పినది — "నన్ను కౌరవులు నిండు సభలో వస్త్రాపహరణము మొదలగు దురంతములతో అవమానించుచుండగా— ఈ భీష్ములవారు ఆ నాటి సభలో కిక్కురుమనకుండ కూర్చుని ఉన్నాడు. ఆ సభలో జరిగిన కౌరవుల అధర్మ ప్రవర్తనను ఈయన చూచి ఊరకున్నాడు. అట్టివాడు— నేడు తగుదునని—ధర్మములు చెప్పుటకు పూనుకొన్నాడు. అందుకని నాకు నవ్వు వచ్చినది." ద్రౌపది మాటలకు భీష్ముడు కోపగించుకొనలేదు.

"ద్రౌపది చెప్పిన మాటలు వాస్తవములే. ఆ కాలమున దుర్మార్గుడైన దుర్యోధనుని అన్నము నేను తినుచున్నాను. అందుచేత నా దృష్టి ధర్మమునందు అంధత్వము పొందినది. నా ధర్మబుద్ధి మందమై పోయినది. అర్జునుని బాణములు నా శరీరములోని రక్తమును బయటకు ప్రవహింపజేసి నా యందున్న కల్మషమును బయటకు వెడలకొట్టుటవలన నే నిప్పుడు విగత కల్మషుడనై నాను. ఇప్పుడు ధర్మమునందు నా బుద్ధి వ్యగ్రత చెందియున్నది. నా దృష్టి ధర్మైక దృష్టిగా నున్నది" అని భీష్ముని సమాధానము.

ఒక్కొక్కప్పుడు బుద్ధిమంతులుకూడ తమ ఔదార్య కార్యములను తామే కొనియాడుకొందురు. "ధర్మం నశ్యతి కీర్తనాత్" తాము తమ్ము పొగడుకొన్నందువలన వారి పుణ్యము నశించిపోవును. అట్టి గర్వమునుండి వారు రక్షింపబడవలెను.

ధర్మరాజు పట్టాభిషేకము చేసికొన్న తరువాత లక్షలాది జనులకు సంతర్పణ చేసి—ఘనకార్యము చేసితి ననుకొని సంతోషపడెను. అతని గర్వమును తొలగింపవలెనని శ్రీకృష్ణుడు భావించి అతనిని పాతాళలోకమునందున్న బలిచక్రవర్తికడకు తీసికొని పోయెను. బలిచక్రవర్తి ప్రాసాదద్వారముకడ నొక పరిచారిక ధర్మరాజునకు బంగారుపాత్రతో కాళ్ళు కడుగుకొనుటకు నీరిచ్చెను. కాళ్ళు కడుగుకొని ధర్మరాజు

ఆ పరిచారికతో బంగారు పాత్రను జాగ్రత్త చేసికొమ్మనెను. ఆమె "బలిచక్రవర్తి ప్రాసాదమున అతిథుల కిచ్చిన పాత్రలను తిరిగి తీసికొనుట ఆచారము కాదు" అని చెప్పగా ధర్మరాజు అహంకారము దెబ్బతిన్నది.

శ్రీకృష్ణుడు ధర్మరాజును బలిచక్రవర్తికి పరిచయము చేయుచూ "ఈయన ధర్మరాజు—లక్షలాది జనులకు అన్న సంతర్పణ చేసినవాడు. అనేక మహాదానములు చేసి ప్రతి గ్రహీతులను తృప్తిపరచినవాడు" అని చెప్పెను.

ఆ మాటలు విని బలిచక్రవర్తి ఆశ్చర్యపడుతూ—"హస్తినాపురమున అన్నము లేనివా రంతమంది ఉండిరా? దానములు తీసికొనుటకు వేచియున్నవా రంతమంది ఉండిరా" అనెను. తనకు దానము పుచ్చుకొనువాడే కన్పించుట లేదని వాపోయెను. ధర్మరాజు పాఠము నేర్చుకొనెను.

అర్జునునికి కర్ణుని గురించి ముఖ్యముగా అతని దాతృత్వమును గురించి చాల తేలికయైన అభిప్రాయమున్నది. శ్రీకృష్ణుడు అర్జుని తనకొక బంగారు రథము, ఒక వెండిరథము, 24 గంటలలో కావలెనని కోరెను. అర్జునుడు ఇవ్వలేకపోయెను. అట్లే కర్ణుని కోరగా-ఆ క్షణమే యిచ్చెను. కురుక్షేత్రమున శ్రీకృష్ణుడు కర్ణుని ముందు బ్రాహ్మణ రూపమున కన్పించి అతని పుణ్యమును దానము చేయమని కోరగా—కర్ణుడెంతో సంతోషముతో దానమిచ్చెను. దానమిచ్చుటకు అచ్చట జలము లేకపోగా తన నెత్తురులోనే ధారపోసెను. పరమాత్మకే తన పుణ్యముకు ధారపోసినందువలన-సమర్పణ చేసినందువలన—కర్ణునికి అనంతఫలము లభ్యమగుట మాత్రమే కాదు—చివరి ఘడియలలో ప్రసన్నుడైన పరమాత్మ అభయమిచ్చుచు దర్శనమనుగ్రహించెను. అర్జునుని ఘనత—యిట్టి ఔదార్య విషయమున శూన్యమే.

ధర్మము విషయమున, ధర్మాచరణ విషయమున రామాయణమునం దెన్నియో సంఘటనలు మనకు ఆదర్శముగా కన్పించుచున్నవి. భిన్న భిన్న వర్గములవారి ధర్మములు—భర్త విషయమున భార్యయొక్క ధర్మములు—తండ్రి విషయమున కుమారుని ధర్మములు—అన్నగారి విషయమున తమ్ముని ధర్మములు—రాజు ప్రజలయందు చూపవలసిన ధర్మములు—మిత్రునియందు చూపవలసిన ధర్మములు—ఇట్లే మరెన్నియో విశదీకరింపబడినవి. నిజమునకు రామాయణము ధర్మశాస్త్రమును కథారూపముగా ప్రదర్శించుచున్నదని చెప్పవలెను. మన పురాణములు ఇతిహాసములు—సాహిత్యము—ధర్మప్రబోధమునకే కదా ఉద్దేశింపబడినవి—మానవుని ఉత్తమ మానవునిగా చేయుటకు.

రామాయణమున భరతుని పాత్ర చాల గొప్పది. శ్రీరామచంద్రుడు ధర్మము మూర్తికట్టినవాడు. ఆయన తాను ధర్మమాచరించుట మాత్రమే కాదు—ధర్మమాచరించువారందరిని ఆప్తులుగా భావించును. వారందరిని కాపాడుటకు పూనుకొనును. అదియే కదా—జనస్థానమున రాక్షసులను సంహరించుటకు పూనుకొనుట, మునుల కభయమిచ్చుట, విభీషణునికి అభయమిచ్చుట.

శ్రీరాముని ధర్మప్రవర్తనను చెప్పవలసినచో మరల రామాయణము నంతయు చెప్పవలెను.

# ధర్మ మార్గము

మనమహర్షులు ధర్మజ్యోతిని చక్కగా — సుందరముగా ప్రకాశింపజేసిరి. ధర్మమే సకలమును నిలువబెట్టుచున్నదని, ధర్మమువలననే ప్రజలు కాపాడబడుచున్నారని వేదవ్యాసముని మహాభారతము శాంతి పర్వమునందు చెప్పెను. (ధర్మాద్ ధర్మం ఇత్యాహుః ధర్మేనవి ధృతః ప్రజా॥....అహింసార్థాయభూతానాం ధర్మ ప్రవచనం కృతమ్.")

చతుర్విధ పురుషార్థములలో ధర్మమువలననే మిగిలిన అర్థ కామములు పొందబడుచున్నవి. "నేను చేతులెత్తి—ఎలుగెత్తి చాటుచున్నాను. అహో! ఎవరును వినుటలేదు—" అని వ్యాసముని మహాభారతము ముగింపులో వాపోయెను. (ఊర్ధ్వ బాహు విరేమి ఏషనచ కశ్చిద్ శ్రుణోతిమే ధర్మాత్ అర్థశ్చకామశ్చసకిమర్థం నసేవ్యతే). అనాదిగా మానవులిట్లే ధర్మవాణిని విన్పించుకొనుటలేదని వ్యాసముని వాపోవుటనుబట్టి తోచుచున్నది.

ధర్మమును పరిపూర్ణముగా — సర్వదా — సర్వధా — అనుష్ఠించిన వాడు శ్రీరామచంద్రుడు. అందుచేతనే ఆతనను ధర్మము రూపుదాల్చిన విగ్రహము (రామో విగ్రహవాన్ ధర్మః) అని చెప్పుట జరిగినది. శ్రీరామచంద్రుని ధర్మ బద్ధత్వము శ్రీ మద్రామాయణమున అయోధ్యకాండయందు సువిస్పష్టముగా విపులీకరణమున్నది. శ్రీరామచంద్రుని అయోధ్యకాండ వృత్తాంతము భారతీయులందరు నిత్యపారాయణముచేసి ఆ ధర్మానుష్ఠానమును అనుసరించుటకు ప్రయత్నించినచో మనదేశమున సమస్యలే వుండవు.

సుఖమున్నది అవిభాజ్యము. ప్రాపంచిక దృశ్యమునందొక ఐక్యత యున్నది. శాంతపరిశీలించినప్పుడది దృశ్యమానమగును. అత్యుత్సాహజనితములైన ఉపరి సంఘట

నాదులను త్రోసిపుచ్చినచో అంతరమైన ఐక్యత భాసించును. శిల్పి కొండరాళ్ళను మలచి—ఉలితో ప్రాణము పోసి—ఆకారము లందొక ఐక్యత సాధించుచున్నాడు కదా?

సర్వాంతరస్థమైన ఆత్మను తెలిసికొన్న ఆత్మవిదునికి—రూపభేదము—ఆకారభేదము—కన్పించనే కన్పించదు. (గీత 5—18) శ్రీ శంకర భగవత్పాద విరచిత దక్షిణామూర్తి స్తోత్రమున నాలుగవ శ్లోకమున—ఆత్మయొక్క ప్రకాశమువలన నానావిధ వస్తు సహితమైన యీ ప్రపంచము ఇంద్రియ సంప్రయోగమునందు ఇంద్రియానుగతమైన అతఃకరణమునందు తత్ప్రతిబింబ విషయముగా ప్రకాశించుచున్నదని చెప్పబడినది. ఉపాధిభేదమేగాని నిజమునకు అనుభవమునందు భేదములేదు.

ప్రవృత్తి మార్గమున అన్యులతో అనుబంధ సంబంధముల నేర్పరచుకొనగా-సంఘటనలు-దుఃఖకారకములగుచున్నవి. ధర్మము సంవిలీన సంయోజకము. కాళిదాసు కుమారసంభవము నందట్లే చెప్పెను. [5వ సర్గ 38—అనేన ధర్మఃసవిశేషం అద్యమే త్రివర్గసారః ప్రతిభాతి—త్వయా మనోనిర్విషయ అర్థకామ్యాయదేక ఏవ ప్రతి గృహ్యాసేవ్యతే]

స్వధర్మము అవలంబనీయము. సామాన్య ధర్మమునకు విరుద్ధముగా నున్నను అవలంబనీయమే. స్వధర్మమును విస్మరించినచో తన్ను తాను మోసగించుకున్నట్లగును. తన్నుతాను మోసగించుకొనుట—తన సొమ్మును తాను దొంగలించుట—అపహరించుట—ప్రయోజనమేమున్నది? పరమాత్మయైన శ్రీకృష్ణుడు సందిగ్ధావస్థయందున్న అర్జునునకిట్లే బోధించెను.

సకలము తానేయైన శ్రీకృష్ణపరమాత్మ కురుక్షేత్రమున మహాభారత యుద్ధము జరుగునట్లు చాలామంది జనులు వధింపబడునట్లు మాయానాటకమాడెను కాబోలు. ధృతరాష్ట్రుని రాణి గాంధారీదేవి శ్రీకృష్ణునిపై యీ నింద మోపినది. ఆయన కాదనలేదు. మందస్మితము చేసెను. ఆయన అవతారమెత్తినదే కార్యమును నిర్వహించుటకో—ఆయా కార్యములను నిర్వహించెను. ఒకరి అభిప్రాయములతో ఆయనకు నిమిత్తములేదు. ఆయన స్వతంత్రుడు. జరిగినవన్నియు మాయాలోకమునందు. కేవల సత్యమైన పారమార్థిక లోకమున కానేకావు.

అద్వితీయమైన ఏకము—నిర్గుణ పరబ్రహ్మ తత్త్వము—సర్వదా అనుసంధానము చేయబడవలెను. పెద్ద కొండచిలువ—అడవి జంతువును మ్రింగినప్పుడు దానిని జీర్ణము చేసికొనుటకెంతో అవస్థపడును. శక్తిని పోగొట్టుకొన్నటుల పడియుండును. పెద్ద

అడివి జంతువు దాని కడుపులో జీర్ణమునాగా నూతన శక్తితో అది విజృంభించును. ఎటు చూచినను దుఃఖమే — అయిన యీ లౌకిక ప్రపంచమున కొండచిలువ వృత్తాంతము మనకు ప్రబోధకరముగా నున్నది.

అందరి ప్రయత్నమును దుఃఖ నిర్మూలమునకే, దుఃఖము పోగొట్టుకొన్నప్పుడే సుఖము లభించునని సకల జనులకు తెలిసిన విషయమే. జీవబ్రహ్మైక్యాను సంధానము చేసి ఆత్మ విదుడైనప్పుడే దుఃఖము నాశనమగుచున్నదని ఆనంద సాంద్రాకృతిగా ఆత్మజ్ఞాని యగుచున్నాడని బృహదారణ్య ఉపనిషత్తు చెప్పుచున్నది. (సబ్రహ్మ యోగ యుక్తాత్మ సుఖం అక్షయతం అశ్నుతే.]

ఈ అక్షయమైన సుఖమునకు బ్రహ్మయోగ యుక్తతకు పెక్కు సోపానము లున్నవి. మొదటి సోపానము — మొదటి మెట్టు — తప్పనిసరైన సోపానము — ధర్మా నుష్ఠానమువలన మార్గము సుకరమగును. సువిస్పష్టమగును. ముందు పయనింపవలసిన పథమంతయు తేటతెల్లముగా కన్పించును. మార్గము గమన యోగ్యముగా నుండును. దుష్కరముకాదు. సులభయాన యోగ్యము.

అయితే కొన్ని సందర్భములలో ఏది ధర్మమన్న సందేహము రావచ్చును. సాధారణముగా అంతస్సునకు ధర్మమేదియో తెలియును. అట్లు తెలిసికొన వీలు లేనపుడు శిష్టుల ప్రవర్తన — ఆచారము ప్రమాణముగా గ్రహింపవలయును.

—o—

# శకునములు, స్వప్నములు

ప్రకృతిలో కొన్ని గుర్తులవలన, చిహ్నములవలన — రానున్న సంఘటనల (శుభాశుభముల) గుర్తింపవచ్చునని అనాదిగా విశ్వసింపబడుచున్నది. జంతువుల — పక్షుల ప్రవర్తనలవలన రాబోవు ప్రాకృతిక ఉపద్రవములను కొన్నిటిని ముందుగా తెలిసికొనవచ్చునని ప్రతీతి. ఉదాహరణకు భూకంపము వంటివి. అదేవిధముగా కొన్ని స్వప్నముల విషయము కూడ. జంతువులు, కీటకములు — పక్షులు — భూకంప, తుపాను లకు ముందు అసాధారణ ప్రవర్తన చూపుటనుబట్టి — మనకు ముందు హెచ్చరిక వంటిది లభించుచున్నది. అట్లే వర్షము వచ్చుట — వానరాక — ముందుగా గమనింప వచ్చును.

అయితే వ్యక్తుల భవిష్యత్తు విషయమున — జంతువుల, పక్షుల ప్రవర్తన (శకు నమయమున)ను గురించి మన కేమియు హేతుబద్ధముగా అవగాహన అగుటలేదు.

సామాన్యులకు ఖగోళ గ్రహస్థితుల విషయముకూడ. అయితే జ్యోతిశ్శాస్త్రము, స్వప్నశాస్త్రము శకునశాస్త్రము దేశమున ఆదరింపబడుచునే యున్నవి.

వాల్మీకి రామాయణమున—(జగత్తునందే ఆదికావ్యముగా పరిగణింపబడుచున్నదానియందు) శకున—స్వప్న విషయములు చాల కలవు.

పక్షులు గాద్గదికముగా—కఠోరముగా అరచుట, జంతువులు ప్రాదక్షిణముగా తిరుగుట—శకునములను—దశరథమహారాజు సీతారామ కల్యాణానంతరము పరివార బృందంతో మిథిలానగరమునుండి అయోధ్యా పట్టణమునకు వచ్చుచుండగా గమనించెను, అశకునములను చూచి దశరథుడు ఆందోళనపడెను. అయితే వశిష్ఠ మహర్షి—పక్షుల రొదవలన అపాయమేదో శీఘ్రముగా రానున్నదని, కాని జంతువుల ప్రవర్తనవలన, అది సుఖాంతము కాగలదని—చెప్పెను. తరువాత జరిగినది పరశురాముడు వచ్చి శ్రీరామునితో యుద్ధమునకు సిద్ధపడుట. అయితే పరశురాముడు శ్రీరామునిముందు వినయమువలంబించి తిరిగిపోవలసి వచ్చెను.

అవయవములు అదరుట, కన్నులు, భుజములు మొ॥ అదరుటవలన శుభాశుభములు చెప్పుదురు. ముక్కు తిమ్మన్నగారు పారిజాతాపహరణము కావ్యమున సత్యభామాదేవికి 'దక్షిణాంస చూచుకనయన ప్రకంపగుణ సూచనలు' చేయించెను. శ్రీరామసుగ్రీవుల మైత్రికి ముందీ సూచనలు వాల్మీకి రామాయణమున నున్నవి. అశోకవనమున నున్న సీతాదేవి కిట్టి సూచనలవలన కొంత దుఃఖోపశమనము జరిగినది. రావణునికి అట్టి సూచనలు ఉపద్రవమునే చెప్పినవి.

తారాబలము: శ్రీరామచంద్రుడు లంకా దండయాత్రను ఉత్తరా ఫల్గుని నక్షత్ర సమయమున ప్రాగంభించెను. అది తన జన్మనక్షత్రమైన పునర్వసునకు సాధనతార యని శ్రీరామచంద్రుడనెను. అది ఆయనకు నైధనతార అగు హస్తకు ముందు నక్షత్రము. మరియూ నది సీతాదేవికి జన్మతారయట. అందుచేత విజయము సూచితమట. చెఱసాలలో బందీగా నున్నవారిని విడిపించుటకు చేయు ప్రయత్నము వారి జన్మతార యందు ప్రారంభించినచో విజయమగునని శాస్త్రము. తనకు కుడి కన్ను అదరుటను గురించి కూడ శ్రీరామచంద్రుడు చెప్పెను. (నిమిత్తాని ధన్యాని యాని ప్రాదుర్భవంతిచ ఉపరిష్టాదినయనం స్ఫురమానం ఇదం మమ విజయం సమనుప్రాప్తం సంసీవ మనోరథమ్) ఆ సమయమున అభిజిన్ముహూర్తమును గురించి కూడ శ్రీరాముడు చెప్పెను.

రావణుడు సీతను అపహరించినది 'విందు' ముహూర్తమునందు కాబట్టి ఆమెను తప్పక విడిపింపవచ్చని జటాయువు చెప్పెను.

సీతాదేవిని అశోకవనమున రాక్షస స్త్రీలు బాధపెట్టుచుండగా ఆమెకు త్రిజట తన స్వప్న వృత్తాంతమును చెప్పి ఊరట కల్గించుట ప్రసిద్ధము. దశరథునికి భరతునికి వచ్చిన స్వప్న వృత్తాంతములు కూడ గుర్తు చేసికొనవచ్చును.

సీతాదేవిని రావణుడు లంకకు తెచ్చి అశోకవనమునందుంచినప్పటినుండి లంకయందెన్నియో అశుభసూచకములైన సంఘటనలు జరుగుచున్నవని విభీషణుడు రావణుని హెచ్చరించెను. చేసిన తప్పునకు పశ్చాత్తాపము పొంది సీతాదేవిని రామునికి సమర్పించినచో రాగల ఉపద్రవములను రాకుండ చేసికొనవచ్చునని చెప్పెను.

రానున్న ఉపద్రవములను నివారించుకొనుటకు కొన్ని పరిహారక్రియలను చేసికొనవచ్చునట. కొన్ని శాంతి పౌష్టిక క్రియలు నిర్వహించుకొనవలెనట. అయితే ఈ పరిహారములు—శాంతులు—ముందుగా తగు సమయమున కావించుకొనవలెను. అంతియేగాని ఉపద్రవము — ప్రమాదము — జరుగునంతవరకు వేచియుండుటవలన లాభములేదు. ఇల్లు తగులబడిన తరువాత నీటికొరకు బావిని త్రవ్వినందువలన ప్రయోజనమేమున్నది? దీనినే తెలుగులో-దొంగలు పడిన ఆరు నెలలకు కుక్క మొరిగినట్లు- అని సామెతగా చెప్పుదురు.

శ్రీరాముని వానరసేనలు లంకపై దండెత్తివచ్చి మీదపడిన తరువాత—పరిహార కార్యములను రావణుడు ప్రారంభించుటను గురించి చెప్పుచు—యమునా నది కట్టలు త్రెంపుకొని దేశమును ముంచెత్తిన తరువాత యమునా నది గట్లను యెత్తుచేసి బలపరచుటవలె నున్నదని—కుంభకర్ణుడు చెప్పెను. ఆ కాలమున వరదనీటి విజృంభణమునకు యమునానది పెట్టినది పేరువలె తోచుచున్నది.

దుశ్శకునములు, దుస్సంఘటనలు—యెదురైనప్పుడు—సజ్జనులు మనస్సును దృఢము చేసికొని భీతిచెందక భగవన్నామ స్మరణ చేయుచు నిలువబడవలెనని మాండవ్యముని హితవుచెప్పెను. ఇంతకు నేటి పరిస్థితిలో సన్మార్గమవలంబించు సాధుజనులు, సజ్జనులు—భగవంతునిపై పరిపూర్ణ విశ్వాసముంచి—ఆయన అనుగ్రహమును అర్థించుచు—భగవన్నామమును నిత్యమననము చేయుచు—దుస్సంఘటనలు నెదుర్కొనవలెను. చివరకు అంతయు సజ్జనులకు శుభముగానే పరిణమించును.

Printed & Published by A. Satyanarayana Murthy, at
6-3-609/18, Anand Nagar, Khairatabad, Hyderabad - 500 004.
Printed at KRANTI PRESS, MADRAS-600 001.
Editor : T. Ramalingeswara Rao

# గ్రంథావలోకనము

సురభారతీ సమితి (ఉస్మానియా యూనివర్సిటీ కాంపస్, హైదరాబాదు-500 007) వారు తిరుపతి-తిరుమల దేవస్థానమువారి ఆర్థిక సహాకారముతో ప్రకటింపబడిన ఈ క్రింది గ్రంథములు. (సురభారతీ సాంస్కృతిక గ్రంథమాల సప్తకుసుమములు) ఈ కుసుమము లన్నిటికి డా. పుల్లెల శ్రీరామచంద్రుడుగారు సాధారణ సంపాదకుడు. సురభారతీ అధ్యక్షులైన గౌ॥ ప్రధాన న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామిగారు ఈ గ్రంథకుసుమము లన్నిటికి సురభిళమయమైన తొలిపలుకులు పలికిరి.

(1) విదురనీతి : (ఆంధ్ర టీకా తాత్పర్యములు — శ్రీమతి చిరుమామిళ్ళ సుజాతా, ఎం. ఏ.,) వెల 10/-

మహాభారతమున ఉద్యోగపర్వమున ధృతరాష్ట్రునికి విదురుడు చెప్పిన మంచి మాట లీ విదురనీతి. మిక్కిలి ప్రసిద్ధమైనది. భారతీయ సంస్కృతినీ, నీతిధర్మాన్ని ప్రస్ఫుటంగా విస్పష్టంచేసే యీ నీతులు సర్వకాలికంగా సర్వజనులకూ ఉపకారకాలు. సన్మార్గదర్శకాలు. మానసిక పుష్టిదాయకాలు. తెలుగు తాత్పర్యము సరళంగా సుబోధకంగా ఉన్నది.

(2) రామాయణములోని రత్నాలు (ఆంధ్ర టీకా తాత్పర్యములు. డా. శ్రీమతి వడలి అనసూయాదేవి, ఎం.ఏ., పి. హెచ్.డి) వెల : 6-50.

రసనిష్యందియైన ఆదికావ్యము శ్రీమద్రామాయణము. మహోత్తమమైన కావ్యము. దీనియందు మన సంస్కృతిని రూపుకట్టించిన పెక్కు ఉత్తమమైన ఆదర్శాల, సంప్రదాయాల ఉపదేశాలున్నవి. రామాయణంలోని వివిధపాత్రలు అవలంబించిన ఉత్తమాదర్శాలు—తలిదండ్రుల విషయంలో భక్తి—మైత్రి—దాంపత్య ప్రేమ—స్వామిభక్తి—కృతజ్ఞత—దౌష్ట్యాన్ని అణచివేయడానికి ప్రయత్నము, దీనజనోద్ధరణ, మొదలగునవి సువ్యక్తమయ్యే శ్లోకరత్నాలను గ్రహించి—తెలుగు టీకా తాత్పర్యాలతో వెలువడిన గ్రంథమిది. తెలుగు రచన సులభముగా అవగాహన అగునట్లున్నది.

(3) సామాన్య ధర్మములు : (శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి. వెల : 6/-

ప్రతి మానవుడు అనుసరింపవలసిన ధర్మాలు—వైయక్తికాభివృద్ధికీ సాంఘిక శ్రేయస్సుకీ ఉపయోగపడేవి—దేశకాల వైయక్తిక భేదాలతో నిమిత్తం లేకుండా అనుసరింపవలసి ఉన్నవి. అట్టి సకల భువనతలానికి సంబంధించిన సార్వభౌమ ధర్మాలను—సామాన్య ధర్మాలను—వివిధ ప్రమాణపూర్వకంగా—ఉపన్యాస పద్ధతిలో ప్రతిపాదించి వివరించడం జరిగింది.

ధర్మమునందు—నీతియందు—నిరాదరణ పెరిగిపోవుచున్న యీ కాలమున— ఆత్మసంస్కార దోహదములైన యీ సామాన్య ధర్మములు కొంతమందికైనా మన సంస్కృతిలోని ఉత్తమత్వాన్ని రుచిచూపించి సన్మార్గప్రవృత్తులనుగా చేయగల వన్న ఆశతో చేయబడిన ప్రచురణ. దీని యందున్న వస్తుప్రతిపాదన వైఖరి— రచనాశైలి తదాశయము ఫలసిద్ధి పొందినట్లే ఉత్తమస్థాయిలో నున్నవి.

(4) శాంతిపర్వములోని సూక్తులు: ఆంధ్ర టీకా తాత్పర్యములు డా॥ శ్రీమతి తే. కమల యం. ఏ. పి. హెచ్. డి. (వెల రు 6/—)

మహాభారతము సూక్తి సుధా రత్నాకరము. అందు భీష్ముని ఉపదేశమున్న శాంతి పర్వమంతయు సూక్తి నిధియే. ధర్మరాజునకు భీష్ముడు ఉపదేశించిన ధర్మములు దేశకాలాతీతముగా నేటికిని అన్వయించేవి. సర్వకాలికములై ధర్మ— నీతి ప్రబోధకాలైన శాంతిపర్వ సూక్తుల సంకలనము నందున్నవి. అయితే కొన్ని ధర్మసూక్తులు (సు + ఉక్తి) కాని అర్థవాదాలు కూడ దీనియందు చేర్చబడినవి. ఉదాహరణకు అర్జునుడు ధర్మరాజుతో—ధనము వలన ధర్మకామములు మాత్రమే కాదు, స్వర్గము కూడ సిద్ధించునని—ధనము లేకున్న యే పురుషార్థము సిద్ధించదని వాదించుట (1 శ్లో) కలదు. ఇట్టివి దీనియందుండవలసిన ఆవశ్యకత తోచదు.

(5) ఈశ ఐతరేయ కఠోపనిషత్తులు: ఆంధ్ర టీకాతాత్పర్యములు-శ్రీ వితల దేవుని సుందరశర్మ. (వెల: రు. 6/-)

భారతీయ తాత్త్విక దార్శనిక నిధులు ఉపనిషత్తులు. ఈశావాస్యోపనిషత్తు వాజసనేయ సంహిత చివర ఉండగా మిగిలిన ఉపనిషత్తులన్నీ అరణ్యకముల చివర యందుండుటచేత వీటికి వేదాంతములు (త్రయ్యంతములు) అని ప్రసిద్ధి వచ్చినది.

ఈశావ్యాసోపనిషత్తు వైదిక కర్మాచరణకూ కర్మసన్న్యాసానికీ సమన్వయం బోధిస్తున్నది. భగవద్గీతా కర్మయోగమున కీ ఉపనిషత్తే ఆధారము. ఐతరేయోప నిషత్తు ఋగ్వేదీయము. ఆత్మావిర్భావ, సృష్టివివరణాదు లీ ఉపనిషత్తునందు చెప్ప బడినవి. సంవాద రూపంగా ఉన్న కఠోపనిషత్తులో బహువిషయములు—ఆధ్యాత్మిక శాస్త్రమర్మము లున్నవి. ఈ ఉపనిషత్తునుండి చాల శ్లోకాలను—కొన్ని యథాతథంగా—కొన్ని కొంత మార్పులతో—భగవద్గీత స్వీకరించింది.

ఈ ఉపనిషత్త్రయానికి సమకూర్చబడిన ఆంధ్ర టీకాతాత్పర్యములు సులభ శైలిలో సుబోధకంగా ఉన్నవి.

(6) శ్రీకృష్ణకర్ణామృతమ్ (వెలగపూడి వెంగనామాత్యుని ఆంధ్రపద్యానువాదముతో) ఆంధ్రటీకా తాత్పర్యములు: డా. బి. రామరాజు, ఎం.ఎ., పి.హెచ్.డి. (వెల: 16/-)

కేరళీయుడయిన లీలాశుకుడు పండ్రెండవ శతాబ్దంలో భక్తిరసభరితంగా రచించిన శ్రీకృష్ణకర్ణామృతమ్ (328 శ్లోకములు) జగత్ప్రసిద్ధి పొందిన ఉత్తమ భక్తికావ్యం. ఈ శ్లోకాలు సాహిత్యమాధుర్యవంతములు మాత్రమేకాదు. కొన్ని మహామంత్రములకు ధ్యానశ్లోకములుగా నున్న మంత్రమయవాణీ విలాసములు. దీనితో వెలగపూడి వెంగనామాత్యుడు రచించిన ఆంధ్ర పద్యానువాదాన్ని జోడించుట కడు సముచితముగా నున్నది. డా. రామరాజుగారు సంతరించిన టీకా తాత్పర్యములు హృద్యముగా—భక్తిరసస్ఫురన్మాధుర్యమత్తములుగా నున్నవి.

(7) భాగవతములోని రత్నాలు: ఆంధ్ర టీకా తాత్పర్యములు: శ్రీమరింగంటి శ్రీ రంగాచార్య, ఎం.ఏ., (వెల: రు. 8/-)

నిగమ కల్పతరుఫలమై శ్రీ శుకముఖనిస్స్రుతమైనదై అమృతమువలె నాస్వాదింపవలసినది శ్రీమద్భాగవతము. అది విష్ణుకథాప్రపంచము. పారమహంస్యసంహిత ఉపనిషత్, బ్రహ్మసూత్ర, భగవద్గీతలతోపాటు-ప్రస్థాన చతుష్టయమునందు స్థానమున్న గ్రంథము. ఉపనిషద్విషయాలయిన జగత్సృష్టి స్వరూపస్వభావములు, జీవ పరమాత్మల స్వరూప పరస్పర సంబంధము, భక్తి జ్ఞానసమన్వయము శ్రీమద్భాగవతముకూడ ప్రవచించినది. ప్రస్థానత్రయ గ్రంథములకు మతత్రయభాష్యములున్నట్లే. శ్రీమద్భాగవతమునకుకూడ అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత వ్యాఖ్యానములున్నవి. శ్రీవల్లభాచార్యులవారి పుష్టిమార్గమున కిది పరమప్రమాణ గ్రంథము.

శ్రీమద్భాగవతములోని, భక్తిజ్ఞానవైశిష్ట్యము తెలిపే శ్లోకములు, కొన్ని భక్తి ఘట్టములు, సత్య, భూతదయ, సత్ప్రవర్తనాది విషయములకు సంబంధించిన శ్లోకములు మొదలగున వీ సంకలనమునందు చేర్పబడినవి. అయితే భక్తి ఘట్టముల వ్యాఖ్యానము విశిష్టాద్వైత పరముగా చేయబడినది. అయినప్పటికీ అందరికీ ఆస్వాద యోగ్యముగా ఉన్నది.

ఈ సప్తకుసుమాలు (గ్రంథములు) సకలాస్తికజనులకు సంస్కృతి ప్రియులకు ఆదరపాత్రంగా వున్నవి. సురభారతీ కార్యదర్శి పేర వ్రాసి తెప్పించుకొనవచ్చును.

(8) సురభారతీ వార్షిక నివేదిక (అయిదవ సంపుటము). ప్రకటన-సురభారతీ సమితి (రిజిస్టర్డు). ఉస్మానియా యూనివర్సిటీ కాంపస్ (హైదరాబాదు-500 007)

ఇది సురభారతీ సమితివారి కార్యకలాపములను (1980-81) గురించిన వార్షిక నివేదిక. ఆంగ్ల సంస్కృతభాషా రచనల సంపుటము. (రామహరిత)

# శృంగేరీ వార్తలు

జూలై 1వ తేదీ అనగా ఆషాఢ శుద్ధ ఏకాదశి, శనివారము ప్రథమైకాదశి, ఆ సందర్భమున శ్రీ జనార్దన స్వామి వారికి విశేష పూజ, మంగళ హారతి జరిగినది. శ్రీ సన్నిధానమువారు శ్రీ జనార్దన స్వామివారి దర్శనము చేసికొని నరసింహ వనమునకు దయచేసినారు.

జూలై 14వ తేదీ అనగా ఆషాఢ శుద్ధ త్రయోదశి, మంగళవారము ఈ రోజు సాయంత్రం 6 గం॥ లకు ఉభయ శ్రీ చరణులు శ్రీ శారదాదేవిని దర్శించి, వేదపండితులు, పాఠశాల విద్యార్థులు వేదస్వస్తి వాచనము చేయుచూ వెంటరాగా మంగళ వాద్యములతో, అనేకమంది శిష్య జనులతో కూడినవారై, పాదచారులై శ్రీ మలహానికరేశ్వరస్వామి వారి దేవస్థానమునకు దయచేసిరి. అక్కడ స్తంభ గణపతికి, శ్రీ మలహానికరేశ్వరస్వామి వారికి, శ్రీ భవానీ అమ్మవారికి ప్రత్యేక పూజలు, మంగళ హారతులు జరిగినవి. అక్కడ దేవతా దర్శనములు చేసికొని, శ్రీ మఠమునకు వచ్చి, అన్ని దేవస్థానములలోను దేవతా దర్శనములు చేసికొని, నరసింహ వనమునకు దయచేసినారు.

జూలై 16వ తేదీ ఆషాఢ శుద్ధ చతుర్దశి, గురువారము, దక్షిణాయన పుణ్య కాలము. ఈ సందర్భముగ ఇక్కడ అన్ని దేవస్థానములలోను విశేష పూజలు జరిగినవి. మధ్యాహ్నము 12 గంటలకు శ్రీ మహాసన్నిధానమువారు అన్ని దేవ స్థానములలోను దేవతా దర్శనములు చేసికొని నరసింహ వనమునకు దయచేసినారు. $12\frac{1}{2}$ గంటలకు శ్రీ సన్నిధానమువారు వచ్చి తుంగా నదిలో స్నానముచేసి, కర్కాటక సంక్రమణము సందర్భముగా తుంగా నదిలో గంగా పూజ యొన రించినారు. తరువాత తెప్పను విడిచిపెట్టినారు. తరువాత శ్రీ సన్నిధానమువారు అన్ని దేవస్థానములలోను విశేష మంగళ హారతులను చూచి, నరసింహ వనమునకు దయచేసినారు. ఈ కర్కాటక మాసమునందు గంగానది తుంగానదికి వచ్చునను ప్రతీతి కలదు. ఈ మాసములో ప్రతి సోమవారము, శుక్రవారము, రాత్రి 8 గం॥లకు తెప్పలను చేసి తుంగా నదిలో విడిచిపెట్టినారు.

ఆషాఢ శుద్ధ ద్వాదశి సోమవారము అనగా జూలై 13వ తేదీ ఉదయం 10-30 గం॥ లకు కర్ణాటక రాష్ట్ర గవర్నరు శ్రీ గోవిందనారాయణ్ గారు దంపతులు శృంగేరికి వచ్చి, ఉభయ శ్రీ చరణులను దర్శించినారు. మధ్యాహ్నం 12-30 గం॥లకు ఉభయ శ్రీ చరణులు మలహానికరేశ్వరస్వామి దేవస్థానమునకు దయచేసిరి. వారి వెంట గవర్నరుగారు కూడా యుండిరి. అక్కడ నూతనముగా నిర్మించుచున్న (ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సహకారముతో) శ్రీ భవానీ అమ్మవారి గర్భ గృహప్రవేశము ద్వారము యొక్క ప్రతిష్ఠను, ఉభయ శ్రీ చరణులు సమ క్షములో, గవర్నరుగారు చేసినారు. తరువాత శ్రీ చరణుల ఆస్థానకార్య దర్శియగు శ్రీ కె. ఎం. బాలసుబ్రహ్మణ్యంగారు ఆంగ్ల భాషలో స్వాగత

వాక్యములు పలికినారు. గవర్నర్ శ్రీ గోవిందనారాయణ్ గారు హిందీలో ప్రసంగించినారు. చివరకు శ్రీ మహాసన్నిధానమువారు అక్కడ చేరిన భక్త బృందమును ఆశీర్వదించుచూ కన్నడములో అనుగ్రహ భాషణ మొనరించినారు. తరువాత ప్రసాద వినియోగము జరిగినది. ఈ కార్యక్రమములో ప్రభుత్వ అధికారులు, శృంగేరీ పురజనులు, అనేకమంది భక్త జనులు పాల్గొనినారు.

ఆగస్టు 5వ తేదీ అనగా శ్రావణ శుద్ధ పంచమి, బుధవారం, నాగ పంచమి. ఆ సందర్భముగా ఇక్కడ నాగ దేవతలకు విశేష పూజ, మంగళ హారతి జరిగినది.

ఆగస్టు 7వ తేదీ శుక్రవారము కర్ణాటకరాజ్య విద్యాశాఖామాత్యులు శ్రీమతి నాగమ్మ కేశవమూర్తిగారు వచ్చి, ఉభయ శ్రీ చరణులను దర్శించి వెళ్ళినారు.

ఆగస్టు 14వ తేదీ శుక్రవారము అనగా శ్రావణ శుద్ధ చతుర్దశి వరమహాలక్ష్మీ వ్రతము. ఈ రోజు ఉదయం శ్రీ శారదాదేవికి విశేష పూజ, మంగళ హారతి జరిగినది. వెండి రథోత్సవము జరిగినది.

సాయంత్రం 5 గం॥లకు నరసింహ వనములో శ్రీ చరణులు శ్రీ మఠములోనున్న 2 ఏనుగులకు "గజలక్ష్మీ పూజ" యొనరించినారు. తరువాత శ్రీ మహాసన్నిధానమువారు కల్పోక్త విధానముగ వరమహాలక్ష్మీ వ్రత మొనరించినారు. చివరకు 5 గురు సువాసినీలకు సువాసినీ పూజ జరిగినది.

రాజపాల్యం రాజ "గురుభక్తమణి" శ్రీ రామ సుబ్రహ్మణ్య రాజుగారు రామేశ్వర మఠ పునర్నిర్మాణమునకుగాను 50,000 రు (యాభై వేల రూపాయలు) శ్రీ చరణుల సన్నిధిని సమర్పించినారు.

ఆగస్టు 15వ తేదీ శనివారము శ్రావణ శుద్ధ పౌర్ణమి "హయగ్రీవోత్పత్తి" ఈ రోజు ఇక్కడ హయగ్రీవమూర్తికి విశేష మంగళ హారతి జరిగినది. ఈ రోజు ఋగ్యజురుపాకర్మ దాదాపు 400 మంది ఉపాకర్మను చేసికొని, తరువాత ఉభయ శ్రీ చరణులను దర్శించి వెళ్ళినారు.

ఆగస్టు 22వ తేదీ శనివారము శ్రీ కృష్ణ జన్మాష్టమి, ఈ రోజు రాత్రి 10 గం॥లకు శ్రీ మహాసన్నిధానమువారు కల్పోక్త ప్రకారముగ శ్రీ గోపాలకృష్ణస్వామికి విశేష పూజ యొనరించినారు. చివరకు భాగవతమునందలి "శ్రీ కృష్ణ జనన ఘట్టమును" పఠించినారు. ఈ రోజు ఉదయం శ్రీ మఠములో జనార్దనస్వామి గారికి, గోపాలకృష్ణస్వామికి విశేష పూజ జరిగినది.

ఆగస్టు 23వ తేదీ ఆదివారము మధ్యాహ్నము 4 గం॥లకు శ్రీ గోపాలకృష్ణస్వామి ఉత్సవమూర్తికి శృంగేరిలోని 4 రాజ వీధులలో ఉత్సవము జరిగినది.

భాద్రపద చతుర్థి బుధవారము (2-9-81) శృంగేరిలో వినాయక చతుర్థి ప్రయుక్త పూజ జరిగినది. ఈ నాటినుండి భాద్రపద పౌర్ణమి వరకు—(గణేశ నవరాత్రి ఉత్సవములతో పాటు)—వాక్యార్థ విద్వన్మహా సభలు జరిగినది.

భాద్రపద శుక్ల నవమి సోమవారము, (7-9-81) కేదార నవమి వ్రతము జరిగినది. శుక్ల ద్వాదశి గురువారము (10-9-81) వామన జయంతి వ్రతము జరిగినది. శుక్ల చతుర్దశి ఆదివారము (13-9-81) అనంత పద్మనాభ వ్రతము జరిగినది. ఆ మధ్యాహ్నమే ఉమామహేశ్వర వ్రతము జరిగినది.

శ్రీ శంకరకృప పాఠకుల తరపున శ్రీ జగద్గురువుల సన్నిధిలో పాదపూజ జరిగినది. శ్రీ జగద్గురువులు చాతుర్మాస్యదీక్షా విసర్జనము—సీమోల్లంఘనము చేసిరి. ఈనాడు వాక్యార్థ విద్వన్మహా సభల ముగింపు సమావేశము జరిగినది. విద్వాంసులు సన్మానింపబడిరి—దాదాపు ఎనుబది తొంబది సంవత్సరములుగా—శ్రీ జగద్గురు సచ్చిదానంద శివాభినవ నృసింహ భారతీ మహాస్వామి (పరంపరలో 33 వారు) వారు పీఠాధిపతిగా నుండగా—సాంప్రదాయ విద్యా రక్షణ—పోషణలకు—శ్రీ జగద్గురువులచే — వాక్యార్థ విద్వత్సభలు—గణపతి నవరాత్రి ఉత్సవములలో ప్రారంభింపబడినవి. భారతదేశమున సర్వ ప్రాంతముల నుండి శాస్త్ర పండితులు వచ్చి సభలలో పాల్గొని శాస్త్ర వాక్యార్థములు చేసి శాస్త్రములలో బహు విషయములను పునరాలోచనకు తెచ్చి—శాస్త్ర వాక్యములకు వినూతన సౌగంధము—వెలుగు—తెచ్చుట - యీ సభలందు శ్రీమహా గణపతి ప్రతినిధిగా శ్రీ మహాసన్నిధానమువారు అధ్యక్షులుగా నుండుట శ్రీ సన్నిధానము వారు ఉపాధ్యక్షులుగా నుండుట జరుగుచున్నది. అన్ని శాస్త్ర విద్వాంసులను సభలలో పాల్గొందురు. ముఖ్యముగా వేదాంత న్యాయ మీమాంసా వ్యాకరణ శాస్త్రములవారు వేద పండితులు, వేదచక్షువైన జ్యోతి శాస్త్ర పండితులు పాల్గొందురు.

దుర్మతినామ సంవత్సర వాక్యార్థ విద్వత్సభలు కూడా అతి ఉదాత్త స్థాయిలో జరిగినవి. విద్వాంసుల వివాదములు అతి ప్రగాఢ స్థితికి వచ్చినప్పుడు శ్రీ మహాసన్నిధానమువారు కల్పించుకొని రమణీయ సాధు పరిష్కారములు చేసిరి.

శ్రీ సన్నిధానమువారు విద్యా పక్షపాత సాహితీవాల్లభ్యులు. శాస్త్ర చర్చలను మధుర వాఙ్మయముగా—స్వాదురుచిమత్తముగా శ్రీ సన్నిధానమువారు తీర్చిదిద్దిరి. శ్రీ తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాదు గారు ముఖ్య అతిథిగా వచ్చెను.

భాద్రపదకృష్ణచతుర్దశి ఆదివారము (27-9-81) నుండి మూడు దినములు శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి చరణుల ఆరాధన జరిగినది. భాద్రపద అమావాస్య సోమవారము (28-9-81) నాడు శ్రీ శారదాదేవికి మహాభిషేకము జరిగినది. శ్రీ శారదాదేవికి జగత్ప్రసు (బాలెంతురాలు) అలంకారము చేయగా జనులు విశేషముగా వచ్చి చూచిరి.

---

శ్రీ గురుభ్యోనమః

శ్రీ శృంగేరీ జగద్గురు శంకరాచార్య శ్రీమదభినవ విద్యాతీర్థ మహాస్వామిచరణ చరణాబ్జములకు భక్తి భరిత సాష్టాంగ ప్రణామములు.



దువ్వూరి నరసింహమూర్తి (పరసుఖానంద)
మండవ రాఘవయ్య, సీతారామమ్మ (దంపతులు)
మండవ జగన్మోహనరావు, పార్వతీదేవి (దంపతులు)
మండవ జయరాం, శారదా (దంపతులు)
దేవభక్తుని ఐ బెనర్జీ, రాజేశ్వరి (దంపతులు)



సోమసుందర రైస్ మిల్
10, క్రొత్త స్ట్రీటు
తిరువారూరు,
తంజావూరు జిల్లా
(తమిళనాడు - 610 108)

శ్రీ జగన్మోహన రైస్‌మిల్
7, రేస్ పార్కు రోడ్డు
మడువంకరై
(మదరాసు - 600032)

# శ్రీ వీర వేంకట సత్యనారాయణ స్వామివారి దేవస్థానము

## అన్నవరం - 533 406

### తూ॥ గో॥ జిల్లా, ఆంధ్రప్రదేశ్

గ్రామ్స్ : దేవస్థానం

ఫోన్స్ : ఆఫీసు : 21
ఎంక్వయిరీ ఆఫీసు : 25

### తప్పక దర్శింపవలసిన పుణ్యక్షేత్రము

ఈ క్షేత్రములో శ్రీ వీర వేంకట సత్యనారాయణస్వామివారు త్రిమూర్తులైన హరిహర హిరణ్యాత్మక అంశముతో వెలసి వున్నారు. అందుకే ఈ క్షేత్రం దైవ స్వరూపులైన త్రిమూర్తులకు నిలయంగా భాసిల్లుతుంది.



ఇచ్చట శృంగేరీనుండి తెచ్చిన శ్రీ చక్రం ప్రతిరోజూ పూజింపబడుతోంది.

శ్రీ స్వామివారి వ్రతం చేయడం యిచ్చట ప్రత్యేకత. ఇది ప్రతి హిందూ కుటుంబం తప్పక ఆచరించదగిన వ్రతము. (వ్రతము ఉదయం 6 గంటలనుండి సాయంత్రం 6 గంటల వరకు)

పంపానది ప్రక్కన వున్న రత్నగిరిపై 'సత్యదేవుడైన శ్రీ వీర వేంకట సత్యనారాయణ స్వామివారు వెలసియున్నారు. ఇచ్చట ప్రధాన విగ్రహం అత్యంత దూరాన వున్న బదరీ పుణ్యక్షేత్రం నుండి తేబడి శ్రీ త్రిపాద్విభూతి

# శ్రీ శంకర కృప

సంపాదకులు: తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

సంపుటి 21 } శంకరశ్శంకర స్సాక్షాత్ వ్యాసో నారాయణో హరిః { సంచిక 3

## శ్రీ శంకర భగవత్పాదాచార్య విరచిత

## శ్రీమత్త్రిపురసుందరీ వేదపాద స్తోత్రము

శ్లో॥ చక్షుః ప్రేక్షత్ప్రేమ కారుణ్యధారాం
హంస జ్యోత్స్నా పూరహృష్యచ్చకోరామ్।
యా మాశ్లిష్యన్మోదతే దేవ దేవః
సానో దేవీ సుహవా శర్మయచ్ఛతు॥ 66

(దీనియందున్న వేదపాదము తైత్తిరీయ బ్రాహ్మణములోనిది)

తా॥ కన్నులనుండి ప్రవహించుచున్న ప్రేమకారుణ్య ధారలతోను, తెల్లని హంసలకాంతి యను వెన్నెల వెల్లువలతోను విరాజిల్లుచు నానందించుచున్నట్టి చకోరనయన యగు—ఏ దేవిని గూడి దేవదేవుడగు పరమశివుడు ప్రమోదమును పొందుచుండెనో—ఆ దేవి—శుభమైనట్టి స్తోత్రములచే స్తూయమానయగు నా యంబిక—జగన్మాత—మాకు శుభములను సుఖములను ప్రసాదించునుగాక.

విశేషములు : పరమశివునిచే ఆలింగనము చేసికొనబడిన శ్రీదేవి నీ శ్లోకమున స్తుతించినారు. అనగా నిచ్చట శ్రీదేవి కామేశ్వరీమహాదేవి. పరమేశ్వ డిచట కామేశ్వరుడు. కామేశ్వరీ కామేశ్వరులను స్తోత్రము చేసిరని భావము. కామేశ్వరీ కామేశ్వరులు సమయదక్షిణాచారమున శ్రీవిద్యకు అధిష్ఠానమూర్తులు. వారికి పంచవిధ సామ్యములు. (అధిష్ఠాన—నామరూపాదులు).

శ్రీదేవిఉపాసన సమయ వైదికాచారసమ్మతమని, బ్రహ్మవిద్య యని, శ్రీదేవిని ధ్యానించుటయే బ్రహ్మైక్యానుసంధానమని శ్రీభగవత్పాదులు సూచించుచున్నారు. ఈ స్తోత్రము త్రయ్యంతములసారభూతమని దీనిని పఠించుట, ఉపనిషదర్థానుసంధానమే యని గ్రహింపవలెను.

—:o:—

# శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి చరణ స్మరణమ్

(గతసంచిక తరువాయి)

## గురుభక్తి

శ్రీ శంకరజయంతి ఉత్సవ సందర్భంగా సమకూడిన విద్వత్సదస్సులో శ్రీ జగద్గురువు లొక విద్వాంసుని—ఒక ప్రత్యేక బ్రహ్మసూత్రమును వ్యాఖ్యానింపుమనిరి. ఆ విద్వాంసుడు చక్కగా వ్యాఖ్యానించెను. కాని ఆ వ్యాఖ్యానము ముగింపులో తన సొంత వాదమును కొంత జోడించి—సిద్ధాంతమును బలపరిచెను.

శ్రీ జగద్గురువులు: నీవు కలిపిన వాదము శ్రీ భగవత్పాదుల భాష్యమునందున్నదా?

విద్వాంసుడు: లేదు.

శ్రీ జగద్గురువులు: అయితే దానిని ఏ వేళ కలిపి చెప్పితివి?

విద్వాంసుడు: అది అదనముగా చేయబడిన వాదము. అందువలన సిద్ధాంతము బలపడును.

శ్రీ జగద్గురువులు: ఈ అదనపు వాదమును—సిద్ధాంతమును బలపరచగల దానిని—శ్రీ భగవత్పాదులు చెప్పలేకపోయిరందువా?

విద్వాంసుడు: దీనినికూడ కలిపి చెప్పిన బాగుండును.

శ్రీ జగద్గురువులు: కలిపి చెప్పవలసినదే యనియా?

విద్వాంసుడు: నేనట్లనలేదు.

శ్రీ జగద్గురువులు: నీవు అవేమాట లనలేదు. కాని భాష్యము యీ క్రొత్త వాదనతో మరింత పుష్టి పొంది మరింత సమగ్రత సాధించుకొని యుండెడిదని నీ మనస్సునందొక ఆలోచన కలిగిన మాట నీవు కాదనలేవు కదా!

విద్వాంసుడు: నిజమే.

శ్రీ జగద్గురువులు: ఈ వాదము చేసి భాష్యమునకు మరింత శోభ కూర్పవలెనని నీ భావమా?

విద్వాంసుడు: కాదు కాదు. ఆ విధముగ నే నెంచి చేయవలచినదని తలచియుండలేదు.

శ్రీ జగద్గురువులు: ఏమైనను ఈ భావము నీ మనస్సునందొక మూల నున్నది. లేకపోయిన యీ వాదము నీవు చేసియుండవు.

విద్వాంసుడు: ఇట్టి ఉపపత్తులకు అవకాశమిచ్చిన వాదమును చేసినందుకు నేను పశ్చాత్తాపము పొందుచున్నాను.

శ్రీ జగద్గురువులు: పశ్చాత్తాపమో—లేదో—ఆ వాదమెంతవరకు నిలచునో పరిశీలింతము.

తరువాత శ్రీ జగద్గురువులు ఆ క్రొత్తవాదమును విశ్లేషించి—అది ఎంత అసందర్భమో—నిరుపయోగకరమో—అసలు చేయదలచిన సిద్ధాంతమునకది ఎంత విరుద్ధమో సునిశితముగా నిరూపించిరి. విద్వాంసుడు తన తప్పిదమును గాఢముగా గ్రహించెను.

విద్వాంసుడు: నే నీ క్రొత్తవాదమును చేసినందుకు చింతించుచున్నాను. అది అసందర్భమైనదని—నిలువజాలనిదని నే నిప్పుడు తెలిసికొని పరితపించుచున్నాను.

శ్రీ జగద్గురువులు: ఈ పరిశీలన—విశ్లేషణము—నీ నుండి—తప్పిదమును ఒప్పుకొనుచు పరితాపము వెల్లడి చేయింపవలెనన్న భావనతోకాదు. లేక నా యొక్క వాదనా పటుత్వము ప్రదర్శింపవలయుననియు కాదు. నా ప్రయత్నమేమనగా—సర్వజ్ఞులైన శ్రీ శంకరభగవత్పాదులు—సాక్షాచ్ఛంకరులు—తమ భాష్యమునం దెక్కడగాని పొరపడినారని, లేక కొంత చెప్పుట మరచినారని—నీ మనస్సునందాలోచనలు కలుగరాదని—కలిగినదానిని నిర్మూలించవలెనని.

శ్రీ భగవత్పాదులు నిజముగా నెవ్వరో మనము మరచిపోయినప్పుడు—ఆయన భాష్యమును మెరుగుచేయవలెనన్న కాంక్ష మనకు కలుగవచ్చును—ఆయన కూడ మనవలె నొక విద్వాంసుడు మాత్రమే నన్న అభిప్రాయమున్నప్పుడు అట్టి భావన కలుగను. నీవు అట్టి భావనలను విసర్జించి మనస్సును క్షాళితము చేసికొనవలెను.

(సశేషము)

---

## చందాదారులకు విన్నపము-ప్రకాశకుని చిరునామా మార్పు గమనింపుడు

చందాలు బాకీయున్నవారికి పత్రిక పంపబడదు. చందా సొమ్మును ముందుగనే (తమ అడ్రసు మార్పుకూడ వెంటనే) క్రింది చిరునామాకు పంపవలెను.

ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి,
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు,
6—3—609/18, ఆనందనగర్,
ఖైరతాబాదు, హైదరాబాదు—500 004.

# శ్రీ జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణాంల ఉపదేశము

మానవులకు భోగలాలసత్వము—ఇంద్రియ విషయములందు ఇచ్ఛ సహజము. మోక్షమును సాధించుకొనుటకై పాటుపడుట సకృత్తుగా నుండును.

మన శాస్త్రములందు వాంఛ—(కోరిక—కామము) సకల దుఃఖములకు మూలకారణమని బహు పర్యాయములు చెప్పబడినది.

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహా పాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్.

అని కదా గీతాచార్యుడైన భగవంతుడు బోధించినది. (సర్వానర్థ కారణమైన శత్రువు కామము. ఈ కామమే ప్రతిహతమైనచో క్రోధమగుచున్నది. ఇది రజోగుణము పుట్టించి దాని ద్వారమున సర్వకార్యములందు పురుషుని ప్రవర్తింపచేయుచున్నది. ఇది బహు విషయకంబగుటచే మహాశనము. సర్వపాపములకు నిమిత్తమగుటచే మహాపాపము. కావున ఈ సంసారము నందు కామమే శత్రువని యెఱుంగుము.)

అందుచేత సాధకులు—తెలిసియో—తెలియకయో—కామమును అణచివేయుటకు—(నిర్మూలించుటకు బదులు) ప్రయత్నింతురు. ఇది చివరకు భరింపరాని దుఃస్థితిని కలిగింపవచ్చును. ఉదాహరణకు—రావణుని మరణమున మండోదరి దుఃఖావేశము గమనింపవలెను. "ఇంద్రియాని పురాజిత్వాజితంత్రి భువనం త్వయా। స్మరద్భిః ఇవతద్వైరమ్ ఇంద్రియై రేవ నిర్జితః॥ (ఇంద్రియముల నణచి తపస్సుచేసి శివుని వరములను పొంది త్రిభువనములను జయించితివి. ఆ ఇంద్రియము లా పూర్వ వైరమును జ్ఞాపకముంచుకొని కసి తీర్చుకొనుచు నిన్ను నేడు జయించినవి).

భోగమన్న గోడకు కామమన్న బంధముతో బిగింపబడిన మనస్సు—విల్లువలె వంగి వెనుకకు లాగుకొనునది. (Spring) బుద్ధి మనస్సును ఆధ్యాత్మిక మార్గమువైపునకు లాగును. ఈ లాగుట బలహీనము కాగా—లేక ఆగిపోగా—మనస్సు మరల తన స్వస్థితికి వెళ్ళిపోవును. ఇది అనుభవమునకు చెందిన విషయము. ముఖ్యముగా బ్రహ్మచర్య విషయమున-ధ్యానమార్గావలంబమున. అనారోగ్యము లేక గృహమున అననుకూల పరిస్థితులు—పూర్వకృత్యము నంతటిని—వమ్ముచేయును. (విశ్వామిత్ర—మేనక వృత్తాంతము గమనింపతగినది).

మానవుడు జంతువులవలె ఇంద్రియలోలుపత్వమువలన నడుపబడడు. అతనికి

వివేకమున్నది. మోహపరచువానిని జయించుట కతడు ప్రయత్నము చేయవలెను. వేదము స్త్రీని ఆశీర్వదించునపుడు "వీరుడైన పుత్రునికి తల్లివగుదువుగాక (వీరసూః భవ)" అనుచున్నది. సాధకుని గురించి శ్రుతి "కశ్చిత్ ధీరాః ప్రత్యగాత్మానం ఐక్షత" (కొందరు ధీరులు ఆత్మను దర్శించుదురు) అన్నది.

భోగమన్న గోడకు బంధింపబడిన మనస్సును గురించి—ముందుగా ఆ బంధించుచున్న కట్టుత్రాడును తెంపవలెను. అనగా కామమును (కోరిక) అణచివేయుటకాదు. త్రెంచివేయవలెను. నిర్మూలింపవలెను.

ఇంద్రియ భోగవిషయములను గురించిన ఆలోచన బంధనకు దారితీసి కామమును కలిగించును. కాబట్టి ఆ తొలి ఆలోచన—కలుగునట్లు చేసికొనవలెను. అదియే గీతాచార్యుడు చెప్పినది.

ధ్యాయతో విషయాన్ పుంస స్సంగ స్తేషూప జాయతే
సంగాత్సం జాయతే కామః కామాత్క్రోధోఽభి జాయతే॥

(పురుషుడు శబ్దాది విషయములను చింతింపగానే వానియందతనికి ప్రీతి కలుగును. ఆ ప్రీతివలన వానియందు కామము జనించును. ఆ కామము ప్రతిహతమగునేని క్రోధము కలుగును).

సంకల్ప ప్రభవాన్ కామాన్ త్యక్త్వా సర్వానశేషతః
మనసై వేంద్రి యగ్రామం విని యమ్య సమంతతః॥

(సంకల్పమువలన ప్రభవించు కామముల నన్నిటిని వాని సంస్కారము గూడ లేకుండునట్లు విడచి వివేకయుక్తమగు మనస్సుచే నింద్రియముల నన్నిటిని సర్వవిషయములనుండియు నిగ్రహించవలెను.)

మహాభారతమునం దిట్లే చెప్పడినది (కామజానామి తే మూలం సంకల్పాత్ త్వంహి జాయతే).

అయితే ఇట్లు సంకల్పమును త్యజించుట కష్టము. కల్మష సహితమైన దుష్టాన్నమువలె—సంకల్పము—చెడ్డదని గ్రహించినపుడు—అది యెంత రుచికరమైనదే కాని—దానిని విడచుట తేలిక. దీనిని యోగశాస్త్రము ప్రతిపక్షభావన యనును. ఈ మార్గమున ప్రగతి గమనమును పరీక్షించుకొనుటకు—జాగ్రదవస్థయందు—స్వప్నమునందు—వచ్చు ఆలోచనలను చూచుకున్న చాలును. ఓర్పు చాల ముఖ్యము. శీఘ్రఫలితములకై చేయు ప్రయత్నములు—శీఘ్ర నైష్ఫల్య నిరుత్సాహమునకు త్రోవ తీయును. ఏ విధమైన ప్రలోభమునకు లొంగనివాడు—(అన్ని విధములైన భోగాసక్తులకు అందనివాడు) నిజమైన యోగి—పారిపోవుటకు కాదు చేయవలసినది.

(దుర్వాసనాక్షయమునకు సద్వాసనాపాటవము చెప్పబడినది కూడ).

# సంస్కృతభాషను మనమేల ఆదరించి నేర్చుకొనవలెను?

## (45)

ఈ ప్రశ్నకు మన దేశంలో మేధావివర్గంలో మూర్ధన్య మనీషామణులు సమాధానాలు చెప్పారు. గత సంచికలందు కొన్నిటిని తెలుసుకున్నాము. ఇప్పుడు మరికొన్ని. (సంపాదకుడు)

### శ్రీ కామాఖ్యారామశర్మా బరూచా

రామాయణ కాలమున—సత్య నిష్ఠయందు, న్యాయ దృష్టియందు, ధైర్య సాహసములందు, ఉత్తమ శీలమునందు, ఆర్య భారతీయుడు మహోన్నత స్థితిని చేరెను. ఐశ్వర్యం ఆర్భాటము, సోమరితనము, స్వార్థము—ఆ నాటి సంఘమును మలినము చేయలేదు. రామాయణము నందు వాల్మీకిచే నిరూపింపబడిన జీవితాదర్శములు, సద్గుణములు—మన దేశమునందు—మరే కాలము నందు అధిగమింపబడలేదు. వైదిక వేదకాలానంతర సంస్కృత వాఙ్మయము నందు నిరూపింపబడిన జీవితాదర్శముకంటె ఉన్నతమైన ఆదర్శమును మరే దేశ వాఙ్మయమును సంభావింపలేదు. అట్టి భాషను, సాహిత్యమును అధ్యయనము చేసినందువలన మన విద్యార్థులు ఉత్తమ శీలవంతు లగుదురనుట చెప్పవలసిన పనిలేదు. కాబట్టి సంస్కృత విద్య మనకు అనుల్లంఘనీయము. మన పాఠశాలలలో, కళాశాలలలో ముఖ్యమైన - నిర్బంధమైన పాఠ్యాంశము కావలెను.

స్నాతకోపన్యాసము
అస్సాం సంస్కృత సమితి 1960

### కవివర్ శ్రీ సుమిత్రానందనపంత్

నేడు లోకమున సర్వత్ర భౌతిక అభ్యుదయ కృషి - గమనము—వాదము కన్పించుచున్నవి. ఆత్మగుణముల వికాసమువలన శాంతి లభింపగలదు. అది లేకుండ సంస్కృత అధ్యయనము సంభవము కాదు. మన ప్రాచీన సంస్కృతి, కళా, మరియు మన పరంపరయొక్క పునః ప్రతిష్ఠాపన కొరకు సంస్కృత భాషా సాహిత్యముల అధ్యయనము అనివార్యము కావలయును.

అఖిల భారత సంస్కృత పరిషత్
లక్నో—వివరణ గ్రంథము
8 అక్టోబరు 1953.

# శ్రీ విద్యారణ్య విజయగాథ



15

వేదవ్యాసులు
వామ్మని కోపింపగా
విద్యారణ్యులు అంజలి
పూని "మీరు వేద
వ్యాసులని నే నెరుగు
దును. మిమ్ము శరణు
వేడుచున్నాను. ప్రస
న్నులై అనుగ్రహిం
పుడు" అని ప్రార్థించిరి.

వ్యాసులు వాత్సల్య
ముతో "నన్నెట్లుగుర్తిం
చితివి? నీకు చెప్పిన
వారెవరు"? అనగా
విద్యారణ్యులు సవిన
యముగా ప్రత్యుత్తర
మీయగా వ్యాసులు
విద్యారణ్యులనుబదరీ
వనమునకు రమ్మని,
అదృశ్యులైరి.



# శ్రీ శంకర భగవత్పాద విరచిత వేదాంత డిండిమము

## వ్యాఖ్యానము: శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

శ్లో॥ సుఖదుఃఖే పదార్థౌ ద్వౌ ప్రియావిప్రియకారకౌ
సుఖం బ్రహ్మ జగద్దుఃఖ మితి వేదాంత డిండిమః॥ (5)

తా॥ సుఖము దుఃఖము అను రెండు పదార్థములు. అందు సుఖము ప్రియమును దుఃఖము విప్రియమును కలుగజేయును. సుఖము బ్రహ్మమని, దుఃఖము జగత్తు అని వేదాంత డిండిమము.

శ్లో॥ సమష్టివ్యష్టిరూపౌ ద్వౌ పదార్థౌ సర్వసమ్మతౌ
సమష్టి రీశ్వరో వ్యష్టిః జీవో వేదాంత డిండిమః॥ (6)

తా॥ సమష్టి, వ్యష్టి అను రెండు పదార్థములు సర్వవిధములైన వాదములు చేయువారికిని సమ్మతములు. సమష్టి ఈశ్వరుడని, వ్యష్టి జీవుడని వేదాంత డిండిమము.

శ్లో॥ జ్ఞానం కర్మ పదార్థౌ ద్వౌ వస్తుకర్త్రాత్మతంత్రకౌ
జ్ఞానాన్మోక్షో న కర్మభ్య ఇతి వేదాంత డిండిమః (7)

తా॥ జ్ఞానము కర్మము అని రెండు పదార్థములు. జ్ఞానము వస్తువున కధీనమగు కర్తృతంత్రము. జ్ఞానమువలననే మోక్షము లభించును గాని కర్మములవలన కాదని వేదాంత డిండిమము.

(సశేషము)

—: o :—

---

# శ్రీ శంకర భగవత్పాద విరచిత
# వివేకచూడామణి
## (శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామి విరచిత వ్యాఖ్యాసమేతము)

ఆంధ్రీకరణము: డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు(వేదాంత శిరోమణి, విద్వాన్
ఎం. ఏ. (సంస్కృత, ఆంగ్ల హిందీ) పి. హెచ్‌డి.

(గత సంచిక తరువాయి)

అవ. మోక్షమును పొందగోరువారికి సుఖముగ తెలియుటకు సమూలమైన సమస్త సంసారమును వృక్షముగా రూపించుచున్నారు.

మూ. బీజం సంసృతి భూమిజస్య తు తమో దేహాత్మ ధీరంకురః
రాగః పల్లవమంబు కర్మ తు వపుః స్కంధోఽసవః శాఖికాః।
అగ్రాణీంద్రియ సంహతిశ్చ విషయాః పుష్పాణి దుఃఖం ఫలం
నానాకర్మ సముద్భవం బహువిధం భోక్తాత్ర జీవః ఖగః॥ 147

ప్ర. అ. సంసృతి భూమిజస్య = సంసారమనెడు వృక్షమునకు, తమః తు = అజ్ఞానమే, బీజం = బీజము, దేహాత్మధీః = దేహమునందు ఆత్మ యనెడు బుద్ధి, అంకురః = అంకురము, రాగః = రాగము (ఆసక్తి), పల్లవం = చిగురు, కర్మ తు = కర్మయే, అంబు = ఉదకము, వపుః = శరీరము, స్కంధః = మ్రాను, అసవః = ప్రాణములు, శాఖికాః = శాఖలు, ఇంద్రియ సంహతిః చ = ఇంద్రియముల సముదాయము, అగ్రాణి = చిగుళ్ళు, విషయాః = భోగ్యవస్తువులు, పుష్పాణి = పుష్పములు, నానాకర్మ సముద్భవం = అనేకవిధములైన కర్మలవలన పుట్టిన, బహువిధం = అనేకవిధములైన, దుఃఖం = దుఃఖము, ఫలం = ఫలము, అత్ర = ఇచట, జీవః = జీవుడు, భోక్తా = (ఆ ఫలమును) భుజించు, ఖగః = పక్షి.

వ్యా. అ. సంసారమే ఒక వృక్షము. దానికి, బీజం = మూలకారణము, తమః = అజ్ఞానము "తు" అనుదానికి అవధారణము అర్థము. అనగా అజ్ఞానమే మూలము కాని మరియొకటి ఏదియులేదు. దేహాత్మ బుద్ధి అంకురము ఏలనన అనాత్మను ఆత్మ అని భావించుటకు ఏకైక కారణము అజ్ఞానమే. రాగము చిగురు. చిగురు అంకురము జనించు తరువాత జనించినదికదా. శరీరమే ఆత్మ అను బుద్ధి కలిగిన తరు

వాత శరీరమునకు అనుకూలమైనది ఆత్మకు అనుకూలముగ నుండును అను అభిప్రాయముతో అట్టి విషయములయందు కలుగు ఇచ్ఛయే రాగము. కర్మయే వృక్షము పెరుగుటకు హేతువైన జలము. "తు" అనుదానికి వెనుకటి వలెనే అవధారణము అర్థము. "కుర్వతే కర్మభోగాయ కర్మకర్తుంచ భుంజతే" (భోగము ననుభవించుటకై కర్మ చేయుచుందురు. కర్మచేయుటకై భోగముల ననుభవించుచుందురు) అని చెప్పబడినది. ఇచట కర్మము అనగా పుణ్యము, పాపముకూడ అని అర్థము. శరీరము స్కంధము. వృక్షముయొక్క ఏ మధ్యభాగమునుండి కొమ్మలు బయలుదేరునో ఆ భాగమునకు స్కంధమని పేరు. అసవః=ప్రాణాదులగు ఐదు వాయువులు, స్కంధమునుండి వ్యాపించునవగుటచే శాఖలు, ఇంద్రియముల సముదాయము చిగుళ్ళు. చక్షురాది జ్ఞానేంద్రియములు వాగాది కర్మేంద్రియములును ప్రాణములపై ఆధారపడియుండు ననికదా ఈ విషయము ఇంద్రియములకును, ప్రాణమునకును నడుమ జరిగిన సంవాదమును తెలుపు శ్రుతియందు ప్రసిద్ధము. చిగుళ్ళ స్థితి శాఖలపై ఆధారపడియుండునన్న విషయము ప్రసిద్ధమే కదా. విషయాః = శబ్ద స్పర్శరూప రస గంధములనెడు విషయములు చిగుళ్ళకు సంబంధించినవగుటచే పుష్పములు. విషయేంద్రియముల సంబంధము కలిగిన తరువాత జనించుటచే దుఃఖమే ఫలము. శాఖాగ్రములయందు పుష్పములు పుట్టిన తరువాతకదా ఫలము పుట్టును. వెనుక కర్మ శబ్దమునకు పుణ్యాపాప రూపమైన కర్మ అను అర్థము చెప్పియుండుటచేతను, అప్పుడప్పుడు సుఖముకూడ అనుభవింపబడుటచేతను దుఃఖముతోపాటు సుఖమునుకూడ చెప్పవలసియున్నను అట్లు చెప్పలేదు. ఏలనన వివేకవంతులు వైషయిక సుఖమునుకూడ దుఃఖముగనే పరిగణింతురు. ఆ సుఖముకొఱకు ప్రయత్నించునపుడును ఆ సుఖము కలిగి నశించిన పిమ్మటను దుఃఖమే కలుగునుకదా "యేహి సం స్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవతే। ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతేబుధః॥" (ఓ అర్జునా! విషయేంద్రియముల సంబంధ రూపములైన భోగములన్నియు దుఃఖమునకే కారణములు అవి ఆద్యంతములు కలవి; అనగా లభించి కొంతకాలము ఉండిపోవునవి. పండితుడు వాటి విషయమున ఆసక్తి చూపడు) అని భగవద్గీతలో చెప్పబడినది. కావుననే న్యాయశాస్త్రములోకూడ ఇరువదియొక్క దుఃఖములలో ఆరు ఇంద్రియములు, ఆరు విషయములు, ఆరు బుద్ధులు, శరీరము, సుఖము, దుఃఖము అనువాటిని పేర్కొని సుఖముకూడ దుఃఖముగనే పరిగణింపబడినది. ఆ దుఃఖముకూడ అనేక విధములయిన కర్మలవలన కలుగుచున్నది. అందుచే కారణమైన కర్మ అనేక విధమగుటచే ఫలముకూడ అనేక ప్రకారమై ఉండును. అత్ర = ఈ వృక్షమునందు, ఖగః = పక్షియైన

జీవుడు దుఃఖరూప ఫలమును అనుభవించును. దేహమే నేను అను బుద్ధి అనెడు బంధము రాగద్వేషాది దోషములను పుట్టించుచు వాటిద్వారా ధర్మాధర్మరూపమైన కర్మకు హేతువు అగుచున్నది. ఆ కర్మచే శరీరపరంపర కలుగుచున్నది. దానియందు మరల నేను అనెడు అభిమానము కలుగుచున్నది. ఈ విధముగ బంధము వ్రేళ్ళు నిల ద్రొక్కుకొని స్థిరపడియున్నది. ఇట్లు "కథం ప్రతిష్ఠాస్య" అను ప్రశ్నకు సమాధానము చెప్పినట్లైనది. 147

అవ. ఇపుడు మోక్షమెట్లు కలుగును అను ప్రశ్నకు సమాధానము చెప్పుటకై వెనుక చెప్పిన బంధమును, దాని కారణమును, దాని ఫలమును అనువదించుచున్నారు.

శ్లో. అజ్ఞానమూలోఽయమ నాత్మబంధో
నైసర్గికోఽనాది రనంత ఈరితః।
జన్మాప్యయ వ్యాధిజరాది దుఃఖ
ప్రవాహ తాపంజన యత్యముష్య॥

ప్ర. అ. అజ్ఞానమూలః = అజ్ఞానమువలన పుట్టిన, అయం = ఈ, అనాత్మబంధః = అనాత్మ బంధము, నైసర్గికః = స్వభావసిద్ధమైన దనియు, అనాదిః = ఆది లేనిదనియు, అనంతః = అంతము లేనిదనియు, ఈరితః = చెప్పబడినది (ఈ బంధము) అముష్య = ఈ పురుషునకు, జన్మ ... తాపం—జన్మ = జన్మలు, అప్యయ = మరణములు, వ్యాధి = వ్యాధులు, జర = ముసలితనము, ఆది = మొదలైన, దుఃఖప్రవాహ = దుఃఖప్రవాహమువలన కలిగిన, తాపం = సంతాపమును, జనయతి = కలిగించుచున్నది.

వ్యా. అ. అయం = సర్వలోక ప్రసిద్ధమైన, అనాత్మబంధః = శరీరము మొదలగు ఆత్మభిన్నములైన వస్తువుల విషయమున తాదాత్మ్యాభిమానము, అజ్ఞానమూలః = స్వస్వరూపముయొక్క అజ్ఞానమే కారణముగ కలది. నైసర్గికః = పూర్వమును అంతకు పూర్వమును ఉండు అధ్యాసలవలన ఏర్పడిన సంస్కారమే హేతువుగా గలది. అనాదిః = ఆది రహితమైన అజ్ఞానమువలన జనించినదగుటచే ఏ సమయములో జనించినదో చెప్పుటకుగాని తెలిసికొనుటకుని శక్యముకానిది. అనంతః = దీనికి జ్ఞానముతప్ప మరి దేనిచేతను నాశముకలుగదు గాన ఇది అనంతము. అని, ఈరితః = శాస్త్రజ్ఞులచే చెప్పబడినది. "నాంతోఽనచాదిః" (దీనికి అంతముకాని ఆదికానిలేదు) అని స్మృతికూడ చెప్పుచున్నది. ఇట్టి ఈ బంధము అముష్య = ఈ జీవునకు జన్మ.... తాపం—జన్మ = శరీరముయొక్క ఉత్పత్తి, అప్యయః = మరణము, రోగము, ముసలి

తనము, ఆది అనుటచే ఆధిభౌతికములును, ఆధి దైవికములును అగు బాధలను గ్రహించవలెను. వాటిచే కలిగిన దుఃఖముల ప్రవాహముచే అనగా పరంపరచే అనగా ఒకదానిపై ఒకటివచ్చి పడుచుండుటచే తాపం = ఉద్వేగమును, జనయతి = కలిగించును. “పాతం” అను పాఠములో ప్రవాహములో పడిపోవుట అను అర్థము స్పష్టము. 148

అవ. ఈ అనాత్మబంధము పరమేశ్వరానుగ్రహముచే లభించిన దృఢతరమగు వివేకముచే కలిగిన స్వస్వరూప సాక్షాత్కారము తప్ప మరి దేనిచేతను తొలగింప రానిది అని చెప్పుచున్నారు.

మూ. నాస్త్రైర్న శస్త్రైరనిలేన వహ్నినా
ఛేత్తుం న శక్యోనచ కర్మకోటిభిః ।
వివేక విజ్ఞాన మహాశినావినా
ధాతుః ప్రసాదేన శితేన మంజునా॥ 149

ప్ర. అ. (ఈ బంధము) ధాతుః = పరమేశ్వరునియొక్క, ప్రసాదేన = అనుగ్రహముచే, శితేన = వాడిగాయైన, మంజునా = సుందరమైన, వివేకవిజ్ఞాన మహాశినావినా = వివేకమువలన కలిగిన విజ్ఞానమువలన కలిగిన విజ్ఞానమనెడు గొప్ప ఖడ్గము తప్ప, అస్త్రైః = అస్త్రములచేత, ఛేత్తుం = ఛేదించుటకు, నశక్యః = శక్యముకాదు, శస్త్రైః = ఆయుధములచేత, న — కాదు, అనిలేన = వాయువుచేతగాని, వహ్నినా = అగ్నిచేతగాని, కర్మకోటిభిఃచ = కోట్లకొలది కర్మలచేతగాని, న = కాదు.

వ్యా. అ. ఈ బంధము పరమేశ్వరానుగ్రహముచే తీక్ష్ణమైన అనగా దృఢమైన “యమేవైష వృణుతే తేనలభ్యః” (ఈ పరమాత్మ ఎవనిని వరించునో వానిచేతనే తెలియబడును.) అని శ్రుతి చెప్పుచున్నది. మంజునా = సుందరమైన, వివేకవిజ్ఞానమహాశినా = వివేకమువలన అనగా ఆత్మానాత్మ వివేచనమువలన కలిగిన విజ్ఞానము అనగా బ్రహ్మసాక్షాత్కారము అనెడు గొప్ప ఖడ్గము లేకుండగ ఆగ్నేయాది అస్త్రములచేతగాని శస్త్రైః = లోహమయములైన బాణాదులచేగాని, వాయువుచేతగాని, అగ్నిచేతగాని వేదోక్తములే అయినను కోట్లకొలది కర్మలచేతగాచే నశింప జేయుటకు శక్యముకాదు. ఈ బంధమునకు మూలము అజ్ఞానమగుటచే దీనిని ఒక్క జ్ఞానముమాత్రమే తొలగింపగలదు అని భావము. ఇట్లు “కథం విమోక్షః” అను ప్రశ్నకు సమాధానముగ ఈశ్వరప్రసాద జనితమగు పరమాత్మా భేద సాక్షాత్కారమువలన బంధవిముక్తి కలుగునని చెప్పినట్లైనది. [సశేషము]

# గురువంశ కథా కథనము

(సంస్కృత మూలము: బ్రహ్మశ్రీ కాశీలక్ష్మణశాస్త్రి
గురువంశ కావ్యమ్)

తెలుగు: శ్రీ చెఱుకుపల్లె జమదగ్నిశర్మ ఎం. ఏ.

(గత సంచిక తరువాయి)

## అష్టాదశసర్గము

శ్రీ సచ్చిదానంద భారతీ మహాస్వామి గురువర్యులు సహస్ర లింగేశ్వరునిచే ఉజ్జ్వలమగుచున్న తుంగభద్రతో హరదత్తయోగి పుణ్యాశ్రమమందు అవి ముక్తకమున విశ్వేశ్వరుని వలెనే విరాజిల్లిరి (1). శ్రీ శంకరాచార్య ప్రతిష్ఠిత స్వీయ మఠమున తపస్వు లయిన గురువర్యులు తా ముండక ఇతర ప్రదేశములలో కష్టపడవలసి వచ్చుచుండుటచే తత్పాల్యదేశము లన్నియు దుర్భిక్ష భయ ప్రపీడితములైనవి (2). భరింపరాని క్షామమువలన ఎకడెక్కడి ప్రజలు తమ తమ నివాస స్థానములను విడిచి ఆకలితో బాధపడుచు కృశించిపోయి కళావిహీనులై గురువులే ప్రవాసము చేయుచున్నను వారే దిక్కని పరమ దీనులై సన్నిధికి చేరి శరణు కోరిరి (3). తపోధనులైన గురువర్యులు ధాన్య సంపాదనము బహు కష్టమగుచున్నను మహా తపస్వులగుటచే అమిత ధనవ్యయ మొనర్చి ఎల్లెట్లో తెప్పించి తండ్రి బిడ్డలను పోషించునట్లు ఎల్ల ప్రజలను కాపాడిరి (4). వర్షమెట్లైన కురిపించవలెనని షడంగ వేదవేత్తలైన ఉత్తమ విప్రులను రప్పించి తుంగభద్రా నదియొడ్డున, పర్జన్య కలోప్త వారుణ ప్రీతికర కర్మతత్త్వ మెఱిగిన విజ్ఞులచేత చేయింపవలసిన శాంతి కర్మ లన్నియు చేయించిరి(5). దానితో నింద్రుడు తృప్తిపడి జగద్గురువులు నివసించియున్న ప్రాంతమంతట సమృద్ధిగా వర్షము కురిపించెను. చెరువులు నిండి పొర్లినవి. పొలములన్నియు పంటలు పండినవి(6). గురువులు సాధించిని ఈ మహాద్భుత కర్మను చూచి తత్ప్రాంత జను లెల్లరు అనన్య సాధారణ జీవనప్రదులగు నా యోగీశ్వరులను సురేశ్వరులే యని విశ్వసించిరి (7).

పిమ్మట వారు శరన్నవరాత్రులు వచ్చుచున్నవి కదా అని శారాదాదేవిని పూజించు తలంపుతో శృంగేరికి ప్రయాణము కాగా వెనుకటి ఇక్కేరి దుష్ట మంత్రి రాజశాసనమును వంచించి వారి కనేక మార్గావరోధములు కలిగించెను(8). దానితో వారి కాగ్రహము కలిగి శారదాదేవిని దర్శించుకొని పూజింపగలుగు వఱకు ఆహారము

పుచ్చుకొనబోమని ప్రతిజ్ఞ బట్టి తీవ్ర నియమముతో మహా పౌరుషవంతులై అక్కడనే ఉండిపోయిరి (9). అప్పుడిక్కేరి భూపాలుడు శైవమత నిర్మూలన మొనర్చి గురువులను శృంగేరికి చేర్చి రావలసినదని తాను బలము తోడిచ్చి పంపిన సేనాపతి తిరిగి రాలేదేమి? యతీంద్రులు శృంగపురి చేరిరో లేదో అని విచారించి పరిస్థితి ఏమిటని శ్రీవారి కవరోధములను రాజునకు తెలియకుండ కల్పించుచున్న దుష్టమంత్రినే అడిగెను (10). రాజట్లడుగగా ఆ మంత్రి "యతీశ్వరు లిప్పటికిని శృంగపురి చేర లేదు. ఆ యోగిపుంగవులు స్వకీయమైన హరకేరి పురములోనే నివసించుచున్నారు" అని చెప్పెను (11). దానిమీద బసవక్షితీశ తనయుడు యతీశ్వరుల నెట్లైన సాంత్వనపరచి శృంగపురికి చేర్చి రావలయును. నీవు వారికెట్టి అసౌకర్యము కలిగింప రాదని మంత్రిని హెచ్చరించెను (12). అట్లు రాజు చెప్పినమీదట కూడ పరమ వంచకుడగు నా దుష్టమంత్రి త్వరితగతిని యతీంద్ర సమక్షము చేరి రాజు తనతో నన్నదానికి విరుద్ధముగా గురువులకు భయాందోళనలు కలిగించునట్లుగా (13). "ఓ యోగీంద్ర! మా రాజన్న మాట వినుడు. సైన్యము వెళ్ళినది. వెళ్ళిన మంత్రియు రాలేదు. వారివల్లనే మన రాజ్యమునకు మహత్తర భయ మేర్పడినది. మా రాజు నన్ను పిలిచి ఈ మాటలు నాతో అనెను (14). రాజుల హృదయములు లోపల దుస్సహాయాదో జంతువు లుండెడి మహోహ్రదములవలె గూఢాశయములై పరమ గంభీరములై యుండును గదా! వారి హృదయములలో నేమున్నదో ఎవ్వ రెఱుగ గలరు? అందుచేత అయన తత్త్వమెట్టిదో మీరే ఆలోచింపుడు" అని తన అతి తెలివి ప్రదర్శించెను (15). ఆ మంత్రి మాటలు విని ధీరాగ్రణులగు యోగివర్యులు చక్కగా విమర్శించి వానితో "ఇది మేము చేసినదనియే రాజు మీతో నన్న మాట నిజమైనచో (16) ధర్మాధ్వనీనులమగు మాకు ధనాగమనముతో గాని రాజ్యముతో గాని ప్రయోజనమేమున్నది? పైగా ధర్మమువలన రాజ్యము ధన ధాన్య సమృద్ధమై సుభిక్షమై యుండవలయుననియే మా ఆశయము (17). ఆదిశంకరుల ప్రభావమువలన ఈ పీఠాధిపతులమైన మాకు దిక్కు దిక్కుల శిష్యు లసంఖ్యాకముగా దేశమంతట నున్నమాట యథార్థము. ఈ పని చేయుడని మే మెవ్వరిని ప్రేరేపింపలేదు (18). అయినప్పటికిని మా వలననే రాజ్యభీతి కలిగినదని రాజు తలంచుచున్నచో మేమే వెళ్ళి దానిని నివారించి వచ్చెదము. ఈ మాట మే మన్నామని మీ రాజునకు చెప్పుము. మేమే వచ్చి మీ రాజునిప్పుడు చూచుట తటస్థించినచో అత దేమనునో తెలియవలయునని యున్నది. మా మనస్సు మమ్ముల నా పని త్వరగా చేయవలసిన దని మాటి మాటికి ప్రేరేపించుచున్నది" అని పరమ గంభీరముగా పలికిరి (20).

"తామే రాజసన్నిధికి వచ్చినచో అక్కడ అంతయు సమంజసమే కాగల" దని ఆ మంత్రి గురువర్యులతో నని వచ్చినవాడు వచ్చినట్లే తిరిగి వెళ్ళెను (21).

పిమ్మట యతీశ్వరులు బాగుగా నాలోచించి ఖడ్గపాణుల ననేకులను వెంట బెట్టుకొని కొద్దిమంది శిష్యులతో అక్కడనుండి బయలుదేరి రామచంద్రాపురము చేరుకొనిరి (22). అక్కడ నున్న గురువర్యులను వంశపురి నున్న జనులెల్లరు వచ్చి సాక్షాత్తు పరమశివుడే వచ్చినట్లు భావించి కమనీయ విగ్రహులగు నా మహానుభావులకు కానుక లర్పించుచు నమస్కరించుకొనిరి (23). లంకాధిపతి యగు రావణాసురుని దశకంధరములను ఛేదించి నెత్తురోడుచున్న తన కత్తిని సీతాపతి ప్రక్షాళన మొనర్చిన శరావతీ నది అచ్చటనే ప్రవహించుచున్నది (24). గురువర్యు లచ్చట మహర్షి తుల్యులైన బ్రాహ్మణోత్తములతో నిత్య మర్చితు లగుచు వసిష్ఠాది మహర్షుల తోడి శ్రీరామచంద్రునివలె వెలుగొందిరి (25). అట్లు కొన్ని దినము లక్కడ గడచినవి. గురువర్యుల యొద్దకు వచ్చిన ఆప్తులు కొందరివలన ఆ దుర్మంత్రి వారు చెప్పిన మాటలను రాజుతో చెప్పక ఉపేక్ష వహించినాడని తెలియవచ్చినది. (26) పరిస్థితి విచారించి యతివర్యులు శ్రీ శారదా సందర్శన మొనర్చుకొనుటయే కర్తవ్యమని నిశ్చయించి శృంగపురి కేగుటకు రక్షకులగు ఖడ్గపాణులతో అనుచర శిష్యవర్గముతో తిరుగుప్రయాణమయిరి (27).

మాఘ కృష్ణ పంచమినాడు రాత్రివేళ అమర పరివృతుడైన శంభుదేవుని వలె మహోజ్జ్వలులై జగద్గురువులు శృంగేరిలో తేలిరి (28). వారిని జూచి పురజను లెల్లరు నింటినుండి వెళ్ళిపోయి ఎచ్చటెచ్చటనో తిరిగి చాల కాలమునకు మరలివచ్చిన తండ్రిని చూచిన పుత్రులవలె సాశ్రులోచనులై వారి పాదాబ్జములకు ప్రణమిల్లి ఆదరను నెరపిరి (29). అప్పుడే యోగీశ్వరులు కొండమీది మల్లికార్జునస్వామిని పూజించి అనేకోత్సవములు చేయించి మరునాడే భక్తి శ్రద్ధలతో రథోత్సవముగూడ జరిపించిరి (30). అట్లే శారదాదేవికి సప్రయత్నముగ సమధిక పూజ లొనర్చి సువాసినీ గణముల కసంఖ్యాకముగా నూతన వస్త్రముల నొసగి బ్రాహ్మణుల కందరకు మృష్టాన్న భోజన సంతర్పణ చేయించిరి (31). (సశేషము)

---

## మతం మార్పు

బుద్ధుడు, గాంధి మొదలగువారు ప్రయత్నించినప్పటికి హరిజనులు సాంఘికముగా వెనుకనే ఉండిపోవుటకు కారణము పైకులమువారిలో ఆర్థిక బలమున్న

వారే. అయితే స్వాతంత్ర్యము వచ్చిన తరువాత ప్రభుత్వమువారి చర్యలు కూడ తృప్తికరముగా లేవు. హరిజనులకొరకై ఉద్దేశించిన సదుపాయములు, ఆర్థిక సహాయము వారికి సరిగా చేరుటలేదు. పైకి వచ్చిన హరిజనులు వెనుకనున్న వారిని పైకి తెచ్చుటకు ప్రయత్నించుటలేదు.

ప్రపంచములో ముస్లిము దేశాలు ఇస్లాము మతమును విస్తరింపచేయవలెనని తయారుచేసుకొన్న పథకములు, అందుకోసము నూరుకోట్ల డాలర్ల నిధిని ఏర్పాటు చేసికొనుట తప్పక గమనింపవలసినది. సౌదీ అరేబియా తన దేశమునకు వచ్చు ఉద్యోగులలో 30 శాతము ముస్లిములై యుండవలెనని పట్టుపట్టుచున్నది. ఇది ఉద్యోగముల ఎరచూపి మతము మార్చుటకు ప్రయత్నించుట కాదా? ముస్లిము మతమువారి మత ఉద్బోధలలో హిందూ దేశమును 'దారుల్ హరాబ్'—(శత్రు దేశముగా) భావించుచున్నారు. అందువలన హిందువులు ఆందోళన చెందుటలో ఆశ్చర్యములేదు. 'దారుల్ హరాబ్' అగుటచేత హిందూ దేశముపై నిరంతరము ముస్లిములు యుద్ధము చేయవలెనట. హైదరాబాదులో జరిగిన జమాత్-ఇ-ఇస్లామ్-సభలో హిందూ దేశమును ఇస్లాము దేశముగా మార్పుచేయవలెనన్న తీర్మాన మొకటి పైపరిస్థితులకు సరిపోవుచున్నది.

* మన మాతృదేశమున కొన్ని భాగములు-అక్కడ ముస్లిములెక్కువగానున్నారని మన దేశమునుండి చీల్చివేయబడిన సంగతి మనకందరకు హృదయశల్యముగా నుండగా-పెద్ద ఎత్తున మతం మార్పు ఉద్యమమును చూచి ఆందోళనపడకుండా నుండుటెట్లు?

శ్రీరామకృష్ణ పరమహంస కాళీమాతను ఉపాసించి — తాను ఈశ్వర దర్శనము పొంది జీవన్ముక్తుడనైనానని చెప్పినట్లుగా — క్రైస్తవులలోగాని — ముస్లిములలోగాని చెప్పువారెవ్వరైన నున్నారా? అది హైందవ దృక్పథము. మన మెంత ఔదార్యము చూపుచున్నను—'సెక్యులరు'గా నున్నను—మనలను తప్పు పట్టుకొనుట మతాంతరుల నిత్యకృత్యముగా నున్నది. మన దేశములో మన మతము వారు అధిక సంఖ్యలోనున్నను—మనము పొరపాటుచేసి—మన సంప్రదాయాను సారము 'సెక్యులర్' రాజ్యాంగ చట్టము నిర్మించుకొనుట. ఈ సదంశమును అవకాశముగా తీసికొని మన దేశపు శాంతిని కొల్లగొట్టి దీనిని ముస్లిము దేశముగా చేయుటకు జరుగుచున్న ప్రయత్నములు—వర్ణింపనలవికాని మహా దారుణ ఘోర కృత్యములే.

భాయిమహావీర (యం. పి.)

---

* మన చుట్టుప్రక్కల దేశములు శ్రీలంక, బర్మా, జపాను మొదలగు దేశములుగాని పాకిస్థాన్, బంగ్లాదేశ్ వంటి దేశములుగాని 'సెక్యులర్' దేశములు కావు. అరబ్బు దేశములలో చర్చి కట్టుకొనుటకుగాని దేవాలయ నిర్మాణమునకు అనుమతి యివ్వరు. ఇది మనము గమనింపవలెను.

(సంపాదకుడు)

# సన్మార్గము

మోక్షమును సాధించుట కష్టమని—అందుచేత దాని జోలికి పోకుండుట మంచిదని—కొందరు అభిప్రాయపడుచున్నారు. ఇది నిజముకాదు. ప్రయత్నించినచో అది సులభము. సుకరము. ముఖ్యముగా ఆవశ్యకమైనది శ్రద్ధ—పట్టుదల. తన్నుతాను ఉద్ధరించుకొనవలెనన్న తీవ్రమైన వాంఛ ఉండినచో సాధన మార్గము అతిసులభము.

ముందు ప్రారంభమున అవలంభింపవలసినది జీవకారుణ్యము. అపారమైన భూతదయ. 'నితాంతాపార భూతదయ' ముఖ్యమని కదా శ్రీమద్భాగవతమున మాలాకారుడు వరమడిగినది. జీవకారుణ్యమునందు అహింసయున్నది. జీవకారుణ్యము కలవాడు 'మాంస భక్షణము' చేయజాలడు కదా! కాబట్టి శుద్ధ శాకాహారమునే స్వీకరించుచు మాంసాహారమును పరిత్యజింపవలెను.

ఒక మహాత్ముడన్నాడు కదా—'జంతువులను చంపువారు, మాంస భక్షణము చేయువారు మనవారు కారు. వారు ఆకలితో వచ్చినపుడు ఆహారమీయ వచ్చును. అంతే వారితో మరే సంపర్కము పెట్టుకొనరాదు. మాటలాడరాదు కూడ.' అయితే చెడ్డవారు బాధపడుచున్నప్పుడు కూడ కారుణ్యము చూపనిచో జీవకారుణ్యమేమి? అందరి బాధలు—జంతువుల బాధలు కూడ—తన బాధలుగా స్వీకరించి—ఆ బాధల నివారణకు కృషి చేసిన మహాత్ములున్నారు. ఆ మహాత్ములు—పైరులకు నీరు లేక యెండిపోవుచుండగా బాధపడి కన్నీరు కార్చెదురు. అప్పుడు వాత్సల్య సముద్రుడైన భగవంతుడు వర్షము కురిపించిన సన్నివేశములున్నవి.

ఎవడు ఏ మతమునకు చెందినవాడైనప్పటికి—వానిని సహోదరునిగా చూడగలుగుట—విశ్వమానవ సౌభ్రాతృత్వము—మత తత్త్వమును గురించి వివాదములలోనికి దిగజారకుండుట—యివి జీవకారుణ్యముతో అభ్యసింపవలసినవి. నిష్కామకర్మను అనుభవములోనికి తెచ్చుకొనవలసినది—నాది—నాయొక్క—అన్న భావములను సంపూర్ణముగా తొలగించుకొనుట. నా శరీరము నా జీవితము—నా భోగములు, అన్నియు ఈశ్వరానుగ్రహమునకు వదలివేయవలెను. ఇతరులందరికి ఈశ్వరానుగ్రహము లభింపవలయునని ప్రార్థన చేయవలెను. అదియే 'సర్వే జనాః సుఖినోభవంతు' అని త్రికరణ శుద్ధిగా భావించుట.

ఇట్టి పరిశుద్ధ జీవితవిధానము అవలంబించుటకు కష్టము కానేకాదు. అందరు అవలంబింపవచ్చును. ఇట్టి సన్మార్గమును అవలంబించినవారికి క్రమముగా శ్రద్ధ విశ్వాసము భక్తి వృద్ధి పొందగలవు. పిమ్మట జ్ఞానలాభము కలుగును.

కాబట్టి—యితర సాధనామార్గములు కష్టసాధ్యములను కొనువారీ సులభ సుకర మార్గమును అవలంబింపవచ్చును.

---

# గురూపసదనము

(శ్రీరామచంద్రునికి శ్రీ వసిష్ఠమహర్షి చేసిన ఉపదేశమునందు కొంతభాగము)

శ్లో॥ పూర్వం రాఘవశాస్త్రేణ వైరాగ్యేణ పరేణచ
తదా సజ్జన సంగేన నీయతాం పుణ్యతాం మనః॥

తా. ఓయి రాఘవా! తొలుత శాస్త్రపఠన, శ్రవణ, అధ్యయనాదుల చేతను, వైరాగ్యముచేతను, సజ్జనసాంగత్యము చేతను, చిత్తశుద్ధి సంపాదించి మనస్సును పుణ్యవంతము చేసికొనవలెను.

శ్లో॥ సౌజన్యోపహితం చేతో యదా వైరాగ్యమాగతమ్।
తదానుగమ్యా గురవో విజ్ఞాన గురవోఽపియే॥

తా. చేతము (మనస్సు) సౌజన్యవంతమై వైరాగ్యమును పొందినదో, అపుడు విజ్ఞానవంతులు, బ్రహ్మనిష్ఠులునగు గురువులను ఆశ్రయింపవలెను.

శ్లో॥ తతస్తస్యోపదిష్టేన కృత్వా ధ్యానార్చనాదికమ్
క్రమేణ పదమాప్నోతి తద్యత్పరమపావనమ్॥

తా. తరువాత ఆ గురూపదేశమార్గము ననుసరించి ధ్యాన అర్చనాదులను (పూజా—ఉపాసన) సలిపి సాధకుడు క్రమముగా పరమపావనగు ఆత్మపదమును పొందును. (అనగా ధ్యానాదులవలన ఈశ్వరానుగ్రహముపొంది తద్వారా అద్వైత వాసన కలిగిన క్రమముక్తి సాధించునని.)

* * *

శ్లో॥ చిత్తస్యభోగైర్ద్వౌభాగే శాస్త్రేణైకం ప్రపూరయేత్
గురుశుశ్రూషయాహ్యేకమవ్యుత్పన్నస్య సత్క్రమే॥

తా. సన్మార్గమున ప్రవర్తింప దలచినవాడు, తొలుత చిత్తమును నాల్గుభాగములలో రెంటిని దేహయాత్రావశ్యకములగు అన్నపానాది భోగములచే నింపవలెను. ఒక భాగమును శాస్త్రవిచారాధ్యయనాదులచే నింపవలెను. మిగిలిన నాలుగవ భాగమును గురుశుశ్రూషచేత పూరింపవలెను.

శ్లో॥ కించిదుత్పత్తి యుక్తస్యభాగం భోగైః ప్రపూరయేత్
గురుశుశ్రూషయా భాగౌ భాగం శాస్త్రార్థ చింతయా॥

తా॥ కొంచెము జ్ఞానముకల సాధకుడు చిత్తముయొక్క ఒకభాగమును దేహయాత్రావశ్యక అన్నపానాదిభోగ సంపాదన విషయముపైనను, రెండుభాగములను గురువాక్య శ్రవణ శుశ్రూషాదులపైనను, తక్కిన భాగమును శాస్త్రార్థచింతనపైనను నిలుపవలెను.

శ్లో॥ వ్యుత్పత్తిమను యాతస్య పూరయేచ్చేత సోఽన్వహమ్
ద్వౌభాగౌ శాస్త్రవైరాగ్యైర్ద్వౌధ్యాన గురుపూజయా॥

తా. తత్త్వజ్ఞాన నిశ్చయమెరిగిన సాధకుడు తన చిత్తముయొక్క రెండు భాగములకు నిత్యము శాస్త్రవిచార వైరాగ్యసంపాదనమునకు వినియోగింపవలెను. మిగిలిన రెండు భాగములను ధ్యానముతో గురుపూజతో నింపవలెను.

యోగవాసిష్ఠమున శ్రీ వసిష్ఠులు చెప్పినది శ్రుతిసమ్మతమే. ఈ భావమునే శ్రుతి "తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" అన్నది.

బ్రహ్మజ్ఞానార్థి శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడునగు గురువు కడకేగి ఆశ్రయింపవలెనని—గురువుకడకు రిక్తహస్తములతో పోరాదని భావము.

జ్ఞానసంపాదనకు గురువును సమీపించి ఆశ్రయించుట గురూపసదనము అందురు.

---

# ఇష్టదైవము

పరబ్రహ్మమును నిష్క్రియాత్మకముగా సంభావించినప్పుడది నిర్గుణ పరబ్రహ్మము. పురుషుడనికూడ చెప్పవచ్చును. దానినే క్రియాత్మకమని సంభావించినప్పుడు దానిని 'శక్తి'యని, ప్రకృతియని చెప్పుదురు. రెండు నొక్కటేయని గ్రహింపనగును. కేవలమైన నిర్గుణతత్త్వము సచ్చిదానందము—సర్వజ్ఞమైన, సర్వ మేధామూర్తియైన, సర్వానందకరమైన జగన్మాత—ఒక రత్నమును దాని ప్రకాశమును వేరుచేయలేనట్లు.

ఈశ్వరునియందు, పరబ్రహ్మతత్త్వమునందు నమ్మకమున్నచో—ఇష్టదేవతా రూపమునందు (సగుణ బ్రహ్మమునందు—అనగా శక్తియుక్తమైన ఈశ్వరునియందు) నమ్మకమున్నట్లే. అట్లే విపర్యయముకూడ.

అనంతశక్తి లక్షణయగు జగన్మాత—జీవుడు—జగత్తుగా తోచును. భౌతిక బౌద్ధిక, నైతిక, ఆధ్యాత్మిక శక్తులన్నియు ఆమెయే.

సమాధియందు బ్రహ్మతత్త్వమును అనుభవములోనికి తెచ్చుకొన్నవారుకూడ-ఇష్టదేవతామూర్తితో అనుబంధమేర్పరచుకొనుటకు దిగిరావలసినదే. అప్పుడు వారికి జీవుడు, జగత్తు—తాను—అంతయు ఈశ్వరరూపములే.

బౌద్ధికము సంభావనతో పరిశీలించినచో—ఇష్టదేవతాస్వరూపము—మనశరీర,

మనస్సు, జగత్తులకంటె నిజమైనది—సత్యమైనది. నిత్యమైనది. లీలాలోలుపమగు చున్నది. దీనిని వినిర్ణయించుట సాధ్యముకానేకాదు.

జ్ఞానికి పరబ్రహ్మము నిర్గుణము. భక్తురా పరబ్రహ్మమును అనేక అవతారము రూపములుగా సంభావించుచున్నారు.

భగవంతు డన్ని జీవులయందున్నాడు. అయితే జీవులందరూ భగవంతుని యందున్నారా?

జ్ఞానియై, మహాభక్తుడై—బహుజనులచేత గౌరవింపబడుచు, పూజింపబడుచు ఆరాధింపబడుచునున్న వానియందు—అతిసామాన్యునియం దున్నదానికంటె అధిక మైన దివ్యత్వమున్నదనుట శంకారహితము.

భగవంతుని (ఇష్టదేవతా) దర్శనమునుపొంది ఆయనతో అనుబంధ సంబంధ ములను కల్పించుకొని (సన్నిహిత బంధువులతో వలె) లోకమున కాలమును వెళ్ళ బుచ్చినవా రున్నారు. అయితే అట్టివారికి భగవంతునితోడిదే లోకము. ఇతరము లేనేలేదు.

భూమిమీద నివసించుచున్నవాడు సముద్రమధ్యమునకు పోవలెనని తలపోసి నచో—ఒక నదికడకు వెళ్ళి—దానియం దొక పడవనెక్కి—ఆ నదీప్రవాహముతో పాటు పడవపై పయనించి సముద్రమును చేరవచ్చు. అయితే సముద్రము విజృంభించి పొంగి—నేలపైకి అలలతో వచ్చినప్పుడు సముద్రమును చేరుటకు నదీప్రయాణము చేయ నక్కరలేదు. అదేవిధముగా భగవంతుని విషయమున — దూరముగా ఎక్కడనో వైకుంఠపురమునందో—కైలాసాచల శిఖరమునందో వసించుచున్నాడన్న భగవం తుడు—నీలోనే—సన్నిహితుడై సన్నిధానమును అనుగ్రహించియున్నాడని గ్రహింప గలుగుట పురోగమనమే. సందేహములేదు. అట్లు గ్రహించినవానికి "మంచి-చెడు" ఒకే విధముగా నుండును. భేదములేదు. అవి అతనిని బంధించలేవు. అప్పు డతడు బ్రహ్మానుభవము కలిగినవా డగుచున్నాడు.

బ్రహ్మానుభవముపొంది దివ్యదర్శన లాభము కలిగినవానికి రాగము ద్వేషము లుండవు. శుభా శుభ, ఉన్నత నీచాది ద్వంద్వముల భేదదృష్టి నశించిపోవును. పర్వత శిఖరమునుంచి మైదానము కన్పించినట్లంతయు సమదృశ్యమే అగుచున్నది. భగవంతుడు సర్వోపగతుడని గ్రహించినవాడు సర్వమును ఉపాసించును. దేనిని ద్వేషింపడు. సర్వగతునిగా భగవంతుని దర్శించును—అర్చించును.

ఆధ్యాత్మికముగా సాధింపబడు పురోగతి వారివారి సాధన తీవ్రతనుబట్టి యుండును. వారివారి చిత్తశుద్ధి పైన, మనస్సంకల్ప దృఢత్వముపైన—భావనా

ప్రగాఢత్వముపైన మనస్థిరత్వములపైన — ఆధారపడియుండును. అంతియేకాని బాహిరమైన పరిస్థితు లెవ్వియు సాధన పురోగతిని సాధించిపెట్టలేవు.

తనకున్న ఐశ్వర్యమునంతయు గొప్ప దేవాలయమున వెంచేసి యున్న భగవంతుని పేర బదిలీచేసి—తానేదో మహత్తర కార్యమును కావించినాడని ప్రగల్భములు పలుకవచ్చును. అయితే ఎంత ఐశ్వర్యముకాని లక్ష్మీపతి ముందు అల్పాల్పమని—కుబేరుడే సేవకుడై కొలువగా సువర్ణగిరియైన మేరు పర్వతము హస్తమునందుంచుకొని వెండి కొండపై వశించు పరమేశ్వరునిముందు అల్పాల్పమని తెలిసికొని వినయమవలంబింపవలయును.

అదేవిధముగా దొంగ యొకడు దేవాలయమున ప్రవేశించి అచ్చటనున్న ఆభరణాది విలువగల వస్తువులను తస్కరించినాడని మనఃక్లేశమనుభవింపనక్కర లేదు. భగవంతుని కేమియు నష్టము వాటిల్లలేదని గ్రహింపవలెను. అయితే కొందరు భక్తులు తమ తమ తృప్తికొరకు, సంతోషము కొరకు ఆయాభరణాది వస్తువులను ఆ దేవతా విగ్రహమునకు అలంకారముగా సమర్పించి దాని గ్రహింపవలయును.

తొలుత సోపానముగా విగ్రహ అలంకారాదులను చూచి సంతోషించుట అవి తస్కరగ్రస్తముకాగా మనఃక్లేశమును పొందుట — భక్తుల పురోగమన మార్గమున నుండవచ్చును. అసలు తనకెంత భక్తియున్నదో చాటుకొనుట కూడ ప్రారంభ దశయందు కన్పించుచున్నది. అంతయు తెలిసి—బ్రహ్మానుభవ లాభము పొందిన సిద్ధుల విషయము స్థిత ప్రజ్ఞుల విషయము వేరు.

—:o:—

# విూగడ తరకలు

## (యోగవాశిష్ఠమునుండి - ఉపశమప్రకరణము)

శ్లో॥ ఆగత్య శ్రోత్రతాం మూర్ఖవ్యరో తానోప బృంహితామ్
ధియా శబ్దాను సారిణ్యా మృగవన్మాత్క్షయం వ్రజ

తా॥ లేడి వేటకు వచ్చిన బోయవాని గానముచేత ఆకర్షింపబడి—తన శ్రోత్రేంద్రియ చాపల్యమువలన—వలలో చిక్కుకొని నాశనము పొందును, నీవును అదే విధముగా—ఓ మూర్ఖమైన మనస్సా! క్షయమును పొందకుము.

శ్లో॥ త్యక్త్వాభిమాగత్య దుఃఖాయ స్పర్శోన్ముఖతయాధియా
మూర్ఖమాబద్ధతా మేహిగజీలుబ్ధగజేంద్రవత్ ॥

తా॥ మగ యేనుగు ఆడ యేనుగు స్పర్శ సుఖమునకై దాని వెంటబడి— ఏనుగులను పట్టువారు తీసిన గోతులలో పడిపోయి—వారికి చిక్కి కష్టపడును. అదే విధముగా త్వగింద్రియ లాలసత్వముతో—ఓ మూర్ఖమైన మనస్సా నీవును బంధమును పొందకుము.

శ్లో॥ రసనా భావమాగత్య గృద్ధ్వేనాన్న దురంధతామ్
మానాశమేహి బడిశపిండీలంపట మత్స్యవత్ ॥

తా॥ రసనేంద్రియ (జిహ్వ) చాపల్యముచేత—గాలమునకు కట్టుబడిన ఎరను చూచి దానిపై ఆశచేత చేప గాలమునకు చిక్కుకొని నాశనము పొందును. ఓ గ్రుడ్డి మనస్సా—నీవును అదే విధముగా జిహ్వేంద్రియ చాపల్యముతో నాశమును పొందకుము.

శ్లో॥ చాక్షుషీం వృత్తిమాశ్రిత్య ప్రభారూపచయోన్ముఖీమ్
మాగచ్ఛ దగ్ధతాం ముగ్ధ కాంతి లుబ్ధ పతంగవత్ ॥

తా॥ అగ్నియొక్క ప్రకాశత్వమును చూచి మోజుపడి నేత్రవృత్తి నాశ్రయించి—రూపము యొక్క లోభముచే మిడత పురుగు నిప్పులో పడి మాడిపోవును. ఓ అమాయికమైన మనస్సా! నీవును అదే విధముగా రూపలుబ్ధమై దగ్ధము కాకుము.

శ్లో॥ ఘ్రాణ మార్గము పాశ్రిత్య శరీరాంభోజకోటరే
గంధోన్ముఖతయా బంధం మాత్వం సంశ్రయ భృంగవత్ ॥

తా॥ ఘ్రాణేంద్రియ లౌల్యముచేత తుమ్మెద పద్మముయొక్క సువాసనవలన ఆకర్షింపబడి ముడుచుకొని పోవుచున్న పద్మముపై వ్రాలి అది ముడుచుకొని పోగా బంధింపబడును. ఓ మనస్సా నీవును అదే విధముగా ఘ్రాణేంద్రియ లౌల్యము చేత బంధనము పొందకుము.

శ్లో॥ కురంగాలి పతంగేభమీ నాస్త్వేకైక శోహతాః
సర్వైర్యుక్తైరసగైరేసు వ్యాప్తస్యాజ్ఞ కుతః సుఖమ్॥

తా॥ ఈ విధముగా లేడి, తుమ్మెద, మిడుత, ఏనుగు, చేప—ఈ అయిదును—ఒక్కొక్క ఇంద్రియ చాపల్యము చేతనే హతమైనవి. అజ్ఞానివగు ఓ మనస్సా! ఇక పంచేంద్రియముల యొక్క లోలత్వము కూడియున్న (నరునికి) వానికి సుఖమెట్లు కలుగును?

(శ్రీ శంకర భగవత్పాదు లీ విషయమునే వివేక చూడామణి యందును చెప్పిరి.)

—:0:—

# గ్రంథావలోకనము

1. సీతాకల్యాణము: (వెల: రు. 3/-)

ప్రచురణ: ఆర్. వెంకటరావు, 635/2, నక్కల గుట్ట హన్మకొండ.

2. హనుమద్వాత్యము (వెల: రు. 5/-)

ప్రచురణ: ఆర్. శ్యామసుందర్ మెకానికల్ డ్రాఫ్ట్స్‌మన్. 2-2-1133/20-B న్యూ నల్లకుంట, హైద్రాబాదు-500044.

3. సామ్రాజ్య పట్టాభిషేకము: (వెల: 5/-)

ప్రకాశయిత్రి: ఆర్. వెంకటలక్ష్మి, 2-2-1130/20 - B న్యూ నల్లకుంట, హైద్రాబాదు 500 044.

(మూడు పుస్తకములకు వి. పి.లో పంపు ఏర్పాటులేదు. ముందుగా సొమ్ము పంపినచో బుక్‌పోస్టులో పంపబడును. పోస్టేజి లేదు.)

ఈ మూడు గ్రంథములను రచించినది శ్రీ రామాభట్ల పేరయ్యశాస్త్రి గారు—వీరు హన్మకొండలోని ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో చరిత్రశాఖలో ప్రధానోపన్యాసకులు.

శ్రీమద్రామాయణాది శ్రీరామ చరిత్ర ప్రతిపాదకములగు పెక్కు గ్రంథములను పరిశీలించి వీరు రామాయణ పంచరత్నములని రచించిన గ్రంథములందివి మూడు రత్నములు. రచన శిష్ట వ్యావహారికమున సరళముగా—సుందరముగా నున్నది.

శ్రీమద్రామాయణాది పలు గ్రంథములలో తాము ఆస్వాదించిన స్వాదుమాధుర్యానందములను బహుజనులకు అందించుటకీ గ్రంథముల ద్వారా రచయిత సఫలమైన ప్రయత్నము చేసినారు.

ధర్మ జిజ్ఞాసువులకు, సాహిత్య భావుకులకు, ఇతిహాస కథాప్రియులకు—ఈ గ్రంథములందెన్నియో తెలిసికొనదగిన విషయములు కలవు. గ్రంథములను చూచిన వారందరు ఆహ్లాదపడునట్లు సాగినది రచన. ఇవి బహుజనాదరణ పొందగలవని భావింపవచ్చును. (రామప్రియ)

4. బ్రహ్మాంజలిః నామ పరమేశ్వరార్పిత శ్లోకమాలికా మూల్యము రు. 10/-

5. శ్రీమత్ ప్రసన్నాంజనేయం నామ హనుమత్సన్దేశః (మందాక్రాంతసప్తశతీ) మూల్యము రు. 25/-

ఈ రెండు సంస్కృత పద్య గ్రంథములకు రచయిత డాక్టరు ధూళిపాళ అర్క సోమయాజి (ఎం. ఏ. పి. హెచ్.డి) గారు. సంస్కృత భాషా విద్వాం

సులుగా రాష్ట్రపతి సమ్మాన గ్రహీత. భీమవరములోని డి. యన్. ఆర్. కళాశాల ప్రిన్సిపాలుగా పనిచేసి విరమించి, తిరుపతిలోని కేంద్రీయ సంస్కృత విద్యాపీఠమున ఖగోళశాస్త్రమున రీడరుగా ఉద్యోగము చేసి విరమించి ప్రస్తుతము తిరుపతి తిరుమల దేవస్థానమువారి హిందూ ధర్మరక్షణ సంస్థకు కార్యదర్శిగా నున్నారు. రచయితయే ప్రకాశకులు.

'బ్రహ్మాంజలి'-నలుబదితొమ్మిది ఖండకావ్యముల (మొత్తము 425వ శ్లోకములు) సంపుటి. దీనియందు కొన్ని ఆంగ్ల వ్యాసములు కూడ కలవు. సంస్కృత శ్లోకములకు ఆంగ్లానువాద మున్నది. ఇందు కొన్ని ఖండికలు, వ్యాసములు పత్రికలలో వచ్చినవి.

'హనుమత్సందేశః'—ఇది ఏడువందలమందాక్రాంత వృత్తముల కావ్యము. పది సర్గలలో నున్నది. హనుమంతుడు సీతాన్వేషణమున మహేంద్రగిరి పర్వతముపై నుండి సముద్ర లంఘనమునకు ఉద్యుక్తు డగుటనుండి సుందరకాండలో గాథ దీని యందు గ్రహింపబడినది. సుందరకాండ వృత్తాంతము పిమ్మట చివరి సర్గలో శ్రీరామ చంద్ర పట్టాభిషేక వర్ణనమున్నది.

శ్రీ అర్క సోమయాజిగారి సంస్కృత కవిత లాలిత్య ధారాళమై, భావనా గంభీర మోహనమై, నూతన కల్పనాచాతుర్యముతో రసనిర్భరమై ధ్వనియుక్తమై బంధపారుష్యరహితమైన ప్రసన్నత కలిగి, విలసిల్లుచున్నది. సంస్కృత సాహితీ భావుకులను అలరింపజేయ గల గవిత్వము గల ఈ రెండు గ్రంథములును సర్వభావుక లోకకరాలంకారము కాగలవని ఆశించవచ్చును.

5. వ్యాసకదంబము (ద్వితీయ భాగము) విమలానంద భారతీ గ్రంథమాల ద్వాదశ పుష్పము. రచన: శ్రీ కారుమంచి కొండలరావు బి. ఏ. బియిడి.

(వెల: రు. 2/50) బావాజిపేట విజయవాడ-3)

దీని యందు—బ్రాహ్మణ్యము, ఆత్మదర్శనము, ధర్మ దారిద్ర్యము, యువత కలలు అవి నేర్పే పాఠాలు, ప్రపంచమునకు ఏకైక రక్షమనసనాతన ధర్మమే కుటుంబ నియంత్రణ—అన్న విషయములపై వ్యాసము లున్నవి. కొండలరావుగారు నిశిత దృక్కు. ధర్మవ్యగ్రమనస్వి. తీవ్రవాక్కు కలవారు. ఈ గుణము లన్నియు ఈ వ్యాసములందు ప్రస్ఫుటముగా నున్నవి. పాశ్చాత్యభావ దాస్యభ్రమ పతితులైన వారిని ఉద్ధరించుటకే కొండలరావుగారు శ్రమించుచు—యిట్టి రచనలు చేయు చున్నారు. ఈ రచనాశైలి ఓజఃపూర్ణమై ప్రసాదగుణకలితమై ధారాళముగా నున్నది. సనాతన మతానుయాయులందరు చదువవలసిన గ్రంథము.

7. హిందూమతము: రచన: శ్రీ శివకోటి సత్యనారాణమూర్తి, మారుటేరు. (ప.గో. జిల్లా)

మూల్యము: రు. 2/50.

హిందూ మతము యొక్క స్వభావ స్వరూప వైశిష్ట్యములను తేటతెల్లము చేయుటకై చేయబడిన రచన. సులభ గ్రాహ్యముగా నున్నది. ఆదరపాత్రము.

(సుధర్మ)

—o—

# శ్రీ ఆదిశంకరుల కాలము

## భమిడిపాటి వెంకటసుబ్బారాయుడు

శ్లో॥ నారాయణ సమారంభారం శంకరాచార్య మధ్యమాం
అస్మదాచార్య పర్యంతాం వందే గురు పరం పరామ్
శాస్త్రం శారీరమీమాంసా దేవస్తు పరమేశ్వరం
ఆచార్యః శంకరాచార్యః సంతు మేజన్మని జన్మని.

శ్రీ దక్షిణామూర్తి అవతారమగు శ్రీ ఆదిశంకరులు కలియుగమునకు జ్ఞానావతారులై జన్మించిరి. వారి కాలమునందు విజృంభించియున్న అవైదిక మతములన్నియు తరిమివేసి వేద మతమగు సనాతన ధర్మమునకు ఎనలేని సేవ చేసిరి. సనాతన ధర్మమందు వేరు వేరు తెగలు. శైవులు, వైష్ణవులు, గాణాపత్యులు, సూర్యోపాసకులు, శాక్తేయులు మున్నగు భేదములతో ఒకరి నొకరు దూషించుకొనుచుండగా శ్రీ ఆదిశంకరులు ఈ ఉపాస్య దేవత లందరి యందును ఒకే పరమాత్మను దర్శించి, ఉపాస్య దేవతలు ఆ పరమాత్మ స్వరూపములే అని భావించి ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ అని తగవులాడక సామరస్యముగ నుండవలెనని బోధించి షణ్మతస్థాపనాచార్యులైరి. వారు అద్వైత మతమును స్థాపించి ప్రచార ప్రబోధములకు భారత దేశము నాలుగు దిక్కులందును నాల్గు ఆమ్నాయ పీఠములను స్థాపించి ఆ పీఠము నధిష్ఠించు ఆచార్యులు తగిన అర్హత గలవారుగా నుండవలెనని ఆదేశించిరి. వారి ఆదేశానుసారము ఈ నాల్గు పీఠములు ఇప్పటికినీ చిరస్థాయిగా నుండి ధర్మప్రచార బోధములు చేయుచు జనులను ధర్మ మార్గమందు నడుపుచున్నవి. శ్రీ ఆదిశంకరులవారి దృఢ సంకల్ప బలము ఎంత బలమైనదో గదా. వారే కలియుగ జ్ఞానగురువులని ఈ యంశమే వేనోళ్ళ చాటుచున్నది.

ఇట్టి మహనీయులు ముప్పదిరెండు సంవత్సరములు మాత్రమే జీవించి ప్రస్థాన త్రయమునకు భాష్యములు వ్రాసి, ఉపనిషత్తులు, గీత బ్రహ్మసూత్రములు విపుల ప్రచారములోనికి తెచ్చిరి. ఈయన కేరళ దేశములోని కాలటి గ్రామమందు* ఆర్యాంబా శివగురువులకు జన్మించిరి. ఈ విషయములందు అందరును ఏకీభవించుచున్నారు. వారి వారి కాలమును గూర్చి ఎప్పటినుంచి ఎప్పటివరకు జీవించిరి అను విషయములో మాత్రము భిన్నాభిప్రాయములు ఇప్పటికినీ వెలువడుచునేయున్నవి. చతురామ్నాయ పీఠములలోని వివరములలో ఒక పీఠమునకు ఇంకొక పీఠమునకు పొంతనను కన్పించుట లేదు. కాని పాశ్చాత్య పండితులు, వారి భారతీయ అనుచరులు మాత్రము శ్రీ ఆదిశంకరుల కాలమును క్రీ.శ. 8-9-శతాబ్దముల మధ్యనని ఒక అభిప్రాయమునకు వచ్చినారు. ఇది సరియైన అంగీకారయోగ్యమైనది కాదనియు వారు క్రీ.శ. 688-720 వరకు జీవించి యుండిరను నిర్ణయమునకు ఈ క్రింది ప్రబలాధారములు కనుపించుచున్నవి.

## మహాకవి భవభూతి కాలము-క్రీ.శ. 675-755

భవభూతి కన్యాకుబ్జ రాజగు యశోవర్మకు ఆస్థాన కవిగా నుండెను. ఈ విషయము కల్హణుని రాజతరంగిణి యందును, వాక్పతి రాజు రచించిన 'గౌడవాహో' అను ప్రాకృత కావ్యమందు పేర్కొనబడియున్నది. యశోవర్మ రాజు క్రీ.శ. 729-53 మధ్య పరిపాలించినట్లు ఆధారములున్నవి. అందుచేత భవభూతి కాలమును క్రీ.శ. 675-755 అని నిర్ణయించుట సహేతుకముగా నున్నది.

## భవభూతి, ఉంబేకభట్టు ఒక్కరే**

భవభూతి మహాకవియేగాక ప్రముఖ వేదాంతాచార్యుడు కూడ ఈయనయే ఉంబేకాచార్యుడు అను పేరుతో ప్రముఖ పూర్వ మీమాంసాదర్శనాచార్యుడగు కుమారిలభట్టు శిష్యుడుగా యశస్సునార్జించినారు, ఈయన కుమారిలభట్టు వ్రాసిన శ్లోకవార్తికమునకు భాష్యమును, మండనమిశ్రుని భావనా వివేకమునకు టీకను రచించి

---

* శంకరులు చిదంబరమున (తమిళనాడులో) విగతభర్తృకకు జన్మించిరని తామా శంకర నిర్మిత పీఠాచార్యులమని చెప్పుకొనువా రున్నారు. (సంపాదకుడు.)

** భవభూతి, ఉంబేకులను గురించి వివరములు 'శ్రీసురేశ్వరాచార్య' (by T. Ramalingeswara Rao) అన్న ఆంగ్ల గ్రంథమున కలవు. (సంపాదకుడు)

నాడు. మండనమిశ్రుడు కుమారిలభట్టు శిష్యుడై నర్మదా నదీతీరమున గల మాహిష్మతీపురమున నివసించెడివాడు. ఈ మండనమిశ్రుడే సురేశ్వరాచార్యులను సన్యాస దీక్షానామముతో శ్రీ ఆదిశంకరులవారి శిష్యుడై శృంగేరీలోని శారదాపీఠమునకు ప్రథమ ఆచార్యునిగ శ్రీ ఆదిశంకరుల ఆజ్ఞానుసారము వర్ధిల్లెను. మండనమిశ్రుడు (సురేశ్వరాచార్యులు),

ఉంబేకుడు (భవభూతి) కన్న ముందువాడు. ఆయన యొక్క కాలమును†
క్రీ.శ. 650-730 అని నిర్ణయించుట సహేతుకమగును.

ఉంబేకుడు కూడ కుమారిలభట్టు శిష్యుడగుటవలన కుమారిలభట్టు ఉంబేకుడు కంటె ముందరివారుగా వారి కాలము క్రీ.శ. 620-705 అని నిర్ణయించుట సహేతుకముగను సమంజసముగను ఉండును.

## శంకరులు, కుమారిలభట్టు

శంకర విజయ గాథలనుబట్టి, కుమారిలభట్టు తుషాగ్నిలో ప్రవేశించి ప్రాయోపవేశ ప్రయత్నమందుండుటవలన మాహిష్మతీపురమున నివసించుచున్న తన ముఖ్య శిష్యుడు మండనమిశ్రునితో వాదించి తన సిద్ధాంతమును ప్రతిష్ఠించుమని చెప్పెను. అందుచేత ఈ సంఘటన శ్రీ శంకరులు 16-20 సంవత్సరముల వయస్సు నందుండగా క్రీ.శ. 700-705 మధ్యను జరిగి యుండవచ్చునని నిర్ణయించుట సమంజసము.

ఈ కారణములనుబట్టి అద్వైత మతస్థాపనాచార్యులైన శ్రీ ఆదిశంకర భగవత్పాదులు కొందరు పండితులు నిర్ణయించినట్లు క్రీ.శ. 688-720 కాలమందిరని అంగీకరించుట, సహేతుకముగను సమంజసముగ నున్నది.

పండిత భూతానాథ సప్తతీర్థులు తన మీమాంసా దర్శనం రెండవ భాగ

---

§ మాహిష్మతీపుర మెక్కడనున్న దనుటలో ఏకాభిప్రాయము లేదు. దీని వివరములు శ్రీ సురేశ్వరాచార్య (రామలింగేశ్వరరావు రచన) అన్న ఆంగ్ల గ్రంథమున కలవు.
(సంపాదకుడు.)

† మండనమిశ్రుడే భవభూతి, ఉంబేకు డన్న వాదము కూడ కలదని, 'మండనమిశ్ర' అన్న నామము బిరుదు కాని పేరు కాదని, మండనమిశ్ర బిరుదును ధరించిన సమకాలికు లిరువురున్నారని శ్రీ సురేశ్వరాచార్య (రామలింగేశ్వరరావు రచన) అన్న ఆంగ్ల గ్రంథమున కలదు.
(సంపాదకుడు.)

మందు 20-21 పుటలలో భవభూతియొక్కయు, కుమారిలభట్టుయొక్కయు, మండన మిశ్రుని యొక్కయు కాలములను పై విధముగానే సూచించిరి.

భండార్కర్ పండితుడు భవభూతియొక్క మాలతీ మాధవమునకు తాను వ్రాసిన ఆముఖమందు భవభూతియు, కుమారిలభట్టు శిష్యుడు ఉంబేకుడును ఒకరే అని నిర్ణయించిరి.

సాధారణముగ పాశ్చాత్య పండితులు భారతీయ ప్రముఖుల కాల నిర్ణయములో ముందు కాలమునకు గల హేతువులు విసర్జించి తరువాతి కాలమునకు ఏ చిన్న హేతువు కనుపించినను ప్రాధాన్యత నిచ్చు మనస్తత్వమునకు అలవాటుపడినారు. ఇది బ్రిటీషువారి పరిపాలనలో మన సంస్కృతిపై మనకు నులకన భావము కలుగుటకు ఏర్పడిన కుతంత్రము. పూర్వముని నిర్ణయించుట కంటె ఆధునికముని నిర్ణయించుట యందు ఎక్కువ ఉత్సాహము వ్యక్తము చేయుదురు. గ్రంథ కర్తృత్వములో కూడ అనుమానము కలుగజేయుటకు 'శంకరులు వ్రాసిరని చెప్పుచున్న' (Generally attributed to Sankara) అను పదములు వాడుదురుగాని ఇది శంకరులు రచన అని మాత్రము నిర్దుష్టముగా చెప్పరు. Norman Brown కూడ తను ప్రచురించిన సౌందర్యలహరి ఉపోద్ఘాతములో ఇట్లే వ్రాసినారు. అందుచేత పాశ్చాత్య పండితులకు దాసులు కాని భారతీయపండితులు పై విషయములు కూడ దృష్టిలో నుంచుకొని సందిగ్ధమైన శ్రీ శంకరుల కాలమును గూర్చి పరిశోధన చేసి సందేహావస్థ తొలగించి సహేతుకమైన నిర్ణయమునకు అచిరకాలములో రాగలరని ఆశింతము. ఈ విషయములో శ్రీ ఆదిశంకరులే వెలుగుబాటను చూపుదురు గాక అని ప్రార్థించుదము.

(Truth పత్రికలో 4-9-81 సంచికలో ప్రచురింపబడిన శ్రీ నీరజకాంత విద్యార్ణవుని ఆంగ్ల వ్యాసము ఆధారముగా).

—:o:—

Printed & Published by A. Satyanarayana Murthy, at
6-3-609/18, Anand Nagar, Khairatabad, Hyderabad - 500 004.
Printed at KRANTI PRESS, MADRAS-600 001.
Editor : T. Ramalingeswara Rao

# పాఠకులతో గోష్ఠి

కొన్ని విన్నపములు :

1. పాఠకులలో—(ముఖ్యముగా చందాదారులు) కొందరికి సాధనము చేయునప్పుడు కలుగు సందేహములను గురించి—కలుగు అవరోధములను నివారించుకొను విధానములను గురించి యీ శీర్షిక ఉద్దేశింపబడినది. అందుచేత పాఠకులు పంపు ప్రశ్నలు—తమ సాధనలో వచ్చు సందేహములను గురించి కాని—కలుగుచున్న అవరోధములను గురించికాని—ఉండవలయునేగాని—యితల విషయములను గురించి ప్రశ్నలు పంపవలదని విన్నపము చేయుచున్నాము. ఈ విషయమును పాఠకులు ముఖ్యముగా గమనింప కోరుచున్నాము.

ఇటీవల కొన్ని ప్రశ్నలు—సాంఘిక విషయములను గురించి—రాజకీయ విషయములను గురించి పాఠకులనుండి వచ్చినవి. ఆ ప్రశ్నలను మేము స్పృశించుట లేదు. మన పత్రిక సాంఘిక రాజకీయ—ఆర్థిక వైద్యా విషయములను గురించి చర్చించుటకు—వ్యాఖ్యానించుటకు, వివరించుటకు పూనుకొనజాలదు. కారణము విస్పష్టము. ఈ నియమ పాలనను ఉల్లంఘింపజాలదు. పాఠకులు మన్నింపవలెను.

2. శ్రీ శంకరకృపలో ప్రచురింపబడుచున్న పెక్కు వ్యాసములను ప్రశంసించుచు పాఠకులు వ్రాయుచున్నారు. వారందరకు కృతజ్ఞతలు. పాఠకులు తరచు తమ సలహాలను అభిప్రాయములను వ్రాయుట మాకు ప్రోత్సాహకరముగా నుండును. పాఠకులను వ్యాసములపైన తమతమ అభిప్రాయములను తరచుగా వ్రాయుడని కోరుచున్నాము.

3. శ్రీ శంకరకృపలో ప్రకటింపబడుచున్న వ్యాసములను కొన్నిటికి 'రచయిత' పేరు వ్రాయబడుట లేదని—ఆ వ్యాసము లెవ్వరు వ్రాసినవని—కొందరు పాఠకులు లేఖలు వ్రాయుచున్నారు.

పాఠకులకు సవినయముగా మనవిచేయునదేమనగా—వ్యాసములు—మిమ్ము అలరించునవిగా—ఏదో కొంత నవ్యతకలవిగా—ప్రామాణికతను ఉల్లంఘింపనివిగా—వుండుట ముఖ్యము గాని—రచయిత పేరు ముఖ్యము కాదు.

పాఠకులు రచయిత యెవ్వరో తప్పక తెలిసికొని తీరవలసినదేయని భావించినచో—లేఖకుని నామములేని రచనలన్నియు సంపాదకుని రచనలుగా భావించినచో తప్పులేదు. అట్లే భావింపగలరు.

4. మీ సంపాదకుడు—యీ పత్రికకు సంపాదకుడుగా నుండుటమాత్రమే-గాక—జీవితములో మరికొన్ని క్రియా కలాపములను నిర్వహించువాడయి వుండక తప్పదు. ఏలననగా జీవనోపాధికి వేరొక వృత్తిని చేపట్టక తప్పదు. ఈ సంపాదక పదవి గౌరవమైనది ఆర్థిక సంబంధము లేనిది. అందుచేత మీ సంపాదకుడు సాహిత్యకారుడుగా జీవనము చేయువాడగుటవలన — ఆ సాహిత్య మార్గమున సంపాదకుని రచనలను—గ్రంథములను చదివి—పాఠకులు కొందరు సంపాదకునికి

ప్రశంసలను—ప్రశ్నలను పంపుచున్నారు. అట్టి ప్రశంసలకు—ప్రశ్నావళికి—లేఖలకు యీ శంకరకృపతో నెట్టి సంబంధము లేదు. ఆ ప్రశ్నలను యీ పత్రికలో సమాధానము లిచ్చుటకు వీలులేదు. పాఠకులు మన్నింపవలెను.

5. శృంగేరికి యాత్ర చేయుటకు అభిప్రాయమున్న పాఠకులు కొందరు అక్కడ వసతి సౌకర్యములను చేసిపెట్టుటకు శ్రీ శంకరకృప సంపాదకునికి వ్రాయుచున్నారు. శ్రీ శంకరకృప సంపాదకుడు — శృంగేరికి వ్రాసి ఏర్పాట్లు చేయుట కాలస్యమగును. ఎవరికి వారు నేరుగా క్రింది చూపిన చిరునామకు వ్రాసికొనవచ్చును.

శ్రీ శృంగేరి జగద్గురువుల ఆప్తకార్యదర్శి
శృంగేరి శారదా పీఠము
శృంగేరి (కర్ణాటక) 577139

లేఖలు ఏ భాషలోనైనా వుండవచ్చును. తెలుగులోగాని, ఆంగ్లమునగాని, సంస్కృతమునగాని, తమిళమునగాని, కన్నడమునగాని, హిందీ భాష యందుగాని వ్రాయవచ్చును.

ఆప్తకార్యదర్శి శ్రీ జగద్గురువులకు లేఖలను యథాతథముగా వినిపించి శ్రీ జగద్గురువుల ఆనతుల మేరకు సమాధానములు వ్రాయును. శ్రద్ధ తీసికొనెదరు. ఆలస్యముండదు.

శ్రీ జగద్గురువులు సంచారమునందున్నప్పుడు—ముకాము చేసియున్న చోటకు లేఖలు వ్రాయవచ్చును. అప్పుడు కూడ శృంగేరికే వ్రాయవచ్చును. అయితే సమాధానములు ఆలస్యమగును.

6. శ్రీ జగద్గురువులు అవ్యాజ వాత్సల్య కరుణామూర్తులు. భేదమును విడిచిచేసిన హృదయము కలవారు. ఎల్లరకు సులభులు. కాబట్టి సంకోచముపేక్షించుండా ఎవరైనప్పటికి — ఆప్తకార్యదర్శి పేర తమకు వచ్చిన భాషలో — తమ కష్ట సుఖములను లేఖ వ్రాసి శ్రీ జగద్గురువుల ఆశీస్సు లనుగ్రహములను పొందవచ్చును.

(సంపాదకుడు)

ఒక ప్రశ్న: "నేను మధ్యవయస్కురాలిని భర్త లేడు సంతానము లేదు. కొంత వైరాగ్యమున్నది. జీవనమునకు బాధలేని ఆస్తి వున్నది. నాకు కొందరు స్త్రీ సన్న్యాసులు, కొందరు పురుష సన్న్యాసులు—సన్న్యాస మిచ్చెదను తీసికొమ్మని ఆస్తి తమకు వ్రాయుమని—బలవంతము చేయుచున్నారు. నేను సన్న్యాసమును తీసికొనుట సమంజసమా?" అని ఒక పాఠకురాలి ప్రశ్న.

సంపాదకుని సమాధానము:

ఇటువంటి ప్రశ్నకు ముందెన్నియో పర్యాయములు సూచనగా సమాధానములు చెప్పబడినవి. స్పష్టముగా మరియొకసారి చెప్పుచున్నాము.

'సన్న్యాసమనగా'—ఏదో లాంఛనముగా తీసికొని—అందువలన ఏ దోష మహత్తు సంక్రమించినదని—దైవత్వము లభించినదని—విఱ్ఱవీగుచు ఆర్భాటముగా బ్రదుకుట కాదు.

సన్న్యాస ధర్మములను విశ్వేశ్వర స్మృతి—నారద పరివ్రాజకోపనిషత్తు—మొదలగు గ్రంథములందు చెప్పబడినది. విరాగితా ధార్వహత్వముతోబాటు—ఎవరియందుగాని ఎట్టి అనుబంధమును నిలుపుకొనక—గ్రామైకరాత్రముగా తరుతల వాసము—కరతల భిక్ష—మొదలగు ప్రవర్తనతో సంచరింపవలెను. సన్న్యాసము తీసికొని మరియొక క్రొత్త విధమైన సంసార లంపటత్వము—అనుబంధ బంధములను—పెంచుట కాదు. శ్రీ శంకర భగవత్పాద ప్రతిష్ఠాపిత చతురామ్నాయ మఠాధిపతుల సంగతి వేరు, వారికి విశేష ధర్మములున్నవి. పులిని చూచి నక్క వాత పెట్టుకొనరాదు. స్మృతులందు, శ్రుతులందు చెప్పబడిన సన్న్యాస ధర్మములను—స్త్రీలు—దుర్బల మానసికస్థితి గలవారు—ఆచరింపలేరు. అందుకని మన మతమున స్త్రీలకు సన్న్యాసము లేదు.

బౌద్ధమతమున స్త్రీలలో పరివ్రాజికలుండిరి. స్త్రీలు పురుషులు సన్న్యాసులై ఆరామములందు ఏకప్రదేశ వాసము చేయుచు యథేచ్ఛా విహారులై బౌద్ధమతమునే నిర్మూలించిరి. స్త్రీలను పరివ్రాజికలను చేయుదుమని చెప్పువారేమి చెప్పుచున్నారో వారికేమి ప్రమాణమో—చెప్పలేము.

స్త్రీలు విరాగులుగా నుండవచ్చును—తప్పులేదు. నిస్సంగులుగా నుండవచ్చును. పూర్వజన్మ సంస్కారమువలన అనభ్యస్తములైన సాధనలు వారికి తెలిసియుండవచ్చును. ఉన్నతి సాధనా కర్తవ్యలను సాధింపవచ్చును. అంతయు సరియే.

పరివ్రాజికలని పేరు పెట్టుకొనకపోయిన నేమి? ఉన్న యిల్లు వదలి—మరియొక యిల్లు కట్టుకొనకపోయిన నేమి? తన్ను ఆదరించి ఆదుకొను ఆ జన్మ బంధువులను త్యజించి క్రొత్త చుట్టములను (చుట్టుకొని యుండువారు చుట్టములు) కల్పించుకొనకపోయిన నేమి? పెద్ద ఆర్భాటముతో వీధులనుబడి ప్రబోధ నాటక రంగస్థలము లెక్కపోయిన నేమి? ఉన్నచోటనుండి రాగద్వేషాది ద్వంద్వములనువీడి మహాత్ములు బోధించిన సాధనా మార్గము శ్రద్ధగా అనుసరించి ఉన్నత సోపానములను ఆరోహింపవచ్చును. అక్కరలేని క్రొత్త ధర్మములను స్వీకరింతునని ప్రతిజ్ఞ చేసి ఆ ధర్మ భంగములను చేయుటవలన మేలుకంటె విప్రతిపత్తి యెక్కువ కలదు.

బృహదారణ్యక భాష్యాదులందువి నిర్ణయింపబడిన (అధికారో వ్యుత్థానే) సన్న్యాస యోగ్యతా విషయములను గురించి వివాదమువలన ప్రయోజనము లేదు. కావలసినది నిజమైన వైరాగ్యము. చేయవలసినది సాధన.

సమాధానములోని లోతుపాతులను పృచ్ఛకులు గ్రహింపవలెను. అప్రియముగా నున్నచో మన్నింపవలెను. (సంపాదకుడు)

---

# శృంగేరీ వార్తలు

అశ్వీయుజ శుద్ధ పాడ్యమి మంగళవారము శృంగేరిలో శరన్నవరాత్రి ఉత్సవములు శ్రీ శారదాంబా విశేషోత్సవములు (పౌర్ణమి వరకు) ప్రారంభమైనవి. శృంగేరిలో జరుగు అన్ని ఉత్సవములకు శిష్యజనము బహు సంఖ్యలో వచ్చి పాల్గొని తీర్థ ప్రసాదములను గ్రహించి — శ్రీ పీఠదేవతల అనుగ్రహమును, శ్రీ జగద్గురువుల ఆశీస్సులను పొందుచున్నారు.

ఇటీవలి కాలమున ఆంధ్రదేశమునుండి ఎక్కువగా శిష్యజనము టూరిస్టు బస్సులలో వచ్చుట జరుగుచున్నది. క్రొత్తగా నిర్మింపబడిన [illegible] దేవస్థానమువారి ధర్మశాలలు కూడ యాత్రికులకు సౌకర్యములను సమకూర్చుచున్నవి.

శృంగేరిలో జరిగిన శ్రీ శారదాంబా విశేషోత్సవములను గురించిన ప్రత్యేక విశేషములు రానున్న సంచికలో ప్రకటింపబడును.

శ్రీ శరన్నవరాత్రి ఉత్సవములు శృంగేరి శాఖా మఠములు అన్నిటియందు [illegible] జరిగినవి. [illegible] శ్రీ [illegible].

[illegible] శంకరమఠమున ఉత్సవములు, హైదరాబాదులో (నల్లకుంట) శంకరమఠములో జరిగిన ఉత్సవములు బహుజనాకర్షణతో చక్కగా జరిగినవి. [illegible] రాజమండ్రి [illegible] మఠములందు కూడ ఉత్సవములు యథాశాస్త్రీయముగ జరిగినట్లు వార్తలు వచ్చినవి.

శ్రీ జగద్గురు మహాసన్నిధానమువారు శిష్య స్వామి సహితులై పరివారము వెంటరాగా శృంగేరి నుండి 22వ తేదీ సాయంత్రము బయలుదేరునపుడు పురజనము శీఘ్ర పునరాగమనము కోరుచు విన్నపములు చేసిరి. శ్రీ జగద్గురువులు చిక్కమగళూరు హాసను పురములలో మజిలీలు చేసి 24 సాయంత్రము మైసూరు పురము చేర స్వకీయ మఠమున విడిది చేసిరి. అక్కడ శ్రీ మహాసన్నిధానమువారి వర్ధంతి ఉత్సవము శరదుత్సవముగా నడచిన వివరములు రానున్న సంచికలో ప్రకటింపబడును.



# శ్రీ శంకర కృప

దక్షిణామ్నాయ
శ్రీశృంగేరి శారదాపీఠమువారి యాజమాన్యమున వెలువడు
ఆధ్యాత్మిక మాసపత్రిక


| | | |
|---|---|---|
| సంపుటి: 21 | వెల రు. 1 డిశంబరు, 1981<br>సంవత్సర చందా రు. 10/- | సంచిక: 4 |

దుర్మతి మార్గశిర - పుష్యము (శకాబ్ది ౧౯౦౩)






సన్న్యాసాశ్రమ స్వీకార స్వర్ణోత్సవము జరిగిన
శ్రీజగద్గురు మహాసన్నిధానమువారు.

# శ్రీ శంకర కృప

సంపాదకులు: తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

| | | |
|---|---|---|
| సంపుటి 21 | శంకరశ్శంకర స్సాక్షాత్ వ్యాసో నారాయణో హరిః | సంచిక 4 |


## శ్రీ శంకర భగవత్పాదాచార్య విరచిత

## శ్రీమత్త్రిపురసుందరీ వేదపాద స్తోత్రము

శ్లో॥ ముంచ పంచకతాం చిత్త పామరం చాపి దైవతం।
గృహాణ పదమంబాయా ఏత దాలంబనం పరమ్॥ 67

(దీనియందున్న వేదపాదము కాఠము నందలిది)

ఓ చిత్తమా! మోసమును చేయుచు నటు నిటు తిరుగుటమానుము. సామాన్య దేవతలను కొలుచుట కూడ విడువుము. పరదేవతయైన శ్రీ అంబిక పాదములను పట్టుకొనుము. అదియే నీకు పరమమైన—గొప్పదైన ఆధారము. (పట్టు గొమ్మ).

విశేషములు: శ్రీదేవి పాదాబ్జములే పరమమైన ఆలంబనము అని చెప్పుటవలన శ్రీదేవి పాదాబ్జములందు సమైక్యత పొందుటయే మోక్షమని తాత్పర్యము.

చిత్తము చాంచల్యమును విడచి—విషయ లంపటత్వమును త్యజించి—మోక్ష ప్రదాతృత్వము లేని సామాన్య దేవతలను సేవించుట మానుకొనవలయునని చెప్పిరి. పరబ్రహ్మరూ యగు శ్రీదేవి పాదములను ఆశ్రయించి—తదైక్యము పొందుట మోక్షముగాని—పరబ్రహ్మము కాని—సగుణ దేవతలను కొలిచి తద్దత్వరాదులవలన నిష్ప్రయోజనమని వెల్లడించినారు.

శ్రీ భగవత్పాదులు కావ్య మర్యాదను పాటించుచు శ్రీదేవి పాదాబ్జములను పట్టుకొనుట పరమమైన గతియని—తెలిపినారు.

శ్రీదేవి పాదాబ్జములనగా పరబ్రహ్మమేనని [illegible]దని – అది మోక్షమని.

# శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీ మహాస్వామి చరణ స్మరణమ్

(గతసంచిక తరువాయి)

## గురుభక్తి

ఒక శిష్యుడు, చాల శ్రద్ధ కలవాడు—నిత్యజపము చేసికొనునప్పుడు కలుగు కష్టము నొకదానిని శ్రీ జగద్గురువులకు తెలిపి పరిష్కారమును అర్థించుటకు వచ్చెను.

శిష్యుడు: నేను కొన్ని మంత్రముల ఉపదేశమును పొందితిని. అవి వేరు వేరు దేవతలకు సంబంధించినవి. ప్రతిదానికి వేరు వేరు ధ్యాన శ్లోకము లున్నవి. ధ్యాన శ్లోకమునందు వర్ణించబడిన మూర్తి కొంతెప్పుడు ఆనాకర్షణముగా నుండుట మాత్రమే కాదు—ఊహించుటకు అలవికాని విధముగ కూడ నుండును. కష్టపడి మనస్సును నిలుపుకొని ఆ రూపమును ఊహించుకొన గలిగినప్పుడు—ఆ రూపము జుగుప్సాకరముగ తోచుట కూడ కలదు. అందుచేత క్షణము కంటే మనసా రూప మును నిలుపుకొనుటలేదు. మరియు ఒక జపము తరువాత మరియొక జపము ప్రారంభించునపుడు మరియొక రూపమును సంభావింపవలసి వచ్చుచున్నది. అట్లు చేయుట దుస్సాధ్యముగా నున్నది. ఫలితమేమనగా నా కెంత శ్రద్ధయున్నను జపము కష్టముగా నున్నది.

శ్రీ జగద్గురువులు: ఒక ప్రత్యేక వాంఛ పెట్టుకొని తదుచిత దేవతా జప మును నీవు చేయుచున్నావా? అట్లయినచో—ఆ ధ్యాన శ్లోకమునందు వర్ణింపబడిన దేవతామూర్తినే మనస్సునందు—కష్టపడి—నిలుపుకొనవలెను.

శిష్యుడు: నాకు ప్రత్యేకమైన లక్ష్యమేదియు దృష్టియందు లేదు.

శ్రీ జగద్గురువులు: అనగా చిత్తశుద్ధిని సాధించి పరమేశ్వరానుగ్రహమును పొందుటయే లక్ష్యమన్నమాట.

శిష్యుడు: అంతే.

శ్రీ జగద్గురువులు: అయితే నీవు మనస్సును బాధించి—ధ్యాన శ్లోక రూప ములపై మనస్సును నిల్పుకొన నక్కఱలేదు.

శిష్యుడు: అనగా ధ్యాన శ్లోకములను చెప్పనక్కరలేదవియా?

శ్రీ జగద్గురువులు: కాదు. ఆ శ్లోకములను చెప్పవలసినదే.

శిష్యుడు: ధ్యాన శ్లోక వర్ణిత దేవతా రూపములను మనస్సున కల్పించుకొన నక్కరలేకుండ ఆ ధ్యానశ్లోకములను చదువుట దేనికి?

శ్రీ జగద్గురువులు: నేను మనస్సున రూపకల్పన చేయ నక్కరలేదని చెప్పలేదు.

శిష్యుడు: మరి మనస్సు నందొక రూపమును దర్శింపవలెనని—ఆ రూపము ధ్యాన శ్లోక వర్ణితము కానక్కరలేదని చెప్పినచో—రెంటికిని విభేదము—విరుద్ధమే అగుటలేదా?

శ్రీ జగద్గురువులు: కాదు—మనస్సునందు కల్పించుకొన్న రూపము ఆ మంత్ర దేవతా రూపమును కూడ సమన్వయించుకొన్నప్పుడు.

శిష్యుడు: అయితే భగవంతుని సర్వ రూపాత్మక విశ్వరూపమును మనస్సునందు కల్పించుకొనవలెనని తాత్పర్యమైనచో—అది మరి యెంతో దుష్కరము. దుర్భరము. అర్జున దట్టి రూపమునే చూడలేకపోయెను. ఇక సామాన్యు డట్టి రూపమును ఊహించుకొని మనస్సునందు నిల్పుకొనకల్గునా? నిల్పుకొనలేడు.

శ్రీ జగద్గురువులు: విశ్వరూప భావనము చేయుట కష్టమని, దానిని మనస్సునందు నిల్పుకొనుట దుస్సాధ్యమని నీ వన్నది నిజమే. అయితే నేను చెప్పునదట్టి రూపమును మనస్సునందు కల్పించుకొనుమని కాదు.

శిష్యుడు: అయితే శ్రీ జగద్గురువులే రూపమును మానసికముగా సంభావింప మందురు?

శ్రీ జగద్గురువులు: కొంతసేపు మనస్సున కష్టము లేకుండ నిల్చునదియు, ఆకర్షణ కలిగినదియు ప్రసన్నమైనదియు అయి ఉండవలయునని కదా నీ అభిప్రాయము?

శిష్యుడు: చిత్తము.

శ్రీ జగద్గురువులు: ఆ రూపము ఊహాకల్పితము కాక ఇదివరకే ఉనికి కలిగినదై ఉన్నచో మరింత మేలు కదా!

శిష్యుడు: అవును.

శ్రీ జగద్గురువులు: ఆ రూపమునకు మనస్సు ఆకర్షణ కల్పింపనక్కరలేక—అది సహజముగా ఆకర్షణ కలిగియున్నచో మరియు మేలుకదా!

శిష్యుడు: ఔనౌను.

శ్రీ జగద్గురువులు: పూర్వ కాలము వారి కట్టి భార ముండిన దేమో. మనకు లేదు.

శిష్యుడు: అదెట్లు?

శ్రీ జగద్గురువులు: నీవు మా గురువులను దర్శించియుంటివా?

శిష్యుడు: ఔను. దర్శించితిని.

శ్రీ జగద్గురువులు: నీవు వారి నొకే పర్యాయము చూచియుండినను, నీ మనస్సుపై చెరగని ముద్ర పడియుండవలెను. అందుచేత నీవు వారి రూపమును మనస్సు ముందు నిలుపుకొనుట సులభమే.

శిష్యుడు: ఔను.

శ్రీ జగద్గురువులు: వారు ఆకర్షించు మూర్తి కలవారు. ఆ మూర్తిని మనోనేత్రముల ముందు నిలుపుకొనుట సంతోషకరము.

శిష్యుడు: నిజమే.

శ్రీ జగద్గురువులు: ఇచ్చట నీవు కోరిన రెండు లక్షణము లున్నవి. తేలికగా సంభావన చేయతగిన మూర్తి. ఆకర్షణశక్తి కలది. ఒక రూపమును ఊహించుకొని దానిని ఆకర్షణ కలదానిగా సంభావించుకొనుట కంటె—ఇచ్చట నీవు దర్శించిన మూర్తి—బహువిధముల ఆకర్షణ కలది సిద్ధముగా నున్నది.

శిష్యుడు: నేను శివ, లేక విష్ణు జపము చేయుచుండగా శ్రీవారి మూర్తిని మనస్సునందు నిలుపుకొనుట సమంజసమా? విరుద్ధము కాదా?

శ్రీ జగద్గురువులు: ఏల? నీవు తెలియునుకదా—"గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః గురుస్సాక్షాత్ పరంబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః"—గురు వనగా మన అవగాహన—ఆయన నిర్గుణ పరబ్రహ్మమనియే. కాబట్టి దానియొక్క గుణవిశేష హారములు అవతారములు ఉన్నవి. అందుచేత ఏదో ఒక దేవతయొక్క జపము చేయునప్పుడు అధ్యానమూర్తిగా శ్రీ గురువును సంభావించుటలో దోషము లేదు. ఆ దేవతామూర్తి సహజముగా గురుమూర్తియందున్నది.

శిష్యుడు: అనగా ఏ మంత్రమును జపించుచున్నను గురుమూర్తిని మనస్సునందు నిలుపుకొనవచ్చునని తాత్పర్యమా?

శ్రీ జగద్గురువులు: ఏల కారాదు? తరువాత జపింపబోవు మంత్రముయొక్క దేవతామూర్తి కూడ యీ రూపమునందే యిమిడియున్నప్పుడు మార్పు చేయవలసిన ఆవశ్యకత యేమి? శాస్త్రములు గోవుయందు బ్రాహ్మణునియందును సర్వ దేవతామూర్తు లున్నవని చెప్పుచుండగా—ఆయన్ని దేవతామూర్తులు గురువునందున్నవని చెప్పుటకు శంకలేనే లేదు. సామాన్యముగా చూచినను—మా గురువులు బ్రాహ్మణశ్రేష్ఠులు,

ఉత్తమాశ్రమములు, అత్యుత్తమ ఆధ్యాత్మిక పీఠస్థులు, ఆత్మసిద్ధులు, — ఆయన నీవు తలచిన దేవతామూర్తికి ప్రాతినిధ్యము వహింపలేరా? (సశేషము)

—:o:—

# శ్రీ జగద్గురు శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామి చరణుల ఉపదేశము

భగవద్గీత ద్వితీయాధ్యాయమున స్థితప్రజ్ఞుని విషయమునందు ప్రజ్ఞయనగా సత్యమును గురించిన జ్ఞానము. ఇది రెండు విధములు. స్థిరము, అస్థిరము. తనచుట్టు ఉన్న ప్రాపంచిక విషయములతో సంబంధమున్నట్లు తోచినను—పరమ వైరాగ్య ముండి యోగసిద్ధుడైనవాడు సత్యస్థితుడే అగును. ఉదాహరణకు వశిష్ఠమహర్షిని చూపవచ్చును. (ఏవం తత్త్వేపరే శుద్ధే ధీరో విశ్రాంతిం ఆగత। తదేవ అస్వాదయన్ అంతర్బహిః వ్యవహార నపి) కాని అప్పుడప్పుడు సత్యమును అనుభమునకు తెచ్చు కొనుచు మరల దూరమగు విషయము అస్థిరము.

సమాధి యందు అన్ని వాంఛలు పరిత్యజింపబడగా మనస్సు చలింపదు. ఆనంద స్థితియందు విశ్రాంతి. ఆత్మ స్వప్రకాశ చైతన్యమన్న జ్ఞాన స్థితి. అప్పుడు సకల ఇంద్రియ విషయములనుండి విరాగిత. రజస్తమో గుణములనుండి పరిపూర్ణమైన స్వేచ్ఛ లభించినప్పుడే నిజమైన వివేకము. సత్త్వగుణము సుఖోన్ముఖము. సుఖానుభవ వాంఛ కలిగినచో స్పృహ కలిగి వివేకము అస్థిరమగును.

శుభాశుభ సన్నివేశములలో రాగద్వేషములు లేకుండ సున్నవానికి స్థిర వివేకము. వాడు స్థితప్రజ్ఞుడు.

> యస్సర్వత్రాఽనభి స్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్
> నాఽభి నందతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ (గీ 2-57)

(ఎవడు దేహ జీవితాదులయందు స్నేహము లేనివాడై శుభము వచ్చినపుడు హర్షముగాని అశుభము సంభవించినపుడు విషాదముగాని పొందకుండునో అట్టివాని యొక్క ప్రజ్ఞ స్థిరమగును.)

తాబేలు భయము వలన తన అవయవము లన్నియు సర్వపదార్థములనుండియు ఆకర్షించి ముడుచుకొనునట్లు, ఎప్పుడు జ్ఞాననిష్ఠుడగువాడు తన యింద్రియము లన్ని టిని విషయముల వెంట బోనీయక యాకర్షించి తన స్వాధీనము చేసికొనుచున్నాడో అప్పుడు స్థితప్రజ్ఞుడగును.

యదా సంహరతే చాఽయం కూర్మోఽఙ్గానీవ సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥ (గీ 2-53)

స్థిత ప్రజ్ఞుని మనస్సు—సమాధియందు లేనప్పుడు కూడ విషయ లంపటము కాదు. లోకమునుండి పారిపోవుట కాదు. అంటకుండ నుండుట. సమాధి యందు లౌకిక విషయముల గురించి తెలియనే తెలియదు. ఇక్కడ తరతమ భేదములను చూపించుటకు కాదు. స్థిరమైన ప్రజ్ఞను పొందుటకు.

—‡—

# శ్రీ జగద్గురు భారతీ తీర్థస్వామి చరణాల ఉపదేశము

## (తిరునల్వేలిలో చేసిన అనుగ్రహ భాషణము)

లోకమున జనులందరకు పుణ్యమును గురించి పాపమును గురించి తెలియును. మంచి పనులు చేయుట పుణ్యమని, దుష్కర్మలు చేయుట పాపమని జను లెరుగుదురు. ఆశ్చర్యకరమైనదేమనగా పుణ్యమేమిటియో తెలిసి పుణ్యము చేయవలె నని, పాపము చేయ కూడదనియు తెలిసి కూడ మానవుడు పాపమునే చేయు చుండుట.

“నీవు రాజరాజువు—ఇట్లేల ప్రవర్తింతువు?” అని దుర్యోధనుని ప్రశ్నింపగా—అతడు “జానామి ధర్మం నచ మే ప్రవృత్తిః జానామ్యధర్మం నచ మే నివృత్తిః” అని సమాధానము చెప్పెను. అనగా “నాకు ధర్మమున్న నేమిదియో తెలియును. అయితే దానిని ఆచరించుటకు నా మనస్సు ఉన్ముఖముగా లేదు. నాకు అధర్మమన్న నేమియో తెలియును. అయితే నా మనస్సు తదున్ముఖముగా నున్నది. నేనేమి చేయ గలను” ఇది ఆశ్చర్యకరమైన విషయము.

శ్రీ కృష్ణపరమాత్మ చేసిన బోధను విన్న తరువాత అర్జునుడు భగవంతుని ప్రశ్నించెను—“నీవు చెప్పినది నేను గ్రహించితిని. అయితే మానవులను చూడగా విచిత్రమైనదొకటి తోచుచున్నది.

“అథ కేన ప్రయుక్తోఽయం పాపంచరతి పూరుషః
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః ॥”

(మానవునికి పాప మేమిటో తెలియును. పాపము చేయుటకు అతడు వెను

కాడును కూడ—కాని ఎవరో అతనిని ఆ పాపము చేయుటకు బలపెట్టుచున్నట్లు తోచుచున్నది. కారణమేమి?) భగవంతుడు సమాధానము చెప్పెను.

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహా పాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్॥

రజోగుణ సముద్భవములైన కామము, క్రోధము—అను రెండును మానవునికి బలమైన శత్రువులు. మానవుని వెనుకనుండి అధర్మాచరణమునకు పురిగొల్పున వీ జంటయే. ఈ రెంటి నుండి విముక్తి సాధించినచో అధర్మాచరణకు ప్రోత్సాహ ముండదు.

కామ మనగా కోరిక, వాంఛ. తాను కోరినవి తనకు లభించనిచో కలుగునది క్రోధము. లేక తనకున్న దానని మరొకడు పొందినప్పుడు కూడ క్రోధము కలుగును. క్రోధము కలిగినవానిని గురించి "క్రుద్ధో హన్యాద్గురూన్ అపి" అని చెప్పుదురు. (కోపావేశము కలవాడు గురువునకు అపాయము కలిగించుటకు కూడ సిద్ధపడును). కోపము మిక్కిలి చెడ్డది. కామము క్రోధము మానవుని చేత పాపము చేయించు బలమై శత్రువులు. పాపాచరణమునుండి వై తొలగుటకు—యీ శత్రువులనుండి దూరమగుటకన్న వేరొక తేలిక మార్గము లేదు. ఇది శ్రీకృష్ణ పరమాత్మ అభిప్రాయము. కామము క్రోధము వాటి కుటుంబములోని మోహ లోభాదులు—ఎట్లు విజృంభించునో శాస్త్రములందు చెప్పబడినది.

మాధవీయ శంకరవిజయమున (అయిదవ అధ్యాయము) శ్రీ శంకరభగవత్పాదులు చిన్ననాటి విషయములు వర్ణింపబడినవి. ఆయన కామ క్రోధ లోభ మద మాత్సర్యములను జయించెనట. ఆయన జయమెట్లు సాధించెను? ఆ వివరములను చెప్పినచో ఆసక్తి కలవారు ప్రయత్నము చేయవచ్చును.

కోరికలు లేకుండ చేసికొనుటెట్లు? కోరదగిన వస్తువులు సారహీనములని నిశ్చయించుకొనవలెను. అనగా వస్తుతతివలన ప్రయోజనమేమియు లేదని గ్రహింపవలెను. ఒక వస్తువు అవసరమైనదని, ముఖ్యమైనదని భావమున్నప్పుడే దానిపై వాంఛ కలుగును. త్రోవను పోవుచున్నప్పు డెన్నియో వస్తువులు కంటపడును. మనమా అన్నిటిని కోరుకొనుటలేదు. ఏల? ఆ వస్తువు లన్నియు ముఖ్యములని మన మెంచుటలేదు కాబట్టి. ఏ వస్తువుపైనగాని కోరిక కల్గినప్పుడు అది ఆవశ్యకమన్న భావముకూడ నున్నదన్నమాట. ప్రపంచమునందే వస్తువుగాని ముఖ్యమైనది కాదన్న నిశ్చయము కలిగినప్పుడు దేనిపై కోరికలు కలుగును? అనగా కోరికలను నిర్మూలించు

కొనుటకు యే వస్తువు గాని సారమున్నది కాదన్న భావమును ప్రబలము చేసికొన వలెను.

> అసారమేవ సంసారం దృష్ట్వా సారదిదృక్షయా
> ప్రవ్రజన్త్యకృతోద్వాహాః పరం వైరాగ్య మాశ్రితాః ॥

శ్రీ భగవత్పాదులు సన్న్యాసమేల స్వీకరించిరి?

అసారమేవ సంసారం మత్వా

లోకమున దేనినిగాని అనుభవించి సాధింపగల ప్రయోజనమేమున్నది? దేని యందుగాని ప్రత్యేకత లేదు. లోకమున నున్న భోగము లన్నియు క్షణికములు. అనగా తొలుత అవి సుఖకారకము లన్నట్లు భ్రమ కలిగించును. తీవ్ర పరిశీలన చేయగా కాదని స్పష్టమగును. మనకు లేని వస్తువు విలువ కలదిగా—సుఖకారిగా తోచును. దానిని సంపాదించిన తరువాత అది యంతయు నిజముకా దనిపించును. తొలుతనే అది ముఖ్యమైనది కాదన్న భావమున్నచో—దానికొరకు ప్రయత్నించుట ఉండదు. కనుక కోరికను నిర్మూలించుకొనుటకు వస్తువులయొక్క—అసారత్వమును గ్రహించవలెను. మరియొక మార్గము లేదు. (సశేషము)

---

## ఆంధ్ర దేశమున ఆస్తిక మహాజనులకు విజ్ఞప్తి

శ్రీ శృంగేరి జగద్గురు శంకరాచార్య శ్రీమదభినవవిద్యా తీర్థమహాస్వామి వారు, శిష్యస్వాములైన శ్రీ జగద్గురు భారతీస్వామి చరణులును, పరివారజనమును వెంటరాగా ఫిబ్రవరి మొదటివారము నుండి మార్చి నెల మధ్యభాగమువరకు ఆంధ్ర దేశ సంచారము చేయుచున్నారు.

ఆంధ్రదేశమున ఆస్తిక మహాజను లందరు యీ సదవకాశమును వినియోగించు కొని శ్రీ జగద్గురువులను దర్శించి సేవించి శ్రీపీఠదేవతలను అర్చించి ఇహపర శ్రేయస్సులను సంపాదించుకొందురని తలచుచున్నాము—

శ్రీవారి సంచార కార్యక్రమమున కొన్ని ముఖ్య ఘట్టములు :

మదరాసు నుండి ఫిబ్రవరి మొదటి వారమున బయలుదేరి తిరుమలనాధుని దర్శించి నెల్లూరు, ఒంగోలు, గుంటూరు, నల్గొండ మీదుగా 11 ఫిబ్రవరి కాళేశ్వరమును చేరి 12 ఫిబ్రవరి అక్కడ కాళేశ్వరుని ఆలయమున కుంభాభి షేకము జరిపించుట. ఆంధ్ర రాజధాని నగరమున మహాశివరాత్రి ఉత్సవ

మును జరుపుట. జగ్గయ్యపేట సమీపమున శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయ ప్రతిష్ఠ జరుపుట. ఆంధ్ర రాజధాని నుండి మార్చి రెండవ వారమున బొంబాయి మార్గమున వెళ్లుట.

—సంపాదకుడు

## సంస్కృతభాషను మనమేల ఆదరించి నేర్చుకొనవలెను? (46)

ఈ ప్రశ్నకు మన దేశంలో మేధావివర్గంలో మూర్ధన్య మనీషామణులు సమాధానాలు చెప్పారు. గత సంచికలందు కొన్నిటిని తెలుసుకున్నాము. ఇప్పుడు మరికొన్ని. (సంపాదకుడు)

### శ్రీ కైలాసప్రకాశ
(శిక్షామంత్రి ఉత్తర ప్రదేశ్)

మనము జాతీయ ఐక్యత కావలెనని ప్రసంగము చేయుచున్నాము కాని—ఆ జాతీయైక్యత ఎట్లు లభించునో ఆలోచన చేయుటలేదు. జాతీయైక్యతయొక్క ప్రాణతత్త్వము సంస్కృతి-చేతన యందు నిహితమై యున్నది. మనము మన జాతీయతకు చేతనకు సుదృఢ రూపమునందు పరినిష్ఠితభావము కోరుచున్నట్లయితే — మనము భారతీయ సంస్కృతి—భారతీయ భాషయగు సంస్కృతమునందు ఆదరము పూనవలసి యున్నది.

సంస్కృతశిక్షా పరిషద్ ఉద్ఘాటన భాషణ
నుండి—గాజియాబాద్ 3 జనేవరి 1964

### శ్రీమతి మహాదేవివర్మా
(మహా కవయిత్రి—హిందీ)

సంస్కృత సాహిత్యము మానవతావాద సాహిత్యము. దీనియందు చేతనయొక్క వ్యాపకత, కరుణాధర్మములు మిళితమై సన్నిహితములై యున్నవి. ఈనాడు జ్ఞానోపదేశము చేయువారు, స్వీకరించువారు—ఉభయులు సంస్కృత సాహిత్య ఉదాత్త విచారధారయొక్క వికాశమును గ్రహింపవలసిన ఆవశ్యకత యున్నది.

అఖిల భారత సంస్కృత పరిషత్
లక్నో వివరణ పుస్తికా 16 డిశంబర్ 1952.

# శ్రీ శంకర భగవత్పాద విరచిత వేదాంత డిండిమము

## వ్యాఖ్యానము: శ్రీ తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

(గత సంచిక తరువాయి)

శ్లో॥ శ్రోతవ్యాఽశ్రవ్యరూపౌ ద్వౌపదార్థౌ సుఖదుఃఖదౌ
శ్రోతవ్యం బ్రహ్మనైవాఽన్యదితి వేదాంత డిండిమః॥ (8)

తా॥ శ్రవణము చేయవలసినది శ్రవణము చేయగూడనిది—అని రెండు పదార్థములు. ఇందు మొదటిది సుఖమిచ్చునది. రెండవది దుఃఖమిచ్చునది. వినవలసినది బ్రహ్మమే. ఇతరము వినగూడదని వేదాంత డిండిమము.

విశేషము: శ్రవణము బ్రహ్మమును గురించియే. అది యొక్కటియే సత్యము—ఉన్నది. లేనిదానిని గురించి—మిథ్య యగుదానిని గురించి విని యేమి ప్రయోజనము?

శ్లో॥ చిన్త్యాఽచిన్త్యౌ పదార్థౌ ద్వౌ విశ్రాన్తిశ్రాన్తి దాయకౌ
చిన్త్యం బ్రహ్మపరంనాఽన్య దితి వేదాంత డిండిమః॥ (9)

తా॥ చింత్యము అచింత్యము అని రెండు పదార్థములు. అందు మొదటిది విశ్రాంతి నిచ్చునది. రెండవది శ్రమ యిచ్చునది. చింత్యము పరబ్రహ్మమే గాని యితరము కాదని వేదాంత డిండిమము.

విశేషము: చింతన చేయుట యనగా మననము చేయుటయే. శ్రవణము చేసిన దానినే మననము చేయవలయును గాన—శ్రవణము చేసిన పరబ్రహ్మమును గురించియే మననము—చింతన చేయవలయునని.

శ్లో॥ ధ్యేయాఽధ్యేయౌ పదార్థౌ ద్వౌధీ సమాధ్య సమాధిదౌ
ధ్యాతవ్యం బ్రహ్మనైవాఽన్యదితి వేదాంత డిండిమః॥ (10)

తా॥ ధ్యేయము అధ్యేయమని రెండు పదార్థములు. అవి బుద్ధికి సమాధినీ—సమాధి లేమిని కలిగించునవి. ధ్యేయము బ్రహ్మమే—యితరము కాదని వేదాంత డిండిమము.

విశేషము: శ్రవణ మననములను చేసిన దానిని నిది ధ్యాస చేయవలెను. అనగా ధ్యేయమైనది. బ్రహ్మమును గురించియే శ్రవణ మననములు కావున అదియే దానిని గురించియే నిది ధ్యాస.

(సశేషము)

# శ్రీ విద్యారణ్య విజయగాథ



16

శ్రీ విద్యారణ్యులు శృంగి వెంటరాగా బదరీవనమునకు వెళ్లిరి.

వారికచ్చట వేదవ్యాసుల దివ్యదర్శన మయ్యెను.



# శ్రీ శంకర భగవత్పాద విరచిత
# వివేకచూడామణి
## (శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామి విరచిత వ్యాఖ్యాసమేతము)

ఆంధ్రీకరణము: డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు(వేదాంత శిరోమణి, విద్వాన్ ఎం. ఏ. (సంస్కృత, ఆంగ్ల హిందీ) పి. హెచ్‌డి.

(గత సంచిక తరువాయి)

అవ. నచకర్మకోటిభిః అని చెప్పుటచే వైదిక కర్మల అపేక్ష ఏమాత్రమును లేదా అను శంక కల్గగా ఆ వైదిక కర్మలు కూడ చిత్తశుద్ధికై ఆవశ్యకములే అని చెప్పుచు బంధ మోక్షములు కలిగించు ఆత్మ సాక్షాత్కారమునకు ఆ చిత్తశుద్ధి కారణమని చెప్పుచున్నారు.

మూ. శ్రుతిప్రమాణైక మతే స్వధర్మ
నిష్ఠాతయైవాత్మ విశుద్ధిరస్య
విశుద్ధ బుద్ధేః పరమాత్మ వేదనం
తేనైవ సంసార సమూలనాశః ॥ 150

ప్ర.అ. శ్రుతి ప్రమాణైకమతేః = శ్రుతిరూపమగు ప్రమాణము నందు మాత్రమే ముఖ్యముగ స్థిరమైన చిత్తము గలవానికి, స్వధర్మ నిష్ఠా = స్వధర్మము నందు నిష్ఠ ఏర్పడును. అస్య = వీనికి, తయైవ = ఆ స్వధర్మ నిష్ఠ చేత నే, ఆత్మ విశుద్ధిః = మనఃశుద్ధి కలుగును. విశుద్ధబుద్ధేః = శుద్ధమైన బుద్ధి కలవానికి, పరమాత్మ వేదనం = పరమాత్మ జ్ఞానము కలుగును. తేనైవ దానిచేత నే సంసార సమూలనాశః = సమూలముగా సంసార నాశము కలుగును.

వ్యా. అ. "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మకర్తు మిహార్హసి" (ఇది చేయదగినది, ఇది చేయదగనిది అను వ్యవస్థయందు నీకు శాస్త్రమే ప్రమాణము. కావున నీవు బాగుగా తెలిసికొని శాస్త్రములో చెప్పబడిన కర్మను చేయవలెను) అను గీతా వాక్యము ననుసరించి శ్రుతియే ప్రమాణము. అట్టి శ్రుతి ప్రమాణమునందు, ఏకా = మరి దేనియందును ఆసక్తము కాక ముఖ్యమైన, మతేః = బుద్ధి కలవానికి, తన శ్రేయస్సు నుద్దేశించి ఏ కర్మను చేయవలెను అను విషయమున ఒక్క శ్రుతియే ఆధారముగా గల వానికి,

తన వర్ణమునకును, ఆశ్రమమునకును విధింపబడిన కర్మకలాపము స్వధర్మము. దాని యందు నిష్ఠ, అనగా శ్రద్ధాతిశయముతో దాని అనుష్ఠానము. తయైవ = మరి దేని యందును ఆసక్తిలేని ఆ స్వధర్మ నిష్ఠచేతనే, అస్య = సాధకుడైన ఈ జీవునకు, ఆత్మవిశుద్ధిః = విశేషముగ అంతఃకరణముయొక్క పరిశుద్ధి అనగా పాపక్షయము, కలుగును. "జ్ఞానముత్పద్యతే పుంసాంక్షయాత్ పాపస్య కర్మణః. కషాయపక్తిః కర్మాణి జ్ఞానంతు పరమా గతిః. కషాయే కర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే" (పాపకర్మ క్షీణించుటవలన పురుషులకు జ్ఞానము కలుగును. కర్మలు పాపనాశ రూపములు; అనగా పాపనాశహేతువులు. ఉత్తమ సాధనము మాత్రము జ్ఞానమే. కర్మలచే పాపము పక్వమైన పిమ్మట జ్ఞానము కలుగును) అను ప్రమాణము ననుసరించి బుద్ధి యందలి రాగద్వేషాది సకల దోషము లన్నియు నశించినవానికి, పరమాత్మవేదనం = అభేదదృష్టితో పరమాత్మ సాక్షాత్కారము కలుగును. ఆ పరమాత్మ వేదనముచే సమూలముగా సంసారము నశించును. అజ్ఞానము మొదలు దుఃఖమువరకును గల బంధ మంతయు పూర్తిగ నశించునని అర్థము. 150

అవ. "వివేక విజ్ఞాన మహాసినా" అనునపుడు వివేకమువలన విజ్ఞానము కలుగునని చెప్పబడినది. "తయోర్వివేకః కథమేత దుచ్యతామ్" అని వెనుక శిష్యుడు ప్రశ్నించి కూడ ఉన్నాడు. స్థూల = సూక్ష్మ-కారణ శరీరములను గూర్చి పూర్వము సామాన్యరూపముగ సంగ్రహముగ చెప్పబడినది. ఆ విషయము నిపుడు సవిస్తరముగ విశదీకరించుటకై ప్రారంభించుచున్నారు.

అవ. "సలిల ఏకో ద్రష్టా" (నిర్మల జలమువంటి ఆత్మయొక్కటియే ద్రష్ట-చూచునది) ఇత్యాది శ్రుతుల ననుసరించి నిర్మల జలమువలె స్వచ్ఛమైన ఆత్మ స్పష్టముగ ఏల ప్రకాశింపదు అను ఆశంక కలుగగా, ఆ జలమునే దృష్టాంతముగ చూపుచు, స్పష్టముగ ప్రకాశింపకుండుటకు కారణమును చెప్పుచున్నారు.

మూ. కోశైరన్న మయాద్యైః పంచభిరాత్మా నసంవృతో భాతి
నిజశక్తి సముత్పన్నైః శైవలపటలై రివాంబు వాపీస్థమ్. 151

ప్ర. అ. వాపీస్థం = దిగుడు బావిలో నున్న, అంబు = నీరు, నిజశక్తి సముత్పన్నైః = తన శక్తి వలన జనించిన, శైవలపటలైః ఇవ = నాచుయొక్క సమూహములచేత వలె, ఆత్మా = ఆత్మ, అన్నమయాద్యైః = అన్నమయము మొదలగు, పంచభిః కోశైః = ఐదు కోశములచే, సంవృతః = కప్పబడినదై, నభాతి = ప్రకాశించుటలేదు.

వ్యా. అ. నిజశక్తి సముత్పన్నైః = తనదియు, తనపై కల్పింపబడినదియు అగు అవిద్యచే పుట్టిన, ముందు చెప్పనున్న అన్నమయాది పంచకోశములచే, కత్తిని కోశము (ఒర) ఆవరించి ఉన్నట్లు ఆత్మను ఆవరించియున్న అన్నమయకోశము మొదలు ఆనందమయ కోశము వరకును ఉన్న ఐదు కోశములచే, సంవృతః = ఈ కోశములు ఆత్మజ్ఞానమునకు ప్రతిబంధకములుగా నిలచియుండు తమ (కోశముల) జ్ఞానమును కలిగించుచుండుటచే వీటిచే కప్పబడినదై, నభాతి = వివిక్తముగా, స్పష్టముగా భాసింపదు. ఇందులకు దృష్టాంతము—నిజశక్తి సముత్పన్నైః = తనలో ఉన్న ద్రవత్వ ధర్మముచే పుట్టిన, శైవలపటలైః = నాచుయొక్క సముదాయములచే, దిగుడు బావి లోని నీరువలే. దిగుడు బావిలో నున్న నీరు దాని నుండియే పుట్టిన నాచుచే కప్పబడి ఎట్లు స్ఫుటముగా భాసింపదో అట్లే అని అర్థము. 151

అవ. దృష్టాంతముగా చూపిన జలము స్ఫుటముగ భాసించుటకు హేతువును చెప్పుచున్నారు.

మూ. తచ్ఛైవాలాపనయే సమ్యక్సలిలం ప్రతీయతే శుద్ధమ్.
తృష్ణా సంతాపహారం సద్యః సౌఖ్యప్రదం పరం పుంసామ్. 152

ప్ర. అ. తచ్ఛైవాలాపనయే = ఆ నాచును తొలగింపగనే, శుద్ధం = నిర్మలమైనదియు, తృష్ణా సంతాపహారం = దప్పికను తాపమును తొలగించునదియు, సద్యః సౌఖ్యప్రదం = వెంటనే సౌఖ్యమును కలిగించునదియు అగు, పరం = శ్రేష్ఠమైన, సలిలం = జలము, పుంసా = పురుషులకు, సమ్యక్ = బాగుగా, ప్రతీయతే = భాసించును.

వ్యా. అ. కప్పివేసియున్న నాచును తొలగించగనే నిర్మలమైన జలము, సమ్యక్ = ప్రతిబంధ మేదియు లేకుండగ, కనబడును. దానివలన ఫలమును చెప్పుచున్నారు—తృష్ణా సంతాపహారం = దప్పికవలన కలిగిన దుఃఖమును హరించునది. పుంసః = పానము చేయు పురుషునకు, సద్యః సౌఖ్యప్రదం = దర్శన స్నాన పానాదులచే వెంటనే సంతోషము నిచ్చునది. పరం = శ్రేష్ఠమైనది. "ప్రతీయతే" అను పూర్వపదముతో అన్వయము. 152

అవ. దార్ష్టాంతికమున (దేనికి ఒక దృష్టాంతము చూపబడునో అది దార్ష్టాంతికము) దానిని చెప్పుచున్నారు.

మూ. పంచానా మపి కోశానామపవాదే విభాత్యయం శుద్ధః
నిత్యానందైక రసః ప్రత్యగ్రూపః పరః స్వయం జ్యోతిః. 153

ప్ర. అ. పంచానామపి కోశానాం = ఐదు కోశముల, అపవాదే = నిషేధము చేయబడగా, శుద్ధ నిర్మలమైనదియు, నిత్యానందైకరసః = కేవలము నిత్యమైన ఆనందమే స్వరూపముగా కలదియు, ప్రత్యగ్రూపః = ప్రత్యగ్రూపమైనదియు, స్వయం జ్యోతిః = స్వయం ప్రకాశమగునదియు అగు, పరః = సర్వోత్కృష్టమైన, అయం = ఈ ఆత్మ, విభాతి = భాసించును.

వ్యా. అ. పంచానామామపి = ఐదు, ఇచట 'అపి' శబ్దము మొత్తము ఐదు కోశములను నిషేధించవలెను అని చెప్పుటకు ప్రయోగింపబడినది. కోశానాం = అన్నమయము మొదలు ఆనందమయము వరకును గల ఆవరణహేతువులగా కోశముల యొక్క, అపవాదే = శ్రుతులతో చూపబడిన యుక్తులచేత నిషేధము చేయబడిన దగుచుండగా, నిత్యానందైక రసః = ఉత్పత్తి వినాశములు లేదనియు, దుఃఖసంమిశ్రము కానిదియు అగు ఆనంద మగునది ఒక్కటియే స్వభావముగా గలదియు, ప్రత్యగ్రూపః = అన్నింటి కంటెను అంతరమైనదియు, స్వయం జ్యోతిః = ఇతర వస్తువులచే ప్రకాశింపజేయబడక స్వయముగనే ప్రకాశించు కేవల జ్ఞానమను స్వరూపము కలదియు, పరః = అన్నింటి కంటెను ఉత్కృష్టమైనదియు అగు, అయం = ఈ ఆత్మ, శుద్ధః = స్వాభావికముగాగాని పైనుండి వచ్చినదిగాని అగు మాలిన్యముచే స్పృశింపబడినదిగా, విభాతి = విశేషముగ, అనాత్మ వస్తువులతో సంబంధము లేనిదిగా భాసించును. 153

అవ. కావుననే—

మూ. ఆత్మానాత్మ వివేకః కర్తవ్యో బన్ధముక్తయే విదుషా,
తేనైవానన్దీ భవతి స్వంవిజ్ఞాయ సచ్చిదానన్దమ్. 154

ప్ర. అ. విదుషా = విద్వాంసునిచేత, బంధముక్తయే = బంధము తొలగి పోవుటకు, ఆత్మానాత్మ వివేకః = ఆత్మానాత్మల వివేకము, కర్తవ్యః = చేయదగినది. తేనైవ = దానిచేతనే, స్వయం = తనను, సచ్చిదానన్దం = సచ్చిదానంద రూపునిగా, విజ్ఞాయ = తెలుసుకొని, ఆనందీ భవతి = ఆనందవంతు డగును.

వ్యా. అ. విదుషా = శాస్త్రజన్యమైన జ్ఞానము గల పురుషునిచేత, బన్ధముక్తయే = అధ్యాసమును తొలగించుకొనుటకై, ఆత్మానాత్మ వివేకః = ఇది ఆత్మ, భిన్నము అని వేరు వేరుగా జ్ఞానము, కర్తవ్యః = చేయదగినది; ప్రయత్నపూర్వకముగ సంపాదింపదగినది. తేనైవ = ఆ ఆత్మానాత్మ వివేకముచేతనే. స్వం = స్వస్వరూపమైన, సచ్చిదానన్దం సత్ = త్రికాలాబాధ్యత్వమును. చిత్ జ్ఞానమును, ఆనందం =

ఆనందమును, విజ్ఞాయ = సాక్షాత్కరింప చేసుకొని, "ఆత్మానాత్మ వివేచనం స్వానుభవః" అని రెండవ శ్లోకమున చెప్పబడినది కదా? ఆనన్దీ = నిరతిశయను (దేనికంటె గొప్పది లేదో అది నిరతిశయము) ఎల్లప్పుడును ఉండునదియు అగు సుఖము కలవాడై, అగును. 154

అవ. వివేచనము చేయు పద్ధతిని బాగుగ అర్థమగుటకై దృష్టాంతపూర్వకముగా విశదీకరించుచు, "బ్రహ్మాత్మనా సంస్థితి" రూపమైన మోక్షము లభించవలెనన్నచో వివేచనానంతరము ఏమి చేయవలెనో చెప్పుచున్నారు.

మూ. ముంజాదిషీకామివ దృశ్యవర్గాత్
ప్రత్యంచ మాత్మాన మసంగ మక్రియమ్
వివిచ్య తత్ర ప్రవిలాప్య సర్వం.
తదాత్మనా తిష్ఠతి యః స ముక్తః. 155

ప్ర. అ. ముంజాత్ = ముంజమను తృణమునుండి, ఇషీకామివ = సన్నని కాడను వలె, దృశ్యవర్గాత్ = దృశ్య పదార్థముల సముదాయమునుండి, అసంగం = సంగము లేనిదియు, అక్రియం = క్రియారహితమును అగు, ప్రత్యంచమాత్మానం = ప్రత్యగాత్మను, వివిచ్య = వేరుచేసి, తత్ర = దానియందు, సర్వం = సమస్త దృశ్య ప్రపంచమును, ప్రవిలాప్య = విలీనము చేసి, యః = ఎవడు, తదాత్మనా = ఆ ఆత్మ స్వరూపముతో, తిష్ఠతి = ఉండునో, సః = వాడు, ముక్తః = ముక్తుడు.

వ్యా. అ. ముంజము, అనెడు తృణమునుండి, ఇషీకామివ = ఇషీకను వలె. తామరతూడులో నుండు సన్నని దారము వలె ముంజతృణ మధ్యమునందుండు చాల సన్నని అంశము ఇషీక. ఆ సూక్ష్మాంశము చుట్టును తృణము ఆవరించియుండును. దానిని తెగిపోకుండగ పైకి తీయవలెనన్నచో ఎక్కువ ఏకాగ్రత, ప్రయత్న విశేషము కూడ అవశ్యకము. "ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే. దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" (అన్ని ప్రాణులందును దాగియున్న ఈ ఆత్మ స్పష్టముగ ప్రకాశించుట లేదు—కాని సూక్ష్మదృష్టి కలవారిచే, ఏకాగ్రమును, సూక్ష్మమును అగు బుద్ధితో గ్రహింపబడును) అను శ్రుతి ననుసరించి, వేదవిహితములగు కర్మలచేతను ఉపాసనచేతను సంస్కృతమగు బుద్ధిచే, దృశ్యవర్గాత్ = అనాత్మ పదార్థముల సమూహమునుండి, ప్రత్యంచం—"ప్రతి = ప్రతిలోమ్యేన, అంచతి ఇతి = ప్రత్యక్" అను విగ్రహముచే ప్రత్యక్ శబ్దమునకు అసత్తులును జడములును అగు దుఃఖాహంకారాదులకంటె విలక్షణముగ సచ్చిత్సుఖ

రూపముతో ప్రకాశించునది యని అర్థము. అట్టిదియు,అసంగం = అద్వితీయమగుటచే సర్వసంగరహితమును, అక్రియం = అపచ్ఛిన్నము కాకుండుటచే క్రియారహితమును అగు, ఆత్మను వేరుచేసి, తత్ర = ఆ ప్రత్యగాత్మయందు, సర్వం = సకల దృశ్యవర్గమును, ప్రవిలాప్య = పూర్తిగ నశింపజేసి, ప్రత్యగాత్మ కంటె వేరుగ ఏదియును లేదు అని నిశ్చయించి, తదాత్మనా = అధిష్ఠానమైన ప్రత్యగాత్మ రూపమున ఎవడు ఎల్లప్పుడును ఉండునో అతడు సకలవిధ బంధమునుండియు ముక్తుడు. ఆత్మానాత్మ వివేకము ద్వారా, ఆత్మ యందారోపింపబడిన అనాత్మ పదార్థములను బాధించి "బ్రహ్మాత్మనా సంస్థితి" రూపమగు ముక్తి పొందదగినది గాన వివేకవంతుడు ప్రపంచ విలాసమును చేయవలెనని చెప్పినట్లైనది. 155

(సశేషము)

---

# గురువంశ కథా కథనము

(సంస్కృత మూలము : బ్రహ్మశ్రీ కాశీలక్ష్మణశాస్త్రి గురువంశ కావ్యమ్)

తెలుగు: శ్రీ చెఱుకుపల్లె జమదగ్నిశర్మ ఎం. ఏ.

(గత సంచిక తరువాయి)

## అష్టాదశసర్గము

పట్టణమున నున్న తక్కిన దేవతల నందరను అంతటి భక్తి శ్రద్ధలతో నర్చించి బృహస్పతితుల్యు లయిన జగద్గురువులు బహు శిష్య సమేతులయి శీఘ్రముగ తీర్థపురమున కేగిరి (32). అట్లు వా రక్కడ నుండగా మహారాష్ట్ర ప్రభు మంత్రివాదుల వలన శ్రీవారు శృంగపురిలో నుండక తీర్థపురిలో నివసించుచున్నారని తెర వెనుక దౌత్యము నెరపిన ఇక్కేరి మంత్రితో (33) "మా గురువర్యులు నేటివరకును శృంగేరిని ప్రవేశించలేదు. దీనికి కారణమేమి? నీ వా మా రాజా ఇట్లు వారిని గూర్చి పట్టించుకొనక ఉపేక్ష వహించినది? లేక మరేమైన కారణమున్నదా? చెప్పుము" అని అడిగెను (34). తన నిజాయితీని ఆ బాజీరావు శంకించుటచేత అతడు వెంటనే "అట్లయిన నేనే యతీంద్రుల సన్నిధి కేగి వారి నెట్లయిన బ్రతిమాలి శృంగేరికి చేర్చి వచ్చెద" నని బదులు చెప్పెను (35). దాని కాతడు సంతోషించి తన దూతలను

గూడ వానికి జతపఱచి వారి కందరకు చెప్పవలసినవి చెప్పి గురువుల సన్నిధికి పంపించెను. (36) ఆ మంత్రి బాజీరావు శాసనమును విని తన వెంబడి ఉన్న ఆతని దూతలతో కలిసి ఇక్కేరి రాజధాని కేగి ఆ రాజున కీ విషయమంతయు నేకాంతమున ప్రస్ఫుటముగా నెఱుకపఱచెను (37). బసవక్షితీశ తనయు డతడు చెప్పిన దంతయు విని అతని మాటలవలన గురువుల మనఃక్లేశమున కంతకు తన ముఖ్యమంత్రియే కారకుడని గ్రహించెను (38). అంతటితో పోక తన ముఖ్యమంత్రి నిర్వాణయ్య అధికారమున కతని నాము తాత్పర్యము పట్టించక తప్పదని హృదయములో నిశ్చయించుకొని గురువుల సన్నిధి కేగి వారిని సాంత్వన పరుచుటకు తన సేనాపతిని పంపవలయునని తలంచెను (39). సోమశేఖర భూపాలుడు వెంటనే సేనాపతిని రప్పించి "నీవు గురువుల సన్నిధి కేగి భక్తిప్రపత్తులతో ప్రణామము అర్పించి పారితోషికములు సమర్పించి వినయనయయుక్తముగ చెప్పవలసిన మాటలు చెప్పి వారి నెట్టైన సాంత్వనపరిచి ప్రసన్నుల నొనర్చుకొని వారిని శృంగేరికి చేర్చి రమ్ము" అని ఆదేశించి పంపెను (40). అట్లు రాజుచే స్వయముగా పంపబడిన యా సేనాపతి శ్రీసచ్చిదానంద మునీంద్రుల సన్నిధి కేగి అవసరము వేచి శ్రీవారి పాద పద్మ దర్శన మొనర్చికొనెను (41). రాజాధిరాజ కిరీట రత్నదీప పరంపరలచే నీరాజిత లగుచుండు నవ్వారి శ్రీ చరణములయందు బద్ధాంజలియయి "స్వామీ గురువర్యా! తమయందు మిక్కిలి వినీతుడగు సోమశేఖరభూపతి స్వయముగా తమకు సాష్టాంగము లాచరించి చెప్పవలసినది చెప్పి పంపగా వచ్చిన సేనాపతిని నేనని తమకు విన్నవించుకొనుచున్నాను. ఆ మహారాజు మాటలను నేను వినిపించునవి విని వానియందు దయ చూపవలయునని మనవి (43). హే స్వామీ! నా పరోక్షమున కుబుద్ధి యగు దుర్మంత్రి చేసిన దుష్ప్రవర్తనవలన నీ యనర్థమంతయు తటస్థించినది. నా మనవిని చిత్తగించి వాడొనర్చిన దోషములో లేశమైనను తమ దివ్యచిత్తమునందుంపవలదని ప్రార్థన (44). తమ తపస్సున కా దుర్మార్గుడు ప్రతిబంధకములు కలిగించినందువల్లనే నా దేశమందంతట నశేషోపద్రవములు తటస్థించినవి. అటువంటి తపో మహిమగల తమకు ఆ క్షుద్ర వ్యక్తివల్ల నేమి యగును (45). ఈ మాటలను శ్రీవారికి నివేదించి వారి కనేక పారితోషికములు సమర్పించి వారిని సాదరముగ శృంగేరి యందున్న వారి మఠమున చేర్చి మరియు రావలసినదని రాజు నన్ను క్షణమైన నుండనీయక తరిమి తరిమి పంపెను" (46). రాజాశయము నెఱిగించి ప్రార్థించుచున్న ఆ సేనాపతిని శ్రీ సచ్చిదానంద యతీంద్ర పుంగవులు సౌమ్యదృక్కులతో చూచి ప్రణయపూరిత వచస్కు లగుచు (47) "సోమశేఖరభూపాలుండు రాజ్యపా

చేయుచుండగా దేశము ఈతిబాధా విరహితముగా వర్ధిల్ల గలదు. మహనీయుల తపః క్రియలు నిర్విఘ్నముగ సాగుటచే నింద్రుడు సర్వ సంపదలను వర్షింప గలడు (48). ఆ రాజు సద్గుణ సంపదయంతయు జగద్విదిత మయ్యును జడధులచే నావృతమై యుండి ప్రకాశించుటలేదు. ఉఱుము లుఱుముచున్న మేఘము లాచ్ఛాదించిన పున్నమ చంద్రునివలె వ్యర్థ ప్రకాశు డగుచున్నాడు (49). అయినప్పటికి సావకాశమునుబట్టి మా దగ్గరకు వచ్చుటవలన నతనికి శ్రేయస్సు కలుగగలదని అట్టి శుభ సమయము నిరీక్ష సేయుచు మేమిక్కడ చాల కాలముగ నున్నాము" (50) అని వాని ననుగ్రహింపిరి. పిమ్మట సేనాపతి చేతను నిజానుచరుల చేతను సేవితులగుచు మహామనీషులగు శ్రీ సచ్చిదానంద గురువర్యులు తీర్థపురమునుండి బయలుదేరిరి (51) వారి వెంట సర్వ సైన్యములు ననుసరించినవి. తీర్థపుర వాసులు గురువులు తమ్ము విడిచి వెళ్ళుట కిష్టములేక, మరల వారి దర్శన మెన్నాళ్ళ కగునో యని బహుదూర మనుగమించిరి. దారి పొడుగున జానపదులు ప్రణామము లొనర్చుచు కానుకలు సమర్పించుకొనిరి (52). ఇట్లు సర్వజన సమర్చితు లగుచు వంది బృందముల స్తోత్రపాఠములు సాగుచుండ రుచిరాత పత్రము సార్వభౌమత్వము ప్రకటించుచుండ ఉత్సాహాతిశయమున చెలరేగుచున్న వాద్య ఘోషములు నిఖిలపర్వత గుహా ప్రదేశములను నింపుచుండ దేశిక పుంగవులు స్వపురమును చేరికొనిరి (53). ఊరు ఊరంతయు స్వామివారి కెదురు వచ్చి ఫలపుష్ప సమర్పణములతో సత్కరించినది. విజయలక్ష్మీ సమేతుడైన ఇంద్రుని వలెనే యతీంద్రు లప్పుడు ప్రజ్వలించిరి (54). శ్రీ మహావిష్ణువు పూర్వ మొనర్చినట్లే ఈ జగద్గురువులు లోకమున బ్రాహ్మణ్యమును సుప్రతిష్ఠిత మొనర్చిరని తత్పుర ప్రజలెల్లరు ఇంటింట క్షణ క్షణము ప్రశంసించ సాగిరి (55). గురువుల కత్యాదరమున అడుగడుగున మంగళారాత్రికలతో నీరాజనము లర్పించుచు దారి పొడుగున పువ్వులు పేలాలు వర్షించుచు ప్రజ లెల్లరు శ్రీవారిని సేవించుకొనిరి (56). శ్రీవారు ముమ్మొదటనే మలహానికరేశ్వరాలయమున కేగి అక్కడ రాతి స్తంభముపై మంత్ర మహిమచే నుద్భవించిన గణపతికి చక్కరపప్పు నివేదించి దాని నందరకు పంచిపెట్టిరి (57). పిమ్మట భవానీదేవితో పాటు మల్లికార్జున దేవుని సేవించుకొని స్వమతాభిముఖముగ నేగి విద్యాశంకర స్వామిని, శారదాదేవిని హృదయపూర్వకముగ పూజించిరి (58). చివరకు మఠములోని కేగి వరాసనమున కూర్చుండి వెంబడి వచ్చిన జనులందరితోడను సముచితముగ భాషించి ఎవరి ఇండ్లకు వా రేగుట కనుమతించిరి (59). రాజాధిరాజార్చిత పాదపంకజాలును తపోబలాధూతరిపూత్కరులు నగు జగద్గురువులు ప్రతాప నిర్భిన్న

పయోదమండలు డగు శరత్కాల సహస్రరశ్మి వలెనే దేదీప్యమానులై ప్రకాశించిరి (60). తారల మధ్య బుధులతో కూడిన కవి వలెను శుక్లపక్ష చంద్రునివలెను కీర్తి చంద్రికలను దిక్కు దిక్కుల వెదజల్లుచు జగత్ప్రశస్తి నందుకొనుచు వచనామృతముల చే శిష్యుల నెల్లర నానందపరచుచు ఎల్లప్పుడు సజ్జన పరివేష్టితులై జగద్గురువులు విరాజిల్లిరి (61). సమస్త భూమండల దిగంత వ్యాప్త యశస్కులగు గురువర్యులు దివ్యమహిమోపేత విచిత్ర చరిత్రను సమర్థముగా వర్ణించుట కెవ్వరు సమర్థులగుదురు? ఆ శేషుడే కవియై వర్ణింపబూనినను కృతకృత్యు డగునో కాదో ఎవ్వరును చెప్పలేరు (62).

(అష్టాదశ సర్గ సమాప్తము.)

(సశేషము)

—:o:—

## శ్రీ జగద్గురువుల సంచార వార్తలు

అక్టోబరు 24 వ తేదీన శ్రీ జగద్గురు మహాసన్నిధానమువారు శిష్యస్వామి, పరివార సమేతులై మైసూరునకు చేరగా శిష్యమహాజనము అఖండ స్వాగతము నివేదించి ధూళిపాద పూజ చేసిరి. శ్రీ మహా సన్నిధానము వారు అనుగ్రహభాషణము చేసిరి.

మైసూరునందు శ్రీ జగద్గురు మహాసన్నిధానమువారి సన్న్యాసాశ్రమ స్వీకార స్వర్ణోత్సవము, పీఠారోహణ నక్షత్రోత్సవము (27 సం॥) 65 వ జన్మదినోత్సవము—శరదుత్సవముగా నడచినవి.

శ్రీ జగద్గురు మహాసన్నిధానవారు మైసూరు చేరక మునుపే 24 అక్టోబరు ఉదయము—సహస్రమోదక గణపతి హోమము, వేదపారాయణ, మహా రుద్ర హోమ సంకల్ప జపములు నడచినవి. అక్టోబరు 25 వ తేదీ ఆదివారము మహారుద్ర జపము, వేదపారాయణ జరిగినవి. "ధర్మము—సంఘము" అన్న విషయముపై ధర్మ సమ్మేళనము జరిగినది. కర్ణాటక విత్తమంత్రి గా. శ్రీ వీరప్పమాయి గీ సమ్మేళనమును ప్రారంభించెను. ఆచార్య విద్యాసాగర యం. పి. యల్. శాస్త్రి అధ్యక్షత వహించెను. శ్రీ హెచ్. యన్. రామతీర్థ స్వాగతము పలికెను. సాయంకాలము జరిగిన సభలో ద్వైత మతమున 'ధర్మము—సంఘము'ను గురించి విద్వాన్ శ్రీ మళిగె రామాచార్, విశిష్టాద్వైత మతమున 'ధర్మము—సంఘము'ను గురించి విద్వాన్ శ్రీ ఎ. ఎన్. వెంకటనాథన్, శక్తి విశిష్టాద్వైతమున 'ధర్మము—సంఘము'ను గురించి

డా. ఎ. యల్. శివరుద్రప్ప, జైనమతమున 'ధర్మము—సంఘము'ను గురించి డా. యం. డి. వసంతరాజ్, అద్వైతమున 'ధర్మము—సంఘము'ను గురించి డా. కె. బి. రామకృష్ణరావు ఉపన్యసించిరి. శ్రీ జగద్గురు సన్నిధానమువారు అనుగ్రహభాషణము చేయుచు, అన్వయ సమన్వయములు సలిపిరి.

అక్టోబరు 26 సోమవారము పూర్వాహ్ణమున పూర్ణాహుతి జరిగినది. కర్ణాటక ముఖ్యమంత్రి గా. శ్రీ గుండురావు సతీసమేతముగా వచ్చి శ్రీ జగద్గురువులను అభినందించి, ప్రణామములు చేసెను.

సాయంకాలము జరిగిన అభినందన సభలో ఆహ్వాన సంఘాధ్యక్షుడు శ్రీ ఆగరం రంగయ్య స్వాగతములు నివేదించెను. పలువురు భక్తులు భిన్న భిన్న భాషలలో శ్రీ జగద్గురువు మహాసన్నిధానమువారికి అభినందన ప్రణామములను నివేదించిరి. శ్రీ శంకరకృప సంపాదకుడు తెలుగున ఉపన్యసించెను.

శ్రీ జగద్గురు సన్నిధానమువారు, స్వర్ణోత్సవ సంచికను ఆవిష్కరించుచు శ్రీ మహాసన్నిధానమువారికి తమ భక్త్యంజలిని నివేదించిరి. శ్రీ మహాసన్నిధానము వారు అనుగ్రహభాషణము చేసిరి.

అక్టోబరు 27 వ తేదీ మంగళవారము సాహిత్య సమ్మేళనము జరిగినది.

పూర్వాహ్ణమున డా. పి. టి. నరసింహాచార్య సమ్మేళన ప్రారంభోపన్యాసమును చేసెను. శ్రీ హెచ్. సుబ్బారావు స్వాగతములు నివేదించెను.

సాయంకాలము జరిగిన సభలో డా. యన్. యస్. దక్షిణామూర్తి పరిచయ వాక్యములు పలికెను. 'సాహిత్యమున మానవ జీవన చిత్రణ' అన్న అంశముపై— కన్నడ సాహిత్య సందర్భముగా డా. టివి. వెంకటాచలశాస్త్రి, ఆంధ్ర సాహిత్య సందర్భముగా శ్రీ పి. వి. సత్యనారాయణమూర్తి మళయాళ సాహిత్య సందర్భముగా శ్రీమతి కమలాదేవిశంకరన్, తమిళ సాహిత్య సందర్భముగా డా. యస్. వేణుగోపాలాచార్, సంస్కృత సాహిత్య సందర్భముగా డా. ఆర్. యస్. శివగణేశమూర్తి హిందీ సాహిత్య సందర్భముగా యం. కె. రాజగోపాల్, ఆంగ్ల సాహిత్య సందర్భముగా ఆచార్య హెచ్. జి. సూర్యనారాయణరావు ఉపన్యసించిరి.

శ్రీ జగద్గురు మహాసన్నిధానమువారు అనుగ్రహభాషణము చేసిరి.

28 అక్టోబరు బుధవారమునాడు వేదవిద్వత్సమేళనము జరిగినది. క్రమ, ఘన పరీక్షలకు వచ్చి ఉత్తీర్ణులైన విద్యార్థులకు పత్రములు, బహూకరణలు జరిగినవి. ప్రసిద్ధ వేద విద్వాంసులకు భూరి సమ్మానములు జరిగినవి.

తొమ్మిదిమంది ఘనాంతస్వాధ్యాయులైన వేద పండితులకు రెండు వేల రూపాయల చొప్పున (ప్రతి ఒక్కరికి) సమ్మానములు జరిగినవి. అందు ఆంధ్ర దేశమున క్రొత్తపేటకు చెందిన, శ్రీ ఇ. రామకృష్ణ ఘనాపాఠిగా నొకరు.

పదునాలుగుమంది క్రమాంతస్వాధ్యాయులకు (ప్రతి ఒక్కడికి) వేయి రూపాయల సమ్మానము జరిగినది. అందు తెనాలి తాలూకా అనంతారమునకు చెంది శృంగేరి ఆస్థానపండితులుగా నున్న శ్రీ గొల్లపూడి గోపాలకృష్ణమూర్తిగా రొకరు.

కృష్ణ యజుర్వేద ఘనాంత పరీక్షలలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులైన శ్రీ గురునాథశర్మ (విజయవాడ శ్రీ కనకదుర్గాంబ దేవస్థాన వేద పండితుడు)కు వేయి రూపాయల సమ్మానము లభించినది. క్రమాంత పరీక్షలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడైన శ్రీ శివరామకృష్ణశర్మ (విజయవాడ)కు రు. 600/- బహుమానము లభించినది. ద్వితీయశ్రేణిలో వచ్చిన విజయవాడకు చెందిన, శ్రీ కె. వెంకటశివరామకృష్ణ శర్మకు, శ్రీ టి. వేంకటేశ్వరశర్మకు, శ్రీ రెండుచింతల నాగేశ్వర అవధానికి రు. 400/- చొప్పున బహుమానములు లభించినవి.

శ్రీ జగద్గురువులు 29 అక్టోబరు గురువారము సాయంత్రము మైసూరునుండి బెంగళూరునకు చేరి స్వకీయ శంకర మఠమున విడిదిచేసిరి.

బెంగుళూరులో శిష్యమహాజనము స్వాగతసమితిగా యేర్పడి శ్రీమహాసన్నిధానమువారి ఆశ్రమస్వీకార స్వర్ణోత్సవమును, శ్రీ మహాసన్నిధానమువారి 65 వ జన్మదినోత్సవమును 31 అక్టోబరు శనివారమునాడు మహావైభవముగా నడిపించిరి. భూతపూర్వ భారత ఉపరాష్ట్రపతి శ్రీ బి. డి. జట్టి సభకు అధ్యక్షత వహించెను. శ్రీ ఆచార్య యం. పి. యల్. శాస్త్రి స్వాగతములు నివేదించెను. శ్రీ డి. వి. లక్ష్మణరావు వినతిపత్రమును సమర్పించెను. శ్రీ టి. ఆర్. శామణ్ణ (యం. పి.) పుష్పాంజలి ఘటించెను. శ్రీ వి. యస్. కృష్ణయ్యారు (యం. యల్. సి.) వందన సమర్పణ చేసెను. శ్రీ జగద్గురువులు అనుగ్రహభాషణము చేసిరి.

## శృంగేరిలో

శ్రీ జగద్గురు మహాసన్నిధానమువారి 65 వ జన్మదినోత్సవమును, శ్రీ సద్విద్యాసంజీవినీ సంస్కృత కళాశాల వార్షికోత్సవమును శృంగేరిలో 26 అక్టోబరు సోమవారము మహావైభవముగా జరిగినవి.

## విజయవాడలో

విజయవాడలో శ్రీ శృంగేరి శంకరమఠమున శ్రీ విశ్వనాథ సోమశేఖర

శాస్త్రిగారి ఆధ్వరమున శ్రీ జగద్గురు మహాసన్నిధానమువారి 65వ జన్మదినోత్సవ సందర్భముగా ఆయుష్యహోమము, ప్రత్యేక పూజలు జరిగినవి.

సాయంత్రము 6 గంటలకు విజయవాడ సత్యనారాయణ పురములోని శ్రీ శివరామకృష్ణ క్షేత్రమున, శ్రీ జంధ్యాల నారాయణమూర్తిగారి అధ్వర్యమున అభివందన సభ జరిగినది. శ్రీ మద్దులపల్లి మాణిక్యశాస్త్రిగారు గురుభక్తిని గురించి మహోపన్యాసమును కావించిరి.

శ్రీ జగద్గురువుల వర్ధంతి మహోత్సవము యావద్భారతమున పెక్కు తావులందు జరిగినది. శ్రీజగద్గురువులు సన్నిధిలో 26 అక్టోబరు సోమవారము (మైసూరు) శ్రీశంకరకృప పాఠకుల తరపున శ్రీ శంకరకృప ప్రకాశకుడు శ్రీ ఆకెళ్ల సత్యనారాయణమూర్తిగారు పాదపూజ నిర్వహించిరి.

శ్రీ జగద్గురువులు బెంగళూరునుండి సేలము, కోయంబత్తూరు, పాలఘాటులందు మకాము చేయుచు కాలడి (7 నవంబరు) చేరి అక్కడ 17 సాయంత్రము వరకు మకాము చేసిరి. శ్రీ జగద్గురువులు సంచరించిన సర్వస్థలములందు శిష్యమహాజనము భక్తిశ్రద్ధలతో సేవించిరి.

కాలడి నుండి కొచ్చిన్, కోట్టయము, తిరువనంతపురము, షెంకోట, తిరునల్వేలి పురములలో మజిలీలు చేసి 23 నవంబరు సాయంత్రం కల్లడై కురిచ్చి చేరి అఖండ స్వాగత నివేదనములను స్వీకరించిరి. కల్లడైకురిచ్చిలో 28 నవంబరు నుండి అతిరుద్రమహా యాగ సరంరంభము జరుగు చున్నది. ఈ మహాయాగ పూర్ణాహుతి 4-12-81 తేదీ జరుగును.

## శ్రీ జగద్గురువుల సంచార కార్యక్రమాలు

శ్రీ జగద్గురువులు తమిళనాడు జిల్లాలలో సంచారము చేసి జనేవరి 1982 మొదటివారమున మదరాసు పట్టణమునకు విజయము చేయుదురు. మదరాసులో మాఘ శు దశమి (3-2-1982) నాడు అయ్యప్ప దేవాలయ ప్రతిష్ఠా కుంభాభిషేకములను (అడయారు) నిర్వహించి ఫిబ్రవరి తొలివారమున ఆంధ్ర సంచారమును ప్రారంభింతురు.

తిరుమల, నెల్లూరు, ఒంగోలు, గుంటూరు, నర్సారావుపేట, నల్గొండ, ఓరుగల్లు పురములమీదుగా కాళేశ్వరము చేరి అక్కడ మాఘ బ పంచమి (12-2-82) నాడు జీర్ణోద్ధరణ కుంభాభిషేకము కావించెదరు.

పిమ్మట కరీంనగరు పట్టణముమీదుగా హైదరాబాదు విజయము చేయుదురు. అచ్చట ప్రత్యేక కార్యక్రమములు.

జగ్గయ్యపేట సమీపమున కాకతీయ సిమెంట్స్ లిమిటెడ్ వారి కర్మాగార ఆవరణలో శ్రీ వేంకటేశ్వర దేవాలయ ప్రతిష్ఠా కుంభాభిషేకములను ఫాల్గున శుక్ల పక్షమున నిర్వహింతురు.

—: 0 :—

# శ్రీ శంకర భగవత్పాదాచార్య, విరచిత
# ఆత్మబోధ

వ్యాఖ్యానము: శ్రీ గాడూభట్ల పేరయ్యశాస్త్రి
(చరిత్ర శాఖాధ్యక్షులు, డిగ్రీ కళాశాల, హనుమకొండ-506010)

శ్లో॥ తపోభిః క్షీణ పాపానాం శాంతానాం వీతరాగిణాం,
ముముక్షూణా మ పేక్ష్యోఽయ మాత్మబోధో విధీయతే. 1

శ్లో॥ బోధోఽన్య సాధనేభ్యోహి సాక్షాన్మోక్షైక సాధనం,
పాకస్య వహ్నివ జ్జ్ఞానం వినా మోక్షో నసిధ్యతి. 2

శ్లో॥ అవిరోధితయా కర్మ నావిద్యాం వినివర్తయేత్,
విద్యాఽవిద్యాం నిహంత్యేవ తేజ స్తిమిర సంఘవత్. 3

శ్లో॥ పరిచ్ఛిన్న ఇవాజ్ఞానాత్ తన్నాశేసతి కేవలః,
స్వయంప్రకాశతే హ్యాత్మా మేఘాపాయేంశు మానివ. 4

శ్లో॥ అజ్ఞాన కలుషం జీవం జ్ఞానాభ్యాసా ద్వినిర్మలం,
కృత్వాజ్ఞానం స్వయం నశ్యే జ్జలం కతక రేణువత్. 5

1. తపస్సులచేత క్షీణించిన పాపములు గలవారును శాంతచిత్తులును, రాగము నశించినవారును అగు ముముక్షువులకు ప్రయోజనకారియైన ఈ ఆత్మబోధ అను గ్రంథము వ్రాయబడుచున్నది.

2. జ్ఞానము, వంటకు అగ్నివలె, ప్రత్యక్షముగా మోక్షమునకు ముఖ్య సాధనము కదా! మోక్షము జ్ఞానము లేనిచో సిద్ధించదు.

3. కర్మ అజ్ఞానమునకు విరోధి కానిది అగుటచేత అజ్ఞానమును బోగొట్టదు. తేజస్సు చీకట్లగుంపును పోగొట్టిన విధముగా, జ్ఞానము అజ్ఞానమును విధిగాపోగొట్టును.

4. ఆత్మ అజ్ఞానము వలన పరిమితి కలది వలె తోచును, ఆ అజ్ఞానము నాశమగుచుండగా అద్వితీయమై, మేఘము పోయిన తరువాత సూర్యునివలె స్వయముగా ప్రకాశిమగుచున్నది.

5. అజ్ఞానముచేత కలుషమగు జీవుని జ్ఞానము—తన్ను అభ్యసించుట వలన స్వచ్ఛమైనవానినిగా చేసి (ఉదకమును స్వచ్ఛమైనదానినిగా చేయు ఇండుపగంధము వలె) తాను (జ్ఞానము) స్వచ్ఛమైన జీవుని కంటె వేరుగా నుండదు. (సశేషము)

## హరిజనాభ్యుదయమును గురించి శ్రీ జగద్గురువులు—

శ్రీ జగద్గురు మహాసన్నిధానమువారిని కోయంబత్తూరులో నవంబరు 4 వ తేదీన పత్రికా విలేఖరులు కలిసికొని హరిజనాభ్యుదయమును గురించి ప్రశ్నింపగా శ్రీ జగద్గురువులు సమాధానములను చెప్పిరి.

హరిజనులు ప్రతిదినము స్నానముచేసి, శుభ్రమైన వస్త్రములను ధరించి శుభ్రమైన అలవాట్లను చేసికొన్నచో వారిని దూరముగా నుంచుటకు వీలుండజాలదని శ్రీ జగద్గురువు లనిరి.

"హరిజనవాడలో నున్న దేవాలయమునకు రమ్మని ఆహ్వానించినచో వచ్చెదరా?" అన్న ప్రశ్నకు సమాధానము చెప్పుచు—అట్టి ఆహ్వానము వెనుక గుప్తమైన ఆలోచన లేకుండిన—ఆ దేవాలయము సక్రమముగ నిర్వహింపబడుచున్న యెడల—తా మా ఆహ్వానమును మన్నింతు మనిరి.

"వెనుకబడిన తరగతులు—ముందున్న తరగతులు—అన్న తేడాలు మంచివి కావు. ప్రతి భారతీయుడు తాను భారతీయుడన్న భావముతోనే ఉండవలయును గాని—తాను వెనుకబడిన తరగతుల వాడను, లేక ముందున్న తరగతులవాడను అని భావింపరాదు" అని మరియొక ప్రశ్నకు సమాధానమును చెప్పిరి.

"ప్రభుత్వము మతములను తీసికొనుట మంచిది కాదు. మతములు ప్రజల ప్రయోజనములకై ఉద్దేశింపబడినవి. ఏ మతముగాని తన విధ్యుక్త ధర్మమును నిర్వహింపనిచో దాని మూసివేయుటయే సమంజసము—దానిని ప్రభుత్వము నిర్వహించుట కంటె—ప్రభుత్వము మతములను నడపుట—మతములు నిర్వహింపవలసిన పాత్రను సక్రమముగా నిర్వహించుట కాదు."

—o—

## "మతం మార్పును నిరోధించే చట్టం రావాలి"

శ్రీ జగద్గురు మహాసన్నిధానమువారిని పాలఘాటు (కేరళ)లో నవంబరు 8వ తేదీన పత్రికా విలేఖరులు కలుసుకొనిరి. శ్రీ జగద్గురువులు పత్రికా విలేఖరులతో గోష్ఠిలో చెప్పిన భాషణము—

"ఒక మతము నుండి మరొక మతమునకు మార్పు చేయుటను నిరోధించు శాసనము వచ్చుట మంచిదే. అట్టి శాసనమునకు నేను స్వాగతమును చెప్పెదను. అయితే అట్టి శాసనమును చేయుటకు ప్రభుత్వమునకు బలము, సామర్థ్యము, ధైర్యము కలవని నాకు తోచుటలేదు."

శ్రీ జగద్గురువులు పాలఘాటులోని స్థానిక బ్రాహ్మణ సభలో అనుగ్రహభాషణము చేయుచు వేద అధ్యయనమునకు శ్రద్ధవహింపవలయునని ఉద్బోధించిరి.

# ఆ సందర్భమున

శ్రీ జగద్గురువు మహాసన్నిధానమువారు 1931 లో సన్న్యాసాశ్రమ స్వీకారము చేసిన సందర్భమును పురస్కరించుకొని ఇలస్ట్రేటెడ్ వీక్లి ఆఫ్ ఇండియా (Illustrated weekly of India) జూను 14, 1981 సంచికను శృంగేరి ప్రత్యేక సంచికగా వెలువరించినది. ఆ సంచిక నుండి యీ క్రింది వివరణమును తీసికొని ప్రకటించుచున్నాము. ఇది పాఠకులను అలరింపగలదని విశ్వసించుచున్నాము.

(సంపాదకుడు)

"మా కళా అనుబంధములో ప్రధాన విషయమైన శ్రీ శృంగేరి శ్రీ విద్యాశంకరుల ఆలయము—(తుంగా జలములలో ఉజ్జ్వలదీప్తితో ప్రతిఫలించుచున్నది)- అక్కడ సనాతన ధర్మ పరిపాలనా వ్యవస్థ యగు శ్రీ శారదాపీఠమునకు నూతన జగద్గురువును ఉత్తరాధికారిగా నిర్ణయించుచు జరిగిన ఉత్సవ కోలాహలము వలన— అశేష హైందవ మహాజనుల దృష్టికి కేంద్రమైనది. ఉత్తరాధికారిగా—నూతన జగద్గురువుగా నిర్ణయింపబడిన బ్రహ్మచారి—12 సంవత్సరముల బాలుడు. మైసూరు రాష్ట్రమునందొక 12 సంవత్సరముల బాలునికి అపూర్వ ఆధ్యాత్మిక, లౌకిక వారసత్వము—(అట్టి వారసత్వము బహుశా పాశ్చాత్యదేశములందు పోపునకు మాత్రమే ఉన్నదని ఊహించతగినది) సంక్రమించినది.

శ్రీనివాసన్ — కాదు — ఆశ్రమ స్వీకరణము తరువాత శ్రీ జగద్గురు అభినవ విద్యాతీర్థస్వామి—శృంగేరి వ్యాఖ్యాన సింహాసన మధిరోహించిననాడు 232 మిలియన్ల హిందూ జనుల ఆధ్యాత్మిక పురోగతికి కారణభూతుడు కాగలడు. కేథలిక్ క్రిస్టియన్లకు 'పోపు' ఎట్టివాడో—భారతదేశమున హైందవులకు శృంగేరి శంకర మఠాధిపతి యగు జగద్గురువట్టివాడు. శృంగేరి శంకరమఠాధిపతి భారతదేశమున 'హైందవ పోపు'—చిత్రముగా పోపు వలె ఆయన కూడ నవరత్న ఖచిత కిరీటమును ధరించును. మొన్న మొన్న నూతన జగద్గురు—ఉత్తరాధికారి—సంవరణ మహోత్సములలో సముద్దీప్తమై ప్రకాశించిన శ్రీ మఠము తుంగాతటిని వామతటమున నున్నది. ఈ సంచికలో ప్రకటింపబడిన చిత్రము లా మఠ సంబంధములు. చుట్టును శ్యామల కోమలములైన కొండలు—పర్వతశ్రేణి—ప్రకృతి సౌందర్యమునకు నిలయములై సమంచిత శోభావిలాసమును వెలార్చుచున్నవి.

శృంగేరి ప్రాంతము అతి పురాతన పౌరాణిక గాథాబంధురము. శ్రీరామచంద్రుని తండ్రి దశరథమహారాజు కావించిన అశ్వమేథ—పుత్రకామేష్టి యాగములకు పౌరోహిత్యము వహించిన ఋష్యశృంగ మహర్షి శృంగేరివాడని జనశ్రుతి. దాదాపు 12 శతాబ్దముల క్రితము—శృంగేరిలో స్వకీయ మఠమును నిర్మించిన శ్రీ శంకర భగవత్పాదులు—ఆ నాడు హైందవమత—సనాతన ధర్మ—శత్రువులు—

దానిని సమూలము నిర్మూలింప ప్రయత్నింపగా—ఆయన ఆ ప్రయత్నములను ప్రతి ఘటించి—జయించి—సనాతన ధర్మమును సుప్రతిష్ఠితము చేసిరి. అది నేటికిని ఆయన కృషి కారణముగా చైతన్య నిర్భరమై శతాబ్దుల కాలమునకు అలంకారమై—వెలుగొందుచున్నది.

శ్రీవిద్యాశంకర దేవాలయమునకు నిర్మాణ పద్ధతిని నిర్ణయించిన మహాత్ముడొక గొప్ప గణిత శాస్త్రవేత్త—జ్యోతిష శాస్త్ర నిష్ణాతి. దీని ముఖమంటపమున నున్న పన్నెండు స్తంభములు—రాశి స్తంభములని ప్రసిద్ధి పొందినవి. సూర్యుడు ఉదయింపగా తొలి కిరణములు—ఏ రాశియందున్నాడో—ఆ రాశి స్తంభమును చుంబించుట మహాద్భుతము.

శ్రీ శృంగేరి జగద్గురువులు—మైసూరు మహారాజ వంశమునకు రాజగురువులు, మైసూరురాజ వంశము శ్రీ మఠ విషయమున భక్తి శ్రద్ధలను వహించుచున్నది. ఈ ఉత్సవములలో నొక ప్రత్యేక సంగతి ఏమనగా—హైందవ స్త్రీలు బహుళముగా వచ్చి పాల్గొనుట.

—o—

## ఏబది సంవత్సరములనాడు—

శ్రీ జగద్గురు మహాసన్నిధానమువారు (శ్రీ జగద్గురు అభినవ విద్యాతీర్థ మహాస్వామి) తమ గురుస్వాములనుండి సన్న్యాసాశ్రమమును పొంది ఏబది సంవత్సరములైనది. శ్రీవారు సన్న్యాసాశ్రమమును గ్రహించిన నాటి విశేషములను స్వయముగా దర్శించిన విలేఖరుల నివేదికలు పాఠకులకు కుతూహలకరముగా నుండునని ప్రకటించుచున్నాము. (సంపాదకుడు)

### టైమ్స్ ఆఫ్ ఇండియా—మే 26, 1931

కడూరు మే-25. పురాతనమై చారిత్రక ప్రసిద్ధమైన శ్రీ శృంగేరి పీఠమునకు ప్రస్తుతము అధిపతులైన శ్రీ జగద్గురు చంద్రశేఖరభారతీస్వామివారి (ఉత్తరాధికారిగా) శిష్య స్వీకార మహోత్సవము—శుక్రవారము సాయంత్రము—శ్రీ జగద్గురువులు వారి నూత్న శిష్యస్వామి శ్రీ జగద్గురు అభినవవిద్యాతీర్థస్వామి—వెండి, బంగారు పల్లకీలలో శృంగేరిలో ముఖ్య వీధులందు ఊరేగుటతో—ముగిసినది. సుందరముగా నలంకరింపబడిన గజములు రెండు ఊరేగింపు ముందు నడచినవి. అనేకమంది శిష్యులు—మైసూరు మహారాజ ప్రతినిధి—ప్రభుత్వోద్యోగులు పల్లకీల ముందు నడచిరి. ఊరంతయు పచ్చతోరణములతో నలంకరించిరి. ఊరేగింపు పట్టణములోని ప్రధాన వీధులందు సాగినది. ఉభయ జగద్గురువులు బంగారు జరీ పీతాంబరములను కప్పికొని నవరత్నఖచిత కిరీటములను ధరించియుండిరి.

నిన్నటి సాయంత్రము గొప్ప విద్వత్సభ జరిగినది. శ్రీ జగద్గురు చంద్రశేఖర భారతీమహాస్వామివారు అధ్యక్షత వహించిరి. శిష్యస్వాములైన శ్రీ జగద్గురు అభినవ విద్యాతీర్థస్వామివారు కూడ సభ నలంకరించిరి. అనుగ్రహభాషణములో శ్రీ జగద్గురువులు గురు-శిష్య సంబంధమును గురించి—అర్థమును గురించి విపులీకరించిరి, శిష్యుల అభ్యుదయమును వాంఛించువాడే సద్గురువులనియు—శిష్య రక్షణమే హృదయమునందు గురువునకుండవలయునని చెప్పిరి. గురువునందు పరిపూర్ణ విశ్వాస ముంచి—ప్రతి నిమిషము ప్రతి విషయమునందు గురువులకు ప్రీతి కలిగించునట్లు ప్రవర్తించు శిష్యుడే శిష్యు డనియు చెప్పిరి. నిజమైన సుఖమనగా నెట్టిదో వివరించిరి. ఎల్లవేళల—ఎల్లచోట్ల—అన్ని పరిస్థితులలో వికల్పము లేని సుఖము కలిగించునదే నిజమైన సుఖమని—అట్టి సుఖమును పొందుటకు మార్గము గురువును పరిపూర్ణముగా విశ్వసించి సేవించుట యనియు చెప్పిరి. శ్రీ జగద్గురువులు ఆశీరనుగ్రహములను పొంది విద్వాంసులు వెడలిరి.

ఈ అవకాశమును పురస్కరించుకొని—అక్కడకు వచ్చిన శిష్యులు శ్రీ జగద్గురువులకు వినతిపత్రమును సమర్పించిరి. శ్రీ జగద్గురువులు శిష్యసంగ్రహము చేసి నందువలన పరంపరా సంపత్తి కలిగి శ్రీ మఠము శోభావిలసితమగుచున్నదని హర్షము వెల్లడించిరి. ఈ బ్రహ్మచారి భవిష్యత్తున మహామహిమాత్ములై—యీ వ్యాఖ్యాన సింహాసనమును దివ్యతేజోభరితము చేయగలడన్న ఆశాభావము తృప్తి కలుగుచున్న దని వినతిపత్రమునందు విన్నవించిరి.

—:o:—

## "హిందువులు మతం మార్చుకొనుట శాస్త్రము లంగీకరింపవు—"

శ్రీ శృంగేరి జగద్గురు మహాసన్నిధానమువారు త్రివేంద్రమున (16 నవంబరు) పత్రికా విలేఖరులతో గోష్ఠి జరుపుచు—'హిందువులు మరొక మతమునకు మార్పు చెందుటను శాస్త్రము లంగీకరింపవు' అనిరి.

వేరొక మతమునకు వెళ్ళినవారు పశ్చాత్తాపము పొందినచో—ఏమియు జరుగ నట్లే భావింపవచ్చునని—శ్రీ జగద్గురువుల అభిప్రాయము. విలేఖరుల గోష్ఠిలో—కరపత్రముగా పంచిపెట్టబడినది.

ఇతర మతములలోకి వెళ్ళిన హరిజనులకు సదుపాయము లన్నియు రద్దు చేయ వలెనని శ్రీ జగద్గురువులు అభిప్రాయమును వెల్లడించిరి.

మతము మార్పునకు చాల కారణము లుండవచ్చును. ధనము—స్వాభిప్రాయము. అయితే మీనాక్షీపురము మతం మార్పులలో ధనము ప్రముఖపాత్ర వహించినదని శ్రీ జగద్గురువు లనిరి.

'మతం మార్పులకు కులతత్వము కారణము కాదా?' అని ప్రశ్నింపగా— అన్ని యితర మతము లందు కులము లున్నవని శ్రీ జగద్గురువులు సమాధానము చెప్పిరి.

అందరకు—బావులు—దేవాలయములు మొదలగువాటిని ఉపయోగించుకొనుటలో స్వేచ్ఛ—హక్కు ఉండవలెనని శ్రీ జగద్గురువులు వెల్లడించిరి. అట్టివాటి ఉపయోగముపై అభ్యంతరములు పెట్టువారిని శిక్షింపవలెననిరి. ఆర్య సమాజము మొదలగువారు హిందూ మతములోనికి యితరులను మార్చుట తగునా? అని ప్రశ్నింపగా ఆర్య సమాజమువా రట్లు చేయుటకు గల కారణము తమకు తెలియ దనిరి.

అస్పృశ్యతను గురించి ప్రశ్నింపగా "దానిని మీరు కల్పించుచున్నారు. దానిని గురించి పదే పదే పలుకుటవలన—అది ఉత్పన్నమగుచున్నది" అనిరి. ప్రభుత్వము కూడ దానికి బాధ్యత వహింపవలయు ననిరి. ఉద్యోగముల సందర్భమున కులము అడుగుట మానివేయవలె ననిరి.

భారతీయులు తాము భారతీయులమని భావన పెంచుకొనవలెనని అట్టి భారతీయ భావము ప్రబలమైనప్పుడు—నేటి సమస్యలు చాలవరకు అదృశ్యమగు నని చెప్పిరి.

శ్రీ జగద్గురువులు, శిష్యస్వామి సహితులై పరివారము వెంట రాగా కోట్టయము నుండి 14న నవంబరు శనివారము త్రివేంద్రము చేరిరి.

శ్రీ జగద్గురువుల సన్యాసాశ్రమ స్వీకార స్వర్ణోత్సవ సందర్భముగా శిష్య మహాజనము (30 లక్షల వ్యయముతో) శృంగేరిలో గాని, మదరాసులో గాని, బెంగళూరులో గాని 1981-82 లో సంస్కృత కళాశాల ప్రారంభింపదలచిరని— శ్రీ జగద్గురువులు వెల్లడించిరి.

---

## వ్యాసములు-ఎక్చేంజి కాపీలు, రివ్యూకి గ్రంథములు

మా పత్రికకు పంపదలచిన వ్యాసములను ఎక్చేంజి కాపీలను రివ్యూకి గ్రంథములను (2 కాపీలు) యీ క్రింద చూపిన మా మద్రాసు కార్యాలయము అడ్రసునకే పంపవలెను.

శ్రీ రామలింగేశ్వరరావు,
నెం. 68, కోడంబాకం హైరోడ్డు, త్యాగరాయనగరు, మద్రాసు-600 017.

---

Printed & Published by A. Satyanarayana Murthy, at
6-3-609/18, Anand Nagar, Khairatabad, Hyderabad - 500 004.
Printed at KRANTI PRESS, MADRAS-600 001.
Editor : T. Ramalingeswara Rao

# సనాతన ధర్మ వైభవము

శ్రీ భమిడిపాటి వెంకటసుబ్బారాయుడు, పిఠాపురము

మన భారతీయులది సనాతన ధర్మము. ఈ ధర్మము సనాతనమైనది. పరదేశీయుల పరిపాలనలో దీనినే హిందుమతమని అపభ్రంశరూపములో పిలువసాగిరి. ఇప్పటికినీ, మన దురదృష్టమువలన, హిందూమతమనియే చలామణీ యగుచున్నది. ఈ సనాతన ధర్మసూత్రములు పవిత్రులగు మన మహర్షి వరిష్ఠులచే, వారు సమాధి నిష్ఠాగరిష్ఠులై యున్నపుడు శ్రుతమైనవి. అందుచేతనే వీనికి శ్రుతులను పేరు వచ్చినది. ఈ శ్రుతులనే వేదమని అందురు. ఈ శ్రుతులను వారు వారి శిష్యుల కుపదేశించిరి. ఇట్టి గురుశిష్య సంప్రదాయముచే అధ్యయన అధ్యాపనములు చేయబడుచు వేదముల పరిశుద్ధముగ, పరమపవిత్రముగ, చేర్పులు కూర్పులు లేకుండ ఇప్పటికిని ప్రచారములో నున్నవి. ఇంత పరిశుద్ధముగ నున్న గ్రంథము మరొకటి ప్రపంచములో లేదు. క్రమ, ఘన, జట అను పద్ధతుల వలన చేర్పులు, కూర్పులు అపభ్రంశములు వేదములలో చొరకుండ గట్టి కట్టుబాట్లను మహర్షులు చేసినారు. అందుచేతనే మన సనాతన ధర్మము శ్రుతి ప్రమాణము గాగలది; వేదప్రామాణ్యము. శ్రుతులే భగవంతునియొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసములు. వేదములు ఆధారముగనే పరమేశ్వరుడు లోకములను పరిపాలన చేయుచున్నాడు. వేదములు మానవనిర్మితము గావు; అందుచే వేదములకు అపౌరుషములు అని పేరు వచ్చినది. గురువు శిష్య సంప్రదాయము ద్వారా వేద ప్రవచనము అవిచ్ఛిన్నముగా సాగుచున్నది. గురువు శిష్యునకు వేదము నుపదేశించి, ఆత్మజ్ఞానమును కలుగజేయును. అనుభవము లేని విద్య విద్య కాదని మనకు మహర్షుల నిర్ణయము. ఆత్మజ్ఞానము పొందుటకు శ్రవణ మనననిదిధ్యాసనములు ముఖ్యాంగములు. శ్రవణమనగా గురూపదేశములు చక్కగా శ్రద్ధగా వినుట, వినినదానిని శ్రద్ధతో మననము చేయుట, మననముద్వారా నిశ్చయత్వమును పొంది ధ్యానము చేయుట. శ్రవణ మనన నిదిధ్యాసనములు శ్రద్ధగా జరిగిననాడే ఆత్మానుభవము కలుగును.

మన సనాతన ధర్మమందు శ్రుతులకు తరువాత స్మృతులు ప్రమాణములు. శ్రుతులను స్మృతులు అనుసరించి ఉండవలెను; శ్రుతులకు విరుద్ధముగా నుండరాదు. "శ్రుతం పశ్యంతి మునయః" శ్రుతులను మునులు ఉన్నత భూమికలలో దర్శింతురు. అట్టి మునులు ఆచరణకు ఉపయోగించు విషయములను వ్రాసిరి. వాటికే స్మృతులు అని పేరు. "సంస్కారజన్యం జ్ఞానం స్మృతిః" అని శాస్త్రము చెప్పుచున్నది. వేద విషయములను అనుభవమునకు వ్రాసిన గ్రంథములే స్మృతులు. ఆ స్మృతులు ఆచరణ నిమిత్తం మనువు, యాజ్ఞవల్క్యుడు, పరాశరుడు, మున్నగు మహనీయులగు మునులు

ప్రాసినారు. శ్రుతి స్మృతులకున్న సంబంధమును మహాకవి కాళిదాసు తన రఘువంశ కావ్యములో చక్కగా చిత్రించినాడు:

"తస్యాః ఖుర న్యాస పవిత్రపాంసుం
అపాంసులానాం ధురకీర్తనీయా
మార్గం మనుష్యేశ్వర ధర్మపత్నీ
శ్రుతేరివార్థం స్మృతిరన్వ గచ్ఛత్"

వశిష్ఠముని ఆజ్ఞను శిరసావహించి, సంతానాభిలాషుడగు దిలీపమహారాజు కామధేనువు కుమార్తె యగు నందినీదేవిని మేతకై తీసికొని పోవుచుండగా, కళంకము లేనివారిలో మొదటగా కొనియాడ తగినటువంటి ఆయన భార్య సుదక్షిణా దేవి, ఆ నందినీదేవియొక్క నడకచే రేగిన పవిత్రమైన పరాగముచే అలంకరింపబడి దిలీపమహారాజును శ్రుతియొక్క అర్థమును స్మృతివలె అనుసరించెను. పతివ్రతాధర్మము పతిని సతి అనుసరించుటయే గదా! అనగా శ్రుతులయొక్క అర్థమునే అర్థమును మాత్రమే స్మృతులు చెప్పుచున్నవి అని మహాకవి కాళిదాసుయొక్క ప్రమాణ వాక్యము కూడ గలదు.

సనాతన ధర్మముయొక్క వైశిష్ట్యము; ఎప్పటికప్పుడు మనలను ధర్మాచరణము నందు ఉత్సాహపరచి ఉత్తేజపరచుటకై మహనీయులు జన్మించి సనాతన ధర్మమును తాము శ్రద్ధగా ఆచరించుచు ప్రజలచేత ఆచరింపజేయుచునే యున్నారు. శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానందులు, రమణమహర్షి, గణపతి ముని, అరవిందులు, మహారాష్ట్ర దేశములో జన్మించిన సాధుపుంగవులగు జ్ఞానదేవు, తుకారాము, ఏకనాథుడు, నామదేవుడు, జనాబాయి మున్నగువారు. త్యాగరాజు, సమర్థ రామదాసు, భద్రాచల రామదాసు, సదాశివబ్రహ్మేంద్ర సరస్వతి, శ్రీ శృంగేరీశారదా పీఠము నధిష్ఠించిన జగద్గురువులు శ్రీ నృసింహభారతి, శ్రీ సచ్చిదానందశివ అభినవ నృసింహభారతి, శ్రీ చంద్రశేఖరభారతి, ఈ మధ్య కాలములో సనాతన ధర్మ రక్షణ చేసిన మహనీయులు. ఇప్పుడు కూడ మనకు సన్నిహితులై మార్గదర్శకులై మనలను ధర్మోన్ముఖులను జేయుచున్న మహనీయులు శ్రీశృంగేరీ, ద్వారక, పూరి, బదరిలలో శ్రీ శంకర పీఠాధిష్ఠితులైన జగద్గురువులు ఇతర మహనీయులు గలరు. వారు కాలమంతయు ప్రజలను ధర్మోన్ముఖులనుజేసి తరింపజేయుటకే వినియోగించుచున్నారు.

కలియుగమునకు జ్ఞానావతారులగు శ్రీమచ్ఛంకర భగవత్పాదులవారు సనాతన ధర్మమును ఆచరించు పద్ధతిని ఒక శ్లోకములో చక్కగ వివరించియున్నారు.

"వేదో నిత్యమధీయతాం తదుదితం కర్మ స్వనుష్ఠీయతాం
తేనేశస్యవిధీయతా మపచితిః కామ్యే మతి స్త్యజ్యతామ్

పాపౌఘః పరిధూయతాం భవసుఖే దోషోఽనుసంధీయతామ్
ఆత్మేచ్ఛా వ్యవసీయతాం నిజగృహాత్తూర్ణం వినిర్గమ్యతామ్"

వేదాధ్యయన మెల్లప్పుడు చేయబడు గాక!
వేదములో చెప్పబడిన కర్మ అనుష్ఠింపబడు గాక!
వేదవిహిత కర్మచే ఈశ్వరునికి పూజ చేయబడు గాక!
పాప సముదాయము దులుపబడు గాక!

సంసార సుఖమందు దోషము కలదని, మరల మరల ఆ సుఖము నందే ఆసక్తి కలుగుట, ఆ సుఖము దుఃఖముగా పరిణమించుట ఈ మొదలగు దోషములు కలవని మరల మరల ఆలోచింపబడును గాక!

ఆత్మజ్ఞానము నందు ఇచ్ఛ పెంపొందును గాక!
స్వగృహము నుండి వడిగా బైటబడబడు గాక!

సనాతన ధర్మము ఇతరమతములవలె ఒక మతము గాదు. క్రైస్తవ మతమందు ప్రభుదినమని ఒక ఆదివారం రోజున నే భగవంతునికి కేటాయింతురు. మన సనాతన ధర్మమందు భగవంతుడు కాలస్వరూపుడు. ప్రతి క్షణము భగవంతునిదే. మన జీవితములోని ప్రతి అంశమును సక్రమ మార్గములో నడిపించునదే మన సనాతన ధర్మము. ఇది ధర్మమునకు సంబంధించినది. ఇది కాదు అని లేదు. మానవునియొక్క జీవిన మంతయూ సనాతన ధర్మముయొక్క పరిధిలోనికి రావలసినదే మన సనాతన ధర్మము, అభ్యుదయము, నిశ్రేయస్సు కూడ చేకూర్చునది. "ధారణాద్ధర్మ ఇత్యాహుః" ధర్మమే ప్రపంచమును భిన్నా భిన్నముగా కూడ నిలుపునది. శరీరమును, ఆ శరీరమునకు ఆవశ్యకమయిన ఇహపర సాధనములను, ఐహికాముష్మిక సాధనములను నిర్వర్తించు ఇంద్రియములను, ఆ ఇంద్రియములను చక్కబెట్టు మంచి విధులను ధరించునది గావున ధర్మమని చెప్పబడుచున్నది. (సశేషము)

---

## చందాదారులకు విన్నపము-ప్రకాశకుని చిరునామా మార్పు గమనింపుడు

చందాలు బాకీయున్నవారికి పత్రిక పంపబడదు. చందా సొమ్మును ముందుగనే (తమ అడ్రసు మార్పుకూడ వెంటనే) క్రింది చిరునామాకు పంపవలెను.

ఆకెళ్ళ సత్యనారాయణమూర్తి,
శ్రీ శంకరకృపా ప్రకాశకుడు;
6-3-609/13, ఆనందనగర్,
ఖైరతాబాదు, హైదరాబాదు-500 004.

**Regd.No.** 17726/59 **H/HD 392. SRI SANKARA KRUPA**
December **1981**

**To**



## ఈ సంచికలో



If undelivered please return to:
**A. SATYANARAYANA MURTY,**
**Publisher : SRI SANKARA KRUPA**
**6-3-609/18 Anand Nagar, Khiratabad, Hyderabad-500004.**